# రాచకన్యకాపరిణయము - సమగ్రపరిశీలనము

ఉస్మానియా విశ్వవిద్యాలయము వారిచే
1988 లో పిహెచ్.డి. పట్టా పొందిన సిద్ధాంత వ్యాసము

డా॥ తలముడిపి బాలసుబ్బయ్య

This book is Published with the financial Assitance of Tirumala Tirupathi Devastanams under their scheme "Aid to Publish Religious Books".

ప్రథమ ముద్రణ : మార్చి 1989

ప్రతులు : 1000

మూల్యం : రూ. 100/-

ప్రతులకు :

1. T. Chandra Sekhara Sarma, B. Com.
   T.R.T. 121, I.H.S. Colony,
   Seethaphalmandi,
   Secundarabad-500861.

2. G. Manemma
   1-8-111/B, Saddalgundu,
   Mahaboobnagar - 509 001.

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాదు.

# కృతిసమర్పణం

జన్మకారణ కర్తృభ్యాం
ధర్మకర్మ సమాప్తయే ।
కామాక్షీ సుబ్రహ్మణ్యాభ్యాం
పితృభ్యామిద మర్ప్యతే ॥

జన్మ కారకులైన జననీజనకులు కీ. శే. శ్రీమతి తలముడుపుల కామాక్షమ్మ, కీ. శే. తలముడుపుల సుబ్రహ్మణ్యశర్మ గారికి దివ్య స్మృతికి ఈ సిద్ధాంత వ్యాసాన్ని సమర్పిస్తున్నాను—

గ్రంథకర్త.

ఆచార్య శ్రీమతి పి. యశోదారెడ్డి
3-4-574, సుధర్మ,
హైదరాబాదు - 500 029.

# చెప్పవలసిన రెండు మాటలు

హంసః పద్మవనం సమిచ్ఛతి యథానీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోరస్తథా ।
చేతోవాంఛతి మామకం పశుపతే! చిన్మార్గమృగ్యం విభో!
గౌరీనాథ! భవత్పదాబ్జయుగలం కైవల్య సౌఖ్యప్రదమ్ ॥

మహాపదార్థాసక్తమైన చిత్తం ఎప్పుడూ ఆ కల్యాణగుణసంకీర్తనంలోనే, ఆ పావనకథావర్ణనంలోనే రమణాన్ని పొందుతుంది. బుద్ధిజీవి పరార్థచింతనా సక్తుడైనప్పుడు ఆ మహాపదార్థాన్నే కథావస్తువుగా స్వీకరిస్తూ కథలు అల్లి, అమూర్తమైన ఆ వస్తువును రసధునిగా ప్రవహింపజేస్తాడు. ఈ ప్రయత్నంలోనే కృష్ణ కథలూ, రామకథలూ ఎన్నో మన తెలుగు సాహిత్యాన్ని అలంకరిస్తూ సుసంపన్నం చేసినాయి. ఈ పరంపరలో నడచినకావ్యం 'రాచకన్యకాపరిణయం'. అముద్రిత రూపంలో ఉన్న ఈ కావ్యాన్ని సిద్ధాంత వ్యాసానికి వస్తువుగా చేస్తూ ఆ కావ్యకర్తకు పుత్ర నిర్విశేషరూపంతో ఋణాన్ని చెలిస్తూ, ఋణవిముక్తిని పొందిన సుకృతి మా బాలసుబ్బయ్య. మా బాలసుబ్బయ్య అంటూ ఏకవచన ప్రయోగం చేయడం ఆప్యాయతకు చిహ్నమే కానీ చిన్నచూపు మాత్రం కాదు. పరిశోధనకు ముందు కానీ, ఇప్పుడుకానీ ఈ చిరంజీవి ఇంకా కుడుకలతో పాలు త్రాగే పసికందు కాదు. సాహిత్యక్షేత్రంలో ప్రవేశించడానికి కావలసిన భాషా, శాస్త్రపాండిత్యాది పరికరాలన్నీ సిద్ధంగా అమర్చుకొన్నవాడే. పరిశోధనకు అవసరమైన విషయ సేకరణాభిలాష, సహనం, పరిశ్రమ, వివేచనాశక్తి, విశ్లేషణాత్మక దృష్టి, సమన్వయబుద్ధి, నిష్పాక్షికమైన పరిశీలనా పాటవం మొదలైనవి ఎన్నో ఈ సిద్ధాంత వ్యాసంలో కనిపిస్తున్నాయి.

జగన్నాటక సూత్రధారియైన ఆ శ్రీమహావిష్ణువు లోకంలో శ్రీకృష్ణరూపిగా జన్మిస్తూ దుష్టశిక్షణ, శిష్టరక్షణాదులు నిర్వర్తించడమే కాకుండా అనితర సాధ్యుడైన నరకుని సంహరించి, ఆ దానవుని చెరలో ఉన్న 16 వేల మంది రాచకన్నెలను పెండ్లాడినాడు. ఈ విషయాన్ని విష్ణుదేవతాకాలైన పురాణాదులన్నీ ఏకరువుపెట్టినాయి. ఈ సంస్కృత సాహిత్యం ఆధారంగా తెలుగులో సాహిత్య పాథోరాసులవంటి మహాకవులు రసగుళికలవంటి కమ్మని పద్యాలతో కావ్య జగత్తును రసప్లావితం చేసినారు. ఐనా దాదాపు డెబ్బై, డెబ్బై ఐదు సంవత్స రాలకు పూర్వుడైన నరసింగకవి తిరిగి ఆ కృష్ణకథనే వస్తువుగా స్వీకరిస్తూ 'రాచకన్యాకాపరిణయం' అనే పేర కావ్యం అల్లినాడు. వస్తువు చర్వితచర్వణంగా కనిపించినా, మురారి అనర్ఘరాఘవంలో చెప్పిన సమాధానాన్ని మనం కృష్ణగుణ విశేషసంబంధిగా అనుసంధించుకొంటూ సమాధానపడవచ్చు. కానీ కావ్యనామం లోనే కొంత దోషం కనిపిస్తుంది కదా? కావ్యం ముద్రితం కాదు. కవి ప్రథిత యశస్కుడూ కాదు. ఐనా ఈ కావ్యం ఆధారంగా ఈ అమాయకుడు Ph.D. పట్టానికి కృషి చేస్తానంటున్నాడు. ఉడుపంతో మహాసాగరాన్ని తరిస్తాడా? చివరకు ప్రాంశులభ్యమైన మహాఫలాన్ని కాంక్షిస్తూ చేతులెత్తిన వామనుడుగా మిగిలిపోడు కదా? అనే సందేహం Guide గా ఉన్న నా మనస్సులో ప్రవేశించింది. 'భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర' అన్న కాళిదాసు మాట పొల్లు పోతుందా? లేదు అముద్రితమైన వ్రాతప్రతి పుస్తకరూపంలో ముద్రణపొంది, ఏ కావ్యం నోచుకోనంతటి విశేష దశాలబ్ధితో ఉత్తమ విమర్శను జతపర్చుకొన్నది. ఈ కావ్య ప్రశస్తికి ఈ పరిశోధకుడు ఉపాదానకారణమై నిలుస్తాడని చెప్పడానికి గర్విస్తున్నాను.

'కృషేర్వృష్టి సమయోగే దృశ్యంతి ఫలసిద్ధయః' అన్నారు పెద్దలు. పురుషకారానికి దైవం తోడుపడినప్పుడే కార్యాలు ఫలరూపాన్ని పొందుతాయి. ఈ రెంటిలో ఏది లోపించినా పనులు కడముట్టి పంటరాల్చవు. పురుషప్రయత్నం వ్యక్తి సంబంధి. కానీ దైవ స్వరూపం విచిత్రంగా, అనూహ్యంగా ఉంటుంది. అది ఒక్కొక్కప్పుడు ఆలంబనరూపంలో, ఆర్థికరూపంలో, సహకారరూపంలో, సహృదయ రూపంలో, వ్యాఖ్యాత రూపంలో, వ్యక్తి రూపంలో దర్శనమిస్తుంది. ఈ దైవ చమత్కారం మన రాచకన్యకా పరిణయ కావ్య సందర్భంలో జరి గింది అని గట్టిగా నమ్ముతున్నాను. అంతేకాదు అనుభవజ్ఞులైన పెద్దలు—

'అశ్వం శస్త్రం శాస్త్రం వీణా వాణీ నరశ్చ నారీచ।
పురుష విశేషం ప్రాప్య హి భవంతి యోగ్యా అయోగ్యాశ్చ॥'

అన్నారు. వారి మాటలు యథార్థాలంటూ రుజువుచేస్తున్నట్లు అతనియెడ అభిమానం ఉన్నవాడూ, సమర్థుడూ, క్రియాశీలీ ఐన పరిశోధకుని చేతిలోపడి ఒక వ్యక్తిత్వాన్ని సంతరించుకొన్నది ఈ 'రాచకన్యకా పరిణయ' కావ్యం.

సంస్కృతం, వ్యాకరణం, తదితర అలంకార శాస్త్ర గ్రంథాలను బాగా చదివి సారాన్ని గ్రహించిన బాలసుబ్బయ్య నిండు కుండలా తొణకని వ్యక్తి. నేను అప్పుడప్పుడు ఆయన శ్రేయస్సును కోరుతూ గట్టిగా మందలించినా, మనస్సులో పెట్టుకోకుండా, నా సూచన మేరకు మరింత పరిశ్రమిస్తూ ఉత్తమ ఫలితాలను సాధించగలిగినాడే కాని, తొందరపాటుతో సిద్ధాంత వ్యాసాన్ని మొక్కుబడిగా పూర్తిచేయలేదు. బాధ్యత, దక్షతలున్న ప్రతి Superviser తన వారికి సూచన లివ్వడం పరిపాటి. కానీ ఇచ్చిన సలహాను పాటిస్తూ, కృషి చేసి ఉత్తమ ఫలితాన్ని సాధించడం మాత్రం విశేషం. లోకంలో విజ్ఞానం, విషయ సంపత్తి అపారంగా ఉంది. కానీ ఉన్న సంపదను వివేకంతో దక్కించుకోవడంలోనే నేర్పు ప్రకటితమౌతుంది. అందుకే ప్రజ్ఞావంతులైన ప్రాచీనులు-

'యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్।
లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి॥'

అన్నారు. స్వయంగా ప్రతిభావంతుడైన మా బాలసుబ్బయ్య ఆప్త వాక్యాలనూ, శాస్త్రపఠనాన్నీ కరదీపికలుగా ఉపయోగిస్తూ భిలక్షేత్రాల్లో ప్రవేశించి మేలైన ఫలితాలను సాధించినాడు.

సదాచారసంపన్నుడైన మా బాలసుబ్బయ్య సంప్రదాయన్ని పాటిస్తూ తన సిద్ధాంత వ్యాసానికి వెలుగుబాటగా రెండుమాటలు వ్రాయమంటూ కోరినాడు. నిజానికి తినబోతూ రుచులెందుకు అని అడగటం సామెతగా నిలిచింది. అది నిజమే ఐనా రుచులెరిగినవారు బాగుందీ అంటే దాని విలువ మరింత పెరుగుతుంది. అదొక పద్ధతి.

మహాకవి మాఘుడు ఒకచోట 'నిర్ధారితేఽర్థే లేఖ్యేన ఖలూక్త్వా ఖలు వాచికమ్' అన్నాడు. అంటూనే, చెప్పవలసిన రెండుమాటలూ చెప్పించినాడు. ఇప్పుడూ అంతే! కావ్య గుణదోషాది విశేషవివేచనారూపంలో సిద్ధాంతవ్యాసం వడ్డించిన విస్తరిలా పాఠకులముందున్నప్పుడు చవులూరిస్తానంటూ చేసే ఈ ప్రారంభం అనవసరమే! ఐనా సంప్రదాయం సార్వభౌమమైంది. దాని ఒత్తిడిని కాదనే శక్తి నాకులేదు. అందుకే అతడు కోరడం-నేను వ్రాయడం లాంఛన ప్రాయంగా జరిగింది.

దాదాపు 570 పేజీలున్న ఈ సిద్ధాంతగ్రంథాన్ని రెండు భాగాలుగా విభజించుకోవచ్చు. అందులో 324 పేజీల గ్రంథం సిద్ధాంత వ్యాసానికి సంబంధించి ఉంటే మిగిలిన 240 పేజీలలో నరసింగకవి రాజకన్యకా పరిణయం ముద్రింపబడింది. ఈ విధానంవల్ల పాఠకులకూ, పరిశీలకులకూ కావ్యమూ, ఆకావ్యవిమర్శ అంతా ఒకచోటే లభిస్తూ పరిశోధకుని భావాలతో ఏకీభవించడానికో, విభేదించడానికో అవకాశం కల్పించింది. పాఠకుల సౌలభ్యంకోసం ఈ కావ్యభాగాన్ని ఉత్తరభాగంగా స్వీకరిస్తే, పూర్వభాగాన్ని పరిశోధకుడు స్వయంగా అవతరణము- అనుశీలనము అంటూ రెండుగా పేర్కొన్నాడు. ఈ అవతరణభాగంలో కవి, కాలం, అభిజాత్యం, దేశం, రాజాస్థానం, ఆస్థానాధిపతులూ, సమకాలికులైన కవులూ, కావ్యమర్యాదలూ, పరిణయకావ్యపరిచయం, ఈ కావ్యనామౌచిత్యం మొదలైన అంశాలన్నీ సంక్షిప్తంగా పరిచయం చేయబడ్డాయి.

రెండవ భాగంలో కావ్యవిశేషవివేచనం సాగింది. ఈ సందర్భంలో బాలసుబ్బయ్య దృష్టితరంగాలుగా పెరుగుతూ వికాసాన్ని పొందినట్లు కనిపిస్తుంది. అందుకే రాజకన్యకాపరిణయ కావ్యాన్ని పురస్కరించుకొని ఏ కొద్దిపాటి అవకాశం దొరికినాసరే! ఇది శబ్దవైచిత్ర్యం, ఇది అర్థగరిమ, ఇది పాకపరిణతి, అది శయ్యాసౌభాగ్యం, ఇక్కడ సంలక్ష్యక్రమవ్యంగ్యం, ఈ తావున అగ్నిదేవతాక బీజాక్షరసన్నివేశం, ఆ చోట అలంకారవిభూతి అంటూ అత్యంత అభినివేశంతో ప్రశంసలు గుమ్మరిస్తుంటాడు. ఈ పొగడ్తలు కేవలం పొడిమాటలైతే పరిశోధనకూ, అతిశయోక్తులకూ పొత్తుకుదరదంటూ త్రోసిపారవేయవచ్చు. కానీ నానా నిఘంటువులనూ, అలంకార శాస్త్రాధారాలనూ, వ్యాకరణ సూత్రాలనూ ఉద్ధరిస్తూ కవి స్థానాన్ని నిర్ణయించడానికి పూనుకొన్నప్పుడు స్వీకరించకతప్పదు. ఉదా

హరణకు రాచకన్యకా పరిణయ కావ్యంలోని నాటకీయతను ప్రదర్శిస్తూ 'నరసింగ కవి సన్నివేశవిభాగము బీజాది అర్థప్రకృతి పంచకము, ఆరంభాది అవస్థా పంచకముతో కూడిన సంధిపంచక స్ఫూర్తికి అనుకూలముగా నున్నది' అన్న వాక్యాలు పరిశోధకుని శాస్త్రపరిజ్ఞానాన్ని, సమన్వయరీతినీ ప్రకటిస్తున్నాయి. ఇట్లే నరసింగకవి శబ్దప్రయోగ సౌష్ఠవాదులను అంచనావేసే సందర్భంలో బాల సుబ్బయ్య చూపిన నానా శబ్దార్థపరిజ్ఞానం, అక్షరదేవతాస్వరూపవిజ్ఞానం, బీజాది గణస్వరూపనిర్ణయం మొదలైన పాండిత్యం అంతా పాఠకులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూ నరసింగకవికి మహోపకారాన్ని చేకూర్చింది.

ఈ సిద్ధాంత వ్యాసంలో అన్నీ ఒక ఎత్తు. 'రసమాధురి, ధ్వనిదీప్తి, సంకేతశిల్పం అనేవి' అనేవి ఒక ఎత్తుగాసాగుతూ మా బాలసుబ్బయ్య ప్రతిభకు పండితుల వరుసలో స్థానాన్ని కల్పిస్తూ సహృదయులకు రసానందాన్ని పంచు తున్నాయి. ఉదాహరణకు వారుణీసేవనంతో ఉన్మత్తలైన రాచకన్నెలు—

"మాలూర ఫలములు మర్రిచెట్ల ఫలించె
నీ వింత గంటివే యిగురుబోడి!"

అంటూ ప్రలాపిస్తుంటారు. ఈ మాటలకు వాచ్యార్థాన్ని ఆలోచిస్తే విశేషం ఏమీలేదు. నిషాలో మర్రిపండ్లు మాలూరాలల్లో కన్పించినాయి. కాని మన బాల సుబ్బయ్యకు ఈ మాటల్లో భక్తిరస నిర్భరత గోచరించింది. ఆ భక్తిరసంకూడా వ్యంగ్య వైభవంతో జాలువారింది. ఈ సందర్భంలో శబ్దశక్తి సంలక్ష్య క్రమ వ్యంగరూపంలో ప్రకరణాన్ని పురస్కరించుకొని 'మాలూరము' అనే మాటకు 'బాలముకుందుడు' అనే అర్థస్ఫూర్తిని కలిగించింది. ఈ విశేషం అంతా వివక్షితాన్యపరవాచ్యధ్వనితో సాధించిన చమత్కారం. ఇట్లే అనేకచోట్ల వస్తు రస ధ్వనులనే కాకుండా, వస్తు కృతవస్తు, వస్తు కృత అలంకార, అలంకారకృత అలంకారాది సూక్ష్మ సూక్ష్మతర ధ్వని భేదాలను గుర్తిస్తూ, కావ్యానికి అన్వ యిస్తూ చూపించడం ముదావహంగా ఉంది. ఆ ఈ సందర్భాల్లో విషయ సమన్వయం కొంత బలవదానీతమై గోచరించినా పరిశ్రమను మెచ్చుకోకతప్పదు.

ఇట్లే ఈ గ్రంథంలో సంకేత శిల్పాన్ని గూర్చిన వివేచన ఉంది. ఇంత వరకు బాలసుబ్బయ్య కేవలం సంస్కృతాంధ్రాలను చదువుకొన్నవాడుగా, ప్రాచీన గ్రంథాలను బాగా అధ్యయనం చేసినవాడుగా కన్పిస్తాడు. కానీ ఈ విషయంలో ప్రవేశించినాక ఆయనకు ఇంగ్లీషులో కూడా మంచి ప్రవేశం ఉన్నట్లు కనిపిస్తుంది. ఇంగ్లీషు భాషాపరిచయంతో ప్రతీక (Symbol) అనే పదాన్ని ఎన్నో గ్రంథాధారాలతో వివరింపగలిగినాడు. ఈ సాహాయ్యంలో రాచకన్యకా పరిణయ కావ్యంలో ఒక పదానికి సంకేతితమైన వాచ్యార్థాన్నే కాక ఆ విషయ గుణసమయ సందర్భాలను పురస్కరించుకొని ఆ పదానికి వేర్వేరు అర్థ స్ఫూర్తులను కల్పించడం విపుల పాండిత్యం ఉన్న విమర్శకులు చేసే పద్ధతి. ఈ గారడినే 'కందర్పాతిశయాంతమాగమము' అనే పద్యానికి వివరణ ఇచ్చే సందర్భంలో మన బాలసుబ్బయ్య ప్రదర్శించినారు. ఈ సందర్భంలో 'ఆకా'రాంత స్త్రీలింగ రూపంలో ఉన్న 'కాంతా' శబ్దం సత్యభామకు మాత్రమే సంకేతం కాకుండాపోయింది. అంతే పరిశోధకుడు పట్టుపట్టి రెండు పరస్పర విరుద్ధాలైన లింగరూపాలకు సంకేతంగా ఆ పదాన్ని ఉపయోగించుకున్నాడు. చమత్కారంగా దీర్ఘాంతమైన పదాన్ని 'కాంత'గా స్వీకరిస్తూ గురుబాల ప్రబోధి కాదిగ్రంథ సాహాయ్యంతో ఆ పదానికి 'శాశ్వతానందసంధాయకుడైన కృష్ణ పరమాత్మను అర్థంగా పూరించినాడు. ఈ విధమైన శబ్ద చమత్కారాలను చూపుతూ ఆ పద్యానికి అద్వైతపరంగా, వ్యూహాల్లో ఒకటైన ప్రద్యుమ్న వ్యూహపరంగా అర్థాన్ని సాధించడం అతని పరిశ్రమకు ప్రతీకగా నిలిచింది.

ఈ విధంగా నరసింగకవి గ్రంథంలో ఒక కాంతి కిరణంగా చొచ్చుకొని పోయి ఏ చీకటి కోణాన్నీ వదలక అభిమానంతో, ఆర్జించుకున్న వివేకంతో, ఎవరిలో ఏదున్నా సంపాదించే దూరదృష్టితో ప్రవర్తిస్తూ అజ్ఞాతంగా ఉన్న ఒక కావ్యాన్ని ఆంధ్ర సాహిత్య లోకానికి ఉత్తమ కావ్యంగా పరిచయం చేసిన ఈయన పరిశ్రమ మెచ్చుకోదగిందిగా ఉంది.

ఆశీస్సులతో

సం/-
పి. యశోదారెడ్డి

**Prof. M. Ranga Rao**
Professor of Telugu,
Kakateeya University,
Warangal

Dt. 6-1-83

ఈ సిద్ధాంత గ్రంథం - వెల్లూరు నరసింగకవి రచించిన రాచకన్యకా పరిణయమనే (నాలుగు ఆశ్వాసాల) ప్రబంధ సమగ్ర పరిశీలనం. ఇంతవరకూ ప్రకటితం కాకుండా లిఖిత రూపంలో ఉంది. దీన్ని సేకరించి, సంశోధించి, సంస్కరించడంతో ఈ పరిశోధనలో మొదటి దశ ముగిసింది. రెండో దశ కవి గురించీ, ఆనాటి చారిత్రక సామాజిక వాతావరణ పరిశీలనంతో, సాహిత్యపరమైన వివరణకు చెందింది. మూడోదీ, ముఖ్యమైందీ క్లిష్ట పద్యాలకు వ్యాఖ్యానంతో సాహిత్య విమర్శనంతో గ్రంథంలోని తత్త్వావలోకనంతో కూడింది. పరిశోధకుడే మూడు దశల్నీ పరిశోధనాదృష్టితో సముచితంగా నిర్వహించడం జరిగింది.

కవి జీవితము, దానికి ఉపకరించిన జటప్రోలు సంస్థానమూ, ఆ ప్రభువుల విద్యాపోషణము మొదలైన అంశాలతో చారిత్రకమైన భూమిక ఈ పరిశోధనలోని ప్రధానమైన విషయానికి ప్రవేశికగా స్వీకృతమైంది. ఈభాగాన్ని అనుసరించిందే వెల్లూరు నరసింగకవి కాలమూ, ఆధ్యాత్మిక వాతావరణంలోని జీవనమూ, ఇతర కృతుల (భర్తృహరి సుభాషితమూ, చూతపురీవిలాసమూ) సాధారణ పరిశీలనమూ,

ఇందులో నరసింగకవి ఆత్మీయత, తాత్త్వికత, సాహిత్యదృష్టీ, సామాజిక తత్పరత అనేవీ, ఈ ప్రబంధం అంతవరకు వెనుకనుండి పనిచేసిన ప్రేరక, శక్తులూ, వీటి సమన్వయంలో కవి ఆంతర బహిగ్ వ్యక్తిత్వాన్ని చేకూర్చిన విధమూ పేర్కొనదగింది.

శ్రీకృష్ణుడు నరకుని వధించి అతడు బంధించిన పదునారు వేలమంది రాచకన్యలను బంధవిముక్తుల్ని చేసి వారిని పరిణయమాడిన పౌరాణిక కథ ఇందులోని వస్తువు. దీని నిర్వహణలో కవి ప్రదర్శించిన ఇతివృత్త నిర్మాణం, పాత్ర చిత్రణం, నాటకీయతకు సంబంధించిన అంశాలపై పరిశోధకుడు వెలుగును ప్రసరించాడు. ఈభాగం పరిశోధకుని విశ్లేషణాదృష్టినీ, కావ్యశిల్పజ్ఞతనూ సూచి

స్తోంది. దీనికి అనుబంధంగా కవి వైదుష్యమూ, పదప్రయోగ నైపుణ్యమూ, వర్ణనావైచిత్రీ, అలంకార విన్యాసమూ, ఛందోవ్యాకరణ విశేషాలూ పరిశోధనా స్వరూపానికి పుష్టిని చేకూరుస్తున్నాయి.

ఇది ఇట్లా ఉంచి పూర్వకవిత్వంలో పరిహరింపరానివీ, ముఖ్యంగా ప్రబంధంలో రసనిర్వహణమూ, ధ్వని ప్రకాశనమూ ఇందులో వివేచితమైనాయి. భక్తి అంగిరసంగానూ, ముఖ్యంగా శృంగారమూ తరువాత కరుణమూ మొదలైనవి అంగరసాలుగానూ పరిష్కరించిన విధం పేర్కొనదగింది. భగవద్భక్తికి గల శృంగార రససమాకలన స్థితీ, దీనికనుగుణంగా పరిశోధకుడు తన అభిప్రాయాన్ని ఆవిష్కరించిన విధం బాగుంది. ప్రబంధం పేరునుబట్టి శృంగారం అంగిరసంగా ప్రభావితం కావడానికి వీలైన స్థితిలో గ్రంథంలో నిర్వహణాన్ని బట్టి భక్తి అంగిరసంగా పరిగణించిన అంశం పరిశోధకుని మౌలికతను ప్రకటిస్తోంది. దీన్ని అనుసరించిన ధ్వని దీప్తిలో కవితాశక్తి ఉన్మీలితమైంది.

ఇందులో సాంకేతిక శిల్పంలో తాత్త్వికఅంశాల సమన్వయము పరిశోధకుని విస్తృతమైన అవగాహనను తెలియజేస్తోంది. ఇది అంతస్సత్త్వానికి సంబంధించింది.

ఈ పరిశోధకుడు తుదిరేఖలన దగిన సాంఘిక జీవనమూ, సాంస్కృతిక వాతావరణమూ, ఈ రచనపై పూర్వకవుల ప్రభావమూ చేకూర్చబడినాయి.

**Prof. Madduri Subba Reddy**
Dept. of Telugu Studies
Venkateswara University
Thirupathy.

---

'రాచకన్యకాపరిణయము - సమగ్రపరిశీలనము' అనే శీర్షికతో రచితమైన సిద్ధాంత వ్యాసాన్ని ఆమూలాగ్రంగా పరీక్షించడం జరిగింది. ఒక మంచి సిద్ధాంత వ్యాసాన్ని పఠించగలిగా ననే సంతృప్తితో సిద్ధాంత వ్యాసకర్తను అభినందిస్తున్నాను. పర్యవేక్షక భారాన్ని నిర్వహించి అముద్రిత గ్రంథపరిశీలన కాక నిర్దుష్టమైన మార్గాన్ని సూచించిన శ్రీమతి యశోదారెడ్డి గారిని ప్రత్యేకించి అభినందిస్తున్నాను.

సాహిత్యలోకంలో ప్రాచీన, ఆధునిక భావసంబంధంగా సంఘర్షణ అనాదిగా కన్పిస్తున్నదే. ఏ ఒక్కటీ శ్రేష్ఠమైందికానీ, నైచ్యమైందిగానీ ఉండదు. రెండింటిలోనూ అంతస్సత్వం కల్గిన భావజాలం మానవుణ్ణి ముందుకు నడిపిస్తూనే ఉంటుంది. గతంలేకుండా వర్తమానం ఉండదు. అంతమాత్రాన గతమంతా యథాతథంగా శిరోధార్యమూ కాదు సమన్వయ మార్గం ఆహ్వానింపదగింది.

గతమనే సముద్రాన్ని తరచిచూస్తే ఎన్నో మణులు వెలికివస్తాయి. అప్రయత్నం అభినందార్హం. అపరిష్కృతంగా, లిఖితరూపంలో ఉన్న ఒక ప్రాచీన గ్రంథాన్ని ఆమూలాగ్రంగా పరిశోధించి సంస్కరించడం క్లేశావహమైన విషయం. వెల్లూరు నరిసింగకవి 'రాచకన్యకాపరిణయము' అనే ప్రబంధాన్ని వ్యాసకర్త పరిష్కరించి సమీక్షించిన విధానం పండిత సమ్మోదకంగా ఉంది. ఈ సిద్ధాంత వ్యాసంలో అర్హమైన అంశాలు.

1. అసూర్యం పశ్యగా ఉన్న గ్రంథాన్ని వెలుగులోకి తేవలెననే ప్రయత్నం.

2. ఎక్కడా ప్రత్యంతరము లభించని గ్రంథాన్ని సంపాదించడం. ప్రముఖమైన భాండాగారాల్లోని గ్రంథ పట్టికలను వెదికిచూడడం జరిగింది. ఇంత అరుదైన గ్రంథాన్ని ఎంపిక చేసుకోవడం ముదావహం.

3. ఇంతవరకు ముద్రింప బడకపోవడమే ప్రధానకారణంగా తీసుకొనక, కవిత్వ పటుత్వాన్ని ఆధారం చేసుకున్నారు.

4. ఆంధ్ర ప్రబంధ సాహిత్యంలో ఈ కవి సంపాదించగల వైశిష్ట్యాన్ని సమగ్రంగా ఆవిష్కరించగలిగారు.

5. రాచకన్యకాపరిణయకర్త ప్రతిభ, ఆత్మీయతల్ని నిశితంగా పరిచి చూపగలిగారు.

6. గ్రంథ నిర్మాణంలో కవియొక్క కృషి వ్యర్థమై పోకుండా ప్రకటించగల్గడమే కాక, ఆంధ్ర ప్రబంధ సాహిత్యాకాశంలో మరొక మణి దీపం వుంది అని చూపగల్గారు.

7. వెల్లూరు నరసింగకవి సంస్కృతాంధ్ర ప్రతిభగలవాడు. జటిల పద ప్రయోగ నిపుణుడు. కొన్నిచోట్ల దురవగాహమైన పద్యాలు కూడా వున్నవి. అటువంటి వాటిని తుదముట్ట లోతకు వెళ్ళి వ్యాఖ్యానించి పాఠకులకు సుబోధకం చేశాడు వ్యాసకర్త.

8. సిద్ధాంత వ్యాస 'అవతరణము'లో స్థూలంగా జటప్రోలు సంస్థానంలో జరిగిన భాషాసేవను, చేర్చడం సబబుగా వుంది. పరిణయ ప్రబంధాల పరిచయం, వర్గీకరణ శాస్త్రబద్ధంగా వుంది.

9. 'అనుశీలనము' అనే శీర్షిక క్రింద ఇతివృత్త నిర్మాణం మొదలు - పాత్రచిత్రణ, నాటకీయత, కవివైదుష్యం, వర్ణనావైచిత్రి, అలంకార పరిష్కృతి, ఛందోఘటనం, రస, ధ్వని దీప్తులు, నాటి ఆచార వ్యవహారాలు సమగ్రంగా ఆవిష్కరించడం జరిగింది.

10. అనుబంధంలో రాచకన్యకాపరిణయ పాఠం (టెక్ట్స్) చేర్చడం సముచితం.

11. విషయవివరణ, విశ్లేషణ, వర్గీకరణ ఔచిత్య శోభితంగా వున్నాయి.

12. సిద్ధాంత ప్రచలనంలో, వాదనాప్రకటనంలో సంయమనం కన్పిస్తుంది. అది పరిశోధకుని పరిణతికి, అనుభవానికి చిహ్నం.

13. సిద్ధాంత స్థాపనకు అవసరమైన ఆధారాలను ఉటంకించడంలో నేర్పు చూపించారు. అది పరిశోధకుని వ్యుత్పన్నతకు గుర్తు.

14. వ్యాసకర్తకు - సిద్ధాంత వ్యాసాన్ని అందగించే - నిర్దుష్టమైన భాష, అలవడింది. అనేక గ్రంథ పఠన, పరిచయాలు దీనికి కారణమని తెలుస్తుంది.

15. ఈ ప్రబంధాన్ని వెంటనే అచ్చువేయించడానికి తగిన రూపంలో సంతరించ గలిగారు.

ఈ గ్రంథం వెంటనే అచ్చుద్వారా వెలుగులోకి రావాలని ఆకాంక్షిస్తున్నాను. మూలగ్రంథం విడిగా అచ్చువేస్తే మంచిది. మూలగ్రంథానికి పరిష్కరణ రూపమైన ఒక విపుల పీఠికను చేర్చవచ్చు. సిద్ధాంతవ్యాసాన్ని విడిగా అచ్చువేయవచ్చు. ఆ విధంగా పండితుల్ని సామాన్య పాఠకుల్ని సంతృప్తిపరచే అవకాశం వుంది.

సరస్వతీకంఠాభరణ, తత్త్వార్థ ప్రబోధక

కళాప్రపూర్ణ, విద్వాన్

**డా॥ వేదుల సూర్యనారాయణ శర్మగారు**

# ఆశీరక్షతలు

చిరంజీవి తలముడిపి బాలసుబ్బయ్యకు ఆశీస్సులు

నీవుపంపిన 'రాచకన్యకాపరిణయం-సమగ్రపరిశీలనం' అన్న నీ సిద్ధాంత వ్యాసాన్ని తలస్పర్శిగా చదివేను. గ్రంథ పరిశీలనలో ఎన్నో కోణాల నుండి రస, ధ్వని, పాత్రపోషణ, పాండిత్యప్రదర్శన, అలంకార ప్రదర్శన మొదలగు ఎన్నో విషయాలు వింగడించి చూపడంలో నీ ఓపిక, భావుకత, సమర్థత, పరిశీలనా ప్రవణత గ్రహించి ఆనందతుందిలుణ్ణయ్యాను. శ్రీ వెల్లూరు నరసింగ కవి వంశం, అభిజనమైన జటప్రోలు సంస్థానాధిపతుల వంశానుగత భాషాపోషణాది మహోదార చరిత్రలు చదివినప్పుడు ఆ విషయాల సేకరణకు నీవుపడిన పాట్లను పరిశోధించిన గ్రంథాల సూచికలు గ్రహించినపుడు ఇక ఆ గ్రంథాన్ని గూర్చిన ఏ విషయము మిగలకుండా సర్వంకషంగా పరిశీలించిన నీవు అనన్య చిత్తంతో ఏకాగ్రతతో ఎన్నాళ్ళు ఎంత శ్రమించి వుంటావో అనిపించింది.

శ్రీ వెల్లూరు నరసింగకవి గ్రంథం నీ కంటబడ్డం, దాన్ని నీవు నీ పరిశీలనకు స్వీకరించడం నిజంగా కవిగారి అదృష్టరేఖ ఇన్నేళ్ళకు పండి బయల్పడిందని చెప్పాలి. ఎవరైనా సిద్ధాంత గ్రంథ పరిశీలనకు అందరికీ చిరపరిచితమైన గ్రంథాన్ని ఎంచుకొని సులువుగా, తెలివిగా గట్టెక్కాలని భావిస్తారు. అందుకు విరుద్ధంగా నీవు చిరకాలం అటకమీద చెదలకాహారంగా నిలువబడి అదృష్టవశాత్తు శిథిలంకాకుండా వున్న రాచకన్యకాపరిణయాన్ని ఎంచుకోవడం నీ పరిశీలనా దృక్పథంలోని పవిత్రతను, నిజమైన భాషా సేవా ప్రవణతను వేనోళ్ళచాటుతుందనక తప్పదు. పేరు ప్రఖ్యాతులు ఈవిధమైన దృక్పథంలో శ్రమించేవారికే వస్తాయి.

నీ 'అనుశీలనం'లో రసాలంకార ధ్వని పాత్రపోషణాదులను, భాషా రచనా వివిధవైచిత్రులను మాత్రమేకాక లోపాలుగాకనిపించే యతి గణదోషాలను ఎత్తి చూపడం మొదలైన అన్ని విషయాలు కూడ బహుళ పరిశ్రమను, సహిష్ణుతను చెప్పేవే. ఇవన్నీ ఒక ఎత్తు. కేవలం సహజ సిద్ధ ప్రతిభావ్యుత్పత్తులతో మాత్రమే దర్శించగల సాంకేతిక శిల్పాన్ని విశ్లేషించి చూపడం, అందులో శ్రీ నరసింగకవిగారి ద్వైత విశిష్టాద్వైత అద్వైత తత్త్వప్రవణతను, పాంచరాత్ర ఆగమశాస్త్ర నిష్ణాతృత్వమును, ఇంకా ఎన్నో మధురభక్తి భావుకతలను ప్రదర్శించి ఎత్తిచూపినావు. అది ఉత్తమ తరహా పాఠకులకు ఎంతో హృదయాహ్లాదం కల్గించేది కావడంవల్ల ఈ నీ పరిశీలనారచన అజరామరంగా నిలిచి పోతుందని నేను అనుకొంటున్నాను. ఏ కొంచెమో శ్రమిస్తే అందరూ తెలిసికోగల్గినవే అయిన విషయాలను ఒకచోట కుప్పలు పోసినట్లు పెద్దగా చూపిస్తుంటారు సిద్ధాంత వ్యాసకర్తలు అందరూ సామాన్యంగా. నీవు అట్లుగాక ఎవరికో, ఎంతో ప్రతిభ గలవారికిగాని తోచని సాంకేతిక శిల్పాన్ని ఈ గ్రంథం నుండి ఉద్ధరించడం సముద్ర మథనంచేసి అమృతభాండాన్ని సుమనస్సులకు అందించడమే కాని అందరిలాగ తాటాబూటా మాటలు కోటల కొలది ఒకచోట ఒలక బోయడం కాదు. ఈ సాంకేతిక శిల్పవిషయం అంతరార్థ రచనా ప్రవణశీలత గలవాణ్ణికాన నాకు ఎంతో సంతోష కారణమైంది.

ఇక బలరాముని పాత్రను స్వతంత్రించి ప్రవేశ పెట్టడంలో కవిగారి వైదాంతిక ఆభిముఖ్యం నీవు గొప్పగా ప్రదర్శించేవు. ఆ విధమైన నీ సమర్థన గ్రంథంలో, సాంకేతిక శిల్పం మొత్తం అంతటిలోను శిరోమణివంటిది. 'ప్రష్టావ్యాది' అనే సూత్రంవల్ల 'బలపదం యొక్క సార్థరూపం' బాల అవుతుంది. అప్పుడు నీ పేరులోని 'బాల' పదం బలరాముణ్ణి చెప్పేది కావచ్చు. బలరాముడు శేషావతారం. అప్పుడు నీ పేరులోని 'సుబ్బయ్య' పదం (సుబ్బారాయుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు శేష రూపములే) బలరాముని శేష రూపాన్ని చెప్పేది అవుతుంది. ఇక ఇంటి పేరు 'తలముడిపి' అన్నది శిరోమణి అన్న అర్థాన్నిస్తుంది. కాగా శిరస్సులో బుద్ధి మణిదీధితులు వెలిగే శేషావతారమైన బలరాముడే తలముడిపి బాలసుబ్బయ్య కావడంవల్ల ఈ గ్రంథంలో బలరాముని పాత్ర విశిష్ట సాంకేతికార్థాన్ని నీవు తెల్పగలిగేవు అని నా స్థూలాభిప్రాయం. శ్లేషపరంగా ఇది కొంత అతియోక్తి అయినా అంతా అబద్ధంకాదు.

ఆశీస్సులతో

తే. 9-2-89,
B. 304, దత్తసాయి ఎపార్ట్‌మెంట్స్,
రాజభవన్ రోడ్, సోమాజిగూడ,
హైదరాబాదు - 500 482.

ఇట్లు
నీ శ్రేయోభిలాషి
సం/-
**డా॥ వేదుల సూర్యనారాయణశర్మ.**

# ఆత్మీయం

—డా॥ ఎల్లూరి శివారెడ్డి
రీడర్, తెలుగుశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

మిత్రుడు బాలసుబ్బయ్య పాండిత్యం పండబారిన విద్వాంసుడు. ఆయన పరిశ్రమ ముందు ఎంతటి కార్యభారమైనా కరిగిపోతుంది. క్షణాల్లో శ్లోకాలను కంఠస్థం చేయడం, రేయింబవళ్ళు అధ్యయనం చేయడం ఆయనకు వెన్నతో బెట్టిన విద్య. ఏదైనా నారికేళపాకంలోని ప్రాచీన కావ్యాన్ని తీసుకొని పరిశోధన చేయాలన్నది ఆయన అభిమతం. ఆ అభిమతానికి అవకాశం కలుగలేదు కానీ, అముద్రితమై, రసవంతమైన రాచకన్యకా పరిణయకావ్యం ఆయన చేతికిచిక్కింది. దాన్ని తీసుకొని కొన్నేళ్ళు పరిశ్రమించి, పరిశీలించి ఈ సిద్ధాంత వ్యాసాన్ని రచించారు బాలసుబ్బయ్యగారు.

వెల్లూరి నరసింగకవి రాచకన్యకా పరిణయం మొదటి చూపుకు పసలేని కావ్యమని అనిపిస్తుంది. నిశితంగా పరిశీలిస్తే మహితాత్ముని అంతరంగంలా ఉదాత్తంగా ఉంటుంది. కవి ఎప్పటివాడో కాదు. ఈ శతాబ్ది తొలిపాదంలో జీవించినవాడు. కొల్లాపురం నందనోద్యానవనంలో కూసిన పుంస్కోకిల నరసింగకవి. నరసింగకవి రచనను, ఆయన అంతరంగాన్ని ఆకళింపు చేసుకోవటానికి అహోరాత్రులు శ్రమించి అనారోగ్యాన్ని కొనితెచ్చుకున్నారు ఈ వ్యాసకర్త. పరిణయ కావ్యాల్లో ఇదీ ఒకటి అనే చూపు మనది. కవి తాననుభవించిన తాత్త్వికానుభవసారమును రాచకన్యకా పరిణయమునందు నిక్షేపించినారు (పు. ౮) అని బాలసుబ్బయ్యగారి నిగమనం. 'సంకేత శిల్పం' అనే అధ్యాయంలో వేదాంతపరమైన విషయాల అనుశీలనం ప్రౌఢంగా ఉంది. వేదాంతాధ్యయనం పట్ల విసుగు, విరామంలేని ఈ వ్యాసకర్త కథాగతమైన శిల్పాన్ని వేదాంతపరంగా విశ్లేషించడం సంభావ్యంగా ఉంది. ఆ విశ్లేషణ చాలాచోట్ల సముచితంగా సాగింది. నరసింగకవి రచనలో కనిపించే కొన్ని పారిభాషిక పదబంధాల వెనుక గోచరించే మహామహుల తాత్త్విక రచనల్ని ఈ వ్యాసంలో ఉద్ధరించి చూపడం జరిగింది. మొదట మొదట మిత్రుడు బాలసుబ్బయ్య తన వేదాంత భావుకతను నరసింగకవికి బలవంతంగా అంటగడుతున్నారేమో అని నాకు అనిపించినా సిద్ధాంత వ్యాసం మొత్తం చదివాక నేనూ ఆయన అభిప్రాయంతో అంగీకరించక తప్పలేదు. అనుశీలనంలోని అధ్యాయాల్లో నరసింగకవి రచనను సాకల్యంగా పరిశీలించారు. 'వర్ణనా వైచిత్ర్యము' అనే అధ్యాయంలో అలంకార శాస్త్రంలోని వర్ణనలలో నరసింగకవి ఎన్ని వాడటం జరిగిందో విశదీకరించారు. నరసింగకవి వాడు కొన్న అలంకారాల గురించి

ప్రత్యేకంగా ఒక ప్రకరణం రచించారు. అందులో వట్టి సమన్వయంతో సంతృప్తి పడకుండా రసభావాదుల బోధకు అలంకారం ఎలా ఉపకరిస్తుందో వ్యాఖ్యానించడం బాలసుబ్బయ్యగారి ధిషణకు తార్కాణం. ఉల్లేఖాలంకారం ఉదాహరణానికి ఆయన చేసిన వ్యాఖ్య సరసంగా ఉంది.

బాలసుబ్బయ్యగారి సర్వాంగీణ పరిశోధనలో రూపుదిద్దుకొన్న ప్రకరణం "తెలుగువారి ఆచారములు-సాంఘిక జీవన ప్రతిఫలనము". ధ్వని దీప్తి, రస మాధురి వంటి ప్రకరణాలలో పరిశోధకుని ఆత్మ ప్రతిఫలిస్తే పై ప్రకరణంలో ఆయన సమాజ జీవన దృష్టి రూపుకట్టుకొంది. అయితే కావ్యానికి ఇతివృత్తం శరీరం. ఆ శరీరం ఏయే జీవధాతువులనుంచి సౌష్ఠవోపేతమయిందో "ఇతివృత్త నిర్మాణము" అనే అధ్యాయం చూస్తే తెలుస్తుంది. రాచకన్యకా పరిణయంలోని కథకు మూల స్తంభాలుగా నిలిచిన ఆకరాలను పరిశీలించి ఈ పరిశోధకుడు కథా విషయాలను వెల్లడించటం జరిగింది.

కొందరు పరిశోధకుల రచనలలో విషయం ఉంటుంది. కాని జీవం ఉండదు. పరిశోధకుడు తెలుసుకొన్న విషయాన్ని మనకు తెలియజెప్పే వాడే కాదు; మంచిచెడ్డలను సాధికారంగా వెల్లడించే సాహసి కావాలి. పరిశోధకులలో కొందరిది గోడమీది పిల్లివాటం. కొందరిది అహంకారాల దండయాత్ర. కొందరిది కాళ్ళు భూమిమీద నిలవని ఊహాశాలిత. కొందరిది ఎవరికీ అర్థంకాని సణుగుడు. బాలసుబ్బయ్య ఈ లక్షణాలన్నింటికి దూరంగా ఉన్న ప్రియంభావుకుడు. నమ్మిన విషయాన్ని నాగారా వాయించి వినిపించగలడు. నమ్మని విషయాన్ని ఎవ్వ రెదురైనా తృణీకరించగలడు. "మాలూర ఫలములు మర్రిచెట్ల ఫలించె" అనే పద్యానికి ఆయన చేసిన వ్యాఖ్య నమ్మకుండా ఉండటానికి హృదయం ఒప్పదు. నమ్మటానికి ఆత్మ అంగీకరించదు. అయినా ఆయన భావుకతను అభిమానిస్తాము. బాలసుబ్బయ్యకు ఏ విషయంలోనైనా నిర్దిష్టమైన అభిప్రాయాలు ఉండటం హర్షించదగిందే.

ఈ సిద్ధాంత వ్యాసంలోని ఎన్నో అమూల్య విషయాలను స్పృశిస్తూ పండితులు పీఠికలు రాశారు. నేను రాస్తున్న ఈ నాలుగు మాటలు కేవలం ఆత్మీయతకు సంబంధించినవి. చక్కని సిద్ధాంత వ్యాసాన్ని వెలువరిస్తున్న నా సహపాఠిని మా సహపాఠులందరి పక్షాన అభినందిస్తున్నాను.

"రసభారతి"

హైదరాబాదు

18-4-1989

# ప్రస్తుతి

ఇది అసూర్యంపశ్య, సరసాలంకృత అయిన ఒక ప్రబంధకన్యకను కావ్యాలంకరణజ్ఞులైన సహృదయులకు సమర్పించు ప్రయత్నము.

సంకట భూయిష్ఠమైన లోకమున మానవునికి చిత్తశాంతిని, ఉత్తేజమును కలిగించు విషయములు రెండే.

"సంసార విషవృక్షస్య ద్వేఫలేఽమృతోపమే।
కావ్యామృత రసాస్వాదః సల్లాపః సజ్జనైస్సహ॥"

అన్నాడో పండితుడు. కావ్యామృత రసపానము, సజ్జన సల్లాపములు విషఫల భరితమైన సంసార వృక్షమునకు ఉద్భవించిన అమృతఫలములు. అట్టివీని అనుభవమునకు దూరమైనవాడు వంచితుడు.

సాహిత్యమున ప్రాచీనాధునికములకు సంఘర్షణ అనాదిగా నున్నదే. కవి కులగురువైన కాళిదాసంతటివాడు కూడ సమకాలీనుల మన్ననలు పొందలేక 'పురాణమిత్యేవ న సాధు సర్వం, న చాపికావ్యం నవమిత్యవద్యం' ప్రాచీనమైన దంతయు శ్రేష్ఠమైనదనికాని, ఆధునికమైన దంతయు వ్యర్థమైనదనికాని భావించ రాదని మొరపెట్టుకొనవలసి వచ్చినది.

అట్లే, అభ్యుదయ భావబంధురమని భావింపబడు నేటికాలమున ప్రాచీన మైన దానిని 'పాతచింతకాయ పచ్చడి' అని కొట్టి పారవేయ వీలులేదు. సమ కాలీనమైనది కదా అని నూతనమైన దానినంతయు మేలిమి బంగారముగా భావించి నెత్తికెత్తుకొనవలసిన అగత్యము లేదు. రెండవసారి చదివించగల్గిన అంతస్సత్త్వము కొరవడి 'మఖలో పుట్టి, పుబ్బలో గిట్టునట్టి' ఆధునిక కవితలు ఈనాడెన్ని లేవు.

ఎన్నడో పదునారవ శతాబ్దమున రచితమైనను, నేటి ఇరువదవ శతాబ్దము ననే పింగళి సూరనార్యుని 'కళాపూర్ణోదయము' వాసిగాంచినది. అంతకంటే ఎంతో ముందుగనే రచితమైన నన్నెచోడుని 'కుమార సంభవము' కూడ వెలుగు లోచి కీర్తి పొందినది నేటికాలముననే.

కనుక ప్రాచీనాధునికతా భేదములను బట్టికాక విషయగౌరవమును బట్టియే కవిత్వమునకు గుర్తింపు కలుగుననన్నమాట వాస్తవము. కాలపరీక్షకు తట్టుకొని విలువగలుగుటయే కవితకు గీటురాయి.

శ్రీకృష్ణరాయల కాలమున ఆంధ్ర సాహిత్య సరస్వతికి అమూల్యాలంకారముగా వెలసిన ప్రబంధ ప్రక్రియ అనంతరకాలమున క్షుద్రప్రబంధముల స్థాయికి దిగజారినదన్న అపవాదు వచ్చినది. 'విజయవిలాసము' వంటివి ఎడారి యందలి కాసారప్రాయములై ఈ నింద నుండి తట్టుకొని నిలిచినవి.

కొంతమేరమీరిన శృంగారము కారణముగా దక్షిణాంధ్రయుగమున వెలసిన ప్రబంధములను క్షుద్రములనియు, ఆ కాలమును అంధయుగమనియు స్థూలదృష్టితో ఏకపక్షముగా నిర్ణయించి నిరసించుటతగదు. భాషాసాహిత్యములు తరుగని సువర్ణఖనులు. జబ్బపుష్టికలవాడు గనిలో నుండి ఎంతసంపదనైన వెలికితీసినట్లుగా, ఆలోచనాపరుడు సాహిత్యము నుండి ఎంత మధురరసము నైనను పిండుకొనవచ్చును.

ఆయా రచయితల హృదయాంతరములందలి యథార్థ తత్త్వమును పట్టుకొన్ననేగాని, వారికవితల ఆంతరసత్యము చక్కగా బోధపడదు. వానియందు వారు నిక్షేపించిన గ్రంథులను భేదించినచో వారి కవితాశయము సుగమము కాగలదు. 'మాసరివాడవా?' అన్న చిన్నమాటకే ఉచ్చారణభేదమును బట్టి భిన్నార్థములు సిద్ధించుట అనుభవసత్యము. ఇట్టి ఉచ్చారణా భేదగ్రహణము కేవల వర్తమానముననే అప్పటికే సాధ్యము. ఆక్షణము మారిన ఉక్తివైచిత్ర్యము మరుగై కేవలవాచ్యమే మిగులును. ఒక చిన్నమాట పరిస్థితే ఇట్లుండగా, ఏనాడో, ఏ కవో వ్రాసిన ఒక కావ్యముయొక్క కవితా భావమును సముచితముగా అవగతము చేసికొనుట సులభసాధ్యము కాదు. దీనికి ఎంతో సంయమనము, ఓర్పు అవసరము.

ఇట ఈ సిద్ధాంత వ్యాసముఖముగా ప్రప్రథమముగా 'రాచకన్యకా పరిణయము' అన్న ఒక అముద్రిత ప్రబంధమును పరిచయము చేయుట జరుగుచున్నది. ప్రబంధ సాహిత్య కేదారమునకు ఇదియొక స్వాతిజల్లు. దీని రచయిత వెల్లాల నరసింగకవి కవితాహృదయమును సమగ్రముగా ప్రదర్శించు ప్రయత్నమిట జరిగినది.

అపరిష్కృతముగా, లిఖితరూపమున నున్న ఒక ప్రాచీన అముద్రిత గ్రంథమును ఆమూలాగ్రముగా సంశోధించి, సంస్కరించి ప్రకటించుటయందలి క్లేశము అనుభవైకవేద్యము. అందులో కవి ప్రతిభావంతుడైనచో ఆ భారము ద్విగుణీకృతము కాగలదు.

నరసింగకవి పెక్కు పద్యములు వ్యాఖ్యానరహితముగా మామూలు పాఠకులకు దురవగాహములుగ నున్నవి. విస్తరభీతికైనను వెరవక అట్టివానిని వర్ణనాలంకారాది ప్రకరణము లందు వివరించుట జరిగినది. రసహృదయుల పరితోషమే ప్రయోగ ప్రయోజనము.

ఈ రీతిగా నాకు ఆంధ్ర సాహిత్య సరస్వతిని సేవించు భాగ్యము కలిగించిన కృతికర్త వెల్లూరు నరిసింగకవికి, సహృదయముతో కృతిలిఖిత ప్రతిని సమకూర్చిన మిత్రులు శ్రీ ముత్యాల సదాశివరావుగారికి ప్రథమ కృతజ్ఞతాంజలి.

అడుగడుగున అమూల్యమైన సూచనలిచ్చి పరిశోధనా మార్గమును సుగమముగావించి, ఆదరణతో నన్ను సోదరప్రాయునిగా భావించి పరిశోధనను పర్యవేక్షించి, నన్ను కృతార్థుని చేయుటతోపాటు, తమ అమూల్యమైన 'చెప్ప వలసిన రెండు మాటలు' రూపంలో ఆశీస్సులనందించిన గురువులు ఆచార్య శ్రీమతి పి. యశోదారెడ్డి గారికి ప్రత్యేకాభివందనములు.

వెన్నుతట్టి ప్రోత్సహించి నా కృషికి అండగానిలుచుటయేగాక ఈ గ్రంథ ముద్రణ కార్యమును నిండుగా తనపై వేసికొని చిత్తుప్రతుల పరిశీలనతోపాటు తన ఆత్మీయతను అందించిన ఆప్తమిత్రులు, ఆర్ద్రచిత్తులు అయిన డా॥ ఎల్లూరి శివారెడ్డిగారికి నమస్సుమములు.

నిర్భర పుత్రవాత్సల్య తుల్యముగా నన్ను అనుగ్రహించుటతోపాటు, అవ్యాజమైన కరుణతో నాపై 'ఆశీరక్షతలు' కురిపించిన బ్రహ్మశ్రీ వేదమూర్తులు వేదుల సూర్యనారాయణశర్మ గారికి శిరోభివందనములు.

నా సిద్ధాంత వ్యాసమునకు నిర్ణేతలుగా ఈ గ్రంథము పరిశీలించి నివేదికల రూపముగా తమ అమూల్యమైన అభిప్రాయాలను ఒసగి నాలో ఆత్మప్రత్యయమును ఇనుమడింపజేసిన ఆచార్యులు మాదిరాజు రంగారావు గారికి, ఆచార్యులు మద్దూరి సుబ్బారెడ్డి గారికి హృదయాభివందనములు.

నా శ్రేయఃకాంక్షులై ఆశీస్సుల నందించిన మా తాతగారు శ్రీ వెల్లాల శివరామశాస్త్రి గారికి, పితృసమానులు శ్రీ గడియారము రామకృష్ణశర్మ గారికి, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి గారికి, శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి గారికి అభివందనములు.

నా ప్రయత్నమునకు హర్షించిన పెద్దలు శ్రీ కపిలవాయి లింగమూర్తి గారికి, శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ గారికి, శ్రీయుతులు యం. లక్ష్మారెడ్డి గారికి, సోదరులు డా॥ ఉమ్మెత్తల లక్ష్మీనారాయణ గారికి నమస్సులు.

పరిశోధనకు అవకాశమును కల్పించిన ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు విభాగ నిర్వాయక సభ్యులకు—

పరిశోధనకు దయతో అనుమతించిన ఉన్నత విద్యా డైరెక్టరేటు అధికారులకు కృతజ్ఞతాంజలి.

ఈ సిద్ధాంతవ్యాస ముద్రణకు ఆర్థిక సహాయమును అందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన కార్యవర్గ సభ్యులకు కృతజ్ఞతాపూర్వకనమస్సులు.

ఈ గ్రంథమును అత్యంత సుందరముగా ముద్రించిన శ్రీ పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత సహృదయులు శ్రీ శ్రీనివాసులు గారికి, వారి ముద్రణాలయ కార్యకర్తలకు నమస్కారములు.

ఒక్కమాట. ఆత్మవిచార పారీణులైన పలువురు మహానుభావుల ప్రవచనములను ఇందు యథేచ్ఛగా, పైతృకధనప్రాయముగా సంగ్రహించితిని. వారందరికి హృదయ కుసుమాంజలి.

ప్రత్యక్షముగను, పరోక్షముగను ఈ ప్రయత్నమున సహకరించిన సహృదయు లెందరో ? అందరికి వందనములు.

—తలముడిపి బాలసుబ్బయ్య
ఆంధ్రోపన్యాసకుడు
గిరిరాజ్ ప్రభుత్వ కళాశాల
నిజామాబాద్.

# విషయ సూచిక

## అవతరణము



## అనుశీలనము

# 1. ప్రవేశిక

ఆధారము లేక లత ప్రాకలేదు. ఆశ్రయము లేక కవిత సాగలేదు. పదకొండవ శతాబ్దమున, అంతకు ముందుండిన బీజదశనుదాటి ఓజవిచ్ఛిత్తిని గావించుకొని అంకురించి పల్లవించినది ఆంధ్ర సాహిత్య లత. ఇది నాటి తూర్పు చాళుక్యరాజు మొదలుకొని నాయకరాజులవరకు రాజాశ్రయానందమున పెంపొంది తీవలుసాగి పుష్పఫలభరితమై సర్వజనానందకరముగా విరాజిల్లినది. పిమ్మట అట్టి రాజులు లేకపోయినారు. రాజ్యములును లేకపోయినవి. వాని స్థానమున, గడచిన ఒకటి రెండు శతాబ్దములందు, సంస్థానములనెడు 'నూతన లక్షణములతో నొప్పునట్టి' ప్రభుత్వము లేర్పడినవి. ఈ సంస్థానములును, ఆంధ్ర దేశమందలి సమస్త ధనికుల సభలును సాహిత్య పోషణభారమును స్వీకరించియుండినవి. నేడు ఇట్టి సంస్థానములును లేకపోగా, ఈ కార్యమును అనేక సాహిత్య సంస్థలు కొనసాగించుచున్నవి.

కడచిన వెయ్యి సంవత్సరములలో ఆంధ్ర సాహిత్య సరస్వతిని తమ అమూల్య కవితాలంకారములతో సర్వాంగ పరిష్కృతి గావించిన మహామహులైన కవి శిల్పులెందరో ఉన్నారు. పలువురు సరసహృదయులు, సాహిత్యరిరంసువులయిన చక్రవర్తులు, రాజులు, సంస్థానాధీశులు, ఇతరులు కవులకు ఆశ్రయమిచ్చి యథాశక్తిగా సాహిత్యాభివృద్ధికి తోడుపడినారు. కాని 'కాలో హి దురతిక్రమః' అన్న సూక్తికి నిదర్శనగా కొందరు మహాకవుల కృతులు అసూర్యంపశ్యలై, కాలగర్భమున లీనమైన అజ్ఞాతముగా ఉండిపోయినవి. ఉదాహరణమునకు తిక్కన 'విజయసేనము', ఎర్రాప్రెగడ 'రామాయణము', శ్రీనాథుని 'మరుత్తరాట్చరిత్ర' 'శాలివాహన సప్తశతి' మొదలైనవి వెలుగుకునోచలేదు. ఇటులే కాలయవనిక మరుగున పడియుండి, జీర్ణదశను పొంది సాహిత్యలోక పరిచయ భాగ్యమునకు నోచుకొనని అముద్రిత గ్రంథములు ఎన్నియున్నవో లెక్కకట్టలేము. జిజ్ఞాసువులైన సాహిత్య పరిశోధకులకు వారి వారి నిరంతరాన్వేషణ ఫలితముగా, కాలాంతరమున, అక్కడక్కడ నిక్షిప్తములైన ఇట్టి అముద్రిత గ్రంథములు లభించు

చున్నవి. శీర్ణావస్థలోనున్న ఇట్టి గ్రంథములను పరిశీలకులు పరిష్కరించి, ప్రకటించి కవితాకళామతల్లిని అపూర్వమైన కవితాభరణములతో సమర్చించి, ఆయా పూర్వ కవుల కవితా తేజమును వెల్లివిరియించు కృషిని కొనసాగించు చున్నారు. ఈ విధముగా పూర్వ గ్రంథములను సేకరించి, సంస్కరించి, ప్రకటించుటలో మెకంజీ, బ్రౌను దొరగారల కృషి చిరస్మరణీయము. మానవల్లి రామకృష్ణ కవిగారిచే ప్రకటితమైన నన్నెచోడుని 'కుమార సంభవము', వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే ప్రకటింపబడిన 'అన్నమాచార్య సంకీర్తనలు' మొదలైన అనర్ఘ రత్నములు కూడ ఇటులే వెలుగు చూచినవి. ఈ మధ్యనే శ్రీరంగాచారిగారి సంపాదకత్వమున ముద్రితమైన మరింగంటి వేంకట నరసింహాచార్య కృతమైన 'కాలాంతనందిని పరిణయము', శ్రీ కపిలవాయి లింగమూర్తిగారి సంపాదకత్వమున ముద్రితమైన ఎ(వె)ల్లూరి నరసింగ కవి కృతమైన 'చూతపురీవిలాసము' మున్నగునవి సాహిత్యలోక పరిచయ భాగ్యమును పొందినవి. ఇట్టివి ఇంకను పెక్కుయున్నవి. ఈ విధమైన కొన్ని అముద్రిత గ్రంథములపై వచ్చిన సవిమర్శక సిద్ధాంత వ్యాసములకు డాక్టరేటు పట్టములును ఇవ్వబడినవి.

ఇదే విధముగా ఇటీవలి కాలమున బయల్పడినట్టి 'రాచకన్యకా పరిణయ' ప్రబంధము కూడ పైవాని జతకు వచ్చునట్టిదే. ఈ గ్రంథ రచయిత వెల్లూరు నరసింగకవి. ఈయన వంశీకులు ప్రస్తుతము మహబూబ్‌నగర్ జిల్లా, కొల్లాపురము మండలమునకు చెందిన ఎల్లూరు గ్రామమున నివసించుచున్నారు. ఈ కవి అగ్రజుడైన లక్ష్మీ నరసయ్యగారి మునిమనుమలైన శ్రీ ముత్యాల సదాశివ రావుగారి ఇంట ఈ 'రాచకన్యకాపరిణయ' ప్రబంధపు కాగితపు ప్రతి లభించి నది. ఇందలి ముఖపత్రములు రెండు అప్పటికే నష్టమైనవి. కావ్యారంభము నందలి 'ఇష్టదేవతాప్రార్థన, పూర్వకవి స్తుతులు' తప్ప తక్కిన గ్రంథ మంతయు పూర్ణముగ నున్నది. ఇప్పటికి ఇదే సమగ్రమైన ప్రతి. దీనికి ప్రత్యంతరము ఎచ్చటను లభించలేదు. కాకినాడ, హైదరాబాదు, తిరుపతి, మద్రాసు, తంజావూరు మున్నగు నగరములందలి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములందున్న గ్రంథ పట్టికలందు ఈ గ్రంథము చేరలేదు. కాని దీనికి సంబంధించిన మరియొక అసమగ్రమైన ప్రతి, మొదటి, రెండవ ఆశ్వా సములందలి కొన్ని పంక్తుల పద్యములతో కూడినది, శ్రీ కపిలవాయి లింగ

మూర్తి గారికి శ్రీ ముత్యాల సదాశివరావుగారి వలననే లభించియుండినది. వారును శిథిలరూపమున నున్న ఆ గ్రంథభాగమును ఉద్ధరించి, ఎత్తివ్రాసి యుండిరి. తాము వ్రాసికొన్న ప్రతిని సహృదయముతో ఈ సిద్ధాంత గ్రంథ కర్తకు శ్రీ లింగమూర్తిగారు ఇచ్చినారు. అందలి గ్రంథభాగము, ఈ సిద్ధాంత గ్రంథకర్త వద్దనున్న పూర్ణప్రతియందలి గ్రంథభాగము దాదాపు సరిపోవుచున్నది. లేఖకజనితమైన పొరపాట్లను కొన్నింటిని సవరించుకొనుటకు అది సహాయపడినది.

ఈ 'రాచకన్యకాపరిణయ' ప్రబంధము దాదాపు డెబ్బదియైదు సంవత్సరముల క్రిందట రచింపబడెను ఇంతవరకు ముద్రణ భాగ్యమునకు నోచుకొననందున, సాహిత్యలోక పరిచయ భాగ్యమునకు దూరమై అజ్ఞాతముగా ఉండినది. ఇంతవరకు అసూర్యంపశ్యలుగా ఉన్న ఈ 'రాజకన్యలను' వెలుగులోనికి తెచ్చుట ఈ సిద్ధాంత గ్రంథ విషయము.

ముందుగా ఈ సిద్ధాంత గ్రంథరచనోద్దేశమును వివరించవలసి యున్నది.

వెల్లూరు నరసింగకవిచేత రచితమైన 'రాచకన్యకాపరిణయ' ప్రబంధము ఇంతవరకు ముద్రింపబడకుండుట, సాహితీలోకమునకు పరిచయము కాకుండుటలు మాత్రమే ఇందు గమనింపదగిన అంశములా?

దీనికి ఆంధ్రప్రబంధ సాహిత్యమున స్థానము సంపాదించగల వైశిష్ట్యము ఏమైన ఉన్నదా?

దీని నిర్మాత అయిన వెల్లూరు నరసింగకవి ప్రతిభ, ఆత్మీయతలు ఎట్టివి?

అన్న ప్రశ్నలకు సారభూతమైన సమాధానమును తెలుపు ప్రయత్నము కావించుటయే ఈ సిద్ధాంత గ్రంథము యొక్క ముఖ్యోద్దేశము.

ఒక కావ్యనిర్మాణము వెనుక కవిపడిన తపన అనుభవైకవేద్యము. అతని అంతర్మథనమును దృష్టిలో నిడుకొని చూడగా ప్రతికవి రచనయు అమూల్యమైనదిగనే తెలియగలదు. ప్రపంచమునందలి ఏ సాహిత్యమునందును కలముపట్టి

కవితచెప్ప దొడగిన ప్రతి కవియు మహాకవి కాలేదు. అది సాధ్యముకాదు కూడను. మహాకవులనదగినవారు వ్రేళ్ళపై లెక్కకట్టగలిగిన సంఖ్యలోనే ఏ సాహిత్యము నందైనను లభింతురు. అందువలననే ఆనందవర్ధనుడు తన ధ్వన్యాలోకమున కావ్య ప్రపంచమున ఇద్దరో, అయిదుగురో మహాకవులు ఉందురనుచు 'అస్మిన్నతి విచిత్రకవి పరంపరావాహిని సంసారే ద్విత్రాః పంచషావా మహాకవయ ఇతి గణ్యంతే' అని చెప్పినాడు. అంతటి సంస్కృత సాహిత్య ప్రపంచమునకూడ కాళిదాసాదులైన కొందరు కవులకే మహాకవులన్న ఘనత దక్కినది. అంత మాత్రమున సాహిత్య లోకము ఇట్టివారినే ఆదరించి, మిగిలినవారిని విడిచిపెట్ట లేదు.అట్లయినచో సాహిత్యము ఇంతగా అభివృద్ధిచెందు అవకాశమే ఉండెడిదికాదు. ఎవరి సామర్థ్యము వారిది. ఎవరి స్థాయి వారిది. కొందరు మహాకవులు కాగా, మిగిలినవారును యథాశక్తిగా సాహిత్యసేవ గావించి తమకు అర్హమైన స్థానమును సంపాదించినారు. మహాబలవంతులైన ఋక్షవానరవీరులు బృహత్పర్వతములు, వృక్షములుగొనివచ్చి వారధి నిర్మించుచుండగా, తనశక్తికి తగినట్లుగా ఇసుకరేణు వులనురాల్చిన ఉడుత కూడ కీర్తిపాత్రము అయినది కదా! ఒక మహాసంగ్రామ మున అతిరథశ్రేష్ఠుడు మొదలుకొని సాధారణ పదాతి కూడ పోరాడవలసినవాడే. అటులే సాహిత్యమునందలి ప్రతి కవి కృషి కూడ గణింపదగినదే. ఎక్కడైన మరుగున పడిపోయిన గ్రంథములుండినచో వాటిని భద్రపరచి, వానిని రచించిన కవులకృషి వ్యర్థమైపోకుండునట్లుగా ఆ గ్రంథములను సంస్కరించి ప్రకటించక పోవుట కవితా సరస్వతికి ద్రోహము చేసినట్లగును. ఆ కవులు ఏ కాలమువారై నను, వారు గ్రహించిన విషయము, తీర్చిన తీరులు ఎట్లున్నను వాని యందలి గుణదోషములను చర్చించి, గుణస్వీకారము కావించుట సహృదయ ధర్మము. అట్టి కవుల గ్రంథములను విశ్లేషించి, వారి హృదయాభివ్యక్తి కావించుట ద్వారా సాహిత్యసరస్వతిని సేవింపగలుగుట సుకృతము.

ఈ కారణముగా 'రాచకన్యకాపరిణయ'మను ఒక అముద్రిత ప్రబంధ మును మొట్టమొదటగా సాహిత్యలోకమునకు పరిచయముచేయుట ఈ సిద్ధాంత గ్రంథ రచనోద్దేశములలో ఒకటి. 'ఒక గ్రంథ నిర్మాణ మందలి కవి కృషి వ్యర్థమై పోకుండునట్లుగా ప్రకటించుట' అన్న అంశమేకాక, 'రాచకన్యకా పరి ణయము' కావ్యగౌరవముచేత ఆంధ్రప్రబంధ సాహిత్యాకాశమున మహోక మణి దీపమై విరాజిల్ల గలదనుట వాస్తవము.

'రాచకన్యకా పరిణయము' ఒక రసవత్ప్రబంధము. 'శ్రీకృష్ణుడు నరకాసురుని వధించిన పిమ్మట అతని చెరలో ప్రమగ్నమైయుండిన పదునారువేలమంది రాజకన్యలను బంధవిముక్తల గావించి వారిని వివాహమాడుట' ఇందలి ప్రధాన కథ.

ఈ గ్రంథరచయిత అయిన వెల్లూరు నరసింగకవి తాను 'సంస్కృతాంధ్ర కవితా ప్రతిభ' కలవాడనని చెప్పుకొన్నాడు. ఈయనకు పాండిత్యజనితమైన అపారమైన సార్థకశబ్ద ప్రయోగ నైపుణ్యమున్నది. దీనితో ఈయన దీనిని ఒక మహత్తర భక్తిరస ప్రబంధముగా తీర్చినాడు. హృద్యమైన పద బంధములతోను, చక్కని జాతీయములతోను, మాండలిక ప్రయోగములతోను, ప్రబంధోచితమైన వర్ణనలతోను, చమత్కార జనకమైన శబ్దార్థాలంకారముల తోను, సజీవ పాత్ర చిత్రణముతోను, సాంఘిక జీవన ప్రతిఫలముతోను ఇది ఒప్పియున్నది. కావ్యమునకు ప్రాణభూతమైన 'రసధ్వని' ఇందు ప్రతీయమానమై, ఈ కావ్యమునకు ఉన్నత విలువలు గలిగిన ఉత్కర్షను ఆపాదించుచున్నది. అందువలన ఈ ప్రబంధము విశేష పరిశీలనకు అర్హమై యున్నది.

ఇంతవరకు, 'రాచకన్యకాపరిణయము' అన్న ప్రబంధము సాహిత్య లోకమునకు అపరిచితము కాని, దీని రచయిత వెల్లూరు నరసింగకవి పరిచితుడే. ఈ గ్రంథరచనమునకన్న ముందుగా ఈయన 'భర్తృహరి సుభాషితత్రిశతి'కి ఆంధ్రానువాదమును, చూతపురీవిలాస'మను యక్షగానమును రచించినాడు. ఈ రెండును ముద్రితములు. ఈయన ఆధునికుడై క్రీ. శ. 1860-1920 ప్రాంతమున జీవించినవాడై యుండియు శతక, యక్షగాన, ప్రబంధ ప్రక్రియలనే స్వీకరించి కవితావ్యవసాయము కొనసాగించుట ఈయన సంప్రదాయ కవితా సక్తిని వెల్లడించుచున్నది.

మహబూబ్‌నగర్ జిల్లా, జటప్రోలు (కొల్లాపురము) సంస్థానమును పాలించిన సురభివంశ పాలకులలో ఇరువదియేడవ తరము వారైన రాజావేంకట లక్ష్మారావు గారి కాలములో స్థానికముగా నున్నట్లు పేర్కొనబడిన కవి పండితులలో వెల్లూరు నరసింగకవి యొకడు. ఈయనను ఆకాలమున 'కవి నర్సింగమయ్య' అనుచుండిరి[2].

కొందరు కవి జీవితకారులు ఈ కవిని 'వెల్లాల' ఇంటివాడుగా పేర్కొన్నారు. శ్రీ వంగూరి సుబ్బారావుగారు 'వెల్లాల నరసింగయ్య[3]' అనియు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు 'వెల్లాల నరసింగకవి[4]' అనియు తమ గ్రంథములందు చెప్పినారు. అముద్రిత గ్రంథ చింతామణియందును ఈయనను గురించి 'వెల్లాల కవి నరసింగయ్య - జటప్రోలు - కొల్లాపురము' అనియే యున్నదట[5].

కాని ఈకవి 'వెల్లాల' వాడు కాదు. 'వెల్లూరు' వాడు. ఈయన ఇంటిపేరు ఈకవి వ్రాసిన గ్రంథత్రయమందు స్పష్టముగ ఉన్నది. ఈయన 'భర్తృహరి సుభాషితములు' (భర్తృహరి సుభాషిత త్రిశతికి ఆంధ్రానువాదము) అన్న శతకమందు చివరగా

'ధర భర్తృహరి కృతంబై
పరగిన శ్లోకములు కందపద్యంబులుగా
నరసింగకవి రచించెను
నరుదుగ వెల్లూరి వెంకటాచల రమణా!'

అని తన గృహనామమును సూచించినాడు.

ఈయన 'చూతపురీవిలాస'ము అన్న యక్షగానావతారికలో
'నను సింగపట్టణ నరసింహదేవ, ఘనవినతాలబ్ధ కవితా ప్రవీణ
నయశాలి వెల్లూరి నరసింగకవిని, ప్రియము తోడుత పిలిపించి
రమ్యముగను'

అని తన యింటిపేరును స్పష్టముగా చెప్పినాడు. ఔపవిభక్తికము 'ఇ' చేరి 'వెల్లూరు-వెల్లూరి' అయినది.

ఇక 'రాచకన్యకా పరిణయము'న ఆశ్వాసాంత గద్యలందు 'వెల్లూరు నరసింగ కవి అని స్పష్టముగ ఉన్నది. 'వెల్లూరు' అనియున్న కవి ఇంటిపేరు పొరపాటున 'వెల్లాల' అని తలచబడియుండును.

నరసింగకవి వేదాంత ద్రష్ట. శాస్త్రజ్ఞానము వలన తనకు సిద్ధించిన, తానసుభవించిన ఆత్మికానుభవసారమును 'రాచకన్యకాపరిణయము'న నిక్షేపించి నాడు. నిజమునకు ఈతడొక పేటికాంతర్గత రత్నము. ఎట్టి రత్నమైనను ఇనాలోకయోగములేక ప్రకాశించదనుట జగత్సత్యము. అయితే ఆశ్రమ, ప్రచారములు లేనిచో ఏ కవియు రాణించలేదు. సహజ పాండిత్యుడైన పోతనామాత్యుని వంటివారు ఇందుకు అపవాదము కావచ్చును.

నరసింగకవి, సాహిత్యసేవకు పెట్టినిల్లు అయిన జటప్రోలు సంస్థాన ప్రాంతము వాడై యుండియు, ఆనాడు పండితులకు కల్పభూజముగా భావింపబడు రాజా సురభిలక్ష్మారాయల సమకాలమున నుండియు ఏలనో రాజాగారి ప్రాపకమును తగినంతగా పొందలేదు. ఇదియు ఈకవి ప్రతిభ ఇంతవరకు సముచితముగా గుర్తింపబడక పోవుటకు గల కారణములలో ఒకటికానోపును.

ఈయన 'రాచకన్యకాపరిణయ'ప్రబంధము దాదాపుముక్కాలు శతాబ్దము క్రిందట రచితమై, కుగ్రామమందలి మట్టిఇండ్ల అటకలందు మూషిక, కీటక గ్రస్తమై, జీర్ణమై కాలగర్భమున కలిసిపోక ఇప్పుడు వెలుగు చూచుటకు కవి సంకల్పబలము కారణము కావచ్చును.

నరసింగకవికి పుత్రసంతతిలేదు. ఆయన అన్నగారి ముమ్మనుమలైన శ్రీ ముత్యాల సదాశివరావుగారి యింట ఇంత కాలము ఈ గ్రంథము అజ్ఞాత వాసము చేసినది. అది ఈనాడు బైటకు వచ్చుటకు వారి సౌజన్యమే కారణము. వారు దీనిని తమపెద్దలు సాధించిన సంపదగా భావించి భద్రపరచియుండిరి.

వెల్లూరు నరసింగకవి గ్రంథత్రయమందు 'రాచకన్యకాపరిణయము' పరిణతిచెందిన రచన. ఈయన ఇందు అడుగడుగున తన ఆత్మీయతను వ్యక్తము చేసినాడు.

'అపారమైన కావ్యప్రపంచమునకు కవియే సృష్టికర్త. అతడు తన ఇచ్ఛాను సారముగా లోకమును మార్చును. అతడు శృంగారి యగుచో కావ్యమును శృంగారమయమొనర్చును. అతడు విరాగి యగుచో నీరసముగావించును. అచేతన వస్తువులను చేతనవస్తువులుగా, చేతన వస్తువులను అచేతనవస్తులుగా స్వతంత్రతతో కవి పరివర్తించును' అన్నది సిద్ధాంతము.

కావ్య నిర్మాణమున కవికి సమాధియే (మనస్సు యొక్క ఏకాగ్రతయే) అధికముగా ఉపయుక్తము. దీనివలన ప్రతిభ సిద్ధించును. ప్రతిభలేని వారికి పదార్థ సముదాయమంతయు పరోక్షమువలె ఉండును. ప్రతిభావంతునకు మాత్రము అతడు చూడకున్నను ప్రత్యక్షమువలెనుండును. ఈ ప్రతిభచేత లోకములో తాను దర్శించిన విషయమును అభివ్యక్తము చేయుటకై కవి ఒక వస్తువును గ్రహించి కావ్యముగా సంతరించును. ఇది స్వీయభావ ప్రకటనమునకు ఉపయుక్తమగు సాధనము మాత్రమే.

ఈ విధముగానే వెల్లూరు నరసింగ కవి, నరకుని వధించి అతడు బంధించిన పదునారువేల మంది రాజకన్యలను కృష్ణుడు వివాహమాడుట' అన్న స్వల్పమైన, శ్రీమద్భాగవత సముద్రమున బిందుప్రాయమైన వస్తువును స్వీకరించి, దానిని దాదాపు 1150 గద్యపద్యములతో మహాప్రబంధముగా నిర్మించినాడు. ఈ కథాముఖమున తన అనుభవ సందేశములను లోకమున చాటినాడు. తను భావించి నట్లుగనే, తన కథయందలి పాత్రలు భావించినట్లుగనే, తన అద్భుతమైన రచనాశక్తి చేత పాఠకులను కూడ భావింపజేసినాడు.

ప్రతిభావంతుడగు ప్రతి కవియు పద సంయోజనములోను, వర్ణముల కూర్పులోను తనదైన ఒక రచనా విన్యాసమును ప్రకటించును. దీనినే ఆలంకారికులు 'శయ్య'7 అనిరి. ఇది ఒక మహా కవి రచనాధోరణికిని, మరియొకరి రచనాధోరణినుండి పృథక్కరించు ప్రధాన లక్షణము. పద సంయోజనరూప ధర్మమైన దగుటచే దీనిని 'రీతి'8 ధర్మముగా ఆలంకారికులు భావించిరి. అటులే అల్పాక్షరయుక్తములై, అర్థానుగుణములైన శబ్దప్రయోగ నైపుణ్యము 'రాచ కన్యకాపరిణయ' కర్త అయిన వెల్లూరు నరసింగకవి సొత్తు. విచిత్ర పద ప్రయోగములు, నూతన పదసంఘటనములు, సామెతలు, జాతీయములు మొదలైన వానియందు ఈయన ఆత్మీయత గోచరించును.

నరసింగకవి ఇట్టి ఆత్మీయతాముద్రతో చక్కని ధారాశుద్ధి గలిగిన పద్యరచన చేసినాడు. పద్యముల ఎత్తుగడయందును, శబ్దార్థములను అన్యోన్యానుగుణముగ పొదుగుట యందును, బిగువు సడలకుండ పద్యమును తుది వరకు ప్రౌఢముగ నడుపుటయందును ఈయన పూర్వకవులకు ఏ మాత్రము

తీసిపోదు, వంపము ఈయనకు అభిమానమైన పద్యము. పెద్దవృత్తమున ఇమి డించగల విషయమును చిరుకందమున పొదుగుట నరసింగకవి నైపుణ్యమునకు నిదర్శన. ఈయన దృష్టిలో శబ్ద సంక్షిప్తీకరణము కూడ పాండిత్యమే!

ఈ కారణములుగా నరసింగకవి మంచి ప్రతిభావంతుడైన కవిగా, ఈయన 'రాచకన్యకాపరిణయ' ప్రబంధము ఉన్నతమైన సాహిత్య విలువలు కలిగినదిగా తెలియగలము. ఈయన తన యోగ్యతదృష్ట్యా, కనీసము నాలుగు శతాబ్దముల ముందుగనైన పుట్టియుండెన, ఏ మహారాజుల ఆస్థానముననైన సముచిత గౌరవమును పొందియుండెడి వాడని నిశ్చయముగ చెప్పవచ్చును.

ఈ 'రాచకన్యకాపరిణయము[9]' ఆధారముగా వెల్లూరు నరసింగ కవి కవితాభివ్యక్తికి రూపుదిద్దుటయే ఈ సిద్ధాంత గ్రంథరచనా ప్రయత్నము. దీని వలన సహృదయులకు ఏమాత్రము భావసారూప్యము కలిగినను ఈ కృషి చరితార్థమే.

# 2. జటప్రోలు సంస్థానము-భాషాసేవ

'రాచకన్యకా పరిణయ'కర్త అయిన వెల్లూరు నరసింగ కవి జన్మస్థల మైన వెల్లూరు జటప్రోలు సంస్థాన మందలిది. అంతేగాక ఈయనకు తన కాలము నాటి ఆ సంస్థాన పాలకులైన రాజా వేంకట లక్ష్మారావుగారి తోడను, ఆ యాస్థాన విద్వాంసులైన వెల్లాల సదాశివశాస్త్రి గారి తోడను సాహచర్య మున్నందున జటప్రోలు సంస్థానమును గురించి కొంత తెలిసికొనుట ఆవశ్యకము.

భారతదేశమునకు స్వాతంత్ర్యము రాకపూర్వము ఆంగ్లేయుల పాలనలో నుండిన ఆంధ్ర ప్రాంతములోను, నిజాం పరిపాలనలో నుండిన తెలంగాణాలోను ఉన్నట్టి సంస్థానములు, జమీందారీలు చేసిన కళాపోషణ, సాహిత్యసేవలు అవి స్మరణీయములు. భారతీయ సంస్కృతికి దర్పణము పట్టినట్టి శిల్పకళ తాండ వించు దేవాలయ నిర్మాణము, వాస్తు వైభవమును ప్రకటించునట్టి కోటలు, భవనములు మొదలైన వాని నిర్మాణము, సంగీత చిత్రలేఖనాది కళాపోషణ, సంస్కృతాంధ్ర గ్రంథ నిర్మాణము మొదలైనవి ఈ సంస్థానాధిపతులు, జమీం దారులు మొదలగువారి కళాభిమానము, రసజ్ఞత, అభిరుచుల కారణముగా ప్రత్యే కతను సంతరించుకొన్నవి.

'తటాకం ధననిక్షేపో బ్రహ్మస్థాపనమేవచ॥ వనం దేవాలయః కావ్యం సుతశ్చ స్వర్గదా నృణామ్॥' అని శంభురహస్యమున చెప్పబడిన సప్తసంతాన ములందు సత్కావ్య నిషేవణమును ఉత్తమ ధర్మముగా భావించినవారు సంస్థా నాధీశులు. వీరిలో స్వయముగా పండితులై, కవులై ఉత్కృష్ట రచనల గావించిన వారు పలువురున్నారు. ఇట్టి వారిలో జటప్రోలు సురభి మాధవరాయలు, గద్వాల ముష్టిపల్లి సోమభూపాలుడు, వనపర్తి అష్టభాషా గోపాలరావు మొదలగు సంస్థానాధిపతులు పండితకవులుగా రాణకెక్కి ఆంధ్రసాహిత్యమున తమకొక ప్రత్యేక స్థానమును సంపాదించినారు. వీరు సరసులై ప్రకటించిన సారస్వతాభి లాష, వీరుగావించిన సాహిత్య సముద్ధరణలు స్తుతి పాత్రములు. కర్తలు, కారయితలు అయిన ఇట్టి సంస్థానాధిపతుల పోషణలో పెక్కురు పండితులు.

వులు, కళాకారులు అనేక విధములుగా రాజులవల్లని ఆదరింపబడిరి. తమ ఆశ్రయమునందలి కవి పండితుల ప్రతిభాపాండిత్యముల స్థాయిని బట్టి వారిని అగ్రహారాది సంభావనలతో సత్కరించి, వారిచేత సత్కృతులను పొంది తమ కీర్తిని సాహిత్య చరిత్రమున సుస్థిరము గావించుకొనిరి. ఈ విధమైన సాహిత్య సముద్ధరణ యజ్ఞములో ఈ సంస్థానాధిపతుల సతీమణులును ఉచితరీతిని భాగము పంచుకొన్నారు. ఇట్టివారిలో గద్వాల మహారాణి ఆదిలక్ష్మీదేవమ్మ, జటప్రోలు మహారాణి రాణి వేంకట రత్నమాంబ, వనపర్తి రాణి సరళాదేవి, ఆత్మకూరు రాణి భాగ్యలక్ష్మీదేవి, గోపాల్పేట రాణి రంగనాయకమ్మ మొదలైన స్త్రీరత్నములు గణింపదగినవారు.

విశేషమైన సాహిత్యసేవ చేసిన సంస్థానములందు తెలంగాణ యందలి మహబూబ్‌నగర్ జిల్లాలోని జటప్రోలు, ఆత్మకూరు, గద్వాల వనపర్తి, గోపాల పేట అన్న పంచ సంస్థానములు ప్రసిద్ధములు. నిజాము రాష్ట్రములో సాంస్కృతిక దీపము ఆరిపోకుండ కాపాడిన గౌరవము కలిగినవి సంస్థానములేనియు, ఇవన్నియు ప్రత్యేక గ్రంథరచనకు తగియున్నవనియు[1]' పండితాభిప్రాయము.

## జటప్రోలు సంస్థాన భౌగోళిక స్వరూపము

పైని పేర్కొన్న పంచసంస్థానములందలి జటప్రోలు సంస్థానపు రాజధాని అయిన జటప్రోలు పట్టణము కృష్ణా, తుంగభద్రానదుల సంగమస్థలమైన సంగమేశ్వర క్షేత్రమునకు ఆగ్నేయదిశలో దాదాపు పది కిలోమీటర్ల దూరమున ఉన్నది. ఈ ప్రాచీన జటప్రోలు పట్టణమందలి ప్రాతకోటలో జటేశ్వరాలయమున్నది. ఈ ప్రదేశమున పూర్వము జటాయువు వధింపబడినట్లును, శ్రీరామచంద్రుడు జటాయువు పేరట శివలింగమును ప్రతిష్ఠించినట్లును, ఆ దేవుని కారణముననే ఆ గ్రామమునకు జటప్రోలు అనుపేరు వచ్చినట్లును జనులు విశ్వసించుచున్నారు.[2] ఈ సంస్థానపు రాజధాని రమారమి రెండు వందల సంవత్సరముల క్రిందట జటప్రోలునుండి ప్రస్తుత కొల్లాపురమునకు మారినది. అందువలన అర్వాచీన కాలమున ఈ సంస్థానమునకు కొల్లాపుర సంస్థానమని వ్యవహారము కలిగినది.

ఈ సంస్థానమునకు తూర్పున కృష్ణానదికి అవతల కర్నూలు జిల్లాయందలి నందికొట్కూరు తాలూక, దక్షిణమున కృష్ణకావల అలంపూరు తాలూక, ఉత్తరమున నల్లగొండ జిల్లాకుచెందిన దేవరకొండ తాలూకాలు ఎల్లలుగా ఉన్నవి. పవిత్ర కృష్ణా తరంగిణి తూర్పు, దక్షిణ దిశలందు ప్రవహించుచు, తుంగభద్రాసంగమ, భవనాశనీ సంగమ క్షేత్రములతో అలరారినది. వరి పంటను మొలకకట్టి చల్లి, పండించు ఆచారము ఈ ప్రాంతమున అధికముగా ఉన్నందున దీనికి మొలకసీమ అని వ్యవహారము కలిగినది. ఈ జటప్రోలు సంస్థానము నందలి పలుస్థలము లందు నిర్మితములైన మృచ్ఛిలా దుర్గములు ఆనాటి యుద్ధవిధానమునకు అనుగుణముగా నుండి యుండునని పండితుల అభిప్రాయము.[4] జటప్రోలు నందలి ప్రాజీన శిలా దుర్గము 'ఏకాలమున ఏ రాజన్యుని వలన నిర్మింపబడినదో తెలియదు.

## జటప్రోలు సంస్థాన చరిత్ర

జటప్రోలు సంస్థాన ప్రాంతమంతయు ఏడవశతాబ్దమున బాదామి చాళుక్యులకు లోబడియుండినది. తరువాత దీనిని రాష్ట్రకూటులు, కళ్యాణి చాళుక్యులు పాలించినారు. జటప్రోలు, అగస్త్యేశ్వరము, బెక్కెం అను గ్రామములలో జగదేకమల్ల, త్రైలోక్యమల్ల, త్రిభువనమల్ల, భూలోకమల్ల చక్రవర్తుల శాసనములు కానవచ్చుచున్నవి.[5] అనంతరము ఈ ప్రాంతము కాకతీయుల వశమైనది. కృష్ణాతీరమందలి సోమశిలలోని ప్రాచీన శివాలయమందు ప్రతాపరుద్రదేవుని శాసనమున్నది. రుద్రదేవ, గణపతిదేవుల కాలమున సమ్మానింపబడిన బేతానాయని కాలముననో, ఆ తర్వాతనో ఈ ప్రాంతము కాకతీయుల పాలనలోనికి వచ్చియుండును.[6] కాకతీయ సామ్రాజ్యము అస్తమించువరకు ఈ సంస్థానము వారికి లోబడియుండి, ఆ తర్వాత కొంతకాలము స్వాతంత్ర్యము ననుభవించి, 15 వ శతాబ్దమున విజయనగర సామ్రాజ్యమునకు 18 వ శతాబ్దారంభమున అసబ్జాహీ నవాబులకును సామంత రాజ్యమైనది. భారత రాజ్యాంగ శాసనము ప్రకారము నిజాము రాజ్యము విచ్ఛిన్నమైనపుడు జటప్రోలు సంస్థానము ప్రతిపత్తిని కోల్పోయి క్రీ. శ. 1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో విలీనమైనది.

## మూలపురుషుడు - వంశము

జటప్రోలు ప్రభువులు సురభివంశమునకు చెందినవారు. వీరిది రేచర్ల గోత్రము. వీరి పూర్వీకులు రేచర్ల గ్రామమున నివసించినందున ఆ గ్రామనామమే వీరి గోత్రనామమైనది. ఈ సురభి వంశమునకు చెవ్విరెడ్డి అను నామాంతరము కలిగిన పిల్లలమర్రి బేతాళనాయుడు మూలపురుషుడు. ఇతడే రేచర్లగోత్రమువారైన వెంకటగిరి, బొబ్బిలి, పిఠాపురము, జటప్రోలు, మైలవరము మొదలగు ముప్పదియారు తెగల సంస్థానముల అధిపతులందరికిని మూలపురుషుడు. ఈ బేతాళనాయుడు కాకతీయ గణపతిదేవ చక్రవర్తి వద్ద సేనానాయకుడుగా నుండి కాకతీయ సామ్రాజ్యమునకు ఎనలేని సేవ చేసినాడు. ఈయన 12 వ శతాబ్దము చివరి భాగములోను, 13 వ శతాబ్దారంభమునను అనగా క్రీ.శ. 1195-1208 ల నడుమ ఉండినట్లు శాసనాధారముల వలన తెలియుచున్నది. ఇతడు కాకతి రుద్రదేవ మహారాజు (క్రీ. శ. 1158-1195) అవసాన కాలములోను, మహాదేవరాజు పాలనా కాలములోను (క్రీ. శ. 1195 - 1198), కొంతవరకు గణపతిదేవుని పాలనాకాలములోను (క్రీ. శ. 1198-1262) ఉండినవాడు. ఈయన నల్లగొండ మండలములోని ఆమనగల్లు రాజధానిలోను, పిల్లలమర్రిలోను రాజ్యమేలినాడు

## జటప్రోలు ప్రభువులు

వీరు చతుర్థ వర్ణమునందలి అత్యుత్తమమైన పద్మనాయక కులమునకు చెందిన రాచవెలమలు.[7] వీరిగృహనామమైన 'సురభి' అనునది బిరుదనామముగను[8] గ్రామనామముగను[9] వచ్చియుండునని పండితులందు భిన్నాభిప్రాయములున్నవి. ఆమనగంటి పురవరేశ్వరులును, రేచర్ల గోత్రులును అయిన వీరి పాలనలోనికి జటప్రోలు ప్రాంతము 12 వ తరమున వచ్చినది.[10] పిల్లలమర్రి బేతాళనాయని వంశమునకు చెంది, అతనికి 12 వ తరమువాడైన ఎరసూరానాయనికి మాదానాయడు, యాచమనాయడు అన్న ఇరువురు పుత్రులుకలిగిరి.వారిలో మాదానాయని సంతతివారు జటప్రోలు సంస్థానాధిపతులైన సురభివారైరి: యాచమనాయని సంతతివారు వెంకటగిరి ప్రభువులైన వెలుగోటివారైరి. అందువలన ఈ మాదానాయడు జటప్రోలు ప్రభువులకు శాఖామూలపురుషుడు. ఇతని కుమారుడును, ఈ వంశమున 14 వ తరమువాడును అయిన మల్లానాయడు (కుమారమాదానాయడు) క్రీ.శ. 1527 లో ఆనెగొంది రామదేవరాయలవలన జటప్రోలు సంస్థానమును

పరితోషకముగా పొందియుండిరనియు[11] అతనినుండియే సంస్థాన చరిత్ర గ్రహింపవగినది. ఈయన క్రీ.శ. 1508 ప్రాంతమునుండి పారంపర్యముగా వచ్చిన జటప్రోలు, సూగూరు, కొత్తకోట, గోపల్ అను పరిగణాలను ఏలిన వాడు.

ఈయన అనంతరము జటప్రోలు సంస్థానమును పలువురు ప్రభువులు శౌర్యౌదార్యములచే సంస్థానమునకు వన్నెదెచ్చునట్లుగా పాలించినారు. వారిలో రాజా సురభి వేంకటలక్ష్మారావు 27 వ తరమునకు చెందినవారు. ఈయనకు వెల్లూరు నరసింగకవి సమకాలికుడు కనుక వీరి విషయమే ఇట ప్రస్తావింపబడు చున్నది.

రాజాసురభి వేంకట లక్ష్మారావు (1865-1928):- 'రాధకస్వ్యకాపరిణయ' కర్త అయిన 'వెల్లూరు నరసింగకవి ఈ రాజా వేంకట లక్ష్మారావుగారి కాలము ననే కొల్లాపురమున ఉండెనాడు. అందువలన వీరి కాలనిర్ణయము నరసింగ కవికిని సరిపోవును.

వేంకట లక్ష్మారావుగారు వేంకట జగన్నాథరావుగారి దత్తపుత్రులు. ఈయన వేంకటగిరి ప్రభువులైన సర్వజ్ఞకుమార యాచమనాయడుగారి చతుర్థ పుత్రులు. మొదట వీరిపేరు నవనీత కృష్ణయాచేంద్రులు. వేంకట జగన్నాథరావు గారు ఈయనను దత్తపుత్రులుగా స్వీకరించి, తమ తండ్రిగారి పేరున శ్రీ వేంకట లక్ష్మారావుగారని నామకరణము చేసిరి. ఈ దత్త స్వీకారము క్రీ.శ. 1879 మార్చినెల 7 వ తేదీన శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి సన్నిధి యందు జరిగినది. క్రీ.శ. 1865 వ సంవత్సరమున జన్మించిన వేంకట లక్ష్మా రాయల వయస్సు ఆనాటికి పదునాలుగు సంవత్సరములు. ఈయనకు క్రీ.శ. 1884 లో పట్టాభిషేకమైనది. క్రీ.శ. 1896 లో నైజాం ప్రభువు ఫర్మానా ప్రకారము జటప్రోలు (కొల్లాపురము) సంస్థానముపై వీరికి నిజామతివవరు (అధికారము) వచ్చినది.[12] వీరు వేములవాడ సంస్థానము దేశాయిగారైన వేంకట కోనారావుగారి కుమార్తెయైన వేంకట రత్నమాంబను వివాహమాడినారు.

రాజా వేంకట లక్ష్మారావుగారికి 'నిజాం నవాజ్‌వంత్' (నిజాంగారి ప్రీతిపాత్రులు) అన్న బిరుదముండినది[13]. ఈయనకు అధికారము లభించిన పిమ్మట కొల్లాపురమును సర్వాంగసుందరముగా పునర్నిర్మించినారు. అమ

రేశ్వరస్వామి ఆలయమును పునరుద్ధరించి, హనుమదన్నపూర్ణాలయములను, రామమందిరమును నెలకొల్పినారు. శ్రీ జగద్గురు విరూపాక్షస్వామివారి పూజా నిమిత్తము ఒక మఠమును కట్టించినారు. ఈయనకు ధర్మకార్యములందు శ్రద్ధ మిక్కుటము. కాశీరామేశ్వరాది పుణ్యతీర్థములను దర్శించి, సప్తసంతానములను స్థాపించి ఇహపరములను సాధించినారు. వీరు పురిటిలో అగ్రగణ్యులు. ఈయన ప్రజారంజకముగా పాలించి, శాశ్వతకీర్తిని సంపాదించి క్రీ.శ. 1928 ఏప్రిల్ 15 వ తేదీన స్వర్గస్థులైరి.[14]

వేంకట లక్ష్మారావుగారికి పుత్రసంతానము లేనందున తమ వంశోద్ధరణకై తమ అన్నగారగు బొబ్బిలి సంస్థానాధీశులు రాజా శ్వేతాచలపతి వేంకట రంగారావు బహద్దరు వారి పౌత్రుని దత్తతీసికొని; ఆ బాలునకు తమ జనకుని నామధేయమగు రాజా వేంకట జగన్నాథరావుగారి పేరిడిరి. వీరే ఈ సంస్థానపు చివరి పాలకులు. ఈ దత్తపుత్రునికి పట్టాభిషేకము, వివాహము కాక మునుపే వేంకట లక్ష్మారావుగారు దివంగతులగుటచే రాణీ వేంకట రత్నమాంబ గారు ఆ శుభకార్యములను జరిపించిరి. వారి దౌహిత్రి అయిన రాణి ఇందిరాదేవి గారే వేంకట జగన్నాథరావుగారి సతీమణి. యువరాజుగారు పెద్దవారగునవరకు రత్నమాంబగారే సంస్థాన పాలనా బాధ్యత వహించి యుండిరి. రాజా వేంకట జగన్నాథరావు బహద్దరుగారు జటప్రోలు సంస్థానాధిపతులై మాతృశ్రీ అండదండలతో భారత రాజ్యాంగమున సంస్థానములు విలీనమగునవరకు ఆ సంస్థానమును పాలించిరి. వీరు క్రీ.శ. 1980 వ సంవత్సరమున దివంగతులైరి. వీరికి శ్రీ సురభి వేంకట కుమార బాలాదిత్య లక్ష్మారావు అను కుమారుడును, శ్రీ రత్న సుధాబాల అను కుమార్తెయు జన్మించినారు. పూర్వపు జటప్రోలు సురభివారి రాజవంశమునకు చెంది వర్తమాన కాలమున ఉన్నవారు వీరు.

## భాషా సేవ

జటప్రోలు సంస్థాన ప్రభువులు పూర్వపురాజన్యులవలెనే విద్వాంసులై, కృతికర్తలై, పలువురు కవి పండితులను పోషించి కృతి భర్తలై విరాజిల్లిరి.

ఈ సంస్థాన పూర్వీకులందు పెద సింగనాయడు సాహిత్య క్షేత్రమున సుప్రసిద్ధుడై, 'సర్వజ్ఞ' బిరుద భూషితుడై సింగభూపాలీయాది పెక్కు గ్రంథములను సంతరించిన విద్వత్కవి. ఆనాటినుంచి ఈ సంస్థానమున సాగిన నిరంతర సాహిత్యసేవ మూడు పూవులు, ఆరు కాయలుగ విలసిల్లినది.

సురభి వంశమునందు 18వ తరము వాడైన ముమ్మడి మల్లానాయడు గొప్ప విద్యా పోషకుడు. ఇతడు విద్యావిశారదుడై 'కృష్ణ చంపువు'ను రచించినాడు. ఈయన మూడవ కుమారుడైన సురభి మాధవరాయలు (ఈ పేరుగం వారిలో ఈయన మూడవ వాడు) తండ్రియు, అన్నలును 16 వ శతాబ్దాంతము వరకు రాజ్యభారము పూనియుండగా తాను నిశ్చింతుడై తర్క వ్యాకరణాది శాస్త్రముల నభ్యసించి, బహు కావ్యవేదియై, సాహిత్య ప్రియుడై, విద్వత్కవి గాయకుల సాహచర్యమును పొంది కావ్య రచనకు పూనుకొని అతి ప్రౌఢమైన 'చంద్రికా పరిణయ ప్రబంధము'ను రచించినాడు.

ఈ సురభి మాధవరాయల ఆస్థానమున మహా మహోపాధ్యాయ బిరుదము నందిన వెలకూచి బాలసరస్వతి అను పండితకవి ఉండినాడు. తండ్రియగు మల్ల భూపాలునిపై విశేషమైన భక్తి గలిగిన మాధవరాయలు ఈ కవి శిఖామణిని ప్రార్థించి, మల్ల భూపాలునికి అంకితముగా భర్తృహరి సుభాషిత త్రిశతిని 'మల్ల భూపాలీయము' అను పేర 'సురభిమల్లా నీతివాచస్పతీ, సురభిమల్లా మానినీమన్మథా, సురభిమల్లా వైదుషీ భూషణా' అన్న ప్రకరణోచిత మకుటములచే రచింపజేసెను. ఈ బాలసరస్వతి కవి 'యాదవ రాఘవ పాండవీయ'మను త్ర్యర్థి కావ్యమును రచించెను. ఈ విధముగా త్ర్యర్థి కావ్యములను రచించిన వారిలో ఇతడే మొదటివాడు[15] అని ఆంధ్ర కవుల చరిత్రకారుని అభిమతము. ఈయన చంద్రికా పరిణయము, ఆంధ్ర శబ్ద చింతామణి మొదలగు మరికొన్ని గ్రంథములను రచించినాడు. ఇతని చంద్రికా పరిణయము సురభి మాధవరాయల చంద్రికా పరిణయమునకన్న భిన్నమైనది. రెండింటి యందలి ఇతివృత్తములు వేరు.

సురభి వంశమున 26 వ తరమువాడైన వేంకట జగన్నాథరావు వనపర్తి సంస్థానమునకు చెందిన కవి సార్వభౌమ బిరుద భూషితుడైన హౌసు

దుర్గం కృష్ణమాచార్యులచే తమ ఇష్టదైవమైన సింగపట్టణము నృసింహస్వామిపై 'నృసింహ విలాసము'ను చంపూ కావ్యమును, జటప్రోలు మదన గోపాల స్వామిని గురించి 'మదన గోపాల మాహాత్మ్యము'ను సంస్కృత భాషలో వ్రాయించి వారిని ఘనముగా సన్మానించినాడు.

రాజా సురభి వేంకట లక్ష్మారాయలు సరసులై పూర్వ ప్రభువుల ఔన్నత్యమును పుణికి పుచ్చుకొని స్వయముగా పండితులై, పలువురు కవి పండితులను పోషించి, బహు గ్రంథములను వ్రాయించి, ముద్రింపించి సాహిత్య సేవ కావించినారు. వీరి ఆస్థానమునకే తలమానికముగా నున్న విద్వాంసులు వెల్లాల సదాశివశాస్త్రిగారు.

వెల్లాల సదాశివశాస్త్రి (1862-1926) :— రాజా సురభివేంకట లక్ష్మారాయల కాలమున జటప్రోలు సంస్థానము నందలి పండితులలో చుక్కలలో చంద్రునివలె ప్రకాశించిన వారు సదాశివశాస్త్రిగారు. రాజాగారికిని, వీరికిని ఉన్న సాన్నిహిత్యము విశిష్టమైనది. వీరిరువురి సంబంధము నాటి ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవ రాయలకును, ఆంధ్ర కవితాపితామహుడు అల్లసానిపెద్దన గారల సంబంధమును తలపించు చుండినదని పెద్దల అభిప్రాయము.

జటప్రోలు సంస్థాన పోషణమున నున్న అయ్యవారిపల్లె అన్న పండిత గ్రామమునకు చెందినవారు వీరు. వీరు సుప్రసిద్ధులై ఆదిశంకరుల బ్రహ్మసూత్రభాష్యమునకు 'భాష్యార్థరత్నమాల' అన్న బృహద్వ్యాఖ్యానమును రచించిన అక్షింతల సుబ్బాశాస్త్రిగారి దౌహిత్రులు. సుబ్బాశాస్త్రిగారి పెద్దకూతురు వెంకట సుబ్బమ్మగారి కుమారులు.

వీరు బాల్యమున అగ్రజుడైన రాఘవ శాస్త్రిగారియొద్ద సంస్కృత కావ్య నాటకములు, మాతులుడైన అక్షింతల సీతారామశాస్త్రిగారి యొద్ద తర్క ప్రకరణములు అభ్యసించినారు. అనంతరము కర్నూలు జిల్లా ప్యాపలి గ్రామమున శ్రీమాన్ హారతి కొండమాచార్ల సన్నిధిని 'శబ్దరత్నము' సాధించినారు. ఈ కాలముననే కొందరు వైష్ణవ విద్యార్థులు 'స్మార్తులకు కవిత్వముచెప్పు శక్తి లేదు. ఉండదు' అని హేళన చేయగా, వారిని అధిక్షేపించి తమ ఇరువది వర్షముల ప్రాయముననే నూటయిరువది గద్య పద్యములతో కూడిన 'కన్యకాంబాచంపూ' అను పేర ఒక సంస్కృత గ్రంథమును రచించిరి.[16] పిమ్మట సదాశివశాస్త్రి

గారు, వారి బంధువు, సహాధ్యాయి అయిన వనం శేషశర్మగారితో కలిసి కాశీ పట్టణము చేరి పండితభట్ల విశ్వనాథ భట్టాచార్యుని వద్ద భాష్యాంత వ్యాకరణము, ధర్మ శాస్త్రములను, మానవల్లి గంగాధర శాస్త్రిగారి వద్ద అలంకార శాస్త్రమును అభ్యసించిరి. కాశీలో అయిదు సంవత్సరముల విద్యాభ్యాసానంతరము మరలి వచ్చిన పిదపనే జటప్రోలు రాజాసురభిలక్ష్మారాయల వారితో శాస్త్రిగారి పరిచయము కలిగినది. ఈ సందర్భమున శాస్త్రిగారు రాజావారిపై నవరత్న శ్లోకములు చెప్పిరట.

వెలుగోటి వేంకటకృష్ణయాచేంద్రుని కోరికమేరకు వెల్లాల సదాశివశాస్త్రి గారు అవధానము శేషశాస్త్రిగారి సహకారమున భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహము నందలి రసప్రకరణ, నాయికా నాయక ప్రకరణములకు సవిమర్శనముగ నొక వ్యాఖ్యానమును వ్రాసిరి. పిమ్మట లక్ష్మారాయలవారి కోరికమేరకు శేషశాస్త్రిగారితో కలిసి సురభిమాధవరాయల 'చంద్రికాపరిణయ' ప్రబంధమునకు 'శరదాగమము'ను పేర ఒక ప్రామాణికమైన వ్యాఖ్యానమును రచించిరి. ఇది 1904 లో మొదట ముద్రింపబడినది. వీరు ఆంధ్ర దశరూపక విమర్శనము, 'విలిభద్రీయ ఖండనము' అను నామాంతరము కలిగిన ఆంధ్ర చరిత్ర విమర్శనము, వెలుగోటివారి వంశ చరిత్రము, శ్రీసురభివారి వంశ చరిత్రము మున్నగు పెక్కు గ్రంథములను వెలయించి,రాజాగారి అనుగ్రహమున ఆరువందల ఎకరముల భూమిని ఇనాముగా పొంది యుండిరి. వీరు రాజావేంకట లక్ష్మారాయల కంటే వయస్సున కొంచెము పెద్దవారై క్రీ. శ. 1862-1926 ల నడుమ జీవించి యుండిరి.

వెల్లాల సదాశివశాస్త్రిగారితో పాటుగా, రాజాసురభివేంకటలక్ష్మారాయల కాలమున జటప్రోలు సంస్థానమున స్థానికముగా నున్న ఇతర కవి పండితులలో వెల్లూరు నరసింగ కవి, చింతలపల్లి భాస్కర జోస్యులు, సిరివెల్లి వాసుదేవ శాస్త్రి, సిరివెల్లి భైరవశాస్త్రి మొదలైనవారు పేర్కొనదగిన వారు. వీరిలో నరసింగ కవికి సదాశివశాస్త్రిగారితో అధిక సాన్నిహిత్యముండినది.[17]

ఈ విధముగా సాహిత్య ప్రాముఖ్యమును సంతరించుకొన్న జటప్రోలు సంస్థానమునకు[18] చెందినవాడు వెల్లూరు నరసింగకవి.

—: ० :—

# 3. వెల్లూరు నరసింగకవి పరిచయము - రచనలు

## ఆభిజాత్యము

కవి వ్యక్తిత్వ, సాహిత్యములందు అతని అభిజనము, కాలము, సమకాలికులు, వంశము మొదలగువాని ప్రభావము లుండుట సహజము. ఈ పరిసరములు కవి ఆలోచనా సరళియందు ఒక నిర్దిష్ట విధానమును రూపొందించుననుట సత్యదూరముకాదు. వెల్లూరు నరసింగకవి కవితాభ్యాసంగమున వీని ప్రేరణ లున్నట్లు తోచుచున్నది.

## అభిజనము

కొల్లాపురమునకు ఈశాన్యదిశగా మూడు కిలోమీటర్ల దూరముననున్న వెల్లూరు గ్రామము నరసింగకవి జన్మస్థలము. ఇప్పుడా గ్రామమును ఎల్లూరు అందురు. ఇది ఒకప్పుడు జటప్రోలు సంస్థానమునకు నాల్గవ రాజధాని. దీని తర్వాతనే సురభివంశస్థులకు కొల్లాపురము రాజధానియైనది.

వెల్లూరు గ్రామమునకు ఆ పేరు ఎట్లువచ్చినదో తెలియదు. కాని ఇది ప్రాచీనమైనదనియు, కొంత చారిత్రక ప్రాధాన్యము కలిగియున్నదనియు చెప్పుటకు తగిన ఆధారములున్నవి. సురభి వంశమున 25 వ తరము వాడైన రాజా వేంకటలక్ష్మా రాయల కాలమున ఈ గ్రామమున ఒక యుద్ధము జరిగినది. ఇది హోసుదుర్గం కృష్ణమాచార్ల వారి 'నృసింహ విలాసము' పేర్కొనబడినది. దీనికే 'ఎల్లూరిలడాయి' అను పేరు వచ్చినదనియు, ఈ విషయమై ఒక భట్రాజు వ్రాసిన కథను పిచ్చికుంట్లవారు చెప్పుచుండిరనియు స్థానిక కథనము. ఇప్పటికిని ఆ గ్రామమున ఒక పాడుబడిన కోట, దాని ప్రాకారమునకు సంబంధించిన మట్టి గోడలు ఉన్నవి. ఈ గ్రామమునందే నేటికిని నరసింగకవి వంశీకులు నివసించుచున్నారు.

## కాలము

నరసింగకవి సుమారుగా క్రీ. శ. 1860 - 1920 ల మధ్యకాలమున జీవించియున్నట్లు నిశ్చయముగ చెప్పవచ్చును.[1] ఈయన రాజాసురభి వేంకట లక్ష్మారావుగారి కాలమునాటి (1865-1928) కొల్లాపుర సంస్థానమున అంతగా ఖ్యాతి పొందినప్పటికి, అప్పటి ఆ సంస్థాన విద్వాంసులు వెల్లాల సదాశివశాస్త్రి (1862 - 1926) గారితో మాత్రము సన్నిహిత పరిచయమున్నట్లు తెలియుచున్నది.

## వంశము

నరసింగకవి నందవరీకుడు. నియోగి. విశ్వామిత్రగోత్రుడు. ఋక్శాఖీముడు. ఆశ్వలాయన సూత్రుడు, వీరి ఇంటిపేరు ముత్యాలవారు. ఈయన అప్పయామాత్య, కృష్ణమాంబల కుమారుడు, లక్ష్మి నరసయ్యకు తమ్ముడు. నందవరీకులు నియోగులు కనుక సంప్రదాయానుసారముగా ఈయన తన తండ్రిని అప్పయామాత్యుడుగనే పేర్కొన్నాడు.

నరసింగకవిది పండిత కుటుంబము. ఈయన తండ్రి అప్పయామాత్యుడు పర్వతాలమల్లేశ్వరుడు, ఎల్లూరిమూలస్థానేశ్వరుడు మొదలగు దేవతలను పేర్కొనుచు ఇరువదిరెండు చరణములుగల మేలుకొలుపు పాటను వ్రాసినాడు. ఆ పాటను ఇప్పటికిని ఆయింటి ఆడబడుచులు పాడుచుందురు. అది

'శ్రీలాలరగ భక్త జనుల పోషించేటి
పర్వతాలమల్లేశ్వరా మేలుకో
వాలాయముగా మిమ్ము వర్ణింతూ
ఎల్లూరి మూలస్థానేశ్వరా మేలుకో' అనుచు మొదలై
'ధీరాని సన్నిధి కూర్మి అప్పాయకవి
ధీరాని రక్షింప మేలుకో' అని ముగియును.

నరసింగకవి అన్నగారైన లక్ష్మినరసయ్యకూడ కవియేనట. ఈయన 'లక్ష్మినృసింహ విలాసమ'ను కృతి రచించినట్లు తెలియుచున్నది. ఈ సోదరులు ఇరువురును ప్రౌఢులైన జంటకవులై గద్వాల సంస్థానమున ప్రత్యేక గౌరవము లందినట్లు శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు పేర్కొన్నారు.

ఈయన మాతృవంశమునందలి పూర్వీకులు కూడా కవులే. ఈయన ముత్తాత చెన్నకృష్ణకవి గోపాలుపేట ప్రభువైన వల్లభరాయనికి అంకితముగా 'యాదవభారతీయమను ద్వ్యర్థికావ్యమును రచించెను. వీరిది నాగరకర్నూలు తాలూకాలోని ఏదుట్ల గ్రామము. ప్రస్తుతము వీరి వంశీకులు కొల్లాపురము తాలూకాలోని తూముకుంట గ్రామమున నివసించుచున్నారు. వీరు తాము శ్రీకృష్ణదేవరాయల కాలమునాటి 'ప్రెగడరాజునర్సన్న' వంశీకులము అని చెప్పుకొందురు. వీరి ఇంటిపేరు కూడ 'ప్రెగడరాజు' అన్నదే నరసింగకవి మాతామహ, మాతులులు కూడ కవులని తెలియవచ్చినను, వారు రచించిన గ్రంథములేవియో తెలియవు. వీరియొద్దనే బాల్యమున నరసింగకవి సాహిత్యాధ్యయనమును ప్రారంభించినాడట.

## విద్యాపరిశ్రాంతి

'రాచకన్యకాపరిణయ' కావ్యావతారిక ఆధారముగా నరసింగకవి విద్య, వ్యక్తిత్వము మొదలగు విషయములు తెలియుచున్నవి. గద్వాల సంస్థానమున మిక్కిలి ప్రసిద్ధిని పొందిన పురాణం దీక్షాచార్యులు నరసింగకవికి గురువు. కవి ఈయనను అవతారికయందు ఈ విధముగా స్తుతించినాడు.

'సాక్షాద్వాణియొ యాబృహస్పతియొ వైశంపాయనుండోయనన్
శిక్షావ్యాకరణాది శాస్త్రకవితా శ్రీసాహితీ పాండితీ
దీక్షంగైకొని సత్పురాణ కథలుద్దీపించు గద్వాల శ్రీ
దీక్షాచార్య గురూత్తమాంఘ్రియుగి హృద్వీథిన్ స్మరింతుంగడున్' (1-1)

అని చెప్పుటవలన ఈ దీక్షాచార్యులు వాగ్దేవి, వాచస్పతి, సాత్యవతేయుల సామ్యమును పొందినవాడని తెలియుచున్నది. వేదాంగములైన శిక్షా, వ్యాకరణాది శాస్త్రములందును, సాహిత్యమునందును నిష్ణాతుడై పురాణకథాప్రవచనమూలమున లోకమునకు జ్ఞానోపదేశమును చేయువాడుగా కీర్తింపబడినాడు.

వీరు క్రీ.శ. 1850 ప్రాంతమున గద్వాల సంస్థానమును పాలించిన ముష్టిపల్లె రామభూపాలుని ఆస్థానవిద్వాంసులు. విద్యాగురువులు. పుల్లగుమ్మి నివాసులు. ఈయన రామచంపువు, రామనృపకర్ణపూరము, కేశవసుప్రభాతము,

కావ్యోత్కర్షమున్నగు గ్రంథములను రచించినారు. ఈయన రామభూపాలుడు రచించిన 'ఛందోముకురము' అను సంస్కృత గ్రంథరచనా విషయమున తోడ్పడినారట. అధునికాంధ్ర సాహిత్యమున సుప్రసిద్ధ కవిద్వయమైన తిరుపతి వేంకటకవులు ఈ రామభూపాలుని కాలమున గద్వాల సంస్థానమును దర్శించినారు. అప్పుడు సభాముఖముగా ఈ జంటకవులను ఎదుర్కొన్నవారిలో పురాణం దీక్షాచార్యులు ముఖ్యులు.[2]

రామభూపాలుడు 19 వ శతాబ్దము ఉత్తరార్ధమునకు చెందినవాడని శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు అభిప్రాయపడిరి. ఈ రామభూపాలుని గురువైన దీక్షాచార్లవారే నరసింగకవికిని గురువు. నరసింగకవి ఈయన యొద్ద శిక్షావ్యాకరణాది శాస్త్రములను, సాహిత్యమును అభ్యసించెనని గ్రహింపవచ్చును. ఈ గురువు సాహచర్యము వలన నరసింగకవికి విశిష్టాద్వైత సంప్రదాయము పట్టువడినది.

నరసింగకవికి ఖండవెల్లి లక్ష్మయ్యగారు విద్వన్మిత్రులు. ఈయన వట్టెము గ్రామవాసి. ఈయనను నరసింగకవి కావ్యావతారిక యందు ఈ విధముగా కీర్తించినాడు.

'వట్టెము ఖండవెల్లి కులవారిధి చంద్రుడు వేదమూర్తి శ్రీ
పుట్టిన యింటిరీతి పరిపూర్ణకృపామతి సంశ్రితాళికిన్
పెట్టు మహీజమున్నత వివేక సుసంతతి పుణ్యరాశికిన్
పెట్టిన లక్ష్మయాఖ్యుదను విద్వదభిజ్ఞునకున్ నమస్కృతుల్' (2-1)

ఈ లక్ష్మయ్యగారు 'వేదమూర్తి, దయాసముద్రుడు, వితరణశీలి, వివేక సుసంతతి పుణ్యరాశికి నెలవు'గా కీర్తితుడు.

ప్రస్తుతకాలమున ఆంధ్రదేశమున గొప్ప వ్యాకరణ పండితులుగా ప్రసిద్ధి కెక్కిన శ్రీ ఖండవల్లి నరసింహ శాస్త్రిగారు ఈ లక్ష్మయ్యగారి పుత్రులే. లక్ష్మయ్యగారు పూర్ణాయుష్కులై తొంబదియైదు వత్సరములు పైబడి జీవించి, క్రీ.శ. 1958లో దివంగతులైనట్లు శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రిగారు తెలిపిరి. లక్ష్మయ్యగారికి, నరసింగకవికి సాధారణమైన మైత్రిమాత్రమేకాక మిక్కిలి

సాహచర్యముండినది. ఆ కారణముగా నరసింగకవి అప్పుడప్పుడు కొన్ని మాసముల పర్యంతము వట్టెము గ్రామమున లక్ష్మయ్యగారితో సహవాసమున సాహిత్య గోష్ఠులతో కాలము గడిపినట్లు తెలియుచున్నది. ఈ లక్ష్మయ్యగారి వలన నరసింగ కవికి వేదోపనిషత్తులతో పరిచయమేర్పడి, అద్వైత సంప్రదాయము పట్టువడినది.

ఈ సంపర్కముననే నరసింగకవికి వట్టెము గ్రామమున మిక్కిలి ప్రసిద్ధుడై, గోపాలుపేట సంస్థానమున దాదాపు ఇరువది వత్సరములు రాజ ప్రతినిధిగా ఉన్న నరసింహారెడ్డితో పరిచయమేర్పడి యుండును. ఈ పరిచయ ఫలితముగనే నరసింహారెడ్డి తన అన్న కోదండరామరెడ్డిగారి దౌహిత్రుడు, గోపాలుపేట సంస్థానమునకు తుది వారసుడు అయిన హనుమంతరాయనికి అంకితముగా 'రాచకన్యకా పరిణయ' ప్రబంధమును రచింపుమని అభ్యర్థించి యుండును.

## ఇలువేలుపు

నరసింగకవికి సింగపట్టణము నరసింహస్వామి ఇలువేలుపు. ఆ దేవుని పేరే ఈయనకును తల్లిదండ్రులు పెట్టినారు. ఈనాటికిని కవి వంశ్యులకు నరసింహుని పేరే బహుళము. ఈ సింగపట్టణము (సింగవటము, సింగోటం) సురభివంశీయుడైన సింగమనాయని పేర వెలసిన గ్రామము. ప్రస్తుతము అది కొల్లాపురమునుండి కొడేరునకు వెళ్ళు మార్గమున ఏడు కిలోమీటర్ల దూరమున నున్నది. ఆ ప్రాంతమున అదియొక ప్రసిద్ధమైన నృసింహక్షేత్రముగా పేరొందినది. మొక్కుబడులు తీర్చుట, తలనీలములు సమర్పించుట, వివాహాది శుభ కార్యములు జరుపుట మొదలైనవి తరచుగా ఈ దేవుని సన్నిధానమున జరుగు చుండును. అక్కడ సాలగ్రామ రూపమున నృసింహస్వామి ప్రతిష్ఠింపబడినాడు.

'ఆ మూర్తి మున్నూరు వెంకయ్య అనువ్యక్తికి పొలము దున్నుకొను చుండగా లభించి, అతని నావేశించి తాను నృసింహుడనని, తనను ప్రతిష్ఠించి పూజించవలసినదని చెప్పుకొనెనట. అంతట గ్రామస్థులు ఆ స్వామికి చిన్న గుడి కట్టి ప్రతిష్ఠించిరి' అని శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు పేర్కొనిరి.

'రాచకన్యకా పరిణయా'విర్భావమునకే గాక, నరసింగకవి కవితా వ్యాసంగమునకే ఈ సింగపట్టణ నృసింహస్వామి కటాక్షవీక్షణము కారణము. జటప్రోలు సంస్థానమున నిదియొక సుప్రసిద్ధ నృసింహక్షేత్రము. అందువలన ఈ క్షేత్రావిర్భావమును గురించి తెలిసికొనుట ఆవశ్యకము.

హొసుదుర్గం కృష్ణమాచార్యుల వారి 'మదనగోపాల మాహాత్మ్యము'న సింగపట్టణ క్షేత్రావిర్భావము ఈ విధముగ నున్నది.

'పూర్వము సింహవటుదను పేరుగల బ్రాహ్మణ వటువు నరసింహ స్వామి భక్తుడై ఉత్తరదేశము నుండి దక్షిణాదిన ప్రసిద్ధమైన అహోబిలక్షేత్ర మును దర్శింప బయలుదేరినాడు. ఆయన జటప్రోలునకు అర్ధయోజన దూరమున శిలోచ్చయ సంకులమైన అరణ్యప్రాంతమునకు చేరి, మధ్యాహ్న సమయమున శుచిస్నాతుడై ఎదురుగనున్న పెద్దరాతిని చూచి నరసింహస్వామిని దర్శింప దలచినవాడై ఆ స్వామిని ఈవిధముగా ప్రార్థించినాడు.

'స్వామీ! పూర్వము ప్రహ్లాదుని కారణముగా స్తంభమునుంచి ఆవిర్భ వించి నీ దివ్యరూపమును చూపితివి. అటులే ఇప్పుడును స్వస్వరూపముతో ఈ రాతియందు నాకు దర్శనమిమ్ము. నాయందలి మోహదనుజుని దునిమి ప్రహ్లాదుని వలె నన్ను కాపాడుము' అని ప్రార్థించగా ఆరాతిని చీల్చుకొని దంష్ట్రికరాళ వదనుడైన నరసింహుడు సాక్షాత్కరించినాడు. అప్పుడు వటుడు ఆ భయంకర మూర్తిని దర్శించలేక 'స్వామీ! ధన్యుడనైతిని. అనుగ్రహింపబడితిని. నీ దర్శనముచేత నామనశ్శరీరములు కంపించుచున్నవి. దయతో నీ ఉగ్రరూప మును ఉపసంహరింపుము' అన్నాడు. అంతట సదయుడైన ఆ దేవదేవుడు 'ఓ సువ్రతుడా: నీ ప్రార్థన కారణముగా లోకములను రక్షించుటకై ఇప్పుడు ఉద్భవించినాను. మరల ఈ శిలయందు ప్రవేశించుచున్నాను. నన్నుగా ఈ శిలను భావించి అర్చించుము' అని చెప్పి అహోబిలమునకు వెళ్ళవలదనియు, మోహ మును వదలి అచటనేయుండి తనను పూజించవలసినదని ఆదేశించి, ఆ ప్రాంతము 'సింహవటము' అనుపేరున పుణ్యక్షేత్రముగా ప్రసిద్ధిని పొందగల దన్నాడు. పిమ్మట స్వామి ఆ శిలయందు ప్రవేశించగా బద్ధసంధియైన ఆ శిల, గుండ్రముగ అయినది. ఆ శిలామూర్తియే ఇప్పుడు పూజలందుకొనుచున్నది.'

అని చివరగా, ఆ దేవుని పూజించినవారికి సమస్తదోషములు నశించి, సర్వసుఖములు లభించునని ఆ గ్రంథమున ఫలశ్రుతి చెప్పబడినది. శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు పేర్కొన్నట్లుగా ఈ శింయే కాలాంతరమున మున్నూరు వెంకయ్యకు లభించియుండవచ్చును.

ఆ స్వామికి నేడున్న ఆలయమును 'చంద్రికాపరిణయ' కర్త అయిన సురభి మాధవరాయలు నిర్మించి, ఉత్సవమును ఏర్పాటు చేయించెను. ఇచ్చటనే ఈయన నిర్మించిన నృసింహ సాగరమను పెద్ద చెరువున్నది. ఆ చెరువు గట్టునకు ఒకవైపున నరసింహస్వామి ఆలయముండగా మరియొకవైపున సరిగా స్వామికి ఎదురుగా ఉండునట్లుగా గుట్టపై రత్నలక్ష్మీదేవి ఆలయమును సురభి వంశీకులు నిర్మించినారు. ఇప్పటికిని ప్రతి సంవత్సరము సంక్రాంతి అయిన రెండవ రోజున ఆ దేవునికి కళ్యాణోత్సవము, జాతరలు జరుగును. హౌసు దుర్గం కృష్ణమాచార్లవారి 'నృసింహవిలాస' మను కృతి ఈ స్వామిపైననే రచింపబడినది.

## ఉపాస్యదైవము-ఇష్టదైవములు

నరసింగకవి పంచవక్త్రుడైన హనుమంతుని ఉపాసకుడు. ఈ ఆంజనేయుని అనుగ్రహము వలననే ఈయన సుస్థిర కావ్యాచరణుడైనాడు. గ్రంథావతారికయందు 'పంచవక్త్ర హనుమత్స్వ ప్రసాదోక్తి సుస్థిర కావ్యాచరణున్ (8-1) అని చెప్పుకొన్నాడు.

నరసింగకవికి వెంకటేశ్వరుడు ఇష్టదైవము, ఈయన నివాసస్థానమైన ఎల్లూరు గ్రామమున నేడొక వెంకటేశ్వరాలయమున్నది. దానిని కవి పూర్వీకుడైన రంగప్ప అనునతడు స్థాపించినట్లు తెలియుచున్నది. కాని ఈ రంగప్ప నరసింగకవికి ఎన్ని తరములు పూర్వుడో తెలియదు. రంగప్ప వెంకటేశ్వరుని ఆలయమును నిర్మించిన విషయము శ్రీ కపిలవాయి లింగమూర్తిగారికి లభించిన చాటుకావ్యము వలనను, ప్రస్తుతము ఆ వంశమునకు చెందిన శ్రీ ముత్యాల సదాశివరావుగారి కథనము వలనను ధృవపడినది. ఈ వెంకటేశ్వరునికి అంకితముగనే నరసింగకవి భర్తృహరి సుభాషితములను కందపద్యములలో అనువదించినాడు.

## ఆకార విశేషాదులు

నరసింగకవి ఎల్లప్పుడు తలపై ఎఱ్ఱని తలపాగా ధరించెడివాడట. ఈయన సాధారణమైన చామనచాయతో, బక్కపలుచగా, పొడవుగా ఉండెడి వాడట. ఈయన వెల్లూరు గ్రామమునుండి సాధారణముగా ప్రతిదినము కొల్లాపురము వచ్చెడివాడు. అప్పుడు తరచుగా వెల్లాల సదాశివశాస్త్రిగారి ఇంటికివెళ్ళి సాహిత్య ప్రసంగములు చేసెడివాడు.4

## వివిధ సంస్థానముల సంబంధము

నరసింగకవికి అభిజనపరముగా జటప్రోలు సంస్థానముతో సంబంధ మున్న విషయము విదితము. గద్వాల ఆస్థానపండితుడు పురాణం దీక్షాచార్లవారి సన్నిధిని విద్యాభ్యాసము కావించి యుండుటవలన, ఆ సంస్థానమున గౌరవ సమ్మానము లందినందువలన ఈయనకు గద్వాల సంస్థానముతో సంబంధ మున్నది. సురభివంశమున 15 వ తరమునాటివాడై తమకు శాఖాపురుషుడైన నాగినేని సంతతికి చెందిన తరణికంటి నరసారాయని కోరికమేరకు 'చూతపురీ విలాసము'ను రచించినందున అతనితో సంబంధమున్నది. వట్టెం లక్ష్మయ్యగారి మైత్రీవలన గోపాలుపేట రాజప్రతినిధియైన వట్టెం నరసింహారెడ్డిగారి పరిచయ మును పొంది, ఆయన కోరికమేరకు గోపాలుపేట తులిపాలకుడైన హనుమంత రాయనికి అంకితముగా 'రాచకన్యకా పరిణయము'ను రచించుటవలన నరసింగ కవికి కవితావ్యాసంగ పరముగా గోపాలుపేట సంస్థానముతోడను సంబంధ మున్నది.

## రచనలు

వెల్లూరు నరసింగకవి భర్తృహరి సుభాషితములకు ఆంధ్రమున కంద పద్యానువాదమును, 'చూతపురీ విలాస' యక్షగానమును, 'రాచకన్యకాపరిణయ' ప్రబంధమును రచించినాడు. ఇప్పటికి లభించిన ఈ కవి రచనలు ఇవి. వీనిలో 'సుభాషిత త్రిశతి' కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిచే వారి పరిషత్పత్రికలందు ఆనుపూర్విగా క్రీ. శ. 1928 - 29 సంవత్సరములలో ప్రకటితము.5 'చూతపురీ విలాసము' శ్రీకపిలవాయి లింగమూర్తిగారి సంపాదకత్వమున విపుల

మైసూరు పత్రికతో 1980 లో ముద్రితము. మూడవదైన 'వాచకస్మృతా పరిచయము' అముద్రితము.

నరసింగ కవి తన గ్రంథముల రచనాక్రమమునందలి పౌర్వాపర్యమును పేర్కొనలేదు. ఈయన ఉత్తరోత్తర గ్రంథములందు పూర్వపూర్వముల విషయమును ప్రస్తావించలేదు. అయినను తన పూర్వులు తన గ్రామమున స్థాపించిన వేంకటేశ్వరునికి అంకితముగా రచించిన 'భర్తృహరి సుభాషితములు' ఈయన ప్రాథమిక రచనగా భావింపవచ్చును. ఇందు ఈయన తనపేరు, ఊరిపేర్లను మాత్రమే పేర్కొన్నాడు. ఆంధ్ర సాహిత్యమున పలువురు కవులకు కవితా వ్యాసంగమును ఆరంభించిన తొలి దినములలో ముందుగా శతకరచన చేపట్టుట సంప్రదాయము.

## భర్తృహరి సుభాషితములు (నరసింగకవి అనువాదము)

ఇందు నీతిశతకమున 93, శృంగార శతకమున 102, వైరాగ్యశతకమున 94 కందపద్యములున్నవి. అన్యంతపద్యములతో కలిపి మొత్తము 291పద్యములు. కొన్ని మూలశ్లోకములకు అనువాదములు లేవు. నీతిశతకమున 'యేనైవాంబర ఖండేన' అన్న అమూలక పద్యానువాదమున్నది.

నరసింగకవి 'చిన్నకందములలోనే మూలభావమును చక్కగా ఇముడ్చి'నట్లుగా కవిచరిత్రకారులు పేర్కొన్నారు. 'వెల్లూరి వెంకటాచలరమణా' అన్నది ఈ శతక సముచ్చయ మకుటము.

ఈ కవి అనువాద విధానమును సూచించుటకు మచ్చునకు ఒకటి రెండు పద్యములు.

### నీతిశతకము

1. 'వ్యాళం బాలమృణాలతంతుభి రసౌ'-5

'కరిబిసతంతునగట్టను, దరిసెన వరి మణిని మెదుప దేనె గడలి మా
ధురినిడ నగు మూర్ఖు దెలుప, నరుదగు వెల్లూరి వెంకటాచల రమణా!'

2. 'స్వాయత్తమేకాంత హితం'-6
తనవశమజ్ఞా నాచ్ఛా, దన మేకాంత హిత మజకృతము బుధసభ మం
డనమై మౌనం బజ్ఞుం, కనువగు.........'
మూలభావములు ఈ కందములందు చక్కగా కుదిరినవి.

3. 'నేతా యస్య బృహస్పతిః-81'
'హరి ప్రాపసిపవి సితకరి, తురగము గురుడొజ్జ వేల్పు తుటుము గలిగినం
బరచె హరి పౌరుషము వృథ, యరయగ.........'

## శృంగార శతకము

1. 'కాంతేత్యుత్పలలోచనేతి'-41
'కనుబొమలు పిరుదులు మొగ, మును జన్నులుజూచి యశుచి బొమ్మను
మోహించినుతించు జ్ఞాని సహిత, మ్మనిశము .........'

2. 'విశ్వామిత్ర పరాశర ప్రభృతయో'-80
'మరుదంబ పశాశ పరా, శరముఖు లతివలకు బ్రమయ శాల్యోదన భు
జ్నరులెంత వసధిదేలునె, హరగిరి...............'
ఇందు సమర్థనము తారుమారైనను భావభంగము కలుగలేదు.

## వైరాగ్య శతకము

1. 'ఆశానామనదీ'—10
'ధృతి కుజహరము మనోరథ, తతికము తృష్ణోర్మికము వితర్కఖగము
రాగతిమగు నాశనది దా,టతరమె...............'

ఇందు 'మోహావర్త', 'చింతాతటీ' వంటి ఒకటి రెండు అవయవ రూపకములకు అవకాశము లేకపోయినను నష్టములేదు.

2. 'ఆయుఃకల్లోలలోలం'—36
'మెరుపులు భోగము లర్థమ, చిర మాయువుపీచి చెలులచెలి మద్రువమౌ
నరులకని యోగిత త్వం, బరయును...............'

ఈ విధముగా విస్తృతార్థమును అలతి అలతి పదములందు కుదించుటలో నరసింగకవి నిపుణుడు.

# చూతపురీ విలాసము

శతకరచన అనంతరము నరసింగ కవి 'చూతపురీ విలాస యక్షగాన రచనను చేపట్టియుండును. ఇందు నరసింగ కవి తన తల్లిదండ్రుల పేర్లనుగాని, గోత్రాదికమునుగాని పేర్కొనలేదు. ఇది మామిళ్ళపల్లి యందు వెలసిన నృసింహ స్వామి పేర బ్రాయబడినది. ఈ మామిళ్ళ పల్లి ఇప్పుడు అచ్చంపేట తాలూకా యందు, జిల్లా కేంద్రమైన మహబూబ్‌నగర్ నుండి అమరాబాదు రోడ్డుపైగల రాకొండ గ్రామమునకు అయిదు కిలోమీటర్ల దూరమున ఉన్నది.

నరసింగ కవి చేత ఈ రచన చేయించిన వాడు సురభి వంశీయుడైన తరణికంటి నరసారాయడు. ఈకృతి ప్రేరకుని పేరును కవి చూతపురీ విలాస మున వాచ్యముగా చెప్పక కృతిపతి నామ గర్భితమైన ప్రహేళిక అయిన ఒక సీసపద్యమునందు కావ్యారంభమున సూచించినాడు. ఈ కృతిభర్త తరణికల్లు గ్రామమువాడు. ఇది నేడు కల్వకుర్తి తాలూకాలోని గ్రామము.

నరసారాయడు మామిళ్ళపల్లి నరసింహస్వామి భక్తుడు. కృతికర్త నరసింగకవి ఈయన సింగపట్టణ నరసింహస్వామి భక్తుడు. ఈ కృతి నరసింహ స్వామికి అంకితము. ఈ విధముగా ఇది నరసింహమయము.

ఈ నరసారాయడు రేచర్ల పిల్లలమర్రి బేతాళనాయని వంశమునకు సంబంధించి, అతనికి 25వ తరమునకు చెందినవాడు. ఇతని ప్రేరణ చేత నరసింగకవి పన్నిద్దరాళ్వారులలో ఎనిమిదవవాడై, తొండరడిప్పొడి యాళ్వారు (భక్తాంఘ్రి రేణువు)గా కీర్తి పొందిన విప్రనారాయణుని చరితమును 'చూతపురీ విలాసమ'ను పేరు రచించినాడు. ఈ విప్రనారాయణుడు విష్ణువనమాలికాంశ సంజనితుడు.

యక్షగాన ప్రక్రియ దేశీయమైనది. నాయక రాజుల కాలమున దీనికి విశేష ప్రాముఖ్యము కలిగినది. నాగోలు సీమ (నాగరకర్నూలు తాలూకా) యందు పెక్కు యక్షగానములు వెలసినవట. మహబూబ్‌నగర్ జిల్లా యందలి యక్షగాన వ్యాప్తిని, చూతపురీ విలాస ఇతివృత్తౌచిత్యమును శ్రీ కపిలవాయి లింగమూర్తి గారు సవిస్తరముగా వివరించినారు.

# రాచకన్యకా పరిణయము

నరసింగకవి మూడవకృతి 'రాచకన్యకా పరిణయము'. ఇందు కవి కృత్యాది, ఇష్టదేవతా ప్రార్థన, పూర్వకవి స్తుతి, గురుస్తుతి, మిత్రస్మరణము, కుకవినింద, కృతిప్రేరకుని ప్రార్థన, కృతిప్రేరక, భర్తృవంశక్రమములు, షష్ఠ్యంతములు మున్నగు అంశములు సన్నిటిని సంపూర్ణముగా రచించినాడు. అందువలన దీనిని ఈ కవి గ్రంథత్రయమందు చివరికృతిగా నిర్ధారించవచ్చును.

ఇది గోపాలుపేట సంస్థానమునకు చివరిపాలకుడైన హనుమంతరాయనికి అంకితము. ఈయన గోపాలుపేట సంస్థానమున మిగుల ప్రసిద్ధిని పొందిన జగపాలరావు దత్తు కుమారుడు. ఈ దత్త స్వీకారము నాటికి హనుమంతరాయడు సుమారు పది, పండ్రెండు వర్షముల ప్రాయమువాడై యుండును. తన అన్న కుమార్తె, జగపాలరావు అర్ధాంగి అయిన రంగనాయకమ్మ నూతనముగా దత్త పుత్రుని పొందునట్టి శుభ సందర్భమున గోపాలుపేట రాజప్రతినిధి అయిన నరసింహారెడ్డి ఆ బాలునకు అంకితముగా 'రాచకన్యకాపరిణయము'ను రచింపుమని నరసింగకవిని కోరియుండును. హనుమంతరాయండు నడిమిప్రాయముననే అనగా సుమారు ఏబది సంవత్సరముల వయస్సున క్రీ.శ. 1952లో దివంగతుడైనాడు. అందువలన ఈయన క్రీ.శ. 1900-1952ల నడుమ జీవించియుండెను.

## రాచకన్యకాపరిణయరచనకు నరసింగకవికి ప్రేరణ

నరసింగకవి 'పరిణయ' నామకమైన 'రాచకన్యకాపరిణయ' ప్రబంధ రచన చేపట్టుటకు కారణము ఈ విధముగా ఊహింపవచ్చును. ఈయన అభిజనమైన కొల్లాపుర సంస్థానమున మిక్కిలి ప్రసిద్ధమైన గ్రంథము, సురభిమాధవ రాయలు రచించిన 'చంద్రికాపరిణయ' ప్రబంధము. నరసింగకవికి సమకాలికులైన వెల్లాల సదాశివశాస్త్రిగారు, అవధానం శేషశాస్త్రిగారలు దానికొక విపులమైన వ్యాఖ్యానమును 'శరదాగమ'మనుపేర రచించిరి. ఇది క్రీ.శ. 1904లో ముద్రితమై ఆనాటి సుప్రసిద్ధ పండితవిమర్శకులైన వేదమువేంకటరాయశాస్త్రి గారు, కందుకూరు వీరేశలింగం పంతులుగారు మొదలగువారిచే మెప్పుపొందినది. అందువలన పాండిత్యస్పర్ధతో నరసింగకవి తానుకూడ ఒక స్వతంత్ర

మైన పరిణయ ప్రబంధమును రచింప నిశ్చయించి యుండుననుకొనుట సంభావ్యముకాదు.

'సుభద్రాపరిణయ'మన్న ప్రసిద్ధిని పొందిన చేమకూర వేంకటకవి 'విజయవిలాస' ప్రబంధముకూడ నరసింగకవికి ప్రేరణ కలిగించి యుండవచ్చును. వేంకటకవి ఈయనకు ఇష్టుడై, రచనా విషయమున ఆదర్శమైనవాడు. అందలి ప్రతిపద్యచమత్కృతుల పట్ల ముగ్ధుడగుటయేగాక, తనగ్రంథమున పెక్కు పద్యపుటెత్తుగడలను నరసింగకవి అనుకరించినాడు.

ఈ కారణముచేతనే 'హరియగు కృష్ణమూర్తి పదియాఱువేవురు రాచకన్యలన్ పరిణయమైన సచ్చరితను' (10-1) తన ప్రబంధ వస్తువుగా ఎన్నుకొని 'రాజకన్యకాపరిణయ' ప్రబంధమును సంతరించినాడు. ఈవిధముగా ఆయన తన యాస్థానమున ప్రసిద్ధమైన 'చంద్రికాపరిణయము'నకు జతపచ్చునట్లుగను, సమకాలీన పండిత మిత్రులైన వెల్లాలసదాశివశాస్త్రిగారు, శేషశాస్త్రిగారలు కావ్యవ్యాఖ్యానమున కీర్తినొందగా తాను స్వతంత్రకావ్య నిర్మాణ దక్షతగలవాడనని నిరూపించుకొనుటకును ఈ కృతినిరచించి యుండునని ఊహించుటకు వీలగుచున్నది.

## నరసింగకవి రచనల కాలనిర్ణయము

శ్రీ కపిలవాయి లింగమూర్తిగారికి లభించిన 'చూతపురీవిలాస'మునకు మూలమైన తాళపత్రప్రతియందు 'విరోధినామ సంవత్సర ఆషాఢ బహుళ త్రయోదశివరకు వ్రాయనైనది' అనియున్నదట. దీనిని ఆధారముగా నరసింగకవి గ్రంథరచనా కాలమును ఊహించుటకు అవకాశమున్నది. వెల్లూరి నరసింగకవి జటప్రోలు సంస్థానపాలకులు రాజాసురభిలక్ష్మారాయలు, వారి ఆస్థాన పండితులు వెల్లాలసదాశివశాస్త్రిగారలకు సమకాలికుడై సుమారు క్రీ.శ. 1860-1920ల నడుమ జీవించియున్నందున ఈయన జీవితకాలమున వచ్చిన విరోధి సంవత్సరము క్రీ.శ. '1889-1890' అగును. అప్పటికి నరసింగకవి వయస్సు ముప్పది సంవత్సరములుపైబడియుండును. ఇది 'చూతపురీవిలాస' యక్షగాన రచనాకాలము. దీనికి ముందుగా సుమారు పాతిక సంవత్సరముల వయస్సున

అనగా క్రీ.శ. 1885-86లలో 'సుభాషితత్రిశతి'ని అనువదించి యుండును. చివరగా సుమారు ఏబదియైదు వత్సరముల వయసున క్రీ.శ. 1915-16లలో 'రాచకన్యకాపరిణయ' ప్రబంధమును రచించియుండునని భావింపవచ్చును.

'సుభాషితత్రిశతి'యందలి శబ్ద సంక్షేపకత, 'చూతపురీవిలాస'మందలి 'ఎరువు-ఎర్వు, తిరుపతి-తిర్పతి'వంటి నుడినడుమ అచ్చు లోపించిన శబ్దరూపములు, 'మ్రొక్కి+అడుగిడుగు, కాచి+ఉన్న=కాచున్న' వంటి క్త్వార్థకేకార సంధులు, 'కలకంఠి నూగారుగాంచినచోందే శేషాచలంబు వీక్షింపనేల', 'వారకాంతల వర్షన'మున్నగు భావములు, 'ఉట్టిపడినదానవీవె, చల్లకువచ్చి ముంత దాచఫలమేమి' వంటి సామెతలు, జాతీయములు 'రాచకన్యకాపరిణయము'న ప్రతిబింబించినవి.

## నరసింగకవి పాండిత్యము

నరసింగకవి తాను 'సంస్కృతాంధ్ర కవితా ప్రతిభా కమనీయధీర పంజర సముదాయ చిత్ర జలజాత రవి' (9-1) నని చెప్పుకొన్నందున ఈయన ఉభయకవితా ధురీణుడని స్పష్టమగుచున్నది. నానారాగ తాళయుక్తములైన దరువులు, చెణుకులు, ఏలలు, కీర్తనలు. లాలి, జోలపాటలు 'చూతపురీవిలాస' యక్షగానమున నిబంధించి యుండుటవలన ఈయన సంగీతశాస్త్ర పాటవము వెల్లడియగుచున్నది. ఈ యక్షగానమున కృతిపతి నామమును చెప్పునప్పుడు నామగర్భిత సమస్యాసీసమును రచించి తన చిత్రకవితా విధాన సామర్థ్యమును ప్రకటించినాడు.

నరసింగకవి రచించిన సంస్కృత కృతులు తెలియవు. అయినను ఈయన రచించిన కొన్ని సంస్కృత శ్లోకములున్నవి. ఈయన 'చూతపురీ విలాసము'ను సంస్కృత 'శార్దూల' వృత్తమున నృసింహస్వామి స్తుతితో ప్రారంభించాడు. అందే బ్రహ్మను 'గాథా'వృత్తమున, ఈశ్వరుని 'రథోద్ధత' వృత్తమున, గణపతిని 'పంచచామరము'న, ఆంజనేయుని 'రథోద్ధత' వృత్తము లందును, రంగనాయకుని 'క్షమా' వృత్తమున సంస్కృతమున స్తుతించినాడు. 'రాచకన్యకాపరిణయము'న ఇంద్రుడు కృష్ణుని స్తుతించు పట్ల ఒక సీసమును (136-2) సంస్కృతమున వ్రాసినాడు. అందే నారదుడు, గరుత్మంతుడు,

భూదేవి మున్నగువారు కృష్ణుని స్తుతించినప్పుడు, రాజపత్నులు మోక్షమును పూజించినప్పుడు, 'చూతపురీ విలాసము'న మామిళ్ళపల్లి నరసింహస్తుతి, సంతానార్థమై నారాయణుడు విష్ణువును స్తుతించిన దరువులను గూడ సంస్కృతముననే రచించి వృత్త, భాషౌచిత్యములను పాటించినాడు.

చూతపురీవిలాసమున అవతారికలో పూర్వకవులందు 'వ్యాసవాల్మీకి కాళిదాసాది' సంస్కృత కవులను, నన్నయ, అనంతుడు, పెద్దన్న, చిన్నన్న, శ్రీనాథుడు మొదలగు ఆంధ్రకవులను, 'సరస సంగీత విచారకోవిదుల, భరత శాస్త్రజ్ఞుల ప్రౌఢిమ దంచి' సంగీతకోవిదులను స్తుతించినాడు. 'రాచకన్యకా పరిణయ' కృత్యాది లభించి యుండిన మరికొన్ని విశేషములు తెలిసియుండెడివి.

## ఆత్మీయత

వెల్లూరు నరసింగకవి, తన రచనల ద్వారా, అందులో ముఖ్యముగా 'రాచకన్యకా పరిణయ' ప్రబంధ రచనద్వారా తెలియదగిన ఆంతరంగికమైన, విలక్షణమైన వ్యక్తిత్వము గలవాడు. ఇందులో ఆయన తాత్త్వికదృష్టి, సాహిత్య దృష్టి, సామాజికదృష్టి మున్నగు అంశములు స్పష్టముగా తెలియుచున్నవి.

ఈయన గొప్పవిష్ణుభక్తుడు. ఈయన రచించిన మూడు కృతులును విష్ణుపారమ్య బోధకములే. ఆంధ్రసాహిత్యమున సహజపాండిత్యుడుగా ప్రసిద్ధుడైన పోతనామాత్యుని అడుగు జాడలను అనుసరించిన వాడు. అందువల్లననే తన 'రాచకన్యకాపరిణయ' ప్రబంధేతివృత్తమును శుకమహర్షిపరీక్షిన్మహారాజు నకు వినిపించినట్లుగా చెప్పినాడు.

నరసింగకవి ఉత్తములైన గురువు, విద్వన్మిత్రుల సాహచర్యమును పొందినవాడు. విశిష్టాద్వైత సంప్రదాయమున దిగ్గజము వంటి గద్వాల సంస్థాన పండితుడు పురాణం దీక్షాచార్ల శిష్యరికము, అద్వైత తత్త్వమున పారముట్టిన వంట్టెం లక్ష్మయ్యగారి సాహచర్యము నరసింగకవి యందు ఒక ప్రత్యేక వ్యక్తిత్వము రూపుదిద్దుకొనుటకు గట్టి పునాదులు వైచినవి. వీరి సాహచర్యముల ఫలితముగా ఈయన విశిష్టాద్వైత, అద్వైత సంప్రదాయములందు పరిణతిని సాధించినాడు. నరహరి పాదభక్తి, పంచవక్త్రహనుమదుపాసన ఈ అనుభవము

నకు జోడై నరసింగకవి యందు ఆధ్యాత్మిక వాసనను వెల్లివిరియించినవి. ఈయనను ఒక వేదాంతిగా తీర్చినవి. వీని ఫలితముగా నరసింగకవికి సర్వత్ర పరాత్పరుని దర్శించ గల దార్శనికత అలవడినది.

## తాత్త్విక దృష్టి

'శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్' అని పరమభక్తాగ్రగణ్యుడైన పోతనామాత్యుడు భాగవత రచనకు ఉపక్రమించినట్లుగా వెల్లూరు నరసింగ కవి కూడా మోక్షమునందిచ్ఛచేతనే 'రాచకన్యకాపరిణయ' ప్రబంధరచన చేపట్టి యుండునని తలంచుటకవకాశమున్నది. ఈ గ్రంథ 'కృత్యాది పద్యము' లభించక పోయినను ఆశ్వాసాంత గద్యను బట్టియు, కవికి నరసింహస్వామిపై గల భక్తిని బట్టియు ఈ ప్రబంధము నృసింహస్తుతితో ప్రారంభమై యుండునని యూహించుట సత్యదూరముకాదు. ఈయన 'చూతపురీ విలాసము'ను కూడ

'శ్రీకాంతాకుచ కుంభ యుగ్మ విలసత్కాశ్మీర పంకాంకిత
శ్రీవక్షోంచిత వక్షసం భవహరం కారుణ్యపాదోనిధిమ్
పాకారి ప్రముఖాఖిలామర నుతం కంజాత పత్రేక్షణం
శ్రీ మామిళ్ళపురీ నిశాంత మహిరాట్తల్పం నృసింహం భజే।'

అన్న సంస్కృత శ్లోకమున నరసింహ స్తుతి తోడనే ప్రారంభించినాడు. ఇట్లు సంస్కృత శ్లోకముతో కావ్యారంభము గావించుట ఈయన సంప్రదాయాభిమానమును వెల్లడించుచున్నది.

నరసింగకవి తాత్త్వికత క్రమ వికాసమును పొందినది. తన 'సుభాషిత త్రిశతి'ని ఇష్టదైవమైన వేంకటేశ్వరునికి అంకితమిచ్చుటతో ఈయన యందలి భక్తి భావములు మొలకెత్తినవి. సాంసారికుడై గార్హస్థ్యమును ఆచరించినవాడై యుండియు భక్తికిని వీడలేదు. మానవుని యందు దేహధర్మమైన కామమునకును, మనోధర్మమైన భక్తిని అవినాభావ సంబంధ మున్నది. తృతీయ పురుషార్థమైన కామమును సక్రమముగా దాటిన గాని, చతుర్థమైన మోక్షేచ్ఛ జనించదు. కాని నరసింగ కవి భక్తుడేగాని సాధకుడు కాడు. 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అన్న ఆదిశంకరుల సిద్ధాంతమును నమ్మినవాడు నరసింగ కవి.

ఈయన యందు మరియొకానొకమునకే వైరాగ్య భావములు పొడ సూపినవి. అవి అతని రచనలందు ప్రతిబింబించినవి. 'మూలప్రకృతి విలాసము'న

'ఆగమతంత్ర రహస్యపురాణ, యోగ శాస్త్రంబులు యోగ వాగములు
మోహనోచ్చాటనములును సంగీత, సాహిత్య దేశభాషాలిపిజ్ఞాన
సర్వశాస్త్ర భరతశాస్త్రము మర్మము, తెరంగులెరుంగుదు
తేటతెల్లముగ'

అని ఎరుకత పాండిత్యమును వివరించునపుడును.

'సరస వేదాంతార్థ సారమూహించి, కరతలామలకంబుగాను గ్రహించి
చరియించెద వటంచు జనులెన్నమించి, బరగెదవు ధరణిలో
ప్రఖ్యాతి గాంచి'

అని బాల విప్రనారాయణుని గూర్చిన జోల పాటయందును నరసింగ కవికిగల వివిధ శాస్త్ర పాండిత్యములు, వేదాంత విచార కాంక్షలు స్ఫురించుచున్నవి.

మామిళ్ళపల్లి నరసింహుని
'మేలుగా నూటెనిమిది తిర్పతులను, పాలించు శ్రీ పరబ్రహ్మ స్వరూప
పరమాత్మ మామిళ్ళపల్లి నివాస, స్థిరముగా మమ్మేలు శ్రీ నారసింహ'

అని నరసింగకవి పరబ్రహ్మ స్వరూపముగా భావించినాడు.

ఇందలి అష్టోత్తరశత దివ్యదేశస్తోత్రమున
'పొలుపొంద వైకుంఠపురవాసుదేవ, సంకర్షణామోద సంకర్షణనామధేయ
వరప్రమోదస్థ ప్రద్యుమ్నదేవ, మురదైత్య హరణ సమ్మోదానిరుద్ధం

భానుమండల వాస పద్మాయతాక్ష' అని వైష్ణవ మతము నందలి చతుర్వ్యూహములను స్తుతించినాడు. అష్టాదశ శక్తిపీఠ స్తుతి కావించుటలో ఈయనకు జగదంబపై గల భక్తి స్పష్టమగుచున్నది.

'రాచకన్యకా పరిణయ' కావ్యావతారిక నరసింగకవి హృదయమును ఆవిష్కరించు చున్నది. ఇందు కృతిప్రేరక, కృతిభర్తల వంశక్రమ వర్ణనల ఆధారముగా నరసింగకవి హృదయమును, తాత్త్విక దృష్టిని అర్థముచేసికొన వచ్చును.

నరసింగకవి మనోవాక్కాయములనెడు త్రికరణములు శుద్ధిగా సర్వాత్ముని నమ్మినవాడు. అవతారికయందు కృతిప్రేరకుడైన వట్టెంనరసింహారెడ్డి గొప్పదనము గురించి చెప్పిన పద్యము వలన ఈ విషయము స్ఫురించుచున్నది.

'మీ మనము మీ కర్మమును
మీ మేడల ప్రాంగణముల మేలిమి వరుసన్
నేమముగ దానవారి
శ్రీమహిమ జెలంగె నారసింహారెడ్డీ!' (34-1)

'నరసింహారెడ్డి మనస్సు, కరము, మేడలప్రాంగణములు వరుసగ 'దానవారి'చే (దానవ + అరి — విష్ణువుచే, దాన + వారి = దానజలముచే, గజమదములచే) శ్రీమహిమయందు ప్రసిద్ధిని పొందినవి' అన్నది ఈ పద్య ప్రస్తుతార్థము. నరసింహారెడ్డిని నామ సామ్యముతో నరసింగకవిగా గ్రహించినచో 'నరసింగకవి మనస్సు, కరము-కావ్యనిర్మాణోపయుక్తమైన హస్తము, మేడ-దేహమునకు ఉపలక్షకము-అనగా కాయము అనునవి 'దానవారి' (దానవ + అరి = విష్ణుమూర్తిచే) శ్రీమహితములై వ్యాప్తములైనవని' కవి పరముగా అప్రస్తుతార్థమును గ్రహింపవచ్చును.

కృతిభర్త సంస్థాన ముఖ్యస్థానమైన గోపాలుపేటను వర్ణించుచు నరసింగకవి

శ్రీమహాలక్ష్మి వర్తించు పదార్వన్నె
బంగరుపేట గోపాలుపేట
ధర్మకార్యప్రవర్తన మించునొక్కటై
పదుగురి మాట గోపాలుపేట
సలయింప నలరును గలమాది ధాన్యంబు
పైరలేపేట గోపాలుపేట
బలులగు రిపులకు నలవికాకుండ ద
ర్పము గలకోట గోపాలుపేట

నందనవనంబు చొక్కాట మిందునాట
సుమహితఫలంబు లిచ్చోట నమరుతోట

పుడమిచెలికి లలాటమింపవరుచోట
మేలుపాపిటయౌను గోపాలుపేట' (47-1)

అని చెప్పినాడు. ఒక నగర వర్ణనాపరముగా ఇందలి ప్రస్తుతార్థము సుస్పష్టము. కాని ఈపద్యము అప్రస్తుతార్థమున నరసింగకవి హృదయమునకు ఉపలక్షకముగా స్ఫురించుచున్నది. ఈ 'గోపాలుపేట' ఒక ఊరు కాదు. గోపాలుని బంధించియుంచిన పేటిక. కృష్ణభృంగ నిక్షిప్తమైన నరసింగకవి స్వాంత కమలము. ఇది 'శ్రీ మహాలక్ష్మి నడయాడునట్టి పదార్వన్నె బంగరుపీట'. 'కారుణ్యతః కల్పయ పద్మవాసే లీలాగృహంమే హృదయారవిందం' అని కనకధారా స్తవమున శంకరాచార్యులు చెప్పినట్టిదిది; ధర్మకార్య కారణమున పదుగురిమాట ఒకేమాటగా నున్నది' అనగా కర్మేంద్రియములైదును, జ్ఞానేంద్రియములైదును ఏకముఖముగా పరమాత్మని వాంఛించునది; నలయింపనలరును కలమాది ధాన్యంబు' అనుటలో భక్తికమలములు (వరిపైరు) పండించు హృత్కేదారము అని అర్థము. ఆదిశంకరులు శివానందలహరిలో 'ధీయంత్రేణ వచోఘటేన' అన్న శ్లోకమున ఇట్టి భావమునే వివరించినారు; 'బలులగు రిపులకు నలవికాకుండ దర్పముగం కోట' అనుటలో అంతశ్శత్రువులైన కామక్రోధాదులకు అసాధ్యమైనదని యర్థము; 'నందనవనము' అనుటలో నందనందనుని విహారక్షేత్రము - బృందావనము - హృదయ బృందావనము అని అర్థము. 'సుమహితఫలము' అనుటలో మోక్షఫలదము, 'పుడమిచెలి' అనుటలో పృథ్వి - అనగా పాంచభౌతికమైన దేహక్షేత్రమున వెలసిన, 'లలాటమింపడరు చోట మేలు పాపిట' అనగా మేధస్సంబంధమైన, 'విజ్ఞానమయమైన 'హృదయ క్షేత్రము' అన్నది ఫలితార్థము. ఈ విధముగా నరసింగకవి హృదయము శ్రీకృష్ణమయమని భావింపవచ్చును.

నరసింగకవి ఈ విధమైన చిత్త సంస్కారము తోడనే 'రాచకన్యకా పరిణయ' కావ్యావతారికయందు కృతిప్రేరక, కృతిభర్తల వంశములందలి ప్రముఖ వ్యక్తులను వర్ణించినాడు. ఆయావ్యక్తుల వర్ణనావ్యాజమున, స్వీయ భక్తిని జోడించి పరమాత్మని దివ్య విభూతులను కీర్తించినాడు.

కృతిప్రేరకుడు నరసింహారెడ్డి. కవి ఇష్టదైవము నరసింహస్వామి. తాను స్వయముగా నరసింగకవి. సనామధేయరూపకమైన ఈ విచిత్ర త్రివేణీ

సంగమము కవికి బాగుగా అనుకూలించినది. అందువలన కవి నరసింహారెడ్డి ముఖముగా నరసింహస్వామిని స్తుతించినట్లు స్ఫురణ కలుగుచున్నది.

1. నరసింహారెడ్డి ఆత్మవిభూతి (ఐశ్వర్యము) ను వర్ణించుచు కవి

'ఇనుడయ్యు గువలయ హితమొనర్పని సూర్యు
దలఘుతేజమున జోడగునె నీకు'
... ... ... ...
'వైభవసురేశ! నరసింహ వసుమతీశ!' (36-1)

అని చెప్పినాడు. ఇందు ప్రస్తుతుడైన నరసింహారెడ్డి 'వట్టెము' అన్న పల్లెటూరున ఒక ధనికుడు. అంతమాత్రమున ఇంత గొప్పదనముగల 'వసుమతీశుడు' కాలేడు. కవి ఎంత 'అర్థకాంక్షి' ఐనను ఇట్లు చెప్పలేడు. దీనివలన ఆయనకు లభించిన ధనసంపత్తికూడ మృగ్యమే. ఆయన సాధారణమైన మధ్యతరగతి కుటుంబీకుడు. నిరాడంబరుడు. మరి ఈ విధంగా కృతిప్రేరకుని కీర్తించుటలోని కవి పరమార్థం వేరు. ఆయన నామసామ్యముచేత తన ఇష్టదైవమైన నరసింహస్వామిని భావించగల పరమభక్తుడు. ఇందలి దివ్యవిభూతులు 'ఆ నరసింహవసుమతీశు'నివి.

2. కృతిభర్తవంశమున ప్రసిద్ధుడైన గోపాలుపేట సంస్థాన పాలకుడు గోపాలరాయని వర్ణించుచు నరసింగకవి

'జిష్ణుడంచును బరక్షితిభృత్ప్రకాండంబు
చతురాస్యుడని సత్కవీశ్వర చయంబు'
'మార్చితుండగు గోపాలమనుజవిభుడు' (74-1)

అని చెప్పినాడు. ఇందలి 'గోపాలమనుజ విభుడు' గోపాలుపేట సంస్థానాధిపతి 'గోపాలరావు' కాడు. ప్రస్తుతుడైన ఇతడు నామకార్థమే. ఇందు వ్యంగ్యమైనవాడు. పరమాత్ముడు, మార్చితుడు. 'త్వదంఘ్రి భజనే లక్ష్మీః' అయిన గో (ఇంద్రియ, లోక) పాలకుడు. ఇది, పరాత్పరుని విశ్వరూపమునకు ఉపలక్షకము. కురుక్షేత్ర రణరంగమున అర్జునునకు దర్శనమైన దివ్యరూపము ఇట్టిదే.

3. కృతిభర్తయైన హనుమంతరాయని గురించి చెప్పిన షష్ఠ్యంతములు, ఆశ్వాసాంతము లందలి సంబోధనలు మొదలైన వానియందును కవి ఈ విధానమునే పాటించినాడు.

అ. 'గోపాలక గోపాలక
గోపాలక భరణనీతి గుణ భోగుఁడగున్
భూపావన భూపావన
భూపావన జవవిభాసి భుజదాహునకున్' (100-1) షష్ఠ్యంతము.

అని చెప్పుటలో, తన కావ్యకన్యకను అంతర్గతమున నరసింగకవి పరమాత్మునికే సమర్పించినట్లు తోచుచున్నది. 'గోపాలక'- 'గో' శబ్దమునకు ఆవు, వాక్కు, భూమి అన్న అర్థములున్నవి. అనగా ఈ గోపాలకుడు - గోవులను పాలించుట, వాక్కును అనగా శబ్దబ్రహ్మను నియమించుట, పృథ్వీపాలన మొదలైన భార వహన సామర్థ్యము కలవాడు. 'భూపావన'- 'పావన' అనగా దుష్టశిక్షణ, శిష్ట రక్షణలచేత భూమిని పావనము చేయుట, 'భూప అవన' అనగా రాజులను కాపాడుట ('నావిష్ణుః పృథివీపతిః' అని యున్నందున రాజులెల్లరు ఆయన అంశలే. అయినను వీరు సన్మార్గమున ఉన్ననే కాపాడుట. లేనిచో పరశుధరుడై వీరిని పరిమార్చును), 'భూప అవన' పార్థివులైన జీవులను ఉద్ధరించుటలందు వేగముచే ప్రకాశించు ఖడ్గమును ధరించిన మూపు సంధులు కలవాడు. ఇట్టి లక్షణములు గల పరాత్పరునికే నరసింగకవి తన కావ్యమును అంకితమిచ్చినట్లు భావింపవచ్చును.

ఆశ్వాసాంత పద్యములును ఈ విషయమును ధృవపరచుచున్నవి.

ఆ. 'దరకర కరుణాకర పర
దరకర బిరుదాంక నలినతతి వికసన సుం
దరకర నిభవిభవ బుధాదర
కర సంగరజయాత్యుదార ప్రవరా' (216-1). ఆశ్వాసాంతము.

'దరకర - పాంచజన్యకరుడు, కరుణాకరుడు; పర దరకర - అరిషడ్వర్గ భయకారకమైన, బిరుదాంక - శౌర్యచిహ్నమైన గరుడధ్వజము గలవాడు; నలినతతి - సవిత్కమలము (జ్ఞానకమలము)ను, వికసన - వికసింపజేయు వాడు; సుందరకర - 'సుతరాం ఆద్రియత ఇతి సుందరం, దృజ్ ఆదరే' అనగా మిక్కిలి సంతోషపెట్టునది, నిభ - 'నితరాం భాతీతి నిభః, భా దీప్తౌ' అనగా మిక్కిలి ప్రకాశించునది అయిన 'విభవ' - సంపదగలవాడు అనగా

మోక్షఫల ప్రదాయకుడు; ఋఘాచరకర - సజ్జనులను ఆదరించువాడు; ఈ విధమైన లక్షణములు పరాత్పరునివని భావింపవచ్చును.

'సర్వదా సర్వదేహా, నిరుపమ జవవాహా, నీతివాక్య ప్రవాహా (431-2), దురితతృణలవిత్రా (282-4) వంటి ఆశ్వాసాంత సంబోధనలు ఈ విషయమును ధృవీకరించుచున్నవి.

ఈ విధముగా 'సర్వమున్నతని దివ్యకళామయ' మన్నట్టి చిత్తవృత్తి, తాత్త్విక దృష్టి కలిగిన భాగవతుడుగా వెల్లూరు నరసింగకవి స్ఫురించుచున్నాడు.

## సాహిత్య దృష్టి

సాహిత్యము విశ్వశ్రేయమును కలిగించవలెనని నరసింగకవి విశ్వాసము. మానవుని యందలి పాపచింతన తొలగిననే గాని మానవాళికి శ్రేయస్సు ఒనగూడదు. మానవులు మత్సర్యాది అరిషడ్వర్గవిదూరులై, ధార్మికతను అలవరచు కొనుటకు భగవద్భక్తి ఉత్తమసాధనమని దృఢముగా నమ్మినవాడీయన. ఈ సాంసారిక సుఖములు అస్థిరమైన వన్న వైరాగ్యభావము మానవులందు కలిగి, వారు అంతర్ముఖులై తమ్ముతాము తెలిసికొని, తమ జీవనమును సోదర మానవాభ్యుదయమునకు వినియోగించవలెనని నరసింగకవి ఆకాంక్ష.

రాచకన్యకా పరిణయేతివృత్తమున తన్ను దర్శింప వచ్చిన నారదుని కృష్ణుడు స్తుతించు పట్టున ఈ విధమైన మానవ జీవన విధానమును నరసింగకవి స్పష్టపరచినాడు.

'అరిషడ్వర్గవిదూరు లింద్రియజయవ్యాపార సంచారు ల
స్థిర సంసారవిముక్తధీరు లఘువిచ్ఛేదక్రియోదారు లం
తరవిద్యావిహారు లట్టి ఘనులన్ దర్శించితిన్ మిమ్ము' (150-1)

అని కృష్ణుడు నారదుని గురించి చెప్పుటలో, కవి సర్వమానవులు ఇట్టి జీవన ధ్యేయముతో విశ్వకుటుంబీకులుగా మనవలెనన్న అభిప్రాయమును వెలిబుచ్చినాడు.

ఈ అభిప్రాయమునకు అనుగుణముగనే నరసింగకవి తన 'రాచకన్యకా పరిణయ' ప్రబంధమును మధురభక్తి భరితముగ తీర్చినాడు. శ్రీకృష్ణలీలావిశేష రూపకమైన ఈ కావ్యకన్యక వలన 'సహృదయ నివేదిత నివృత్తి, భక్తజన కలుష

నిరాకృతి' అన్న రెండు సాహిత్య ప్రయోజనములను కవి ఆశించినాడు. ఈయన యొక్క ఈ భావము కావ్యము నందు అడుగడుగున ప్రతిబింబించుచున్నది.

## సామాజిక దృష్టి

సమాజ సాహిత్యములు పరస్పరాశ్రయములు. సమాజమునుండి సాహిత్యము ఆవిర్భవించుననియు, సాహిత్యము సమాజమును సత్క్రమ మార్గమున నడిపించుననియు సాహిత్యవేత్తల సిద్ధాంతము.

మానవుడు ఏకాకిగా ఈ లోకమున మనుగడ సాగించలేడు. కొందరు మానవులు సమిష్టిగా, సంఘముగా కలిసినగాని వారి జీవనము సుఖవంతముగా సాగదు. నలుగురు వ్యక్తులు కలిసి జీవించుటకు కొన్ని స్పష్టమైన మార్గదర్శక నియమములు అవసరము. కట్టుబాటులేనిది ఏదైనను అస్తవ్యస్తమై భ్రష్టమగును. ఈ కట్టుబాటునకే మన ప్రాచీనులు ఆచారము, సంప్రదాయము అని పలు విధములైన పేర్లు పెట్టినారు.

మానవులందు ఆత్మీయతానురాగములను పెంపొందించి, వారియందు ఐకమత్యము, వాత్సల్యము, ప్రేమ, త్యాగము మొదలగు సద్గుణములను కలిగించుటకు 'ఉమ్మడి కుటుంబజీవన విధానము' ఉత్తమమైనది. తల్లి, తండ్రి, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, ఆడుబిడ్డలు, తోడికోడండ్రు మొదలగువారితో కలిసిమెలసి జీవించు అలవాటు మానవునికి తన కుటుంబమునుండియే సిద్ధించగలదు. ఒకవ్యక్తి ముందుగా తన కుటుంబమున ఉత్తమ సభ్యుడు కాగలిగినచో అతడు తన గ్రామమున, దేశమున ఉత్తముడుగా రాణించి, విశ్వమానవ సమాజమున సభ్యుడుకాగలిగిన అర్హతను సంపాదించగలడు. 'ఇంట గెలిచి రచ్చగెలువవలె'నన్న సామెతలు ఇట్టివిషయమునే సమర్థించు చున్నవి. మానవుడు తనవారి మేలునే కాంక్షించినచో అది స్వార్థమగునన్న శంక కలుగవచ్చును. కాని తన వారినే ఆదరించి, అభిమానించలేని వాడు పొరుగు వారికి ఏవిధముగను తోడ్పడ లేదు. 'స్వయంతీర్త్వా పరాన్‌తారయ' అన్నది పెద్దలవాక్కు.

నరసింగకవి మానవులందలి ఐకమత్యమునకు ఇట్టి కుటుంబజీవనము శ్రేష్ఠమైనదిగా విశ్వసించి, తన ప్రబంధము నందలి పాత్రలను ఈ దృష్టితోడనే తీర్చినాడు.

రాచకన్యకా పరిణయమున, సర్వోత్కృష్టులు స్వర్గమునకురాగా, దేవమాత యైన అదితి 'తనసన్నిధానమునసేవావృత్తినున్న' కోడలు శచీదేవికి వారినిచూపి ఈ విధముగా చెప్పినది.

'నీయారాలీసత్యయు
పాయని నీ మరది యితడు పద్మాక్షుండున్
ఓ యింద్రపత్ని కలదే
నీ యంతటి భాగ్యశాలి నిఖిల జగములన్' (411-2)

అని చెప్పుటలో ఆ అత్తా కోడండ్ర అనుకూల్యము స్పష్టము. అత్తను తల్లివలె సేవించునది కోడలు. కన్నబిడ్డవలె ఆదరించి కోడలికి ప్రేమలు బోధించునది అత్త.

'అనిన విని, తాను సత్యను గనికరమున
గౌగిటను జేర్చి కరమున కరముబట్టి
తనదు శృంగారభవనంబు గనగవేడ్క
జనియె పౌలోమి సంతోషసహితయగుచు' (412-2)

అత్త అన్నమాటను వెంటనే మన్నించి తోడికోడలైన సత్యను ఆప్యాయముగా ఆదరించినది శచి. లోకమున అందరు అత్తలు, కోడండ్రు, తోడికోడండ్రు ఇంత సమరసభావమున నున్నచో ఇక గృహచ్ఛిద్రములకు తావెక్కడిది.

ఈ విధముగా అత్తమామలు, అన్నదమ్ములు, తోడికోడండ్రు, సవతులు ఉన్న ఇండ్లయందు ఇంటి కోడండ్రు వ్యవహరించవలసిన తీరు, భార్యల పట్ల భర్తల ఆప్యాయతాదరణలు, బావగార్లు, మరదండ్ర వాత్సల్యగౌరవములు, తోడికోడండ్ర ఒద్దికలు మున్నగు విషయములను కన్నులకు కట్టినట్లుగా నరసింగకవి చిత్రించినాడు. సందర్భానుసారముగా ఇండ్లయందు అతిథి సత్కారము, విందులు మొదలగువానియందు పాటించవలసిన ఆచారములను వివరించినాడు.

ఇట్లు వెల్లూరు నరసింగకవి పండితులకు నిలయమైన జటప్రోలు సంస్థాన ప్రాంతమునందలి కవుల ఇంట జన్మించి, వంశానుగతమైన భక్తిభావమును సహజముగ పొంది, ఉత్తముల సాహచర్యమున తన విద్య, విజ్ఞానములకు పదును పెట్టుకొని, వేదాంతవాసనను కలిగి సాహిత్య సమాజముల పట్ల చక్కని అవగాహనతో కవితా రచనకు పూనుకొన్నాడని అర్థమగుచున్నది.

—: o :—

# 4. రాచకన్యకా పరిణయ ప్రాదుర్భావము- నామౌచిత్యము

కవులు తమ కావ్యకన్యకలను తమ ఇష్టదైవములకు గాని, ఇష్టులైన వ్యక్తులకుగాని అంకితమిచ్చుట సహజము.

'గురునకు శిష్టదైవమునకుం బతికిం గృతి జెప్పి పుణ్యమున్
వరమును దేవమున్ బడయవచ్చు జగంబుల నిశ్చయంబుగన్'
(కుమా.సం. నన్నెచోడ)

అని కృతికర్తల దృఢవిశ్వాసము. ఇట్లు గురు, దైవ, నరాంకితములయిన కృతులకు కృతికర్త, కృతిభర్తలు ఇరువురుండుట పరిపాటి. కొన్ని సందర్భములలో ఈ ఇరువురి నడుమ సంధానకర్తగా ఒక కృతిప్రేరకుడు ఉండుట తటస్థించును. దీనివలన కృతికర్తతోపాటు కృతి భర్త, ప్రేరకుల కీర్తికూడ సాహిత్య ప్రపంచమున చిరస్థాయిగా నిలుచును.

ఆదికవి నన్నయ భట్టారకుడు తన భారతాంధ్రీకరణమును తన యేలికయైన రాజరాజ నరేంద్రున కంకితమిచ్చినాడు. నన్నెచోడ కవిరాజు కుమార సంభవ కావ్యమును తన గురువైన జంగమ మల్లికార్జున పండితారాధ్యున కంకితము గావించినాడు. కవిబ్రహ్మ తిక్కన సోమయాజి విరాట పర్వాది పదునేను పర్వముల భారతమును హరిహర నాథునకు సమర్పించినాడు.' ఆంధ్ర వాఙ్మయారంభ దశయందే ఈ విధముగా త్రివిధములైన కృతి సమర్పణ సంప్రదాయములు వ్యాప్తములైనవి.

కవి ఒక కావ్యమును వ్రాయదలచినవాడై కథావస్తువును తానే నిర్ణయించుకొని కృతి భర్తకై అన్వేషించుటగాని, కృతి భర్తృ ప్రేరకులలో నొకరు తమ కిష్టమైన వస్తువును ఎన్నుకొని కావ్యముగా రచింపుమని కవిని అర్థించుట గాని సాహిత్య లోకమున సర్వ సాధారణముగా జరుగుచుండును. ఇట్లు వస్తు

వరణము కృతికర్త, కృతిభర్తలలో ఎవరి ఇష్టమునననుసరించియైనను జరుగు చుండును.

గురు, దైవ, నరాంకితములైన కృతులందు ఒక్కొక్కదానిలో వస్తు వరణము, కృతి సమర్పణములు ఆధారముగా చతుర్విధ వ్యవహారములు పొడ కట్టుచున్నవి.

1. కృతికర్త స్వయముగా కావ్యవస్తువును నిర్ణయించుకొని కృతిభర్తను ఎన్నుకొనుట.

2. కృతిభర్తయే వస్తునిర్ణయము గావించి కవిని గ్రంథముగా వ్రాయుమని కోరుట.

3. కవియే కావ్యవస్తువును నిర్ణయించుకొనియుండగా కృతిప్రేరకుడు ఫలానివారికి అంకితమగునట్లుగా కృతి రచింపుమని కోరుట.

4. కృతిభర్తగాని, ప్రేరకుడుగాని కథావస్తువును నిర్ణయించి కవిని కృతి రచింపుమని కోరుట.

ఇట్లు కావ్యావిర్భావ విషయమున పెక్కు వైవిధ్యములు గోచరించు చున్నవి.

## రాచకన్యకా పరిణయ ప్రబంధావిర్భావము

వెల్లూరు నరసింగకవి 'రాచకన్యకా పరిణయ' ప్రబంధావిర్భావమునకు వట్టెం నరసింహారెడ్డి ప్రేరకుడు. కవి 'చమత్కారజనకముగా శ్రీకృష్ణలీలా విశేషమును' (4-1) రచియింప దలచి, తన కావ్యకన్యకా రత్నమున కధీశ్వరు డెవ్వడోయని విచారించు సమయమున గోపాలుపేట రాజప్రతినిధియైన నరసింహారెడ్డి

'హరియగు కృష్ణమూర్తి పదియార్వురు వేవురు రాచకన్యలన్
బరిణయమైన సచ్చరితబాగుగ మీరొనరించి గ్రంథమున్
వరజనుపల్లి రాజమల వర్ధనుడౌ హనుమంతరాడ్పృహా
దరుసకు నంకితంబుగ నుదారకృపన్ రచియింపుడీ (యనన్') (10-1)

అని గోపాలుపేట పాలకుడైన హనుమంతరాయనికి ఆ గ్రంథమును అంకితము చేయుమని కోరినాడు.

వస్తువరణము కృతకర్త, ప్రేరకులు ఇరువురి ఇష్టరూపముగా జరిగినది. కవి శ్రీకృష్ణలింగము కొనియాడదలచగా ప్రేరకుడు రాజకన్యకం పరిణయ లీలను వివరించుచున్నాడు.

## కృతిప్రేరకుడు-వంశక్రమము

నరసింహారెడ్డి శ్రీ మహావిష్ణువు పాదోద్భవుడు. వీరిది తాడూరు వంశము. పూర్వాల గోత్రము. వీరు వట్టెం గ్రామవాసులు. ఇది గోపాలుపేట సంస్థానము నకు చెందిన ఖాల్సా గ్రామము. వీరు మోటాటిరెడ్ల తెగకు చెందినవారు. వీరికి 'తాడూరు' అనునది ముందుగా గృహనామమై కాలాంతరమున వంశనామముగా పరిణమించినట్లు కవి చక్కని హేతువుతో వ్యవహరించినాడు.

'ఇలమోటాటి కులస్థులైన ధరణీశేంద్రుల్ పురగ్రామముల్
వెలయంజేసి వసించువారగుట తాపేరొందె వంశంబుకే
వలమైయొప్పెను గొంతమంది కవిమే వర్తిల్లు చుండంగ మీ
కలరున్ తాడురు వంశమట్లు నదిశ్రేయంబౌ నృసింహాధిపా!' (16-1)

ఈ వంశమువారికి రామచంద్ర వసుధాధ్యక్షుండు మూలపురుషుడు. ఈయన దేవబ్రాహ్మణ భక్తియుక్తుడై, చతురంగబల సమేతుడై రాజ్యమేలిన వాడట (17-1). నరసింహారెడ్డికి ఈయన ఎన్నితరములు పూర్వుడో తెలియదు. ఇతని వంశమున జన్మించినవాడు పాపిరెడ్డి. ఇతడే కృతిప్రేరకుడైన నరసింహా రెడ్డికి తండ్రి. ఈ పాపిరెడ్డికి అయిదుగురు కుమారులు. ఈ విషయము కవి నరసింహారెడ్డిని ఉద్దేశించి

'మీ యన్నగారు నల్గురు
ధీయుతు లతిశాంతులురువితీర్ణులు న్యాయో
పాయులు సూనృత వాక్తే
జోయుతులు దయాళురయ్యు జూపట్టిరిలన్. (20-1)

అని చెప్పిన పద్యమువలన తెలియుచున్నది. కాని తర్వాతివర్ణనలో పాపిరెడ్డి కుమారులైన కోదండరామరెడ్డి (1) రామనయ విభుడు (2) నరసింహారెడ్డి

(5) అన్న ముగ్గురి ప్రస్తావనయే ఉన్నది. మూడవ, నాలుగవ పుత్రుల విషయ మును కవి చెప్పలేదు.

## కోదండ రామరెడ్డి

కోదండ రామరెడ్డి గొప్ప వితరణశీలి. ఇతని 'దానకాంతి గురువై వ్యాపించగా తరణిజ (కర్ణుడు), శశి, శిబి, బలులు ఆ దివిగవి పగిది లఘువు లైనట్లు (23-1)' కవి చమత్కరించినాడు. కర్ణాదులను లఘ్వక్షరములు గం పదముంతో చెప్పి, దానకాంతిని 'ఘా'గా సర్వాక్షరముతో చెప్పి దీనిముందు వారందరును వెలవెలబోయిరని కవి వర్ణించినాడు.

## రామన(య)

తరువాతివాడైన రామన మంచి పరాక్రమవంతుడై, పరిపాలనాదక్షత గలవాడట, ఇతడు గోపాలుపేట సంస్థానమునకు మూలస్తంభముగా ఉన్నవాడు. ఈయనను గురించి కవి

'శ్రీపద్మాక్షు దయాప్తి రామనయ రాజేంద్రోత్తముండెప్పుడున్
వ్యాపాదస్థితి స్వప్నమందయిన నోర్వంజాలకున్నట్టి రా
ద్వ్యాపారాంచిత చిత్తముంగలిగి సాహాయ్యంబుగావించె శ్రీ
గోపాల్పేట పురీప్రభుత్వము తెరంగున్ మేల్మెరుంగై తగన్' (27-1)

అని పేర్కొన్నాడు. ఈ 'రామనయ'నే కోదండరామరెడ్డి కంటే పెద్దవాడని పెద్దలవాక్కు. ఆయన పేరు 'రామరెడ్డి' అనియు. అతడు 'సత్యవచస్థితి, సద్వి వేకమున్ పల్మరు తూర్మియున్ వెలయ వట్టెము పట్టజసీమల గొప్పగొప్పవారల్ ముదమందంగా' (26 - 1) తిరుగుటవలన అందరు అతనిని ఆప్యాయముగా 'రామన్నయ్య' అని పిలుచుచుండిరనియు, అదియే 'రామనయ'గా మారినదనియు, ఈయన సుమారుగా ఇరువది సంవత్సరములు గోపాలుపేటసంస్థానమున రాజప్రతి నిధిగా పరిపాలించినాడనియు పెద్దల కథనము. నరసింగకవి ముందుగా కోదండ రామిరెడ్డిని పేర్కొని, తర్వాత రామనయను గురించి చెప్పుటకు కారణము అనూహ్యము.

# నరసింహారెడ్డి

పాపిరెడ్డి కుమారులలో చివరివాడు నరసింహారెడ్డి. ఇతడే నరసింగకవిని 'రాచకన్యకా పరిణయ' ప్రబంధమును రచింపుమని ప్రేరేపించినవాడు. ఈయన కాలమున ఒకసారి గోపాలుపేట సంస్థానమునకు శత్రువులవలన చెడుపు సంభవించినది, అప్పుడు ఈయన ఆ అరివర్గమును జయించినాడు (30-1). 'నృసింహస్వామి భూదేవిని ఉద్ధరించినట్లుగా' గోపాలుపేట సంస్థానమును పునరుద్ధరించినాడు.

'ఆ నరసింహదేవుడపుడా భువి యాకడలిన్ మునింగినన్
రానెటుగా నుదారమహదారుడునై పయికెత్తె నిప్పుడా
మానిత జన్నలింద్ర హనుమంతనృపాలుని రాజ్యసంపదన్
శ్రీనరసింహనామ నృపశేఖర ! నీవటు నిల్పితౌ బళి' (29-1)

అని ఆ విజయమును గురించి కవి చెప్పినాడు. ఇందు కవి నరసింహస్వామితో నరసింహారెడ్డిని సుజసాదృశ్యముతో పోల్చినాడు. కాని నరసింహస్వామి భూదేవిని ఉద్ధరించె నానుట పొసగదు. అందువలన నరసింహ దేవుడను నరసింహస్వామి యనికాక నరశ్రేష్ఠుడు-పురుషోత్తముడు. అనగా విష్ణువన్న అర్థము సరిపోవును.

నరసింహారెడ్డి సాధించిన ఈ విజయమునకు సంబంధించిన చారిత్ర కాంశములు తెలియవు. ఈయన కూడా రామునయవలెనే అతని అనంతరము దాదాపు ఇరువది సంవత్సరములు గోపాలుపేట సంస్థానమున రాజప్రతినిధియై రాజ్యమేలినాడట. ఈయన గొప్పపరిపాలనాదక్షుడు. భువిలో సప్తసంతానములను నిలిపినవాడు(1-32). ఇతడు బండపల్లి ఆంజనేయుని భక్తుడు. అచ్చట ఈయన ఒకరామాలయమును నిర్మించినాడు(1-33). 'వైభవసురేశ! నరసింహవసుమతీశ! (1-36) అని ఈయన గొప్పదనమును నరసింగకవి మిక్కిలి ఉన్నతముగా పేర్కొన్నాడు. ఈయన అన్న కోదండరామరెడ్డి కుమార్తె రంగనాయకమ్మను గోపాలుపేట సంస్థాన ప్రభువైన జగపాలరావు వివాహమాడినాడు. ఈ జగపాలరావు, రంగనాయకమ్మల (దత్త) కుమారుడే 'రాచకన్యకాపరిణయ' కృతిభర్త

యైన హనుమంతరాయుడు. కృతి ప్రేరకుడైన నరసింహారెడ్డికి, అన్నకుమార్తెకు కుమారుడు కావున, హనుమంతరాయుడు దౌహిత్రుడగు చున్నాడు. దౌహిత్రునికి అంకితమగునట్లుగా తాత నరసింహారెడ్డి నరసింగకవిని కావ్యమును వ్రాయుమని కోరినాడు. ఈ నరసింహారెడ్డి అరువది సంవత్సరములు పైబడి జీవించి యుండినట్లును, ఆయన మరణించి ఇప్పటికి దాదాపుగా అరువది సంవత్సరములు అయి యుండినట్లును తెలియుచున్నది. అందువలన నరసింహారెడ్డి క్రీ.శ. 1880-1930ల నడుమ జీవించియుండునని తలంపవచ్చును. ఈ కాలము నరసింగకవి కాలమునకు సరిపోవును.

## కృతిభర్త-వంశక్రమము

కృతిభర్తయైన హనుమంతరాయనికి సంబంధించిన గోపాలుపేట రాజవంశమును నరసింగకవి విపులముగ వర్ణించినాడు. గోపాలుపేట సంస్థానాధీశులు వనపర్తి సంస్థానాధిపతుల కుటుంబ శాఖనుండి చీలినవారు. వీరు 'అనవరతానమద్విబుధమౌ హరిపాద సరోరుహాముస'(40-1) జన్మించినవారు. వీరు మోటాటి తెగకు చెందిన రెడ్లు. వీరిది పెనుబాల గోత్రము. కవికి తెలిసినంతవరకు వీరకృష్ణ నృపచంద్రుడు ఈ వంశమునకు మూలపురుషుడు. నరసింగ కవికి తల్లివైపు వంశమున పూర్వుడైన చెన్నకృష్ణకవి గోపాలుపేట వల్లభరాయనికి అంకితముగా రచించిన యాదవ భారతీయమను ద్వ్యర్థికావ్యమునందును గోపాలుపేట రాజవంశమును ఈ వీర కృష్ణాఖ్యుని తోడనే ప్రారంభించినాడు. ఈయన వనపర్తి సంస్థానమువారికిని, జనుంపల్లి కులమునకును మూలపురుషుడని శ్రీనెమలూరు వెంకట శాస్త్రిగారు 'వనపర్తిసంస్థాన చరిత్రము'న వివరించినారు.

'ఆ జనుంపల్లి కులమునకాదియగుచు
బొడమె వీరకృష్ణారెడ్డి భూతలేశు
డామహాత్ముండె యీ గృహమునకు
నీదృశాస్థానమునకు సంపాదకుండు.'

ఈ వీరకృష్ణుడు కడప మండలమునందలి జనుంపల్లి గ్రామ వాసుడట.

నరసింగకవి గోపాల్పేట సంస్థాన రాజధానియైన గోపాలుపేట పట్టణమును సంపన్నమహితముగా, మనోహరముగా వర్ణించినాడు(45-47/1). వనపర్తి రాజులలో పూర్వుడైన బహిరిగోపాలరావు పేరున గోపాలుపేట నిర్మితము.

గోపాలుపేట రాజవంశమునకు మూలపురుషుడైన పెదకృష్ణుడను రాయకృష్ణో ర్వీవల్లభుడుకుమారుడు. ఈయనకుమారుడు పెదవేంకటభూమీంద్రుడు. చినవేంకట క్షితిప్రభుడుఇతనికుమారుడు. ఈయనకు ఇమ్మడివేంకటపతి అని నామాంతరము. ఈయన కుమారుడు గోపాలరాయుడు. గోపాలరాయునికి సవాయివేంకటేంద్రుడు, రంగనృపాలుడు అని ఇరువురు కుమారులు. వీరిలో రంగనృపాలుడే గోపాలు పేట రాజవంశమునకు శాఖామూల పురుషుడై గోపాలుపేట రాజధానియందు వసించి పాలించినాడు (48-1). ఈయనకు వరుసగా హనుమత్ప్రభుడు, రాయ నృపుడు, సవాయిఘనకీర్తియైన రాముడు, కేశభూపాలసుడు, లక్ష్మణుడు, అయ్య భూవిభుడు అను ఆరుగురు సంతానులుదయించిరి. యాదవభారతీయమున ఏడుగురు కుమారులున్నట్లు పేర్కొనబడినది. వీరిలో జ్యేష్ఠుడైన హనుమంతరాయుడు మిక్కిలి కీర్తిగలవాడుగా రాచకన్యకాపరిణయమున కీర్తితుడు (50-1). గొప్ప వితరణ శీలిగా, పరాక్రమవంతునిగా 'జగత్ప్రసిద్ధ యుద్ధసన్నద్ధ సేనాసమిద్ధ శౌర్యోరుద్ధ దర్పావబద్ధ బుద్ధవిరోధి యూథపాళి జనుపల్లి హనుమభూపాలమౌళి' అని ఈయనను చెన్నకృష్ణ కవి వర్ణించినాడు.

రెండవవాడు రాయనృపాలుడు. ఈయనకు వల్లభరాయడని నామాంతరము. ఈయనకు సంజీవమ్మ, జానమ్మ అని ఇరువురు భార్యలు. సంజీవమ్మకు హనుమంతరాయడు, కాశీపతి, దేవరాయడు అను ముగ్గురు కుమారులును, జానమ్మకు రంగరాయడు అను కుమారుడును కలిగిరి. ఈ జానమ్మ పేరిట జానంపేట వెలసినదట. సంజీవమ్మను విదుషీమణిగా, సత్కవిమందారముగా నరసింగ కవి కీర్తించినాడు.

వల్లభరాయని పుత్రులలో దేవరాయని పరాక్రమమును నరసింగకవి గొప్పగా ఉత్ప్రేక్షించి చెప్పినాడు. (57-1). ఈయనకు నరసింహరాయడు, రామకృష్ణుడు అను ఇరువురు కుమారులు.

రంగనృపాలుని పుత్రుడై, వల్లభరాయని తమ్ముడైన రామరాయడు సవాయి అను బిరుదు పొందినట్టివాడు. ఈయనకు రామరాయడు, గోపాలరాయడు, లక్ష్మణశౌరి అను ముగ్గురుకుమారులు కలిగిరి. వీరిలో గోపాలరాయడు పానుగల్లు రాజధానిగా గల రాజ్యమునకు దేశాయి విభుడై భాగ్యనగర పాదుషా వలన

మన్నెవారితో సాధించి కీర్తికెక్కినాడు (73-1). ఈయన భార్య రత్నమాంబను కవి 'రమ్యసద్గుణ నికరంబ రత్నమాంబ' (77-1) అని గొప్పగా వర్ణించినాడు. వీరికి రామచంద్రా రెడ్డి, రామన్న భూజాని, లక్ష్మారాయడను ముగ్గురు కుమారులు. వీరందరును సుగుణఖనులే. వీరిలో మూడవవాడైన లక్ష్మారాయని అర్ధాంగి కేశవాంబ. ఈమె భువిలో సప్త సంతానములను నిలిపి, యజ్ఞయాగములు చేయించి, ఇష్టాపూర్తములు నిర్వర్తించిన స్త్రీ రత్నముగా కవి పేర్కొన్నాడు. ఈమె గుణగణములను 'జనుంపల్లి కేశవాంబామతల్లి' (84-86/1) అన్నమకుట ములో మూడు సీసపద్యములందు విపులముగా వర్ణించినాడు. ఈమె పేరిట కేశం పేట వెలసినది. వీరి పుత్రుడు వెంకట గోపాలరాయుడు. ఈయన భార్య లక్ష్మీనరసమ్మ. వీరిరువురి కుమారుడే గోపాలుపేట సంస్థానమున మిక్కిలి ప్రఖ్యాతి పొందిన జగపాలరాయడు. ఈయన సర్వసుగుణములతో పురుషోత్తము డుగా వన్నెకెక్కినాడు.

'విక్రాలాది కళాంశశోభితుడు దాతృర్వార్కసూనుండు సా
దృక్పూర్ణాంబుజ పాళిమిత్రుడు మహాధీరస్వభావుండు స
మ్యక్పూతాత్ముడు సద్గుణోత్కరుడు సత్యజ్ఞానసంపన్నుడౌ
జక్పాత్రాయ నృపోత్తముండు పొడమెన్ సంగ్రామభీముండనన్' (90-1)

ఈయన వట్టెం కోదండ రామరెడ్డి కుమార్తెయైన రంగనాయకమ్మను వివాహ మాడినాడు. ఈమెను 'నయగుణకదంబ శ్రీరాంగనాయకాంబ' (93-1) అని నరసింగ కవి కీర్తించినాడు. వీరి కుమారుడైన హనుమంతరాయడే వెల్లూరు నరసింగకవి కృత రాచకన్యకాపరిణయ ప్రబంధ కృతిభర్త.

'ఆయువతియందు జక్పా
త్రాయ నవై బహిరి బహవరాధిపు డెలమిన్
శ్రేయోభివృద్ధి గలిగెన
శ్రీయుత హన్మంతరాయనృప వరు గనియెన్' (94-1)

అని కవి జగపాలరాయనికి హనుమంతరాయడు ఔరసపుత్రుడు. కాని శ్రీకేశవ పంతుల నరసింహశాస్త్రిగారు, శ్రీఖండవల్లి నరసింహ శాస్త్రిగార్ల ప్రత్యక్ష కథనము ప్రకారము హనుమంతరాయడు జగపాలరాయని దత్తకుమారుడని

తెలియుచున్నది. నరసింగకవి ఈ విధముగా చెప్పుటకు కారణము తెలియదు. జగపాలరాయ రంగనాయకమ్మ దంపతులు హనుమంతరాయని దత్తత తీసికొను సమయమునన్నో, వట్టెం నరసింహరెడ్డి నరసింగకవి హనుమంతరాయనికి అంకితముగా 'రాచకన్యకాపరిణయము'ను రచింపుమని కోరి యుండును.

ఈ విధముగా 'రాచకన్యకా పరిణయ' ప్రబంధము అవతరించినది.

## గ్రంథ నామౌచిత్యము

ఉపలబ్ధ లిఖితప్రతియందు కథాప్రారంభమునకు ముందున్న వచనమందును (102-1), ఆశ్వాసాంత గద్యమందును గ్రంథనామము 'రాచకన్యకా పరిణయమ'నియే యున్నది. 'కృత్యాది' లభించనందున గ్రంథారంభమున ఏమియుండెనో తెలియదు. మిగిలిన ఆశ్వాసారంభములందు 'ద్వితీయాశ్వాసము, తృతీయాశ్వాసము' అని ఉన్నదిగాని కవి గ్రంథనామమును ప్రత్యేకముగ పేర్కొనలేదు.

వ్యాకరణ సంప్రదాయానుసారముగా 'రాచకన్యకాపరిణయము' వైరి సమాసమగును. 'కేవల సంస్కృత శబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు' (బా.వ్యా. సమాస. 3) అన్న నియమమునుబట్టి పైప్రయోగము దుష్టమగును. లిఖితప్రతియందు పెక్కులేఖకప్రమాదములు కనబడుచున్నందున ఇది కూడ అట్టివానిలో నొకటియని భావింపవచ్చును. 'రాజకన్యకాపరిణయము' అని యున్నది పొరపాటుగా 'రాచకన్యకా పరిణయ'మని లేఖకప్రమాదజనితముగా ఏర్పడియుండవచ్చును. పైన పేర్కొన్న స్థలములందు తక్క మిగిలిన గ్రంథ భాగమున నరసింగకవి ఎచ్చటను 'చ'కారమును ప్రాసస్థానమున పేర్కొనలేదు. ఆయన రాజకన్యలకు పర్యాయముగా వసుధాధిపకన్యలు, నరనాథుం కన్యలు, విశ్వంభరాధీశకన్యలు, భూపాంతనయలు మున్నగు విధముగా సిద్ధ సమాసరూపములనే ఎక్కువగా వాడినాడు. 'రాచకూతులు'వంటి అచ్చ సమాస రూపములు, 'రాచకన్యకలు' వంటి మిశ్రసమాసరూపములనే ద్విపదయుక్తము లుగ ఒకటి, రెండుచోట్ల ప్రయోగించినాడు.

నరసింగకవి తనరచనలో పెక్కు వ్యవహారప్రయోగములు, స్వతంత్ర ప్రయోగములు చేసినాడు. 'బహుపెద్దల్, కరసాన' వంటివి ఇట్టివి. ఇవన్నియు

ద్విపదయుక్తములు. సమర్థమైన ప్రకారాంతరము లభించువరకు కవి అభిప్రాయమున గ్రంథనామము 'రాచకన్యకాపరిణయము' అనియే భావించుట యుక్తము.

ఇట్టి ప్రయోగములు పూర్వగ్రంథములందును ఉన్నవి. పోతనామాత్యుని శ్రీమహాభాగవతమందలి 'విరటజాగర్భము', 'మద్భుజాబలిమి', 'దానవరాచూలు' వంటి ప్రయోగములు ఇట్టివే. వికృతివివేకకారుడైన అథర్వణుడు ఆరువర్ణములకులోనైన తెలుగుపదము కర్మధారయ సమాసమందు సంస్కృతపదముతో సమసించుటను 'ఆంధ్రం షడ్వర్ణ పర్యంతం పదం స్యాత్కర్మధారయే' (వికృతి.వివే.హలంత.24) అని సమ్మతించినాడు. అందువలన 'వేడిపయోధారలు, వాడిమయూఖములు' వంటి ప్రయోగములు సమ్మతములైనవి. తెలుగున శ్రోత్రానందమును గ్రహించి ప్రకృతి వికృతి శబ్దములు విభక్తిసహితముగా స్వేచ్ఛగా సమసించుచున్నవి అన్నవిషయమును 'సంస్కృతాంధ్ర పదాన్యత్ర సమస్యంతే యథాతథం శ్రుతిరంజన మాదాయ విభక్త్యనివిపభభిక్తిః' (వికృతి.వివే. హలంత 24, 25) అనియు అథర్వణుడు సమ్మతించినాడు. దేనివలన మేటిమునిరాజు, తెలితమ్మి కంటిగేహిని' వంటి ప్రయోగములు సాధువులైనవి.

వీనివంటిదే అయిన 'రాచకన్యకాపరిణయము' అన్నప్రయోగమును నరసింగకవి బుద్ధిపూర్వకముగనే ప్రయోగించి యుండుననుకొనుట సమంజసము కాదు.

—: ౦ :—

# 5. పరిణయ ప్రబంధములు– రాచకన్యకా పరిణయము

తూర్పు చాళుక్యుల కాలమునుండి క్రమాభివృద్ధిని పొందిన ఆంధ్ర కవితా సరస్వతి ఆంధ్రభోజుడు, సాహితీ సమరాంగణ సార్వభౌముడు అయిన శ్రీకృష్ణ దేవరాయల ఆశ్రయమున పరిపూర్ణయౌవనవతియై, ప్రౌఢయై పెక్కు కవితా లంకారములను సంతరించుకొని జగజ్జేగీయమానయై విరాజిల్లినది. రాజకీయ ప్రాభవమునందును, సాహిత్యాభివృద్ధి యందును, శిల్పచిత్రలేఖనాది సకల కళల యందును, భోగభాగ్యముల యందును ఈ చక్రవర్తి పరిపాలనా కాలము స్వర్ణ యుగముగా రాణకెక్కినది. పదునొకండవ శతాబ్దమున ఆంధ్ర సాహిత్యరచన ఆరంభమైనప్పటి నుండి నేటి ఇరువదవ శతాబ్దము వరకును గడచిన వెయ్యి సంవత్సరములందు కృష్ణరాయని కాలము (1509 - 15030) మధ్యస్థమై రత్న హారము నందలి నాయకమణివలె ప్రకాశించినది. ఈ కాలమున ఆంధ్రసాహిత్య ప్రపంచము నందు 'ప్రబంధము' అనెడు అపూర్వ సాహిత్యప్రక్రియ అవత రించినది.

ఆంధ్ర సాహిత్యారామమునందు వెలసిన పరిణత సహకార ఫలమే 'ప్రబంధము'. కృష్ణదేవరాయల భువనవిజయ సభామండపమును అలంకరించిన అల్లసాని పెద్దనామాత్యుడు రచించిన 'మనుచరిత్రము', నంది తిమ్మనార్యుడు రచించిన 'పారిజాతాపహరణము'లు ప్రబంధములుగా పేరు పొందినవి. పిని వరవడిగా ఆంధ్రసాహిత్యమున పుంఖాను పుంఖములుగా పెక్కు ప్రబంధములు ఆవిర్భవించినవి.

. ప్రాచీన సంస్కృతాంధ్ర కవులు, వ్యాఖ్యాతలు, ఆలంకారికులు ఈ ప్రబంధ పదమును 'కావ్యసామాన్యవాచి'గా ప్రయోగించినారు. వారు దీనిని ఒక ప్రత్యేక కవితాప్రక్రియగా పేర్కొనలేదు. కృష్ణరాయల కాలమునాటి పెద్దనాది కవుల రచనలకే ప్రత్యేకముగా 'ప్రబంధములు' అను నూతన సాహిత్య ప్రక్రియగా పేరువచ్చినది.

ఈ కాలమునాటి కవులు అంతకు ముందుండిన అనువాద విధానమును వదలి నూతనముగా స్వతంత్ర కావ్యరచనా విధానమును చేపట్టినారు. కాని ఈ గ్రంథములందలి వస్తువు సంపూర్ణముగా వీరి నూతన సృష్టికాదు. ప్రాయికముగా సంస్కృత పురాణేతిహాసములందలి పరిమితకథను గ్రహించి, దానిని రసానుకూలముగా స్వీయకపోలకల్పనలతో విస్తరించి, అష్టాదశ వర్ణనలతో అలంకరించి స్వతంత్ర కావ్యములగునట్లుగా రచించినారు. అనంతరకాలమున ఈ కావ్యములే 'ప్రబంధము'లనెడు ప్రత్యేక కావ్యప్రక్రియగా సాంకేతికముగా స్థిరపడి, ఆంధ్ర సాహిత్య చరిత్రలో కృష్ణరాయల కాలము 'ప్రబంధయుగము' అన్న పేరుతో వాసిగాంచినది. ఆనాటినుండి నేటి ఇరువదవ శతాబ్దము వరకు విస్తృతముగా ప్రబంధరచన కొనసాగి ఈ ప్రబంధశాఖ బహుముఖములుగా విస్తరించినది.

ఆధునికాంధ్ర సాహిత్యమున ఈ ప్రబంధ ప్రక్రియా వైశిష్ట్యమును ప్రకటించునట్టి విమర్శనాత్మక కృషి గణనీయముగా జరిగినది. ప్రబంధముల విషయమై సమష్టిగను, వ్యష్టిగను పర్యాలోచన కావించినట్టి పెక్కు పరిశోధక సిద్ధాంత వ్యాసములు, లఘువ్యాసములు, వెలువడినవి.

కృష్ణరాయల కాలమునుండి తీవలుసాగిన ఈ ప్రబంధప్రక్రియా సౌభాగ్యమునకు లౌల్యమంది పలువురు ఆంధ్రకవులు పురాణాదులందు ప్రసిద్ధమైన వివాహ గాథలను గ్రహించి ఆయా నాయికా నాయకుల పరిణయములుగా నామమిడి పెక్కు పరిణయ ప్రబంధములను రచించినారు.

## పరిణయ ప్రబంధములు

కవులు నాయికపేరుతోగాని, నాయకునిపేరుతోగాని, నాయికా నాయకులు ఇరువురి పేర్లతోగాని 'పరిణయ' పదమును చేర్చి ఆ యా ప్రబంధములకు నామకరణము చేసిరి. అయినను సాధారణముగా నాయిక నామముతో ఒప్పునట్టి పరిణయప్రబంధములే అధికము. అచ్చట ఈ 'పరిణయ' పదమునకు పర్యాయములైన 'కళ్యాణము, వివాహము' వంటి పదములతోకూడ నామకరణము జరిగినది. ఈ గ్రంథముల నన్నిటిని ఇక్కడ సామూహికముగా పరిణయ ప్రబంధములని వ్యవహరించుట జరిగినది.

ఇట్టివానిలో చంపువులు, ద్విపద కావ్యములు, అచ్చతెనుగు కావ్యములు, ద్వ్యర్థికావ్యములు, అనువాద కావ్యములు మొదలగునవి ఉన్నవి. పదునారవ శతాబ్దమునుండి ఇరువదవ శతాబ్దము వరకును పరిణయ ప్రబంధములు ముప్పాతికపైగా ఉన్నవి. మరికొన్ని గ్రంథములు కూడ రచింపబడినట్లు తెలియుచున్నది. పరిణయము, దాని పర్యాయ పదములతో నొప్పునట్టి నాటకములు, యక్షగానములు, హరికథలు, పాటలు, వచనరూపమున, పద్యరూపమున నున్న కథలు, నవలలు అసంఖ్యాకములు. వీనిలో ముద్రితములు, అముద్రితములు కూడ ఉన్నవి. 'ఆంధ్రవాఙ్మయ సూచిక - ముద్రితాముద్రితముల పట్టిక[1]'ను చూడగా ఉషా పరిణయము, శశిరేఖా పరిణయము, సీతాకళ్యాణము, గౌరీకళ్యాణము, రుక్మిణి పరిణయము వంటి పేర్లతో ఒక్కొక్కదానిని పలువురు కవులు రచించినట్లు తెలియగలదు.

ప్రబంధయుగమునకు సమీప పూర్వమందలి, అనగా పదునేనవ శతాబ్ది ఉత్తరార్థమునకు చెందిన, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు రచించిన 'శకుంతలా పరిణయము' అను నామాంతరము కల్గిన 'శృంగారశాకుంతలము' లభ్యమైన పరిణయ గ్రంథములందు మొదటిది. పినవీరభద్రుడు ఆశ్వాసాంత గద్యలో తన గ్రంథమునకు 'శాకుంతలా పరిణయము' అన్న నామాంతరమును సూచించినాడు. అనంతర కాలమునాటి ప్రబంధ రచనకు మార్గదర్శకములైన కావ్యములలో 'శృంగార శకుంతలము ఒకటిగా పేరుపొందినది.

తర్వాతి కాలమున 'ఇందుమతీ పరిణయము' (కుమార ధూర్జటి, చిత్రకవి అనంతకవి, తెనాలి రామభద్రకవి, కాకునూరి కృష్ణయ్య, పూడిపెద్ది బుచ్చన్న-ద్విపద), 'భానుమతీ పరిణయము' (రెంటూరి రంగరాజు), 'నీలాసుందరీ పరిణయము' (కూచిమంచి తిమ్మకవి-అచ్చతెనుగు), 'వాసవదత్తా పరిణయము' (వక్కలంక వీరభద్రుడు-అనువాదము), 'ధరాత్మజా పరిణయము' (కొత్తలంక మృత్యుంజయుడు-ద్వ్యర్థి) వంటి పెక్కు పరిణయ ప్రబంధములు రచితములైనవి.

వీనివంటిదే వెల్లూరు నరసింగకవి 'రాచకన్యకా పరిణయము'.

ఈ విధముగా ఆంధ్ర సాహిత్యమున ఉన్న పరిణయ ప్రబంధములను ఈ క్రింది విధముగా వర్గీకరించుటకు అవకాశమున్నది.

# పరిణయ ప్రబంధముల వర్గీకరణము




పరిణయము
కళ్యాణము
వివాహము
(లక్షణా వివాహము)
ద్విపదలు
(ఉషా
కళ్యాణము)
చంపువులు
(గౌరీ
కళ్యాణము)
అనువాదములు
(గౌరీ కళ్యాణము)
(కుమారసంభవము-కాళిదాసు)
చంపువులు
ఇవి పెక్కులు
(చంద్రికా
పరిణయము)
ద్విపదలు
(ఇందుమతీ
పరిణయము)
అనువాదములు
(వాసవదత్తా
పరిణయము)
(వాసవదత్త-
సుబంధుకృతము)
ద్వ్యర్థి కావ్యములు
(ధరాత్మజా
పరిణయము)
అచ్చ తెనుగు
కావ్యములు
(నీలాసుందరీ
పరిణయము)

'పరిణయ ప్రబంధము'ల విషయమై చెప్పెడు ఈ వర్గీకరణము తక్కిన ప్రబంధములన్నిటికిని వర్తించును. 'పరిణయ ప్రబంధములు' అన్నవి భాగము ప్రబంధములందలి అంతర్భాగమే కాని, వానికంటే ప్రత్యేకమైన లక్షణవైవిధ్యమున్నవి కాదు. గ్రంథనామకరణాధారముగా మాత్రమే సౌలభ్యమునకై పరిణయ ప్రబంధములను వేరుగా చెప్పుట జరిగినది. పరిణయమన్న పేరులేక పోయినను వసుచరిత్ర, ప్రభావతీ ప్రద్యుమ్నమువంటి ప్రబంధములందును నాయికానాయకుల పరిణయమునకే ప్రాధాన్యమున్నది.

## రాచకన్యకాపరిణయము

ఆంధ్ర సాహిత్యమున ప్రబంధములు పెక్కులుండగా, వానియందు కృష్ణరాయల యుగమున వెలసిన ప్రబంధములుకొన్ని, దక్షిణాంధ్ర యుగమున వెలసిన 'విజయవిలాసము' వంటి ప్రబంధములు మాత్రమే పేరుపొందినవి. మిగిలినవన్నియు, ఒకటి చదివిన తక్కినవి ఎట్లుండునో చెప్పవచ్చునట్లుగా, స్వతంత్రత కొరవడినవై, చర్విత చర్వణములై, పిష్టపేషణ ప్రాయములైనవని సాహిత్యవేత్తల అభిప్రాయము.

'దక్షిణాంధ్ర యుగమునాటి కవులు సభ్యతామర్యాద నతిక్రమించి దుర్నీతికరమును, జుగుప్సాకరమును అగు శృంగారరసమును హెచ్చుగా వర్ణించిరనియు, వారియందు స్తుత్యమైన ప్రతిభ క్షీణించి హేయమైన అనుకరణమే ప్రబలినదనియు' విమర్శలుండినవి.

'ప్రబంధములందలి ఇతివృత్తములు, సాధారణముగా, ప్రతిధ్వనులవలె నున్నవి. కల్పనలు కూడా అంతే. ఏ కావ్యమున చూచినను నాయికానాయకుల కలయిక, ప్రేమలు, ఎడబాటు, విరహబాధ, పునస్సమాగమము, వివాహము, సంభోగము అన్నదే నిర్మాణ సూత్రముగ నున్నది. ఈ పద్ధతి ఆంధ్ర సాహిత్యమునకేకాదు. ఇతర దేశములందును ఉన్నది. అమెరికా, హాలీవుడ్ సినిమాకథలందును, బ్రాడ్వే నాటకములందును కథా ప్రణాళికలిట్లే ఉన్నవి. 'బాయ్ మీట్స్ దిగర్ల్, బాయ్ లూజెస్ దిగర్ల్, బాయ్ గెట్స్ ది గర్ల్' అన్న ఫార్ములా మీదనే ప్రచారముకోరు కథలన్నియు ఆధారపడియున్నవి' అన్నది శ్రీ ఆరుద్రగారు వెలిబుచ్చిన అభిప్రాయము.

పెక్కు ప్రబంధములందు విస్తారమైన వర్ణనలున్నను అందులో నిజముగా కథా నిర్వహణమునకు అవసరమైనవి ఎన్ని అన్న విషయమున స్పష్టమైన సమాధానము లభింపదు.

ఇది ఇట్లుండగా, 'కృష్ణరాజకన్యకా పరిణయగాథ'ను గ్రహించి వెల్లూరు నరసింగకవి రచించిన 'రాచకన్యకాపరిణయము' తక్కిన ప్రబంధముల కంటే ప్రధానముగా రసవిషయమున వైవిధ్యమును కలిగియున్నది. రసములలో మధురభక్తికి రసరాజ పట్టము కట్టినాడు. ఇందు కేవలము శారీరక సుఖమును కలుగజేయు స్త్రీ పురుషుల రతిరోచకమైన లౌకిక శృంగారము కాక, శాశ్వతానంద సంధాయకమై, అనిర్వాచ్యమైన అపరోక్షానుభూతిని కలిగించునట్టి భగవద్రతిక మైన ఉజ్జ్వల శృంగారమున్నది. ఈ రసమునకు అనుగుణమైన రీతిలోనే ఇతి వృత్త నిర్మాణము, పాత్రచిత్రణము, సన్నివేశ కల్పనము, సాభిప్రాయ పద ప్రయోగము, వర్ణనలు, అలంకారములు మున్నగువానికి కవి రూపుదిద్దినాడు.

ఒక కవి ప్రతిభకుగల ముఖ్య కారణములలో పాత్ర నిర్మాణ కౌశల మొకటి. సామాన్య కవులందరకును సజీవపాత్ర నిర్మాణ కౌశలము అబ్బునది కాదు. ప్రబంధ కవులందరకును ఇది యున్నదని చెప్పవలను పడదు. పెద్ద నార్యుని మనుచరిత్ర మందలి 'వరూథినీ ప్రవరులు', తిమ్మన పారిజాతాప హరణ మందలి 'సత్యభామ', ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యము నందలి 'తిన్నడు', తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము నందలి 'నిగమ శర్మ అక్క', పింగళి సూరన కళాపూర్ణోదయ మందలి 'కలభాషిణీ మణికంధ రులు, సుగాత్రీశాలీనులు, సుముఖాసత్తి మణిస్తంభులు', ప్రభావతీ ప్రద్యుమ్న మందలి 'శుచిముఖి', కృష్ణరాయల ఆముక్తమాల్యద యందలి 'మాలదాసరి', చింతలపూడి ఎల్లనార్యుని రాధామాధవ మందలి 'గాథ', చేమకూర వేంకట కవి విజయవిలాస మందలి 'ఉలూచి,సుభద్ర' మొదలైనవి సజీవపాత్రలు. ప్రబంధ కవుల ప్రత్యేకత ఇట్టి పాత్ర నిర్మాణ నైపుణియందే కానగును. ఇట్లే వెల్లూరు నరసింగకవి రాచకన్యకా పరిణయమందలి 'బలరాముడు, రాజకన్యలు' పైవానికి జతవచ్చునట్టివే. నరసింగకవి అపూర్వమైనరీతిలో, అద్భుత సంవిధాన చాతుర్య ముతో 'బలరాముని' జీవత్పాత్రగా రూపకల్పన గావించినాడు.

ప్రబంధ కవితకు వర్ణన ముఖ్యాంగము. పదునెనిమిది, ఇరువదియైదు, ఇరువది ఆరు, ఆఖరుకు ముప్పదినాలుగు వరకు ఈ వర్ణనం సంఖ్య పెరిగినది. నరసింగకవి కూడ వర్ణనాప్రియుడే. ఈయన దాదాపు ముప్పది వర్ణనం కావించి నాడు. అయినంత రెండువంతులు ఈయన గ్రంథమున వర్ణనలాక్రమించినవి. అయినను నరసింగకవి పురవర్ణనాది వస్తురూప వర్ణనలను, మద్యపానాది చేష్టాదుల వర్ణనంను, ఉద్యానవన విహార పుష్పదోహదాది ప్రాకృతిక వర్ణనంను రసాంగములుగ చేసినాడు.

కావ్యమునందలి అలంకారములు స్త్రీల ఆభరణముల వలె పెట్టు సొమ్ములే కాని, అంతస్సౌందర్యద్యోతకములు కావని పూర్వాలంకారికులలో కొందరి మతము. కాని ప్రబంధ కవులు రసనిష్పత్తికి అలంకారములకు ప్రాధాన్యమిచ్చి వానిని రసోపస్కారకములుగా చేసినారు. వెల్లూరు నరసింగ కవి కూడ అనుప్రాస యమకములను, శ్లేషోత్ప్రేక్షలను విరివిగా వాడినను సాభిప్రాయపదప్రయోగతతో నొప్పు పరికర, పరికరాంకురములందు ఈయనకు అభిమానము ఎక్కువగా గోచరించును. రాజకన్యల భక్తిని ఆవిష్కరించుటలో నరసింగకవి ప్రతిపదమును తూచితూచి సాభిప్రాయముగా ప్రయోగించినాడు. నవ్యార్థాల చమత్కారాలు ఉన్న కావ్యములలో నిజమునకు పొల్లు మాటలుండకూడదు. దీనినే అర్థగౌరవము అన్నారు. మద్యపానమత్తచిత్తలైన రాజకన్యలను నరసింగకవి శ్రీకృష్ణవేణు గానామృత మత్తచిత్తలుగా భావింపజేసినాడు. ఇచ్చట రాజకన్యలను నీలవేణులు' అన్న స్త్రీ సంబోధకమైన సమాస పదముతో చెప్పినాడు. 'నల్లని వేణికలవారు' అన్నది దీని సాధారణ విగ్రహ వాక్యము. కాని దీనిని 'నీల-ఉజ్జ్వలనీలమణియైన కృష్ణుని, వేణులు-వేణుగానలాలసలు' అన్న గౌరవార్థ స్ఫోరకముగా ప్రయోగించి నాడు. ఇట్టి హృద్యభావభరితము నరసింగకవి రచన.

ఇట్టి కారణములచేత ఆంధ్రసాహిత్యమున 'రాచకన్యకాపరిణయ' ప్రబంధమునకు ఒక ఉత్తమ ప్రబంధమన్న స్థితి గలిగి, ఆంధ్రసాహిత్య సరస్వతికి ఒక అపూర్వాలంకారమై విరాజిల్ల గలదనుట అక్షర సత్యము.

—: o :—

# 1. ఇతివృత్త నిర్మాణము

రాచకన్యకాపరిణయము మందలి కథ ప్రఖ్యాతము. వెల్లూరు నరసింగరావు ఇందలి కథను సంస్కృత భాగవత హరివంశము, పోతనామాత్యుని భాగవతము, నంది తిమ్మన పారిజాతాపహరణముల ఆధారముగా సిద్ధము చేసికొన్నాడు.

శ్రీకృష్ణుడు నరకాసురుని వధించిన పిమ్మట ఆ రక్కసుడు బంధించి యుంచిన పదునారువేల మంది రాజకుమార్తెలను వివాహమాడిన వృత్తాంతమును గ్రహించి దాదాపుగా మూలానుసారముగనే ప్రబంధ కథను రూపొందించుకొన్నాడు.

## సంస్కృత భాగవత మందలి కథ

శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో శ్రీకృష్ణుడు రుక్మిణ్యాది అష్ట వనితలను వివాహమాడిన అనంతరము 'భూపుత్రుడైన నరకుని సంహరించి, అతడు బంధించిన వేలకొలది సౌందర్యవతులను భార్యలుగా పొందినాడు[1]' అని చెప్పినాడు.

అప్పుడు పరీక్షిత్తు 'నరకుడు స్త్రీలను ఎందుకు బంధించినాడు. అతనిని కృష్ణుడెట్లు సంహరించినాడు. ఆ శార్ఙ్గి పరాక్రమమును తెలుపవలసినది' అని యడుగగా మునీంద్రుడు సాంగముగా ఆ కథను వివరించినాడు.

ఛత్రము, కుండలములు, అమరాద్రిస్థానములు నరకాసురుని కారణముగా కోల్పోయిన వాడైన ఇంద్రుని ప్రార్థనను అంగీకరించి శ్రీకృష్ణుడు సత్యభామా సహితుడై నరకునిపైకి దండయాత్రకు వెడలినాడు. ప్రాగ్జ్యోతిషపురము ప్రవేశించి, మురాసురుని పాశములను త్రుంచి, సుతసహితముగా అతనిని యుద్ధరంగమున కూల్చినాడు. పిమ్మట నరకుడు కృష్ణునితో రణమున తలపడి చక్రఖండితశిరస్కుడై

మడసినాడు. అప్పుడు తన పౌత్రుడైన భగదత్తునితో భూదేవి శ్రీకృష్ణుని శరణు కోరి, తమ ఆతిథ్యమును స్వీకరించి, బాలుని పైతృకరాజ్యపదస్థుని కావింపుమని వేడుకొన్నది. శ్రీకృష్ణు డామెకు అభయమొసగి భగదత్తునికి పట్టాభిషేకము గావించి, పురసౌందర్యము చూచు నెపమున నరకుడు బంధించి యుంచిన రాజకన్యలను చూచినాడు. ఆ విధముగా వచ్చిన కృష్ణుని రాజకన్యలు విమోహితలై చూచి తమకు దైవోపపాదితుడైన పతిగా అతనిని వరించిరి. శ్రీకృష్ణుడు వారందరిని సాలంకృతల గావించి భగదత్తుని సైన్య సంరక్షణలో ద్వారకానగరమునకు పంపినాడు. తాను సత్యాసహితుడై అమరావతికి వెళ్ళి, అదితికుండలములను, వరుణుని ఛత్రమును సమర్పించి ఇంద్రుని పూజలను అందుకొన్నాడు. ఆ తర్వాత సత్యభామచే ప్రేరితుడై దేవతలను నిర్జించి పారిజాత వృక్షముతో ద్వారకానగరము చేరినాడు. అంతట పదునారువేల మంది రాజకన్యలను వివాహమాడి, వారిని అనురూపములైన ప్రత్యేక మందిరములందుంచి, సమస్తమైన గార్హస్థ్య సౌఖ్యములను అనుభవించినాడు. ఈ విధముగా రాజకన్యలు శ్రీకృష్ణుని పతిగా పడసి బ్రహ్మాదులు సైతము పొందలేని ఉత్కృష్టపదము చేరినారు[3].

స్థూలముగా సంస్కృత భాగవతమందలి కథ ఇది.

## సంస్కృత హరివంశము నందలి కథ

సంస్కృత హరివంశమున ఈ కథ ఇంకను కొంత విపులముగనున్నది. కాని నరకాసురుడు వివాహార్థమై బంధించి యుంచిన కన్యలు ఎందరు, ఏ జాతి వారు అను విషయమున సంస్కృత భాగవత హరివంశములందు భిన్నముగా నున్నది. భాగవతమున పదునారువేల సంఖ్యను మించిన వారుగను, వారందరును రాజకన్యలుగను చెప్పబడినది.[4] హరివంశమున ఆ కన్యలు దేవగంధర్వ-అప్సర మనుష్యజాతులకు చెందిన వారుగను, పదునారువేల మీద ఒక వంద మందిగను ఉన్నది.[5]

హరివంశమున కూడా ఇంద్రుడు కృష్ణునితో నరకుని దుశ్చేష్టితములను వివరించి, అతనిని వధించి తమ్ము కాపాడుమని కోరినాడు. వెంటనే కృష్ణుడు సత్యభామాసహితుడై ఇంద్రునితో కలిసి[6] అప్పుడే నరకునిపైకి దండయాత్రకు

పెడలినాడు. ప్రాగ్జ్యోతిషమున రక్తాక్షుడు, మురుడు, నిసుంభుడు, హయగ్రీవుడు, విరూపాక్షుడు మొదలగు ఆప్తులతోపాటుగానున్న నరకుని శ్రీకృష్ణుడు యుద్ధరంగమున కూల్చినాడు. పిమ్మట భూదేవి మనుమనితో వచ్చి శరణుకోరినది. ఆమె కోరికమేరకు నరకరాజ్యమునకు అతని పుత్రుని అభిషేకించి కృష్ణుడు మణి పర్వత ప్రాంతమున నరకాసుర బంధితలైన కన్యలను చూచినాడు. అప్పుడా కన్యలు శ్రీకృష్ణుని మోహపరవశలై చూచి భర్తృభావమును పొందినారు.[7] పిమ్మట వారు అంతకు పూర్వమే నారదమహర్షి తమకు శ్రీకృష్ణుడు పతి కాగలడని చెప్పినట్లుగా పేర్కొన్నారు.[8] మిగిలిన కథ భాగవతమందువలెనే ఉన్నది.

నరసింగకవి సంస్కృత భాగవతము ననుసరించి నందలి పదునారువేల రాజకన్యల సంఖ్యను స్వీకరించినాడు. సంస్కృత హరివంశాధారముగా నారదుని రాజకన్యల సందేశహారకునిగా తీర్చినాడు.

## ఆంధ్ర మహాభాగవతము

పోతన భాగవతమునందలి కథ వ్యాసభాగవతము ననుసరించియే ఉన్నది. పోతనామాత్యుడు మనోహరముగా పెంచిన సత్యభామా నరకాసురుల యుద్ధ ఘట్టమును నరసింగకవి యథాతథముగా స్వీకరించినాడు.

## పారిజాతాపహరణము

తిమ్మనార్యుని పారిజాతాపహరణమునందలి పారిజాత వృత్తాంతమును నరసింగకవి తన గ్రంథమున ఆద్యంతములందు పొందుపరచినాడు. నారదాగమనము, పారిజాతపుష్ప ప్రదానము, సత్యభామ అలుక, కృష్ణుని సాంత్వనము మున్నగు అంశములను ఆరంభమున, పారిజాతవృక్షాపహరణము, కృష్ణేంద్రుల యుద్ధము, పారిజాత ప్రతిష్ఠ మున్నగు అంశములను గ్రంథాంతమున కవి అను సంధించినాడు.

## రాచకన్యకా పరిణయ ప్రబంధ కథ

వీని ఆధారముగా నరసింగకవి ఈ విధముగా తన రాచకన్యకా పరి యమునందు ఇతివృత్తమును మలచుకొన్నాడు. భాగవతమునందువలెనే ఇందు

శుకయోగీంద్రుడు వక్తగా, పరీక్షిన్మహారాజు శ్రోతగా ఉన్నారు. స్థూలముగా ఇందలి కథ-

# ప్రథమాశ్వాసము

బహుకథానుభూతి నిరతుడైన పరీక్షిత్తు కనకాంశుకము నిజాంగమున గప్పు సురనుత నీలాంశుకమూర్తి కథలు లీలాశుకము గతిని చెప్పగల (1-104) శుకమునిశేఖరుని ఈ విధముగా అడిగినాడు.

'హరి పదియారువేల వసుధాధిప కన్యల నెవ్విధంబునం
బరిణయమయ్యె నాయమృతభాను నిభాస్యలనేకరొక్కడా
సరసిజనేత్రలందరికి సమ్మతిగాగ మెలంగు టెట్లు సు
స్థిరమతి నమ్మనోహరు విచిత్ర చరిత్రమెరుంగ జెప్పవే' (1-105)

అప్పుడా తాపసవర్యుడు 'అనఘా! వెన్నుని చరితము వినుమని' చెప్ప మొదలిడి ద్వారకాపురమును, అందలి సౌధ ప్రాకారఖేయాదులను, చాతుర్వర్ణ్యము, చతురంగ బలములను విస్తరఫణితితో వివరించినాడు. అట్టి ద్వారకా నగరమున 'సురద్విషద్వారక చక్రధారియైన శౌరి దయామృత పూర్ణకటాక్ష వీక్షణాయామ ధురాధరుడై 'సమస్త జనులకు స్వర్గసుఖములు కలుగజేయు చుండెను. ఆవనజాత నేత్రుడు, ఆయన అగ్రజుడైన తాలాంకుడు దివ్యమూర్తులతో దీప్యద్రత్న సింహాసనస్థులై యుండిరి. ముందుగా కళ్యాణవతియైన రేవతీ రమణిని బలరాముడు వివాహమాడినాడు. అనంతరము కృష్ణుడు రుక్మిణాది అష్టభార్యలను వివాహమై వారియందు ఏ విధమైన భేదభావములు లేకుండునట్లుగా తన దక్షిణ నాయకత్వము ప్రఖ్యాతి వహించునట్లుగా భోగించుచుండెను.

ఇట్లుండగా కృష్ణుడు ఒకనాడు రుక్మిణీమందిరమున ఉన్న సమయమున దేవమునియైన నారదుడు ఆయనను దర్శింపవచ్చినాడు. భార్యాసహితుడై కృష్ణుడా మహర్షిని అర్హోచితవిధుల గారవించినాడు. నారదుడు శ్రీకృష్ణుని దశావతార యుక్తముగా పెక్కు విధముల స్తుతించి, ఆకాశగంగోద్భవమైన తామరపు టాకుమాటున పొందుపరచిన పారిజాతకుసుమమును సమర్పించినాడు. కృష్ణుడు దానిని కన్నుల కద్దుకొని గ్రహించి, దానిని తన భార్యలలో ఎవ్వరికి పంప

వలయునా యని ఇంచుక విచారించెను. కలహభోజనుడప్పుడు సమక్షముననున్న రుక్మిణి కొసంగుమని కనుసన్న చేసెను. కృష్ణుడు భోజకన్యకకు ఆ పుష్పమును ఇచ్చినాడు. అంతట పారిజాత సుమమును సిగలో సింగారించిన రుక్మిణి సోయగమును నారదుడు పలువిధముల కొనియాడి కలహవాక్సంపాదియై అభిమానవతియైన సత్యాకాంతను తూలనాడినాడు. అప్పుడు ప్రసంగవశమున తాను ప్రాగ్జ్యోతిషమున కేగినట్లును, అందు భూపుత్రుడైన నరకునిచే బంధింపబడిన ధరిత్రీవర కన్యకామణులను దర్శించినట్లును తెలిపినాడు. ఆ రాజకన్యలు తమ సందేశమును కృష్ణునితో నివేదించుమని తనను ప్రార్థించినట్లు చెప్పినాడు.

'విగ్రహజాగ్రదుగ్ర భుజవీర్యముచే నరకున్వధించి నీ
విగ్రహణంబొనర్చి ననవింటి వజీరునివంటి నీలస
ద్విగ్రహ సంగతిన్ శుభమతిన్ గనజేసితివేని మమ్ముఖా
విగ్రహబాధ లంటవని వెన్నునితో నిటు విన్నవించుడీ' (187-1)

అని తెలిపిరనియు, అప్పుడు తాను వారికి అభయమొసగి వచ్చితిననియు కృష్ణునికి చెప్పి, అతనికి ఇంపు జనించునట్లుగా ఆ రాజకన్యకా సౌందర్యమును విస్తారముగా వర్ణించినాడు. 'భూమినందన దనుజుని వధించి ప్రమదముతో ఆ పదియారువేల భామినుల వరించుమని' కృష్ణునికి నివేదించి నారదుడు ఆయన యొద్ద సెలవు గైకొని వెళ్ళెను. శ్రీకృష్ణుడు నరకాసుర సంహారమునకు కృతనిశ్చయుడయ్యెను.

## ద్వితీయాశ్వాసము

నారదుడు రుక్మిణీ మందిరమునకు రాకమునుపే అచ్చట ఉండిన సత్యభామ దూతిక అందు జరిగిన విషయములన్నియు సరభసగతిన వెళ్ళి తన దొరసానికి ఆమె హృదయము భగ్గుమనునట్లుగా వివరించినది. ఆ మాటలువిన్న ఆ యభిమానవతి 'దండతాడిత రుషద్దర్యక్ష భార్యావిధంబున జనితామర్ష కషాయితాక్షి'యై శ్రీకృష్ణుని విలువిధముగా నిందించినది. పిమ్మట ధూర్త గోపాలుని నమ్మి మోసపోయితినని ఘూర్ణితమనస్కయై 'మణిభూషణాది శృంగారములను సడలించి పేద ముత్తవదయివలె' కోపాగారము చేరినది.

అప్పుడు రుక్మిణీ మందిరమున ఉన్న కృష్ణుడు తనకు సాత్రాజితి వలన 'ఏమేమి కష్టములు రానున్నవో' యని తలచి వాయువేగమును హసించు రథ మెక్కి సత్యాసదనము చేరినాడు. అక్కడ కృష్ణుడు రంజన రహిత గృహాం తర్భాగమును చూచి, భార్య కాపట్యమును గ్రహించి, ఆమె చెలులకు లంచము లిచ్చి తృప్తిపరచి సతిజాడ తెలిసికొనెను. పిమ్మట కోపమందిరమును ప్రవేశించి అక్కడ సత్యభామకు చెలికత్తె వీవన వీచుచుండగా చూచి, తాను ఆ తాళవృంత మును స్వీకరించి విసరుచు కోపనివారణార్థము సత్యాసతితో అనేక విధములుగా సాంత్వన వాక్యములు పలికినాడు. ఎన్ని నయగారములకును ఆమె కటాక్షించ నందున 'పాదపతనమే' తనకు మిగిలిన కర్తవ్యమని కృష్ణుడు తలచినాడు. అప్పుడు సత్యభామ

'అతని తలంపు తానెరిగి యప్పువుబోణి హృదంతరాళ గుం
భితమగు చింతచేమిగుల భీతిలి సయ్యన గూరుచుండి 'య
చ్యుత! యిటసేయవచ్చిన కుచోద్యములెల్లను గంటినీవు నీ
చతురిమ భోజపుత్రికడ సల్పు' (87-2) మని ఆతనికి పాదాభివందనము

నకు అవకాశమివ్వలేదు. పంచదారలో గరళమువంటి అతని వర్తనలను పరిపరి విధములుగా నిందించుచు వలవల యేడ్చినది. అప్పుడు కృష్ణుడు ఆమెను లాలించుచు అక్కున జేర్చుకొని 'పుష్పమాత్రమునకో విను నేనాఖండలు గెల్చి పారిజాత తరువునే నీగృహారామ మధ్య దేశమున ప్రతిష్ఠింతునని' ప్రతిన చేసినాడు. ఆ మాటలకు సత్యభామ సమ్మదమొందినది. పిమ్మట వారిరువురును స్నానాదికములను ముగించుకొనిరి.

ఆ సమయమున త్రింశత్కోటి దేవతాయుక్తుడైన ఇంద్రుడరుదెంచి కృష్ణుని పెక్కు విధములుగా స్తుతించినాడు. ధరణీసుతుడైన నరకాసురుని ఆగడ ములను వివరించి, వాని బాధనుండి తమనుకాపాడుమని వేడుకొన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు 'క్షితిసుతుకార్యమెంత? అతిశీఘ్రముగా వధియింతు'వానినని అంచితశీలం తనయింట విందారగించవలసినదని దేవేంద్రుని కోరినాడు. భోజ నాదికములు ముగిసిన పిమ్మట తనవారందరితో పురందరుడు కృష్ణుని ఆమం త్రించి అమరావతికి వెళ్ళినాడు.

మరునాటి ఉదయమున శ్రీకృష్ణుడు సభలో తాను భూనందనదనుజునిపై దండయాత్రకు వెళ్ళుచున్నట్లు ప్రకటించి వినతానందనుని తలచినాడు. వైనతేయుని ఆగమనానంతరము వాసుదేవుడు సాయుధుడై ప్రస్థానోద్యుక్తుడు కాగా, సత్యభామ తాను కూడ అతనివెంట వత్తుననెను. కృష్ణుడు ఆమెను రావలదని ఎన్నివిధముల అభ్యంతర పెట్టినను వినక ఆమె బ్రతిమాలి అతనిని ఒప్పించినది. అంతట కృష్ణుడు భార్యాసహితుడై గరుడుని అధిరోహించి ప్రాగ్జ్యోతిషాభిముఖముగా వెళ్ళి మార్గమధ్యమునందలి వింతలను సత్యభామకు వివరించుచు, ఆమోద సూచకములైన శుభశకునములు తోచుచుండగా తత్పుర సమీప శైలాగ్రమున విడిసి తాంబూల చర్వణాదికములను ఆచరించినాడు.

అప్పుడు ప్రాగ్జ్యోతిషమున నరకాసురునకు అనేకములైన దుర్నిమిత్తములు కన్పట్టెను. అంతట నరకుడు తనవారినందరిని రప్పించి సభలో తన మంత్రులతో శ్రీకృష్ణుడను యాదవుడు తన ఆప్తులైన కంసాదులను సంహరించి విర్రవీగుచున్నాడని తెలిపి అతనిపై దండయాత్రకు సిద్ధపడవలసినదని ఉద్బోధించెను. ఆ సమయముననే కృష్ణుడు ప్రాగ్జ్యోతిషము నందలి సమస్త దుర్గచయమును భంజించి, మురప్రచ్ఛన్న పాశములు ద్రుంచి పాంచజన్యమును పూరించినాడు. ఆ ధ్వనికి పంచశిరుడైన మురాసురుడు నిద్రసాలించి, జలములనుండి వెడలివచ్చి కృష్ణునితో తలపడగా, కృష్ణుడతనితో కొంతసేపు పోరాడి చక్రముతో వాని శిరములను ఖండించినాడు. పిమ్మట మురపుత్రులు ఏడుగురిని వధించినాడు. అప్పుడు తనవారందరు యుద్ధరంగమునకు బలియైన విషయము తెలిసి, సక్రోధుడై లక్షాక్షోహిణి సైన్యముతో నరకాసురుడు ఆహవరంగమునకు వచ్చెను. అతనిని చూచి సత్యభామ వీరాలంకారయుక్తయై యుద్ధముచేయు తలంపుతో తన ప్రాణేశాగ్రభాగమున నిలిచినది. అప్పుడు శ్రీకృష్ణుడు ఆమెతో 'యుద్ధమువలదన్నను' వినకుండుట ఆమెకు తన ధనుస్తూణీరములను అందివ్వగా ప్రత్యాలీఢపాదయై నిలిచి సత్యాసతి నరకునితో దురమొనర్చినది. నరకుని ఫాలభాగమున ఒక చటులాంబకమును నాటించగా భూపుత్రుడు మూర్ఛనొందెను. అప్పుడు ఒక రక్కసుడు అతనిని యుద్ధరంగమునుండి తప్పించగా, మిగిలిన సేనలన్నియు సత్యభామచేతిలో ఓడిపారెను. కృష్ణుడప్పుడు సాత్రాజితీ శౌర్యమును మిక్కిలిగా సంభావించినాడు. అంతట భూసుతుడు లబ్ధస్మృతుడై

శేషమైన నక్తంచరసైన్యమును కూర్చుకొని మరల యుద్ధరంగమునకు వచ్చి, హరిని నిందించి, పోరాడి చక్రచ్ఛిన్న శిరస్కుడై మరణించినాడు.

అంతట భూదేవి తన పౌత్రుడైన భగదత్తునితో శ్రీకృష్ణుని దర్శించి స్తుతించి నరకుడు హరించిన అదితికుండలములను, వరుణుని ఛత్రమును సమర్పించినది. తన మనుమని కరుణించి, పైతృకరాజ్య పదస్థునిగావించి, తమ ఆతిథ్యమును స్వీకరించి వెడలుమని భూకాంత కృష్ణుని అర్థించినది. అందులకు కృష్ణుడు అంగీకరించి భగదత్తునకు పట్టముకట్టి పురశృంగార విలోకనమునకై వెడలి మార్గమధ్యమున ఒక మణి విస్తృత సౌధమును చూచినాడు. అందులో నరకునిచే బంధింపబడిన రాజకన్యలను గాంచి వారి వృత్తాంతములను వివరించుమని యడిగినాడు. అప్పుడువారు, ఆవిధముగా తమనుబంధించి, తమకు కృష్ణ సందర్శనావకాశమును కలిగించిన నరకుని కృత్యమును కొనియాడి, తమ తమ వివరములను తెలిపి, తమను భార్యలుగా స్వీకరించ వలసినదని ప్రార్థించిరి. కృష్ణుడు వారిప్రార్థనను మన్నించి. వారికి స్నానాద్యలంకారములు కావించి, ఏకాక్షోహిణి సైన్యరక్షణతో వారిని ద్వారకకు పంపుమని భగదత్తునితోచెప్పెను. ఆవిధముగా కృష్ణప్రేషితలైన రాజకన్యలు సముద్రమునుదాటి రైవతకాద్రి సమీపమున విడిదిచేసిరి.

రాజకన్యకా ప్రేషణానంతరము కృష్ణుడు ప్రాగ్జ్యోతిషము నుండి సత్యా సహితుడై అమరావతికి వెడలినాడు. ఇంద్రపట్టణ బహిర్ద్వార దేశమును చేరి దేవాళి మనములు అలరునట్లుగా పాంచజన్యమును పూరించినాడు. అప్పుడు ఇంద్రుడు సపరివారుడై కృష్ణునికి ఎదురేగి గారవించి హరితో తన మందిరమునకు చేరినాడు. కృష్ణుడు దేవమాతనుగాంచి మ్రొక్కి కుండలములను సమర్పించి దీవనలు పొందినాడు. మాత్రాజ్ఞచే ఉపేంద్రుడు స్వర్గమున కొంత కాలము సమస్త భోగములు అనుభవించుచు వసించెను. స్నేహ భావముతో కృష్ణుడు వరుణునకు నరకుడపహరించిన ఛత్రమును ఇచ్చినాడు.

## తృతీయాశ్వాసము

ద్వారకానగరమున బలరాము డొకనాడు సభతీరియుండి మంత్రులతో 'నరకుని సంహరింప వెళ్ళిన కృష్ణుడు ఇంకను ఏలరాడొకో' యని విచారమును

వెలిబుచ్చెను. అప్పుడు వారు 'దుష్ట సంహారణము కొరకై పుడమిలో జన్మించిన హరియగు కృష్ణుడు ఆ రాక్షసుని దునిమియే రాగలడనియు, అందుంకై చింతింప వలదనియు' బలరామునితో చెప్పిరి.

ఆ సమయమున రైవతకాద్రి సమీపమందలి అరణ్యావాసులైన చెంచులు వారి జాత్యుచిత వేషభాషలతో బలరాముని దర్శించి కానుకలర్పించి రైవతకాద్రి నికటారణ్యమున వేటాడరమ్మని ప్రార్థించిరి. అంతట బలరాముడు సపరివారుడై వేటకు వెళ్ళి, అడవిలో అశాంతికి కారణమైన పెక్కు క్రూరమృగములను వధించి నాడు. అనంతరము రైవతక పర్వత సౌందర్యము చూచుటకై దానిపైకి వెళ్ళి, ఆవలివైపున విడిదిచేసిన ఒకానొక బృహత్సైన్యమును చూచెను. దాని నతడు తమపైకి దండయాత్రకు వచ్చిన పరసైన్యముగా భావించి ఆ విషయమును మంత్రులతో విచారించినాడు. వారు దానిని చూచి 'అదిశత్రుసైన్యము వలె కనబడక ప్రేమాస్పదమై తోచుచున్నదని' చెప్పిరి. అంతట బలరాముడు దానివిషయమును తెలిసికొని రమ్మని కొందరు చారులను పంపెను.

ఆ సైన్యము, అంతకు ముందుగనే రాజకన్యలకు రక్షణగా పంపబడి అక్కడ చేరిన భగదత్తుని సైన్యము. బలరాముని చారులు ఆ సైన్యము వద్దకు వెళ్ళి ఆ సైన్యాధిపతుల వృత్తాంత మడిగిరి. అప్పుడు వారు తాము భగదత్తుని సేవకులమనియు, కృష్ణుడే వారినటకు పంపినాడనియు చెప్పి ప్రాగ్జ్యోతిషమున జరిగిన మురనరకాసురవధ, సత్యభామ పరాక్రమము, రాజకన్యకా ప్రేషణము మొదలగు అంశములన్నియు వివరించిరి. అంతట చారులు మరలివచ్చి బల రామునికి ఆ వృత్తాంతమంతయు వినిపించిరి. వారి మాటలు విని సంకర్షణుడు సత్యభామ పరాక్రమమునకు ఆశ్చర్యామోదములనుపొంది, రాజకన్యలను భగ దత్తుని సేనా నాయకులను తనవద్దకు పిలిపించుకొనెను. వారందర్నీ తన వద్దనే భుజించవలసినదని ఆహ్వానించినాడు. బలరాముడు తనకు నమస్కరించిన రాజ కన్యల సౌందర్యమునకు మురిసి వారి వివరములు తెలిసికొని ఆనందించినాడు. పిమ్మట అందరును భోజనాదికములను ముగించిరి.

ఆ సమయమున వరుణదేవుడు బలదేవునికి వారుణిని కానుకగా పంపినాడు. ఆ మదిరాపానముచే రాజ్యకన్యలందరను ప్రమత్తులై పరిపరి విధముల కృష్ణాను

రక్తిని ప్రశంసించిరి. అప్పుడు బలరాముడు వారితో 'ప్రొద్దు పోయినది నిద్దుర పొందని' చెప్పి ఆ మరునాడే రామందరు ద్వారకకు వెళ్ళుచున్నట్లు తెలిపినాడు. పిమ్మట బలరాముడు విశ్వకర్మను స్మరించగా అతడు వచ్చినాడు. అతనితో ఆ మరునాటికే తయారగునట్లుగా ద్వారకానగరమున వేరువేరుగా రాజకన్యలందరికి అనురూపమైన విధముగా దివ్యనివాసములను నిర్మించుమని కోరినాడు.

ఈలోపల రాజకన్యలు తమకు రాత్రి కలలో అనేక విధములుగా శ్రీకృష్ణ సంగమ సుఖము కలిగినట్లు పరస్పరము చెప్పుకొనిరి. మర్నాటి ఉదయమున వారందరు ద్వారకాపురము చేరిరి. స్వాగతవచనములతో తమకు ఎదురు వచ్చిన పురజనులతో బలరాముడు సత్యాకృష్ణులు నరకాసురుని వధించిన విషయము తెలిపినాడు. రాజవీథిలో ఊరేగుచు బలరాముడు రాజకన్యలతో రాజమందిరము ప్రవేశించి, దేవకీవసుదేవులను రాజకన్యలకు చూపి నమస్కరింపుమన్నాడు. అతడు తల్లిదండ్రులకు అంతవరకు జరిగిన విషయములను వివరించినాడు. అనంతరము బలరాముడు ఆ రాజకన్యలకు ఎందులోను తక్కువ లేకుండునట్లుగా సమస్త మర్యాదలు చేయించినాడు. ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట ఆ రాజ కన్యలు శ్రీకృష్ణుని విషయమై తీవ్రమైన విరహవేదనను పొంది, దానిని భరింప లేక తమను కనికరింపుమని మన్మథపూజ గావించిరి.

# చతుర్థాశ్వాసము

అక్కడ, స్వర్గములో తనతో చెలిమిగా నున్న శ్రీకృష్ణునితో ఇంద్రుడు నందనోద్యానములో తామందరు భార్యా సహితముగా విహరింప రమ్మని ఆహ్వానించినాడు. అంతట దేవతలందరును తమతమ భార్యలతో నందనవనము చేరి పుష్పాపచయ జలక్రీడాదులందు తేలియాడి, వివిధ రుచ్యఫలముల నారగించి తమ గృహముల కేగి శయనించిరి. ఆ సమయమున కృష్ణుడు సత్యభామను మేల్కొలిపి, పారిజాతవృక్షమును పెకలించి, కొనిపోవ సిద్ధపడెను. అప్పుడు అచ్చటి వనపాలకులు అభ్యంతరపెట్టగా కృష్ణుడు వారిని లక్ష్యపెట్టలేదు. అంతట వారు దేవనాథునితో ఆ విషయమును చెప్పగా ఇంద్రుడు సపరివారుడై వచ్చి శ్రీకృష్ణునితో తలపడి ఓడిపోయెను. దేవతలందరను కృష్ణుని శరణు వేడిరి. అప్పుడు కృష్ణుడు వారిగుణమును పరీక్షింపదలచియు, సత్యాసతి కోర్కె

తీర్చదలచియు పారిజాతమును గ్రహించినట్లును, అది కొంతకాలము ద్వారకా నగరమున ఉండగలదనియు వారితో చెప్పినాడు. అప్పుడు దేవతాసముదాయము శ్రీకృష్ణుని ఆ బాల్య లీలలను వివిధములుగా స్తుతించినది.

అనంతరము కృష్ణుడు సత్యాపారిజాతసమేతుడై గరుడవాహనముపై ద్వారకానగరోపవనము చేరి పాంచజన్యమును పూరించినాడు. అప్పుడు, పుర జనులు స్వాగతవచనములతో అతనికి ఎదురు వెళ్ళకమునుపే, రాజకన్యలు ఒక దూతికను కృష్ణునివద్దకు పంపిరి. ఆ దూతిక కృష్ణునికి రాజకన్యల విరహ బాధలను అనేక విధములుగా వినిపించినది. షడృతువులను వర్ణించి, వాని యందారాజసుతల మదనవేదనలను తెలిపి, వారిని కనికరించి స్వీకరించుమని ప్రార్థించినది. అప్పుడు కృష్ణుడు ఆ దూతికతో ఆ రాజనందనల కోర్కెలను తీర్తుననియు, వారిని స్వస్థలై ఉండవలసినదనియు చెప్పిపంపెను.

పిమ్మట బలరాముడు సాత్యకి సహితుడై వెళ్ళి, సత్యాకృష్ణులను సాదర ముగా పిలుచుకొని వచ్చి ద్వారకను ప్రవేశించినాడు. కృష్ణుడు తల్లిదండ్రులకు నమస్కరించి వారి దీవనలు పొందినాడు. అప్పుడు దేవకీవసుదేవులు, బల రాముడు కృష్ణునితో 'పదునారువేలమంది రాజకుమార్తెలను తెచ్చి, ఆ విధముగా వారిని విరహానలమున వేగించుట అయుక్తమని' చెప్పి శీఘ్రముగా వారిని వివాహ మాడుమని ఉపదేశించిరి. అప్పుడు కృష్ణుడు 'మీ ఆజ్ఞ కొరకే ఇంతకాలము ఆలసించితిని, మీరు అనుమతించినందున ఇక ఆ రాజకన్యలను వివాహ మాడుదు నని' తెలిపి, బలరాముని 'వివాహ ప్రయత్నములు కావింపుమని' కోరినాడు.

అనంతరము రాజకన్యకాకృష్ణుల కల్యాణోత్సవమునకై ద్వారకా నగరమును సర్వాంగ సుందరముగా అలంకరించినారు. ఆ వివాహమునకు ధర్గవిధి ప్రముఖాది దేవతలు, గర్గాది మహామునీశ్వరులు, అనేక దేశాధీశ్వరులును రాగా షోడశ సహస్ర సంఖ్యల నొప్పు రాజ్యకన్యలకును, కృష్ణునకును మహా వైభవముగా వివాహము జరిగినది. వారందరితో కృష్ణుడు ఇష్టభోగములను అనుభవించినాడు.

నరసింగకవి ఈవిధముగా తన ప్రబంధ కథానిర్మాణము గావించినాడు.

# నరసింగకవి మార్పులు, చేర్పులు - ఔచిత్యము

ఈ కథా నిర్మాణమున నరసింగకవి ఔచిత్యపోషకముగా కొన్ని మార్పులను, నూతన కల్పనలను చేసినాడు.

1. 'నారదాగమనము మొదలుకొని పారిజాత ప్రతిష్ఠాపనము' వరకు తిమ్మన 'పారిజాతాపహరణ' ప్రబంధము నందలి ప్రతి పద్యపుటెత్తుగడను, భావమునుకూడా దాదాపుగా అనుకరించిన నరసింగకవి 'శ్రీకృష్ణునికి సత్యాపాద ప్రతాడనపు బాధను' తప్పించినాడు. భగవద్భక్తిని ప్రబోధించునట్టి 'భక్త జన కలుష నిరాకృతియైన శ్రీకృష్ణ లీలా విశేషమును' రచింపదలచిన వాడు కావున యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణునికి 'పడతికాలి తాపులను' పరిహరించి కవి ఉచితజ్ఞతను చూపినాడు.

2. 'కృష్ణునిచే భగదత్తుని సైన్య రక్షణలో ద్వారకకు పంపబడిన రాజకన్యలు సముద్రమును దాటిన తర్వాత తమంతతాముగనే ద్వారకానగర మును ప్రవేశింపక రైవతకాద్రి సమీపమున పట కుటీరములు నిర్మించి కొన్ని దినములు వసించినట్లు' కవి కల్పించినాడు. వారు అట్లుండుటవలన వారికి బలరామునితో సమాగమము కలుగుటకు దోహదపడినది.

3. నరసింగకవి కావించిన మిక్కిలి ఔచిత్య కల్పనము 'బలరాముని పాత్రచిత్రణము'. సంస్కృత భాగవత హరివంశములందు గాని, మరే ఇతర 'ఆంధ్ర గ్రంథము'లందుగాని 'పారిజాతాపహరణ, నరకాసురవధా ఘట్టము' లందు అంతగా ప్రాధాన్యములేని బలరామునికి ఈ కవి ఒక ప్రత్యేక ప్రాధాన్య మును సంతరించినాడు. కృష్ణుడు భూతనయ వధార్థము ప్రాగ్జ్యోతిషమునకు వెళ్ళిన పిదప కొంతకాలమునకు బలరాముడు ద్వారకానగరమున తమ్ముని ఆగమన విలంబమునకై విచారించు సమయమున రైవత కారణ్యప్రాంత కిరాత సముదాయము రాక, బలరాముని వేటాడరమ్మనుట, బలరామునివేట, రైవతక రామణీయక సందర్శనము, రాజకన్యకాసమాగమము, ద్వారకానగర ప్రవేశము' మున్నగు అంశములు నరసింగకవి కల్పించుకొన్నవి. 'ద్వారకలో విశ్వకర్మ చేత బలరాముడు రాజకన్యలకు దివ్యభవనములు నిర్మింపించి, కృష్ణాగమన

పర్యంతము వారికి సకల సౌకర్యములు కలిగించినట్లు' కథను మలిచినాడు. ఇదంతయు నరసింగకవి స్వయముగా కల్పించుకొన్నది.

సంస్కృతాంధ్ర హరివంశ భాగవతాదులందు 'నరకవధానంతరము కృష్ణుడు తనను వలచిన రాజకన్యలను భగదత్త సైన్యరక్షణలో ద్వారకానగరమునకు పంపినట్లును, తాను అమరావతికి వెళ్ళినట్లును' ఆ గ్రంథములందున్నది.

ఇట్లు చెప్పుటలో ఒక వెలితి ఉన్నది. కృష్ణ ప్రేషితలైన కన్యలు తమంతతాముగా ద్వారకానగరమునకు పోవుటకుగాని, అచ్చట కృష్ణాగమన పర్యంతము ఉండుటకుగాని సరియైన ఆధికారిక స్థితిలేదు. లోకమున ఏ స్త్రీగాని వివాహము కాకముందు ఒక పరాయి యింటికి వెళ్ళి, ఆ యింటి పెద్దలతో 'మీ అబ్బాయి నన్ను వివాహమాడెద నన్నాడు. ఆయన ఏదో పనిమీద ఎచ్చటికో వెళ్ళినాడు. అతని రాకకు చాలాకాలము పట్టగలదు. ఆయన వచ్చువరకు నన్ను ఈ యింట ఉండమన్నాడు. ఆయన వచ్చిన తర్వాతనే మా వివాహము జరుగగలదు. అంతవరకు నేను మీవద్దనే ఉండెదను' అని చెప్పజాలదు. ఒకవేళ ఆమె ఆ విధముగా చెప్పినను ముక్కు మొగము ఎరుగని ఆ కన్యను ఆ యింటివారు ఏ విధముగా ఆదరించగలరు? ఏదో మానవతా దృష్టితో ఆశ్రయము కలిగించినను ఆమెకు ఆ యింట ఏ విధమైన స్థానముండగలదు? ఆత్మీయతాభిమానములు కరువై వరుడేతెంచువరకు ఆమె ఆ యింట భృతిరహిత చేటిప్రాయగా ప్రాకృత జీవనము గడుపవలసినదేకదా! ఒక్క స్త్రీ విషయమే ఇట్లుండగా ఇక్కడ వచ్చినవారు ఒక్కరుకాదు. లెక్కకు మీరినంతమంది కన్యలు. అందునా, ఆభిజాత్యలైన రాజకన్యలు పదునారువేలమంది. మీదుమిక్కిలి చాలా కాలము క్రిందటనే తల్లిదండ్రులకు దూరమై, ఒక క్రూరుడైన రక్కసుని యింట చెరపెట్టబడి అనుమానాస్పదమైన జీవనము గడిపినవారు. ఇట్టివారికి, ఇంతమందికి ద్వారకానగరమున కృష్ణుడు వచ్చువరకు ఏ విధమైన ఆశ్రయ గౌరవములు లభించగలవు? ఆశ్రయము లభించినను దేవకీవసుదేవులు, బలరాముడు, రుక్మిణి మొదలైన ఇంటి కోడండ్రు, ఇతర పరిచారికాదుల ఎదుట వారికి ఉండు స్థానమేమి? అను ప్రశ్నలుదయించగలవు.

అందువలన లోకధర్మమును తెలిసిన నరసింగకవి బలరాముని పాత్రకు ప్రాధాన్యమును కలిగించి 'ద్వారకానగరము రాజకన్యలు చేరుటకు ముందుగనే' రాజకన్యకా బలరాముల కలయికను సృష్టించి పై సమస్యలను పరిష్కరించినాడు. ఈ సమావేశము యాదృచ్ఛికముగా జరిగినట్లుగా కథను మలచి 'కృష్ణుడు లేని

సమయమున ద్వారకానగరమున రాజకన్యలకు అర్హమైన గౌరవాదరములు కలుగుటకు' అవసరమైన పూర్వరంగమును చక్కగా సిద్ధపరచినాడు.

నరసింగకవి కథలో, బలరామునికి ముందుగా రాజకన్యల ఆగమన విషయము తెలియదు. చెంచుల ప్రార్థనను మన్నించి వేటకు వెళ్ళిన బలరామునికి అప్రయత్నముగా కృష్ణప్రేషితలైన రాజకన్యలతో కలయిక సంఘటించినది. ఆయన వారిని ఆదరించి, తన ఆధిపత్యమున సగౌరవముగా ద్వారకకు పిలుచుకొని వెళ్ళి, దేవకీవసుదేవులకు పరిచయముచేసి, వారి రక్షణ పోషణ భారములను వహించినాడు. బలరాముడంత వాని అండనుండగా ద్వారకానగరమున ఉన్న రాజకన్యల గౌరవాదరములకు కొదువ ఏమి? ఈ విధముగా నరసింగకవి విజ్ఞతతో కథానిర్మాణముగావించి, కృష్ణుని పరోక్షమున రాజకన్యల ద్వారకా నగరవాసమునకు ఒక సముచిత స్థానమును కల్పించినాడు.

కృష్ణుడు స్వర్గమునుండి మరలివచ్చిన పిదప 'పదియారువేల పడతుల దెచ్చియు వలనొప్ప పెండ్లియాడక నిలుపుట మరియాదకాదని' బలరామునితో కృష్ణునకు చెప్పించి, కృష్ణుని కోరికపై బలరాముని రాజకన్యకాకృష్ణుల పరిణయ కార్యక్రమ నిర్వాహకుని గావించి, బలరాముని పాత్రకు ఒక ప్రయోజనమును నరసింగకవి కల్పించినాడు.

4. పారిజాతమునకై జరిగిన యుద్ధములో కృష్ణుని చేతిలో ఓడిన దేవతలు 'కృష్ణుని ఆ బాల్యక్రీడలను' పరిపరి విధముల స్తుతించినట్లు నరసింగకవి కల్పించి 'భాగవత పూర్వభాగమంతటి' కథను పూర్తిగా జోడించినాడు. ఈ విధముగా కవి తన గ్రంథమును సార్థకముగా 'శ్రీకృష్ణలీలావిశేషము' కావించినాడు.

5. 'సత్యభామ పారిజాతవృక్షములతో ద్వారక చేరవచ్చిన కృష్ణుడు నగరమును ప్రవేశింపక పురోపవనమున విడెసినట్లు' చెప్పి నరసింగకవి 'రాజకన్యల దూతికాప్రేషణమునకు' అవకాశమును కల్పించినాడు. 'కృష్ణునితో తమకు కలుగబోవు సాంగత్య సౌఖ్యము విలంబమగుట పట్ల రాజకన్యల అసహిష్ణుతను' ఈ వాక్యము వ్యక్తము చేయుచున్నది.

నరసింగకవి సందర్భము ననుసరించి గృహస్థ ధర్మమునకు సంబంధించిన పెక్కు ఆచారములు, సంప్రదాయములను పొందుపరచినాడు.

ఈ విధముగా నరసింగకవి ఇతివృత్త నిర్మాణమున ఉచితజ్ఞతను ప్రదర్శించినాడు.

—: 0 :—

# 2. పాత్రచిత్రణము

కావ్యప్రశస్తికి మూలమైన కావ్యాంగములలో పాత్రచిత్రణము ఒకటి. స్వీయప్రతిభ ననుసరించి కవి కావ్యమునందలి పాత్రలను తీర్చిదిద్దును. వానిలో ఒక్కొక్క పాత్రలో కవి పాత్రనిర్మాణ శిల్పము పరాకాష్ఠను పొంది బహిర్గతమగుచుండును. ఆంధ్ర ప్రబంధములందలి కొన్ని పాత్రలు ఆయా కవుల అపూర్వ నిర్మాణ దక్షతకు ఎత్తిన పతాకలైనవి. అట్టివానిలో ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దనార్యుని ప్రవర వరూథినీ పాత్రలు ఆయన కవితారస సిద్ధతకు ప్రతీకలై, సహృదయ హృదయవర్జితములై విరాజిల్లినవి. కథ అవిచ్ఛిన్నముగ కొనసాగుటకు ప్రధాన పాత్రలే ఆధారములైనను, కొన్ని సందర్భములందు తటస్థపాత్రలు కూడ పూర్వాపరములను సంధించు వారధులై హారమునందలి తరళరత్నములై ప్రకాశించును. మృచ్ఛకటికమునందలి శకారుడు, పారిజాతాపహరణమందలి నారదుడు, ప్రభావతీ ప్రద్యుమ్నమందలి శుచిముఖి వంటి పాత్రలు ఇట్టివానిలో కొన్ని. యథాశక్తిగా వెల్లూరు నరసింగకవి కూడా తన 'రాచకన్యకాపరిణయ' ప్రబంధమునందలి పాత్రలను లోకజ్ఞతతో, ఔచిత్యదృష్టితో తీర్చిదిద్దినాడు.

రాచకన్యకా పరిణయమందలి కథ ప్రఖ్యాతమైనందున నరసింగకవి పురాణ ప్రసిద్ధమైన పాత్రలను కాక ప్రత్యేకమైన వానిని సృష్టించలేదు. కాని కథాసూత్రము సాగుటకు ఔచిత్యమును పోషించుటకు పూర్వపు సిద్ధమైన కథయందు ఈ కథాభాగమున ఎట్టి ప్రాధాన్యములేని కొన్ని పాత్రలకు విలక్షణమైన ప్రధాన స్థానమును కల్పించినాడు. అట్టివానిలో ముఖ్యమైనది బలరాముని పాత్ర. సత్యభామవంటి పూర్వమే ప్రసిద్ధముగానున్న పాత్రలను ఇంకను గడుసుగా చిత్రించినాడు. ఈ ప్రబంధమునకు నాయికలైన రాజకన్యలను మధురభక్తికి ప్రతీకలుగ, తెలుగింటి కోడండ్రుగా తీర్చినాడు. ఇందు ప్రతినాయకుడైన నరకుని ఉదాత్త ఉద్ధతునిగా మలచినాడు. ప్రబంధములందలి అష్టాదశ వర్ణనములలో నొకటియైన మృగయను వర్ణించుటకును, కథలో కానుపించని

మలుపును నిర్వహించుటకును రైవతకాద్రి సమీపారణ్యమందలి చెంచుల పాత్రలను సృష్టించినాడు. ఇది నరసింగకవి కల్పన. దేవమాతయైన అదితిని బంధుప్రీతి, గృహాధిపత్యము కలిగిన అత్తగా అభివర్ణించినాడు. కథానాయకుడైన కృష్ణుడు, దేవముని నారదుడు, దేవనాథుడు, రుక్మిణి, గరుడుడు, భూదేవి మున్నగు పాత్రలకు యథానురూపముగా లోపరహితమైన రూపుదిద్దినాడు.

## బలరాముడు

వెల్లూరు నరసింగకవి అపూర్వకల్పనా శిల్పమునకు మచ్చుతునక బలరాముని పాత్ర చిత్రణము. పూర్వగ్రంథములందు కృష్ణరాజకన్యల పరిణయ కథాభాగమున బలరామునిపాత్రకు ఏవిధమైన ప్రాధాన్యములేదు. కృష్ణప్రేషితలై, నరకవధానంతరము, ద్వారకానగరము చేరిన రాజకన్యలు కృష్ణాగమన పర్యంతము అచట ఉండుటకు తగిన స్థితి వానియందు చెప్పలేదు. దుష్టదానవుడైన నరకుని కఠోరమైన కారాగారమున గ్రమ్గిన పదునారువేలమంది రాజకన్యకలు ఏ విధమైన అండదండలులేక కృష్ణుని రాకను ప్రతీక్షించుచు ద్వారకానగరమున ఉండుట కష్టము. అందువలననే ఉచితజ్ఞుడైన వెల్లూరు నరసింగకవి ఈ లోపమును గమనించి ఒక అద్భుతమైన సన్నివేశమును కల్పించి రాజకన్యలకు బలరాముని రక్షణ కల్పించినాడు.

ఎంత పూర్వాధారము లేదనుకొన్నను నరసింగకవి ఈ కల్పనకు పోతన భాగవతమే స్ఫూర్తినిచ్చి యుండునని భావించుటకు అవకాశమున్నది. భాగవతమందలి రుక్మిణీకల్యాణ ఘట్టమున రుక్మిణీ హరణార్థము కృష్ణుడు ఒంటరిగ వెళ్ళిన పిమ్మట

'హరియొకడేగినాడు మగధాదులు చైద్యహితానుసారులై
సరపతులెందరేని జనినారు కుమారిక దెచ్చుచోట సం
గరమగు దోడుగావలయు గంసవిరోధికి నంచువేగ దా
నరిగె హలాయుధుండు కమలాక్షుని జాడ ననేక సేనతోన్'

అని వెళ్ళిన బలరాముని భాతృవాత్సల్యము, తమ్ముడు పరిగ్రహింపబోవు కన్యను 'కుమారిక' అని భావించుటలోని ఉదాత్తతలు నరసింగకవికి ప్రేరకములై

యుండును. కృష్ణుడు రుక్మి తలగొరిగి అవమానించినపుడు అతనిని మందలించు టలో రుక్మిణిని ఊరడించుటలో బలరామునికి తమ్మునిపైగల అధికారము, మరదంద్రవద్దగల చనువు కూడ నరసింగకవి తోడుపడి యుంతవచ్చును. నరసింగకవి పోతన భాగవతమును మథించినవాడై యుండుటయే దీనికి నిదర్శ నము. ఈ సంస్కారముతో కవి తన రాచకన్యకాపపణయ ప్రబంధమున బలరాముని బాధ్యతగల అగ్రజునిగా, పితరులయెడ భక్తిగలిగిన పుత్రునిగా, తమ్ముని భార్యలపట్ల యెనలేని వాత్సల్యానురాగములు కలిగిన బావగా చిత్రించి నాడు.

నరకవధానంతరము కృష్ణుడు రాజకన్యలను ద్వారకకు పంపినప్పటి నుండి రాజకన్యకా కృష్ణుల వివాహమగువరకు ప్రధాన పాత్రను నిర్వహించిన వాడు బలరాముడు ప్రబంధ కథయందు తృతీయాశ్వాసారంభమునుండి కథాం తమువరకు గల బలరాముని పాత్రచిత్రణము సంపూర్ణముగా నరసింగకవి కల్పనావిశేషము.

వేటనెపముగా రైవతకాద్రి చెంగటికి వెళ్ళిన బలరామునికి అప్రయత్న ముగా కృష్ణప్రేషితలైన పదునారువేలమంది రాజకన్యలు తటస్థపడినారు. అప్పటికి కృష్ణుడు వారిని వివాహమాడియుండకపోయినను, బలరాముడు వారిని కృష్ణ పత్నులుగను, తనమరదండ్రుగను భావించి వారిని అర్హోచిత విధుల సంభావించి నాడు. ఇందరు భూపతుల సుతలు సపరివారముగా ఒక్కసారిగా, స్థిరముగా నివసించుటకై ద్వారకానగరమునకు రాదలచగా అచ్చట వారికి అప్రయత్నముగ అర్హమైన నివాసములు చూపుట దుష్కరమగును. అందువలన బలరాముడు విశ్వ కర్మను అభ్యర్థించి ఆ మరునాటికే సిద్ధమగునట్లుగా ద్వారకలో అభిజాత్యలైన రాజకన్యలకు అనురూపములైన సౌధములను నిర్మింపజేసినాడు.

బలరాముని వెంట ద్వారకానగరము చేరిన రాజకన్యలు పురజనులచేత 'శౌరిదేవులు'గా సంభావితలైనారు. అనగా అప్పటికే వారు ఆ నగరపు కోడండ్రు అను గౌరవార్హతలను సంపాదించినారు. పురజనులు బలరాముని ఉచితజ్ఞతను

దేవరవారలు నగరము
దీవరముగజేరి శౌరిదేవులకెల్లన్
దావులు కల్పనసేయుట

కేవల సౌజన్యమనుచు' (186-3) పొగడగ, వారితో 'అతివలను బ్రోవ ధర్మమ'ని ఉదాత్తముగా చెప్పి అంతర్మందిరము ప్రవేశించి రాజకన్యలను దేవకీ వసుదేవులకు పరిచయము చేసినాడు. విశ్వమోహనముగా విశ్వకర్మ నిర్మించిన సౌధములందు వారిని పుణ్యాహవాచన, బ్రాహ్మణ సంతర్పణలతో గృహప్రవేశములు చేయించి, వారికి సర్వసదుపాయములను కలిగించినాడు.

కృష్ణుడు అమరావతినుండి మరలివచ్చిన పిమ్మట రాజకన్యలను వివాహమాడుమని తమ్మునికి హితముచెప్పి, పెండ్లి పెద్దయై వారి వివాహమును చేసిన వాడు బలరాముడు.

ఇట్లు నరసింగకవి కల్పించిన బలరాముని పాత్ర ప్రబంధమున ప్రముఖ స్థానమును పొందినది.

## సత్యభామ

సంస్కృతాంధ్ర సాహిత్యములందు సత్యభామ పాత్రకు ఒక ప్రత్యేకత యున్నది. ఆయా సందర్భములందు ఆయా కవులు ఆమె పాత్రకు యథాశక్తిగా స్పష్టమైన రూపకల్పన చేసినారు. 'పారిజాతాపహరణ' ప్రబంధమున ప్రయోజనకాంక్షియైన తిమ్మన సత్యభామను ఆభిజాత్యపూర్ణయై, మానాంధయైన శృంగార నాయికగా తీర్చిదిద్దినాడు. ఈ విషయమున వేరొకరు చేయివేయుటకు అవకాశము లేని విధముగా సత్యభామ సంపూర్ణ శిల్పమును తన అద్భుత కర కౌశలముతో మలిచినాడు. ఇట్టి స్థితిలో, వెల్లూరు నరసింగకవి తన రాచకన్యకాపరిణయ ప్రబంధ కథా నిర్వహణమున పారిజాతాపహరణ వృత్తాంతమును విధిగా స్వీకరింపవలసిన వాడైనాడు. ఈయన సత్యభామ పాత్రచిత్రణమున తిమ్మన మార్గమునే అనుసరించినాడు. కాని తిమ్మనవలెకాక 'పరమాత్మునికి పడతి పాద తాడనము'ను పరిహరించి, సత్యభామను గడుసరిగా చిత్రించుటతో నరసింగకవి తృప్తిపడినాడు.

రుక్మిణీమందిరమున జరిగిన విడ్డూరములను దూతిక తెలుపగా జనితామర్ష కషాయితాక్షియై కలగి అలిగిన సత్యభామ మణిభూషణాది శృంగారములను సడలించి పేదముత్తైదువవలె కోపసదనము చేరినది. అప్పుడు కృష్ణుడు తత్తరముతో

వచ్చి ఎన్నివిధముల బ్రతిమిలాడినను కనికరించలేదు. ఆమెను అనునయించుటకు మార్గాంతరము కానని కృష్ణుడు

'ఈ చెలి చిత్తవీథి నుదయించిన కోపభరంబు దీర్పనే
యోచనయున్ ఘటింపదు నయోక్తులు పల్కిన వంచకంబులై
తోచిన రీతి గన్పడియె దొయ్యలికిం బ్రణమిల్లుటే సదా
లోచనయంచు దత్పద విలోకము జేయు బ్రయత్నుడౌనెడన్' (36-2)

అని ఆమె పాదముల పడుటయే శరణ్యమని భావించెను. ఇక్కడనే తిమ్మన సత్యకును, నరసింగకవి సత్యకును వ్యత్యాసమున్నది.

అప్పుడు నరసింగకవి సత్యభామ గడుసుగా

'అతని తలంపు తానెరిగి యప్పువుబోణి హృదంతరాళ గుం
భితమగు చింతచే మిగులం భీతిలి చయ్యనగూరుచుండి య
చ్యుత! యిటసేయవచ్చిన కుచోద్యములెల్లను గంటి నీవు నీ
చతురిమ భోజపుత్రి కడ సల్పుమని' (37-2) అతని ధృష్టత్వమునకు అడ్డుకట్టవేసినది. 'అచ్యుతుడని' ఆతనిని వ్యంగ్యముగా దెప్పిపొడిచినది.

ఈ సందర్భమున తిమ్మనకు అవసరము కనుక

'పాటల గంధి చిత్తమున బాటిలు కోపభరంబు దీర్పనే
ప్పాటను బాటుగామి మృదుపల్లవ కోమల తత్పద ద్వయీ
పాటలకాంతి మౌళి మణి పంక్తికి వన్నియవెట్టనా జగ
న్నాటక సూత్రధారి యదునందను డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.'
(పారిజాత. 120-,

అని కృష్ణుని సత్యాపాదములకు ప్రణమిల్ల జేసినాడు. అప్పుడు

'జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామపాదంబునం

దొలఁగంద్రోచె లతాంగి యట్లయగు నాథుల్నేరముల్సేయ బే
రలుకం జెందినయట్టి కాంతలుచిత వ్యాపారముల్నేర్తురే'

(పారిజాత. 121-1)

అని సత్య వామ పాదమున కృష్ణుని శిరమును తొలగద్రోచినది. ఈవిషయమును తిమ్మన అర్థాంతరముతో సమర్థింపక తప్పలేదు. అప్పటికిని ఆ కుహనాగోపాలుడు ఆమె స్పర్శామాత్రముననే మేనపులకలు పొడమగ తన కాపట్యమును వీడక

'ననుభవదీయదాసుని మనంబున నెయ్యపు గిన్కఁబూని తా
చిన యది నాకు మన్ననయ చెల్వగునీ పదపల్లవంబు మ
త్తను పులకాగ్ర కంటక వితానము తాకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానవుగదా యికనైన నరాళకుంతలా!' (123-1)

అని యర్థించినాడు. ఇక్కడ తిమ్మనార్యుని కల్పనాప్రయోజనము వేరుగా నుండుట వలన, జంజాత ప్రభవాదులకందని పరబ్రహ్మమునకు ఇంతిపాదతాడనమును పరిహరించలేదు. మీదు మిక్కిలి ప్రతి పదమును సాభిప్రాయముగా ఒత్తి ఒత్తి, రసబంధురముగా రచన సాగించి తన కార్యమును సానుకూలమొనర్చుకొన్నాడు, అట్లుగాక నరసింగకవి భక్తజనుల కలుషములను నివారించు శ్రీకృష్ణలీలావిశేషమును రచింపబూనినవాడు కావున ఇది అనౌచిత్యమని తలచి తొలగించినాడు. ఈయన సత్యభామ కృష్ణుని ఎత్తిపొడుచుటలో అసమానమైన నైపుణ్యమును ప్రదర్శించినది. ఈ విషయమును పదునెనిమిది పద్యములందు (90-107/2) కవి వివరించినాడు.

ఇందలి నరకవధ ఘట్టమునందలి సత్యభామ చిత్రణమున నరసింగకవి పోతనామాత్యునే అనుసరించినాడు.

## రాజకన్యలు

రాజకన్యలు అప్సరాంశ సంభూతలు. వీరు ఈ ప్రబంధనాయికలైనను లెక్కకు మీరినవారై పదునారువేలమంది యగుటచే వారి పేర్లనుకూడా విడివిడిగా తెలుపుటకు నరసింగకవికి అవకాశము లేకపోయినది. ఇకవారి పాత్రలను ప్రత్యేకముగా చిత్రించుట అసాధ్యము కనుక కవి సమిష్టిగా వారి గుణగణములను వర్ణించినాడు. కాని ఆదినుండియు వారిని ఒక ప్రత్యేకమైన దృష్టితోనే తీర్చినాడు.

ఈ ప్రబంధకథ భాగవతముననుసరించి పరీక్షిన్మహారాజుకు శుకయోగీంద్రునిచే వినిపింపబడుట వలనను, కవి తాను భక్తికి ప్రాధాన్యమిచ్చునట్టి శ్రీకృష్ణ లీలావిశేషమును రచింపబూనుటవలనను భాగవతమందలి గోపికలవలె రాజకన్యలను మధురభక్తికి ప్రతీకలుగ మలిచినాడు.

## శ్రీకృష్ణుడు

రాచకన్యకా పరిణయ ప్రబంధ నాయకుడు కృష్ణుడు. వెల్లూరు నరసింగ కవి తిమ్మన పారిజాతాప హరణ పంథాలోనే కృష్ణుని చిత్రించినాడు. కృష్ణుని దాక్షిణ్యమును సమగ్రముగా రూపొందించినాడు. పరీక్షిత్తు శుకయోగీంద్రుని అసంఖ్యాకలైన భార్యామణులతో సమ్మతిగా మెలగిన ఆ మనోహరుని విచిత్ర చరిత్రమును తెలియజెప్పుమనియే అభ్యర్థించినాడు.

'నే వేడ్కన్ విహరింతునన్నతడు మన్నింపంగ నా తోడనే
యేవేళన్ విహరించు, నాకొరకు దానే వస్తువుల్ దెచ్చుచున్
నావల్లన్ సుఖియించు, నాకతని కెన్నన్ వేరులే దిప్పుడిం

దేవర్తించు ముకుందుడందు రనురక్తిన్ గాంతలిట్లందరున్' (137-1)

అనియు,

'యువతులనేకులున్న మగడోపిక నందరి నొక్కరీతికై
తవముదయింపనీక ప్రమదంబొనరించుట దుష్కరంబు కే'
శవుడది యేమొకాని తన చానల నందరి నొక్కరీతి గా

రవ మొనరించు నెయ్యెడ బరస్పరమైత్రిజనింప నెంతయున్' (140-1)

అనియు పాత్రలముఖమున చెప్పినాడు.

'దక్షిణ నాయక సహజా
దక్షిణతం దనరుశౌరి తనుజనులెల్లన్
దక్షిణ నాయకుడని కన
దక్షిణ నేత్రాం విహార దక్షుండయ్యెన్' (142-1)

అనుచు కృష్ణుని దక్షిణనాయకత్వ దక్షతను పలువిధములుగా చెప్పినాడు.

మిగిలిన కథలోని కృష్ణుని పాత్రచిత్రణము పూర్వప్రసిద్ధమైన పద్ధతి లోనే సాగినది. ఒక్కచోట మాత్రము నరసింగకవి మిక్కిలి ఔచిత్యముతో కృష్ణుని పురుషోత్తమత్వము, జగన్మోహతను ఒక అద్భుతమైన కల్పనతో నిరూపించినాడు.

## నరకాసురుడు

నరకాసురుడు ధీరోద్ధతుడుగా ప్రఖ్యాతుడు. నరసింగకవి నరకుని పాత్ర చిత్రణమున ఔద్ధత్యముతోపాటు ఉదాత్తతను కూడా ఆపాదించినాడు. పోతనామాత్యుని భాగవతమందలి హిరణ్యకశిపుని ఒరవడిలో తీర్చిదిద్దినాడు. భక్తికి ప్రాధాన్యమును కలిగించుటకై నరకుడు కృష్ణుని నిందించినప్పుడు పోతన ననుసరించి వ్యాజస్తుతిలో చెప్పినాడు.

సత్యభామాసహితుడై కృష్ణుడు ప్రాగ్జ్యోతిషముపై దండయాత్రకు వెడలగనే నరకునికి పెక్కుదుర్నిమిత్తములు తోచినవి. వెంటనే అతడు సభ నేర్పరచి వానివిషయమై మంత్రులతో సమీక్షించినాడు. అంతకుపూర్వము తాను దిక్కుల రాజులను, దిక్పతులను గెలిచి గాసిబెట్టుటను వివరించి, అప్పటికి నూతనముగా శ్రీకృష్ణుడను యాదవుడు శత్రుత్వముతో తన అప్తులైన కంసాదులను ద్రుంచినట్లు చెప్పినాడు. అట్టి శత్రువును తుదముట్టించక తనకు మనశ్శాంతి లేదనగా మంత్రులు అతని పరాక్రమమును అభివర్ణించి, ముందుగా తామేవెళ్ళి పరాక్రమమునగాని, ఏమరిపాటునగాని, వివిధములైన మంత్రమహౌషధముల వలన భ్రమింపజేసికాని కృష్ణుని దునిమి వత్తుమనిరి. నరకాసురుడామాటలకంగీకరించక 'దైత్యదానవమాయంజని త్రుంచుటర్హమె బహుఘనులకు యుద్ధమున రిపులఖండింపదగున్' అని తన బంటుతనమును చూపినాడు. మిగిలినది యథాపూర్వమే.

## అదితి

వెల్లూరు నరసింగకవి దేవమాతయైన అదితిని సంపూర్ణమాతృమూర్తిగా, కోడలిపై వాత్సల్యాధికారములు గల అత్తగా తీర్చిదిద్దినాడు.

నరకవధానంతరము సత్యభామాసహితుడై అమరావతికి చేరిన కృష్ణుడు అదితినిగని నమస్కరించగా ఆమె 'నెమ్మది ముదముజెంది అతని శిరము మూర్కొని ముద్దాడి చెక్కునిమిరినది.' పిమ్మట

'నన్ను గన్న తండ్రి! నాపాలిదైవమ!
నాతపః ఫలంబు! నా కుమార!
నేడు నిన్ను గంటి నే ధన్యురాలను
రావె నాదు భాగ్యరాశి! కృష్ణ!' (401-2)

అని లోక సామాన్యమైన పుత్రవాత్సల్యమును ప్రదర్శించినను వెంటనే ఆతని పురుషోత్తమతను గుర్తెరిగి ఆయన దశావతారములను కీర్తించినది. అప్పుడు ముదముతో కృష్ణుడు నరకుడపహరించిన ఆమె మణికుండలముల నొసగగ, ఆమె నరకుని దుష్టగుణములుగ్గడించి, సత్యభామ పరాక్రమమును మెచ్చుకొన్నది. పిమ్మట తన సన్నిధానమున సేవావృత్తి నున్న పౌలోమికి సత్యాకృష్ణులను చూపి

'నీయారాలీసత్యయు
పాయని నీమరది యితడు పద్మాక్షుండున్
ఓ యింద్రపత్ని! కలదే
నీయంతటి భాగ్యశాలి నిఖిలజగములన్' (411-2)

అని అధికమైన బంధు ప్రీతితో చెప్పినది.

ప్రేమానురాగములు పెద్దల నుండియే పిన్నలకు సంక్రమించును. అన్నదమ్ములు, తోడికోడండ్రు అన్యోన్యాప్యాయతలు కలిగియున్ననే గాని, వారి పిల్లలకు సోదర భావములు పెంపొందవు. మనమందరము ఒకటి అన్న భావములు వారిలో కలిగి ప్రేమ, త్యాగమువంటి సద్గుణములతో కూడిన సత్సంబంధములు పిల్లలయందు పెంపొందించు బాధ్యత తల్లిదండ్రులదే కదా.

ఈవిధముగా అత్తగారు ఆప్యాయముగా చెప్పిన వెంటనే పౌలోమి

'అనినవిని, తాను సత్యను గనికరమున
గౌగిటను జేర్చి కరమున గరముబట్టి

తనదు శృంగారభవనంబు గనగ వేడ్క
జనియె పౌలోమి సంతోషసహితయగుచు' (412-2)

పిలుచుకొని వెళ్ళినది. ఇంటితనము అత్తలనుండి కోడం[డకు సం[క్రమించ వలసిన వెలలేని సంపద.

అదితి కృష్ణుని భార్యాసహితముగ కొన్నిదినములు తమ యింటనుండు మని కోరినది. కృష్ణుడందుల కంగీకరించిన వెంటనే దేవేంద్రుడు సంతసముతో ఆతనిని సుధర్మా సందర్శనార్థము పిలుచుకొని వెళ్ళినాడు. కొడుకులు కోడం[డపై మెత్తని పెత్తనముగల ఉత్తమ గృహిణిగా అదితిని నరసింగ కవి రూపుదిద్దినాడు.

## చెంచులు

వెల్లూరు నరసింగకవి తన ప్రబంధకథా నిర్వహణమున తానాసించిన ఒక ముఖ్యమైన మలుపు సాధించుటకు చెంచుల పాత్రలను కల్పించినాడు రాజకన్యలకు, బలరామునికి సంఘటన కలుగుటకు ఈ చెంచులు పరోక్ష ప్రేరకులు.

## ఇతర పాత్రలు

రుక్మిణి స్వభావమునకు సహజమగు విధముగా ఆమెను చిత్రించి, కృష్ణుని సత్యభామ నిందించుటలో రుక్మిణి సత్యనుమించిన స్వాధీనపతిక అన్న భావమును పొందుపరచినాడు.

నారదుని పాత్ర చిత్రణము ఆ 'కయ్యంపు భోజనము దిట్టజడ దారికి' తగిన రీతిలో నున్నది. ఇందలి నారదకృత దశావతారస్తుతి మనోహరము.

ఇంద్రుని స్నేహపూర్ణుడు, భక్తుడుగను, గరుడుడు, భూదేవి మొదలగు వారిని భక్తాగ్రగణ్యులుగను కవి చిత్రించినాడు. వీరిమూలమున నరసింగకవి పెక్కుచోట్ల విష్ణుస్తుతి కావించినాడు. కవి 'రాజకన్యకం దూతికా దౌత్యము'ను కల్పన చేయుటలో షడృతువర్ణనము ప్రధాన ప్రయోజనము.

ఈ విధముగా నరసింగకవి తన ప్రబంధమునందలి పాత్రలకు ఉచిత రూపకల్పన గావించుటలో కృతకృత్యుడైనాడు.

—: o :—

# 3. నాటకీయత

'కావ్యేషు నాటకం రమ్యమ్' అని సంస్కృత సాహిత్యమున బహుళ జనాదరణ పొందిన నాటకప్రక్రియకు ప్రాచీనాంధ్రసాహిత్యమున ఉచితమైన స్థానము లభించలేదు. నన్నయభట్టారకుడు చంపూవిధానమున ఆంధ్రకవితకు శ్రీకారము చుట్టిననాటినుండి గత శతాబ్దమువరకు దాదాపుగా కవులందరు అదే విధానమును అనుసరించిరి. అభిజ్ఞాన శాకుంతలము, ఉత్తరరామ చరిత్ర, ప్రబోధ చంద్రోదయము వంటి ప్రసిద్ధ సంస్కృత నాటకములు తెలుగున శ్రవ్యకావ్యప్రబంధములుగనే రూపుదిద్దుకొన్నవి. అయినను ప్రాచీనాంధ్ర కవులు నాటక సంప్రదాయములను అలక్ష్యము చేయలేదు. తమ శ్రవ్యకావ్యములందే నాటకలక్షణములను పొందుపరచి, వానికి దృశ్యతాగౌరవమును ఆపాదించి పఠితల మనోరంగస్థలముపై పాత్రల వాచిక, ఆంగిక, సాత్త్వికాభినయములను దర్శింపజేసి వానిని శ్రవ్యనాటకములుగా తీర్చినారు. కవిబ్రహ్మ తిక్కనసోమయాజి విరాటోద్యోగ పర్వములు పెక్కునాటకలక్షణములను సంతరించుకొని, ఆయన నాటకీయతా దృక్పథమునకు ఎత్తిన పతాకలైనవి. శ్రీకృష్ణరాయల కాలమున వెలసిన ప్రబంధములు ధీరోదాత్తాదినాయకపోషణము, శృంగార రసప్రాధాన్యము, సంభాషణా చాతుర్యము, వస్త్వైక్యము సిద్ధించిన సంవిధాన నైపుణ్యములతో నొప్పి శ్రవ్యనాటకముల ఖ్యాతిని పొందినవి.

ప్రపంచము మానవపాత్రల ప్రవర్తనకు రంగస్థలము. ఈ లోకతత్త్వము తెలిసిన కవులు మానవజీవితమును జగన్నాటకముగనే దర్శింతురు. కావ్యనాటక సృష్టి జగన్నాటకమునకు ప్రతిబింబము. ప్రకృతియందును, నాటకకృతియందును గుణారోపణము సమానము. 'లోకవృత్తానుకరణం నాట్యం[1]' అని భరతముని అభిభాషణము. ప్రపంచము, నాటకము రెండును భిన్న చిత్తవృత్తుల కూడలులే. దురవగాహమైన జగన్నిర్మాణ తత్త్వమును ఆకళించుకొన్న కవికి కావ్యనిర్మాణము సుకరమగును.

దర్శనస్ఫూర్తికి ఉన్నంత శక్తి శ్రవణస్ఫూర్తికి లేదు. విన్నవిషయము కన్న, కన్నవిషయము త్వరగా మనసునకు పట్టును. కనుకనే ప్రత్యక్షముగా

దర్శించగలిగిన నాటకములందు రసస్ఫూర్తి సద్యోజనితమై సహృదయాహ్లాదమును కలిగించును. కవులు రసచిత్తులైనచో శ్రవ్యకావ్యార్థములనుగూడ ప్రత్యక్షకల్పముగా చేయగలరు.

'వర్ణనోత్కలితాః భోగప్రౌఢోక్త్యా సమ్యగర్పితాః,
ఉద్యానకాంతా చంద్రాద్యాః భావాః ప్రత్యక్షవత్స్ఫుటాః'[2].

అని భట్టతౌతుని అభిప్రాయము.

అభినయాది నాటకీయతాగుణములను శ్రవ్యకావ్యములందును నిబంధింపవచ్చును. 'It is wrong to hold that dramatic poetry alone is concerned with the presentation of action and not the epic, lyric and other forms of poetry[3]' అన్న K.C. పాండేగారి మాటలు ఈ భావమునే సూచించుచున్నవి.

పలువురు ప్రబంధకవులు నాటకీయరీతిలో రసానుకూలముగా ఇతివృత్తమును మలుచుకొనుటకు అవకాశమున్న వస్తువును గ్రహించి, దానిని దృశ్యకావ్యలక్షణ సంభరితముగా తీర్చ యత్నించినారు. వెల్లూరు నరసింగకవి 'రాచకన్యకా పరిణయ' ప్రబంధమునకూడ పెక్కు నాటకసంప్రదాయములు పొడకట్టుచున్నవి.

'నరకబంధితలైన రాజకన్యలను కృష్ణుడు పరిణయమాడుట' అన్న వస్తునిర్వహణకు అనుకూలమైన విధముగా నరసింగకవి ఇతివృత్తమును స్థిరపరచినాడు. నాటకోపయుక్తములైన సంభాషణలు, అంక, రంగ విభజనకనుకూలమైన సన్నివేశములు, అభినయ ప్రధానములైన చేష్టలు మొదలైనవానితో రసస్ఫూర్తినిచ్చు నాటకీయధోరణిని కవి ప్రదర్శించినాడు. కథారంభమున మాత్రము తిమ్మన పారిజాతాపహరణ రచనావిధాన అనుసరణమున్నది.

నారదుడు కృష్ణునివద్ద తెచ్చిన రాజకన్యల ప్రసక్తి సంభాషణౌచితికి చక్కని నిదర్శన. నారదుడు అలవోకగా 'ఆడికలయ్యె నీవు గోపికలం గూడొ్కని యాడిన కతలిక గైకొని యాడినమేలు రాచకూతుల' (181-1) నన్నాడు. రాజ

కన్యలను గురించి మొట్టమొదటి ప్రస్తావన ఇది. ఇందులో అయ్యా! నీవు పర కాంతాసక్తుడవై అన్యలైన ఆ గోపికల వెంటబడి అనవసరముగా ఎందుకు లోక నిందను ఒడిగట్టుకొందువు? నిన్ను కాంక్షించు రాజకన్యలను స్వీయలుగా వరి గ్రహించి ఇష్టార్థములను అనుభవింపకూడదా' అన్న హితభావము వ్యక్తము. దీనికి కృష్ణుడు వెంటనే ప్రతి స్పందించినాడు.

'నారదమునిచంద్ర! నను నవ్వులకెవ్వరు రవ్వమాటన్నారదరన్, దదుక్తులకు నన్ను నెరుంగరె మీరలు, ఎందుగన్నారు. అదనెంచితెత్తు నరనాథుల కన్యల జాడదెల్పుడీ' (182-1) అని కృష్ణుడు నారదునికి సమాధానము చెప్పి నాడు. కృష్ణుడు తక్కువవాడుకాదు. 'ఏమయ్యా నామీద ఏమి అపకీర్తి వచ్చినది. నీ మాటలకు నాకు అదరు బుట్టుచున్నది. నా గురించి మీకు తెలియనిదా. అది సరిగాని ఆ రాజకన్యల నెక్కడ చూచితిరో జాడతెలిపిన అదనుచూచి తేగలను' అన్న ప్రతివచనమున కృష్ణుని తత్త్వము అర్థమగుచున్నది. అప్పుడు నారదుడు 'రదనచ్ఛదాగ్రమున నవ్విగురొత్తగ' రాజకన్యల విషయము తెలిపినాడు. ఇట్లు పాత్రల ప్రవృత్తి ద్యోతకముగా నరసింగకవి నరకుని మంత్రాలోచన, కృష్ణ రాజకన్యల, బలరామ రాజకన్యల సంభాషణలను నిర్వహించినాడు.

రుక్మిణీ మందిరమున జరిగిన తంతును దూతిక 'కన్నుదోయిని రాగాం కురముదయింపగ కోపచలితాధరయై సరభసగతిని' (5-2) వివరించినది. దూతికమాటలకు సాత్రాజితీదేవి 'ఆజ్యాహుతి గొన్న దర్పహుతభుక్స్ఫూర్జార్చి చందమున జనితామర్షి కషాయితాక్షియై హెచ్చిన గాద్గద్యయుతానులాపి' (32-2) యైనది. నేత్రరాగాంకురత, కోపచలితాధరత, గాద్గద్యములు సత్త్వసంజాతము లైన అభినయ విశేషములు. దొరసాని పట్లగల దూతికానురాగము, స్వాభిమాన భంగము పొందిన నాయిక ప్రతిస్పందనలు ఇందు ప్రస్ఫుటములు.

'దురంత చింత మదిలో వేధింపగా అత్యంతరోషాప్తిచేబలు వేసారు, మురారి దూరు, చెలినంపంజేరు, పల్మారు చంచలతస్మేరు, ఛలారి యీతడని యంచుంజేరు శయ్యోపరిన్' (53-2). ఇది కోపమందిరమందలి సత్యభామ స్థితి అభిమానవతియైన సత్య కృష్ణుని దుశ్చేష్టితమునకు తాళలేక పోయినది. ఇందలి నిర్వేదము, గ్లాని, చపలత మొదలైన సంచారిభావములు సత్యభామ చిత్తవైకల్య

ముసకు రూపకల్పన గావించి దర్శింపజేయుచున్నవి. విషాదరోషములను అణచు కొనలేని చలద్రూపముగా ఇందు సత్యభామ భాసించినది.

కృష్ణుని నిందించుచు సత్యభామ విలపించినది.

'తామసమోపలేక మదిధైర్యముఁద్రీల ముసుంగు కొంగు నె
మ్మోమున మాటుచేసుకొని మోహనరాగ కలస్వనంబుతో
గోమలి యేడ్చెనప్డు యదుకుంజరుకున్మది జాలిబుట్టగా
సామజకుంభ సన్నిభ కుచస్థలి నశ్రులు జాలువారగన్.' (109-2)

పరిస్థితులను శిఖరాగ్ర స్థాయికి చేర్చుటకును, పురుషుని హృదయమును పక్వమొనరించుటకును అనుకూలించునట్టి దైవదత్తమైన వరము స్త్రీల రోదనము కాంత కన్నీళ్ళకు కరుగని కటిన చిత్తులుండుట అరుదు.

'అప్పుడు కైటభారి దయనంగన నక్కున జేర్చి జాఱవా
దుప్పటి కొంగుతో గనుల తోయకణంబులునొత్తి యాదరం
బొప్ప శిరంబు దువ్వి కరుణోజ్జ్వలుడై ఘన సమ్మదాబ్ధిలో
దెప్పం దేల్చి పల్కులను దియ్యదనంబును దోపనిట్లనున్' (110-2)

లోక దుఃఖమునే పరిహరించ గలిగిన కృష్ణుడు ఇల్లాలి కన్నీటికి ఎట్లాగ గలడు. ఆమెను లాలించి, బుజ్జగించినాడు. ఈ సన్నివేశము లందలి అభినయ చేష్టా వర్ణనములు దర్శనీయములు.

మధ్యపాన మత్తలైన రాజకన్యల మాటలు, చేష్టలు వాచికాంగికాభినయ ద్యోతకములు.

'చక్కెర మోవి చురుక్కున పలుకెంపులుంచుచు దయను లాలించెనమ్మ' (166-3) అనువిధముగా రాజకన్యలు తమ స్వప్నానుభవములను పరస్పరము తెలుపుకొనుటలందు వర్ణనాత్మకమైన వాచికము, సన్నివేశవలనాదికమైన ఆంగికము, అంతర్బహిరాత్మకమైన సాత్త్వికము అన్న అభినయ భేదత్రయము చక్కగా సమ్మిళితములై సహృదయులను భావనామగ్నులను చేయుచున్నది.

దృశ్యమును వర్ణన ద్వారా మనసునకెక్కునట్లు చేయుట కవి ప్రతిభలో ఒక అంశము. విషయమాత్ర ప్రధానముగా ఉన్న సందర్భమును సంభాషణా విశిష్టముగను, చేష్టావిన్యాస ప్రధానముగను మార్చి నరసింగకవి వానికి ఈ విధముగా నాటకీయతను జోడించినాడు.

నరసింగకవి సన్నివేశ విభాగము బీజాది అర్థప్రకృతి పంచకము, ఆరంభాది అవస్థాపంచకముతో గూడిన సంధిపంచక స్ఫూర్తికి అనుకూలముగ నున్నది. వీనివలన 'రాచకన్యకా పరిణయమును' ఒక అయిదారంకముల నాటకముగా రూపొందించుటకు అవకాశమున్నది.

ఇతివృత్తము నందలి 'సత్యభామ అలుక, కృష్ణుని సాంత్వనములు' దూరానువర్తనము కలిగిన 'పతాక'[4] గను, బలరాముని వేట 'ప్రకరి'[5] గను భాసించుచున్నవి. నారదుని మూలకముగా, రాజకన్యల సందేశరూపము 'బీజ'[6] ప్రాయముగా ప్రారంభమైన వస్తువు 'ఇంద్రసంప్రార్థనము' చేత 'బిందువు'[7]గా విస్తరించి, కృష్ణ రాజకన్యల పరిణయ 'కార్యము'[8]గా ఫలించినది.

రాజకన్యల ప్రాప్తికై కృష్ణునకు ఔత్సుక్య రూపమైన 'ఆరంభా'[9] వస్థ కృష్ణుని నరక నిగ్రహణ సంకల్ప 'యత్నము'[10] చేత కొనసాగి, నరకవధ,రాజ కన్యల సందర్శన సంభాషణలచేత 'ప్రాప్త్యాశ'[11]యై, రాజకన్యలను ద్వారకకు పంపుటచేత 'నియతాప్తి[12]కమై, పరిణయ రూపమున 'ఫలాగమ[13]మును' పొందినది.

కృష్ణుడు ఇంద్రునికిచ్చిన విందు, మురనరకుల వధ, బలరాముని వేట, ఇంద్రాదుల నందనోద్యాన విహారము మొదలైన సన్నివేశములు 'విష్కంభ'[14] ప్రాయములు.

ఈ విధముగా పెక్కునాటక లక్షణములను సంతరించుకొన్న దృశ్య ప్రబంధముగా నరసింగకవి 'రాచకన్యకా పరిణయము' భాసిల్లుచున్నది.

—:౦:—

# 4. నరసింగకవి వైదుష్యము– శబ్దప్రయోగ సౌష్ఠవము

నరసింగకవి మంచి శబ్దాధికారము కలవాడై, చక్కని ధారాశుద్ధితో గూడిన పద్యరచన గావించుటలో అందెవేసిన చేయి. సందర్భానుసారముగా దీర్ఘ సమాసభరితముగను, అలతి యలతి పదముల కూర్పుతోడను పద్యముల్లల్ల గలడు. వ్యక్తులు ఎదుటనిలిచి మామూలుగా మాటలాడుకొన్నట్లు పద్యరచన చేయుట ఈయన ప్రత్యేకత. ఈ కవి రచనయందున్న అనుప్రాస, యమకా లంకార బాహుళ్యము ఈయనకుగల శబ్దప్రయోగ నైపుణ్యమునకు తార్కాణ.

## పద్యరచనా విధానము - శైలి - పాకము

1. 'ఆ పురి సాలమెన్నదగు నంబరచుంబి శిఖామణి చ్ఛటా
దీప కళావిశేష పరిదీపిత నందనకాననాంతర' (109-1)
'ఆ కుంభీనస విష్టపాధిక గభీరా తీర పూర్ణామిత

వ్యాకోచాబ్ధి మరంద తుందిల మిళిందామంద ఝుంకార స' (111-1)

ద్వారకానగర సాలఖేయములను వర్ణించునప్పటివి ఈ పద్యములు. సంస్కృత పద గుంభితములై, గౌడీరీతిలో[1] చిక్కని ధారలో సాగినవి ఇవి. ఇందలి శబ్దాను ప్రాసకత్వము శ్రుతి సుభగత్వమును కలిగించుటతో పాటు పద్యములకు మత్తద్విపయానత్వమును పొందించుచున్నవి. మొత్తముపై నరసింగకవి రచన కదళీపాకమున సాగినది.

2. ద్వారకా నగరమున రుక్మిణీ మందిరములో కృష్ణనారదులు పరస్పరము పరామర్శించుకొనుచు

'నారదమునిచంద్ర! శర
న్నారద రిపుసాంద్ర! మీరు నయసంపదచే

నారద రిపు సన్నుతి గ
న్నారద దమప్రకృతి జనుల నమ్మనివారల్' (149-1)
'అరిషడ్వర్గ విదూరులింద్రియ జయవ్యాపార సంచారుల
స్థిర సంసార విముక్తధీరు లఘువిచ్ఛేదక్రియోవాయ లం
తరవిద్యాపరిహారులట్టిఘనులన్ దర్శించితిన్ మిమ్ము

మీకరుణా పాత్రుడనైతి' (150-1) అని కృష్ణుడు నారదునితో పలుకగనే నారదుడు నిర్విణ్ణుడై

'దేవా! కేవల మానవుండనెడు రీతింబల్కగా జెల్లునే
నీవింద్రాది సురాగ్రజుండవు జగన్నిర్మాత నీ నాభిరా
జీవావిర్భవుడేను దత్సుతుడ మచ్చేత స్సరోజంబునం
దేవేళన్ భజియింపుచుందు నిను లక్ష్మీశా! జగన్నాయకా!' (151-1)

అని బదులు పలికినాడు.

ఈ సందర్భమునందు కవి 'నారద' శబ్దమును పునరావృత్తము చేసి నందున ఒక్కసారి చదివిననే ఇందలి అర్థము స్పష్టముగా బోధపడదు. 'నారద' శబ్దము దేవముని, మేఘము, రాక్షసుడు అను పెక్కు అర్థములను బోధించును. నారద—నారదముని; శరన్నారద—శరన్మేఘమంటలి, రిపు-ధవళముతో విరోధించునట్టి అనగా మీరునట్టి (అధికధావళ్యముతోకూడిన వాడని అర్థము;) నారదరిపులు-దేవతలు(దనుజారులు) (వారిచేత సన్నుతింపబడినవాడు-నారదుడు) అను భిన్నార్థములు నారదశబ్దమునకు సిద్ధించుచున్నవి. 'అట్టి నారదముని ప్రకృతిని తెలిసికొనలేక పామరులైన జనులే వ్యర్థముగా 'కలహ భోజనుడు' అని ఆడిపోసికొనుచున్నారు' అన్న పద్యభావము రెండు మూడు పర్యాయములు చదినవిగాని స్ఫురించని విధముగా ఇచ్చట రచన కదళీపాకమున సాగినది.

కృష్ణనారదులు ఒకరినొకరు వారివారి భావములకు ఉపపత్తులు చూపుచు 'అరిషడ్వర్గవిదూరులు, అస్థిరసంసారవిముక్తధీరులు' అనువిధముగా కృష్ణుడు నారదుని, 'నీవింద్రాది సురాగ్రజుండవు, జగన్నిర్మాత నీ నాభిరాజీవావిర్భవుడు' అను విధముగా నారదుడు కృష్ణుని స్తుతించుటలు ప్రౌఢార్థభరితములు

నుండి సాత్త్వతీవృత్తిలో సాగినది. కొంతదీర్ఘసమాసమును, కొంతమృదుపద బంధముతోను కూడినందున పాంచాలీరీతిలో నున్నది.

3. ఒక్కొక్కచోట కవి భావావేగము కుంటుపడని విధముగా, చిన్నచిన్న మాటలతో అర్థగాంభీర్యము అచ్చుపడునట్లుగా మహాసుకరముగా పద్యమును నడుపగలడు.

సత్యభామ కృష్ణుని దౌష్ట్యమును నిందించుచు
'కల్లలు, ముళ్ళమాటలు, మొగంబున నిచ్చకముల్, మరుంగునన్
క్షుల్లకవాక్యముల్, బహుచోద్యము లిచ్చట' (92-2)
'నినుననవేల, నారదమునిన్ వచియింపగనేల, రుక్మిణీన్
గనలున దూరనేం గొరగాని దురుక్తుల నొందుమంచు నా' (96-2)

అన్నమాటలు ఎంతో సూటిగా, సరళముగా, భావబంధురముగా సాగి, సందర్భ శుద్ధిగలిగిన కైశికీ4 వృత్తిని ప్రతిబింబించుచున్నవి.

4. పూర్వకవుల వృత్తపద్యములందలి భావము ఏమాత్రము దెబ్బతినకుండునట్లుగా కవి తన చిన్నకందపద్యములందు కుదించి చెప్పినాడు. పోతన పద్యములు ఇట్టివానియందు పెక్కులు. ఉదాహరణమునకు 'సత్యభామ యుద్ధమును ప్రావృట్కాలముగా' సావయవముగా రూపించి పోతన చెప్పిన

'జ్యావల్లీధ్వనిగర్జనంబుగ సురల్ సారంగయూథంబుగా'
(భాగ.10.ఉ.182)

అన్న శార్దూల వృత్తమునందలి భావము భంగపడకుండునట్లుగా

'ధనువింద్రధనువు గుణ ని
స్వనమురుము నిలింపులెల్ల చాతకములునే
ఘనమీవు మెరుపుగా నరి
జన శిఖినార్చితివి నిశిత సాయకవృష్టిన్' (298-2)

అని చెప్పినాడు నరసింగకవి. పద్యము కూడ మిక్కిలి సులువుగా నడచినది. ఈ పద్ధతి ఈయన 'భర్తృహరి సుభాషితానువాదము' నందు అధికముగా కానవగును.

5. దశావతారస్తుతియందు దశరథరాముని అవతారమును స్తుతించుటలో ఒక్క పద్యముననే రామాయణమందలి ప్రధానాంశములను పూసగ్రుచ్చినట్లుగ వివరించి, అలవోకగా దానిని సంగ్రహరామాయణముగా కవితీర్చినాడు.

'గమి యాగాహితుఁ జయించి, హరకోదండంబు ఖండించి, సీ
తమనాసక్తి పరిగ్రహించి, భృగురామాటోపమున్మాన్చి, శీ
ఘ్రమె సాకేతపుటాసజెంచి, వనులంగష్టించి, సుగ్రీవ నా
మము హెచ్చించి, దశాస్యునొంచితివి రామస్వామివై మాధవా!' (157-2)

విశ్వామిత్ర యాగరక్షణము, శివధనుర్భంగము, సీతాపరిగ్రహణము పరశు రాముని గర్వభంగము, దశరథుని రామపట్టాభిషేక ప్రయత్నము, అరణ్య వాసము, వాలివధ, రావణ సంహారము మున్నగు బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, యుద్ధకాండముల ముఖ్యాంశములు వర్ణితములు. సుందరకాండమున రాముని ప్రసక్తి పరోక్షమైనది కావున దాని విషయమిందులేదు.

## శబ్ద శిల్పము

కావ్యశరీరమని చెప్పదగిన శబ్దములకూర్పు విషమముగాక సముచితముగా నుండుచో కావ్యమునకు సౌందర్యము చేకూరును. ఈ విధమైన పదములకుగల ఉత్కృష్టమైన పరస్పరమైత్రిని విద్యానాథుడు 'శయ్య'[5] అన్నాడు. ఏ పదము తర్వాత ఏ పదమును వాడినచో శ్రవణసుభగత్వము, అర్థవైశద్యము కలుగునో తెలిసికొని కవి పదములను ప్రయోగించవలెను. ఈవిధముగా, పరివృత్తిని సహింపని పదములనుకూర్చి నరసింగకవి తన పదప్రయోగ సౌష్ఠవ పాటవ మును ప్రదర్శించినాడు.

1. 'సురలకు విందు, పొందు తొగజోటికి, లేటికిపట్టు, గట్టుకూ
తురు దొరసొమ్ము, వమ్ము వెలిదొంగకు, గంగకుదీవి, తావితా' (169-2)

అన్న చంద్రవర్ణనమునందలి చిన్నారి అచ్చిక మిశ్రసమాసములందలి సంస్కృ తాంధ్ర పదములు కవలపిల్లలవలె ఒదిగినవి. ఇందలి ఛేకానుప్రాస నిబిడత్వము పద్యమునకు చిక్కనితనమును కలిగించినది.

2. నరసింగకవి అటనట చక్కని శబ్దశిల్పమును ప్రదర్శించినాడు. అక్షరప్రయోగముచేతనే అర్థసంసిద్ధి కలుగుట విచిత్రము.

ద్వారకాపురమందలి చాతుర్వర్ణ్యమును వర్ణించుటలో కవి ఆయా జాతుల కులధర్మములను స్ఫురింపజేయునట్టి అక్షరములను వృత్త్యనుప్రాసలో బిగించినాడు.

'నానాభిధానావధాన ప్రధానా స
మానాగమ ద్విజస్థానకంబు
దుర్వార విద్విషద్గర్వ నిర్వాపణా
ఖర్వ శౌర్య క్షత్ర ధూర్వహంబు
పేటీకృత స్వర్ణకోటీక్షణాదాన
పాటీల సద్వైశ్య వాటికంబు
గోత్రామృతాశన క్షత్రార్యభజనాతి
మాత్ర కృషిక్రియాపాత్ర పదజ

మనిరతాధ్వరమంత్రస్వరా, రిపీర
విజయ ఘోషణ, బహువస్తు విక్రయార్థ
భాషణా, ఖిల ధాన్య భృత్ప్రకట శకట
చరణ రటనా కరంబొప్పు హరిపురంబు' (113-1)

ఇందు మొదటి పాదము బ్రాహ్మణులకు సహజమైన దైన ఉదాత్తానుదాత్త స్వరిత స్వరములతో గూడిన వేదోచ్చారణమును అనుకరించునట్లుగా 'నానాభిధానావధాన ప్రధానాసమానాగమ' అన్న అక్షరములు కూర్పబడినవి. ఇచ్చట అకారము (అ, ఆ,) ప్రాసయతియందు 'న' కారము పునరావృతమైనవి. అకారము త్రిమూర్తులను (అకారోబ్రహ్మ విష్ణ్వీశ - నానార్థ రత్నమాల) 'ఆ' కారము బ్రహ్మను (ఆకారస్తు......పితామహే......నానార్థ), 'న' కారము విఘ్నేశ్వర, జ్ఞానములను (హేరంబే నః పుమాన్, నంజ్ఞానవాద్యయోః) సూచించును. అనగా 'బ్రహ్మజ్ఞాన సంపన్నులై, శివకేశవాదుల పట్ల అభేద భక్తి భావమును ప్రదర్శించువారై, సర్వవిఘ్నములను పరిహరించు విధముగా

దైవారాధన గావించుటలో నిష్ణాతులై, సుస్వరయుక్త వేద పారంగతులైనవారు ఆ పట్టణమందలి బ్రాహ్మణులు' అన్న భావమును ప్రోదిచేసినాడు కవి.

క్షత్రియ వర్ణనమునవారి రాజసమునకు అనుగుణముగా, వారి పరాక్రమ మును వ్యంజించునట్లుగా శ్రుతికఠినమైన రీతిలో 'దుర్వార విద్విషద్గర్వ నిర్వాపణాఖర్వ శౌర్య' అన్న అక్షరములు కూర్పబడినవి. ఇందు 'ర' కారము 'రేఫశ్లిష్టము' ప్రాసయతియందు పునరావృతమైనవి. 'ర' కారము అగ్నిబీజము. రాజులును అగ్నిబీజులే. (రః పుమాన్ పావకే కామేక్షయే వజ్రేహస్తే - నానార్థ) అనగా 'అగ్నిబీజులై మహాబలపరాక్రమములు కలిగి, మన్మథతులిత సుందరులై శత్రునాశనకరమైన దారుణా ఖండల వజ్రతుల్యమైన మనస్సంకల్పములు కలవారై, వితరణ పాణులైన వారు ఆ పట్టణమందలి క్షత్రియులు'అన్న భావము సూచితము.

వైశ్యవర్ణనమున వారి సంపద్వ్యాపారదక్షతలకు తగినట్లుగా 'పేటీభృత స్వర్ణకోటీఫణాదాన పాటీ'అన్న అక్షరములు కూర్పబడినవి. ఇందు 'టీ' కారము (ఈ కారముతోకూడిన ట వర్ణము) ప్రాసయతి యందు పునరావృతమైనది. 'ఈ' కారము లక్ష్మిని-సంపదను (ఈ కారోఽబ్జపశే లక్ష్మ్యాం ... రసనాయాం) 'ట' కారము వాక్చాతుర్యమును (భూమ్యావృత్త్యోస్తు టాస్త్రియామ్) సూచించును. అనగా 'కోట్లకు పడగలెత్తిన సంపదతో కూడినవారై, ఆవృత్తి - పలుమారు పలుకుట - అనగా తాము విక్రయించునట్టి వస్తువులందలి గుణములను పలు విధములుగా ఉగ్గడించి క్రేతలను ఆకర్షించునట్టి వాక్నైపుణ్యము కలవారు ఆ పట్టణమందలి వైశ్యులు' అన్న భావము సూచింపబడినది.

శూద్రవర్ణనమున వారి సహనము, మానవసేవా తత్పరతలకు అనుగుణ మగునట్లుగా 'గోత్రామృతాశన క్షత్త్రార్య భజనాతి మాత్ర కృషి క్రియాపాత్ర' అన్న అక్షరములు కూర్పబడినవి. ఇందు 'త' కార, 'ర' కారముల సంశ్లేషము ప్రాసయతియందు పునరావృతమైనది. 'త' కారము కరుణను (కరుణాయాంతు తాస్త్రియాం), 'ర' కారము అనుసరణమును (రాస్త్రియాం......ఆశంసాయాం గతావపి - నానార్థ) సూచించును. అనగా 'తోటి మానవుల పట్ల దయగలవారై, తమ కార్యములను పరిత్యజించియు ఇతరుల కార్యములను చేయువారై, మానవ

సేవాముఖమున మాధవసేవ గావించు పరహిత వ్యాపృతులు ఆ పట్టణమందలి శూద్రులు' అన్న విషయము సూచింపబడినది.

ఈ భావములన్నియు అప్రయత్నముగా సిద్ధించినవి కాక, కవి సాభిప్రాయముగనే పై విధమైన అక్షర విన్యాసము గావించినట్లు సీసగీతము నందలి భావము స్పష్టపరచుచున్నది. బ్రాహ్మణులు 'అనిరతాధ్వర మంత్ర స్వరము' చేతను, క్షత్రియులు 'అరివీరవిజయఘోషణము' తోడను, వైశ్యులు 'బహువస్తు విక్రయార్థ భాషణము' తోడను, శూద్రులు 'అఖిల ధాన్య భృత్పృ కట శకట చరణ రటనము' (ఎద్దులవలె పనిచేయువారు) తోడను ఒప్పినట్లు క్రమముగా కవియే చెప్పినాడు.

ఇట్లు సామాన్యమైనదిగా అనిపించునట్టి వృత్త్యనుప్రాస మనెడు శబ్దాలంకారమునకును అర్థ గౌరవము కలిగించునట్టి దానిగా తీర్చి దిద్దుటయందు నరసింగకవి శబ్ద సౌష్ఠవము తేట పడుచున్నది.

3. అవతారికయందు నరసింహారెడ్డి అగ్రజుడైన కోదండరామ రెడ్డి వితరణ గుణమును ఇట్టి శబ్ద చిత్రముచేతనే కవి చెప్పినాడు.

'కోదండరామరెడ్డి స
దాదానపు భా గురుత్వ తత్వము తనరం
గా దరణిజ శశి శిబి బలు
లా దివిగవి పగిది లఘువులైరి తలంపన్' (23-1)

కోదండరామరెడ్డి దానపు 'భా' - దానకాంతి గురువైనది. అనగా గొప్పదియైనది. ఈ 'భా' గుర్వక్షరము - అలఘువు. అప్పుడు తరణిజ (కర్ణుడు), శశి, శిబి, బలులు (బలిచక్రవర్తి మొదలగువారు) ఆ దివిగవి (కామధేనువు) పగిది లఘువు లైరి అనగా చులుకనివారు-చేవలేనివారు అయినారు. ఇచ్చట కర్ణాదులు లఘ్వక్షరములతోకూడిన పదములచే చెప్పబడినారు.

అర్థానుగుణమైన అక్షరవిన్యాసమునకు ఇది నిదర్శన.

4. నరసింగకవి ద్వి, త్రి, చతుః, పంచ సంఖ్యల నొప్పు ప్రాసలతో గూడ పద్యములను రచించినాడు. ఈ విధముగా యమకముతో పద్యము చెప్పుట

శబ్దచిత్రము క్రిందికే వచ్చినను ప్రతి అక్షర సముదాయమునకును అనుచితము కాక, సందర్భమునకు అనుగుణమైన విధముగా అర్థము ఒనగూడుట ఈయన రచన యందలి ప్రత్యేకత.

శ్రీకృష్ణుని లోకపాలనమును గురించి చెప్పుచు
'ఆ వనజాతనేత్రుడ సహాయ పరాక్రముడై నిశాట శి
క్షా వనజాత జాత శితికంఠ సహస్రవిలోచనాది దే
వావన జాతకీర్తి కలితాష్ట దిశాక్రముడై ధరాస్థలిన్
గావ నజాతశత్రుడనగా విలసిల్లెను ధర్మ పద్ధతిన్' (128-1)

అనియున్న పద్యమున 'వనజాత' అన్న నాలుగక్షరముల ప్రాసయున్నది. వనజాతనేత్రుడు- కృష్ణుడు, నిశాటశిక్షా వనజాతజాత - అనగా రాక్షసులను శిక్షించుటచేత బ్రహ్మ (రుద్రేంద్రాదులైన), దేవ అవన జాతకీర్తి - దేవతలను కాపాడుటచేత పుట్టిన కీర్తి (కలవాడు), ధరాస్థలిన్ కావ నజాత శత్రుడనగా - భూప్రజలను రక్షించుటకై అవతరించిన ధర్మజుడన్నట్లును, శత్రురహితుడన్నట్లును ఉన్నవాడు కృష్ణుడు అన్న విభిన్నార్థములు సిద్ధించినవి.

ఈ విధమైన అర్థసిద్ధిని కలిగించుటలో నరసింగకవి నిపుణుడు.

## పద ప్రయోగ వైచిత్రి

అచ్చటచ్చట కవి ప్రకరణౌచిత్య పోషకములగునట్లుగా ఆత్మీయతా ముద్రతో నూతన పద గుంభనములుగా కొన్ని అపూర్వ పద ప్రయోగములు కావించినాడు.

కుపితయైన సత్యభామ పట్టుడు కఱ్ఱతో కొట్టబడిన 'ఆడు సింగము'వలె 'హర్యక్షభార్యావిధంబున' (32-2) కోపాగారము చేరినదట.

మందపవనము అను అర్థమున 'సోమరి తెమ్మెర' (165-1) అన్నాడు.




కృష్ణునకు అభ్యంజనము గావించు చెలికత్తెలను వర్ణించుచు అవి 'వెన్నెలదొర పిల్లల' (125-2) వలె ఉన్నవన్నాడు. ఇందలి 'పిల్ల' శబ్దము

సంతానార్థమునకాక విశేషణముగా ప్రయుక్తము. 'బాలచంద్రుడు' లేక 'చంద్ర రేఖ' అన్న అర్థములందు కవి వాడినాడు.

ఉతికి ఆరవేసిన మడిబట్టలు కట్టుకొని భుజించుట బ్రహ్మణుల ఇంట ఆచారము. మడుగు - పరిశుద్ధ వస్త్రము. దీనికి బహువచన ప్రత్యయముచేరి 'మడుగులు' అయినది. కాలక్రమమున ఇందలి 'గు' లోపించి 'మడులు'గా మారినది. 'ఇత్తునకు బహువచనము పరమగునపుడు ఉత్వము వచ్చుట' వ్యాకరణ సంప్రదాయము. ఆ విధముగా 'మడులు' అన్నదాని ఏకవచనము 'మడి' అయినది. ఇట్టి మడి వస్త్రములను 'ఏదోహార శుద్ధి వస్త్ర సంధారణలు' (142-2) అన్నాడు కవి.

భోజనము చేయునప్పుడు ఎడమవైపు ఉంచునట్టి మంచి నీటి చెంబులను పానీయాల్పకుంభములు (144-2) అని పేర్కొన్నాడు.

ఎవరైనను ఏదైన వాదులాటలో మధ్యవర్తులుగా వచ్చి సర్ది చెప్ప యత్నించినపుడు, ఆ మాటలు వారికి అయిష్టమైనచో 'బో పెద్ద మనిషివిలే. మా బాగా చెప్పవచ్చినావు' అని ఎత్తిపొడుచుట లోక వ్యవహారము. ఈ విషయమునే 'తనను గురించి నిందాలాపములు పలికిన నారదుని గూర్చి సత్యభామ 'తమ్ము బహుపెద్దల్ (36-2) గా విచారింతురో' అని ఎత్తిపొడిచినది,

కృష్ణుని బూటకపు మాటలను సత్యభామ 'వనగండ్లమూటలు' (43-2) అన్నది. కొంతసేపటికే కరిగిరై రూపమును కోల్పోవునవి వడగండ్లు. అట్లే కృష్ణుని మాటలును నిలుకడలేనివై క్రియాశూన్యములైన మెరమెచ్చులే యని భావము.

ఎవరైన ఏదైన అవివేకము పనిచేసిన, చూచినవారు 'సిగ్గుపోయేపని ఎందుకు చేసితివని' చేసిన వారిని దెప్పిపొడుచుట లోకసహజము. అట్లే ఇందు తనను సాంత్వనపరచు కృష్ణునితో 'అత్తమామలైన దేవకీ వసుదేవుల ముందర తనకు హ్రీత్యాగంబగు వర్తనంబును' (106-2) అతడు కావించినట్లు' ఎత్తి పొడిచినది. సిగ్గుపోవువని అనులోక వ్యవహారమునే కవి సంస్కృతీకరించి హ్రీత్యాగంబగు వర్తనము అన్నాడు.

తలంటు పోయునపుడు ఒళ్ళు రుద్దుటను 'కరసాన' (122-2) ఘటించుట యన్నాడు

సర్వసుఖాస్పదమైన ఇంటిని 'కమ్మటిల్లు' (230-4)గా ప్రయోగించినాడు.

## సమాస కల్పనము

నరసింగకవి అర్థపుష్టిని గావించు విధముగా సమాసములను ఘటించినాడు. వ్యక్తుల శౌర్యౌదార్యాది గుణ సాంద్రతను సూచించుటకై ఆయా విషయములను దీర్ఘ జటిల సమాసములందు చెప్పుట ఈయనకు అలవాటు. సంస్కృత సమాసములను మిక్కిలి సుకరముగా కూర్చగలడు. అయిదు, ఆరు పదముల ఆచ్ఛిక సమాసములును, మిశ్రసమాసములును ఈ కవి రచనయందున్నవి.

అవతారికయందు హనుమంతరాయని కీర్తిని 'జగచ్ఛటా గుణస్యూత నిజోల్ల సద్వర గుణోత్కర రత్నమయ స్రగగ్ర ముక్తాతతిగుచ్ఛ విశ్రుత వికస్వర కీర్తిరుచి ప్రరోహుడై' (50-1) అని వర్ణించినాడు.

వల్లభరాయని పరాక్రమము 'ఆసారాయత శారాదృత సారశరాసాభ్రలూన శత్రుకమలుడై' (51-2) అని అభివర్ణించినాడు.

ద్వారకా నగరమందలి దిగుడు బావులను సుకర సుందరములైన సంస్కృత సమాసములలో వర్ణించినాడు.

'సురుచిర శశికాంత సోపానముల తోడ
రమణీయ మణిమంటపములతోడ' (120-1)

ఇందలి ప్రతిపాదము (సమాసము) ఒక్కొక్క సమనిర్మితమైన సోపానమువలె మలచబడినది.

రుక్మిణిని 'కన్నులవింటిరా కొమరుగన్న వెలంది' (171-1) అని పెక్కు ఆచ్ఛిక పదములతో గూడిన సమాసమున చెప్పినాడు.

అంధకారమును 'ముదివార సుదతుల కెలబ్రాయ మొసవించు మదనుని మృదుచికిత్స'గా (162-2), 'కంతునిమాయమచ్చు పొడిగా' (160-2) అభి

వర్ణించినాడు. ఇందలి 'మృదు, చికిత్స, మాయ' వంటి తత్సమపదములు ఆచ్ఛిక శబ్దములందు అతికిపోయినవి.

నారదుడు కావించిన దశావతారస్తుతి యందలి నృసింహావతార వర్ణన మందు నరసింహుని రభసావిర్భావమునకును, అసురేంద్రుడైన హిరణ్యకశిపుని బీభత్సకరముగా వధించుటకు అనుగుణమైన విధముగా కఠినపదస్యూత సమాసములతో ఆరభటీవృత్తిలో,6 గౌడీరీతిలో విషయమును విస్ఫుటీకరించినాడు.

'తనతో నర్భకుడన్న మాటకు సభాస్తంభంబు హస్తంబుచే
గినుకం దట్టిన నుట్టిపడ్డగతి దిగ్భేదార్భటిన్ స్తంభ సం
జనితోగ్రాకృతియై హిరణ్యకశిపుం జాగ్రన్నఖాగ్రాళిచే
హననక్రీడ నటించి త్రుంచవె నృసింహస్వామివై మాధవా!' (156-1)

ఇందు నరసింహుని హఠాదావిర్భావమును 'ఉట్టిపడ్డగతి' అన్న చక్కని తెలుగు పలుకుబడితో, ఔగ్ర్యమును 'దిగ్భేదార్భటిన్, స్తంభసంజనితోగ్రాకృతి, జాగ్రన్నఖాగ్రళి' అన్న చిక్కని సంస్కృత సమాస ఘటనముతో కవిచెప్పినాడు. హిరణ్యకశిపుని చీరుటయందలి తీవ్రతను 'హననక్రీడ'గా అభివర్ణించినాడు. 'హననము' క్రూరకర్మ. 'క్రీడ' విలాసకర్మ. ఈ రెండును పరస్పర విరుద్ధములు. వీనిని ఈ విధముగా రూపించి చెప్పుటలో నరసింహుని క్రౌర్యము ద్యోతితము. ఈ విధముగా చిరుపదములతో గూడిన భావధుర్యమైన సమాసముతో నరసింగకవి ఆ ఉగ్రనరసింహుని దుర్భరరూపమును పఠితలకు సాక్షాత్కరింప జేసినాడు.

## జాతీయములు-సామెతలు

నరసింగకవి అటనట పెక్కు జాతీయములు, సామెతలను ప్రయోగించినాడు. ఇట్టివి అర్థస్పష్టతగావించి కవిలోకజ్ఞతను చాటుచున్నవి. 'తియ్యదనముప్పతిల', 'తియ్యదనముదోప' 'నవ్వొగురొత్తగ', 'తెప్పలదేలు' వంటి సాధారణమైన తెలుగు పలుకుబడులతోపాటుగా, కవి స్వీయతను సంతరించుకొని సందర్భమునకు పుష్టిని చేకూర్చునట్టి ప్రత్యేక పలుకుబడులును ఉన్నవి. 'చుక్కతెగిపడ్డ గతిన్', 'ఉట్టిపడ్డగతి', 'వసగండ్లమాట' 'పంచదారలో గరళమువంటి వర్తనము' వంటి జాతీయములు స్థానపతితములైన హవ్యములవలె సార్థకములైనవి.

'తగరు బలిసికొండ తాకినలీలన్ (253-2), దావాగ్ని పై గవియు మిడుత చందమున (85-3), పేదలకు పెన్నిధానముచే దొరికినలీల (198-3) పున్నాగముతో మశకములెన్నైనను పోరిజయింపగలవే (92-3), 'హస్తిమశకాంతరము' (270-2) 'దాసరితప్పు దండమున దప్పునటందురు' (88-2) వంటి లోకోక్తులు, దృష్టాంతములు ఈ కవిరచనయందు పెక్కులు.

'కపటికి నెంతబెట్టి యుపకారము చేసిన మేలుచేసునే' (39-2) 'కాముకస్య కుతస్సత్యానుచిత్తమ్' (41-2), స్త్రీలకు మానరక్షణముసేయని కట్టిడి భర్త గల్గినన్' (46-2), చల్లకువచ్చి ముంతదాచగవలెనే' (272-2) వంటి అర్థాంతర సమర్ధనములు సందర్భపోషకములు.

ఇట్టి సమర్థనములలో కొన్ని సందర్భమునకు అతికి కవి లోకజ్ఞతకు దర్పణము పట్టుచున్నవి.

నరకుడు సమరక్షోణికి రాగానే సత్యభామ వీరాలంకారభూషితయై తన ప్రాణేశ్వరుని ఎదుట నిలిచినది. అప్పుడు కృష్ణుడు 'నీవు వలదన్నను వినవు. దీనివలన (నీవు యుద్ధము చేయుటవలన) మనకెట్టి అపకీర్తి, వచ్చినను భరించెదను. నీ యిష్టప్రకారముగనే యుద్ధము చేయుమన్నాడు. అప్పుడు కృష్ణుడు లోకధర్మమును చక్కని అర్థాంతరముతో సమర్థించి చెప్పినాడు.

'వనితామణి ! మెచ్చనట్టి వార్తలు విన్నన్
జనులైన నేమి యననీ
మొనసిన సంద్రంబుమూయ మూకుడు గలదే' (273-2)

ఇందు, కృష్ణుడుండగా సత్యభామ యుద్ధము చేయుటను లోకము పలువిధములుగా వ్యాఖ్యానించ గలదన్న భావము గర్భితము. 'అవ్వ ! మగడుండగా ఆడుది సిగ్గులేక పగవానిఎదుటబడి సిగసిగలు పట్టుకొని పోట్లాడుచుండెనా?' అని సత్యభామను, ఆడుది యుద్ధము చేయుచుండగా, చేతగానివాడై నిర్లజ్జతో చూచుచున్నాడని' తనను లోకము ఆడిపోయగలదని కృష్ణుడుచెప్పి 'ఎవరేమనుకొన్ననేమి ? మన యిష్టము మనది' అను 'లోకము నోరుమూయ నెవరి తరము' అన్నాడు.

ఈ లోకము ఎప్పుడును పరులయందలి దోషములనెత్తి చూపి నిందించు స్వభావము గలది, ఎంతటి వారును లోకము నోరు మూయించుటకుగాని, లోక ధర్మమును అణచుటకుగాని సమర్థులు కాలేరను భావమును 'మొనసిన సంద్రంబు మూయ మూకుడుండునా' అన్న అర్థాంతరముతో తన భావనను సమర్థించినాడు.

ఇట్టి సమర్థనములు లోకతత్త్వ సంబోధకములు.

## ఉపమాన నవ్యత

నరసింగకవి కొన్ని విషయములందు ఆత్మీయతా ముద్రనువైచి వైలక్షణ్యాము చూపినాడు. ఇట్టిది ఆయన నవ్యపద గుంఫనములు, సందర్భ శుద్ధి గలిగిన పలుకుబడులు, క్రొత్తఉపమానములు, కవి సమయములు, బ్రాహ్మణ సంప్రదాయ చిత్రణము మొదలగు అంశములందు తెలియగలదు. ఏ విషయమునైనను వర్ణించుటలో దాని యందలి సూక్ష్మాంశములను కూడ విడువక చెప్పుట ఈయనకు నైజము.

సాధారణముగా ఇతర కవులు అంతగా ప్రాధాన్య మివ్వనట్టి జంఘలు, జానువులు మొదలగు అవయవములను గూడ స్త్రీ సౌందర్యమున వర్ణించినాడు. హస్తాంగుళులు, నఖములు వంటి వానికి నూతన ఉపమానములను పేర్కొన్నాడు కొన్నిటికి స్వీయోత్ప్రేక్షలు సృష్టించినాడు.

స్త్రీల తరుణాంగుళములు 'పిల్ల పెసరులతో' (201-1) పోలిన వన్నాడు. పొలమునకు సత్తువగను, పశువుల మేతగను ఉపయోగపడునట్టి పిల్లపెసరుకాయలు సన్నముగను, మృదువుగను, ఉండుటచేత అట్లు పోల్చినాడు కవి.

కోప మందిరము నందలి సత్యభామ 'పేదముత్తైదువ' (51-2) వలె ఉన్నదట. రాజకన్యల జానువులు 'కొబ్బరి గిన్నెల' (208-1) వలెను, జంఘలు 'కమల గర్భముల' (209-1) వలెను ఉన్నవన్నాడు.

తిమిరంపు గుంపును 'ముదివారసువతులకెలబ్రాయమొదవించు మదనుని మృదు చికిత్స' గను (162-2), 'కంతుని మాయమచ్చుపొడి' (160-2) గను ఉత్ప్రేక్షించినాడు.

'పశ్చిమాంబుధిగత పాతాళ సుచిరత్న ఫణిఫణారత్న ప్రభా పటలము' గను, 'సమయాధ్యనిష్కూట సముదంకురిత దళ మహిత శోణాశోకమండలము' గను, వారుణి ద్వీప సంభవ శంభదుత్తాల సరసవిద్రుమలతా సముదయము' గను, 'విరహిజన జనాభిసరణ మీనాంక కృద్ఘన రక్త పటకుటికా నిచయము' గను సంధ్యను (159–2) కవి ఉత్ప్రేక్షించినాడు.

'సమయ సిద్ధుడు క్రియాసము దయంబులచేత ఘటియించు నూతంపు ఘటిక'గను, 'కాలవర్తకుడు స్వోత్కర్ష చేతంగట్టుడంచైన ముగ్తాఫలము'గను 'విరహులను మృగముల వేటాడి జాలించి చనుమదనుని చేతిశంశము' గను వేగు చుక్కను (175-2) కవి ఉత్ప్రేక్షించినాడు.

ఈ విధమైన నవ్యోపమానములు నరసింగకవి భావనా పటిమను వెళ్ళ డించు చున్నవి.

## అర్థవిశేషములు

నరంగకవి సందర్భమునకు అనుగుణమగునట్లును, తన భావమును స్పష్టముగ వెలిబుచ్చునట్లును పెక్కు విరళార్థక ప్రయోగములు చేసినాడు.

'విశేషేణ అత్యంతరమితి విరళం, రా - ఆదానే' విశేషముగా అవకాశ మును అంగీకరించునది అని విరళశబ్దార్థము. పలుచగా అనగా విశేషార్థమున వాడిన ప్రయోగములు అని పైదానికి అర్థము.

1. **'వ్యాపాదస్థితి'** (27-1) ద్రోహపు తలంపు.

2. 'ఘన **సోమ** శ్రీమహిమన్' (35 - 1) ఇట 'సోమ' శబ్దమునకు 'చంద్రుడు' అను అర్థముకన్న 'పరాక్రమము' అన్న అర్థమే యుక్తము. ఈ యర్థమున ఇది తద్భవమగును. అట్టిచో రెండు సంస్కృత పదముల నడుమ వైకృత పదము చేరినట్లగును.

3. **'సలయింప**నలరును గలమాది ధాన్యంబు'(47-1) సలు = పొలకాలువ లోనగు వానికి నీరు ఆవలికి పోవుటకు నడుమ అడ్డముగా పెట్టు తడిక. సలయింప = పంటకాలువలో నీరు పైకి ఎక్కుటకు అడ్డముగా పడిపలుకట్టి నీరు పారించుట.

4. 'హనూమత్ప్రభున్ **తిలకున్** రాయనృపున్' (49-1) తిలకము = శ్రేష్ఠము. (ఇది తరచు సమాసాంతములందే ప్రయుక్తము) - సూ. రా. ఆం. ని. ఈ యర్థమున నిది సమాసోత్తర పదమగును - శబ్దార్థ చంద్రిక. కాని ఇట వ్యస్తముగా ప్రయుక్తము. తిలకుడు - శ్రేష్ఠుడు.

5. 'వినమ్రమవిద్విషజ్జాలిని' (61-1) జాల = సమూహము. జాలం సమూహ'—అమరము. నతశత్రు సముదాయుడు అన్న అర్థమున ప్రయుక్తము.

6. 'నిలింప దంపతీ **ద్వాపరకృత్** పరస్పర' (109-1) 'ద్వాపర కృత్'—అనుమానాస్పదమైన అను అర్థమున ప్రయుక్తము.

7. **'ఆరామాబ్ధితటీ'** (134-1) రామ = నది.

8. **'రిపుమల్లాసవ తిమిరార్కుడు'** (178-1) ఆసవము-అసువు సంబంధమైనది. అనగా 'శత్రువీరుల ప్రాణములనెడు చీకటికి సూర్యునివంటివాడు' అన్న అర్థమున ప్రయుక్తము.

9. **'సవతు'** (176-1) సామ్యము.

10. ఖువినొద్దిక **'గద్దరిలున్'** (40-2) గద్దరిల్లు - కూర్చుండు, కూలబడు అన్న అర్థమున ప్రయుక్తము.

11. **'సోమ** రూపము'(43-2) సోమశబ్దము కర్పూరము అను అర్థమున ప్రయుక్తము. 'సోమః కుబేరేకర్పూరే ' - అమరము. కర్పూరము యొక్క రూపము క్షణ క్షణమున హరించిపోవునట్లు ధూర్తునికి మాటయందు నిలుకడ ఉండదు అన్న అర్థమున ఉన్నది.

12. **'ఖళారి'** (53/2) మోసగాడైన శత్రువు.

13. **'నపాదులు'** (146-2) ఆ మూలముగా, సంతృప్తిగా

14. **'నాయకుడు'** (169-2) చంద్రుడు అను అర్థమున ప్రయుక్తము. 'అధిభూర్నాయకోనేతా ప్రభుః పరివృఢోధిపః, ప్రభౌ భూమిపతౌ రాజాక్షత్రియే రజనీపతౌ'.

15. 'వెలిదొంగ' (169 - 2) బయటనుండి వచ్చుదొంగ. కన్నపు దొంగ.

16. **'వయోవరులు'** (173-2) గరుడ పచ్చలు అన్న అర్థమున ప్రయుక్తము. 'ఖగబాల్యాది నోర్వయః' - అమరము. వయోవరుడనగా గరుత్మంతుడు.

17. **'పరిణామము'** (223-2) ఆనందము.

18. 'అవనీ సూనున **కవి** కేతు' (300-2)అవనీ సూనునకు + అవి. అవి = సూర్యుడు 'అవయశ్శైలమేషార్కాః' - అమరము.

19. **'మస**రంజిలమీరిన' (324-2) మస = మూపు.

20 'బ్రహ్మ, భవ, నేత్రక**ర్ణా**గ్ర ప్రకటమానులు' (347-2) నేత్ర కర్ణము = చక్షుశ్శ్రవము - సర్పము. వానియందు అగ్రుడు - ఆదిశేషుడు.

21. **'వగ** సుందరి దోర్కారమ్ము' (117-4) వగ = విలాసము.

22. **'దండుగ**లందుడి' (153-4) దండుగలు = రాజు బంట్ల సామర్థ్యమును మెచ్చుకొని ఇచ్చెడి బహుమానము.

23. **'దశా**వతార వర్తనలు' (193-4) 'దశ' శబ్దము 'బాల్యము మొదలైన అవస్థలు' అన్న అర్థమున ప్రయుక్తము. 'దశావస్థానే కవిధాపి' అమరము 'జీవితకాలమున గలిగిన వర్తనలు' అని పై సమాసార్థము.

24. 'వర్ష **కాళిక'** (225-4) వానమబ్బు.

25. **లావణము 'గల్గువారి'** (227-4) స్వేదజలము.

26. ఘోరా**సారాధారా** భారంబై' (228-4) ఆధారము = మడుగు.

27. 'ప్రౌఢయాంధ్ర **కురువంపుడు'** (230-4) 'ఉరువంపుడు' అన్నది ఉగ్రాడు, వ్రేలాడు అన్న అర్థమున ప్రయుక్తము. (కించిత్ వర్ణల్)

28. 'యావ**కాళింపు**ధాన్యాళి' (239-4) ఆళి-మినుములు. అలసందలు.

ఇట్లు నరసింగకవి ప్రయోగించిన, విరళార్థకములుగా పేర్కొన్న పదములలో పెక్కులు నిఘంటువులందున్నవే. కాని వానికి ప్రసిద్ధములైన అర్థములు కాక ప్రత్యేకమైన అర్థములుండుటచే వానినిట ప్రత్యేకముగా చూపవలసి వచ్చినది.

## మాండలికములు

నరసింగకవి రచనయందు అటనట కొన్ని మాండలికపదములు కనబడు చున్నవి.

1. 'శాద' (58-2) సేద - బడలిక.

2. 'సేలు' (180-2) క్షేమము, కీర్తి. 'నిన్నుముంచి వాడే విసేలౌతాడు' అని వ్యవహారము.

3. 'ఏగోలము' (26-3) 'చిరుతపులి జాతికి చెందినది' అని 'గ్రుడ్డి ఎలుగు' అని రెండు విధముల వ్యవహారమున ఉన్నది.

4. 'నారిజ' (18-4) నారింజ.

5. 'వేధ' (108-4) వేదన.

## అన్యదేశ్యములు

నరసింగకవి నిజాముపాలన యందుండిన తెలంగాణయందలి జటప్రోలు సంస్థానము వాడైనందున ఈయన హింది, ఉర్దూభాషాపదములు పెక్కింటిని వాడినాడు.

1. 'బహాదరు' (10-1) బహద్దరు — ఘనసూచకమైన బిరుదు.
   వజీరు - రౌతు, మంత్రి.

2. 'పేష్కారులు' (31-1) అమల్దారు (తహశీల్‌దారు) క్రింది ఉద్యోగస్థుడు. నేటి U.D.C. వంటివాడు.

   సదరు - ముఖ్యమైన Chief.

3. 'సవాయి' (71-1) ఒకానొక ముఖ్యమైన.

4. 'మన్నెవారీలు' (73-1) పన్నులు వసూలుచేయుట.
   దేశాయి - దేశముఖ్ - బిరుదు.

5. 'బహిరి' (91-1) బిరుదు.

6. 'నాస్త' (213-2) ఉపాహారము లేక ఫలాహారము.

7. 'సజరు' (16-3) బహుమానము.

8. 'పఠాణీ జమాదారు' (204-3) 'పఠాన్' జాతికి చెందిన భటాధికారి
'మొగలి వజీర్లు' 'మొగల్' జాతికి చెందిన రౌతులు.
'కట్టాఫౌజు' ఇకత్తా - సమీకృత, ఫౌజ్ = సేన.
'సైదుల లసకరుల్' 'సయ్యదు' జాతికి లష్కరులు. లష్కరు - దండు, సైన్యము.
'శేకు' 'షేక్' జాతికి చెందినవారు.
'సవారి' పల్లకి, గుఱ్ఱముపైనెక్కి పోవుట.
'సిద్దీలు' 'సిద్దీఖీ' జాతివారు. షేక్, సయ్యద్, మొగల్, పఠాన్, సిద్దీఖీ అనునవి మహమ్మదీయజాతులందలి భేదములు.

## గద్యరచన

నరసింగకవి చిక్కని గద్యరచన చేసినాడు. రాచకన్యకా పరిణయమందు నూటికిపైగా వచనములున్నవి. వీనియందు పెక్కులు కథాంశములను కలుపు అతుకులుగ నున్నవి. నాలుగైదు పెద్ద వచనములు వర్ణనాత్మకముగా, జటిల సమాసభరితమై, నానాలంకార భూషితమై ఈయన గద్యరచనా పాటవమునకు నికషోపలములుగా నున్నవి.

1. రాత్రిని వర్ణించునట్టి వచనము.

'వెండియు సప్పుండరీక మండలంబున దండిమెరసి వర్షించు పండువెన్నెల లజాండకరండంబునందు సమయోరవ్యండు పిచండిలంబుగా నిండించు కర్పూరా ఖండ పాండిత్యంబు నంగీకరించుచు' (171-2) అన్న విధముగా పెక్కు రూప కోత్ప్రేక్షోల్లేఖాద్యనేక అర్థాలంకార, అనుప్రాస ముక్తపదగ్రస్తాద్యనేక శబ్దా లంకార పూర్ణమై ఒప్పినది. ఈ వచనము మూడుపుటల వ్యాప్తి కలిగినది. దీనిని 'ధ్వాంతగద్య' అని పేర్కొనవచ్చును.

2. రైవతకాద్రి రామణీయకము కూడ ఈరీతిగనే

'మరియు సద్గాధరంబు సురాసుర జేగీయమానంబై, నిరంతర కిసలయ కోరక కుసుమ పరిమళ భరితంబులైన నానా నోకహంబుల విరాజమానంబై...

............, శ్రుతిహిత ద్విజశబ్దంబు గావున యజ్ఞవాటంబునుం బోలె, హరి నివాసంబు గావున వైకుంఠపురంబునుం బోలె, పుండరీకనిలయంబు గావున కాసారంబునుంబోలె............' (59-3) అన్న విధముగా శ్లేషోల్లేఖాదులచే సాగినది. ఇది పోతనామాత్యుని భాగవత సప్తమస్కంధమందలి 'స్తంభోద్భవ గద్య'ను తలపించుచున్నది.

3. భూదేవి కావించిన కృష్ణస్తుతి

'దేవా ! పిపీలికాది యోనులందును మోదఖేదభోగాభోగ సంజనితులై, దుఃఖాగ్నిహోత్రంబున తంతన్యమానులై శోకశాంతిలేని శరీరాభిమానంబున మోహితులై...' (348-2) అన్నవిధముగా భగవత్ప్రతిపాదకము, వేదాంతార్థ సంభరితముగనుండి, దండకప్రాయమై భారతారణ్యపర్వమందలి నన్నయ భట్టారకుని అర్జునకృత పరమేశ్వర దండకమును పురుడించుచున్నది.

ఈ రీతిగా నరసింగకవి చక్కని శబ్దాధికారముగలవాడై శబ్ద శిల్పము నందే అర్థగాంభీర్యమును పొదిగి, శబ్దార్థములను కవల పిల్లలవలె ఆదరించి పూర్వ ప్రబంధకవులకు తీసిపోని విధముగా 'రాచకన్యకా పరిణయ' ప్రబంధ రచనమున తన పాండిత్యమును ప్రదర్శించినాడు.

# 5. వర్ణనా వైచిత్ర్యము

ప్రబంధములకు ప్రాణభూతమైనవి వర్ణనలు. ఒక్క ప్రబంధమునకే అన నేల కావ్యప్రపంచముననే వర్ణనకు మిగుల ప్రాధాన్యమున్నది. వర్ణన మనగా కవిత్వమనియు, కవిత్వమనగా వర్ణనమనియు సాధారణ వ్యవహారము. 'కవి' శబ్దార్థమే ఈ విషయమును ధృవీకరించుచున్నది. 'కబృ' వర్ణే-వబయోరభేదః- అని ధాత్వర్థము. 'వర్ణింప దగినది కావ్యము', 'వర్ణించువాడుకవి. అతనికర్మ కావ్యము', లోకోత్తర వర్ణనా నిపుణుడైన కవియొక్క కర్మ కావ్యము', నవ నవోన్మేషశాలినియగు ప్రజ్ఞ ప్రతిభయనబడును. దానికి ఆశ్రితుడై వర్ణనము చేయువాడు కవి' అని పలువురు పూర్వాచార్యుల అభిప్రాయము.

వర్ణన మనగా వర్ణించుట. 'వర్ణస్తుతౌ' కొనియాడబడునది, కొనియాడు నది-అని గురుబాల ప్రబోధిక. ఒక వస్తువుయొక్క బాహ్యాకారమును, దానినుండి పుట్టిన భావములను, అంతరాకారమును,దానినుండి పుట్టిన భావములను వర్ణించుట వర్ణనమగుచున్నది. బాహిరాంతర వర్ణనలు రెండును వర్ణనమే అగును.

కావ్యములందలి ఇట్టి వర్ణనల సంఖ్య ఎంత ? అవి ఏవి? అన్న విషయ మున భిన్నాభిప్రాయములున్నవి. సాధారణముగా అష్టాదశవర్ణనలు (18) అన్న మాట సాహిత్యలోకమున బహుళ వ్యాప్తిలో ఉన్నది. నగరము, సముద్రము, శైలము, ఋతువులు, చంద్రోదయము, సూర్యోదయము, ఉద్యానము, సలిల క్రీడ, రతి, మధుపానము, విప్రలంభము, వివాహము, కుమారోదయము, మంత్రము, దూత్యము (ద్యూతము), ప్రయాణము, యుద్ధము, నాయకాభ్యుద యము అనునవి అష్టాదశ వర్ణనలు. దూత్య, ద్యూతముల విషయమున అభి ప్రాయభేదమున్నది. దండి, విద్యానాథుడు, నన్నెచోడుడు, విన్నకోట పెద్దన మున్నగువారు అష్టాదశవర్ణనలను పేర్కొనగా, అప్పకవి ఇరువదిరెండు (22), విశ్వనాథుడు ఇరువది అయిదు (25), భోజుడు ఇరువది యారు (26), అందరి కంటే కేశవమిశ్రుడు ముప్పదినాలుగు (34) వర్ణనలను పేర్కొన్నారు.

వెల్లూరు నరసింగకవి కూడ తన రాచకన్యకా పరిణయమున పెక్కు వర్ణనలు కావించినాడు. ఆంధ్రసాహిత్యమున వర్ణనాబాహుళ్యము కలిగిన గ్రంథములలో నిదియొకటి అనిచెప్పనొప్పును. కథాభాగము వర్ణనలు ఇంచుమించుగా సమప్రాధాన్యముతో సాగినవి. అయినను కల్పించుకొని చెప్పినట్లుకాక వర్ణనలు కథాసందర్భమునకు పుష్టిని చేకూర్చునట్లుగ ఉన్నవి.

గ్రంథమునందలి పద్యగద్యముల సంఖ్య 1143. ఇందు పీఠిక, ఆశ్వాసాంత్యంత పద్యములు 116 టిని తొలగించినచో కథాభాగమున 1027 గద్యపద్యము లుండును. అందువర్ణనాభాగము 400 గద్యపద్యములను మించినది. ఈవిధముగా వర్ణనల శాతము నలువదికి మీరుచున్నది. అష్టాదశ వర్ణనలందు ఒక్క 'చంద్రోదయము' తప్ప తక్కిన పదునేడు వర్ణనలు ఇందున్నవి. కొందరు లాక్షణికులు అధికముగా పేర్కొన్న మృగయ, కన్యాసౌందర్యవర్ణన, సూర్యాస్తమయాది సూర్యోదయ పర్యంతవర్ణన, స్నానాద్యవస్థల వర్ణనలును ఇందున్నవి. వృక్షము, నది, సైన్యము, ముని, సభ, ఇంద్రుడు, దశావతారములు మున్నగు వర్ణనలు యథావకాశముగా ఇందు చోటుచేసికొన్నవి. ముప్పది (30)కి పైగా ఇందున్న వర్ణనలు రమ్యముగను, సరసముగను ఉండి అలంకారసహితములై కవి భావనా బలిమిని ప్రకటించుచున్నవి.

ఏయే వర్ణనమున ఏయే అంశములు నిబద్ధింపబడవలెనో లక్షణకారులు నిర్దేశించినారు. నరసింగకవి సాంప్రదాయికుడై ఆ లక్షణములను అనుసరించినాడు. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి ననుసరించి లక్షణము స్వీకృతము.

## అష్టాదశ వర్ణనలు

### 1. నగర వర్ణన

దుర్గమ పరిఖావరణనిసర్గ బలానీక చతుర చాతుర్వర్ణ్యా
నర్గళ సంపద్వన జలవర్గస్తుతివలయు నగర వర్ణనమునకున్' అని కావ్యాలంకార చూడామణి యందలి లక్షణము. వాపీ, నదీ, సరోవర, వేశ్యాదికములు కూడా ఉండవలెను.

కాచకన్యకా పరిణయ ప్రబంధ నాయకుడు కృష్ణుడు. ఆయన వాస స్థానము ద్వారకా నగరము. లీలామానుషవేషుడైన ఆ మహనీయుని మహనీయ తను వ్యంజించునట్లు ఉదాత్త అద్భుతములతో ద్వారకను కవి వర్ణించినాడు. సంప్రదాయానుసారముగా సౌధములు, ప్రాకారము, ఖేయము, చాతుర్వర్ణ్యము, చతురంగ బలములు, వాటి(క) (వీథి), పుష్పలావికలు, దీర్ఘిక (ఓగుడుబావి), ప్రహి (చేదుడుబావి), ఆరామయ మున్నగు అంశములన్నియు పదునెనిమిది పద్యములందు వర్ణితములు. ఈ వర్ణనము గౌడి, పాంచాలీ రీతులతో, శయ్యా సౌభాగ్యముతో నొప్పుచున్నది. సౌధ ధావళ్యము. సాలౌన్నత్యములను కవి శృంగార రసభరితములుగ చెప్పినాడు. ఈ కావ్యమునందలి ప్రధానరసమైన మధుర భక్తికి అంగముగా శృంగారమును ఇట్లు ఇతర వర్ణనలందు నిబంధించి చెప్పుట ఉచితముగ నున్నది.

వరణ (ప్రహరి) వర్ణనము విష్ణుతత్త్వ ప్రతిబోధకమున ఉన్నది. దశావతారములందు కృష్ణుని బలరాముని అవతారముకన్న ముందున్న నరరూప ధారకములైన అవతారములు మూడు. అవి వరుసగా వామన, భార్గవరామ, దశరథరామావతారములు. ఆ యవతారములను ఈ ద్వారకాపురి వరణము తలపించుచున్నట్లుగా కవి వర్ణించినాడు.

'అత్యున్నతాకృత యగు త్రివిక్రమలీల
నల బలీంద్రుని మీద నడుగుమోపి' (110-1)

ఆకారమున త్రివిక్రముని, శత్రుంజయత్వమున పరశురాముని, రాక్షస నిగ్రహ మున శ్రీరామచంద్రుని, లోకరక్షణమున శ్రీమహావిష్ణువును ద్వారకాపురి వర ణము పోలియున్నది.

అగడ్త 'ఆ కుంభీనస విష్టపాధిక గభీరయై'నందున (111-1) 'నాగ కన్యలు అందు జలకేళి జరిపినట్లుగా (112-1) కవి వర్ణించినాడు. ఇట్లు సాల ఖేయములు నభఃపాతాళ వ్యాప్తతను పొందియుండు వైష్ణవ తత్త్వమును తెలుపు చున్నది.

'ద్వార కవాటకుడ్యఘటిత త్రిదశేంద్రశిలాహిజిద్దృష
ద్వార కళాధి రాడుపలధామ పరిస్ఫుట గేహవాటియౌ (120-1)

ద్వారకవాటములందు పొదుగబడిన ఇంద్రనీలములు, గరుడపచ్చలు మొదలగు వాని సముదాయములచేత, చలువరాతిచేత నిర్మితమైన ద్వారకానగరము ఇలలో వెలయగా, సురారుల యౌద్ధత్యమును వారించు చక్రధారియగు కృష్ణుడు అందు ప్రకాశించుచున్నట్లు చెప్పుటలో కృష్ణుడు విష్ణువనియు, ద్వారక (మోక్షదాయక పురి-శబ్దార్థచంద్రిక) సాక్షాద్వైకుంఠమనియు స్పష్టమగుచున్నది.

చతురంగ బలములందలి గజవర్ణనమున శబ్దార్థములు పోటీపడునట్లుగా సరసమైన ఉపమానములతో సుందరముగా ఉల్లేఖించినాడు కవి.

'ఋభురాజ వజ్ర సంక్షుభి తాంగములుగాగ
గరిమగాంచిన నీలగిరులనంగ' (115-1)

సానబట్టిన ఇంద్రనీలముల వంటి శరీరము కలిగిన నీలగిరులన్నట్లును, సముద్ర జల గ్రహణార్థము భువికి దిగిన మేఘములన్నట్లును, తన హస్తకళా నైపుణ్యము నకు నిదర్శనగా దేవశిల్పి నిర్మించిన ఇంద్రనీలమయ క్రీడా శైలములన్నట్లును, సూర్యకాంతిచేత పరిహరింపబడజాలని తిమిరంపు గుంపులన్నట్లును ఉండి అసాధారణములై కృష్ణ విజయ కారణములై, శత్రు బలవిచ్ఛేదకములైనవి గజములని చెప్పుట వాని యౌద్ధత్యమునకు అనుగుణముగనున్నది.

'సురుచిర శశికాంత సోపానములతోడ
రమణీయమణి మంటపములతోడ' (120-1)

అన్నట్లుగా మనోహరములైన చంద్రకాంతములమెట్లతో, మణిమంటపములతో, అమృత పానీయములతో, రాయంచలపిండుతో, పద్మమురందపానమత్త భృంగము లతో, కుడ్యనిర్మిత సాలభంజికలతో, గజపార్శ్వములతో, స్ఫటిక స్నాన ఘట్ట ములతో, స్నానసంధ్యాదుల నిష్ఠులైన బ్రాహ్మణులతో, జలపరిగ్రహణాగత స్త్రీ సమూహములతోగూడిన దీర్ఘికలు రమణీయ పదసోపానయుక్తములు.

## 2. సముద్ర వర్ణన

'సిరిచెలవు గుమసుధా ప్తియు
నరుదారగ నజుని తండ్రి యల్లుడు రత్నా

కరము దనపేరు జలధికి
సరిగలరే యరయ ననుచు జను వర్ణింపన్'

అని లక్షణము.

నరసింగకవి ఈ సంప్రదాయానుగుణముగనే సముద్రమును వర్ణించినాడు.

'శంబరవైరి నిజాంబికా జననంబు
నంబుద రాశ్రితాలంబనంబు' (383-2)

అని చక్కని శబ్ద చమత్కారముతో సాగినది ఆవర్ణనము. ఆదిలక్ష్మికి జన్మస్థానము, జలజంతువులకు ఆశ్రయము, మేఘములకు ప్రప, పుండరీకాక్షుని పడక, ఇంద్రాదంబరకరణము, ఆదితేయులకు అన్నదాత, పరమశివుని అమ్ముల పొది, అలల ఆటుపోట్లతో నొప్పునది, శంఖ, అమృత, కౌస్తుభ, ఉచ్చైశ్రవాదులకు జన్మభూమిగా సముద్రము వర్ణితము. ఇందలి అనుప్రాస బాహుళ్యము సముద్రమునకు నిండుదనమును ఆపాదించుచున్నది.

## 3. పర్వత వర్ణన

'అచలతయును నున్నతియును
ఖచర వినోదౌచితియును గనకాది ఖనీ
రుచి తయును మొదలుగాగల
ప్రచురతలు నుతింపవలయు బర్వతమునకున్'

అని లక్షణము.

రాచకన్యకా పరిణయమున మేరు, రైవతకాద్రులు వర్ణితములు.

'ఈ మేరువేకదా భూమికాధారంబు
హేమ మయంబు సంక్షేమదంబు' (390-2)

స్వర్ణమయమై. భూధరత్వము కలిగి, ఈశ్వరునికి బాణాసనమై, సురాలయమై, సూర్యేందు నక్షత్రాదులచే ప్రదక్షిణము గావింపబడుచు, మణి, కల్పక, మృగ, పక్షిగణావాసమై విరాజిల్లినట్లుగా మేరువును నరసింగకవి సంప్రదాయరీతిలో వర్ణించినాడు.

రైవతకాద్రి భ్రాంతిమదుల్లేఖాద్యనేకాలంకార భరితముగా సుందరముగా ఒక సుదీర్ఘవచనమున కవి వర్ణించినాడు. ఒక వస్తు రూపమును సాక్షాత్కరింప జేయుటలో కవి ఎంత భావనాసామర్థ్యమును ప్రకటించునో తెలుపుటకు ఇది మచ్చు తునకగ ఉన్నది.

## 4. ఋతువర్ణన

నరసింగకవి తన గ్రంథమున షడృతువులను వర్ణించినాడు. ఆంధ్ర సాహిత్యమున కావ్య ప్రబంధములందు నన్నెచోడుని కుమార సంభవము, పింగళిసూరన కళాపూర్ణోదయములలో మాత్రమే పూర్ణముగా షడృతు వర్ణన కనబడుచున్నది.

సత్యా పారిజాత సహితుడై అమరావతి నుండి పునరాగతుడై వచ్చిన శ్రీకృష్ణునికి తమ వేదనలు తెలుపుటకై ఒక దూతికను పంపిరి. ఆమె రాజకన్యల విరహ బాధలను నివేదించు సందర్భమున ప్రసంగమును కల్పించుకొని రాకుమార్తెలకు విరహోద్దీపకము అయిన ఋతు క్రమమును వివరించినది. ఇరువది ఆరు (26) పద్యములందు కవి ఋతువులను వర్ణించినాడు.

## వసంత ఋతువు

'అంకుర పత్ర సమాంకిత ముకుళ ప్రసూన హారి ఫలములన్
బొంకములగు వనములు నిశ్శంకముగ నుతింపబడు వసంతము నందున్'

అని లక్షణము.

నరసింగకవి వసంత ఋతువును ఆరు (6) పద్యములందు వర్ణించినాడు. వసంతము 'మదనాధిక సైన్యవిహార సంభృతాశాంతముగను, కాంత కంతు శరసంఘ సముజ్జ్వల వన్యమేదినీ ప్రాంతముగను, పాంథహృద్భయద భార మనోభవ, దర్ప విస్ఫురాత్యంతముగను, సంతతాఖిల జనాళికి నేత్ర విచిత్ర పర్వముగను, (214-2) చెప్పుటతో పాటుగా, మదనాడంబరములను ప్రకటించునదిగా, స్త్రీ పురుషులు పరమ విచిత్రముగా సంగమమును గూర్చు కొం (కుం) టె (న) గా శ్లేష రూపకాతిశయోక్తులతో రమ్యముగా శృంగారించినాడు.

'అవని కొమ్మలకు బల్లవసంగతులు గూర్చె
బుష్పిణులకు మధుస్ఫూర్తి జేర్చె
మొగి భుజంగులకు నామోద మాపాదించె
బ్రమదాళులకు రాగపటిమనెరపె
బరమహంసలకును బద్మినీతతినిచ్చె
విటప సంగతి శుకవితతికొసగె
వనవాసులకు లతాంగనల పొందుఘటించె
బ్రహ్మణ్యులకును రంభానుకూల
మెంత చిత్రంబు జూడ విభ్రాంతి గరపి
పంతమున వింతవింతలు సంతరించె
దపసులకును మన్మథవ్యాప్తి దనరజేసె
దుష్టకృత్యంబు లీ వసంతునకు దగును' (216-4)

కొమ్మలకు (స్త్రీలకు, చెట్లకొమ్మలకు) పల్లవ (విటులు, చిగుళ్ళు) సంగతి కలిగించినది; పుష్పిణులకు (రజస్వల, పుష్పించినచెట్టు) మధుస్ఫూర్తి (మద్యము, మకరందము) కలిగించినది; భుజంగులకు (విటులు, తమలపాకుతీగ) ఆమోదము (ఆనందము, వాసన) కలిగించినది; ప్రమదాళులకు (స్త్రీసముదాయము, తుమ్మెదలు) రాగపటిమ (అనురాగము, రంగు) కలిగించినది; పరమహంసలకు (మునులకు, రాజహంసలకు) పద్మినీతతిని (పద్మినీజాతిస్త్రీలు, పద్మములు) ఇచ్చినది; విటపసంగతి (విటులపొత్తు, కొమ్మలకూడిక) శుకవితతికి (శుకమహర్షి, చిలుకలు) కలిగించినది; వనవాసులకు (మునులు, వృక్షములు) లతాంగనల (లతవంటి స్త్రీలు, లతలు) ను కూర్చినది; బ్రహ్మణ్యులకు (బ్రహ్మజ్ఞులకు; ముంజతృణమునకు) రంభానుకూలము (రంభయను దేవవేశ్యా సంభోగము, అరటిచెట్టుతో కూడిక) కలిగించినది. తపసులకు (మునులు, అగిసెచెట్టు) మన్మథవ్యాప్తి (మదనబాధ, వెలగచెట్టు) కలిగించినది వసంతము. వసంతమున ప్రకృతి శోభాయమానముగా పుష్పఫలభరితమై వెలయుట, శృంగారోద్దీపకమగుట అన్న రెండు విషయములు ఇందు సుందరముగా జోడింపబడినవి. నరసింగకవి భావుకత, శబ్దాధికారములు ఇందు ప్రస్ఫుటముగా గోచరించుచున్నవి.

## గ్రీష్మర్తువు

'ధారాగృహముల నవఘనసారాంబుల గంధసార సరస పటీరో
శీర వ్యజనాదుల నింపారగ వర్ణింపదగు నిదాఘాగమనమున్'

అని లక్షణము.

చింతనిప్పుల వంటివేడిమి, పడమటి వాయువులు, రాత్రిజాములు కృశించుట, మృగతృష్ణలు, సుడిగాలులు, చండకిరణుని చండిమలను (222-4) నరసింగకవి వర్ణించినాడు. ఇట్టి తపనకాలమున పురుషులకు భార్యాపరిరంభణమే తరణోపాయ మయ్యెను.

'కుచకుంభ శీతలంబులు
ప్రచురాధర మధు సుధానుభవము లొసగుచున్
రుచిరాంగులు రక్షించిరి
విచికిలశయ్యలను గ్రీష్మవేళల విభులన్' (221-4)

## వర్షర్తువు

'తటిదటన మేఘపటలీ ఘటితాంబర శక్రచాపకరకావ్రాత
స్ఫుటధారాసారాది వికటత నుతింపంగవలయు ఘనకాలమునన్'

అని లక్షణము.

మేఘాడంబరము, ధారాసారములు, 'గేస్తులు వెచ్చని తీర్థమాడి, నులి వెచ్చపదార్థము లారగించి, కమ్మటిండ్లలో పచ్చడములు ముసుంగులిడి, ప్రియురాండ్ర కురువంపుడు కుచసీమలానుచు' (230-4) భోగించుటలు రాచకన్యకా పరిణయమున వర్ణితములు.

మేఘుడు పరోపకారపరాయణుడైన ఘనుడుగా శ్లేషచమత్కారముతో కవి చక్కగా చెప్పినాడు.

'లావణము గల్గువారిని
వావిరితోగూర్చి మంచివారి నొనర్పన్

జీవనద! నీవెకావా
కేవల ముపకార వృత్తికిన్ ఘనుడవనన్' (227-4)

ఓ జీవనదా! - మేఘుడా! (జలదాతా), ప్రాణదాతా!, లావణము గల్గు వారిని-సముద్రజలమును, స్వేచజలమును! జనయోరభేదః లావనము-కోయుట, ఛేదనము,లావనము గల్గువారు-ఛేదించుట వృత్తిగాగల దుర్మార్గులను, వానిరితో-క్రమముగా, మంచివారి నొనర్పన్ - స్వచ్ఛజలముగా చేయుటకు, సజ్జనులుగా చేయుటకు, ఉపకార వృత్తికి ఘనుడవు - ఉపకారము చేయు మేఘుడవు, గొప్ప వాడవు నీవేకదా అని మేఘుని మహనీయునిగా రూపకాతి శయోక్తిచే రూపించి చెప్పినాడు.

## శరదృతువు

'వెన్నెల సొంపును జుక్కల చెన్నునుదెలుపారుదెసల చెలువంబులు వి
చ్ఛిన్నములగు జలదంబులు సన్నుతిసేయంగవలయు శారదవేళన్'
అని లక్షణము.

జలదసంతతి విచ్ఛిత్తి, నదీప్రవాహములు కుందగించుట, రాజుల జైత్ర యాత్ర, జ్యోత్స్నా వ్యాపనములు వర్ణితములు.

'కూరిమిగల దినములలో నేరము లెన్నడును కలుగవు, కాని ఆకూరిమి సడలిన అన్నియును నేరములుగా తోచుట సహజము' అన్న న్యాయము మేఘుని విషయమున వాస్తవమైనది. తనకాలము తీరగనే, 'ఉపకారవృత్తికి ఘనుడని' పొగడ్తగనిన మేఘుడే దుష్ప్రభుడుగా భావితుడైనాడు. ఈలోక ధర్మమును నరసింగకవి వర్షశరద్వర్ణనలందున చక్కగా పొందుపరచినాడు.

'పాత్ర ద్విజరాజ సత్సంగ మిత్రతతులు
ప్రబలనివ్వని మేఘ దుష్ప్రభుడు జనగ
రాగముదయించి వచ్చె శరత్ప్రభుండు
చెలువుగా వీరలకు తెల్వి జెందజేసి' (232-4)

యోగ్యమైన, ద్విజరాజ-చంద్రుడు, బ్రాహ్మణ శ్రేష్ఠులు, సత్సంఘ - నక్షత్ర సముదాయము, సజ్జనసముదాయము, మిత్రతతులు - సూర్యుడు మొద

లైనవారు, సహృత్సముదాయములకు బాధకుడైన మేఘుడను దుష్టప్రభువు వెళ్ళగా, అనురాగభరితుడై వీరలకు ఆనందకారకుడైన శరత్ప్రభుడు ఏతెంచి నట్లుగా కవి వర్ణించినాడు.

వర్ష శరత్తుల సంధిలో జరిగిన శరల్లక్ష్మి ఉత్పత్తిని హృద్యమైన సావయవ రూపకముతో కవి వర్ణించినాడు.

'కార్తిక శుభ్రాంశు మూర్తి యాననమొప్ప
విమల ప్రసాద హాసము చెలంగ' (234-4)

మేఘుపటలమనెడు సురాసురులు మెరుపనెడు త్రాటిని చుట్టి కరువలియను కవ్వపు కొండతో వర్షఋతువనెడు సముద్రమును చిలుకగా, సర్వమోహన కరముగా శరచ్చంద్రుడు ముఖముగా, చంద్రికహాసముగా, చుక్కల ముత్తెపు దండతో, లాంఛన కస్తూరీ తిలకముతో, శరన్మేఘాంబరధారియై చకోరాశ్రితులు కొలువగా, మనోహర దేహకాంతితో శరదిందిర ఉద్భవించినట్లు కవి చక్కని భావుకతతో వర్ణించినాడు.

## హేమంత ఋతువు

'బలవత్కాలీయక కంబళఘన కౌశేయపట్టి పటమాంజిష్ఠం
బుల జనదు సీతు యువతులవలిచన్నుల దక్కననుచు వలయుం
బొంగడన్'

అని లక్షణము.

రాత్రులు దీర్ఘములగుట, సతులకు పతులపై ఇచ్ఛ, దహనుడు సహవాస యోగ్యుడగుట. మద్యపానాతిశయము, కాకవస్తువుల ప్రాధాన్యము మొదలగు విషయములు సంప్రదాయానుసారముగా వర్ణితములు.

'రాత్రియామములు దీర్ఘంబులై రాజిల్లె
పగటి జాములు కొంచబడి కృశించె' (237-4)

## శిశిర ఋతువు

'భృశవిచ్ఛినంబగు దిగ్దశకంబును గమలరుహవితానము ప్రాతః
ప్రశిథిల రవికరమును శిశిరము పొగడంగ దగు విశేషక్రియలన్'

అని లక్షణము.

చలి, ఎండలు పర్యాయముగ నుండుట, ధాన్యపుసముదాయములు వర్ణితములు.

'చలికొంతసేపు నెండల
బలిమిన్ మరికొంతసేపు భాసిల్లంగా' (238-4)

'మాఘమాసంబు విబుధ సుశ్లాఘ్యమగుచు
నల్లరేగళ్ళ బంటలు కొల్ల లమరె
యావకాళింపు ధాన్యావళి తీవి దనరి
కండ్ల పండువు నయ్యెను జగతికెల్ల (239-4)

ఈ రీతిగా షడృతువులను వర్ణించుటకు. తన కథలో నరసింగకవి కొంత బలవంతముగ అవకాశము కల్పించు కొన్నట్లున్నను ఈ వర్ణనమందు మాత్రము చక్కని లోకజ్ఞతను, భావుకతను ప్రదర్శించి దీనిని ఆవశ్యకముగా చేసినాడు.

## 5, 6. చంద్ర సూర్యోదయ వర్ణనలు

వెల్లూరు నరసింగకవి సూర్యాస్తమానము మొదలుకొని సూర్యోదయ పర్యంతము ప్రాకృతికముగా జరుగునట్టి సూర్యుడు అస్తగిరివైపు జరుగుట, జరఠాతపము, పశ్చిమాద్రియందలి సూర్యస్థితి, అస్తమానము, అస్తమయానంతరస్థితి, సంధ్యారాగము, ధ్వాంత వ్యాపనము, తారకోదయము, నిశిచర్యలు, చంద్రోదయము, జ్యోత్స్నా వ్యాపనము, చంద్రాస్తమయము, అనంతరస్థితి, కృకవాక కూజితము, శుక్రోదయము, అరుణద్యుతులు, సూర్యోదయము మొదలగు అంశముల నన్నిటిని పూసగ్రుచ్చినట్లుగా వర్ణించినాడు.

'సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోషధ్వాంత వాసరాః, ప్రాతర్మధ్యాహ్న' అని విశ్వనాథుడు సంధ్య, రజని, ప్రదోష, ధ్వాంత, వాసర, ప్రాతర్మధ్యాహ్నములను వేరు వేరు వర్ణనలుగా పేర్కొన్నాడు.

పై విషయములను పూర్వకవులు పలువురు పలువిధములుగ వర్ణించినను వారివారి భావుకతా సామర్థ్యముచేత అన్నియును నూతన భావస్ఫోరకములై యుండుట విశేషము.

## జరఠాతపము

నరసింగకవి సూర్యాస్తమాన పూర్వపు వృద్ధాతపమును కూడ విశేషముగా చెప్పినాడు. ఆయన దీనిని అరుణ జరఠాతపము అన్నాడు.

'కిరణశృంగాళిచే నరుణాభికుడు ధరా
కాంతపై జిల్కు వసంతమనగ' (153-2)

సూర్యుడనెడు గజబంధకుడు పెంచిన పుష్ప సముదాయముగా జరఠాతపమును రూపకోత్ప్రేక్షలో చెప్పుట హృదయంగమముగనున్నది. ఇట్లు మధురమైన సమాసోక్త్యుత్ప్రేక్షలతో సాగినది ఈ వర్ణన.

## సూర్యాస్తమానము

'గాఢాంధకార రాక్షసవల్లభుడు వెంట
బడి పట్టుకొనునను భయము గలిగొ' (155-2)

అని సూర్యాస్తమానమునకు హేతువులు కాని వానిని హేతువులుగ చెప్పి ఉత్ప్రేక్షించినాడు కవి. సూర్యుని భయము, కరుణ, సేవాతత్పరత, అనుమానము మొదలగు లక్షణములుగల సగటు మనిసిగా మానవీకరించుట ఉచితముగ నున్నది.

కమలమీలనము, చక్రవాక దుఃఖము, మారమదోద్రేకము మొదలగు తక్కిన విషయములు సంప్రదాయానుసారముగనున్నవి.

సంధ్యారాగము సమాసోక్త్యుత్ప్రేక్షలతో వర్ణితము.

'కంతుని మాయమచ్చువాడిగా, ముదివారసుదతులకెలబ్రాయ మొదవించు మదనుని మృదు చికిత్సగా' తిమిరంపు గుంపులను అద్భుతముగా కవి వర్ణించినాడు.

'వియత్కాంత కబరీభరమున దాల్చిన ముత్యపుదామముగా' (164-2) తారావళి మెరసినట్లు కవి చెప్పినాడు.

నిసివేళను ప్రేయసీ ప్రియులకు ఆనుకూల్యము కలిగించునదిగా వర్ణించినాడు. కామాంధతకు గాఢాంధత జోడైనట్లు సమాధ్యలంకార యుక్తముగ చెప్పినాడు.

'ఒక విట సంకేత మొకకాంత చేరి వే
    రొకడౌట గనక మచ్చిక బెనంగు
నొకనాతి ప్రీతి వేరొని యొద్దికి బోవ
    గికురించి యొకడు సందుగొని కవయు' (166-2)

ఈ రీతిగా 'భూరిగాఢాంధ కామాంధములు సహాయమగుచు తము వేగింపగా' సాగిన వారి అభిసరణములకు కొదువలేదు.

## చంద్రోదయము

ఇట్లుండగా, కులటాంగనలకు దుర్వహమై మిగుల భయము తోచునట్లుగా పూర్ణకళాభరితుడైన రాకా సుధాకరుడుదయించినాడు. నరసింగకవి ఈ చంద్రోదయమును చక్కని చిక్కని తెలుగు పద గుంఫనముతో, ఛేకాను ప్రాసతో గూడిన జంట పదములతో వర్ణించుటలో తన అద్భుత పద ప్రయోగ వైచిత్ర్యమునకు మచ్చుగా దానిని తీర్చినాడు.

'సురలకు విందు, పొందు తొగ జోటికి, రేటికిపట్టు, గట్టుకూ
తురు దొర సొమ్ము, వమ్ము వెలిదొంగకు, గంగకు దీవి, తావితా
మరలకు కీడు, జోడు హరి మామకు, తేమకు మేర, జారతా
చరులకు ముప్పు, మెప్పు గురజాయకు, నాయకు డొందె ముందెసన్'
(169-2)

విందు-పొందు, బోటికి - రేటికి, పట్టు - గట్టు, - సొమ్ము - వమ్ము, దొంగకు గంగకు, దీవి - తావి, కీడు - జోడు, మామకు - తేమకు, మేర -జార: ముప్పు-మెప్పు, జాయకు - నాయకు, ఒందె - ముందె వంటి పదములు జంటలుగా శ్రోత్ర ప్రేయముగా కూర్పబడినవి. తెలుగున ఇంత జటిలముగా పదములను కూర్చుట కేవల ప్రతిభైక సాధ్యము.

దేవతలకు విందు కలువలకు పొందు, సారంగమునకు నెలవు, సారంగ ధరునకు చెలువు, చోరులకు తాపము, గగన గంగకు ద్వీపము, పద్మములకు కీడు, పద్మబాంధవునకు జోడు, శైత్యమునకు సంపత్తు, జారత్వమునకు విపత్తు, వాక్పతి సతికి ఉపపతిగా నాయకుడు (రాజు-చంద్రుడు) వర్ణితుడు.

'మదనదేవుని మహోత్సవమునకై భువన భవనమునకు నిశాకాంత వేసిన సుధయన్నట్లు' (170-2) వెన్నెలలు ప్రసరించినట్లుగా ఉత్ప్రేక్షించినాడు కవి.

## చంద్రాస్తమానము

జార చోరాదులు జిగిబిగులు చంద్రాస్తమానముతో సడలినవి. ఇచ్చట కవి చంద్రుని సత్ప్రభువుగా శ్లిష్టరూపకమున మనోహరమున చెప్పినాడు.

'సత్సంతతులకు దేజంబులు కడజారె
ద్విజకులంబుల రొదల్ దిశలుమీరె
రాగోదయంపు బరంపరల్ మితిమీరె
బంకజాప్తుని విజృంభణము చేరె
పగలు బుట్టుటకు దంభమ్ములు చేకూరె
గువలయం బాపద గడువ దూరె
నాశ్రయించిన చకోరాళి యాశలు దీరె
దనయాప్త చంద్రకాంతములు దాగె

నరయ పరచక్రముల భయమంతదీరె
వరుస తోడుత సన్మార్గవర్తియైన
మహితయశుడైన సర్వజ్ఞమౌళియైన
సత్ప్రభుడు భూమిగావని సమయమునను.' (173-3)

సత్సంతతి - నక్షత్ర సముదాయము, సత్పురుషులు, ద్విజకులము - పక్షి సముదాయము, బ్రాహ్మణ సముదాయము, రాగోదయము - అరుణిమ, ఈర్ష్యాదులు, పంకజాప్తుడు - సూర్యుడు, పాపజన్ముల సాహచర్యుడు, పగలు - వెలుతురు, ద్వేషములు, కువలయము - కలువ, భూమి, చకోరాళి - వెన్నెల పులుగులు, ఆశ్రితులు, తన ఆప్త చంద్రకాంతములు - తనకు ఇష్టమైన చలువ రాళ్ళు, తనయ ఆప్త చంద్రకాంతములు - పుత్రమిత్రాదులు, పరచక్రము - శ్రేష్ఠమైన చక్రవాకము, శత్రుసేన, సన్మార్గవర్తి - నక్షత్రమార్గానుయాయి, శ్రేష్ఠమార్గానువర్తి, మహితయశుడు - అధిక కాంతిమంతుడు, సత్కీర్తి భరితుడు, సర్వజ్ఞమౌళి - ఈశ్వశిరో గ్రస్థితుడు, సర్వవిచ్ఛ్రేష్ఠుడు, సత్ప్రభుడు - తారా

నాయకుఁడు, సన్నరపాలుడు. ఈ విధమైన అర్థద్వయ కల్పనము పాండిత్య ద్యోతకము.

సురతపీడిత యువతీనికర భీకరముగా కృకవాకులు కూసినివి. (174-2)

'ప్రాక్సతి ముక్కరపై కీలించిన కొమరైన తెలివెండి గుండుగా, విరహు లను మృగముల వేటాడి వెళ్ళు మన్మథుని చేతి వజ్రాయుధముగా' శుక్రుడుద యించినాడు. (175-2)

పిమ్మట అరుణోదయ, తపనోదయములైనవి. సూర్యుడు భువనబాధకుడు అన్న విషయమును కవి రమ్యముగా ఉత్ప్రేక్షించినాడు.

## సూర్యోదయము

'చీకటి యను మదనునిపై
ప్రాకటమగు పూర్వకుధరభవు డగ్రత నా
లోకించు నుదుటి కన్నన
నాకమ లాప్తుండు పొడిచె నగరిపుని దెసన్' (182-2)

చీకటియను మదనుని ధ్వంసము గావించుటకై తూరుపుకొండ యనెడు రుద్రుడు తెరిచిన ఫాలనేత్ర మన్నట్లుగా పూర్వదిశను సూర్యుడుదయించినట్లు కవి వర్ణించి నాడు.

### 7. వన విహారము

చారుతర చైత్ర సంపత్పూరిత విభవముల వేడ్కపొంగుడుపడగా
నారీజన సహచరుడై యారామవిహారమొప్పనధిపతి చేయున్.

అని లక్షణము.

నరసింగకవి వనవిహారమును కడురమ్యముగ వర్ణించినాడు. భార్యాసహి తులై ఇంద్రోపేంద్రులు సమస్తదేవతా సముదాయముతో నందనవన విహారము గావించుటలో అందలి వింతలు, వినోదములు, హాస్యములు ఇరువది ఆరు(26) పద్యములందు సరసముగా కన్నులకు కట్టినట్లుగా వర్ణించినాడు. కొమ్మలను కొమ్మలెక్కించి పూలుకోయించుటలు, నందనవనమాహాత్మ్యముచే ఒక్కచెటునసే

బహువిధఫలపుష్పము లుదయించుటలు, పుష్పదోహదక్రియలు, నర్మహాస్యములు,.. విలాసములు, కృష్ణుని జగన్మోహనతలు కీర్తిపాత్రముగ వర్ణితములు.

## 8. జలవిహారము

'నీరజములు చెంగలువలు గైరవములు వీచికలును గరయంత్రపయో
ధారలు నావర్తంబులు వారి విహారంబులందు వర్ణ్యము లరయన్'

అని లక్షణము.

నందన వన విహారసమయము ననే నరసింగకవి జలక్రీడలను వర్ణించినాడు. ఈ సందర్భమున కవి మందాకినీ పావిత్ర్యమును అయిదు పద్యములందు. కీర్తించినాడు. ఆ గంగానది యందు దేవకాంతలు విలాసముతో చల్లు లాటలతో జలవిహారము కావించుటలు ఆరు పద్యములందు వర్ణితములు.

'చెలువుగా బంగరు చషకాల జలకముల్
నమ్మించి సములపై జిమ్మి జిమ్మి' (45-4)

సంప్రదాయానుసరణము ఇందు ప్రస్ఫుటము.

## 9. మద్యపానము

'సంబోధకరము మదనాలంబనము నశేషరసవిలసితము నంత
ర్బింబిత వదనమునగు కాదంబరి నాపానమునకుదగునొడగూర్పన్ '

అని లక్షణము.

నరసింగకవి వర్ణనలందు 'మద్యపానమును' ప్రత్యేకరీతిలో తీర్చినాడు. ఆయన భక్తుడు, ఉపాసకుడు, అనుష్ఠానపరుడు. అట్టి ఈయన ఆచారనిష్ఠ ఎక్కడ ? మద్యపానవర్ణన ఎక్కడ? ఇదియొక విరుద్ధ విషయము. ఈయనకు మద్యపాన సంబంధమైన స్వానుభవములేదు. కేవలము లోకానుభవ సంబంధమైన శ్రవణానుభవమే ఉన్నది. అయినను దీనిని రసపోషణకు ఒక ఉత్తమాంగముగా కవి స్వీకరించినాడు.

'రమ్యమైనదిగాని, రోతగొలుపునదిగాని, ఉదారమైనదిగాని, నీచమైనది గాని, భయంకరమైనది గాని, ప్రసన్నమైనది గాని, గంభీరమైనది గాని, వికృతమైనదిగాని, వస్తువుకాని అవస్తువుకాని లోకమున కవిచే భావ్యమానమై రసభావమును గలిగింపనిది లేదు' అన్న ధనికుని సూక్తి నిత్య సత్యము. ఈ విషయము నరసింగకవి మద్యపాన వర్ణనను గమనించిన స్పష్ట పడగలదు.

'ఆంధ్ర సాహిత్యమున తెనాలి అన్నయ్య సుదక్షిణాపరిణయమున మద్యపానవర్ణనమున కొంత క్రొత్త దనమును ప్రదర్శించినాడని' ఆరుద్రగారి అభిప్రాయము. అయినను అందు 'తతత తామరసాక్షి, పపప పాటల గంధి, ససస సారసహస్త' అన్న విధముగా మద్యపానము గావించిన స్త్రీలు మైకమున పదోచ్చారణమున తడబడినట్లు శబ్ద చమత్కారము మాత్రమే చూపబడినది. కాని నరసింగకవి 'మద్యపాన' వర్ణన అద్భుతమైన అర్థ గౌరవము గలది. ఆంధ్ర సాహిత్యమున ఇంతమనోజ్ఞమైన 'మద్యపాన' వర్ణనలేదన్న అతిశయోక్తి కాదు.

నరసింగకవి తన గ్రంథమందలి ప్రధాన రసమైన మధురభక్తికి పరిపుష్టిని గూర్చునట్లుగా చక్కని అవకాశమును కల్పించుకొని మధుపానమును వర్ణించినాడు. వరుణుడు పంపించిన వారుణిని బలరాముడు విందు సమయమున రాజకన్యలకు సమకూర్చగా, వారా ఆసవామృత పాన విలాస మత్త చిత్తలై కావించిన చేష్టలు మనోమోహనములు.

## 10. సురతము

'తనరు నెనుబది నాల్గు బంధములయందు
నమరు ప్రచ్ఛన్నమును ప్రకటము ననంగ
సురతములు రెండు వానికి స్ఫురణ సొంపు
వలయు వర్ణింప వలయు నిఖిల కావ్యముల యందు'

అని లక్షణము.

వెల్లూరు నరసింగకవి పనిగట్టుకొని సురతమును వర్ణింపడు. ద్వారకా నగర సౌధ సాలముల వర్ణనమందును, పుష్పలావికావర్ణనమందును, కృష్ణుడు కుపితయైన సత్యభామను సాంత్వన పరచుట యందును, అంధకార వర్ణన మందును, రాజకన్యల స్వప్నానుభవ వివరణ మందును శృంగారము అప్రధాన ముగా వర్ణితము. గ్రంథాంతమున, కృష్ణుడు తాను వివాహమాడిన రాజకన్య లతో

'పాడియు దప్పక సురత
క్రీడలు చౌసీతి బంధరీతులు వరుసన్
గూడుక పదియార్వేవురు
చేడియల రమించె గోపశేఖరుడెలమిన్' (279-4)

అని ఒకే పద్యమున, భోగములనుభవించినట్లు సూచించినాడు.

## 11. విప్రలంభము

'అచ్చపు వెన్నెలచే గడు వెచ్చుటలును మానమెడలి వెడవిల్తునిచే
నొచ్చుటలును బ్రియుడబ్బని ముచ్చటలును విప్రలంభమున జెప్పదగున్'
అని లక్షణము.

రాజకన్యలు ద్వారకా నగరమున కృష్ణాగమనమునకై ప్రతీక్షించుటలో విప్రలంభము వర్ణితము. కృష్ణునకు, తమకు ఏవిధముగా వివాహము జరుగునో అని చింతించుట వారికి 'రేబగళ్ళు హరిపై నత్యంత మోహాప్తిచే వనజాతాస్త్ర శరప్రవర్షములు దుర్వారంబులై తాకగా హరిరాక గోరుచు' ఎదురుచూచు చుండిరి. అప్పుడు వారికి మదనోద్దీపకములైన చంద్రమలయానిలాదుల వలని బాధ దుర్భరమై తోచినది.

'కాయజుడిక్షు కార్ముకముఖంబున గ్రొవ్విరి తూపులేయ, రే
రాయడు వేడి వెన్నెల పరంపరలున్ వెసగాయ, గోకిలల్. (203-3)

'అంచితంబుగను రాయంచ పతాణీ జ
మావార్ల బలములు మలసి కొలువ'
'మింక తాకట మెట్లొకో యిందుముఖులు' (204-3)

ఈవిధముగా తమ ఎదుట సాక్షాత్కరించిన మన్మథుని అర్పించి తమ్ము కాపాడు మని రాజకన్యలు ప్రార్థించినారు. ఇట్లు మదనపీడితలైన ఆ కన్యలు కృష్ణుడు స్వర్గమునుండి ద్వారకకు మరలివచ్చిన వెంటనే ఆత్మీయురాలైన ఒక మాలికతో కృష్ణునికి తమ బాధలు తెలుపుమని పంపిరి. ఆమె కృష్ణునితో 'శుకపికముల రొద లకు, చంద్రకిరణముల వేడిమికి పకపకలు, వకవకలు, కకవికలు అయిన రాజ కన్యల విరహవేదనలను వివరించి, బాధలకు తాళలేని వారు కావించిన మన్మథ దూషణల తెరంగెరిగించి, వారి సంకటకములకు కారణమైన షడృతువులను వర్ణించినది.

## 12. వివాహము

'ప్రచుర స్వయంవరోచిత రచనలు కన్యావరాభిరమ్యక్రియలున్
విచితశుభాత్మక విధులును రుచిరవివాహంబులందు రూపింపదగున్'

అని లక్షణము.

ఏవిషయమునైనను సమగ్రముగా వర్ణించు అలవాటుగల నరసింగకవి ఏలనో తన గ్రంథముఖ్యాంశమైన రాజకన్యల పరిణయమును మిక్కిలి సూక్ష్మ ముగా ముగించినాడు. ఈయనకు తెలుగింటి ఆచారములను పేర్కొనుట ఇష్టము. అట్టిది, వివాహకార్యమునందు పాటింపబడు పెక్కు సంప్రదాయములను పేర్కొన వలసిన చోట అనేక ముఖ్యాంశములనే కవి వదలినాడు. ఇందుకు కారణము అనూహ్యము. వధూవరుల మంగళ స్నానములు, అక్షతారోపణము (తలబ్రాలు) లను మాత్రమే వర్ణించినాడు. మంగళసూత్రధారణ, నాగవల్లి, సప్తపదివంటి ప్రముఖమైన అంశములను చెప్పలేదు. పేరంటములు, బువ్వము బంతులు మొద లైనవి తెలుగింటి వివాహములందలి ప్రత్యేక ఆకర్షణలు. ఒక్క అక్షతారోప ణమునే నాలుగు పద్యములందు కవి వర్ణించుటవలన మిగిలిన విషయములను కూడ కవి చెప్పియుండునని భావించుటకవకాశ మున్నది. గ్రంథపాతము వలన గాని, లేఖక ప్రమాదమువలనగాని ఆ భాగము భ్రష్టమైయుండునని తలప వచ్చును.

రాజకన్యలు కృష్ణునిపై పోసిన ముత్తెముల తలబ్రాలు వారి ఆయా అంగ సంసర్గముచేత నానా వర్ణవిరాజితములై చూపరులకు విభ్రాంతిని కలిగించినట్లు కవి చక్కగా వర్ణించినాడు.

'ఆ యింతు లెత్తిన దోయిళ్ళ ముత్యముల్
పద్మరాగ ప్రభాపటలి దోప' (275-4)

## 13. ప్రయాణము

'గజరథహయసూచితమగు విజయంబుననుబ్బినడచు విశ్రుతవివిధ
ధ్వజిని వినుతించుటెప్పుడు భజనీయము సుకవి సత్ప్రబంధములందున్'

అని లక్షణము.

రాచకన్యకా పరిణయమున నాలుగు పర్యాయములు ప్రయాణము వర్ణితము. కృష్ణుడు సత్యాసహితుడై ప్రాగ్జ్యోతిషమున కరుగుట, భూపుత్రుని రణాగమనము, బలరాముడు వేటకు వెళ్ళుట, మృగయానంతరము పురమునకు మరలుటలందు ప్రయాణ ప్రసక్తియున్నది.

ప్రాగ్జ్యోతిష గమనమున కృష్ణుడు 'ధరణీమండలి వింతజూడు తరుణీ!' యని సత్యభామకు మనస్సంతోష సంజాతకముగా మార్గమునందలి వింతలు చూపుచు వెళ్ళినాడు.

నరకాసురుని రణరంగ గమనము రాక్షసాగమన సహజముగా ఆరభటీ వృత్తిలో, గౌడీరీతిలో సాగినది.

'గిరులెల్లన్ దిరిగెన్ హరిద్గజములున్ ఘీయంచుమ్రొగ్గెన్ నిశా
కర మార్తాండులు తల్లడిల్లిరిల నక్షత్రంబులున్ రా (259-2)
'అష్టదిగ్గజ జాతులగు మత్తమాతంగ
బలములు కోట్ల సంఖ్యలను మీర' (261-2)

ఇట్లు చతురంగ బలసమేతుడై నరకుడు ఖండనమునకు కదలినాడు.

బలరాముడు వేటకు వెళ్ళిన సమయమందు భటులు పల్కిన బీరాలాపములు మిక్కిలి సహజరీతిలో నున్నవి.

'బల్లెంబుచే నెంత పటువైన కిటినైన
పడద్రోయకున్న నీభటుడ గాను' (31-8)
'మును కుంతమున సింగమును గూల్చ మాళవ
క్షితిపతి రతనాల పతక మొసగె' (32-3)

ఈ రీతిగా సాగినవి వారి పరాక్రమంపు ముచ్చటలు.

మృగయానంతరము బలరాముడు

'దిగ్భిత్తులెల్ల ఖేదిల్లగా భేరికా
ఖాంకారముల రొదల్ ప్రబ్బుకొనగ' (179-3)

ద్వారకాపురి చేరినాడు. ఈ విధముగా సంప్రదాయ రీతిలో ఈ వర్ణన సాగినది.

## 14. మంత్రము

'అగవాక్షము నస్తంభమునగు గూఢాభ్యంతరములు హర్మ్యాగ్రమహా
నగశృంగంబుల మంత్రము దగునొనరింపంగవనుచు దగు వర్ణింపన్'

అని లక్షణము.

రాచకన్యకా పరిణయమున రెండు, మూడు పర్యాయములు మంత్రము వర్ణితము. కృష్ణుడు దండయాత్రకు వెడలగనే భూసుతుపురమున మొక్కరముగ దుర్నిమిత్తములు పుట్టగా నరకుడు తన మంత్రులను సమావేశపరచి, దుర్నిమిత్తములకై కటకటపడి, కృష్ణునిపై దండయాత్రకు అవసరమైన భవిష్యత్కార్యక్రమమును గురించి చర్చించినాడు.

నరకాసురుని జయింప వెళ్ళిన కృష్ణుడు మరలిరాక ఆలసించుట యందలి కారణములను బలరాముడు మంత్రులతో చర్చించినాడు.

రైవతకాద్రి శిఖరమునుండి రాజకన్యల రక్షణకై వచ్చిన సైన్యమును గాంచి శత్రుసైన్యముగా భ్రమపడి బలరాముడు దాని విషయమై మంత్రులతో ఆలోచన కావించినాడు. ఇవన్నియు సంప్రదాయ రీతిలో ఉన్నవి.

## 15. దూత్యము

'ప్రతిభయు పరతంత్ర విభేదితయును బతిరక్తియు దితిక్షయు నిర్మా
ర్థతయును నవ్యసునీతియు జతురతయును దూత్యమున జనునుతియింపన్'
అని లక్షణము.

రాచకన్యకాపరిణయమున రెండుచోట్ల దూతకృత్యము నిర్వహింపబడి నది. ఈ రెండు ఒక అంశమునకే సంబంధించినవి. అవి రాజకన్యల నుండి కృష్ణునకు పంపబడిన సందేశములు. దూతలు మాత్రము వేరు. మొదటదౌత్యము నెరపిన నారదుడు 'నిస్సృష్టార్థుడు.' ప్రాగ్జ్యోతిషమున నరకుని చెరలో గ్రమగ్గు చున్న రాజకన్యలను చూచి, వారి అభ్యర్థనమేరకు నారదుడు కృష్ణునకు వారి వారి ప్రార్థనను నివేదించినాడు. కృష్ణునికి వారి ప్రార్థనను నివేదించినాడు. కృష్ణునికి ఆచార్యప్రాయుడై 'భూమినందన దనుజుం జయించి ప్రమదంబున నప్పదియారువేల భూమినుల వరింపుమని' నిర్దేశించినాడు నారదుడు.

రాచకన్యలు ద్వారకలో కృష్ణాగమనమునకై విరహవేదనలతో నిరీక్షిం చుచు, అమరావతి నుండి కృష్ణుడు మరలివచ్చిన వెంటనే ఆయనవద్దకు 'సకల శ్రీ హృదయాంబు జాతకలనా సంవేది', వాగ్మి అయిన దూతికను తమ అవేదన లను తెలుప పంపినారు. 'మితార్థక' అయిన ఆమె తనవాక్చైత్ర పుణ్యముతో—

'ఒక్కొక ఋతువునందున
కక్కసమగు వేధలన్నిగడుపుచు నీపై
వెక్కసమగు మోహముగల
యక్కన్యల విడువదగునె యాకాలమునన్' (212-4)

అని కృష్ణునకు రాచకన్యలపై జాలిపుట్టునట్లుగా చెప్పినది. పిమ్మట వారి వేదన లకు కారణమైన ఋతుక్రమమును వర్ణించినది. దూతికమాటలువిన్న కృష్ణుడు రాజకన్యలను వివాహమాడగలనని, వారిని చింతింపవలదని చెప్పి పంపగా కృత కృత్యురాలైన ఆ దూతిక వెళ్ళి వారి మదికలంకలు తీర్చినది.

## 16. రణము

'పటురథకరిహరి భట సంఘటిత వ్యూహాదికములు ఘనఫలకాసి
స్ఫుటరుచులు విజయకారణ పటహాడంబరము బొగడబడుబోరాటన్'
అని లక్షణము.

మురకృష్ణుల, సత్యాభూసతుల, కృష్ణనరకుల, ఇంద్రోపేంద్రుల పోరాటములందు యుద్ధమువర్ణితము. సత్యభామ చేతిలో భంగపడిన నరకుడు కృష్ణని తూలనాడుట, అందులరు కృష్ణుని ధిక్కార ప్రతివచనములు హృదయంగమముగా నున్నవి. యుద్ధభాగము దాదాపు నూటపాతిక(125) పద్యములందు చెప్పబడినది

## 17. నాయకాభ్యుదయము

'అరుల జనదోలి యార్తుల నరుదారంగాచి హతులయడియాలములన్
బిరుదంబుల గైకొనునన్నరపతి విజయంబు కీర్తనముసేయదగున్'
అని లక్షణము.

రాచకన్యకా పరిణయ ప్రబంధనాయకుడు, మధురానివాసుడు అయిన 'ఆ మధురాక్షసారిని కొనియాడగ శేషునకైన నశక్యమని నరసింగకవి కృష్ణుని మాహాత్మ్యమును శ్లేషశబ్ద చిత్రములతో మనోహరముగ వర్ణించినాడు.

'గజవర దానంద గరిమగాంచినవాడు
    గజవరదానంద గరిమ వాడు
ఘన పుణ్యజన వివర్ధనము సల్పినవాడు
    ఘనపుణ్యజన వివర్ధనమువాడు
కమలజాతాప్త విగ్రహము సల్పినవాడు
    కమలజాతాప్త విగ్రహమువాడు
గగనచరేశ్వర సుగతినొందినవాడు
    గగనచరేశ్వర సుగతివాడు

సాధుబృందావన క్రీడ సల్పువాడు
సాధుబృందావన క్రీడ సల్పువాడు
సబలుడగువాడు గోపాల చక్రవర్తి
స బలుడగువాడు గోపాలచక్రవర్తి' (126-1)

గజవరదానందగరిమ - గజేంద్ర మోక్షానందము, బృహత్ఫల సంధాయకతా నందము; ఘనపుణ్యాజన విమర్దన, వివర్ధనములు - రాక్షస నిగ్రహణ, సజ్జన రక్షణములు; కమలజాతాప్త విగ్రహము - బ్రహ్మకు ఇష్టమైన యుద్ధము (సోమ కాసురుని దునిమి వేదముల నిచ్చుట), ఇందిరాప్రియమగు రూపము; గగనచరే శ్వర సుగతి - ఇంద్రుని మైత్రి, గరుడవాహనగమనము; సాధుబృందావనక్రీడ- సజ్జనుల కాపాడు క్రీడ, మనోహర బృందారణ్య సంచారఖేలనము; సబలుడగు వాడు - బలరామసహితుడు, బలవంతుడు; గోపాల చక్రవర్తి - గొల్లల నాయ కుడు, గోపాలుడను రాజు. ఇట్లు అర్థద్వయయుక్తముగ నరసింగకవి కృష్ణుని ఔన్నత్యమును కీర్తించినాడు.

ఈవిధముగా నరసింగకవి వర్ణించిన అష్టాదశవర్ణనలందు ఒక్క 'కుమా రోదయము'నకు మాత్రము ప్రసక్తి లేదు.

## ఇతర వర్ణనలు

కొందరు లాక్షణికులు పేర్కొన్న కన్యాసౌందర్య వర్ణన, మృగయవంటి మరికొన్నిటిని కూడ నరసింగకవి వర్ణించినాడు.

### 1. కన్యాంగ సౌందర్య కథనము

'కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
 భ్యుదయంబు విప్రలంభోచితంబు'

అని అప్పకవి దీనిని పేర్కొన్నాడు.

రాచకన్యకా పరిణయమున రెండుచోట్ల ప్రత్యేకముగా రాజకన్యా సౌందర్య వర్ణన కావింపబడినది. మొదట, నారదుడు కృష్ణునికి రాజకన్యల సందేశమును వివరించి, వారి అంగాంగ రామణీయకమును ఇరువది నాలుగు (24) పద్యములందు వర్ణించినాడు. ఆ రాకుమార్తెల నఖశిఖా పర్యంత వర్ణన మున వారి నెరికొప్పు, సువదనాస్యము, కన్నులు, రెప్పలు, కనుబొమలు, చెక్కులు, నాసిక, కర్ణములు, గళము బాహువల్లికలు, తరుణాంగుళములు, పయోధరములు, నూగారు, నాభి, నడుము, జానువులు, జంఘలు, నఖములు, నడకలు మొదలగు అవయవములు ప్రత్యేక పద్యములందు వర్ణితములు.

'మెలతం మేనులన్ బసిడిమేడలపై వలరాయడెక్కనే
ర్పలవడ గన్నెగేదగుల నందముగా రచియించినట్టి తా
పలసగ భాసిలున్ వళులు, భామినులన్ మదనాస్త్రశాలలన్
సలువుగ బూలవిండ్లకిడు నారులనందగు నారులెన్నగన్' (203-1)

ఇది నూగారు, వళుల వర్ణన. రూపకోత్ప్రేక్షల సాంకర్యముతో ఆ రాజకన్యలు మన్మథుని గృహములని సుందరముగా కవి వర్ణించినాడు. ఆ స్త్రీల శరీరము లనెడు బంగారు మేడలపై వలరాజు ఎక్కుటకై ఏర్పాటు చేయబడిన మొగలి రేకులతో నిర్మితమైన మెట్లా అన్నట్లుగా నున్నవి వళులు. స్త్రీలనెడు మదనాస్త్ర శాలలందు మదనుని పుష్పధనువునకై నిర్మించిన అల్లెత్రాడులా అన్నట్లున్నవి వారి నూగారులు. ఇందలి భావుకత రసిక రంజకము.

బలరాముడు రాజకన్యల సౌందర్యమును మెచ్చుకొనుట అయిదు పద్యము లందు వర్ణితము.

## 2. మృగయ

లక్షణ కారులందు విశ్వనాథుడు పంచవింశతి వర్ణనలందు మృగయను పేర్కొన్నాడు. శ్వసంచారము, వలలు, నల్లని వేషములు, భటులు, ఢక్కా నాదములు, మృగముల భీతి, సింహయుద్ధము, వేగము మొదలగునవి మృగయ యందలి ప్రధానాంశములు.

నరసింగకవి మృగయను విపులముగా వర్ణించినాడు. ఈ భాగము ముప్పది నాలుగు (34) పద్యములందు వర్ణితము. మృగయాంగములైన ధనురాది సాధనములు, వేటకుక్కలు, వేట పురుగులు, భటుల సామర్థ్యములు, అరణ్యములందు వలలు పన్నుట, కొండగుహలందు అగ్నిదరి కొల్పుట, మృగములు చీకాకు పడుట, మృగములవేట, పక్షివేట మొదలగు అంశముల నన్నిటిని నరసింగకవి వివరించినాడు.

'గజములమీద నాగ్రహముచే దూకుచో
సింగపుంగొదముల చెల్వుదాల్చు' (26-3)

అని వేటకుక్కలను అనురూపముగా ఉల్లేఖించినాడు.

'దేగలు 'మేటి సుధాకరుం గదిసి మ్రింగగ బోయెడి రాహులీల నేర్పాటుగ గానగవచ్చు' (28-3) నట్లుగ నున్నవి. ఇట్టి వీనికి పికిలి పిట్టలు, శుకపికములు, బురకలు, గొరువంకలు లెక్కయేమి? సింహ, శరభ, శార్దూలాది క్రూర మృగముల వేటలను కవి ప్రత్యేకముగా చెప్పినాడు.

కొన్ని అరుదైన వర్ణనలో 'ముని, స్వర్గములను' విశ్వనాథుడు, 'స్వచ్ఛరో న్మత్తాభిసారికాహ స్తి వాజులను' కేశవమిశ్రుడు పేర్కొన్నారు. నరసింగ కవి వీటన్నిటిని తన గ్రంథమున వర్ణించినాడు. జలకము, విందుభోజనము, శకునములు మొదలగు అంశములుకూడ ఇందు వర్ణితములు.

నారదమునిని స్వభావోక్తిలో చక్కగా వర్ణించినాడు నరసింగకవి(144-1)

స్వర్గము,దేవ. దేవసభ లందలి వింతలు రమణీయముగా వర్ణితములు. సుధర్మయందలి వివిధమణి దీప్తులకు ఆ యా పక్షి. మృగములు భ్రాంతి చెంది సంబరము చెందుట హృద్యముగా చెప్పబడినది (417-3), అప్సరకాంతల నాట్యములు, తుంబురనారదుల వీణావాదనము, బృహస్పతి పాండిత్యము, వీర స్వర్గము నలంకరించిన వీరుల గౌరవములు ఇందువర్ణితములు.

గంగానది, దిగుడు బావులు, ప్రపలు, పారిజాతవృక్షము, అభిసారికలు, గజాశ్వములు మున్నగువానికి ఉచితరీతిలో ప్రసంగమును కల్పించుకొని నర సింగకవి సరసముగా వర్ణించినాడు.

ఈ రీతిగా నరసింగకవి ప్రబంధములందు ప్రధానములైన వర్ణనలను చక్కని అవగాహనతో, భావుకతతో హృదయంగమముగా తీర్చినాడు.

# 6. అలంకార పరిష్కృతి

కవి లోకములో తాను దర్శించిన విషయమును భావించి వర్ణనగా రూపొందించులోపల ఆలోచనా భాగమునకు చెందిన అలంకారములు కొన్ని స్వయంసిద్ధములై వెలువడును. కేవల వాస్తవ ప్రకటనము కవిత్వమనిపించు కొనదు. భావనాసౌధమును నానావర్ణ విరాజితముగా రమణీయముగా పరిష్కరించుటయే కవిత్వకళ.

'కావ్యశోభకు హేతువులైనవి అలంకారములు[1]' అని దండి, 'సౌందర్యమే అలంకారము. కావ్యము అలంకారము చేతనే గ్రహింపదగినది[2]' అని వామనుడు, 'అలంకారములు చమత్కృతిని ఆపాదింపగలవు. రసమునకు ఉపకరింపగలవు[3]' అనియు, 'వ్యంగ్యరామణీయకతను గూర్చునవి అలంకారములు[4]' అనియు జగన్నాథుడు మొదలగు సుప్రసిద్ధాలంకారికులు కావ్యములందలి అలంకార ప్రాధాన్యమును ధృవపరచినారు.

భాషను పొదుపుగ వాడి విషయమును స్పష్టపరచుటలో అలంకారము అగ్రగణ్యము. 'భాషపొదుపునకు అలంకారమొకసాధనమని[5]' విమర్శకుల నిశ్చితాభిప్రాయము.

కావ్యకన్యకను సర్వాంగసుందరముగా తీర్చిదిద్దునట్టి అమూల్యాభరణములే అనుప్రాసోపమానాదులైన శబ్దార్థాలంకారములు. స్త్రీ ఎంత సహజ సౌందర్యవతి యైనను నిరస్తభూషయైనచో మనోజ్ఞ కాలేదు. అట్లే కవితాకన్య కూడ ఉచిత స్థానఘటితాలంకారములతో సహృదయుని అలరించవలెను.

## అర్థాలంకారములు

అర్థమునకు ప్రాధాన్యమిచ్చునవి అర్థాలంకారములు. ఇవి శబ్దసౌందర్యమునకు వన్నెతెచ్చును. 'అర్థాలంకార రహితా విధవేవ సరస్వతీ[6]' అనుట చూడగా అర్థాలంకారముల గౌరవము స్పష్టము కాగలదు.

వెల్లూరు నరసింగకవి కూడ అలంకార ప్రియుడే. అర్థాలంకారము లందు ఉత్ప్రేక్షయన్న ఈయనకు అభినివేశము మెండు. ఉపమారూపకాదు లతోగూడి ఉత్ప్రేక్షను సంసృష్టి చేయుట ఈయనకు ఎక్కువగా అలవాటు. ఈయన చక్కని అర్థాంతర న్యాసములను పొందుపరచినాడు. సందర్భానుసార ముగా ఈయన స్వీకరించిన ఉల్లేఖ, శ్లేష, వ్యతిరేకాది అలంకారములు హృద్యములు.

## 1. ఉపమ

సాదృశ్యమూలకమైన అలంకారములలో ఉపమ సర్వశ్రేష్ఠమైనది. వస్తువుయొక్క యథార్థస్థితిని సుబోధకము చేయుటలో ఇది ప్రథమము.

కోపమందిరము నందలి సత్యభామ స్థితిని కవి చక్కని ఉపమానముతో చెప్పినాడు. కృష్ణుని దౌష్ట్యమునకు కలగి అలిగిన సత్యభామ కోపాగారమున 'పేదముత్తైదువ' వలె ఉన్నది.

'చేరి మణిభూషణాది శృంగారములను
దానె సడలించి పేదముత్తైదవవలె
నమరు మంగళసూత్ర మాత్రము వెలుంగ
మలిన వసనంబు తలకొంగు నమరగట్టి.' (51-2)

ప్రణయ కుపితయై కోపాగారమును చేరిన సతికి ఆభరణములతో అవసరము లేదు. అందువలననే సత్యభామ త్యక్తాభరణయై, మలిన వసనధారిణియైన పేద ముత్తైదువవలె తయారైనది. అప్పుడు ఆమెకున్న మంగళసూత్రము ఆభరణము కాదు. అది సుమంగళీత్వ చిహ్నమై, అపరిత్యాజ్యమైనది. కనకనే ఆమె దానిని విడవలేదు 'భూషణహానిస్తు భూషణం భవతి' అన్నట్లుగా ఆమె నిరలంకృతగా ఉండుట తత్కాల స్థితికి అనుగుణముగా ఉన్నది.

* * *

పరీక్షిన్మహారాజు శుకమహర్షిని కృష్ణుని కథ చెప్పుమని కోరినాడు. కవి శుకమునీశ్వరుని లీలాశుకముతో పోల్చినాడు.

శుకమూర్తి కథలు లీలా
శుకము గతిం జెప్పగలవు సొంపు జనింపన్' (104-1)

నీలాంశుకమూర్తి (కృష్ణుడు) కథలు లీలాశుకము (పెంపుడు చిలుక, శ్రీకృష్ణ కర్ణామృతకారుడైన లీలాశుక కవీంద్రుడు) వలె లీలగా, ఆశుకముగా సొంపు జనించునట్లుగా శుకమహర్షి చెప్పగలడని పరీక్షిత్తు అతనిని అభ్యర్థించినాడు. చిలుకల పలుకలు మదికి సమ్మోదము కలిగించునట్లుగా శుకుని పలుకులు ఇంపులు పుట్టించునని భావము. ఇందలి ఉపమానము శ్లేషయమకానుప్రాణిత మగుటవలన అనేక భావనలకు ఆస్కారము కలిగించు విష్ణుని కథలను అనేక విధములుగా చెప్పుటలో శుకమహర్షి సమర్థుడు అన్న భావము ధ్వనితము.

చీకటిని కవి 'కంతునిమాయమచ్చుపొడి'తో ఉపమించినాడు

'చింతలవేగి యొంటిగ వసించి పరస్పరదర్శనాప్తి ధీ
మంతులునౌ విటీవిటుల మానధనాపహృతార్థియైన యా
కంతునిమాయమచ్చుపొడి కైవడి మిక్కిలి కారుక్రమ్ముచున్
ధ్వాంతము నిండబర్వె వసుధాస్థలిపై దశదిక్సుగూఢమై' (160-2)

విరహవేదనల ననుభవించుచు పరస్పర సందర్శనేచ్ఛ గలిగియు స్వాభిమానములతో బిగుసుకొనియున్న ప్రేయసీప్రియుల దంభముల పోద్రోలునట్టి మదనుని వశ్యక్రియాసమర్థమగు భూతివలె దశదిశలు నిండునట్లుగా చీకటులు వ్యాపించినట్లు చెప్పుటలో, చీకటి ఆ విటీవిటులకు అనుకూలత కలిగించుటయేగాక కంతుని మాయమచ్చుపొడి వంటిది అయినందున వారికి పరవశత్వమును కలిగించి అభిసరణమును సుకరమొనర్చినది. సమాధ్యలంకారభావము ఉపమానమునకు జోడైనది.

## 2. ఉత్ప్రేక్ష

అన్యధర్మ నిమిత్తముచేత అన్యవస్తువునకు అన్యతాదాత్మ్య సంభావనము ఉత్ప్రేక్ష.

కోపమందిరమున మూర్ఛితమనస్కయై యున్న సత్యభామకు కృష్ణుడు వీవనక్రతో విసరుట అధిక బాధాకారకమయ్యెను.

'చతురతనొక్క చేడె కరసారస సీమను బూనియున్న భా
సిత మణి తాళవృంతమును శ్రీహరి తాగొని వీవ సత్యహృ
ద్గతమగు క్రోధభోగికి ప్రకంపిత సువ్యజనానిలంబు లా
హుతులిడులీల గన్పడియె నింపుదలిర్పగ నట్టివేళలోన్' (66-2)

ఇందలి ఉత్ప్రేక్ష రూపకముతో సాంకర్యమును పొందినది. కోపము సర్ప మైనది. ప్రణయకుపితమై తిరస్కారవృత్తినున్న సత్యభామకు కృష్ణుని ఉపచార క్రియలు బాధానివారణము కలిగించకపోవుటయేగాక, బాధను వృద్ధి చేసినవి. ఈయన సువాసనాభరిత వ్యజనానిలము ఆమె హృద్గతక్రోధభోగికి ఆహుతులిచ్చి పరిపుష్టము కావించినట్లయినది. సర్పమునకు పవనాశనత ప్రసిద్ధము.

లోకమున తుమ్మెదలు - సంపెంగ పుష్పములకు వైరము స్వతస్సిద్ధము. కాని ఈ రెంటికి నరసింగకవి రాజకన్యల నేత్రనాసికావర్ణనవ్యాజమున చక్కని హేతువుతో నిర్విరోధమైన మైత్రిని సాధించినాడు.

'విలసద్గంధఫలీ తిలప్రసవముల్ విశ్వంభరాధీశ క
న్యలకామోచము సంఘటిల్ల నిజరమ్య స్నేహ సంబంధమున్
గలుగంజేసి తదీయనాసలగుటన్ గన్పట్టి తత్ప్రేక్షణా
ళుల నానాసుమ గంధసారముల దేల్చున్నిర్విరోధంబుగన్' (197-1)

సంపెంగ కుసుమములు తమ రమ్యతను, తిలప్రసవములు తమ స్నేహమును (నూనె-మృదుత)సంబంధములుగ చేసికొని 'సమానశీలవ్యసనేషుసఖ్యమ్' అన్నట్లుగా ఆ రాజకన్యల నాసికలతో తాదాత్మ్యమును పొంది వారి ప్రేక్షణాళులతో నిర్వి రోధమైన మైత్రిని పొంది వానికి సర్వసుమనస్సౌరభ్య సంవాసితను గూర్చినవి.

## 3. రూపకము

ఉపమేయమునకు ఉపమానముతో అభేదతాద్రూప్యరంజనము రూపకము.

ప్రణయకుపితయైన సత్యభామను సాంత్వనపరచుచు ఆమె వియోగము తనకు భరింప శక్యముకానిదని చక్కగా రూపించి చెప్పినాడు. మన్మథబాధ అతివేలమైనదని చెప్పుటకై మదనుని అనంతసాగరముగా సాంగముగా నిరూపించినాడు.

'అలరు శరంబులున్, జిగురుటాకుల విల్ సుడి, డాలుమీలు, చి
ల్కలబలముల్ తరంగములుగా నల పున్నమచందమామ రా
కలకు విజృంభవృత్తిగం కంతుమహాంబుధినెట్లు దాటు దీ
వలిగి యొకింత నాయెడ ఘృణాయత నావయుగాకయుండినన్' (73-2)

పుష్పములు చిగుళ్ళు, మదనధ్వజములైన మత్స్యములు, చిలుకలు, పున్నమ చంద్రుడు మొదలైనవి సహజముగనే విరహులను బాధించు మదనోద్దీపకములు. అవి దురంతసాగరముగా రూపితములై ముందునకు దూకిన ఇక విరహులకు దిక్కేది? పుష్పములు (బాణములు) జలములుగా, చిగురువిల్లు సుడిగా, డాలు మీనములుగా, చిలుకలు తరంగములుగా నుండి రాకాసుధాకర సందర్శనమున విజృంభించునట్టి మన్మథ పారావారమును సత్యదయయనెడు నావలేనిచో తరించుట కష్టమని కృష్ణుడామెను ప్రార్థించినాడు. దుస్సహమైన విరహము దుస్తరమైన సముద్రముగా చెప్పుట ఉచితము.

## 4. అర్థాంతరన్యాసము

సామాన్య విశేషములలో ఒకదానిని మరియొకదానితో సమర్థించుట అర్థాంతరన్యాసము.

కృష్ణుడు తనను అనాదరించిన విషయము తెలిసి సత్యభామ 'మోసగాడు తనకు ఇతరులు చేసిన మేలును విస్మరించి అపకారము చేయగలడనుచు' కృష్ణుని దూరినది.

'కృపవిడనాడుచున్ మరుడు ఘేయని పైకొనువేళయందు నే
నపరిమితాను రాగమున నార్తి తొలంగగజేసి, తన్ను బల్
నిపుణత ప్రోచుటన్ మదిగణింపక నన్నిటుజేయ జెల్లునా
కపటికి నెంతబెట్టి యుపకారము చేసిన మేలు చేసునే' (39-2)

మన్మథుని బారినబడి కటకటపడు కృష్ణుని తాను అమితానురాగమున బాధానివృత్తి గావించి ప్రాణాపాయసంకటము నుండి కాపాడిన విషయమును విస్మరించి కృష్ణుడు కపటియై కృతఘ్నతతో తనను అవమానించినాడని, కపటిక

ఎంత మహోపకారము కావించినను వాడు తన సహజప్రవృత్తితో అపకారము చేయ వెనుదీయడని అతని కౌత్స్యమునకు బాధపడినది.

అసంఖ్యాకలైన గోపకాంతల సంభోగరతుడైన కృష్ణుని దౌష్ట్యమును 'కాముకస్య కుతః సతీ అనుచిత్తమ్' (41-2) అని సత్యభామ తూలనాడినది.

సందర్భానుసారముగా నున్న 'స్త్రీలకు మానరక్షణము సేయని కట్టడి భర్తగల్గినన్ (46-2), 'మొనసిన సంభ్రమంబు మాయమూకుడుగలదే' (273-2) 'అనిశము వీరులకు సమరమతి వేడ్కగదా' (199-3), మౌనులైన యమాన్మి నులం గనుంగొనిన మానసముల్ నిలుపంగనేర్తురే' (1901) వంటి అర్థాంతర సమర్థనములు నరసింగకవి లోకజ్ఞతను తెలుపుచున్నవి.

## ౫. దృష్టాంతము

వాక్యములకు బింబ ప్రతి బింబత్వముండుట దృష్టాంతము.

నరకుని వధించి వచ్చిన హరిని గాంచిన ప్రాగ్జ్యోతిష పురజనులు భూపుత్రుని దుశ్చేష్టితమును ఖండించిరి.

'భగవంతుడని యెరుంగక
జగతీసుతు డితని తోడ సలిపెను వైరం
బెగియును గన్నుంగానక
తగరు బలిసి కొండ తోడ దాకిన లీలన్' (353-2)

పరాత్పరుడైన భగవంతుని సామాన్యమానవుడనెడు భావము అల్పుడైన భూసుతుడు 'గొర్రెబలిసి కొండను ఢీకొన్నట్లుగా' కృష్ణునితో వైరమున మరణించినట్లు పౌరులు నిందించిరి.

సందర్భానుసారముగా నరసింగకవి 'చల్లకువచ్చి ముంతదాచగవలెనే (272-2), 'సరి తప్పు దండమున దప్పునటందురు' (88-2), 'దావాగ్నిపై గవయు, మిడుతచందమున' (85-3), 'పున్నాగముతో మశకములెన్నైనను బోరి జయింప గలవే' (91-4) వంటి సామెతలు, దృష్టాంతములను పేర్కొన్నాడు.

## 6. ప్రతివస్తూపమ

రెండు వాక్యములకు ఏకసామ్యముండుట ప్రతివస్తూపమ.

కృతిప్రేరకుడైన వట్టెము నరసింహారెడ్డి పాలనాదక్షతను కవి రమ్యమైన ప్రతివస్తూపమలో చెప్పినాడు.

'ఆ నరసింహదేవుడపుడా భువి యాకడలిన్ మునింగనన్
దానెటుగా నుదార మహిదారుడునై పయికెత్తి నిల్పె జూ
మానిత జన్పలీంద్ర హనుమంత నృపాలుని రాజ్య సంపదన్
శ్రీ నరసింహనామ నృపశేఖర! నీవటు నిల్పితా బళీ!' (29-1)

ఆ నరసింహదేవుడు - విష్ణువు (ఇట 'సింహ' శబ్దము స్వార్థమునకాక శ్రేష్ఠతార్థమున ప్రయుక్తము. పురుషోత్తముడు - విష్ణువు అని అర్థము) హిరణ్యాక్షుని వలన భూమి సముద్రమున మునుగగా తాను మహిదారుడై (ఆది వరాహస్వామియై, భూమిని ఉద్ధరించినవాడై) ఉచ్ఛస్థితిని కల్పించినట్లుగా గోపాలుపేట సంస్థానాధీశుడైన హనుమంతరాయని రాజ్యము శత్రువశము కాగా నరసింహారెడ్డి వారిని అణచి సంస్థానమును పునరుద్ధరించినాడు. పుడమిని ఉద్ధరించుటయందు నరసింహ దేవునికి నరసింహారెడ్డికి సామ్యమున్నది.

## 7. శ్లేష

నానార్థ సంశ్రయత్వము శ్లేష.

గోపాల్పేట రంగనృపాలుని మనుమడైన హనుమంతరాయని కీర్తిని హృద్యమైన విధముగా కవి శ్లేషతో శివమూర్తిగా ఉపమించినాడు.

'రంగనృపాలు పౌత్రుడయి రాజిలు నాహనుమద్ధరాధిరా
ట్పుంగవుకీర్తి పూర్తి శివమూర్తి దగున్ శరజాతగౌరవా
ప్తిం, గమలాహితోరుకరదీప్తి, మహాసితకంధరానుష
క్తిం, గమనీయ హైమజగతీధర ధర్మనియుక్తి నెంతయున్' (54-1)

శరజాతగౌరవాప్తిన్ - బాణజనిత గౌరవమును పొందుటచేత (పరాక్రమముచే) రాజు, కుమారస్వామి గౌరవమును పొందుటచేత శివుడు; కమలాహితోరుకర దీప్తిన్ - కమల (సంపదచే) హిత (ఉంచబడిన, పంపబడిన) గొప్ప హస్తము చేత ('దానేన పాణిః') రాజు. కమల + అహిత - చంద్రుని యొక్క అధికకిరణ కాంతిచేత శివుడు; మహాసితకంధరానుషక్తిం - మహా = గొప్పదియైన, అసిత కంధరానుషక్తిం = ఖడ్గమును ధరించుట చేత (కం = శిరము. "కంశిరోసుఖే" శిరము దేహమునకు ఉపలక్షకము. అట్టిచో నల్లనిదేహముకలది - ఖడ్గము) రాజు, కాలకంఠపు కూడికచేత శివుడు; కమనీయహైమ జగతీధర ధర్మనియుక్తిన్ - కమనీయహైమ = మనోరమైన, చల్లని (రంజకులైన), జగతీధర = రాజుల యొక్క, ధర్మనియుక్తిన్ = ధర్మనియామకముచేత అనగా చల్లగా పాలనము చేయు-ప్రజారంజకముగా పాలించు పూర్వరాజుల ధర్మనియామకముచేత రాజు (హనుమంతరాయుడు), మేరు పర్వతమును విల్లుగా ధరించుటచేత శివుడు అని ఈ విధముగా సాభిప్రాయముగా హనుమంతనృపాలుని కీర్తి పూర్తిగా శివ మూర్తితో తుల్యముగా చెప్పినాడు కవి. ఇందు ప్రతిపాదమున వేరువేరుగా పునరావృతములైన రా, ర్తి, ప్తి, క్తి వంటి అక్షరములు పద్యమునకు సమతౌల్యమును, నిండుదనమును కలిగించినవి.

## 8. ఉల్లేఖము

ఒక వస్తువునే అనేకులు అనేక విధములుగా చెప్పుట ఉల్లేఖము.

గోపాల్పేట సంస్థానమున మిగులప్రశస్తిని పొందిన గోపాలరాయని కవి ఆయాదేవతలతో సమానముగా శ్లిష్టరూపకముతో ఉల్లేఖించినాడు.

'జిష్ణుడంచును బరక్షితిభృత్ప్రకాండంబు
        జతురాస్యుడని కవీశ్వర చయంబు
నలఘుకళానిధి యనుచు సత్ప్రకరంబు
        నినుడంచు మిగులలోకనివహంబు
నచలేశ్వరుండంచు నఖిల దేవావళి
        సరసఘనుండని సౌమనసము
నసమాంబకుడని రమ్యసరోజముఖులును
        బొసగ శ్రీదుండని పుణ్యజనులు

నిరతము నుతింప నలరారు నిజపదాంబు
జానుబంధ యథార్థ కృతారిమౌళి
లాలితాంబుజ రాగరత్నాళి రుచిర
మార్చితుండన గోపాలమనుజవిభుడు' (74-1)

జిష్ణుడు-జయశీలుడని, ఇంద్రుడని, పరక్షితిభృత్త్రకాండము - శత్రురాజసము దాయము, శత్రువులైన పర్వతసముదాయము ; చతురాస్యుడు - చమత్కార భాషణుడని, బ్రహ్మయని, కవీశ్వరచయము - కవుల గుంపు, ఋషుల గుంపు; అలఘుకళానిధి - అధికమైన లలిత కళలందు నిపుణుడని, చంద్రుడని, సత్త్ర కరము - సజ్జన సముదాయము, నక్షత్రసముదాయము; ఇనుడు - సమర్థుడైన ప్రభువని' సూర్యుడని లోకనివహము- ప్రజాసమూహము, భువనసముదాయము అచలేశ్వరుడు-స్థిరుడైన రాజని, అచలుడైన ఈశ్వరుడని (శివునకు అచలుడు; 'స్థాణువు' అను పేరు ప్రసిద్ధము), అఖిలదేవావళి-బ్రాహ్మణసముదాయము, దేవతా సముదాయము (ఈశ్వరుడు హాలాహల భక్షణముచేత దేవతల ప్రాణములు నిలుపుట ప్రసిద్ధము); సరసఘనుడు-సరసుడైన గొప్పవాడని, జలయుక్త ఘుడని, సౌమనసము - విద్వాంసులసముదాయము, పుష్పసంబంధమైన తరుల తాదుల సముదాయము; అసమాంబకుడు - సాటిలేని కన్నులు గలవాడని (అంద గాడని), మన్మథుడని, రమ్యసరోజముఖులు-పద్మముఖులైన స్త్రీలు. పద్మములు ముఖములుగా-అలుగులుగా గల బాణములు అనగా పుష్పబాణములు; శ్రీదుడని- సంపత్ప్రదాత అని, కుబేరుడని, పుణ్యజనులు-సజ్జనులు, యక్షులు, నిజపదాంబు జాత......మార్చితుడు - తనపాదపద్మముల యొక్క ఎడతెగని కూడికచేత ధన్యమైన శత్రుకిరీటలాలిత పద్మరాగరత్నసముదాయముచే మనోజ్ఞమైన సంపదచే పూర్ణుడు తనపాదముల నారాధించు లక్ష్మీదేవి చేనొప్పినవాడు అయిన గోపాల మను జవిభుడు-గోపాలుడను పేరుగల రాజు, గోపాల - గొల్లల, మనుజ = మాన కాంతలకు, విభుడు - భర్తయైనవాడు-ప్రియముడైనవాడు కృష్ణుడు. అని ఈరీతిగా పలువురిచేత పలుకారణములతో పలువిధములుగా గోపాలరావు కీర్తితుడు. ఇందలి ఉల్లేఖము, శ్లేషరూప కాతిశయోక్తుల సాంకర్యముచే కూడినది.

## 9. వ్యతిరేకము

ఉపమానోపమేయములు రెండింటిలో దేనికైన నొకదానికి ఆధిక్యము చెప్పుట వ్యతిరేకము.

"ఇనుడయ్యు గువలయహితమొనర్పని సూర్యు
డలఘుతేజమున జోడగునె నీకు
రాజయ్యు దోషాకరస్థితిగను చంద్రు
డమల కళాప్తి నీడగునె నీకు
శుచియయ్యు నవిహిత స్ఫూర్తి వర్తిలు వహ్ని
తగ ప్రతాపమున దీటగునె నీకు
ఘనుడయ్యు నప్రసిద్ధి నడంగు మేఘుండు
త్యాగంబుచే బురుడగునె నీకు
నినుడు రాజును శుచి ఘనుడనెడి పేర
నవనిపాలించి నిర్దుష్టతాప్తి నమరి
విహిత గతి మీరి యనిశంబువెలసి తహహా
వైభవసురేశ! నరసింహ వసుమతీశ!" (86-1)

కృతిప్రేరకుడైన నరసింహారెడ్డి గొప్పదనమును నరసింగకవి అద్భుతముగా నానాలంకార సంసృష్టి సాంకర్యములతో గొప్పగా చెప్పినాడు.

ఇనుడు - సర్వసమత్వమును ప్రదర్శింపవలసిన సూర్యుడు, రాజు, కువలయములకు-కలువలకు, లోకములకు, తాపకారకుడైనాడు, హితముచేయలేక పోయినాడు; రాజు-చంద్రుడు, ప్రభువు, దోషాకరస్థితిని-కళంకియగుట, రాత్రిని కలుగజేయుట (చంద్రుడు నిశాకరుడగుట ప్రసిద్ధము), దుర్మార్గము కలిగి యుండుట; శుచి - అగ్ని, అవిహితస్ఫూర్తిని - అనిష్టకార్యకరణము అనగా అపకారముకలుగజేయుట (ప్రజలకు అగ్నిబాధాకారకుడగుట ప్రసిద్ధము) యందు నిష్ఠుడైనాడు; ఘనుడు - మేఘుడు, అప్రసిద్ధి-అపఖ్యాతిని పొందినాడు అనగా ఎల్లకాలము ఉండలేనివాడైనాడు (వర్షాకాలముననే మేఘునికి ప్రాధాన్యముండుట ప్రసిద్ధము). అందువలననే వీరందరిని క్రిందుపరచునట్లుగా వీరి లోపములను పరిహరించి అవని పాలించుట యందును, నిర్దుష్టతాప్తి యందును, విహితగతిని మీరుటయందును, అనిశము వెలయుటయందును ప్రసిద్ధిని పొంది సార్థకముగా ఇనుడు, రాజు, శుచి, ఘనుడైనట్లుగా నరసింహారెడ్డి వర్ణితుడు. ఇట్లు ఈయన ఉపమానాతిశాయియైన సుగుణ భూయిష్ఠుడైనాడు. ఇందలి వ్యతిరేకాలంకారమునకు శ్లేష, ఉల్లేఖ, క్రమ, అపహ్నుతులు జోడై అర్థపుష్టిని చేకూర్చినవి.

## 10. సమాసోక్తి

ప్రస్తుతమునందు అప్రస్తుత పరిస్ఫూర్తి సమాసోక్తి.

నరసింగకవి ప్రకృతి వర్ణనమున సమాసోక్తులను పొందుపరచినాడు. అరుణ జరఠాతపము, సంధ్య, అరుణద్యుతులు మొదలగువానియందు ప్రస్తుత విషయముతోపాటుగా పరకీయాశృంగార సంబంధమైన అన్యార్థస్ఫురణ కలుగుచున్నది.

"కిరణ శృంగాళిచే నరుణాభికుడు ధరా
కాంతపై జిల్కు వసంతమనగ" (153-2)

అరుణకిరణములు అంతట ప్రసరించుట ప్రస్తుత విషయము. కాగా అరుణుడను కాముకు డొకడు చిమ్మనక్రోవితో ఒకానొక స్త్రీపై అనురాగముతో వసంతము చల్లుట (రంగునీళ్ళు) అనెడు అప్రస్తుతాంశ మిందు స్ఫురితము.

''తరుణ హరిత్సతి లీలా
పరిచితిచే నంతరిక్ష పల్లవికునిపై
నరుణరుచి రసము చిమ్మిన
కరణిన్ సంధ్యాతిరాగ కలన దనర్చెన్'' (158-2)

ఇందలి సంధ్యా వర్ణనమున దిశాకాంత యనెడు నాయిక లీలా పరిచితి - శృంగార చేష్టలందలి పరిచయముతో, అంతరిక్షుడను విటునిపై ఎర్రని వసంత జలమును రాగిణియై చిమ్ముట అప్రస్తుతము.

''హరిహరి దబలా వీటీ
ఖర పరిచితి దశన వసన బంధూక నవ
స్ఫుర దరుణ ద్యుతులో యన
నరుణ ద్యుతులుదయ శిఖరి నల్లన బర్వెన్' (177-2)

తాంబూల చర్వితమైన ఇంద్రదిగంగనయనెడు పరకీయా నాయికను అరుణుడనెడు విటుడు ముద్దిడుకొనగా అతని పలువరుస కంటిన రక్తిమ యన్నట్లుగా అరుణకాంతులు తూర్పు దిశయందు ప్రసరించినట్లు కవి చెప్పినాడు.

## 11. పరికరము

విశేషణము సాభిప్రాయమైన పరికరము.

కవి కృష్ణుని అష్టభార్యలను సార్థకనామధేయలుగా చెప్పినాడు.

'రుచిరాంగరుచిజిత రుక్మిణి రుక్మిణి
సత్యభామాంచిత సత్యభామ
జాంబవత్కచధన్య జాంబవద్వరకన్య
మిత్రజనానంద మిత్రవింద
పంచాస్త్ర శాస్త్రసుభద్రానుభవ భద్ర
సమదంత విజితదాడిమ సుదంత
కాంతి స్వసాయిత కాళింది కాళింది
లలితసులక్షణ లక్షణాఖ్య' (133-1)

శరీరకాంతిచేత తిరస్కరించిన హేమము కలది 'రుక్మిణి', కాంతిమంతమైన శరీరముకలది 'సత్యభామ', నేరేడుపంటు వంటి కొప్పుగలది 'జాంబవతి', మిత్రులను ఆనంద పరచునది 'మిత్రవింద', మన్మథ శాస్త్రానుభవమున భద్రమైనది 'భద్ర', సుందర దంతములుగలది 'సుదంత', కాళిందివలె నల్లనైనది 'కాళింది', శుభలక్షణములతో కూడినది 'లక్షణ' అని సాభిప్రాయమైన విశేషణములుండుట వలన పరికరము.

## 12. పరికరాంకురము

విశేష్యము సాభిప్రాయమైన పరికరాంకురము

'హరి నీలమణుల రంధ్రాన్వేషణము సల్పు
గుణవతీమణుల ముంగురుల సొబగు
జలదాళి జీవనశక్తి పాయగజేయు
శరదబ్జ నేత్రల జడల సొరు
సకలంకుడగు సారసద్వేషి గబళించు
నవతమోవేణుల నగుమొగములు
మీల బల్వంతల పాలుగా నొనరించు
కోక స్తనుల సద్విలోకనములు

మన్మథుని విండ్ల గంట్లెల్ల మాన్పదలచు
గంధసింధుర యానల కన్నుబొమలు
పక్వబింబ ఫలమ్ముల బలిమి నణచు
కీర వాణుల మధురోష్ఠసారరుచులు' (192-2)

ఇది రాజకన్యల అంగవర్ణన. వారు 'గుణవతీమణులు' కావున ఇంద్రనీలమణుల రంధ్రాన్వేషణ గావించిరి. 'శరదబ్జనేత్రలు' కావున మేఘములందలి జీవనమును హరించిరి (శరత్కాలమున మేఘములు నిర్గతజలములగుట ప్రసిద్ధము). 'నవతమోవేణులు' (రాహువువంటి వేణికలవారు) కావున చంద్రుని కబళించినవి వారి ముఖములు. కోకస్తనులు (కోకము-చక్రవాకము) కావున చేపలను వంతల పాలు గావించినవి వారి విలోకనములు. 'గంధసింధురయానలు' కావున మన్మథుని చెరుకు విండ్లను ధ్వంసము కావించిరి. 'కీరవాణులు' కావున దొండపండ్ల బలిమిని అణచిరి. ఇందలి స్త్రీసంబోధక విశేష్యము లన్నియు సాభిప్రాయములు.

## 13. విరోధాభాసము

శ్లేషాదులచే విరోధము తొలగుట విరోధాభాసము.

'ఘనపుణ్యజన విమర్దనము సల్పినవాడు
ఘనపుణ్యజన వివర్ధనమువాడు' (126-1)

అని కృష్ణుని వర్ణించుచు కవి చెప్పినాడు. ఒకే వ్యక్తి పుణ్యజన విమర్దకుడు, వివర్ధకుడు అయినట్లు చెప్పబడుటచేత అర్థమున విరోధము తటస్థించినది. కాని శ్లేషవలన 'పుణ్యజన' శబ్దమునకు 'సత్పురుషులు, రాక్షసులు' అని అర్థద్వయము సిద్ధించుట వలన పుణ్యజనులను అనగా రాక్షసులను నాశనముకావించినవాడు, పుణ్యజనులను అనగా సత్పురుషులను రక్షించినవాడు అన్న స్పష్టమైన అర్థ మేర్పడినది. అందువలన ఇందలి విరోధము తొలగిపోయినది.

## 14. వ్యాజస్తుతి

నిందచేత స్తుతిగావి, స్తుతిచేత నిందగాని తోచుట వ్యాజస్తుతి.

1. నిందచేత స్తుతి - యుద్ధరంగమున నరకుడు కృష్ణుని దుర్భాషలాడుటలో వ్యాజస్తుతి యున్నది.

'జలధింజారిన కానన
ముల దూరిన విప్రవేషముల దేరిన రా
కలిమింగేరిన మసరం
జిలమీరిన కలికివగల జేరిననైనన్' (324-2), 'నినుబోనిత్తునె' (325-2).

నరకుడు కృష్ణునితో అతడెక్కడ దాగినను విడువననుటలో సముద్రమున మునిగినను, అరణ్యమున మాటువడినను, బ్రాహ్మణరూపమున ప్రచ్ఛన్నుడైనను, రాజుల నాశ్రయించినను, మాయ చేసినను, ఆడుదానివలె వగలుపోయినను విడువక సంహరింతునన్నాడు. ఇందు 'జలధింజారుట' అనుటలో మత్స్య, కూర్మములు, 'కాననముల దూరుట' అనుటలో వరాహ, నారసింహములు, 'విప్రవేషములదేరుట' అనుటలో వామన భార్గవరాములు, రాకలిమింగేరిన' అనుటలో శ్రీరామ, బలరాములు, 'మసరంజిలమీరిన' అనుటలో బుద్ధుడు, 'కలికి వగల జేరుట' అనుటలో కల్కి మొదలగు దశావతారములు స్తుతింపబడినవి.

2. స్తుతిచేత నింద - (చూ. 'రసమాధురి' యందలి' పతితులనెందును' అన్న పద్యవివరణ)

## 15. అతిశయోక్తి

అతిశయించి చెప్పినమాట అతిశయోక్తి.

రాజకన్యల గండస్థలనైగనిగ్యము అతిశయముగా వర్ణితము.

'తళుకు చెక్కులు మెరుగుటద్దముల మించు
మించు బోడుల కనుచు వర్ణించవలసె
వలసినప్పుడు చూపరుల్ గలయజూడ
జూడనగునందు దమమేని నీడతార' (196-2)

ముందే వారు మించుబోడులు. అందునా మెరుగుటద్దముల మించు తళుకుచెక్కులు వారివి. అందువలననే అవసరమగునపుడు చూపరులు అద్దముల అవసరములేకయే తమ ప్రతిబింబములను వారి చెక్కిళులందు చూచుకొనవచ్చునని అతిశయింపబడినది. దీనికి ముక్తపదగ్రస్తము తోడైనది.

## 16. ఉదాత్తము

సమృద్ధిని వర్ణించుట ఉదాత్తము.

నరసింగకవి గోపాలుపేట సంస్థాన ప్రధాన పురమైన గోపాలుపేటను మిక్కిలి ఉదాత్తముగా చిత్రించినాడు.

'శ్రీపూర్ణోత్పల బాంధవోపలగణ శ్రీసౌధ శంభచ్ఛకా
లాపీ గంధకుచద్వయీ పరిమళాహ్లాదాగత ద్యోధునీ' (45-1)

ఆకాశ గంగయందలి పద్మమరంద పానమత్త భృంగములు సవాసనాలాలసతో గోపాలుపేట సౌధముల సంచరించు స్త్రీల గంధ భరితకుచద్వయమును ఆశ్రయించినట్లు చెప్పి ఆ నగరము శ్రీమహాలక్ష్మికి ఆటపట్టుగా వర్ణించుట ఉదాత్తముగనున్నది.

## 17. స్వభావోక్తి

జాతి గుణాదుల యందలి స్వభావమును వర్ణించుట స్వభావోక్తి.

నరసింగకవిరైవతకాద్రి సమీపమందలి చెంచులను వారి జాత్యుచిత వేషభాషణములతో వర్ణించినాడు.

'నెమలీకెల తురాయిలమరించు తోలుకు
శ్శాయిాలమీద జెల్వంబుగాగ' 12-3

నెమలీకెల తురాయిలు కలిగిన తోలు పట్టములు, పికిలిపిట్టల యీకల దండలు, పులిచర్మముల దట్టీలు, కాసెకోకలు, బొల్లినామములు, గురివిందపూసలదండలు మొదలగువానిని ధరించినారు చెంచులు.

'ఓరి యనుమంత, సీరామ, నారసిమ్మ, తిరుమలేసుడ, మారకాపురము సెన్నవరద' (13-3) అని వారికి అనుగుణమైన విధముగా తమ తమ పేర్లను వారు పిలిచిరి.

## 18. ప్రౌఢోక్తి

వస్తువు యొక్క ఉత్కర్షకు హేతువుకాని దానిని హేతువుగా చెప్పుట.

'కొమ్మల వదనమ్ముల యల
కమ్ముల రదనమ్ముల సరిగాకను నరవిం
దమ్ములు కందమ్ములు కుం
దమ్ములు జలగగనవన పదమ్ముల డాగెన్' (191-1)

రాజకన్యల అంగవర్ణనమున వారి ముఖము, అలకలు, రదనములకు ఉపమానములైన పద్మము, మేఘము, మొల్లమొగ్గలు వారి ఆయా అంగసౌందర్యములకు సాటికాలేక భీతిలి జల, గగన, వనములందు దాగినట్లు చెప్పబడినది. పద్మఘనకుందాదులు జలగగనవనముం నుండుట వాటి నైజమేకాని భీతిలి దాగుటకై కాదు. కారణము కానిది కారణముగా చెప్పబడినది.

## 19. అర్థాపత్తి

ఒక విషయమును చెప్పిన మరియొక విషయము తనంతటనే సిద్ధించుట.

'పటు తరాగ్ని యంత్ర పటపటార్భటులచే
దిక్కులెల్ల బగిలి దిక్కరులకు
జొడువడియె నితరజాతి మృగాళికి
భయము బొడముటెంత పని తలంప' (36-3)

మృగములను భయపెట్టి బయలు వెడలించుటకు వేటగాండ్లు అగ్నియంత్రములను ప్రయోగించగనే దిగ్గజములకే చెవులు చిల్లులు పడినవి. ఇక ఇతర ప్రముక్కడి మృగముల విషయము వేరుగా చెప్పనేల? అనగా సామాన్యమైన ఇతర మృగములు గుండెలు పగులుటకు సంశయింప పనిలేదను అన్యార్థము స్వయముగా సిద్ధించుచున్నది.

## 20. అపహ్నుతి

ఒకదానిని కాదని మరియొకదానిని చెప్పుట అపహ్నుతి.

ముందుగా వ్యతిరేకాలంకారమునకు ఉదాహరణగా ఇవ్వబడిన 'ఇనుడయ్యు గువలయ హితమొనర్పని సూర్యుడు' అన్న పద్యముననే (చూ. పు. 164) అపహ్నుతి యున్నది.

ఇనుడు (సూర్యుడు), రాజు (చంద్రుడు), శుచి (అగ్ని), ఘనుడు (మేఘుడు) అనువారు వారుకాదు. రాజే ఈ ధర్మములన్నిటిని కలిగియున్నట్లు అపహ్నవించి చెప్పబడినది.

## 21. విషమము

అననురూపమైనివావికి సంబంధమును వర్ణించుట విషమము.

సత్యభామ తనతో యుద్ధమునకు వత్తుననగా ఆమెను వారించుచు కృష్ణుడు

'దురమెక్కడ నీవెక్కడ
నరుదేరగవలదు నిలువు' (204-2) అని పలికినాడు. 'మహాభయంకరమైన యుద్ధమెక్కడః కుసుమసదృశవైన నీవెక్కడః వలదని' కృష్ణుడు వారించినాడు.

## 22. భ్రాంతిమదము

ఒక వస్తువును భ్రాంతిచేత వేరొక వస్తువుగా తలచుట.

విశ్వకర్మ నిర్మించిన దేవసభయందలి వింతలకు తిర్యక్కులు భ్రాంతి పడినవి.

'చంద్రకాంతోపల సత్కాంతి చంద్రికా
తతికి చకోరసంతతులు రేగ' (417-2)

చంద్రకాంతమణుల కాంతిని చకోరములు వెన్నెలగా, పద్మరాగమణి ప్రభను ఎండగా చక్రవాకములు, మరకత దీప్తిని జింకలు బాల తృణముగా, ఇంద్రనీలముల కాంతిని నెమళ్ళు మేఘముగా భ్రాంతిచెంది సంతసించినవి.

## 23. సమాధి

కారణాంతర సాన్నిధ్యమువలన కార్యసౌకర్యము కలుగుట.

నిశావర్ణనమున వేశ్యలకు వారి కామాంధతయే వారి అభిసరణములకు సమర్థమైయుండగా, దానికి గాఢాంధతయు జోడై వారికి కార్యసౌకర్యము కలిగించినట్లు చెప్పబడినది.

'భూరి గాంధాంధ కామాంధములు సహాయ
మగుచు తము వేగిరింపగా నిగురుబోండ్లు
సొగసుకాం[ద]ను దొగతూపు శూరువగల
వేచి తిరుగుదురన్ని శివేళయందు' (166-2)

తమ అభిసరణమున ఇతరుల కంటబడిన అల్లరి పాలగుదుమేమోయను భయము లేకుండునట్లుగా ఇతరుల కంట పడకుండ అధికారము వారికి తోడై కార్య సౌకర్యమును కలిగించినది.

## 24. తుల్యయోగిత

క్రియ మున్నగువానిచేత పెక్కింటియొక్క తుల్యత్వము తుల్యయోగిత.

కృతిపేరకుడైన నరసింహారెడ్డి గొప్పదనమును కవితుల్య యోగితలో చెప్పినాడు.

'మీ మనము మీకరమ్మును
మీయెడల ప్రాంగణముల మేలిమి వరుసన్
నేమముగ దానవారి
శ్రీమహిమజెలంగె నారసింహారెడ్డీ!' (34-1)

నరసింహారెడ్డి మనము, కరము, మేడల ప్రాంగణములు దానవారి శ్రీమహిమచే చెలగినవి. మనస్సు దానవ + అరి + శ్రీమహిమ- దానవులకు శత్రువైన విష్ణు సంబంధమైన బుద్ధి మహిమచేత, హస్తము దానజలసంపదచేత, మేడల ప్రాంగణములు ఏనుగుల మదజలాధిక్యతచేత ప్రకాశించినట్లు ఒకే విశేషణము, క్రియలు పెక్కింటికి సమానముగా అన్వయించినవి. ఇందు అన్నియు ప్రస్తుతములే.

## 25. తద్గుణము

స్వగుణమును విడిచి అన్యగుణమును గ్రహించుట తద్గుణము.

రాజకన్యకా కృష్ణుల వివాహమున కన్యలు కృష్ణునిపై పోసిన ముత్యాల సేసలు ఆయాస్థానములందాయా వర్ణములను గ్రహించి నానా వర్ణవిరాజితములైనట్లు చెప్పబడినది.

'అయింతులెత్తిన దోయిళ్ళ ముత్తెముల్
పద్మరాగ ప్రభాపటలి దోప
హరి శిరస్థాన విన్యస్త లంబలగుచు
గుంద సూనంబుల క్రిందుపరుప
నీరద తులిత శరీరంబుపై వ్రాలి
సంక్రందనోపల చ్ఛాయలమర
దివ్యభూషణ మణిదేదీప్య మానంబు
లగుచు దత్తచ్ఛాయ నభినయింప

ముదితలు పదారు వేవురు ముదముమీర
ప్రోదిగా గూడి తలబ్రాలు వోయువేళ
వింత వింతల కాంతులత్యంత లీల
భాసమానంబులయ్యె జూపరులకెల్ల' (275-4)

ముత్యములు సహజముగ తెల్లనివి. వాటిని రాకుమార్తెలు తమ దోసిళ్ళలో పట్టు కొనినప్పుడు వారి హస్తారుణిమ సాహచర్యము వలన పద్మరాగములవలె నెర్ర నైనవి. దోసిళ్ళనుండి కృష్ణుని శిరముపై వంపగనే అవి జారుచు శిరముచేరు వరకు స్వగుణమును స్వీకరించి మొల్ల మొగ్గలవలె తెల్లనైనవి. కృష్ణుని నీల శరీరమునుండి జారునపుడు ఇంద్రనీలములవలె నల్లనైనవి. ఇక ఆయా వర్ణము లతో గూడిన మణిభూషణములపై నుండి జారునపుడు ఆయావర్ణములను స్వీక రించినవి అందువలన ఒక్క ముత్యములే వింత వింతల కాంతులను ప్రసరించి చూపరుల నాశ్చర్యచకితుల చేసినట్లు కవి వర్ణించినాడు.

## 26. లోకోక్తి

లోకోక్తులను చెప్పినచో లోకోక్తియగును.

కృష్ణుని దౌష్ట్యమును దూతిక సత్యభామకు ఎరిగించుచు నారదముని ఆగమనమును గురించి ఆర్భాటముగా తెలిపినది.

'చతురాస్యసుతుడు నిజదీ
ధితి దిక్కుల గప్ప జుక్క తెగపడ్డగతిన్

దితిజారి సన్నిధికి న
ద్భుత లీలన్ రాగ నతని బొడగని వేగన్' (8-2)

నారదుడు 'చక్క తెగిపడినట్లుగా' వచ్చినాడు. చుక్కతెగిపడుట అనగా 'హఠాత్తుగా' అని అర్థము. కొంపలు అంటుకొని పోవునట్లుగా ఏదో ఘన కార్యమును సాధింపవచ్చినాడని యర్థము.

## 27. చేకోక్తి

లోకోక్తి యర్థాంతర గర్భితమై యుండెనేని చేకోక్తి.
'సరసిజ నేత్ర! నీ కిటు పొసంగిన కూర్మికి దేవసంయమీ
శ్వరుడె తలంప సాక్షి కలచందము తెల్పెద బంచదారలో
గరళమువంటి వర్తనము గావొకొ తావక వాక్యవైఖరుల్' (93-2)

అని తనను సాంత్వన పరచు కృష్ణుని సత్యభామ తూలనాడినది. ఇందు 'పంచదారలో గరళము వంటి వర్తనము' అన్నది లోకోక్తి. 'ధూర్తుడు చేసిన మేలు స్థిరముగా నిలువదు. స్వీయకార్య సాధనకై వాడు మేలు చేసినట్లు కనబడినను అది ఎప్పుడు వికటించి అపకారముగా పరిణమించగలదో తెలియుట కష్టము' అన్న అర్థము ఇందు గర్భితము. విషయుక్తమైన చక్కెర తీపిగ నున్నట్లున్నను ప్రాణాంతకమగును.

ఇటులే మరియొక చోట సత్యభామ కృష్ణుని గురించి 'కంసరిపుమాట కడువనగండ్లమూట' (43-2) అని అనుకొన్నది. ఇందు 'వనగండ్లమూట' లోకోక్తి. వడగండ్లు ఘనపదార్థమై, బరువు కలవియైనందున అవి ఉపయోగపడు నని తలచి ఎవరైన మోసి తెచ్చుకొన ఫలితమేమైన ఉండునా? కొన్ని నిముషములకే కరిగి నీరై పోవును. చేసినపని వ్యర్థమగును. అటులే ఊరక అభిమానమును చూపునట్టి మాటలు గట్టిగా, ఉదారముగా నుండును. కాని ఆదుకొనవలసి వచ్చినపుడు మాత్రము తప్పుకొనునట్టి మాటల పసనేగాని, చేతల పసలేదు అన్న అర్థము ఇందుగర్భితము.

## 28. నిదర్శన

సదృశమైన రెండు వాక్యములకు అభేదము నారోపించుట నిదర్శన. ఇందే సదసదర్థ బోధన రూప నిదర్శనాలంకార మున్నది. ఏదేని యొక కార్యమును జేయుచు, దానిని దృష్టాంతముగా బరపి ఆకార్యముచేతనే ఇతరులను గూర్చి కీడునుగాని, మేలునుగాని బోధించుట కూడదని దర్శనమే[7].

సత్ప్రభుడు-చంద్రుడు, మంచిరాజు భూవలయమును పాలించని సమయమున అన్నియును అనర్థములే యగును.

'సత్సంతతులకు దేజంబులు కడజారె
ద్విజకులంబుల రొదల్ దిశలుమీరె
రాగోదయంపు బరంపరల్ మితిమీరె
బంకజాప్తుని విజృంభణముజేరె
పగలు బుట్టుటకు దంభమ్ములు చేకూరె
గవలయంబాపద గుడువజారె
నాశ్రయించిన చకోరాళి యాశలుదీరె
దనయాప్త చంద్రకాంతములు డాగె

నరయపరచక్రముల భయమంత దీరె
వరుసతోడుత సన్మార్గవర్తియైన
మహితయశుడైన సర్వజ్ఞమౌళియైన
సత్ప్రభుడు భూమిగావని సమయముననుʼ (173-3)

ఇది చంద్రాస్తమాన వర్ణన. ఇందు ఉపమాన వాక్యార్థమునకు, ఉపమేయ వాక్యార్థమునకు శ్లేషమూలకముగా అభేదము చెప్పబడినది. ఇందు ఉపమేయము చంద్రుడు. ఉపమానము ప్రభువు. చంద్రుడు అస్తమించినను, ప్రభువు పదవీచ్యుతుడైనను జరుగు విషయములు దృష్టాంతముచేత నిరూపితములైనవి. చంద్రుడు అస్తమించిన సత్సంతతులకు - నక్షత్ర సముదాయమునకు తేజము తగ్గిపోవునను దృష్టాంతముచేత, సమర్థుడగు రాజు పదవీచ్యుతుడైన వెంటనే సజ్జనులకు (సత్సంతతులకు) గౌరవము తగ్గునని లోకులకు బోధపడునట్లు చెప్ప

బడినది. ఇట్లే ప్రతిపాదమున అర్థద్వయమున్నది. ద్విజకులంబుల రొదల్ దిశలుమీరె - పక్షుల కలకలా రావములు మెండైనవి. బ్రాహ్మణులు ఆవేదనలు పొందిరి; రాగోదయంపు పరంపరల్ మితిమీరె - అరుణకాంతులు వ్యాపించినవి, మాత్సర్యాది గుణములు విజృంభించినవి; పంకజాప్తుని విజృంభణముజేరె- సూర్యుడు విజృంభించినాడు, పాపాత్ములకు బలము చేకూరినది; పగలు బుట్టుటకు దంభములు చేకూరె - సూర్యకాంతి వ్యాపించుటకు అవకాశము కలిగినది, ద్వేషములు ప్రబలినవి; కువలయం బాపదగుడువబారె-కలువలు ముకుళించినవి, ప్రజలు కష్టాలపాలైరి; ఆశ్రయించిన చకోరాళి ఆశలుతీరె - చకోరములు స్రుక్కినవి, ఆశ్రితులు విఫలులైరి; తనయాప్త చంద్రకాంతములు డాగె- చంద్రకాంతమణుల ప్రకాశము తగ్గినది, పుత్రమిత్రాదులు బాధచెందిరి; పరచక్రముల భయముతీరె- చక్రవాకములు, శత్రు సైన్యములు సంతసించినవి అన్న విధముగా నరసింగ కవి 'సమర్థుడు లేని చోట కలుగు నుత్పాతములను' చక్కని నిదర్శనతో హృదయావర్జితమగునట్లు వర్ణించినాడు.

## 29. అప్రస్తుత ప్రశంస

ప్రస్తుతము దోచునట్లుగా నప్రస్తుతమును చెప్పిన అప్రస్తుత ప్రశంస.

భూసుతుని మరణానంతరము అతని కారాగారమున క్రమగ్గుచున్న రాజకన్యలను గాంచి కృష్ణుడు వారి చెరవిడిపించదలచి వారిని పరీక్షించుటకై 'మీ రింతకు ముందు ఎవ్వరినైన కామించితిరా?' అని యడుగగా వారు కృష్ణునకు మిక్కిలి ఉదాత్తముగా సమాధానమిచ్చిరి.

"నూతన మేఘోద కాతత చాతక
జాతముల్ చనునె దుర్జలములకును
వెన్నెల గుత్తిని వేడు చకోరికల్
చెలగి చండజ్యోతి జేర జనునె
మానసకాసార మహితమరాళముల్
తుంగమడ్గులను మేలంగ జనునె
పద్మమరందైక పాన భృంగంబులు
జిల్లేడు పూల కాశించబోనె

దేవ! త్వత్పాదసేవె మా జీవనంబు
గావునను మమ్ము రక్షించు కరుణతోడ
దేవకీపుత్ర! సుజన వందిత చరిత్ర!

భవ్యగుణజాల ! సంతతభక్తలోల' (374-2) 'నూతన పయోద జలమును కోరు చాతకములు మురికి గుంటల నీటిని ఆశించునా?. వెన్నెలను కోరు చకోరికలు బడబాగ్నిని ఆశించునా?, మానస సరోవరమున విహరించు హంసలు బురదగుంటల విహరించునా? పద్మమరంద పానాసక్తములైన తుమ్మెదలు జిల్లెడు పూలనుకోరునా?' అనుచు అప్రస్తుతములను ప్రస్తుతించుటలో 'ఇతర క్షుద్రులైన రాజమాత్రులను కోరక మేము పురుషోత్తముడవైన నీయందే లగ్న మానసలమైతిమని' మనోహరముగా రాజకన్యలు కృష్ణునకు విన్నవించిరి. క్షుద్ర విషయములందాసక్తులు కాని వారి ప్రసక్తి చెప్పదలచి దానికి బదులుగా చాతకాదులైన అప్రస్తుతముల ప్రసక్తి చెప్పబడినది.

## 30. విభావన

కారణము లేకుండగనే కార్యము గలిగినట్లు చెప్పుట విభావన. దీనియందు భేదములు పెక్కులు. విరుద్ధమైన దానిచే కార్యము కలిగినట్లు చెప్పినను విభావనమే అగును.

ఆహ్లాదమును కలిగించునట్టి పుష్పవృష్టి, వెన్నెల, కోకిలగానము, తుమ్మెదల ఝుంకారము, మందపవనములు వియోగమున నున్నవారికి బాధాకారకములగుట ప్రసిద్ధము.

'కాయజుడిక్షు కార్ముక ముఖంబున గ్రొవ్విరి తూపులేయ, రే
రాయడు వేడివెన్నెల పరంపరలున్ వెసగాయ, గోకిలల్
కోయని చౌలు చించరగగూయ, మదాళులు ఝుమ్మఝుమ్మనన్
మ్రోయగ, మందమారుతము మించుకవచ్చె నికెట్లు తాళగన్' (203-3)

చంద్రుడు వేడివెన్నెలను ప్రసరించడు. కోయిల కూతలు చెవులు చిల్లులుపడునట్లుగా ఉండవు. పూలు, తుమ్మెద ఝుంకారము, మలయమారుతములు బాధాకర

ములు కావు. కాని విరహమున నున్న రాజకన్యలకు ఇవన్నియు అతిమాత్రముగా బాధాకరములైనవని విభావింపబడినది.

ఈ రీతిగా నరసింగకవి పెక్కు అర్థాలంకారములను సందర్భశుద్ధితో తన గ్రంథమున గ్రథనమొనరించినాడు.

## శబ్దాలంకారములు

శబ్దమునకు ప్రాధాన్యమిచ్చునవి శబ్దాలంకారములు. ఔచిత్యమును అనుసరించిన శబ్దాలంకార ఘటనము పాఠకులకు ప్రీతి నాపాదించును.

వెల్లూరు నరసింగకవి శబ్దమునకు మంచి ప్రాధాన్యము నిచ్చినాడు. అనుప్రాస, యమక ఘటనమున ఈయన అందెవేసిన చేయి. పద్యమున ఒక్కచోటనైన అనుప్రాస, యమకాదుల స్పర్శలేకుండునట్లుగా నరసింగ కవి పద్య రచన చేయలేదన్న అతిశయోక్తి కాదు.

### 1. వృత్త్యనుప్రాసము

ఆవృత్త వర్ణ సంపూర్ణము వృత్త్యనుప్రాసము.

"వట్టెము పట్టణంబు గనుపట్టెను పట్టయి యద్ధి పట్టికిన్" (6-1) అని వట్టెము గ్రామమును వర్ణించుటలో 'టకారద్విత్వము' (ట్ట) పునరావృతమైనది.

నారదుడు కృష్ణునకు పారిజాత పుష్పమును ఇచ్చు సమయమున ముమ్మరమ్ముగా గమ్ముగమ్మనందన పరిమళమ్ము నలుగడలం గ్రుమ్మడించు సోమరి తెమ్మెరలం గ్రమ్మం దిమ్మరు కొదమ తుమ్మెదలం బొదలుచుం బున్నమ వెన్నెల రేని చిన్నెల జేరుచున్న పారిజాతంపు మిన్నా క్రొవ్విరిం దిన్నగా విన్నువాక నుత్పన్నంబగుచున్న నౌన్నంపు గొన్నన తామరపుటాకు మాటునం బ్రచ్ఛన్నంబు జేసి' (165-1) అని చెప్పుటలో మకార నకార ద్విత్వములు పునఃపునరావృతములు,

"మేళ్ళ ముంగిళ్ళ నెలరాజిగిళ్ళ మేళ్ళ
దళ్ళపాదిళ్ళ గున్నమావిళ్ళ చాళ్ళ" (174-1)

ఇటువంటి ప్రయోగములు ఈ కవి రచన యందు పెక్కులు.

## 2. ఛేకానుప్రాసము

స్వరవ్యంజన సందోహవ్యూహము ఛేకానుప్రాసము. స్వరూపముతోడను, క్రమముతోడను వ్యంజన సంఘమును ఒక్కసారి మాత్రమే అవృత్తి చేయుట ఛేకానుప్రాసమని నియమము.

బలరాముని వివాహమును గురించి తెలుపుచు కవి

'రైవతకాభిధానుడగు రాజిల రాజిల గాచుబుద్ధి పే
రైవతరించి నాడన నాత్మజ నాత్మజనుర్నియుక్తుడై
రైవతకాద్రి చెంగటిపురంబు కరంబుగ దేరియిచ్చెనా
రైవతకన్యకన్ రిపువిరాముడు రాముడు భార్యగా గొనెన్' (131-1)

అని చెప్పుటలో 'రాజిల రాజిల' నాత్మజ నాత్మజ, పురంబు గరంబు, రాముడు రాముడు అన్న వ్యంజన సంఘములు ఒక్కసారిమాత్రమే ఆవృతములైనవి.

చంద్రవర్ణనకు చెందిన 'సురలకువిందు, పొందు తొగజోటికి' (169-2) అన్న పద్యమునందలి ఛేకానుప్రాస విన్యాసము మనోహరము. చూ. వర్ణనా వైచిత్ర్యము.

## 3. యమకము

ఆవృత్త వర్ణస్తబకము యమకము. నరసింగకవికి యమకమన్న మిక్కిలి యిష్టము. దీనితో గూడిన పద్యములు ఈయన రచనమున పెక్కులు.

నారదుని మాటలు విని కృష్ణుడు నరకుని వధించుటకు నిశ్చయించినాడు.

'నారద నిభవర్ణుడు హరి
నారదమునిలపిత ఘోరనరకాఖ్య మహా
నారదవిభు జీవనదీ
నార దరాచరణ దృఢ మనస్కుండయ్యెన్' (214-1)

ఇందు 'నారద' శబ్దము పాదాదియందు పునరావృతమైనది. నారద-మేఘము, దేవముని, రాక్షసుడు (నారం-నరసముదాయము. ద- (దానిని) ధ్వంసము చేయువాడు - నరధ్వంసి - రాక్షసుడు) జీవనదీ, నార దరాచరణ- (నరకుని) జీవముఁ నెడు (ప్రాణములనెడు) నదీ జలములకు భయకారకముగా అనగా

గౌర్యు త్రవ్వి పాతుటకు (ధృఢమనస్కుడయ్యెను) అన్న భిన్నార్థములందు నారదశబ్దము ప్రయుక్తము.

## 4. ముక్త పదగ్రస్తము

ఒక వాక్యము చివరగాని, పాదము చివరగాని విడిచిన పదముతో తరువాతి వాక్యమునుగాని, పదమునుగాని ప్రారంభించుట ముక్త పదగ్రస్తము.

'సుర సత్రామద్వర భోగ భోగమణి భాచ్ఛుభ్రాహి శౌర్యాతిభా
సురకీర్తి ప్రవిభాగ! భాగనగరస్తోక ప్రతిజ్ఞాత్తభూ' (215-1)
'ఘనసంగ్రామ పరాక్రమ క్రమకళాగాంగేయ! గాంగేయ దృ
ష్ఘునసోపక్రమ విక్రమ స్మృతివిచారాధేయః రాధేయ కో' (210-3)

ఇవి ఆశ్వాసాంత పద్యములు.

రాత్రిపూట జరుగు విషయములను వివరించు నొక్కపెద్ద వచనమున 'అందు వెడవిల్కాడు...విటులును, విటజన...సతులును, సతులకును...శంబళీ సతులును, వసతులగు...కదంబములును, కదంబ...శిఖామణులును, మణిస్థగిత వధూవరులును, వయోవరుల...మలయానిలంబులును' (171-2) ఈ విధముగా సాగినది ఆవచనము.

ఈ విధముగా అలంకార బాహుళ్యముతో కూడినది నరసింగకవి రచనము స్థాలీపులాకన్యాయముగా కొన్ని ప్రసిద్ధములైన అలంకారములు మాత్రము ఇట ఉదాహరించి చూపుట జరిగినది. సూక్ష్మముగా పరిశీలించినచో ఆయా అలంకారములకు చెందిన భేదప్రవిభేదములు పెక్కులు ఈ కవి రచనమున ఉన్నట్లు తేటపడగలదు.



# 7. ఛందో వ్యాకరణ వైశిష్ట్యము

## ఛందో విశేషములు

ఆంధ్ర సంప్రదాయ కవితా సరస్వతికి యతిప్రాసలు మంగళసూత్ర ప్రాయములు. ఇవి తెలుగు వ్యాకరణమునకు ప్రాణ సదృశములు. శబ్ద స్వరూప నిర్ణయమునకు ఈ యతిప్రాసలే పరమ ప్రమాణోపకరణములు. తెలుగు వ్యాకరణము యతిప్రాసస్థాన ప్రయోగములనే ప్రామాణికములుగ గ్రహించినది. రేఫ, శకటరేఫ నిర్ణయమునకు, సార్ధబిందుక శబ్ద నిర్ధారణమునకును యతిప్రాసలే ప్రధానాధారములు. ఇట్టి యతిప్రాసల విషయమై వెల్లూరు నరసింగకవి తన 'రాచకన్యకా పరిణయమున పూర్వ సంప్రదాయములనే పెక్కింటిని అనుసరించి నను కొన్ని సందర్భములందు తన ఆనుకూల్యమును దృష్టిలో ఉంచుకొన్నాడు. అటనట ప్రమాదములును దొరలినవి.

## లఘ్వలఘు వైపరీత్యములు

సంయుక్తాక్షరములకు ముందున్న హ్రస్వములు గురువులగును. కాని సమాస గతముకాక వ్యస్తముగానుండి తేల్చి పలుకబడు సందర్భములందు సంయుక్తాక్షర పూర్వములు గురువులు కాకపోవుట ప్రసిద్ధము. సమస్త పదము లందు మాత్రము ఇట్టివి నిత్యముగ గురువులయి తీరును.

నరసింగకవి తన సౌకర్యమునుబట్టి గురు లఘు నిర్ణయము కావించు కొన్నాడు. కొన్నిచోట్ల రేఫ, వకార శ్లిష్టపూర్వాక్షరములు వ్యస్తములుగ నుండి తేల్చి పలుకబడునప్పుడును వానిని గురువులుగ ప్రయోగించినాడు. మరికొన్ని చోట్ల సమాసగతములైనను లఘువులుగనే వాడినాడు. ఒకే విధమైన భిన్న సందర్భములందు అవసరానుగుణముగ నిర్ణయించుకొన్నాడు.

1. వ్యస్తముగనుండి తేల్చిపలుకబడు రేఫశ్లిష్టపూర్వాక్షరము లఘువుగ నుండుట.

శా 'దీక్షంగైకొని సత్పురాణ కథలుద్దీపించు **గద్వాల శ్రీ**
దీక్షాచార్య' (1-1) ఇందు 'గద్వాల శ్రీ దీక్షాచార్య' అన్నచోట రేఫ సంశ్లేషమైన 'శ్రీ' కన్న ముందున్న 'గద్వాల' పదాంతమందలి 'ల' గురువు కాలేదు. అందువలన 'గద్వాల' తగణమైనది. 'గద్వాల' 'శ్రీ' అన్నవి వ్యస్తము లగుటవలన 'శ్రీ' తేల్చిబడుట కవకాశమున్నందున దాని పూర్వాక్షరము 'లఘువ'గుటలో విచిత్రమేమియును లేదు.

ఇట్టి సందర్భముననే మరియొకచోట వ్యస్తపదములందు రేఫశ్లిష్ట పూర్వాక్షరము గురువు అయినది.

శా. 'తా, **డూరు శ్రీ**ప్రథితాన్వ యాంబునిధి' (5-1) ఇచ్చట 'తా, డూరు శ్రీప్రతిథితా' అన్నచోట రేఫశ్లిష్టము, 'శ్రీ' కన్న ముందున్న 'రు' గురువు అయినది. అందువలననే '(తా), **డూరుశ్రీ**' అన్నది 'మ' గణమైనది. ఇక్కడి 'శ్రీ'ని ఒత్తి పలుకవలెనని కవి అభిప్రాయమై యుండనోపును.

2. సమస్త పదములందును రేఫ సంశ్లిష్టమునకు ముందున్న అక్షరములు 'లఘువులు'గా ప్రయోగింపబడినవి.

క. '**సాయకముల వంటి ముని ప్రసంగము**లెల్లన్' (94-2) ఇందలి 'ముని ప్రసంగములు' అనుసమాసమున రేఫ సంశ్లేషము 'ప్ర'కన్న ముందున్న 'ని' గురువు కాలేదు.

ఇట్టివే మరికొన్ని ప్రయోగములు.

గీ. '**నధిక ప్రభ**దూలి కడుజాలి నంశుమాలి' (155-2) ఇందలి 'అధిక ప్రభ' అన్న సమాసమున 'క' లఘువు అయినది.

గీ. 'నినద శుకపిక నినదాయ **నిజప్రతాప**' (208-3) ఇందలి 'నిజ ప్రతాప' అన్న సమాసమున 'జ' లఘువు అయినది.

ఇట్లే 'వకార' శ్లిష్టములకు ముందున్న అక్షరములు కూడా లఘువులే అయినవి.

క. 'శ్రీజయవల్లభరామ
క్ష్మాజాని ద్వితీయపత్ని జానాంబిక' (53-1) ఇందలి 'క్ష్మాజాని ద్వితీయ పత్ని' అన్న సమాసమున వకారశ్లిష్టము 'ద్వ'కి ముందున్న 'ని' లఘువు అయినది.

ఇట్టివానిని శిష్ట ప్రయోగములుగా కొందరు పండితులు అంగీకరించినారు. విశ్వనాథ సత్యనారాయణ గారి 'చిద్గగన ప్రాలేయాంశువు'[1]వంటి ప్రయోగములు ఇట్టివి.

## యతులు

### 1. ప్రత్యేక యతులు

అఖండయతి, ఉ - వు యతి, ఋ - రు యతి వంటివి కొన్ని ప్రత్యేక యతులు. ఇట్టి వానిని పూర్వ కవులలో పలువురు వాడి యున్నను వీనికి ప్రాచుర్యము తక్కువ. వీనిలో అఖండ యతిని అప్పకవి ఒప్పలేదు.[2] తక్కిన వానిని చెప్పలేదు. అప్పకవీయమునే ప్రామాణికముగా గ్రహించిన కొందరు పండితులు ఇట్టి ప్రయోగములను దుష్టములని భావించి, దిద్ది సవరించుట కూడ జరిగినది. ఇట్లు సవరించుట ఆయా కవుల అభిమతమునకు భంగము కలిగించుటయే కాగలదు.

నరసింగకవి రచనయందును ఇట్టి యతులున్నవి.

### అఖండయతి

1. శా. 'తా, **దూ**రుశ్రీప్రథితాన్వయాంబునిధిరా। **టూ**ర్ణేందు' (5-1)
2. సీ. '**న**రమేధ మఖమున **న**వనివెలసె.' (85-1)
3. గీ. '**ను**దుట బూబంతులడరించు। **నొ**క్కవేళ' (138-1)
4. శా. '**రా**జీవారణ కేళిచే జెలగెసౌ। **రా** రాజకన్యాక్షి' (193-1)
5. చ. '**న**ను దయజూడు కొమ్మవిడ। **నా**డకు మంచు' (85-2)
6. క. '**నా**స్తను తాంబూల చర్వ। **ణా**ది విధులచేన్' (213-2)
7. ఉ. 'గో, **త్రా**మర వృత్తినైన విపి। **ధం**బగు మంత్ర' (244-2)

## ఉ - వు యతి

1. క. 'తాముచ్చెరు, వునగను గొనుచుండ వారి।యొద్దకు' (364-2)

2. క. 'బంధన, మొనరింపుడు వానిబంధు।వులు మొరబెట్టన్ (154-4)

3. మ. 'యుపమాశాలియు బ్రహ్మసారథియు నీ। వున్మేరువిల్లంబులై' (191-4)

## ఋ-రు యతి

1. గీ. 'ఋషుల బ్రాహ్మల బిలిపించి । రూఢిగల్గు' (162-4)

## ఋ-ఉ యతి

1. క. 'గృకవాకము లరచె గొక్కొ । రోకోయనుచున్ (174-2)

2. క. భృంగాలక నీదు పొందు । పొలుపొందెజుమీ' (291/2)

## యతి భ్రంశములు

కొన్ని ప్రయోగములందు యతులు తప్పినవి. ఇట్టివి ప్రమాదమూలకములై యుండును. మహాకవులకును ప్రమాదములు దొరలుట కద్దు.

## అనుస్వార సంబంధ యతి తప్పుటు

1. చ. 'నాదుచిత్తముం, దెలియగ నీవె కోపము గ।డించితొ' (80-2)

2. క. 'బల్కెం, దిటమింతయు లేక నినుమ।డించిన జాతిన్ (108-2)

## భ్రమ ప్రమాదములు

1. గీ. 'మలిన వసనంబు తలకొంగు । నమరగట్టి' (51-2)

యతి స్థానమందలి 'అమర' శబ్దమున 'మ' (ఉత్తరాక్షరము) కు సరిపోయినదనుకొని యుండవచ్చును.

2. సీ. 'కుచములు నిర్జిత।లికుచముల్ ననవొప్పు' (129-3)

'కుచ', 'లికుచ' రెండుచోట్ల 'కుచ' శబ్దములు సరిపోయిన వని తలచి యుండవచ్చును.

3. సీ. 'ఘన తావకీన సం।దర్శన చంద్రోద' (137-3)

ఆదియందలి 'ఘన'కును 'దర్శన' పదమందలి 'ర్శన' తో ప్రాసయతి కుదిరియుండునని భావించి యుండవచ్చును. ఇవన్నియు ఉత్తరాక్షరములు.

4. గీ. 'భువిని సర్వఫలరసము।లు నుగ్రహించి' (149-3)

ఆద్యక్షరమైన 'భు'కున యతిస్థానమునందలి 'లు'కు పూర్వాక్షరమైన 'ము'తో సరిపోయినదని ప్రమాదపడియుండవచ్చును.

## భ్రష్ట యతులు

1. సీ. 'కాపాడుచున్న ద।యారసంబు' (253-4)
2. మ. 'అయుతానేకపజిత్స దృక్ష బలగర్వోద్యత్కటుల్' (117-1)
3. మ. 'చం, చలతన్ మీరు ఛలారి యాతడని యం చుంజేరు' (53-2)
4. శా. 'సత్రాజిత్తున కీర్ష్యనాయెడ జనించెన్ బోలు' (108-2)
5. క. 'కలరవములె వినగ బాపగుణ నిస్వనముల్' (203-2)
6. మ. 'త, త్ప్వరమున్గాసి యొనర్చుటల్ మురసురా రిన్ద్రుంచుటల్' (106-3)

## ప్రాసలు

నరసింగకవి లఘ్వలఘురేఫములకు, స్థ-స్తలకు, జ్ఞ-గ్నలకు ప్రాసవేసినాడు.

## ర-ఱ లకు ప్రాస

1. క. 'తరుణుల జంఘలతో శర
గరిమన్మళ్ళబడి కమలగర్భములనికిం
గొఱగాక తత్తృణీకృత
కరణములై వెన్నొసంగె గాదే తుదకున్' (209-1)

2. క. 'దురమెక్కడ నీవెక్కడ
నరుదేరగ వలదు నిలువుమని పలికిన నీ
మఱుగున నుండగ నాకీ
వెఱపేటికి నాదుమాట వినుమిటు కృష్ణా!' (204-2)

## స్థ - స్తలకు ప్రాస

క. "ఆస్తరణము గరుడంశిడ
సుస్తనియుం దాను చాల సొంపు దలిర్పన్
స్వస్థముగా గూర్చుండిరి
నాస్తను తాంబూల చర్వణాది విధులచేన్" (213-2)

## గ్న - జ్ఞలకు ప్రాస

క. "ఆగ్నేయ బాణమప్పుడు
ప్రజ్ఞను దలపోసి కృష్ణుపై నడరింపన్
విజ్ఞాని వహ్ని సిరివరు
నాజ్ఞా ధారకుడు గనుక నట నూర్కుండెన్" (335-2)

## ప్రాస భంగము

శా. "శ్రీమంతుల్ గుణవంతులుత్తమ బుధశ్రేణుల్ నుదారుల్మహా
**సమ్రాజ్ఞాజము లాదిగా** సదరు పేష్కారుల్ దొరల్ మెచ్చగా" (31-1)

ద్వితీయ చరణమున 'సమ్రాజ్ఞాజము' అని యున్నందున ప్రాసభంగమైనది. అర్థము కూడ కుదురదు. పద్యము మంచి నడకలో సాగినది కనుక ఇంత అర్థరహితమైన, లక్షణభంగము వచ్చుటకు అవకాశము లేదు. బహుశః ఇది లేఖక ప్రమాదమై యుండనోపును. ఈ భాగమును **"సామంతౌఘము లాదిగా"** అని సవరించుట జరిగినది.

## శబ్దాలంకార ప్రాసలు (షడ్విధ ప్రాసలు)

శబ్దాధికారము కలిగిన కవులు ఈ ప్రాసలలో పలువిధములైన విచిత్ర ములు కావించినారు. నరసింగ కవి కూడ శబ్ద ప్రియతతో పెక్కు ప్రాస చమత్కారములను చూపినాడు. ప్రాస నియమము లేని గీత పద్యములందును ఈయన ప్రాస చమత్కృతి కావించినాడు. అనంతామాత్యుని ఛందోదర్పణా ధారముగా లక్షణము స్వీకృతము.

1. సుకర ప్రాసము :- సామాన్యము.

2. అనుప్రాసము:- పద్యము నంతంతటను, ప్రాసస్థానము నను ఒకే అక్షరమును ప్రయోగించుట అనుప్రాసము.

గీ. 'వీట్ల సయ్యాట్ల బైపోట్ల నాట్ల పాట్ల
దేట్ల ముచ్చట్ల నచ్చట్ల నాట్ల బోట్ల' (118-1)

గీ. 'మేళ్ళముంగిళ్ళ నెలరాజిగిళ్ళ మేళ్ళ
దళ్ళపాదిళ్ళ గున్న మావిళ్ళ చాళ్ళ (174-1)

**3. దుష్కరప్రాసము:- కఠినమైన అక్షరములుగాని, సంయుక్తాక్షరములు గాని ప్రాసస్థానమందుండుట.**

క. 'వాగ్జాలము పనియేమీ
రుగ్జనకము పరులకది పరోక్షము కనగా
దిగ్జనపతుల కసాధ్యము
ప్రాగ్జోతిషపురము నెంత బలవంతులకున్' (189-2)

'ప్రాగ్జ్యోతిషము'ను కవి 'ప్రాగ్జోతిషముగా' ప్రయోగించినాడు. పెక్కు 'క్ష' కారప్రాస పద్యములున్నవి.

**4. అంత్యప్రాసము :- ప్రతి పాదాంతమున ఒకే అక్షరము పునరావృత మగుట.**

మాలిని. 'సదమల గుణసాంద్రా జన్వలీసంతతీంద్రా
సదవన కృతిరుంద్రా సత్యవాగ్రామచంద్రా
సదయనయవితంద్రా సత్కళాపూర్ణచంద్రా
హృదయలసదుపేంద్రా యిష్టభోగామరేంద్రా' (217-1)

## ద్విప్రాసము

క. 'ద్వారావతి నవతార
ద్వారా వర్తించు చక్రధరుడవు దివిష' (164-1)

## త్రిప్రాసము

ఉ. 'ఆమధురానివాసుడు దయామృతపూర్ణ కటాక్షవీక్షణా,
యామధురాధరుండగుచు నాత్మల సద్విషయంబు నిత్యప' (125-1)

## చతుష్ప్రాసము

ఉ. 'ఆవనజాత నేత్రుడసహాయ పరాక్రముడై నిశాటశి
క్షావన జాత జాత శితికంఠ సహస్రవిలోచనాది దే (128-1)

## ప్రతి రెండుపాదములకు పంచప్రాసలు

క. 'కలకలనగు చిగురాకుల
కలకలనగు రాజకన్యకల చరణంబుల్
తలతలయను నెలనెలతల
తలతయను సతులనఖర తతి కిరణంబుల్' (210-1)
ప్రతి రెండు పాదములు సమానముగ నుండుట.

గీ. 'సాధు బృందావన క్రీడ సల్పువాడు
సాధు బృందావన క్రీడ సల్పువాడు
సబలుడగువాడు గోపాల చక్రవర్తి
సబలుడగువాడు గోపాల చక్రవర్తి' (126-1)
అన్ని చరణములందును ఒకే అక్షరము ప్రాసయతిగల గీతములు.

ఇట్టివానిని 'సర్వతః ప్రాస గీతము'గ భావింపవచ్చును. 'సర్వతః ప్రాస సీసము 'దశవిధసీసములందున్నది. దాని లక్షణము ఈ గీతములకు సరిపోవును.

గీ. 'అంత వాడల్క మీరంగ బంతగించి
హొంతనుస్నట్టి యొకవిల్లు సంతరించి' (334-2)

గీ. 'వింటిరే కృష్ణుడౌనరించు కంటకంబు
తొంటివలె దొంగతనమున కంటినాడు' (69-4)
ఇట్టివి పెక్కులు.

## అర్థక్లేశ పద్యములు

సరసింగకవికి గల ఈ ప్రాసచమత్కార దృష్టివలన కొన్ని పద్యములకు అర్థాన్వయము కుదురుట కుందేటి కొమ్ము సాధించుట వంటి దగుచున్నది.

క. 'దక్షిణ నాయక సహజా
దక్షిణ తందనరు శౌరి తనుజనులెల్లన్' (142-1)

శా. 'రాజీవాళిదరంబుబన్ బ్రబలి సారశ్రీపగల్మీరదా
రాజీవాళి సహాయతన్మెలగి పోరంగేరి తద్వాసనా' (193-1)

క. 'అనితరతమ భావోక్తుల
ననితర సామ్య ప్రభాంగనాళికి దోడ్తో' (180-1)

## విశేష పద్యములు

దశవిధ సీసములందలి కొన్ని భేదములు నరసింగకవి రచనలో కనబడుచున్నవి. వానిలో 'సమసీసములు' మొదటిది. ఇది సామాన్యమైనది. విశేషమైన లక్షణములేవియు దీనికి లేవు.

## అవకలి ప్రాససీసము

అన్ని చోట్లను ప్రాసయతినియమము కలది.

'**మందార**మాలా మ। **రంద** తుందిల సురేం
**దిందిర** ఝుంకృతుల్। **గ్రందు**కొనగ

**మకు**టాదిభూషణ। నికరమణీ విభా
**చక**చకల్ రవిమరీ। **చిక**ల గప్ప
**త్రీణి** తింశత్కోటి। **గాణిత** ప్రబలగీ
**ర్వాణ**యోధావర। **శ్రేణి** గొల్వ
**కేళి**విజిత పర్వ। **తాళి** నిపాత దం
**భోళి** విస్తృత బాహు **పాళి**మెరయ
**సిత**కరీంద్రము నెక్కి స। **న్నుత**వి భూతి
**ద్వార**వతి జనుల్ చూడ। **దుర్వార** భక్తి
**వేయి** కన్నుల నానంద। **తోయ**మంద
నింద్రు**డే**తెంచె నలయాద। **వేంద్రు** గనగ' (132-2)

## అక్కిలి వడి సీసము

అన్ని చోట్లను వడినియమమే కలది.

'సత్సంతతులకు దే। జంబులు కడజారె
ద్విజకులంబులరొదల్। దిశలుమీరె
రాగోదయంపు ప। రంపరల్ మితిమీరె
ఖంకజాప్తుని విజృం। భణము జేరె
పగలు బుట్టుటకు దం। భమ్ములుచేకూరె
కువలయం బాపద కుడువబారె
నాశ్రయించిన చకో।రాళి యాశలుదీరె
దనయాప్తచంద్రకాం। తములుడాగె
నరయపరచక్రముల భయ। **మం**తదీరె
వరుసతోడుత సన్మార్గ। వర్తియైన
మహితయశుడైన సర్వజ్ఞ। మౌళియైన
సత్ప్రభుడు భూమిగావని। సమయమునను' (173-3)

## వృత్త ప్రాస సీసము

పెద్ద పాదములు నాల్గింట మాత్రమే వృత్తములకున్నట్లు ప్రాస ముండవలెను.

'ఒకవెట సంకేత మొకకాంతచేరివే
రొకడౌట గనకమచ్చిక బెనంగు
నొకనాతి ప్రీతివేరొకని యొద్దికిబోవ
గికురించి యొకడు సందుగొనికవము
మకరాంక కేళి భర్తకు చొక్కు బుట్టించి
వొకలేమ తగుపల్లవికులబొందవు
నొకని పిల్వగబంచి యొకచోటనుంచి వే
రొకనితో న్నొకతె యొద్దిక చరించు' (166-2)

## సర్వతః ప్రాససీసము

అన్ని చరణములలోను ఒకే అక్షరము ప్రాసయతులు గలది. అనగా ఇరువది నాలుగుచోట్ల (24) ఒకటే ప్రాసాక్షరముండుట.

'**ఇది** గదా ముదివార। **సుద**తుల కెలప్రాయ
**మొద**వించు మదనుని। **మృదు** చికిత్స
**యిది** సుమీ సదనాళి। **బొద**లు సంపదగొన
**మెదలు** ప్రల్లదులకు। **మొద**టిచుట్ట
**మిది** సుమీ యరవడి। **వద**నముల్ గలవాని
**బెదిరింపజాలు బె। **ట్టిద**పు విసము
**నిది**యెనాలేబద। **నది** కించి కన్నుల
**గది**యింప నదనైన। **కజ్జ**లంబు
**నిది**మెకా ముదమెదనించి। **ముద**వతులకు
**గొద**మవిటులకు సదయత। **ఎదు**గజేయు
**నిది**యెనుపకార పదమంచు। **మది** దలంచి' (62-1)

పెద్దపాదములలో నాలుగవదాని యుత్తరార్థమునను, గీతము చతుర్థ చరణమునను ప్రాసయతి లేదు.

## సమప్రాస సీసము

నాలుగు పెద్ద పాదములందును, గీతిలో బేసిపాదములందును ప్రాసాక్షరమొకటే ఉండవలెను. అనగా ఆరుచోట్ల ఒకటే ప్రాసాక్షరము.

'చండదోర్దండ ప్రచండ బలంబున
దుండంబువడిబట్టి పిండి పిండి
కొండ మాడ్కి చరించు దండి వేదండంబు
గుండెలు పగులగా గూలదన్ని
వెండి దూలంబు లననుండు దంతంబులు
బెండుల చాడ్పున పీకివైచి
ఖండనంబునకు నుద్దండత జనుదెంచు
దుండిపాలకులను రెండివైచి
దండ ధరులను బోలి యుద్దండ బాహు
దండముల దంతయుగళంబు దార్కొనంగ' (147-4)

గీతమునందు బేసిపాదములకు బదులుగా ఒకటి, రెండు పాదములందు ప్రాస పాటింపబడినది.

## అక్కలి ప్రాససీసము

పెద్దపాదములందు గల ఎనిమిది (8) ఖండములందును, గీతి నాలుగు పాదములందును ఒకే ప్రాసాక్షరముండవలయును. అనగా పన్నెండు (12) చోట్ల ఒకే ప్రాసాక్షరము.

'శంబరవైరిని జాంబికా జననంబు
నంబుచరాశ్రితాలంబనంబు
నంబుద పాంథ మహాంబుదాన గృహంబు
నంబు జాతాక్ష శయ్యాతలంబు
శంబాయుధోత్సవా డంబరకరణంబు
నంబరచర నిరతాన్నదంబు
నంబికావర శరాధార తూణీరంబు
నంబు తరంగ విడంబనంబు

కంబు నమృతంబు వరకౌస్తుభంబు జృంభ
ణంబు చేనొప్పు నింద్రహయంబు లాది
కంబు లిందుల తగనుద్భవంబు నొందె
నంబు జానన లీ సముద్రంబు గనుడి' (383-2)

## సంస్కృత సీసము

'జయ విదర్భావనీశ్వర కన్యకాలోల!
సరస సాత్రాజితీ సురతలీల!
జాంబవతీముఖ షట్సతీ పాంచాల!
సంక్రందనోపల శకలనీల:
మణికుండల ప్రభా మండిత సుకపోల!
భక్తలోకైక కృపావిశాల!
సకలవేదాంతార్థ సన్నుత గుణజాల!
కాంతి విభాసిత కనకచేల!
మునిహృదయఖేల! దనుజదుర్జన విఫాల!
కాంతియుతఫాల! వరసామగానలోల!
మధుర వాగ్జాల! నిర్జితమధురపాల!
భవ్యతరశీల! నందగోపాల బాల!' (136-2)

అంత్యప్రాస పద్యమునకు సొగసు గూర్చినది.

## ఆచ్ఛికశబ్ద బాహుళ్యముగల పద్యములు

'జిలుగు బంగరు రంగు చీరల తగుకట్ల
వెలలేని సొమ్ముల కలిమినీట్ల' (118-1)
'ఇచ్చను బూబంతులే గొనవచ్చితి
ముట్టిచూడగనిమ్ము మోహనాంగి' (119-1)
'కన్నులకింపు సొంపు దొలుకం గనుపించుచు నిట్టులున్నన,
క్కన్నుల కల్కితో నపుడు కయ్యపుదిండి తపస్వివల్కెన (171-1)

## పంచ పాది వృత్తములు

నరసింగకవికి పంచపాది వృత్తములు వ్రాయుట అలవాటు. ఈ గ్రంథమున అట్టివి నాలుగు ఉన్నవి. వానిలో రెండు మత్తేభములు (121-2, 392-2), ఒక మత్తకోకిల (88-4), ఒక ఉత్పలమాల (230-4) లు ఉన్నవి. ఒక సీస పద్యమునకు (33-4) ఆరుపాదములుగల గీతమాలిక కూర్చబడినది.

## వ్యాకరణ విశేషములు

నరసింగకవి సంప్రదాయవాదియై, పూర్వకవుల ఒరవడిలో కవితా వ్యవసాయము సాగించిన వాడైనను ప్రజలకు సన్నిహితమైన వ్యవహార భాషా పదములు బహుళముగా వాడుట ఈయన ఆధునికతకు ప్రబల నిదర్శనము.

ఇట్టి ప్రయోగములు దక్షిణాంధ్ర సాహిత్యమున కొల్లలు. అప్పటికవులు భాషావిషయమున వ్యాకరణ సంప్రదాయముల నుల్లంఘించుటచే ఆ కాలమునకు 'అంధయుగము' అన్న అపవాదముకూడ వచ్చినది. అయినను ఈ విధమైన నియమాతిక్రమణము ఇంకను ముందుగనే అనగా పాల్కురికి సోమనాథుడు, గౌరన మొదలగు కవుల ప్రయోగములందే పొడసూపినవి. ఇట్టివి అభారత ప్రయోగములనియు, తప్పులనియు కొందరు పండితులు అధిక్షేపించి, అట్టి వానిని మార్చి నవరించుట కూడా జరిగినది. ఈ పద్ధతివలన కవి కవితా హృదయము భంగపడగలదు. కాలానుగుణముగా భాషలో వచ్చు మార్పులను గమనించి, వ్యవహారమునకు సమీపముగా నుండునట్లు రచించినచో పఠితల కానందము కలుగునని భావించి కొందరు కవులు బుద్ధిపూర్వకముగనే అట్టి ప్రయోగములు చేసియుండవచ్చును. ఇట్టి వానిని సహృదయముతో స్వీకరించుట యుక్తము.

వెల్లూరు నరసింగకవి తన కావ్యమున కొన్ని విచిత్ర ప్రయోగములు కావించినాడు. కొన్ని లక్షణ వ్యతిరిక్తములు కాకున్నను శ్రవణ సుభగములు కానందున పూర్వకవులు వానిని విరళముగ వాడలేదు. అట్టి వానిని ఈయన యథేచ్ఛగ వాడినాడు. కొన్నిచోట్ల కేవలము తెలుగుపదములకే వర్తించు వ్యాకరణ కార్యములను సంస్కృత పదములకును వర్తింప జేసినాడు. మరి కొన్నిచోట్ల లక్షణకారులు నిషేధించిన ప్రయోగములనుకూడ చేసినాడు.

## అత్వసంధి

అన్యార్థస్ఫోరకత్వము, అర్థస్పష్టత లేకపోవుటలు కారణమైనచో సంధి చేయకూడదు. కాని ఇట్టివి అటనట నరసింగకవి రచనయందు కనబడుచున్నవి.

మెట్ట + అను = మెట్టను. (155-2)

## తత్సమ సంధి

చిన్నయసూరి దీనిని వ్యతిరేకించినను, అథర్వణాచార్యునికి సమ్మతమే. నరసింగకవి అత్వములకే గాక, ఇత్వములకును సంధికావించినాడు.

స్రష్ట + అగు = స్రష్టగు(150-4)
చక్రవర్తి + అగు = చక్రవర్తగు (85-1)
రూఢి + ఐన = రూఢైన (263-2)
వనధి + ఎట్లు = వనధెట్లు (60-3)
సంగతి + ఏర్పడిన = సంగతేర్పడిన (29-4)

## స్త్రీవాచక సంధి

సవతి + ఎవ్వతి + ఐన = సవతెవ్వతైన (35-2)

## క్త్వార్థకేకార సంధి

స్రుక్కి + ఇద్ధర = స్రుక్కిద్ధర (286-2)
గారవించి + అభయదానంబిచ్చి = గారవించభయదానంబిచ్చి (351-2)
కేలించి + ఇప్పుడు = కేలించిప్పుడు (361-2)
వెడలి + అటవీవనము = వెడలటవీవనము (37-3)

## విచిత్ర సంధులు

అంహస్ + ఆత్ములు = 'అంహోత్ములు' అనికావాలసియుండగా నరసింగ కవి 'అంహాత్ములు'గా ప్రయోగించినాడు. (422-2) 'మనోభీష్టము' వంటిదిది. ఇది యతిప్రాసల స్థానమున లేదు. కనుక లేఖక ప్రమాదమై యుండనోపును.

ద్రుతప్రకృతికముపై యడాగమము:- 'నే యూరకుంటిని' (263-4). ఇది ప్రాసస్థానమున ఉన్నది.

## వ్యాకరణ కార్యములు

నగాగమ విరహిత ప్రయోగములు:- ఇట్టివి చిన్నయసూరికి సమ్మతములు కావుగాని, ప్రౌఢ వ్యాకరణకారుని మతమున సాధువులే.

యదుకుంజరుకున్ (108-2), దేవేంద్రుకైన (184-3), చెట్టుకు (8-4), మనసుకు (201-4).

నుగాగమ విరహితములు:- మనసు + అందు = మనసందు (101-2)

నుడినడుమ లోపము:- నరసింగకవి ఆచ్చిక పద మధ్య మందలి న,ల, డ,ర,ట ల అత్వ, ఇత్వ, ఉత్వములను లోపింపజేసి ప్రయోగించుట యందు అభిలాషమెండు. ఇట్టివి అసాధువులు కాకపోయినను కొన్నిచోట్ల శ్రుతివిహితముగ లేవు.

'తెల్యదు' — తెలియదు (133-3)
'చిర్తపులి' — చిరుతపులి (37-3)
'చిత్ర్వు' — చిత్తరువు (32-1)
'చెర్వు' — చెరువు (32-1)
'తర్చంగ' — తరుచగ (154-1)

సంస్కృత పదములందును ఈ విధానమును అనుసరించి నరసింగకవి నుడినడుమ లోపములతో ప్రయోగించినాడు.

'పర్షతనము' — పరుషతనము (224/4)
'తర్వు' — తరువు (52-3)

విడి పదములకు సంధిచేసి, దాని మధ్యమందలి అచ్చులనుకూడ కొన్ని చోట్ల లోపింప జేసినాడు.

వారిని + అనుట = 'వార్ననుట' (92-2)

ఊరకె + ఉండిన = 'ఊర్కుండిన' (230-2)

సమాస మధ్యమందలి అచ్చులనుకూడ లోపింపజేసినాడు.

'తొల్నోము' = తొలి + నోము (45-2)

కవి కొన్నిచోట్ల సంస్కృత పద మధ్యమందలి సంశ్లేషమును విడదీసి స్వరాగమ యుక్తముగ ప్రయోగించినాడు.

'శిరుషము' - శీర్షము (276-4)

'హరిషించి' - హర్షించి (156-2)

ఆంధ్రదేశమున మంత్ర పుష్పపఠనమందు (నారాయణసూక్తము) 'ఓం సహస్ర **శిరుషం** దేవం' అనియు, పురుషసూక్త పఠనమందు 'సహస్ర **శిరుషా** పురుషః', దేవీసూక్త పఠనమందు 'సనః **పరుష**దతి దుర్గాణి' అని ఉచ్చరింప బడుట ప్రసిద్ధము. అందువలన వీనిని ఛాందస ప్రయోగములుగా భావింప వచ్చును.

## వక్రతమాదేశము

అచ్చికములందు అయి, అవులకు వక్రతమాదేశమున్నది. కాని నరసింగ కవి హ్రస్వవక్రములకును వక్రతమాదేశము కావించినాడు.

'చౌడు' - చెవుడు (యతిస్థానము) (36-3)

చౌలు - చెవులు (203-3)

ఒకచోట విచిత్రముగా సంస్కృత సిద్ధవక్రతమమును (ఐని) విడగొట్టి 'అయి'గా ప్రయోగించినాడు.

'శయిలాగ్రము' - శైలాగ్రము. (58-3) (వృత్తపద్యమందలిది)

## బిందుపూర్వక బువర్ణాదేశము

ఇత్వయుక్తమైన మాముడికి బిందుపూర్వక 'బు'వర్ణాదేశముతో కవి ప్రయోగించినాడు.

'దొంబిగ' - దొమ్మిగ (112-4) (ప్రాసస్థానము). 'దొమ్మర-దొంబర' అన్న ప్రయోగములు వ్యవహారమున ఉన్నవి.

## వ్యవహార ప్రయోగములు

నరసింగకవి పెక్కువ్యవహార ప్రయోగములు చేసినాడు. 'ఉచితమేకాదు గదా' (167-1), 'కోపంబు చేసునా' (30-2), మేలుచేసునే (39-2), మాటు చేసుకన్ (65-2), తీసుకంజని (271-2), తెల్సున్ (275-2), దుంకి (339-2), ధరియించే (130-3), తోడక్కరమ్మని (130-4). ఇట్టివి పెక్కులు.

ఈ విధముగా నరసింగకవి రచనయందు అటనట కొన్ని ఛందోవ్యాకరణ స్ఖాలిత్యములు కనబడుచున్నను 'ఏకోహిదోషోగుణ సన్నిపాతే నిమజ్జతిందోః కిరణేష్వివాంకః' అన్నట్లుగా తక్కిన కావ్యగుణములందు అవి గణనకురావు.



# 8. రసమాధురి

శబ్దార్థ స్వరూపిణి అయిన కావ్యమునకు ఆత్మ ఏది అను విషయమున భిన్నాభిప్రాయములున్నను భరతముని రసమున కిచ్చిన ప్రాధాన్యమును బట్టి అభినవగుప్తుడు 'రసమేకావ్యాత్మ, రసధ్వనికంటే కావ్యోత్కర్షకు హేతువైన అంశము మరియొకటి లేదు' అని సిద్ధాంతీకరించినాడు.

విభావానుభవ వ్యభిచారి సంయోగమువలన రసము నిష్పన్నమగునని భరతముని చెప్పినాడు. విభావములు, అనుభావములు, సాత్త్విక భావములు, వ్యభిచారి భావములు అను సామగ్రిచే సముల్లసితమైన రత్యాది స్థాయి భావము రసమని చెప్పబడుచున్నది. సజాతీయ, విజాతీయ భావములచే భంగపడక రస స్ఫూర్తి పర్యంతము సహృదయ హృదయముల నిలుచునది స్థాయి భావము. నరులకు రాజు, శిష్యులకు గురువువలె సర్వభావములందు స్థాయి భావము గొప్పది. రసమును ఉద్దీపింపజేయునవి ఉద్దీపనవిభావములు. భావ సంసూచనాత్మకములైన వికారములు అనుభావములు. సత్త్వజములగు కొన్ని అనుభావములే సాత్త్విక భావములు అగుచున్నవి. రసవ్యక్తికి సహాయభూతములగునవి వ్యభిచారి భావములు. వ్యంజనౌషధి సంయోగమున అన్నము స్వాదుత్వమును పొందు నట్లుగా, యుక్తమైన విభావాదులవలన అతిశయించి ప్రకాశించునట్టి రతి, హాస, శోక, క్రోధ, ఉత్సాహ, భయ, జుగుప్స, విస్మయ, శమములను స్థాయి భావములు వరుసగ శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత, శాంతము లనెడు రసములగును. కావ్యములందలి ఇట్టి రసము వాచ్యముగా నుండక వ్యంగ్యముగా నుండవలయునని ప్రాచీనుల సిద్ధాంతము.

"నానా రసములు నిబంధింపవలసిన ప్రబంధములందు ఒక్క రసమును అంగిరసముగా, తక్కిన వానిని దానికి అంగములుగా చేసి చెప్పుట ప్రబంధోత్కర్షకు హేతువగునని ఆనందవర్ధనుని అభిమతము.

సాధారణముగా ఆంధ్ర ప్రబంధములు శృంగార రసాత్మకములై యున్నవి శంకరకవి 'హరిశ్చంద్రోపాఖ్యానము', కంకంటి పాపరాజు ఉత్తర రామాయణము' మొదలైన కొన్ని ప్రబంధములు కరుణసప్రాధాన్యమును కలిగి యున్నవి. అధునిక కాలమున వెలసిన మేడేపల్లి వేంకటరమణా చార్యులు గారి 'దేవవ్రతచరిత్రము', సెట్టి నరసింహముగారి 'ప్రభాసశాపమోచనము' (భీష్ముని చరిత్రము) వంటి గ్రంథములు వీరరస ప్రధానములుగ నున్నవి. వీనియందు శృంగారము అంగరసముగ నున్నది.

ప్రాచీనాంధ్ర సాహిత్యము నందలి రామాయణ, భారత, భాగవతముల ముల తర్వాత హరవిలాసాది కావ్యములును, విష్ణు, మార్కండేయ, కాశీఖండ, భీమేశ్వరాది పురాణములును భక్తి ప్రబోధాత్మకములే. కాని భక్తి రసమునకు ప్రాధాన్యమిచ్చిన ప్రబంధములు మాత్రము విరళము. రాయల యుగమున వెలసిన 'శ్రీకాళహస్తి మాహాత్మ్యము', 'పాండురంగ మాహాత్మ్యము'లు భక్తి ప్రబోధాత్మక ప్రబంధములే అయినను అవి క్షేత్ర మాహాత్మ్యముల కోవలో చేరును. కృష్ణరాయల 'ఆముక్త మాల్యద' మాత్రము భక్తితత్త్వమును ప్రతిష్ఠించుటలో అగ్రగణ్యమైన ప్రబంధము. విశిష్టాద్వైత మతమును ప్రతిపాదించునట్టి ఆముక్తమాల్యదయందు విష్ణుచిత్తుడు, యామునాచార్యుడు మాలదాసరి మొదలగు భక్తుల కథలను కృష్ణరాయలు చెప్పినాడు. గోదాదేవి భక్తి పూరిత శృంగార నాయిక. ఈమెకు శ్రీరంగేశ్వరునిపై గల ప్రేమ మాధుర్య రూప పరిణతి చెందినది.

ఈ రీతిగనే వెల్లూరు నరసింగకవి తన 'రాచకన్యకాపరిణయము'ను భక్తిరస ప్రధానముగా రచించినాడు.

కవులు తమ గ్రంథావతారికలందు రసవిషయమై ప్రస్తావించుట పరిపాటి. తాము పోషింపదలచిన ప్రధాన రసమును కొందరు స్పష్టముగ చెప్పుదురు. మరికొందరు రసనామమును పేర్కొనక రస ప్రసక్తి మాత్రమే చేయుదురు.

వెల్లూరు నరసింగకవి తన 'రాచకన్యకాపరిణయ' ప్రబంధమందలి రసపోషణవిషయమై ఆరంభమునుండియు ఒక ప్రత్యేకమైన, స్పష్టమైన మార్గ

మును అవలంబించినాడు. తన గ్రంథము నందలి ప్రధాన రస నామమును స్పష్టాస్పష్టమైన రీతిలో పేర్కొన్నాడు. ఇది 'పరిణయము' ప్రధానాంశముగ నున్న గ్రంథమైనను, ఇందు 'శృంగారము' అంగభూతమే అయినది.

నరసింగకవి గ్రంథావతారికయందు 'ఇష్టదేవతా వంధనంబును,....... కుకవి జనతావలేపనివర్తనంబు గావించి సమస్త సుమనో మోదనానల్పామృత కల్ప కల్పతరు ప్రసూన వితాన పరిచ్యవమానానూన మకరంద బిందు బృంద నిష్యందనామంద మండిత పాండిత్య హిండిత **సరస రస సమన్వితాతి** చమత్కృతియును, సహృదయ నివేదిత నివృత్తియును, భక్తజన కలుష నిరాకృతియునగు శ్రీకృష్ణలీలా విశేషంబు రచియింపంబూని యేతత్కావ్య కన్యకా రత్నంబున కధీశ్వరుండెవ్వండో యని విచారించు సమయంబున' (4-1) అను వచనమునందు సరస రస సమన్వితాతి చమత్కృతి' (సరస రసముతోకూడిన అతి చమత్కారము కలది) అని తన గ్రంథమందలి రసవిషయమై ప్రస్తావించి నాడు. దీనికి 'సహృదయ నివేదిత నివృత్తి, భక్తజన కలుష నిరాకృతి' అన్న మరి రెండు విశేషణములను జోడించి, వీనితో గూడిన 'శ్రీకృష్ణలీలా విశేషము' తన గ్రంథమని పేర్కొన్నాడు.

పై వచనమందలి 'సరసరసము' అనగా ఏమో విచారించినచో ఇందలి ప్రధానరసము బోధపడగలదు. 'సరసము' అన్న పదమునకు వ్యస్తముగను, సమస్తముగను అర్థము చెప్పుకొనవచ్చును.

'రస' శబ్దమునకు 'శృంగారము' అని అర్థముండుటవలన 'సరసము' అని విడదీసినప్పుడు 'శృంగార సహితము' అని అర్థము వచ్చును. అప్పుడు 'శృంగారమే ప్రధాన రసము కదా' అన్న అభిప్రాయము కలిగి, ఈ చర్చ ఎందుకు? అన్న ప్రశ్న ఉదయించును. కాని కవి మరియొక 'రస' పదమును 'సరస' పదమునకు జోడించినాడు. అట్టిచో శృంగార సహితమైనది మరియొకటి ఉండవలెను - అట్టి రసముతోకూడినది అని అర్థము చెప్పవచ్చును. శృంగార సహితము 'భక్తి రసమనియు', అట్టి భక్తిరసముతోకూడినది ఈ గ్రంథమనియు ఫలితార్థము.

'సరసము' అన్నదానికి 'ప్రేమతోకూడినది' అని కూడ అర్థమువచ్చును. ప్రేమతోకూడినది ఏది అన్న ప్రశ్నకు భక్తి అని సమాధానము.[2] అప్పుడు 'సరసరసము' అనగా భక్తిరసమని యర్థము.

'సరసము' అన్న పదమునకు మధురము, లలితము, సున్నితము అన్న పదములు పర్యాయములుగా వ్యవహరింపబడుచున్నవి. కళల విషయమున మధురకళలు, సరసకళలు, లలితకళలు సమానార్థకములగుట ప్రసిద్ధము. అప్పుడు 'సరసరసము'నకు 'మధుర రసము' అని అర్థము చెప్పవచ్చును. అనగా 'మధురభక్తి' అని సారాంశము. అట్టి 'మధురభక్తి' ఇందలి ప్రధాన రసమని నరసింగకవి అభిప్రాయము. ఈ విషయమునకు ప్రోద్బలకముగనే 'సహృదయనివేదిత నివృత్తి' (సహృదయునిచేత తెలిసికొనబడిన మోక్షము కలది), 'భక్తజన కలుష నిరాకృతి' (భక్తుల పాపములను పోగొట్టునది) అన్న విశేషములను కవి జతపరచినాడు. ఈ విధముగా 'మధురభక్తి' ప్రధానమైన 'శ్రీకృష్ణలీలావిశేషము' 'రాచకన్యకా పరిణయ'మని నరసింగకవి సూచించినాడు.

నరసింగకవి స్వయముగా విష్ణుభక్తుడు. ఈయనకు కొల్లాపుర సమీపమందలి సింగపట్టణము నరసింహస్వామి ఇష్టదైవము. అందువలననే ఈయన 'శ్రీనిధి సింగపట్టణ నృసింహు కృపారస వీక్షణమున పెంపూనిన' (11-1) వాడు. సంప్రదాయుడైన పంచవక్త్రహనుమంతుని ఉపాసకుడు. ఆ దేవుని కరుణవలననే సుస్థిరకావ్యాచరణుడైనాడు (8-1). వంశపారంపర్యముగా 'నరహరి పాదభక్తహితుడైనవాడు' (9-1). ఈయన రచించిన గ్రంథత్రయమందు విష్ణు పారమ్యమే ఉన్నది. భక్తిరసమును స్వీకరించుటకు కవికిగల సంస్కారమిది.

ప్రాచీనాంధ్ర సాహిత్యములో పోతనామాత్యుని భాగవతము భక్తిరసమునకు విజయపతాక. నరసింగకవి తన గ్రంథమందలి భక్తికి ప్రాధాన్యము సిద్ధించవలెనని రాచకన్యకాపరిణయకథను, భాగవతానుబంధిగా, పరీక్షిన్మహారాజునకు శుకయోగీంద్రుడు వినిపించినట్లుగా చెప్పినాడు. కావ్యనాయికలైన పదునారువేలమంది రాజకన్యల మధురభక్తికి జతగా నారదుడు, ఇంద్రుడు,

గరుడుడు, నరకుడు, భూదేవి, అదితి మొదలగు భక్తిపూర్ణమైన స్తుతులను ఈ గ్రంథమున చక్కగా జోడించినాడు. ఈ విధముగా భక్తిమయమైన కావ్యమున శృంగార, హాస్య, వీర, అద్భుతములను కవి భక్తికి అంగములుగా చెప్పినాడు.

## భక్తి : రస విచారము

భక్తి భావమా? రసమా? అన్న విషయమున ఆలంకారికులలో భిన్నాభిప్రాయము లున్నవి. భారతీయాలంకారికులందు ప్రథమగణ్యుడైన, భరతముని భక్తిరసమును చెప్పలేదు. 'దేవాదివిషయకమైన రతి 'భావమే[3]' కనుక భక్తి భావమని ప్రాచీనులు వ్యవహరించిరి'.[4] కాంతా విషయకమగు రతి మాత్రమే (శృంగార) రసముగా పరిణమించును. దేవ, గురు, పుత్రాదికమైన రతికి, భావత్వమును మాత్రమే వారు అంగీకరించినారు. ఇది రసత్వమును పొందదని వారి తాత్పర్యము.

భక్తి రసముకాదను సిద్ధాంతమును ప్రతిపాదించినవాడు 'దశరూపక' కారుడైన ధనంజయుడు. 'ప్రీతి, భక్తి మొదలైన భావములు హర్షోత్సాహాదులందే అంతర్భవించునని, వానిని ప్రత్యేకముగా చెప్పనవసరము లేదని[5] అతని అభిమతము.

అభినవగుప్తుడు భక్తిని శాంతరసమునందు అంతర్భవింపజేసినాడు[6].

మమ్మటభట్టు భక్తి రసముకాదనియు, భావమే అనియు తెలిపినాడు. 'దేవ, ముని, గురు, నృప, పుత్రాది విషయకమైన రతిభావమే కాంతాది విషయకముగా వ్యక్తమైన రతియే శృంగార రసము[7]' అని అతని వాదము.

'కావ్యానుశాసన' కారుడైన హేమచంద్రుడు 'స్నేహ, భక్తి, వాత్సల్యములు రతి విశేషములే. సమానులందలి రతి స్నేహము. అనుత్తమునికి ఉత్తముని యందలి రతి ప్రసక్తి. దీనినే భక్తి అందురు. ఉత్తమునికి అనుత్తముని యందలి రతి వాత్సల్యము. వీనియందు భావమే ఆస్వాదింపదగినది'[8] అన్నాడు.

'సంగీత రత్నాకర' కారుడైన శృంగదేవుడు 'భక్తి స్నేహాదులు వ్యభిచారి భావములు,[9] అన్నాడు.

'రసగంగాధర' కారుడైన జగన్నాథుడు విచిత్రమైన రీతిలో మొట్టమొదట భక్తికి విభావానుభావ వ్యభిచారి సామగ్రిని నిర్దేశించి రసత్వమును ప్రతిపాదింప ననుకూలమగు వాదమును లేవనెత్తి తుట్టతుదకు జారవిడిచినాడు. అతని వాద మిది 'కామినీ విషయకమగు రతి రసమగుచుండగా దేవతా విషయకమగు రతి రసము కాకపోవుటకు అవకాశము లేదు. భగవంతుడు ఆలంబన విభాగముగా రోమాంచాశ్రుపాతాదులు అనుభావములుగా, హర్షాదులు వ్యభిచారులుగా' భాగవతాది పురాణ శ్రవణ సమయమందు అనుభవింపబడు భగవదనురాగ రూపమైన రతి స్థాయి భావముగా గల భక్తి రసమే అగున'ని చెప్పినాడు. 'దీనిని శాంతరసమున అంతర్భవింప జేయరాదు. ఏలన భక్తిరసమునకు స్థాయి భావము అనురాగరూపమగు రతి. శాంతమునకు స్థాయి భావము వైరాగ్యము. ఇవి పరస్పర విరుద్ధములు. కాని భక్తి దేవతా విషయకమగు రతి యగుటవలన రసము కాదనియు, భావమనియు చెప్పబడుచున్నది. ఇది భావమైనచో కామినీ విషయకమైన రతి కూడ భావమే కావలెను' అని ఇంతగా భక్తి రసత్వమును సమర్థించి 'ఏది రసము? ఏది భావము అన్న విషయమున భరతముని వచనమే ప్రమాణము' అని దానిని అథఃపతనము కావించినాడు.[10]

జగన్నాథుడు ఈ విషయము నంతను చర్చా విషయకముగా చెప్పినాడు కాని అతని ఉద్దేశమున దేవాది విషయకమైన రతి భావమే. దాని నతడు రసముగా అంగీకరించకూడదని ఖండితముగా మొదటనే చెప్పినాడు.

ఈ విధముగా భక్తిరసము కాదన్న వాదములున్నవి. ఇక భక్తిరసము అన్నవారి వాదములను గమనింతము.

మొట్టమొదటగా దండి 'కావ్యాదర్శము'న ప్రేయోలంకారమునకు లక్ష్యముల చూపు సందర్భమున భగవంతునిపై గల అనురాగమును భక్తిగా, దీనికి ప్రీతి అన్నది పర్యాయముగా వ్యవహరించినాడు.[11]

'భాగవత ముక్తాఫల' కారుడైన బోపదేవుడు, అతని గ్రంథమునకు "కైవల్యదీపిక' అన్న వ్యాఖ్యానమును చెప్పిన హేమాద్రి అనువారలు 'భిన్న రూపములనొప్పు భక్తి ప్రధానరసమనియు, మిగిలిన రసములు భక్తికి సహాయ కారులు' అన్న అభిప్రాయమును పెంపొందించినారు. భాగవత ముక్తాఫల ద్వితీయ ప్రకరణమున భక్తుడు తొమ్మిది విధములుగా, భక్తిరసము శృంగారాదు లైన నవరసముల రూపములను స్వీకరించునని చెప్పబడినది.[12]

కైవల్య దీపికయందు హేమాద్రి భక్తి రసత్వమునకు వ్యతిరేకించినవారి అభిప్రాయములను క్రోడీకరించి, భక్తిని సమ్మతమైన రసముగా సిద్ధాంతీకరించి నాడు. ఈ భక్తిరసము విభావాదులతో కూడినదై అభిరుచి కలిగించునదిగా పేర్కొన్నాడు.[13] భక్తికి రసత్వమును అంగీకరించని అభినవగుప్త, హేమ చంద్రులను విమర్శించినాడు. భక్తిని రసము కాదను వాదమునకే కారణము లున్నవో అవన్నియు తక్కిన శాంతాది రసములకును ఉన్నవన్నాడు.

ప్రాథమికమైన బోపదేవుని భక్తి సిద్ధాంతమును శ్రీకృష్ణచైతన్యుని మార్గానుయాయులైన బెంగాలీ వైష్ణవాలంకారికులు విస్తృతపరచినారు. 'భక్తి రసామృత సింధువు' 'ఉజ్జ్వలనీలమణి' అన్న గ్రంథములను రచించిన రూప గోస్వామి వారిలో ముఖ్యుడు. ఈయన 'పృథగేవ భక్తిరసరాట్ సవిస్తరే ణోచ్యతే మధురః' అని ప్రారంభించి మధురము, ఉజ్జ్వలము అను పేర్లతో ఉన్నత ప్రమాణములతో భక్తిని విస్తరించినాడు.

భక్తి ప్రధానముగా రెండు విధములు. సాధనభక్తి, ప్రేమభక్తి. భాగవత మున చెప్పిన నవవిధ భక్తిమార్గములు సాధనభక్తిలో భాగములే. ఈ సాధన భక్తియొక్క మహాత్ఫలమే ప్రేమభక్తి. మొదటిది ఉపాయము. రెండవది ఉపేయము.[14]

బెంగాలీ పండితులు శాంతాది నవరసములను, వాత్సల్య, సఖ్య, దాస్యము లను మొత్తము పన్నెండింటిని అంగీకరించినారు. వీరు ప్రాచీన మైన శృంగారమును ప్రధాన రసమనిరి. అది భగవద్రతికము. దీనికే మధురము ఉజ్జ్వలము అనికూడా పేర్లు. భక్తి మధుర, శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య

ములు అను ప్రాథమిక భేదములతో నొప్పినది. ఈ అయిదును ముఖ్య భక్తిరసములు. మిగిలిన 'హాస్య, అద్భుత, వీర, కరుణ, బీభత్స, భయానక, రౌద్రములు అను ఏడును గౌణభక్తి రసములైనవి. ఇవన్నియు కృష్ణరతితో కూడినపుడే. రసములగుచున్నవి' అని వారి అభిప్రాయము.[15]

'అలంకారకౌస్తుభ' కారుడైన కవికర్ణపూర గోస్వామి 'కృష్ణ-గోపిక'ల నడుమనున్న దివ్యశృంగారమును మధుర రసమని చెప్పినాడు. చిత్తద్రవము దానికి స్థాయిభావము. రాధాకృష్ణుల నడుమనున్నది శృంగారరస మన్న వారి వాదమును ఈయన ఖండించినాడు. పూర్వులు శృంగారమును అంగిగా, ప్రేమను అంగముగా చెప్పగా, ఇతడు ప్రేమ అంగి, శృంగారము అంగమని సిద్ధాంతీకరించినాడు. అఖండ రసత్వము కలిగిన ప్రేమయందు సర్వ రస భావములును, సముద్రమునందలి తరంగములవలె మునిగి లేచుచున్నవని అతని అభిప్రాయము.[16]

భక్తిరస విషయమై అనేకులు చెప్పియుండినను, 'భగవద్భక్తి రసాయన' కారుడైన మధుసూదన సరస్వతి భక్తిరసమును నిర్వహించిన తీరు అసాధారణమైనది. ఇతడు ప్రతిపాదించిన భక్తి సంపూర్ణమైనది. ఉదాత్తమైనది. ఈయన ప్రమాణ, ప్రమేయోపన్యాస పూర్వకముగా భక్తికి రసత్వమును స్థాపించినాడు.

అనుభవమాత్రము వలననే సాక్షాత్సుఖ విరుద్ధములైన శోక, క్రోధ, భయాదులకు రసము అంగీకృతమైయుండగా, అనుభవసిద్ధమై మిగిలిన రసముల కన్న సహస్ర గుణాధికముగ రస్యమానమగుచున్న భక్తి ఏల రసము కాదని ప్రశ్నించినాడు. దేవతావిషయకమగు రతి రసము కాదను సిద్ధాంతము ఇతర దేవతావిషయముకాని శ్రీకృష్ణసంబంధము కాదని ఇతని అభిప్రాయము. ఇతర దేవతలు జీవులే యగుటచే పరమానందము కలుగదు. పరమాత్మ స్వరూప శ్రీకృష్ణరతి మహానందమునకు గొంపోవును. లోకమునందలి అత్యధిక దుఃఖము కూడ ఏట్టి ప్రభావమును చూపలేని స్థిరప్రజ్ఞతను కలిగించునట్టి వాచామగోచరమైన భక్తికలది భక్తి. 'కాంతాది విషయకమగు ఏ రసమునందును భగవద్రతి యందువలె పూర్ణ సుఖము లేక ఆనందము కలుగదు. కాన వానియందు తగినంత రసపుష్టి లేదు. అవి క్షుద్ర రసములు. భగవద్రతి పూర్ణరసము. మిణు

గురు పుర్వులకన్న సూర్యకాంతి ఎట్లు బలవత్తరమో, అట్లే మిగిలిన రసముల కన్న భక్తి బలవత్తరము. సర్వోత్తమము. ఈ భక్తిరసమునకు భగవంతుడు ఆలంబన విభావము. అతని చరిత్రములు విభావములు. భగవదాకార చిత్తవృత్తి స్థాయిభావము. అదియే భగవద్రతి. తత్కాలమున బుట్టిన నేత్రవికారములు అనుభావములు. నిర్వేద హర్షా శంకాదులు వ్యభిచారులు. ఇవన్నియు పరమా నంద స్వరూపమగు భక్తిరసముగా పరిణమించునని' మధుసూదన సరస్వతి సిద్ధాంతము.[17]

'The Number of Rasas' అన్న గ్రంథమున వి. రాఘవన్‌గారు భక్తిరస విషయమై పూర్వసిద్ధాంతముల నన్నిటిని చర్చించుచు 'అభినవ గుప్తుడు, ఇతరులు భక్తిని శాంతమున పర్యవసింపజేసిరి. తురీయ పురుషార్థమైన మోక్షముతో సంబంధము కలిగినది శాంతము. భక్తి, కర్మ, జ్ఞానము అనునవి మోక్షమార్గములు. జ్ఞానము ఆధారముగా అభివృద్ధి అయిన భక్తిశాంతమునకు అంగముగా కొన్ని సందర్భములందు అయియుండవచ్చును. కాని భక్తి స్వతం త్రమైన, సర్వోత్తమమైన రసముగా అంగీకరింపదగినది. ఈ భక్తికి జ్ఞాన, కర్మలు అంగములు. సమస్త విషయములనుండి విముక్తిని కోరునట్టి జ్ఞాని కాంక్షించు మోక్షమును భక్తుడు ఆశించలేదు. భక్తుడు శాశ్వతముగా భగవంతుని ప్రేమనే ఆశించినాడు. ఈ భక్తి మధురము, సఖ్యము, వాత్సల్యము, దాస్యము అని చతుర్విధములు. మధురమునకే శృంగారము, ఉజ్జ్వలము అనియు పేర్లు. ఇది కృష్ణుని పట్ల గోపికలు ప్రదర్శించిన ప్రేమరూపము. కృష్ణుని పట్ల అర్జునుడు ప్రదర్శించిన ప్రేమ సఖ్యము. కృష్ణుని పట్ల దేవకీనందయశోదల ప్రేమ వాత్స ల్యము. కృష్ణుని పట్ల భక్తులకు గల ప్రేమ దాస్యము అని భక్తిరసవాదుల అభిప్రాయము' అన్న భావమును వెలిబుచ్చిరి.[18]

'సంస్కృత సాహిత్యమున భక్తి బలవత్తరమైన ప్రధానాంశముగా నుండుట సర్వసామాన్యము. అందువలన కవులు, విమర్శకులు భక్తిని ప్రత్యేక రసముగా అంగీకరించియుండవలసినది'[19] అని వి. రాఘవన్‌గారు, ఈ చర్చకు ముందుగనే తీర్పువంటి తమ అభిప్రాయమును వెలిబుచ్చినారు.

ఈవిధముగా అనంతరకాలమున భగవద్రతికమైన భక్తి రసముగా అంగీకరింపబడినది. ఇది పంచవిధభేదములతో నొప్పినది. శాంత, దాస్య, సఖ్య వాత్సల్య. మధురములని ఆ భేదములు.

ధర్మపరిపాలన చేయు చక్రవర్తి దగ్గర ప్రజలు ఎట్లు ప్రవర్తింతురో, ఎంత గౌరవమర్యాదలతో. భయభక్తులతో, మెలగుదురో శాంత భావములో భక్తుడు భగవంతునితో అట్లుండును - దూరమున ఉండి నమస్కరించవలసినదే కాని దగ్గరకు వెళ్ళుటకు వీలులేదు - శాంతము.

భగవంతుని యజమానిగా భావించి అతని సమీపమున ఉండి పాద సంవాహనాదులతో సేవచేయుట దాస్యభావము - దాస్యము.

సఖ్యభావములో భగవంతునితో ఇంకను సన్నిహిత సంబంధము భక్తుడు సంపాదించును - సఖ్యము.

భగవంతుని తన కుమారునివలె చూచుకొనుటయే వాత్సల్య భావము - వాత్సల్యము.

మధురము అన్నింటికంటే చాలా ముఖ్యమైనది. భక్తిమార్గముల కెల్ల మకుటము వంటిది. ప్రపంచములో ఎన్ని ఇబ్బందులు వచ్చినను రహస్యములేక బట్టబయలుగా ఉండు ప్రేమయే ఈ మధుర భావములోని రహస్యము. అన్ని అడ్డంకులను ఛేదించగలిగి, బలీయమై ప్రపంచమును మరిపింప జేయగలది ఇది. దీనికి త్యాగము ఊపిరి. ఈ భావమున జగన్మోహనాకారుడైన శ్రీకృష్ణుడు అధిష్ఠాత. రుక్మిణ్యాది భార్యలు, రాధ, పదునారు వేలమంది రాజకన్యలు, గోపికలు, వీరువారనక అందరును లోకమోహనుడు, త్రిలోకసుందరుడు అయిన ఆయనవెంట బడి రాసక్రీడలు చేసి సమస్తమును విస్మరించినారు. ఒక్క క్షణము ఆయన ఎడబాటును సహింపలేక పోయినారు. కృష్ణుని గానక రాధ యమునలో దూకినది. చైతన్యాదులు ఈ మార్గమునే అనుసరించినారు. ఆవిరహ వేదన భరింపలేక ఈయన జగన్నాథమున సముద్రములో దూకినాడు. భక్తునికి భగవంతునితో ఉండు సంబంధమును, సన్నిహితత్వము, ప్రేమాధిక్యములను

బట్టి ఈ రీతిగ అయినది. దీనిని దాటగనే అద్వైత మార్గమునకు దారి అందును అని తత్త్వవేత్తల అభిప్రాయము.

## మధుర భక్తి

భాగవతమందలి గోపికా కృష్ణుల సంబంధము ఈ మధుర భక్తికి ప్రకృష్టోదాహరణము. కాని, గోపికల భక్తి శృంగార సమ్మిశ్రితమై, స్త్రీ పురుష సంబంధియై యుండుటచేత లఘు దృష్టికి తుచ్ఛ శారీరక వాంఛగా గోచరింప వచ్చును. పురుషుడైన భక్తుడు ఈ మధురభక్తిని ప్రదర్శించినప్పుడు అందలి నైర్మల్యము చక్కగా బోధ పడగలదు. ఇది కేవలేంద్రియానంద జనక భిన్నమైన, సర్వోత్కృష్టమైన మోక్షరతితోకూడినది. బ్రహ్మభావనా సామ్యముతో గూడిన ఈ భక్తి శృంగారమే మధురభక్తిగా పేర్కొనబడినది. ఇట్టి దివ్య శృంగారమునకును, సాధారణమైన స్త్రీపురుష సంబంధమైన లౌకిక శృంగారమునకును సత్యలోక, పాతాళముల కున్నంత వ్యత్యాసమున్నది.

స్థూలమైన పార్థివ శరీరమును పొంది మనోబుద్ధిచిత్తాహంకారాదియుక్త సూక్ష్మశరీరుడైన జీవుడు పరమాత్మునిలో లీనమగుటకై అనుసరించెడు మార్గమే మధురభక్తి. విశిష్టాద్వైత సంప్రదాయాను సారాముగా నిత్యములైన తత్త్వత్రయ మందు (పరమాత్మ - జీవుడు - ప్రకృతి) పురుషోత్తముడైన పరమాత్మునికి, ప్రకృతికి నడుమనుండి తత్తదంశములైన స్థూలసూక్ష్మ శరీరములతో నొప్పు జీవుడు తనప్రావరణమును భేదించుకొని పరమాత్మునిలో లీనమగుటకు తపన చెందుట ప్రసిద్ధము. దీనిననుసరించియే చైతన్యుడు, రూప గోస్వామి, మధుసూదన సరస్వతి మున్నగువారు మధురభక్తి సిద్ధాంతమును లేవదీసినారు. తులసీదాసాదులు యథాశక్తిగా దీనికి ప్రేరకులైనారు.

రామాయణముననే ఈవాదమునకు బీజమున్నది. భక్తునికి భగవంతుని మీదవలెనే, భక్తులపైన భగవంతునికి ప్రేమ. ఈ ప్రేమ అలౌకికమైనది. అందువలననే సర్వసంగ పరిత్యాగులై, అనన్యభక్తితో తననే ధ్యానించుచు శరణు పొందిన మహర్షుల కొరకు 'పుంసాంమోహనరూపుడైన' భగవంతుడు వైకుంఠ

మును వదలి, అయోధ్యను పరిత్యజించి, పాదచారియై వారిని వెదకుచు ఘోరారణ్యముల దారి పట్టినాడు. తన రూపమునే ధ్యానించుచున్న వారికొరకై ముని వేషమును కూడ ధరించినాడు. ఆ భగవద్భాగవత సంబంధ మాధుర్యము అనిర్వచనీయమైనది. అతిమనోహరమైనది. బ్రహ్మాది దేవతలకు సైతము అగోచరుడైన పరమాత్మ జీవిత దండకారణ్య సంకటస్థితులైన ఆ మహర్షుల నుద్ధరించుటకై వారి ఆశ్రమద్వారమున ప్రత్యక్షమై ఆ తాపసోత్తములను స్వయముగా అర్చించి ఆనందించినాడు. అచటి మునులు రామచంద్రుని కనులార చూచినారు. ఆనందించినారు. వాని అందచందములకు పరవశత్వమును పొందినారు. వానిని నిండార కౌగిలించుకొన అభిలషించినారు. ఆ క్షణమున వారు స్త్రైణ భావమును పొందినారు. కాని ఏకపత్నీవ్రతుడైన రాముడు కృష్ణావతారమున వారి కోర్కె తీర్తునన్నాడు. వారే ద్వాపరయుగమున రాజకన్యలై (గోపికలై) తమ మనోరథముల నెరవేర్చుకొనిరట. తనను సేవించు భక్తులను సేవించుటయే భగవంతుని పని. ఎవరు ఆత్మనిష్ఠులై, అనన్య శరణాగతులై తనయందు మగ్నులు కాదలుతురో వారిని ఆ పరమాత్ముడు స్వీకరించును. గోపికలు ఈవిధమైన భక్తిచేతనే తరించినారు.

వెల్లూరు నరసింగకవి తన గ్రంథనాయికలైన పదునారువేల మంది రాజకన్యలను ఈ గోపికలవలెనే చిత్రించ యత్నించినందున గోపికల ప్రస్తావన ఇక్కడ కొంత అవసరము. కృష్ణతత్త్వము నందు గోపీకృష్ణ సంబంధమువలె వివాదాస్పదమైనదియు, ఇంత మాధుర్యభావ సంపన్నమైనదియు మరియొక అంశములేదు. ఈగోపికలందరును పూర్వసంస్కార వశమున జన్మించి స్వామి మధుర స్పర్శను కాంక్షించిన మునిసత్తములన్నది ప్రధాన విషయము.

ఆంధ్రమహాభాగవతమున పోతనామాత్యుడు ఈ గోపికావృత్తాంతమును అనితరసాధ్యమైన రీతిలో నిర్వహించినాడు. కృష్ణుని వేణుగానమును విని గోపికలు సమస్తమును విస్మరించి అతని సన్నిధిని చేరినారు. 'ఇట్లు హరి వేణునాదంబు పూరించిన, మారవికారహేతువగు తద్గీతంబాలించి, సిగ్గులు చాలించి, మక్కువలు చెక్కులొత్త, గోపికలోపికలులేక, తమ తమ పొత్తుకత్తెలుందారును, చత్తరంబున ఐదుగురు, నేగురుం దుటుములుగొని' బృందావనముచేరి గోపికలు

పరమానందంబున అతనిని తమ మనస్సులలో ఆలింగనము చేసికొనిరి. స్వామి వేణుగానమునకు ప్రకృతియంతయు రసభావ ప్రవన్ఫూర్తియైనది. పతులను, బిడ్డలను, బంధువులను, సర్వస్వమును పరిత్యజించి తనకై విచ్చేసిన గోపకాంతల భక్తికి ప్రతికృతి సేయుట ఆ పరమాత్మునికే కష్టసాధ్యమయ్యెను.

'పాయని గేహ శృంఖలము బాసి నిరంతర మత్పరత్వముం
జేయుచునున్న మీకు బ్రతిసేయ యుగంబులనైన నేరనన్
బాయక గొల్చు మానసము ప్రత్యుపకారముగా దలంచి నా
పాయుట తప్పుగా గొనక భామినులారః కృపన్ శమింపరే'

ఇట్టి కథ విశిష్ట సంస్కారములున్న జీవాత్మలయొక్క ఆధ్యాత్మిక ప్రస్థాన గాథ. దీనిని పోతన తన మహత్తర శిల్పరచనావైభవము తోడను, పరమ తాత్త్విక సమన్వయము తోడను రూపొందించినాడు. గోపికలు పరమేశ్వరుగనిన ముక్త బంధలు. పోతన వారి కథను సౌమనస్యముగా నొనర్చిన ముక్తసంగుడు అన్న విజ్ఞుల అభిప్రాయము అక్షరసత్యము.

శ్రీకృష్ణ గోపికావృత్తాంతమున భక్తి శృంగారములు మిశితమైనవి. భగవంతుడైన కృష్ణుని ఆత్మేశ్వరునిగ భావించి అనిర్వాచ్యమైన నిర్మల భక్తినే గోపికలు ప్రదర్శించిరి. 'యథాప్రజగోపికానామ్' (భక్తి అనునది గోపికల భక్తివలె ప్రగాఢమై ప్రస్ఫుటించవలెను. పరమభక్తికి, ప్రేమ స్వరూపమైన నిష్కళంక మధురభక్తికి గోపాంగనలు ఆదర్శప్రాయులు) అని నారదమహర్షి వారి భక్తిని స్తుతించినాడు.

కృష్ణునితో కుబ్జ, గోపికల శృంగారములను పరికించిన మనకీ అంశము స్పష్టపడగలదు. పరమార్థము నెరుగక బాహ్య సౌందర్యమునకే భ్రమసిన కుబ్జ.

'చక్కనివాడవౌదు సరసంబుల నొంపకు యెల్లవారికిన్
జక్కదనంబు లెక్కడివి చారు శరీర!' అని పిలిచి

'వేంచేయుము నాయింటికి
పంచశరాకార! యనుచు బైకొంగా క

రక్షించి హరి దిగిచె గామిని
పంచాశుగ బాణజాల భగ్నహృదయమై'

కృష్ణుని అంగజకేళి కోరినది. అందుకే ఆమె 'కామిని' అయి

'సైవం కైవల్యనాథం తం ప్రాప్య దుష్ప్రాపమీశ్వరమ్,
అంగరాగార్పణే నాహో దుర్భగైన మయాచత'

అని తిట్టువడినది. ఆమె యజ్ఞానమును సహింపలేని వ్యాసమహర్షి ఆమెను 'దుర్భగ' అని యీసడించినాడు. తద్విహీనం జారాణామివ' (భగవంతుడని తెలిసికొనకుండ సామాన్యుడని భావించి అతనిపై ప్రేమ ప్రకటించినచో అది జారత్వమువలె ఉండును) అని నారదుడును వ్రాక్రుచ్చినాడు.[20] కాని గోపికా శృంగారము అట్టిదికాదు. వారు కృష్ణుని యందలి పరాత్పరతను గుర్తెరిగి సర్వాత్మనా అనగా తమ స్థూల సూక్ష్మ శరీరములందలి ప్రత్యణువు ఆ పరాత్పరుసిలో లీనము కావలెనని తలచిరి. లౌకిక ప్రేమ వ్యవహారములలో పరస్పరాభిలాష ఉన్నను, ఉత్తమోత్తమమైన, నిస్స్వార్థమైన, పరిపూర్ణమైన ఈ పరమ ప్రేమ ముందు అది ఎందునకు కొరగాదు అన్నాడు నారదుడు.[21] ఈ విషయము భాగవతమున కృష్ణుడు ఉద్ధవుని గోపికల వద్దకు పంపుటలోను, గోపికాగీత లందును, ఉద్ధవుని అనుభవమందును స్పష్టముగా పొందుపరుపబడియున్నది.

వెల్లూరు నరసింగకవికూడ రాజకన్యలను 'రాచకన్యకాపరిణయమున' ఈ విధమైన మధుర భక్తి పూర్ణలుగా తీర్చినాడు.

## రాజకన్యకల మధుర భక్తి

నరసింగకవి రాజకన్యల పాత్రలను నిర్వహించిన తీరును విచారించుటకు ముందుగా కృష్ణ రాజకన్యల తత్త్వములను గమనించుట యుక్తము.

శ్రీకృష్ణుడు దక్షిణ నాయకుడు. రుక్మిణ్యాది అష్టభార్యలు, షోడశ సహస్ర సంఖ్యాకలైన రాజకన్యలు, రాగ, నందవ్రజమందలి పరకీయలైన పెక్కురు గోపకాంతలు, కుబ్జాదులు, ఇతరులు ఇంకను ఎందరో అతని అంగనలు. ఒక్క

పురుషుడు ఇందరు స్త్రీలతో సంబంధము కలిగియుండుట సాధ్యమా ? అని విచారించినచో, ఈ బహుభార్యత్వమున నిరూపింపబడినది శృంగారేతరమైన తాత్త్విక సమన్వయమని తెలియగలదు. జీవతత్త్వము బ్రహ్మతత్త్వములో లీనమగుట అనుసాధన దీని పరమార్థము. 'నారదస్తు తదర్పితాఖిలాచారతా, తద్విస్మరణే పరమవ్యాకులితేతి' (నారాయణునికి సర్వసమర్పణము చేయుట, ఆయన విస్మరణ కలిగినచో వరమవ్యాకులత పొందుట), 'అస్త్యేవమేవమ్' (ఇదే నిజమైన భక్తి. పరమభక్తి కొరకు వ్యాకులత పొందుటయే నిజమైన సాధన భక్తి) అని నారదుడు ఈ విషయమును ధృవీకరించినాడు.

భాగవతమందలి రాసలీలాది ఘట్టములను దృష్టిలో నిడుకొని చూచినచో, కృష్ణుడు అవతార మానవ రూపము కాదని, అది ఒక ఆధ్యాత్మిక తత్త్వముఅని, దానిని ఆకళించుకొని అనుభూతికి తెచ్చుకొనుటయే భాగవత పరమోద్దేశమని స్పష్టపడగలదు.

కృష్ణశబ్దమునకు పలువిధములుగా వ్యుత్పత్తులు చెప్పబడినవి.

దేవీభాగవతము 'కృష్ణ' శబ్దమునకు ఉత్కృష్టమైన అర్థములు చెప్పుచున్నది.

'సచాత్మా, స పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిదీయతే,
కృషి తస్తద్భక్తి వచనో, నశ్చ తద్దాస్యవాచకః.
భక్తిదాస్య ప్రదాతాయః సచకృష్ణః ప్రకీర్తితః,
సకృష్ణః సర్వస్రష్టాఽఽ ఏకఏవహి'

ఆత్మ, పరబ్రహ్మ అన్న అర్థాలు కృష్ణపదమున కున్నవి. 'కృషి' ధాతువునకు భక్తి అని అర్థము. 'న' అనునది దాస్యము అన్న అర్థము నిచ్చును. కనుక 'భక్తి దాస్యమును ఇచ్చువాడు' అని కృష్ణపదమునకు వ్యుత్పత్తి. ఈ కృష్ణుడే సర్వమును ఆదిలో సృష్టించినాడు.[22]

'కృషిర్భూవాచకః శబ్దః ణశ్చ నిర్వృతి వాచకః,
తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణఇత్యభిధీయతే.

ఏవం శాస్త్ర ప్రసిద్ధత్వాత్ కృష్ణో బ్రహ్మైవనాపరః,
జీవస్యైవతు బ్రహ్మత్వం స్ఫుట మౌపనిషన్మతే.
అధ్యాత్మ వసథిం కృత్వా జీవో కృష్ణో బ్రహ్మాత్మనా స్థితః'

'కృషిః' అను ధాతువునకు భూవాచక శబ్దము అర్థము. 'న' అనునది నిర్వృతి (ఆవరణములేనిది) వాచకము. ఆ రెండింటి కలయికయే కృష్ణ శబ్దము. అనగా భూసంబంధమైన విషయావరణములేనిది అన్నది కృష్ణ అనబడును. అదేహ పరబ్రహ్మతత్త్వము. 'బ్రహ్మ' అనగా మనలోని జీవుడే అని ఉపనిషద్వాక్యము. దేహములోని మనస్సునందు నివాసమేర్పరచుకొన్న జీవుడే కృష్ణుడుగా ఉన్నాడు.[23]

ఉన్నత దృక్పథముతో చూచినచో ఈ నగ్న శృంగార కథలన్నియు పరమాత్మతో ప్రేమానుబంధము కలిగిన జీవాత్మలు పరమాత్మతో ఐక్యమగుటకు చెప్పు సాధనములుగనే అన్వయించక తప్పదు. 'కృష్ణ' అనగా 'కర్షయతిఇతి'. 'కృష్ణః' అను పదమునకు జీవాత్మలను ఆకర్షించు పరతత్త్వము అని అర్థము చెప్పవలెను' అన్నది అరవిందుని అభిప్రాయము.

ఇక పదునాలుగువేలమంది రాజకన్యల విషయము
"కాంతా షోడశ సాహస్రం కలాసు పరికల్ప్యతే"

అని దేవీభాగవత నీలకంఠీయ వ్యాఖ్య. పదునారువేల కన్యలు దేహములోని పదునారువేల సంఖ్య గల కళలని అర్థము. దేహమున ప్రకాశించునట్టి జ్ఞాన జ్యోతి యొక్క కిరణములే ఆ కళలు.[24]

డా॥ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి అభిప్రాయానుసారము 'పదునాలుగు వేలసంఖ్యలోని పదునారు అనునది సృష్టిలోని షోడశప్రకృతులకు సూచకము (అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, పంచ తన్మాత్రలు, మనస్సు) వీనిచే పరివృతుడై జీవులు కన్యలుగా అంతర్యామి క్రీడించును. సహస్ర సంఖ్య, పురుషసూక్తమున ప్రతిపాదింపబడిన సహస్ర శీర్షములకు ఉప లక్షకము. శీర్యతే ఇతి శిరః అను నిర్వచనము ననుసరించి పురుషోత్తముని

అంశయగు జీవలోకమున క్షరపురుషుల ఉద్భవమే శీర్షములు లేకపొటమరించినవి. అదొక్కప్పుడు 'సోహం' అనుశ్వాసమంత్రమున 'హంసో' అనునిశ్వాస మంత్రమున జీవిగా నేర్పడి 'సహస' అనుమంత్రముల సధిష్ఠించి జీవించును. వాని ప్రాణములకు సూచకమగు అగ్ని బీజము 'ర' సమ్మేళనముతో 'సహస్ర' అను మంత్రము క్షరపురుషుని తాత్కాలిక స్థితికి బీజమగును. దీనితో 'శీర్షము' కట్టుకొనగా 'సహస్రశీర్ష మేర్పడును. ఇట్టి ఉపాధిరూపుడైన క్షరపురుషుడు ముందు చెప్పిన షోడశప్రకృతులకును అంతఃపురముగ నేర్పడును. ఇదియే రచనా చాతుర్యమున షోడశసహస్రముగ సంకేతింపబడినది.'25

ఈ విధమైన 'కృష్ణరాజకన్యల' సంసర్గమును 'రాచకన్యకా పరిణయ' ప్రబంధమున వెల్లూరు నరసింగకవి మిక్కిలి చాతుర్యముతో నిర్వర్తించినాడు. పదసంజయోసములోను, వర్ణముల కూర్పులోను ప్రత్యేకమైన మెలకువతో విషయమును విస్తరించినాడు. తాను భావించినట్లుగనే, గ్రంథమునందలి పాత్రలు భావించినట్లుగనే, ఆయా విషయములు పాఠకుల మనోరంగముపై ప్రతిఫలించి, వారిని రసానుభవభరితులను చేయునట్టి రచనాకళతో రాజకన్యల మధురభక్తికి రూపుదిద్దినాడు.

శ్రవణకీర్తనాదులైన నవవిధోపాయములతోగూడిన సాధనభక్తి, దీని యొక్క మహత్ఫలమైన ప్రేమభక్తి రెండును 'రాచకన్యకా పరిణయము'న వర్ణితములు.

రాజకన్యలు కృష్ణుని పట్ల ప్రదర్శించినది లౌకిక శృంగార సంబంధమైన తుచ్ఛదైహికేచ్ఛగాక మోక్షరతికమైన ఉత్కృష్టప్రేమ. తన అసాధారణదృష్టితో, రాజకన్యలను ఈ లోకముననే సాలోక్యము (భగవల్లోకప్రాప్తి), సామీప్యము (భగవంతుని దగ్గర చేరుట), సారూప్యము (భగవద్రూపప్రాప్తి), సాయుజ్యము (భగవదైక్యప్రాప్తి) అన్న శాస్త్రప్రసిద్ధములైన చతుర్విధముక్తులను పొందిన జీవన్ముక్తలుగా కవి రూపకల్పన చేసినాడు.

కథాప్రారంభమున నారదుడు శ్రీకృష్ణుని దర్శింప ద్వారకానగరమునకు వచ్చినాడు. ఆయన తాను వచ్చునపుడు ప్రాగ్జ్యోతిషమునకు వెళ్ళినట్లును, అచ్చట

నరకబంధితలైన రాజకన్యలను చూచినట్లును, వారు తన ద్వారా కృష్ణునికి సందేశము పంపినట్లును చెప్పి, ఆ రాజకన్యల సందేశమును కృష్ణునికి నివేదించినాడు.

రాజకన్యలు నారదముని ద్వారా కృష్ణునకు

'విగ్రహ జాగ్రదుగ్ర భుజవీర్యముచే నరకున్వధించి నీ
విగ్రహణం బొనర్చి ననవింటి వజీరుని వంటి నీల స
ద్విగ్రహ సంగతిన్ శుభమతిన్ గనజేసితివేని మమ్ము భా
విగ్రహబాధలంటవని వెన్నునితోనిటు విన్నవించుడీ' (187-1)

అని సందేశమును పంపినారు. నరసింగకవి ఈ పద్యమును సాభిప్రాయముగా రచించినాడు. బాహిరకముగా ఇందు లౌల్య శృంగారమున్నట్లు కనిపించును. కాని 'వీర్యము, నరక, నీవిగ్రహణ, నీలసద్విగ్రహ సంగతి' మున్నగు శబ్ద పరికరము మనోహరమైన అన్వార్థస్ఫోరకముగా ఉన్నది. 'వీర్య' శబ్దమునకు 'తేజస్సు' అని అర్థమున్నది. అవాఙ్మానసగోచరమైన అఖండవైష్ణవ తేజమది. దీనినే 'యత్కించిదేకంమహః' అని భోజుడును, 'జ్యోతిశ్చేతసి నశ్చకాస్తి జగతామేకాభిరామాద్భుతమ్' అని లీలాశుకుడును, 'సహజానందోజ్జ్వలం యన్మహః' అని విజ్ఞులను పేర్కొన్నారు.

'నరక' శబ్దము భౌమాసురుడు అన్న అర్థముతో పాటుగా, సాక్షాన్నరక తుల్యమై, దుఃఖసంకులమైన సంసార పారావారమును స్ఫురింపజేయుచున్నది. (భౌమాసురుడులో 'భౌమః' అనగా భూమికి సంబంధించిన మాయ. అసుర— సు = సుగతిని అనగా ముక్తిని గ్రహించువాడు సురుడు. న + సురః = అసుర—ముక్తిని గ్రహింపనివాడు. అనగా 'భూసంబంధమైన విషయానంద మనెడు అజ్ఞానము' అని అర్థము). నర + క—'నృహింసాయాం' అను ధాతువు వలన 'నర' అనగా నశించునది అని అర్థము. 'క' అనగా సుఖము. 'నరక' అనగా 'తాత్కాలికమై నశించునట్టి ఇహలోక సుఖమని అర్థము .

'నీవి' శబ్దమునకు 'చెర' అను అర్థమున్నది. ముక్తికాంక్షియై తపించు జీవునకు ఈ ప్రపంచము పెద్ద చెరసాల అన్నది సత్యము.

'నీలసద్విగ్రహ సంగతి' అన్నది అనంత తేజః పుంజ బంధురమైన పరమాత్మ ఐక్యమును సూచించుచున్నది,

'భావిగ్రహబాధ' అన్నది పునర్జన్మను సూచించుచున్నది. 'గ్రహ' మనగా చెరసాల. చెరసాల అనగా పునర్మాతృగర్భకారాగార వాసత. అనగా పునర్జన్మ అని దీనివలన స్పష్టమగుచున్నది. అందువలన కృష్ణైక్యమే పునర్జన్మ బాధనుండి విముక్తి కలిగించగలదని అర్థము. అట్టి సాయుజ్యమును రాజకన్యలు కాంక్షించినందున ఇందు సాయుజ్యముక్తి చెప్పబడినది. దీనివలన రాజకన్యలు జాంతవమైథున కాంక్షులు కాక పరమానంద దాయకమైన మోక్షరతి లాలసలని విశదమగుచున్నది. చతుర్విధ ముక్తులందు తురీయము, సర్వోత్కృష్టము అయిన సాయుజ్యముక్తికి ఈ విధముగా ఆరంభముననే గట్టి పునాది వేయబడినది.

* * * *

నరకవధానంతరము కృష్ణుడు నరకబంధితలైన రాజకన్యలను చూచి 'మీ చేతో మోదంబులుగల భూతలపతులందు బుద్ధి కలిగినదా?' (371-2) అని యడిగినప్పుడు వారతనికిచ్చిన సమాధానము వారి భక్తి తత్పరతను చాటుచున్నది. అది సమాధానముకాదు. ఉపన్యాసము. ఈ ప్రశ్న వారిహృదయములపై దెబ్బకొట్టినట్లైనది. వారు జగన్మోహనాకారుడైన అతనినే కాంక్షించి, ఇన్ని సంవత్సరములుగా క్షణమొక యుగముగా గడుపుచు నరకుని చెరలో అతని కొరకై ప్రతీక్షించుచు తపించుచున్నారు. తనకావిషయము తెలిసియుండియు, కృష్ణుడు ప్రథమముగా దర్శనమిచ్చి సాధారణులైన ఇతర రాజకుమారులపై కాంక్షల విషయమై తమను, నవ్వులాటకైనను, అడిగిన ప్రశ్నకు రాజకన్యలు తట్టుకొనలేకపోయినారు. ఈ మాటకు వారు ఉద్వేగకరముగా ప్రతిస్పందించి 'అంభోజగర్భాదులభ్యసింపగ లేని హరిభక్తి పుంభావరూపుడైన' ప్రహ్లాదుని సోదరీ ప్రాయలై తమ అంతరంగమును కృష్ణుని ముందు పరచినారు.

'అనినన్ గృష్ణునిగాంచి కాంతల సమూహంబెల్లను దైత్యమ
ర్దన ! మీ పాదసరోరుహద్వయిని జింతింపుచుండియున్నట్టి నె
మ్ము మను నీలీలల బల్కానర్హమె జగంబున్ గావఁ సిద్ధాత్రిలో
జననంబందిన విష్ణుమూర్తివి మదేచ్ఛల్ మీకడన్ వర్తిలున్

ఇతర నృపాలక జన సం
గతులొల్లము మీపదాబ్జగత చిత్తలమై
సతతము మిమ్మే కోరెద
మితర నృపుల గొల్చు చిత్తమిందదు మాకున్

నూతనమేఘోద కాతత చాతక
జాతముల్ చనునె దుర్జలములకును
వెన్నెల గుత్తిని వేడు చకోరికల్
చెలగి చండజ్యోతి జేరజనునె
మానసకాసార మహిత మరాళముల్
తుంగమడ్గులను మెలంగజనునె
పద్మమరందైక పాన భృంగంబులు
జిల్లెడుపూల కాశించబోనె
దేవ! త్వత్పాద సేవెమా జీవనంబు
గావునను మమ్ము రక్షించు కరుణతోడ
దేవకీపుత్ర! సుజనవందిత చరిత్ర!
భవ్యగుణజాల! సంతత భక్తలోల!
భూపుత్రుడు చెరబెట్టెను
పాపాత్ముండనుచు మేము పదరిన దోషం
బాపుణ్యునిచే గాదా
మీపద పద్మములసేవ మెచ్చుగ దొరకెన్.' (372-375/2)

అన్న రాజకన్యల పలుకులందు క్షుద్రగ్రామ్యధర్మాభిరక్తి లేశమైన లేదనుట స్పష్టము. ఈ విధముగా వారు నిత్యము హరిపాద సామీప్యమునే కోరుటవలన ఇందు రాజకన్యల సామీప్యముక్తి ప్రకటితమైనది.

* * *

కృష్ణప్రేషితలై ద్వారకా నగరమునకు బయలుదేరిన రాజకన్యలు

'ద్వారకానగర నివాసులమై యున్కి
యెన్నటి కబ్బునో సన్నుతముగ
వసతిగా దేవకీ వసుదేవులకు బూజ
గావించు టెన్నడో సన్నుతముగ'

'అనుచు పదియారువేవురు నంగనలును
జింతచే రేబగళ్ళు నాశించియుండ
వారి భాగ్యంబు ఫలియించు పగిది'గా (123-3)

అయాచితముగా వారికి మార్గ మధ్యమునసే బలరాముడు తటస్థించి వారిని ద్వారకానగరమునకు కొనివెళ్ళినాడు. ఈ విధముగా ఆ కృష్ణపరమాత్ముడున్న స్థానముననే, వైకుంఠతుల్యమైన దార్వకానగరముననే ఉండగల అవకాశము వారికి లభించుటవలన ఇందు రాజకన్యల సాలోక్యముక్తి ప్రకటితమైనది.

* * *

రాజకన్యలు బలరాముడిచ్చిన విందు సంరంభమున వారుణి పానముగావించి మానసపూజావిధానమున కృష్ణుని సేవించిరి. అనంతరము నిద్రించి స్వప్నము లందు కృష్ణ సంభోగ సౌఖ్యములను అనుభవించి, తమ అనుభవములను

"సొగసుగా జెక్కుల్ చుంబించి చుంబించి
చేరి మోమున మోము జేర్చెనమ్మ" (166-3)

అని పరిపరివిధములుగా పరస్పరము తెలుపుకొనిరి.

స్వప్నములు జీవితమునందలి ప్రగాఢమైన కోరికలకు పెక్కుమారులు ప్రతిబింబములగును. ఒక వ్యక్తి ఏ విషయమును గురించి నిరంతరము సర్వాత్మగా ఆలోచించి తపించుచుండునో అట్టివి సిద్ధించునట్లు అతనికి స్వప్నములు కలుగుట అనుభవసిద్ధమే. ఈ విధముగా జాగ్రదవస్థ యందలి తీరని కోరికలు స్వప్నములందు ఫలించుననుట సత్యము.

రాజకన్యకల ఇట్టి స్వప్నానుభవములు, బృందావనమున కృష్ణునిగానక తపించి అతని వియోగమును భరింపలేక పారవశ్యముతో కృష్ణలీలలను అనుకరించి ఆడిపాడి ఆనందించిన భాగవతమందలి గోపికల చేష్టలను పోలియున్నవి. లేనిదానిని ఉన్నట్లు భావించుట, కృష్ణవియోగము, సారూప్యము (తన్మయత)లు రాజకన్యలు, గోపికలు ఇరువురి యందును సమాన లక్షణములు. కృష్ణసంయోగమును తమలో పొందినట్లుగా లీలానుకరణమున గోపికలు, స్వప్నానుభవమున రాజకన్యలు భావించిరి. నిజమునకు ఇది గోపికల కృష్ణలీలానుకరణము కాదు.

రాజకన్యల స్వప్నానుభవముకాదు. ఇది వారి వారి భావ తపస్సు. ఈ రెండు చోట్లను వారు కృష్ణునితో సారూప్యమును (తద్భావ భావనను) అనుభవించినారు. ఇందు రాజ్యకన్యల సారూప్యముక్తి ప్రకటితము.

ఈ విధముగా శాస్త్రప్రసిద్ధములైన చతుర్విధముక్తులు రాచకన్యకాపరిణయమున వర్ణితములు.

'సారూప్యం తవపూజనే శివ మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తి ధుర్యజనతా సాంగత్య సంభాషణే।
సాలోక్యం చ చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే
సాయుజ్యం మమసిద్ధమత్ర భవతి స్వామిన్ కృతార్థోస్మ్యహమ్'

అని శంకర భగవత్పాదులు చతుర్విధ ముక్త్యనుభూతుల ద్వారా అద్వైత సిద్ధిని పొందుటను చెప్పినట్లుగా, వెల్లూరు నరసింగకవి తన కావ్యనాయికలైన రాజకన్యలను జీవన్ముక్తిని పొందిన మధుర భక్తి భరితలుగా జేసి అద్వైత సౌధ మార్గ అంతిమ సోపానమున నుంచినాడు.

ఆబాల్యముగా 'పద్మ నేత్రువరసుఖానంద సామ్రాజ్య వైభవమును' (137-3) ఆశించిన రాజకన్యల భక్తి భావమునకు పరవశించిన బల రాముడు వారిని-

'పూర్వజన్మ తపః ఫలంబులనకాదె
మీకు మా కృష్ణసేవాను మేళనంబు
నబ్బుటలు బ్రహ్మరుద్రాదుల కందరాని
పదవి జెందెదరిక మీరు సుదతులార!' (139-3)

అని మెచ్చుకొన్నాడు.

భాగవతమున కృష్ణప్రేషితుడై గోపికల వద్దకు వెళ్ళిన ఉద్ధవుడు ఆ గోపికల విశుద్ధ భక్తిని గాంచి పరవశించి

జపదాన వ్రతహోమ సంయమ తపస్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నేవిభున్ మనములో నిల్పంగలేరట్టి స
ద్విపులా కారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ కజ
స్ర పటు ధ్యానము లిట్లు నిల్చునె భవచ్చారిత్రముల్ చిత్రముల్.

అని పొందిన అనుభూతివంటిదే, ఇక్కడ బలరాముఁకును కలిగినది.

వెల్లూరు నరసింగకవి రాజకన్యల మధురభక్తిని శృంగార సమ్మిశ్రిత మొనర్చినాడు. ద్వారకానగరమున రాజకన్యలు

'...రేబగళ్ళు హరిపై నత్యంత మోహార్తిచే
వనజాతాస్త్ర శరప్రవర్షములు దుర్వారంబులై తాకగా
ననబోణుల్ హరిరాకగోరుచు 'ముకుందా! మమ్ము రక్షింపనే
యనురాగమ్మున వేగనందరి వివాహంబుంసి చేపట్టవే' (202-3)

అని విరహభరితలై పరిపరివిధముల సంకటపడి, ఆశయసిద్ధికై మన్మథుని పూజించి ప్రార్థించినారు. అనంతరము కృష్ణుడు వచ్చి వారిని వివాహమాడినాడు. కృష్ణుడు వారితో

'పాడియు దప్పక సురత
క్రీడలు చౌశీతి బంధరీతులు వరుసన్
గూడుక పదియార్వేవుర
చేడియల రమించె గోపశేఖరుడెలమిన్' (274-4)

అని మదన సామ్రాజ్య భోగములను అనుభవించినట్లు ఒక్క పద్యమున సూచనామాత్రముగనే చెప్పి తన గ్రంథమును పరిసమాప్తి కావించినాడు. నరసింగకవి నాయికానాయకుల సంభోగ శృంగారమును వివిధ రీతులలో వర్ణించకపోవుట వలన ఈయన శృంగారమునకు ప్రాధాన్యమివ్వలేదని, అవసరమునుబట్టి దానిని భక్తికి అంగముగ మాత్రమే వాడినాడని స్పష్టమగుచున్నది.

## ఇతర భక్తిమార్గములు

వెల్లూరు నరసింగకవి రాజకన్యల మధురభక్తితో పాటుగా భాగవతము నందు పేర్కొనబడిన శ్రవణకీర్తనాదులైన నవవిధసాధన భక్తిమార్గములను తన గ్రంథమున పొందుపరచినాడు. ఇవికాక వాత్సల్య, వైరభక్తులను కూడ జోడించినాడు.

## శ్రవణము

పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రునితో

'హరి పదియారువేల వసుధాధిపకన్యల నెవ్విధంబునం
బరిణయమయ్యె నా యమృతభానునిభాస్యలనేకలొక్కఁడా
సరసిజనేత్రలందరికి సమ్మతిగాగ మెలంగుటెట్లు సు
స్థిరమతి నమ్మనోహరు విచిత్రచరిత్ర మెరుంగజెప్పవే' (105-1)

అని యడిగి ఆ మునీంద్రునితో చెప్పించుకొని శ్రవణమున తరించినాడు.

భాగవతమున పేర్కొనబడిన భక్తులు ఎవరెవరు ఏ యే భక్తిమార్గముల తరించిరో వివరించెడి పూర్వప్రసిద్ధ శ్లోకమును ఈ సందర్భముగా గుర్తుతెచ్చు కొనుట అనవసరము కాదు.

'శ్రీవిష్ణోశ్శ్రవణే పరీక్షిదభవత్ వైయ్యాసికిః కీర్తనే
ప్రహ్లాద స్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీః పృథుః పూజనే।
అక్రూర స్త్వభివందనే ఖగపతిర్దాస్యేఽథ సఖ్యేర్జునః
సరస్వాత్మనివేదనే బలిరభూత్ భక్తప్రియో మాధవః॥'

ఇందు వివిధ భక్తుల వివిధ భక్తిమార్గములు పేర్కొనబడినవి.

## కీర్తనము

'కనకాంశుకము నిజాంగమున గప్పు సురనుత నీలాంశుకమూర్తి కథ లను లీలాశుకముగతిన్' (104-1) కీర్తించి తరించినవాడు శుకమహర్షి. ఇట్టివాడే నారదమహర్షి. ఈయన కూడ స్మరణ కీర్తనాదులచే తరించినాడు.

ద్వారకలో కృష్ణుని దర్శించిన నారదుడు ఆ ఇంద్రాదిసురాగ్రజుని దశావతార లీలలను మనోహరముగా కీర్తించినాడు. 'మాధవా' అన్నమకుటముతో విష్ణ్వవతారములను పది పద్యములందు కీర్తించి, వేరొక్క దానిలో విష్ణుతత్త్వమును చెప్పినాడు. ఈ పదునొకండు పద్యములు శతక సంప్రదాయముతో నొప్పినవై 'మాధవైకాదశస్తుతి' (153-163/1) అని చెప్పదగి యున్నది.

## అభివందన - స్మరణములు

పారిజాత వృక్షమునకై కృష్ణునితో జరిగిన సంగరమున పరాజయమును బొందిన దేవతా సముదాయము ఆయనను శరణు జొచ్చినది. పిమ్మట

'స్వస్తిసకలార్థపాల! నమోస్తు' యనుచు
సర్వ సాష్టాంగ దండ ప్రణామములను
జేసి యామీద బహుప్రదక్షిణము లొప్ప
జేసి నుతిజేసి రమరవరులు' (97-4)

ఇట్లు అభివందన మాచరించి దేవతలు శ్రీకృష్ణుని ఆ బాల్యమైన క్రీడలను సుదీర్ఘముగా స్మరించి కీర్తించిరి (98-192/4). ఈవిషయమును నరసింగకవి దాదాపు నూరు గద్యపద్యములందు వివరించినాడు. ఈవిధముగా భాగవత దశమస్కంధ పూర్వభాగమందలి కథ నంతయు కవి జోడించి 'రాచకన్యకాపరిణయము'ను ఒక సంక్షిప్త భాగవతముగా తీర్చినాడు. ఈ అంశము కూడా ఈ గ్రంథమున భక్తికి గల ప్రాధాన్యమును ధృవపరచుచున్నది.

## పాదసేవనము

రాజకన్యలు కృష్ణుని 'పాదసేవనయే తమ జీవనముగా భావించినవారై, పుణ్యాత్మకుడైన నరకుని బైద్యమువలననే తమకావిష్ణుపదపద్మ సేవాభాగ్యము కలిగినదని' (374-375/2) సేవించి తరించినారు. (చూ. ఇందలి పు. 222)

## అర్చనము

నరకవధానంతరము భూదేవి తన పౌత్రుడైన భగదత్తునితో కృష్ణుని దర్శించి, స్తుతించి తమ మనుమని కటాక్షించుమని ప్రార్థించినది. పిమ్మట ఆమె

కృష్ణుని భగదత్తునకు పట్టము కట్టి తమ పూజలందుకొని వెళ్ళుమని కోరినది. కృష్ణుడు ఆమె అభ్యర్థనను మన్నించి ప్రాగ్జ్యోతిషమునకు రాగా

'భూదేవియు భగదత్తుడు
యాదవ విభునకు మణిమయాంచిత సౌధం
బాదట నొసగిరి విడిదిగ
సాదరమున నర్చనములు సలిపిరి వేడ్కన్'. (355-2)

భూదేవి, భగవదత్తుడు అర్చనమున తరించినారు.

## దా స్య ము

నరకవధార్థమై వెడల దలచిన కృష్ణుడు వైనతేయుని స్మరించినంతనే గరుడుడు వేంచేసి కృష్ణుని పలు విధముల స్తుతించి

'దేవరవారి సేవకరుదెంచితి మీరు దలంచినంతలో
వావిరి మీమదిన్ బొడము వాంఛితమున్ దగనాకు దెల్పుడీ' (198-2)

అని దాసభావమున ప్రార్థించి, సేవించి తరించినాడు.

## సఖ్యము

రాచకన్యకా పరిణయమున సఖ్యభక్తిచే తరించినవాడు ఇంద్రుడు. నరసింగకవి కృష్ణ ఇంద్రులను అన్నదమ్ములు, బాల్యమిత్రులు మొదలగువారి మధ్యనుండు ఆత్మీయతా స్నేహభావములున్నట్టి వారుగా తీర్చినాడు. నరక బాధలు భరింపలేని ఇంద్రుడు ద్వారకకు వెళ్ళి శ్రీకృష్ణుని కీర్తించి, తమ్ము కాపాడుమని కోరినాడు. కృష్ణుడాతనికోర్కె తీర్తునని వాగ్దానమొనర్చి తన యింట భుజించివెళ్ళుమని ఆప్యాయముగా కరములు పట్టి ఆహ్వానించినాడు. కృష్ణేంద్రులు దేవతాసముదాయముతో హాస్యోక్తులతో విందారగించిరి. పిమ్మట కృష్ణుడు వారందరిని సగౌరవముగ సత్కరించి పంపినాడు.

నరకవధానంతరము స్వర్గమునకేతెచ్చిన కృష్ణుని ఈ రీతిగనే ఇంద్రుడు స్నేహభావముతో పెక్కు మర్యాదలు కావించినాడు. ఇంద్రాణి సత్యభామను

తోడికోడలుగ భావించి ఆదరించినది. ఇంద్రుడు కృష్ణుని కరముపట్టి 'లలితమై నట్టి మత్స్యభాస్థలము చూడరమ్ము శ్రీకృష్ణ దాని చెల్వమ్ము గనుము' (416-2) అని పిలుచుకొని వెళ్ళి అందలి వింతలు చూపినాడు. పిమ్మట ఇంద్ర కృష్ణులు దేవతా సహితముగా భార్యలతోగూడి నందనవనమున పుష్పాపచయ, జలక్రీడాది వినోదములలో ఓలలాడిరి. ఈ సందర్భమున ఇంద్రుడు ప్రవర్తించిన స్నేహ భావము మనోహరము. ఇట్లు సఖ్యమున ఇంద్రుడు తరించినాడు.

## ఆత్మనివేదనము

మధుర భక్తిభరితలైన రాజకన్యలు తమ సర్వస్వమును శ్రీకృష్ణునకు సమర్పించి, ఆత్మనివేదనము కావించినారు.

ఇట్లు నవవిధ భక్తిరీతులతో పాటుగా, ఇందు వాత్సల్య, వైర భక్తిమార్గములు కూడ స్థానమును పొందినవి.

## వాత్సల్యభక్తి

నరసింగకవి దేవమాతయైన అదితిని వాత్సల్య భక్తిపూర్ణగా చిత్రించినాడు. నరకవధానంతరము కృష్ణుడు స్వర్గమునకు వెళ్ళి అదితికి నమస్కరించగా, ఆమె ఆనందపారవశ్యమున తేలియాడినది.

'మ్రొక్కిన నను గాంచి నెమ్మది ముదముబెంచి
శిరము మూర్కొని ముద్దాడి చెక్కునిమిరి
యరయవచ్చితె నన్ను దయాంబురాశి!
నే కృతార్థత నొందితి నీరజాక్ష!
నన్ను గన్న తండ్రి! నాపాలిదైవము!
నా తపఃఫలంబ! నాకుమార!
నేడు నిన్నుగంటి నే ధన్యురాలను
రావెనాదు భాగ్యరాశి! కృష్ణ!' (400-401/2)

అని అదితి పొంగిపోవుటలో ఆమె వాత్సల్యపరవశత వెల్లడి యగుచున్నది.

## వైరభక్తి

నరసింగకవి నరకాసురుని వైరభక్తికి ప్రతీకగా చిత్రించినాడు. పోతన ఆంధ్రమహా భాగవతమందలి హిరణ్యకశిపాది పాత్రలను దృష్టిలో నిడుకొని నరసింగకవి నరకుని పాత్రను తీర్చినాడు విరోధియైన నరకుడు కృష్ణుని నిందించు సందర్భమున కవి వ్యాజస్తుతిని ఆశ్రయించినాడు.

"జలధింజారిన కానన
ముల దూరిన విప్రవేషముల దేరిన రా
కలిమింగేరిన మసరం
జిలమీరిన కలికివగల జేరిననైనన్" (324-2), 'నినుబోనిత్తునే' (325-2)

అని నరకుడు యుద్ధరంగమున కృష్ణుని తూలనాడి నాడు. ఇందు మిక్కిలి సంక్షిప్తముగా, హృద్యముగా దశావతారములు స్తుతింపబడినవి.

'జలధింజారిన' - మత్స్యకూర్మములు, 'కాననముల దూరిన' - వరాహ, నారసింహములు, 'విప్రవేషముల దేరిన' - వామన భార్గవరాములు, 'రాకలి మింగేరిన' - శ్రీరామబలరాములు, 'మసరంజిలమీరిన' - బుద్ధుడు, 'కలికివగల జేరిన' - కల్కి అని ఈ విధముగా దశావతారములు సూచితములు.

యుద్ధరంగమున శత్రువీరులు పరస్పరము యథాలాపముగ నిందించు కొనుటలు సహజము. కాని ఇట నరకుని ఆంతర సంస్కారానుగుణముగా అతని నిందావాక్యములు స్తుతిగర్భితములై వెలసినవి. కృష్ణుని యందు నరకాసురుడు పరాత్పరుని భావించినాడు కావున ఆ మహనీయుని ధర్మసంస్థాపనకరములైన అవతారక్రమమును ఈ విధముగా కీర్తించినాడు. దీనివలన భూపుత్రుని వైర భక్తి స్పష్టమగుచున్నది.

ఇంకను నరసింగకవి తన గ్రంథమున ఆ యా పాత్రల ముఖమున పెక్కు పర్యాయములు కృష్ణుని స్తుతింపజేసినాడు. నారదుడు, ఇంద్రుడు, వంది మాగధులు, గరుడుడు, భూదేవి, అదితి, రాజకన్యలు మొదలగువారి స్తుతులు భక్తిరస భరితములు. వైవిధ్యముతో అయిదు, ఆరు పర్యాయములు దశావ

తారములు కీర్తింపబడినవి. ఈ విధముగా నరసింగకవి 'రాచకన్యకాపరిణయము' భక్తిరస నిధానమై యొప్పియున్నది.

## ఇతర అంగరసములు

నరసింగకవి కథాగమనము ననుసరించి శృంగారము, వీరము, హాస్యము, కరుణము, అద్భుతము మున్నగు రసములను భక్తిరసమునకు అంగములుగా చేసి చెప్పినాడు.

## శృంగారము

మధుర భక్తి శృంగార సమ్మిశ్రితము కావున నరసింగకవి తన గ్రంథమున రెండవ స్థానమును కల్పించినాడు. ఇందు ప్రధానమైనది మోక్షరతికమైన దివ్య శృంగారము కనుక, లౌకిక శృంగారాంగములైన నాయికానాయక పరస్పర సందర్శనాదులందలి కటాక్షభ్రూవిక్షేపాది అను భావములు, స్తంభ ప్రళయాదులైన సాత్త్విక భావములు, నిర్వేదశంకాదులైన వ్యభిచారిభావములు, ఇంకను సంభావ్యములైన చేష్టలు, చంద్రమలయానిలాది ఉద్దీపనములు, నాయికా నాయకుల విరహతాపములు, శీతలోపచారములు, చంద్రమలయానిలాదుల ఉపాలంభములు, కావ్యాంతమున సంభోగశృంగారము మొదలగువానికి 'రాచకన్యకా పరిణయము'న ప్రసక్తి లేదు. అయినను మధురభక్తికి అంగముగా అవసరమైనంత శృంగారమును మాత్రమే కవి చెప్పినాడు.

కృష్ణుని వద్ద నారదముని రాజకన్యల అంగసౌందర్యమును వర్ణించినప్పుడును, రాజకన్యలు పరస్పరము స్వప్నానుభవములెరిగించుకొన్నప్పుడును, రాజకన్యల విరహవేదనలు, మన్మథ పూజ మొదలగువానిని వర్ణించినప్పుడును కవి పరిమితముగా శృంగారమును పోషించినాడు.

నారదుడు కృష్ణునికి రుచి పుట్టునట్లుగా

'ఆరమణీ శిరోమణుల నందర నయ్యరవిందసూతి రా
కారజనీకరప్రభల కంతుని తూపుల కుందనంపు బం
గారముతోడ గూర్చి కరకౌశల మేర్పడదిద్దితీర్చి శృం
గార రసాన్వితాకృతలుగా నొనరించి సృజించెనో కదా' (189-1)

అని రాజకన్యల సౌందర్యవర్ణనను కమ్మగా ప్రారంభించి

'అనెరిగొప్పులా సురుచిరాస్యములా తెలివాలుచూపులా
మేనిమెరుంగు లాబిగువుమిట్ట చనుంగవ లాయొమారముల్
సూనశరున్మరులు గొలుపు చోద్యముగాదది మౌనులైన న
మ్మానినులం గనుంగొనిన మానసముల్ నిలుపంగ నేర్తురే' (190-1)

అని వారి ప్రత్యంగ వర్ణనమును 'నాయకుని మనస్సున నాయికా విషయమై శ్రవణ జనితమైన దర్శన స్పర్శనాదులపై ఆపేక్ష జనించునట్లుగా' వర్ణించినాడు.

* * *

'సొగసుగా చెక్కిళ్ళు చుంబించి చుంబించి
చేరిమోమున మోము చేర్చెనమ్మ' (167-4)

'తరుణీ! కృష్ణుడు నాదుస్వప్నమున నుత్సాహంబుతోవచ్చి నన్
పరిరంభంబొనరించి చుంబనములున్ బల్మారుగావించి నన్
మరుకేళిందనివారదీర్చి మణిదామంబిచ్చి యీరీతి సు
స్థిర సౌఖ్యంబులు సల్పువాని క్రియజేసెన్, లేడుమేల్కాంచినన్'(170-4)

అనియున్న రాజకన్యల సంభాషణలందు వారికి కలిగిన స్వప్న ప్రాప్త సంభోగ సుఖము వర్ణితమగుటవలన అది వారి కృష్ణపరతను స్థాపించుచు వారి మధుర భక్తి పారవశ్యమునకు అంగమై విరాజిల్లినది.

* * *

'కాయజు డిక్షుకార్ముక ముఖంబున ద్రొవ్వెరి తూపులేయ' (203-4) అనుచు రాజకన్యల విరహవేదనల వర్ణించుటలో కవి శృంగార రసోద్దీపకములైన చంద్రమల యానిలాదుల ప్రసక్తి మాత్రమే తెచ్చినాడు.

కృష్ణుడు రాజకన్యలతో సురత క్రీడలందు ఓలలాడినట్లు (279-4) సూచనగా మాత్రమే చివర ఒక్క పద్యమున చెప్పినాడు.

* * *

కృష్ణుడు పారిజాత కుసుమమును రుక్మిణికిచ్చిన విషయము తెలిసి సత్యభామ నిర్వేదము నొందుటలోను, కృష్ణుని సాంత్వన వాక్యములందును ప్రకరణార్హమగునట్లుగా కవి శృంగారమును చెప్పినాడు.

'కృపవిడనాడుచున్ మరుడు ఘేయని పైకొనువేళయందునే' (39-2)
అని సత్యభామ కృష్ణుని ధృష్టతకు కంటగించినప్పుడును,

'అలరు శరంబులున్, జిగురుటాకుల విల్ సుడి డాలుమీలు చి' (73-2)

'కందర్పాతి శమాంతమాగమము తర్క ప్రక్రియం జూచినీ' (81-2)
అని కృష్ణుడు సాంత్వన వాక్యములు పలికినప్పుడును ఉన్న శృంగారము ప్రసంగోచితముగ నున్నది.

నరసింగకవి ఈ రీతిగా నాయికా నాయకులను పురస్కరించుకొనియే గాక ప్రాసంగికముగా పెక్కు ఇతర స్థలము లందును శృంగారమును వర్ణించినాడు. పురసౌధ ప్రాకారముల వర్ణనమందును, పుష్పలావికా వర్ణనమందును, ప్రాకృతికరములైన జరఠాతప సంధ్యా తమిస్రాదుల వర్ణనమందును ఋతు వర్ణనమందును శృంగారమును చెప్పినాడు.

నరసింగకవి ద్వారకాపుర సౌధములను వర్ణించుచు వానియందలి కుడ్య ధావళ్యమును శృంగార బంధురముగా చెప్పినాడు.

'కువలయకాంత కాంతమణి కుడ్యములందు సజీవభూమికా
నివహములోయనంగ రమణీయ మనోభవకేళికా వస
ద్యువయువతీ జనాంగకము లొప్పగ గానగవచ్చు దత్పుర
ప్రివిమల సౌధ సంపదలు బ్రహ్మకునైన నుతింపశక్యమే' (180-1)

చంద్రకాంతోపల నిర్మిత కుడ్యములందు ప్రతిబింబితములైన ప్రేయసీ ప్రియుల సంభోగావస్థలు చలనచిత్రములవలె భాసించువిధముగా నున్నట్టి ఆ సౌధ ధావళ్యమును, అచటి సృష్టికార్య వర్తనలను వర్ణించుటకు సృష్టికర్తయైన పరమేష్ఠికే అసక్తము అనుట చమత్కారజనకముగ నున్నది.

ఇట్లే ద్వారకాపుర సాలౌన్నత్యమును వర్ణించుచు

'ఆ పురి సాలమెన్నదగు నంబర చుంబి శిఖామణిచ్ఛటా
దీప కళా విశేష పరిదీపిత నందన కాననాంతర
శ్రీపకుమారకేళి సుఖసింధు నిమగ్న నిలింప దంపతీ
ద్వాపరకృత్పరస్పర పిధాల విధాన విహీన లీలమై' (109-1)

అని చెప్పుటలో ప్రాకార శిఖర స్థిత మణి దీపకాంతులు నందనోద్యాన పరివ్యాప్తములై అచ్చట తస్కర సురతమందు లీనమైన అమర దంపతుల రహస్యములను భేదించుచున్నవని పేర్కొనబడినది.

పుష్పలావికా వర్ణనమున

'ఇచ్చను బూబంతులే గొనవచ్చితి
ముట్టి చూడనిమ్ము మోహనాంగి!' (119-1)

అన్న పుష్పలావికా విటజనమ్ముల నర్మసంభాషణములు శృంగార రసనిర్భరములై యున్నవి.

'కిరణ శృంగాళిచే నరుణాభికుడు ధరా
కాంతపై జిల్కు వసంతమనగ' (153-2)

అని అరుణ జరఠాతపమును,

'తరుణహరిత్సతీలీలా, పరిచితిచే' (159-2)

అని సంధ్యారాగమును వర్ణించుటలో విటులు తమ వలపుకత్తెలు పట్లను, జారిణులు తమ ఉపపతుల పట్లను ప్రదర్శించు ప్రేమలు, వారికి ఉద్దీపకములగు శృంగారచేష్టలు ప్రకటితమగుచున్నవి.

'ఒకవిటసంకేతమొకకాంత చేరి వే
రొకడౌట గనక మచ్చిక బెనంగు' (166-2)

అని ఈ విధముగా నున్న అంధకార వర్ణనము వేశ్యాపరకీయాదుల సంభోగ శృంగారమునకు పరాకాష్ఠ.

'వెచ్చని తీర్థమాడి నులివెచ్చ పదార్థము లారగించి బల్
పచ్చడముల్ ముసుంగులిడి పైచలిసోకని కమ్మటిండ్లలో
ముచ్చము నింగి యింటిపని ముమ్మరమెల్లనుదీర్చి ప్రక్కకున్
వచ్చిన ప్రౌఢయాంధ్ర కురువంపుడు బల్కుచ సీమాలానుచున్
బచ్చని విల్తుకేళికల బన్నిరి నాస్థల గేస్తుఁజడిన్' (230-4)

అని వర్ష ఋతువును,

'మగల సహింపని మగువలు రాత్రిళ్ళు
దయవారి కౌగిలింతలను వేడ' (237-4)

అని హిమవంత ఋతువును వర్ణించుటలందు సరసముగా దాంపత్య శృంగారము వర్ణితమైనది.

## వీరము

కృష్ణునికి నరకునితోను, ఇంద్రునితోను జరిగిన యుద్ధములందు సంప్రదాయానుసారముగా వీరము వర్ణితమైనది. నరసింగకవి పోతన ఆంధ్రమహాభాగవతానుసారముగా సత్యభామా నరకాసుర యుద్ధమును వీరశృంగార సమ్మిశితమగునట్లుగా వర్ణించినాడు. యుద్ధరంగమున శత్రువీరుల పరస్పర అధిక్షేపణలు, ప్రత్యారోపణలు, చతురంగబలములు, బాణాదుల ప్రయోగములు, కవచ శరాసముల ఛేదనలు, బాణాఘాతములకు మూర్ఛనొందుటలు మొదలైన అంశములు యథాయోగ్యముగా ఇందు వర్ణితము.

## హాస్యము

నరసింగకవి రచనయందు భక్తి రసమునకు అంగముగా శృంగారము తర్వాతి స్థానమును సంపాదించినది హాస్యము. రాచకన్యకా పరిణయమున మూడు పర్యాయములు హాస్యప్రసక్తి ఉన్నది. అందు మొదటగా బలరాముడు ద్వారకా సభాసింహాసనమున కొలువుదీరియున్న సమయమున రైవతకాద్రి సమీపారణ్య స్థితులైన చెంచులు వారి జాత్యుచిత వేషభాషణములతో చూపరులకు వింతగొలుపునట్లుగా వచ్చి బలరాముని దర్శించి, వేటాడ రమ్మని వేడిరి.

అ సమయమందు వారి

'నెమలికెలతురాయి లమరించు తోలుకుళ్ళా
ళ్ళాయిాలమీద జెల్వంబుగాగ'
'పలువన్నె మెకముల బలు చర్మములుగూర్చు
నరచుట్టలంగముల్ దొరగ దొడిగి' (12-3)

అనియున్న వేషములను చూచి సభాసదులు ఆశ్చర్యపడిరి.

ప్రతిదినము మనకు సన్నిహితముగానున్న విషయములుకాక క్రొత్తవి ఏవి వచ్చినను, వానికి వింతపడుట మానవస్వభావము. అ విషయములు సహజములైనవైనను, తాత్కాలికముగనైన తప్పక వింతను కలిగించును. కోతులనాడించుట, ఎలుగుబంట్ల నాడించుటలు సాధారణములైనవైనను చూపరులకు వింత కలిగించి వారిని హృదయము నిండుగా నవ్వింపజేయును. అట్లే ఈ చెంచునాయకుల విచిత్ర వేషధారణ హాస్యజనకముగ నున్నది.

'ఓరి యనుమంత! సీరామ! నారసిమ్మ' (13-3)

అని వారు తమ తమ నామముల బిల్చుకొనుటయందు,

'సామీ! దేవర యాన మీకరకను నిచ్చల్ సెంచుగూడెంబులన్
మేమున్ మా జవరాండ్లు పిల్లలు నేమిన్ సింతయున్‌లేక' (19-3)

అని బలరాముని ప్రార్థించుటయందు ఉన్నవారి అనాగరిక భాషలయాస హాస్యస్ఫోరకముగా ఉన్నది. ఇది వేషభాషాజన్యమైన సాధారణ హాస్యము.

రాజకన్యలకు బలరాముడు విందు విడిన సందర్భమున హాలాపాన జనిత మత్తతతో గూడిన ఆ కన్యల చేష్టాదులు హాస్యరస భరితములు. మధుర భక్తి గర్భితములు.

'మాలూర ఫలములు మర్రిచెట్ల ఫలించె
నీవింత గంటివే యిగురుబోణి!
జంబీరములు బుట్టు నింబతరువుల యందు
నీచోద్యమేమమ్మ యిందువదన!
నేరెడు చెట్లకు నారింజలుదయించె
నీమహత్వంబేమి కోమలాంగి!
ఖర్జూర వృక్షసంఘములందు ద్రాక్షలు
పండుట చిత్రమౌ పంకజాక్షి!

యనుచు మైరేయ పాన సంజనిత మత్త
చిత్త లగుచును దమతమ చేష్టలెల్ల

జూచువారికి వింతలు దోచునట్లు
భ్రాంతి ముచ్చట లాడిరి పణతులెల్ల' (153-3)

అని వర్ణింపబడిన రాజకన్యల ప్రలాపములు స్థూల దృష్టికి ఉన్మత్తాలాపములవలె భాసించినను ప్రగాఢ భక్తిరస సంభరితములు. వెల్లూరు నరసింగకవి సంపూర్ణ మైన అవగాహనతో, అద్భుతమైన సంవిధాన చాతుర్యముతో, సాభిప్రాయ పద ప్రయోగ వైచిత్రితో ధ్వని ప్రధాన మగునట్లుగా ఈ పద్యమును నడిపినాడు. 'రాచకన్యకాపరిణయ' మందలి భక్తిరసమును దర్శింపజేయు మణి దీపిక వంటిది ఈ పద్యము.

రాజకన్యలకు వారి భక్తి పారవశ్యమున, చిత్త సంస్కారవశమున సర్వము కృష్ణ మయముగా కనబడుచున్నది. స్వస్వరూపాను సంధానము కలిగించుటలోను, మోక్షమును కరతలామలకము చేయుటలోను భక్తి నిత్య సులభమైనది. సర్వశ్రేష్ఠమైనది. 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ! స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే॥ (వివేక చూడామణి ఆదిశంకరులు)

'మాలూరఫలములు మర్రిచెట్ల ఫలించె అనుటలో' 'మాలూర ఫలము (మారేడు) విష్ణువునకు ఉపలక్షకము. 'మాలూరశ్రీఫలావపి' అని అమరము. 'మాం లక్ష్మీం లాతీతి వామాలూరః, లాదానే-సంపద నిచ్చునది' అని 'మాలూర' శబ్దమునకు యౌగికార్థము. అనగా లక్ష్మీప్రదుడైన కృష్ణుడని యర్థము. 'మర్రి చెట్టున ఫలించుట' అనగా 'వటపత్రమున శయనించుట' యని యర్థము. వట వృక్షము సమస్త జీవరాశిలో బృహన్మూర్తి కలిగినది. ఇది అనంత విశ్వమునకు ఉపలక్షకము. 'ఆకుచాటు పిందె' అన్నది లోక వ్యవహారము. అనగా ఇచ్చట రాజకన్యలకు వటపత్రశాయియైన బాలగోపాలుడు' దర్శనమిచ్చినాడని భావము.

"జంబీరములు బుట్టు నింబతరువులయందు" అనుటలో 'జంబీరము' (నిమ్మకాయ) విష్ణువునకు ఉపలక్షకము. 'జంబయతి మోహయతీతి జంబీరః - మోహింపజేయునది' అని జంభీర' శబ్దమునకు యౌగికార్థము. అనగా 'లోకము లను మోహింపజేయువాడైన విష్ణువ'ని అర్థము. 'నింబతరువు' (వేపచెట్టు) ఈశ్వరునకు ఉపలక్షకము. 'అరిష్టస్సర్వతో భద్ర హింగునిర్యాసమాలకాః పిచుమందశ్చనింబే' అని అమరము. 'ఆరోగ్యంనయతీతి నింబః-ణీఞ్ ప్రాపణే-

ఆరోగ్యమును పొందించునది' అని యర్థము. దీనికే సర్వతోభద్రమన్న పేరున్నది. 'సర్వతఃభద్రమస్యాస్తీతి సర్వతోభద్రః - అంతట సుఖముగలది'. శివుడు సుఖకరుడు. వేపచెట్టు తాను చేదును భరించి లోకమునకు ఆరోగ్యమును పొందించుచున్నది. శివుడు తాను హాలాహలమును భక్షించి లోకమునకును సుఖకరుడగుచున్నాడు. దీనివలన విష్ణువు ఈశ్వరుని మోహింపజేయుట' సూచితము.

'నేరేడు చెట్లకు నారింజలుదయించె' అనుటలో 'నేరేడుచెట్టు' కృష్ణునకును, నారింజలు గోపికలకును సంకేతములు. నేరేడు నైల్యముతో కూడినది. కనుక కృష్ణుని ధ్వనింపజేయుచున్నది. నారింజలకు 'ఐరావతము' అనియు పేరున్నది. 'ఐరావతో నాగరంగః' అని అమరము. 'ఇరావతి యనగా మెరుపు - దానివలె నైరనైనది' (ఇరావతీ విద్యుత్ సేవరక్తత్వాదైరావతః - గురుబాల ప్రబోధిక) అని యౌగికార్థము. దీనివలన మెరుపుతీగలను బోలిన గోపకాంతలు సూచింపబడినారు. అందమైన కన్యలను 'దబ్బపండు' వంటివారుగా వాడుట ఆధునిక వ్యవహారము. కనుక ఇందు 'గోపికాకృష్ణుల రాసలీల' ధ్వనితము. కృష్ణుడు నేరేడుచెట్టుగా, దానిపై అన్యఫలములైన నారింజలు అనగా గోపికలు చేరినట్లు చెప్పుటలో ఆ గోపికలందరును పరకీయలే అన్న భావము ధ్వనితము.

'ఖర్జూర వృక్ష సంఘములందు ద్రాక్షలుపండుట' అనుటలో 'ఖర్జూరము' దేవతలకు, 'ద్రాక్ష' అమృతమునకు ఉపలక్షకము. 'ఖర్జూరము' అనగా 'రోగమును పోగొట్టునది' (ఖర్జయతిరోగం ఖర్జూరం) అని యౌగికార్థము. రోగమును పోగొట్టునది రోగరహితమైయుండును. దీనివలన 'జరామరణాది రోగరహితులైన దేవతలు' సూచింపబడినారు. 'ద్రాక్ష' అనగా 'దాహాదికమును పోగొట్టునది' (ద్రాతిదాహాదికంద్రాక్షా) దేవతల దాహము అమృతముచేతనే తీరును. దీనివలన 'విష్ణువు మోహినీ వేషమున అమృతాంధసుల కమృత ప్రదానముచేయుట' సూచితము.

రాజకన్యలు 'మైరేయపాన సంజనిత మత్తచిత్తలైనట్లు' చెప్పుటలో వారు 'హృదిస్మృత వేణుగానామృత పాన సంజనితమత్తచిత్త'లని సూచితము. మైరేయ మనగా 'చెరుకు రసముతోచేసిన ఆసవము. 'మైరేయమాసవఃశీధుః' అని అమరము. చెరుకు గడ రూప సామ్యముచేత వేణువునకు ఉపలక్షకము. చెరుకు

నుండి మధురరసము ఉత్పన్నమగును. వేణువునుండి మనోహరమైన గానరసము పుట్టును. అందువలన 'మైరేయమనగా' 'వేణుగానము' అని పరంపరగా అర్థము చెప్పవచ్చును. రాజకన్యలు మరళీగానలాలసలై ఈ తీరున భ్రాంతి ముచ్చట లాడిరి. అందువలననే చూచువారికి వీరి చేష్టలన్నియు మిక్కిలి వింత గొలుపు నట్లుగ తోచినవి.

ఈ రీతిగా నరసింగకవి హాస్యమును భక్తికి అంగముగా తన అమోఘ పదవిన్యాస చాతుర్యముతో నిర్వహించినాడు. ఈ పద్యమునకు వెంటనే తన భావమునకు వ్యాఖ్యానప్రాయముగా

'మానసపూజా విధానక్రియల గృష్ణు
గాంచి సేవించిరి కన్నెలపుడు
హరికీర్తనామృత సరసిజాకరమున
దేలియాడిరి రాజబాలికలును
దేవకీనందన భావి ఫలాప్తి కు
పొంగుచుండిరి రుచిరాంగులెల్ల
జితదితిసుతశౌరి వితత కథల్విని
కొనియాడు చుండిరా వనితలెల్ల

గడియకొక యేడుగా బ్రొద్దుగడుపు చుండు
కామినీమణు లాసవభ్రామికమున
దేహముల చింతకాసంత తెలియలేక
నీలవేణులు హరిమీద జాలిజెంది' (154-3)

అన్న పద్యమును రచించినాడు.

మానసపూజా మగ్నలైన రాజకన్యలకు 'సర్వము విష్ణుమయమైన జగత్తు'గా భాసించుటలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఆదిశంకరులు మానస పూజా విషయమై

'ఆత్మాత్వం, గిరిజామతిః, సహచరాః ప్రాణాః, శరీర గృహం,
పూజాతే విషమోపభోగరచనా, నిద్రాసమాధిః స్థితిః ।
సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాగిరో,
యద్యత్కర కరోమి తత్తదఖిలంశంభో తవారాధనమ్.

అని చెప్పిన అద్వైతస్థితివంటిదే ఈ రాజకన్యల స్థితి.

వీరు ఈ అద్వైతసిద్ధిని పొందినవారై హరిగుణగానామృతచిదానంద సామ్రాజ్యమున ఓలలాడినారు.

'అహం నిర్వికల్పో నిరాకార రూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియణాం
నచాసంగాతంనైవ ముక్తిర్నమేయం'

అని శంకరులు నిర్వాణషట్కమున పేర్కొనిన అద్భుతస్థితిలోనున్నవారు రాజకన్యలు.

వీరు బృందావన గోపకాంతలవలె శ్రీకృష్ణసాయుజ్య ఫలమునకై ఉవ్విళ్ళూరుచుండిరి. అశుభ ఘడియ ఇంకను ఆసన్నముకానందున వారికి కాలము బరువుగాసాగినది. గడియలు (ఇరువది నాలుగు నిముషముల కాలము) సంవత్సరములైనవి, ఆయాలస్యమునందలి అంతర్వేదనను భరించలేనివారై కృష్ణలీలలను స్మరించిరి. ఆసవభ్రామికత వారిని వేదనామగ్నులు కాకుండ కాపాడినది. దీని వలనవారు సంపూర్ణముగా దేహాధ్యాస నుండి పరిముక్తలైరి. హరిమీద జాలి జెందిన వారికి వేణుగానామృత చింతనమే తరణోపాయమైనది. 'నీలవేణులు' అన్నది సాభిప్రాయ ప్రయోగము. 'నీల' ఉజ్జ్వల నీలమణి (కృష్ణుని) 'వేణులు' మురళీగానలాలసలు అన్నది దీని పరమార్థము.

ఈ విధముగా నరసింగకవి హాస్యమును పరమోత్తమమైన మోక్షరతికి హృద్యమైన రీతిలో అంగముగా చేసి చెప్పినాడు.

* * *

కావ్యమున మూడవమారుగా 'సభార్యులై ఇంద్రుడు, కృష్ణుడు సమస్త దేవతా సముదాయముతో నందనవనమున విహరించి నప్పటి దేవకాంతం పుష్పాపచయ క్రీడల' వర్ణనమున సరసమైన హాస్యము వర్ణితము.

' ఒక కాంతామణి పొన్న క్రొవ్విరులు వేగోద్యోగియై చెట్టునుం
చక తాగోసి సఖీలలామగని హాస్యం బొప్పగా నీవు గో
సుక పొమ్మనను నవ్వెనంతటను రాసుల్‌మీరగా బూసె దా
నికి నాశ్చర్యమునొంది మెచ్చి శశిరే యీచోద్యమెందుంగనన్ (27-4)

అని పుష్పదోహదాక్రియలను చెప్పుటలోను-

అందరు సుందరీమణులు పూలుగోయుచుండగా ఒక యింతి పూలుగోయనిచ్ఛ లేక యుండగా తక్కిన ప్రమదాజనము

'పతితులనెందును బట్టరాదంచునో
యీరామ రాలుపండ్లేరదయ్యె
బుష్పిణులను జేరిముట్ట రాదంచునో
పూలతీవం పొంత పోవదతివ
పల్లవ సంగతేర్పడిన కొమ్మలచెంత
జేరరాదని సతి చేరదయ్యె
జండాళులను మైత్రి సలుపరాదని రోసి
క్రొవ్విరుల్ ముట్టంగ గోరదబల

యహహ ! యీయింతి శీలమేమనగ వచ్చు
దాను జంబీర ఫలకుచ, తనులతాంగి
పల్లవాధరి, సూనసంవాసియయ్యు
గేరి తనయంగసముల నెగ్గింపదగునె' (29-4)

'పతితుం నెందును బట్టరాదంచు రాలుపండ్లేరదనుటలో' క్రిందపడిన ఫలము లేరుట లేదనియు, భ్రష్టులను దరిజేర్చ లేదనియును; పుష్పిణులను జేరి ముట్ట రాదని పూలతీవల పొంత పోలేదనుటలో' పూలుకోయుటలేదనియు, రజస్వలలను

తాకకూడదనియును, 'పల్లవసంగతేర్పడిన కొమ్మల చెంత చేరదనుటలో' చిగురులంటుట లేదనియు, విటులపొందిన స్త్రీల (జారిణుల) పొంత పోకూడదనియును; చండాళులను మైత్రి సలుపరాదని రోసినదనుటలో తుమ్మెదలు మూగిన పూవులను ఆదరించుట లేదనియు, అస్పృశ్యుల (తీవ్రమైన విటులు) స్నేహము తగదనియును భావించి ఈమె ఊరకున్నది ఈమె శీలమునేమని పొగడవచ్చును అని చెప్పుచు ఆమెను 'లికుచఫలకుచ' (తనయందే పండ్లున్నవి), 'లతాంగి' (తానేలతవంటి శరీరముకలది) 'పుష్పసువాసిని' (శరీరమాద్యంతము పుష్పదామావాసనతో గుబాళించునది)పల్లవాధరి (తనపెదవే చిగురు)గా నుండియు తన అంగసములను తిరస్కరించవచ్చునా? అని వ్యాజనిందాపూర్వకముగా ఎత్తిపొడిచినట్లు చెప్పుటలోను-

'మాధవీలతలకుమరి పొన్నచెట్లకు
చెలువుగా పెండ్లిండ్లు చేసిచేసి
తపనుల రంభలకుపమ చెలంగగా
గోర్కెతోడుత జెల్మికూర్చికూర్చి
పరమహంసలకును బద్మినీతతులపై
నేర్పుతో మోహంబునెరపి నెరపి
ప్రకటమౌ బ్రహ్మణ్యులకు మన్మథవ్యాప్తి
జిత్తంబులలరగా జేర్చి చేర్చి
తమ చమత్కారములు మహోద్యానమునను
హరియు దేవేంద్రులీచోద్యమరసిచూచి
మెచ్చినుతియించునట్లు సన్మేళముగను
గ్రీడసల్పిరి యచ్చరచేడెలెల్ల' (31-4)

'మాధవీలతలకు మరి పొన్న చెట్లకు పెండ్లి చేసిరి' అనుటలో పొన్నచెట్లకు, పూల గురివెంద తీగలను కూర్చిరనియు- ముగ్ధ కన్నెలను పురుషశ్రేష్ఠులతోడ, కూర్చిరనియును (పొన్న చెట్టుకు పున్నాగమని పేరున్నది. పున్నాగ ఇవపున్నాగః పురుషశ్రేష్ఠునివలె పూజ్యమైనది); 'తపసులకు రంభలకు చెలిమి కూర్చి' రనుటలో అవిసె అరటి చెట్లను జతసేసిరనియు (అరటి తోటలకు వాని ఆకులు

గాలికి చినిగిపోకుండ దానిచుట్టు అవిసె చెట్లను కంచెగా వేయుట ప్రసిద్ధము), మునులకు రంభాద్యప్సరసలకు జతచేసిరనియును; 'పరమహంసలకు పద్మినీ తతులపై మోహము కలుగజేసి' రనుటలో మరాళములకు తామరలపై మక్కువ కలిగించిరనియు, సన్యాసులకు పద్మినీ జాతి స్త్రీలపై మోహము కలిగించిరని యును; బ్రహ్మబ్యులకు మన్మథవ్యాప్తి కలిగించి రనుటలో గంగరావి, వెలగ చెట్లకు జోడు గూర్చిరనియు, వేదపండితులకు మన్మథ బాధ కలిగించిరనియును ఆ దేవ కాంతల క్రీడాచాతుర్యములు అర్థద్వయ యుక్తము గానున్నవి.

అని కవి ఈ విధముగా అచ్చరలేమల క్రీడలను చెప్పుటలోను-
ఉన్న హాస్యము సహృదయరంజకముగా ఉన్నది.

## కరుణము

రాచకన్యకా పరిణయమున నరకపతనానంతరము భూదేవి తన మనుమనితో వచ్చి కృష్ణుని దర్శించి భాషించుటలో కరుణరసభరితముగ నున్నది. పుత్రమరణ దుఃఖితమైన భూదేవి కృష్ణునకు సాష్టాంగ వందనస్తుతులు సలిపి తన పౌత్రుడైన భగదత్తుని చూపి-

'బాలుడు యుష్మత్కృపనను
కూలతవర్తించు బుద్ధికుశలుడుమృదువా
గ్జాలుడు నతరక్షణ! వన
మాలీ! రక్షింపదగిన మాన్యుడు మీకున్'

'కరుణించి నరకదైత్యుని
పురమున కరుదెంచి వాని పుత్రునకును సు
స్థిరముగ బట్టము గట్టియు
విరివిగ ద్వారకకు మీరు వేంచేయదగున్' (349-350/2)

అని దీనముగ ప్రార్థించుటలో కరుణము వర్ణితము.

## అద్భుతము

వెల్లూరు నరసింగకవి ఒక అద్భుతమైన కల్పనగావించి శ్రీకృష్ణుని లోక సమ్మోహనతను చాటినాడు. ఇది కల్పనమాత్రమేకాదు. వాగతీతమైన భావనా ప్రపంచ నిర్మాణము. అనిర్వచనీయానందలోకమునకు గొంపోవు అపురూప సృష్టి. దీనివలన కవిపాఠకుల మనోనేత్రములందు మనోహర సుందర దృశ్య మును నిలిపినాడు.

దేవకాంతలు నందనోద్యానమున దోహదక్రియలచే వృక్షములను పుష్పింపజేయుచుండగా వారిని మేలమాడుచు ఇంద్రుడు ఈ విధముగా అన్నాడు.

'డంబుగా దశదోహళంబుల బుష్పింప
జేయుట తరుణుల చేష్టలదియు
నొక్కొక్క చెట్టున నొక్కొక్కటేగాని
యన్నియు నొకటి చేయంగలేదు
కాంతయొక్కతె వనమంత బూయించెనా
యదెఱగన్మోహిని యనగబరగు
మూడులోకములను జూడుము నిటువంటి
కాంతను నదియు నెక్కడ గలందొ

యనుచు నింద్రుడు వలుక నావనితలోడి
మారుమాటాడలేక తామూరకున్న
నదియుహరిగాంచి నెమ్మదినతిశయించి
మురళి తానుగ్రహించి సమ్మదముబెంచి
గానమొనరించినను గాంచి కడుభ్రమించి
వనము పుష్పించి ఫలియించి వన్నెమించె' (323-4)

ఇంద్రుడు 'దోహదక్రియలతో ఒకొ్కక్కదానితో ఒకొ్కక్క వృక్షమున పూలు పూయించుట సాధారణముగా అందరు స్త్రీలును చేయగలరు. కాని ఒకే దోహద క్రియతో అన్ని వృక్షములను పుష్పింపజేయగల స్త్రీ ఎవరైన ఉన్నదా?' అని

అడిగిన ప్రశ్నకు దేవకాంతలెల్లరు వ్రీడావనతవదనలై తమ అసక్తతను ప్రకటించగా, కృష్ణుడు మురళి గ్రహించి వేణుగానము ఆలపించినాడు. అప్పుడు వనమంతయు పుష్పించినది. ఈ విధముగా కృష్ణ గానమాధుర్యముచేత భూమాత పుష్పించి, ఫలియించి పులకించుటను చూచి దేవతా సముదాయమంతయు పరమాశ్చర్యభరితయై ఆయన మాహాత్మ్యమును వేయినోళ్ళ పొగడినది.

ఈ విధముగా మురళీగానమాధుర్యమునకు 'కడు భ్రమించి, పుష్పించి, ఫలియించి, వన్నెమించిన' వనసౌందర్యము సాధారణ చక్షురింద్రియమునకు గోచరించునదికాదు. ఉత్కృష్టమైన అంతరింద్రియమైన మనస్సుచేత మాత్రమే ఆస్వాదింపదగినది. నరసింగకవి గావించిన ఈ మనోహరకల్పనకు లీలాశుకుడు స్ఫూర్తి నిచ్చియుండవచ్చును.

'లోకానున్మదయన్ శ్రుతీర్ముఖరయన్ క్షోణీరుహాన్ హర్షయన్
శైలాన్విద్రవయన్ మృగాన్ వివశయన్ గోబృందమానందయన్।
గోపాన్ సంభ్రమయన్ మునీన్ముకుళయన్ సప్తస్వరాన్ జృంభయ
న్నోంకారార్థముదీరయన్ విజయతే వంశీనినాదః శిశోః॥'

లీలాశుకుడు శత్రర్థకప్రత్యయమును క్రియలందు అంత్యానుప్రాసగ నొసరించగ నరసింగకవి క్త్వార్థకేకారమును అంత్యానుప్రాసమున అనుసంధించినాడు.

ఈ విధముగా వెల్లూరు నరసింగకవి తన 'రాచకన్యకాపరిణయము'ను భక్తిరసప్రధానముగా తీర్చి, శృంగారహాస్యాదులను దానికి అంగములుగా చేసినాడు.



# 9. ధ్వని దీప్తి

ధ్వనిని సమర్థించుచు ఆనందవర్ధనాచార్యుడు వెలువరించిన వాదము 'ధ్వని సిద్ధాంతము'గా పలువురిచే ఆదరింప బడినది. కావ్యశరీరము, కావ్యాత్మల గురించి ధ్వనికారుడు ఒసగిన అభిప్రాయము వలన శబ్దశక్తికి నూతన ప్రకాశము కలిగినది.

లోకమున పదములకు, అర్థమును బోధించు ఒక శక్తియున్నది. ఇది అభిధ, లక్షణ, వ్యంజన అని మూడు విధములు. వీనివలన పదములకు వాచ్య, లక్ష్య, వ్యంగములనెడు అర్థములు సిద్ధించుచున్నవి.

పదపదార్థ సంబంధమువలన సంకేత బలముతో ఒక పదమును విన్న వెంటనే స్ఫురించు అర్థము వాచ్యార్థము.

ఒక్కొక్కప్పుడు వాచ్యార్థము సందర్భమునకు సరిపడకున్నచో లోకము నందలి రూఢి, ప్రయోజనములను బట్టి దానిని సరిచేయగా వచ్చు అర్థము లక్ష్యార్థము.

సన్నివేశమును బట్టి, చెప్పకపోయినను, వాచ్యార్థము ముగిసిన పిమ్మట వాచ్యార్థాతిశాయిగా స్ఫురించు అన్యార్థము వ్యంగ్యము. దీనినే ధ్వని యందురు.

'స్త్రీల శరీరములందు అవయవముల కంటే వేరైన సహృదయ లోచనామృతమైన లావణ్యము ప్రకాశించునట్లుగా, మహాకవుల వాక్కులందు వాచ్యాతివ్యతిరిక్తమై, సారభూతమై, సహృదయ సంవేద్యమైన అర్థము ప్రకాశించుననియు, దానినే ధ్వని యందురనియు'[1] ఆనందవర్ధనుడు ధ్వని సిద్ధాంతమును ప్రతిపాదించినాడు. ఇది వ్యాకరణ నిఘంటువులను చదివినంత మాత్రమున గోచరింపదు. కావ్యతత్వజ్ఞులకు మాత్రమే గోచరించును.[2]

వాచ్యార్థము ముగిసిన పిమ్మట ప్రకరణాదివశమున తోచునట్టి ఈ వ్యంగ్యార్థము ఒకచో వస్తురూపముగా, ఒకచో అలంకార రూపముగా, ఒకచో రసభావాది రూపముగా నుండును. ఈ త్రివిధమగు వ్యంగ్యార్థ ప్రాధాన్యమును బట్టి కావ్యములు ఉత్తమ మధ్యమాధమములనెడు భేదములతో ఒప్పుచున్నవి. వాచ్యార్థముకన్న వ్యంగ్యార్థము సుందరముగా భాసించినచో ఉత్తమ కావ్యము. వ్యంగ్యార్థముకన్న వాచ్యార్థము సుందరముగా భాసించినచో మధ్యమ కావ్యము. వ్యంగ్యార్థము అస్ఫుటముగా (గూఢముగా) గోచరించినచో అధమకావ్యము. అస్ఫుటమనగా వ్యంగ్యార్థ రహితమనియే అర్థము.

వస్త్వలంకార రస రూపమున నున్న ధ్వనిత్రయమునందు రసధ్వనియే శ్రేష్ఠమైనది. ఇదియే కావ్యాత్మ. వస్త్వలంకార రసధ్వనులు కూడ రసపర్యవసాయులు కావలయునని అభినవగుప్తుని సిద్ధాంతము.

'కావ్యములందలి రసము ధ్వన్యమానము కావలసినదేగాని యెన్నడును వాచ్యము కారాదు' అని లోచనకారుడైన అభినవగుప్తుడు మొదలైన ఆలంకారికుల అభిమతము.[3]

'రస్యతే ఆస్వాద్యతే ఇతి రసః' అను రస శబ్ద వ్యుత్పత్తినిబట్టి రస్యమానత్వము లేక ఆస్వాద్యమానత్వము కలిగిన రస, భావ, రసాభాస, భావాభాస, భావోదయాదులు అన్నియు రసశబ్ద వాచ్యములే. సహృదయ హృదయమున వాసనా రూపముననున్న రసములను విభావాదులు వ్యక్తము సేయును. రసము అభిధామూలకమై వివక్షితాన్యపరరూపమున వ్యక్తమగును. అనగా అన్య (ధ్వని) పరముగా వివక్షింపబడిన వాచ్యముగలదని యర్థము. ఇందు వాచ్యార్థము పొసగినను ధ్వనిపరముగా వివక్షింపబడును. ఆ రసము వ్యంగ్యమగునపుడు 'నూరు తామర రేకులను ఒక సూదితో పొడిచినపుడు క్రమముగా ఒక్కొక్క రేకునకే ఆ సూది గ్రుచ్చుకొనుచు పోయినను, ఒక్క పర్యాయమే అన్ని రేకులను గ్రుచ్చుకొనట్లు తోచినట్లుగా (శతపత్ర పత్రశత భేదనా న్యాయము) వాచ్యార్థ వ్యంగ్యార్థములకు క్రమమున్నను అది సూక్ష్మతమ మగుటవలన గోచరింపదు. దీనిని ఆలంకారికులు అసంలక్ష్య క్రమ వ్యంగ్యముగా పేర్కొన్నారు.[4]

ఒక్కొక్కచో రసాభివ్యక్తిలో వాచ్యవ్యంగ్యముల క్రమము గోచరించి అది సంలక్ష్య క్రమ రూపముననుు ఉండునని అభినవగుప్తుని మతము.5

కావ్యములందున్న రసాలంకార వస్తు రూపకమైన వ్యంగ్యములు పెక్కు భేద ప్రవిభేదములతో ఒప్పుచున్నవి.

వెల్లూరు నరసింగకవి 'రాచకన్యకాపరిణయ' గ్రంథమును యథాశక్తిగా ధ్వనిమంతము గావించ యత్నించినాడు. కావ్యావతారికయందు తన గ్రంథ మందలి ప్రధానరస విషయమై వాచ్యముగ చెప్పలేదు. కాని సూచించినాడు. ఈయన వ్యంగ్యార్థ కల్పనా దక్షత తన కావ్యమందలి 'రసము'ను స్ఫురింప జేయుటతో ప్రారంభమగును. ఇందు కవి పోషించినది మధురభక్తి. దీనిని ఆయన కొందరు కవులు పేర్కొన్న విధముగా 'నా రచియింపబూనిన మధుర భక్తి రసప్రధాన ప్రబంధమునకు' అన్నట్లుగా వాచ్యముగా చెప్పలేదు. 'మధుర భక్తి' అన్న అనుమేయార్థద్యోతకమైన 'సరస రసము' అన్న పదముచే అభిధామూలకమైన వివక్షిత అన్యపర వాచ్యరూపముగా ప్రతీయమానము కావించి నాడు. ('సరసరససమనితాతి చమత్కృతి' (4-1)). దీనికి 'సరసమైనరసము' అన్నది సామాన్యముగా సిద్ధించు వాచ్యార్థము. అన్నియును సరసమైనరసములే. వానిలో ఇది ఏది అన్న ప్రశ్న ఉదయించును. 'సరస' శబ్దమునకు 'మధురము' అన్నది సమానార్థము. అప్పుడు 'మధురరసము' అన్న అర్థము సిద్ధించును. మాధుర్య గర్భితమైనది భక్తి. అందువలన 'మధురభక్తి' అన్న వ్యంగ్యార్థము సిద్ధించును. ఇది అర్థశక్తి మూలము. సంలక్ష్యక్రమము.

'రాచకన్యకాపరిణయమున' ధ్వని (వ్యంగ్యము) రస, వస్తు రూపముల ద్యోతకమగుచున్నది. అందు రసధ్వని-ప్రకరణ గతముగ, వాక్యగతముగ, శబ్దైకదేశగతముగ (సమాస,వచనగతముగ), రచనాగతముగను (వక్తృబోద్ధవ్య ప్రకరణాదులనుబట్టి తెలియగలది), వస్తుధ్వని-పద, వాక్యగతముగను స్ఫురించు చున్నవి.

# రసధ్వని

## 1. భక్తిరస పర్యవసాయి

కావ్యారంభము నుండియే భక్తిరసపరమైన ధ్వని స్ఫురించుచున్నది. ఇందు వర్ణితములైన శృంగారము, హాస్యము, అద్భుతము మొదలైన రసములు అంగభూతములై భక్తిరసమునకు ప్రోద్బలకములగుచున్నవి. ప్రబంధాంగము లైన వర్ణనలును శుద్ధ వర్ణనలు కాక భక్తి రస పర్యవసాయులుగా ఉన్నవి.

'విగ్రహ జాగ్రదుగ్రభుజ వీర్యముచే నరకున్వధించి' (187-1)

అని ఈ విధముగా కృష్ణునికి నారదుని ద్వారా పంపిన సందేశమున నాయికలకు నాయకుని పట్ల గల సంభోగాభిలాష వాచ్యరూపముగ వెల్లడియగుచున్నది. 'తత్ర సంభోగ విషయక ఇచ్ఛా విశేషోరతిః' (సంభోగ విషయమైన కోరికయే రతి) అని యున్నందువలన శృంగార సంబంధమైన స్త్రీపురుషుల రతి ఇందు వ్యక్తము. ఇది లౌకికము. ఈ వాచ్యార్థము ముగిసిన పిమ్మట ఈ పద్యమందలి 'వీర్య, నరక, నీవిగ్రహణాని' శబ్ద పరికరమంతయు 'రాజకన్యలు కృష్ణునితో లౌకిక మైన తాత్కాలికానందదాయకమైన సంభోగేచ్ఛ కలవారు కాదని, వారతనినుండి శాశ్వతానంద సంధాయకమైన విష్ణుసాయుజ్యమును కోరుచున్నారు' అన్న వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది. ఇచ్చట ఇది శబ్ద శక్తి మూలకము. 'వీర్యాది' శబ్దములకు బదులు వాని సమానార్థకములను ప్రయోగించిన ఈ అర్థము, ఈ బిగువు సిద్ధించవు. ఇది శబ్ద పరివృత్తిని సహించదు. ఇందలి వ్యంగ్యము వివక్షితాన్యపరరూపముగా సిద్ధించినది. 'నీవిగ్రహణము' మొదలైన శబ్దము లందు 'పోకముడి విప్పుట, చెరను విడిపించుట, సంసార దుఃఖ ప్రశమనము గావించుట' అన్న అర్థములు ఒకదాని పిదప ఒకటి సంలక్ష్య క్రమము సిద్ధించి నవి. ముందు పదగతమై', పిమ్మట 'వాక్యగతము'గా పరిణమించినది.

* * *

కావ్యములందు ధ్వనికొన్ని సార్లు ప్రకరణ గతముగా ద్యోతకమగును. 'ప్రకరణ గతముగ' అనగా ఒక్క పదముననో, వాక్యముననో ఒక్క పద్యముననే ఉండక అనేక పద్యముల సార రూపముగా ఒక ప్రకరణము ఆధారముగా స్ఫురించునట్టి ధ్వని అని అర్థము. పూర్వ పూర్వ పద్యములందు బీజరూపమున

మున్న కవి భావన ఉత్తరోత్తర పద్యములందు కొనసాగి ప్రకరణాంతమున స్పష్టమైన రూపు సంతరించుకొని సుందరముగా బహిర్గతమగును. ఇది కుంతకుని మతమున చెప్పబడిన 'ప్రకరణ వక్రత'వంటిది (రసాననుకూలముగా నున్న కథావస్తువును రసోచితముగా మార్చుట). ఇది హఠాత్సంభూతము కాదు. దీనికి అవసరమైన 'పూర్వరంగము'ను కవి తన అద్భుతమైన సంవిధాన చాతుర్యముతో రచనా ప్రణాళికయందు నిబంధించుకొనును.

వెల్లూరు నరసింగకవి 'బలరాముని' పాత్రను ఈవిధముగనే వినియోగించుకొన్నాడు. 'నరకాసుర బంధవిముక్తులైన పదునారు వేలమంది రాజకన్యలను శ్రీకృష్ణుడు వివాహమాడు' వృత్తాంతమున భాగవత హరివంశాది గ్రంథములందు 'బలరామునికి' ఏవిధమైన ప్రాధాన్యములేదు. అట్టిది నరసింగకవి తన కథలో బలరాముని పాత్రకు ప్రాధాన్యమును కలిగించి, కథలో తనకిష్టమైన మలుపును సాధించి ఔచిత్యమును పోషించినాడు. కృష్ణప్రేషితలైన రాజకన్యలు ద్వారకానగరమున స్వర్గమునుండి కృష్ణుడు వచ్చువరకు, అధికారగౌరవములతో నుండుటకు తగిన పరిస్థితిని కల్పించుటకై నరసింగకవి బలరాముని పాత్రను ప్రవేశపెట్టినాడు. 'బలరాముడు వేటకై రైవతకాద్రి సమీపారణ్యమునకు వెళ్ళినట్లు కల్పించి, కృష్ణుడు పంపగా ద్వారకానగరమునకు ఏతెంచుచుండిన రాజకన్యలకు మార్గ మధ్యముననే అతనితో అప్రయత్నముగ సమాగమము కలిగినట్లు చెప్పినాడు. బలరాముడు వారి వృత్తాంతమును తెలిసికొని మహానందముచెంది, కృష్ణపరిగ్రాహ్యలైన ఆ రాజకన్యలకు సకల సదుపాయములు కలిగించినాడు. దుష్టదానవునిచే చెరపట్టబడి, శీలవిషయమై అనుమానమునకు తానొసంగునట్టి ప్రాగ్జ్యోతిషమునుండి విచ్చేసిన పదునారువేలమంది రాజకన్యలు కృష్ణాగమన పర్యంతము ద్వారకలో ప్రజల అపవాదములకు గురికాక జీవింపగలుగుట కష్టము. నరసింగకవి బలరాముని పాత్రకు ప్రాధాన్యమును కల్పించుటద్వారా ఈ సమస్యను పరిష్కరించినాడు. ఈ సన్నివేశము ప్రాతిపదికగా నరసింగకవి రాజకన్యల 'మధురభక్తి'ని ఆవిష్కరించుటకు చక్కని అవకాశమును కల్పించుకొని, ఉత్తరకథను నడిపినాడు.

బలరాముడిచ్చిన విందు సందర్భముగా వారుణిని సేవించిన రాజకన్యల ప్రమత్తతతో గూడిన చేష్టాదులు హాస్యరసభరితములైన ఉన్మత్తాలాపములవలె

కనబడినను ప్రగాఢభక్తిరస నిర్భరములు. నరసింగకవి ఈ ఘట్టమును జాగ్రత్తగా నడిపినాడు.

"మాలూర ఫలములు మర్రిచెట్ల ఫలించె
నీ వింతగంటివే యిగురుబోడి !
.............................
జూచువారికి వింతలు దోచునట్లు
భ్రాంతిముచ్చటలాడిరి పణతులెల్ల" (153-3)

అన్న ఈ పద్యమున వాచ్యార్థము సాధారణమైనదే. త్రాగినమత్తులో నున్నవారికి మర్రిచెట్లపై - మారడికాయలు, వేపచెట్లకు - నిమ్మకాయలు, నేరేడుచెట్లకు - నారింజకాయలు, ఖర్జూర వృక్షములకు-ద్రాక్షలు పండినట్లు కనబడుట సహజమే. మారడికాయలు మర్రిచెట్లపై ఎట్లుకాయును? అన్న విధముగా ఇక్కడ ముఖ్యార్థ బాధ వున్నను మద్యపానమత్తత రాజకన్యలకు ఆ విధముగా తోపింపజేసినది అని చెప్పినచో వాచ్యార్థము సరిపోవును.

కాని ఇందు వాచ్యార్థవ్యతిరిక్తమైన మనోహరమైన అర్థాంతము స్ఫురించుచున్నది. 'కృష్ణపరాధీన మానసలైన రాజకన్యలకు సర్వము కృష్ణ (విష్ణు) మయముగా కనబడుచున్నది' అన్నది ఇందలి వ్యంగ్యార్థము. వారి యందు ఈ విధమైన అంతర సంస్కారమున్నట్లు నరసింగకవి ఆదినుండియు ప్రోది చేసినాడు. కృష్ణునికి రాజకన్యలు సందేశమును పంపిన విషయమును చెప్పినపుడు ఈ విషయము స్పష్టము చేయబడినది.

ద్వారకానగరమునకు బయలుదేరిన రాజకన్యలు.

"బావగారగు బలదేవుని దర్శనం
బెట్లబ్బునో మాకు నింపుమీర
ద్వారకానగర నివాసులమై యునిక
యెన్నటికబ్బునో సన్నుతముగ
వసతిగా దేవకీవసుదేవులకు బూజ
గావించుటెన్నడో కౌశలమున
వాసుదేవుడు వివాహంబునను మమ్ము
జేబట్టుటెన్నడో సిరులు మెరయ

ననుచు పదియారువేవురు నంగనలును
జింతచే రేబగళ్ళు నాశించియుండ
వారి భాగ్యంబు ఫలించు వలను పగిది
బలుడు పిలిపించె వారివైభవముమెరయ' (123-3)

అని తలచుచుండగా వారికి బలరామునికలయిక, ఆదరణ, విందులు, మద్యపానములు లభించినవి. కాని మద్యపానమునందలి మత్తువారికి తాత్కాలికముగ నైనను కృష్ణవియోగ దుఃఖమును ఉపశమింప జేయలేకపోయినది. వారిహృదయాంతరములందు నిర్భరముగానున్న శ్రీకృష్ణరతి (భగవద్రతి)కి వారుణి అడ్డుకట్ట కాలేకపోయినది. కనుకనే వారి ప్రలాపములు సర్వమున విష్ణువును దర్శించగలిగిన వారికి అనుభావములైనవి.

రాజకన్యలు దర్శించినది 'మాలూర ఫలమును కాదు-మద్రిచెట్లను కాదు'. 'మాలూరము (మారడి) బాలముకుందుడుకాగా, ఆ వటపత్రశాయిని' వారు దర్శించినారు. బహువచన సామర్థ్యముచేత ఒక్కచోటనే అట్లు కనబడుటలేదు, వారికి అంతట అట్లే కనబడుచున్నది. ఇట్లే మిగిలిన చోట్లను గ్రాహ్యము. నింబతరువు (వేపచెట్టు) ఈశ్వరుడు కాగా, ఆయనను మోహింపజేసిన విష్ణువు- నిమ్మపండు. ఇందు 'ఈశ్వరుడు జగన్మోహినికి భ్రమయుట' ధ్వనితము. నేరేడుచెట్లు కృష్ణులు కాగా, నారింజలు గోపికలు. ఇందు 'రాసక్రీడధ్వనితము. ఖర్జూర వృక్షములు దేవతలు కాగా, ద్రాక్షలు అమృతము. విష్ణుదేవతలకు అమృత ప్రధానము గావించుట' ధ్వనితము. మైరేయము వేణుగానము కాగా, రాజకన్యలు వేణుగానామృతమత్త చిత్తలయినారుకాని మద్యపానమత్త చిత్తలు కాదన్నది ధ్వని.'

ఇక్కడ ధ్వని అభిదామూలకమై వివక్షితాన్యపర రూపముగా సంలక్ష్యక్రమమున శబ్దశక్తిచేత సిద్ధించినది. మారేడు-విష్ణువు, నింబతరువు-ఈశ్వరుడు, జంబీరము-విష్ణువు అని ఈ విధముగా చెప్పుకొనుటలో లక్షణామూలకతయు భాసించుచున్నది.

'మానసపూజా విధానమగ్నలైన' (154-3) రాజకన్యలకు ఈ విధముగా సర్వము విష్ణుమయముగా భాసించుటలో విప్రతిపత్తిలేదు. వారు హరికీర్తనామృత

సరసిజాకరమున తేలియాడినవారు. విష్ణువు లీలలను పునఃపునః మననము చేసి కొనుచున్నవారు. నందనందనుని వలన లభింపబోవు సాయుజ్య సామ్రాజ్య భోగమునకై గడియలు సంవత్సరములుగా కాలమును బరువుగా నెట్టుచున్న వారు. అట్టి వారికి దేహముల చింత కాసంత తెలియలేకుండజేసినది వారి వేణు గాన లాలసత. ఈ విషయమును ధ్వనింపజేయునట్లుగ కవి రాజకన్యలను 'నీలవేణులు' అన్నాడు. ఈ సమాసమునకు 'నల్లని జడ కలవారు' అన్నది సాధారణమైన విగ్రహవాక్యము. కాని కవి అభిప్రాయము అదికాదు. దీనిని 'పరికరాంకురము'గా ప్రయోగించినాడు. 'నీల' ఉజ్జ్వల నీలమణియైన కృష్ణుని యొక్క, వేణులు వేణుగాన పరవశలు అన్నది నరసింగకవి హృదయము. ఈ విధమైన ధ్వని పఠితలను బ్రహ్మానంద పరవశులను గావించు ననుట సత్యము. ఇది కూడ వివక్షితాన్యపరరూపముగా సమాసగతమై సంలక్ష్యక్రమ మున శబ్దశక్తిచేత సిద్ధించినది.

ఇట్లు రాజకన్యలు కృష్ణచింతనమున ప్రొద్దుపోవువరకు తేలియాడి, నిద్రించి, అందు కృష్ణసంభోగ సౌఖ్యము కలిగినట్లుగా తమ స్వప్నవృత్తాంతము లను పరస్పరము చెప్పుకొనిరి. ఇవన్నియు వారి భక్తిపారవశ్యమును ధ్వనింప జేయుచున్నవి.

నరసింగకవి ఈ రీతిగా బలరాముని పాత్రమూలకముగా రాజకన్యల మద్యపానము, స్వాప్నిక సంభోగ సుఖములు మొదలగువానిని వర్ణించుటకు అవకాశమును కల్పించుకొని, వానిని రసపర్యవసాయులుగా కావించి ప్రకరణాం తర్గత రసధ్వనిని స్ఫురింపజేసినాడు.

పురవర్ణన ప్రబంధములందలి అష్టాదశవర్ణనలందు ఒకటి. వర్ణనలు కూడ రసమును ధ్వనింపజేయునవిగా ఉండవలయును. నరసింగకవి పురవర్ణ నాంగమైన ప్రాకారమును వర్ణించుచు దానిని విష్ణుతత్త్వ ప్రతి బోధకముగాచేసి, భక్తికి అంగముగా భాసింపజేసినాడు.

'అత్యున్నతాకృతియగు త్రివిక్రమ లీల
నంబలీంద్రునిమీద నడుగుమోపి

ప్రతిపక్షజేతయౌ పరశురాముని మాడ్కి-
పరరాజహంస సంస్పర్ధ నొంది
బలవంతుడగు రామభద్రుని కైవడి
మత్తఖరాసురోద్వృత్తినణచి
సకలలోకైక రక్షకుడైన హరిజాడ
సాగరమధ్యవాసంబుగాంచి
సంతత నిజాంతరాళ నిశాంత ఖేల
దాశరాంతక భవ్యదివ్యావతార
లక్షణ నితాంత వైభవాలంకరణము
ద్వారకాపురి వరణ మిద్ధరణి వెలయుః (110-1)

ఇది ద్వారకానగర ప్రాకారవర్ణనము. 'శత్రుదుర్భేద్యముగ నుండుటయే' ప్రాకారము యొక్క ప్రయోజనము. అది ఇందలి వాచ్యార్థము.

ఇందు వస్తు ధ్వని, రసధ్వనులు రెండును ప్రతీయమానములు. వరణము 'బలీంద్రునిపై అడుగుమోపినది' అనుటలో 'గట్టి పునాదులు గలది' అన్నది వ్యంగ్యము. 'ప్రతిపక్షజేతయౌ పరశురాముని మాడ్కి- పరరాజహంససంస్పర్ధ నొందినది' అనుటలో 'శత్రురాజులు తమ చతురంగబలములతో సాధింపలేనిది' అన్నది వ్యంగ్యము. 'బలవంతుడగు రామభద్రుని కైవడి మత్తఖరాసురోద్వృత్తిని' అణచినది అనుటలో 'రాక్షసులు తమమాయలతోజేర శక్యముకాని'దన్నది వ్యంగ్యము. 'సకలలోకైక రక్షకుడైన హరిజాడ సాగరమధ్యవాసంబుగాంచిన' దనుటలో 'జలదుర్గమై శత్రుదుర్భేద్యమైనద'ని వ్యంగ్యము. అర్థాంతర సంక్రమిత రూపమై వాక్యగతముగా సిద్ధించిన అలంకారకృత వస్తు ధ్వని ఇది.

ఈ పద్యమునందలి వ్యంగ్య ప్రతీతి ఇంతటితో ముగియలేదు. ఉపమాన బలిమిచే విష్ణుమూర్తి దివ్యతత్త్వమును ఇది ధ్వనింపజేయుచు కావ్యమునందలి భక్తిరస పర్యవసాయి యగుచున్నది.

ఈ వరణము (ప్రాకారము) సాధారణమైనదికాదు. భూసంబంధమైన మానవుని విషయసుఖములనెడు అజ్ఞానావరణము. దీనిని ఛేదించనిది (దాటనిది)

మోక్షదాయకపురియైన ద్వారకానగరవాసము లభ్యముకాదు. దాని సాధనా మార్గమే ఇందు ధ్వనితము.

అవతారదశకమున కృష్ణా (బలరామా)వతారముకన్న ముందున్న మానవ రూపధారకములైన అవతారములు మూడు. ఇప్పుడు, కృష్ణుడు. కృష్ణుడే, హరి. 'వరణము' ఈ నాలుగిటిని పోలియున్నదనుటలో, 'త్రివిక్రముడు-బలి' అన్న పదములు 'బలిచక్రవర్తివలె ఆత్మనివేదనమున త్రిలోకవ్యాప్తియైన విష్ణువును పొందవలయుననియు', 'పరశురామ-రాజహంస' అన్న పదములు- 'పరాన్ శృణాతీతి పరశుః' (శత్రువులను హింసించునది పరశువు) 'రమయతి మోదయతి రామః' (రమింపజేయువాడు రాముడు) అన్న వ్యుత్పత్తులున్నందున 'మానవులు తమ శత్రువులను అనగా అంతశ్శత్రువులైన అరిషడ్వర్గమును నిర్మూలించుటకై పరశురామునివలె రాజహంసలను అనగా ఉత్తములైన మునిపుంగవులను (హంసశబ్దము యోగీశ్వరుని, రాజశబ్దము శ్రేష్ఠతార్థమును బోధించును) మీరునట్టి భక్తి జ్ఞానములు కలిగియుండవలయుననియు', 'రామభద్రుడు - మత్తఖరాసురోద్వృత్తి' అన్న పదములు, అసుర - 'న విద్యతే సురా యేషాంతే' (అమృతములేనివారు) అన్న వ్యుత్పత్తిచేత 'మృత్యువుకలవారు' అన్న అర్థము సిద్ధించును. మృత్యువుకలవారికి పునర్జన్మసిద్ధము. 'మత్తఖరాసురోద్వృత్తి' అనగా 'తీవ్రమైన మత్తత కలిగించునట్టి జన్మమరణాది భూయిష్ఠమైన ఇహలోకాతిశయము' అన్నది స్ఫురించును. 'దానిని అణచుటకై కళ్యాణకారకుడైన ఆత్మారాముని (రామభద్రుని) సేవించవలయుననియు', 'హరి - సాగరమధ్యవాసత' అన్న పదములు 'తమో హరతీతి హరిః' (చీకటిని పోగొట్టువాడు) అని వ్యుత్పత్తి. అనగా 'అజ్ఞానాంధకారమును పోగొట్టి శాశ్వతానంద సంధాయకుడైన హరి సాగరమధ్యవాసి యగుటవలన, బాహుబలిమిచే సముద్రతరణము ఎంత కష్టమో, అట్లే మనోబలిమితోగూడిన భక్తితో సర్వసమర్పణము చేయుటద్వారా ఆ పరమాత్ముని పొందవలయుననియు' ధ్వన్యర్థములు నిష్పన్నములగుచున్నవి. ఈ వ్యంగార్థములన్నియు ఇట శబ్ద పరివృత్తిని సహించవు. అందువలన ఇవి శబ్దశక్తిమూలకములు. ఇవి వివక్షితాన్యపరరూపమున సంలక్ష్యక్రమముచే సిద్ధించినవి.

ద్వారకానగర వర్ణనమున (124-1) ద్వారక వైకుంఠమని, కృష్ణుడు శ్రీమన్నారాయణుడని ధ్వని.

పుష్పదోహద ప్రసక్తి సందర్భమున (333-4) కృష్ణుని జగన్మోహనత ధ్వనితము.

నరకుడు కృష్ణుని నిందించుటలో (324-2) దశావతార కీర్తనము ధ్వని.

## 2. శృంగార రస పర్యవసాయి

రాచకన్యకాపరిణయమున శృంగారము భక్తిరసమునకు అంగభూతముగ నున్నది. అందువలన నరసింగకవి సంభోగ శృంగారమును చెప్పలేదు. విప్రలంభ శృంగారము, శృంగార రసాభాసము, శృంగార రసభ్రాంతి వంటి వానినే చెప్పినాడు.

## విప్రలంభ శృంగారము

కావ్యములందలి రసము వాచ్యముకాక వ్యంగ్యరూపముననే ప్రతీయమానమై, ఆస్వాద్యమానము కావలయును.

కృష్ణుడు రుక్మిణికి పారిజాత కుసుమ మివ్వగా, ఆ విషయము తెలిసి సత్యభామ ఈర్ష్యామానభరితయై కోపాగారమును చేరినది. అప్పుడు కృష్ణుడు ఆమెను సాంత్వనపరచుటకై పలికిన పలుకులు (69-88/2), సత్య కృష్ణుని నిందించుట, విలపించుట (90-107/2) లందు ప్రబంధగతమైన రసధ్వని యున్నది. ఇక్కడ ఇది వాచ్యార్థము తోడనే స్ఫురించును. అందువలన అసంలక్ష్య క్రమము.

ఈర్ష్య చెందిన నాయికను సామదాన నమస్కారాదులచే నాయకుడు ప్రసన్నురాలిని చేసికొనవలసినదేగాని దండమును ప్రయోగింపరాదు.

సత్యభామ వియోగమును భరింపలేని కృష్ణుడు

'అలరు శరంబులున్, జిగురుటాకుల విల్సుడి, తాలుమీలు; చి
ల్కల బలముల్ తరంగములుగా నల! పున్నమ చందమామ రా

కలుష విజృంభవృత్తిగం కంతుమహాంబుధినెట్లుదాటు దీ
వలిగి యొకింత నాయెడ ఘృణాయత నావయుగాకయుండినన్' (73-2)

అని బాధపడినాడు. ఇందు మదనోద్దీపకములైన పుష్ప, పల్లవాదులు పేర్కొన బడినవి. ఇవన్నియు 'మన్మథుడనెడు సముద్రము' అన్న ప్రధాన రూపకమునకు అంగములైనవి. 'అల' అన్నది విరహబాధాధిక్యమును ధ్వనించుచున్నది.

'పెదవి సుధారజంబిడక, బింకము మీరగ గౌగిలింప కిం
పొదవ రతిక్రియల్ సలుపకూరక యుండిన నీకె దోసమౌ
మదన శరాళికిన్ బెదరిమాటికి జొచ్చిన నన్ను నిట్లనీ
వదయత జూడనాయమగునా? కమలాయతపత్రలోచనా!' (75-2)

'కందర్పాతి శయాంత మాగమము తర్క-ప్రక్రియం జూచి నీ
సౌందర్యద్యుతిమీద దృష్టిమిగులన్ సంధించి యామీద త్వ
న్మందాలాప సుధారసానుభవ సామ్రాజ్యంబునందేలి 'యా
నందో బ్రహ్మము'గా మదిందలంతు గాంతా! తావకాశ్లేషమున్' (81-2)

అని ఈ విధముగానున్న కృష్ణుని సాంత్వనవాక్యములందు ఆయన విరహ-తీవ్రత, మన్మథ వేదాంతమున ఆనందో బ్రహ్మమనెడు ఉపనిషద్వాక్యమును శృంగారపరకము వ్యాఖ్యానించుటయందు కృష్ణుని భావావేశములు ధ్వనితములు. ఇట్లెన్ని విధములుగ బ్రతిమిలాడినను కనికరించని ఆమె పాదములపై బడ యత్నించినాడు. 'దాసరితప్పు దండమున తప్పును' గదాయని తన దోసముల శమియింపుమన్నాడు. అప్పుడు సత్యభామ పలువిధముల కృష్ణుని నిందించినది.

'కల్లలు, ముళ్ళమాటలు, మొగంబున నిచ్చకముల్ మరుంగునన్
ఝుల్లకవాక్యముల్ బహుసచోద్యము లిచ్చట, నందురుక్మిణీ
పల్లవపాణితో సరసభాషలు, ప్రేమలు నీకవశ్యముల్
పల్లవకామినీ హృదయ వారిజనందన! నేనెరుంగనే' (92-2)

'పోడియొకింతలేని వలపుల్ వచరించగరామకృష్ణ! నీ
జాడలుజూడ రుక్మిణి కౌసంగిన వేలుపుపూవుతావినా

మేడకుదెచ్చి యాపెయశమే వెలయింపుచునన్ను సారెకున్
గోడిగమున్ ఘటించుకొరకున్ భవదాగమనంబు గన్పడెన్' (98-2)

ఒక ఈర్ష్యామానినియైన నాయిక ధృష్టనాయకుని నిందించుటలోని సహజత్వము ఇందు ఉట్టిపడుచున్నది. ఇట్లెన్ని విధముల విలపించినను సత్యభామకు హృదయారాటము తగ్గలేదు. ఇట్టి పరిస్థితులందు బాధానివారణమునకై ఆడువారికి దైవదత్తమైన వజ్రాయుధము 'కంటతడి'.

'ఇటు హరినిదూరి మది న
క్కుటిలాలక కోపవహ్ని కుదురుప లేకా
రటపడి మారుంబల్కన్
దిటమింతయులేక నినుమడించినజాలిన్' (108-2)

కృష్ణునికి ఎక్కడ దెబ్బకొట్టిన లొంగునో సత్యభామకు తెలియును. అందువలననే తన మాటలతో అతని ధృష్టత అతనికి బోధపడి చిత్తము ద్రవించు స్థితికి తీసికొని వెళ్ళినది. ఇప్పుడు దెబ్బకొట్టినది. ఇనుము బాగుగా కాలిననే గాని సమ్మెట వ్రేటునకు లొంగదు. ఇక్కడ సత్యభామ 'కుటిలాలక' యగుట సాభిప్రాయము. ఆమె కౌటిల్యము నైపుణ్యము రూపమున బహిర్గతమైనది. ఇక బ్రహ్మాస్త్రమును ప్రయోగించినది.

'తామసమోపలేక మదిధైర్యముప్రీల ముసుంగుకొంగు నె
మ్మోమున మాటుచేసుకొని మోహనరాగ కలస్వనంబుతో
గోమలియేడ్చెనప్డు యదుకుంజరుకున్ మదిజాలి బుట్టగా
సామజ కుంభసన్నిభ కుచస్థలినశ్రులు జాలువారగన్' (109-2)

ఆ మోహనరాగాలాపవిలాపమునకు కృష్ణుడు తత్తరపడినాడు. 'అంగనను అక్కున జేర్చినాడు. జాళువాదుప్పటికొంగుతో కన్నీరొత్తినాడు. ఆ ముదంబొప్ప శిరము దువ్వినాడు. ఘనసమ్మదాబ్ధిలోతెప్పల దేల్చినాడు. తియ్యదనముతోప ఇట్లని పల్కినాడు' (110-2)

'అండజయాన! నా మదికి నద్భుతమయ్యెను మున్ను నెన్నది
ట్లుండవు పుష్పమాత్రమునకో వినుమెంతటికైన నీకునే
నుండగ జింత నీపగిది నొందగ జెల్లునె పోయితెత్తునా
ఖండలునైన గెల్చి త్వరగా సురభూజమదెంత కార్యమే?' (111-2)

'తెచ్చి యుష్మద్గృహారామదేశమధ్య
మున ప్రతిష్ఠించి నీమనమునకు ప్రీతి
సేయుదును నీవుకడు చింతసేయవలదు
చారుగుణ ధామ! నమ్మమీ సత్యభామ! (112-2)

దీనితో ఆమె కృతకార్య అయినది. ఆమె అలక, నిందాలాపములు సత్ఫలము నిచ్చినవి. అమాయకురాలైన రుక్మిణి, అదియు ఆమెనై పుణ్యము వలనగాదు- నారదముని దయాలబ్ధమైన కన్నుసన్న చేత, ఒక్క పారిజాతకుసుమమునే పొందినది. ఆమె భోగమునకు స్పర్థించిన సత్య తన స్వశక్తిచే పారిజాత వృక్షమునే సంపాదించినది. ప్రణయవీర రసాధిదేవత అయినది. ఆమె ఈ విజయము రాబోవు నరకాసుర సంగర విజయమునకు నాంది పలికినది.

నరసింగకవి ఈ విధముగా ఈఘట్టమును అత్యంత మనోహరముగా నిర్వహించి శృంగార రసావిష్కారము కావించి, కావ్యాత్మయైన రసధ్వనికి పట్టము కట్టినాడు.

* * *

'ఆరమణీ శిరోమణుల నందర నయ్యరవింద సూతి రా
కారజనీకర ప్రభల, కంతుని తూపుల, కుందనంపు బం
గారము తోడగూర్చి కర కౌశలమేర్పడ దిద్ది తీర్చి శృం
గార రసాన్వితాకృతలుగా నొనరించి సృజించెనో కదా!' (189-1)

అని నారదుడు రాజకన్యల సౌందర్యమును కృష్ణునికి తెలుపుటలో, ఆయనకు 'ఏకక్రియా ద్వ్యర్థికరీబభూవ' అన్నట్లుగా ఒక్క పనివలన రెండు కార్యములను సాధింపవచ్చునని ధ్వనింపజేసినాడు. కృష్ణుడు నిశాటశిక్షణమున ధరాస్థలిని కావనవతరించిన విష్ణుమూర్తి. అందువలన రాజకన్యలను అనుగ్రహించుటలో

ఆయనకు 'దుష్టదానవ సంహారకీర్తి, సహస్రాధిక శృంగార రసాధిదేవతలైన కన్యకాలబ్ధి' రెండును సిద్ధించగలవన్న భావము వ్యక్తము.

బ్రహ్మ (కవి) రాజకన్యలను తన అద్భుత నిర్మాణ చాతుర్యముతో సృజించినాడు. వారు 'రాకారజనీకర, ప్రభల' నొప్పిన వారనుటలో 'తేజోవరు'లు అన్నది వాచ్యము. 'తపస్తేజోవతులు' అన్నది వ్యంగ్యము. 'కంతుని తూపుల' అనుటలో 'పుష్పసున్నిత శరీరలు' అన్నది వాచ్యము. 'సున్నితమైన మనః పుష్పమును సమర్పించి ఆత్మనివేదమునకై తపించుచున్న వారన్నది' వ్యంగ్యము. 'కుందనంపు బంగారము' అనుటలో 'శుద్ధసువర్ణ కాంతులతో నొప్పు సంకాశవిగ్రహలు' అన్నది వాచ్యము. శరీరమునకు కాంతిని కలిగించునది వన్నెకాదు. స్వభావ జనితమైన శీలము. 'మేలిమి బంగరువంటి శీలవతులు' అన్నది వ్యంగ్యము. 'శృంగారరసాన్వితాకృతులు' అనుటలో 'ఇంద్రియానంద జనకమైన బహిస్సౌందర్యరూపలు' అన్నది వాచ్యము. శృంగార, మధురములు సమానార్థకములగుటవలన 'మధురభక్తి భరితలై ఆత్మానందజనకమైన అంతః సౌందర్యరూపలు' అన్నది వ్యంగ్యము. అందువలననే కవి (బ్రహ్మ) వీరిని తన కర (ల) కౌశలమేర్పడ ('రలయోరభేదః-కావ్య (ర్య) కళచేత) దిద్ది తీర్చినాడు.

పల్లవీమానసచోరుడు, దక్షిణుడు అయిన కృష్ణుడు ఇంత సౌందర్యరాశులు లభించు అద్భుతావకాశమును జారవిడుచుకొనలేని విధముగా నారదుడు రాజకన్యల సౌందర్యమును వర్ణించినాడు. ఇది నిజముగా నరసింగకవి అపురూప సృష్టి. శృంగార భావ సంబంధమైనదిగా ఈవర్ణన అనిపించినను భక్తికే అంగమైనది. అర్థశక్తిచే వివక్షితాన్యపరరూపముగా సంలక్ష్యక్రమమున సిద్ధించినది ఇందలి వ్యంగ్యము.

## 3. రసాభాసము

శృంగారమున అనుచితమైన విభావము ఆలంబనముగా నుండిన రసాభాసమగును. ఉపపతి విషయకమగు రతియు, బహునాయక విషయకమగు రతియు ననుచితము. కాన శృంగార రసాభాసము.

రాచకన్యాపరిణయమునఁ వర్ణితములైన
'ఇచ్చను బూబంతులే గొనవచ్చితి
ముట్టిచూడగనిమ్ము మోహనాంగి!' (119-1)

అని ఈ విధముగనున్న పుష్పలావికా వర్ణనమున పుష్పలావికలు-విటుల సంభాషణలు, చేష్టలు ఉపనాయక రతిని సూచించుటవలన రసాభాసము.

'ఒకవెలసంకేతమొకకాంత చేరివే
రొకడౌట గనకమచ్చిక బెనంగు' (166-2)

అని ఈవిధముగ నున్న అంధకారవర్ణనమున ఉపపతి రతి, తస్కరసురతము, బహునాయక రతి మొదలైనవి వర్ణితములైనందున శృంగారాభాసము. ఇందలి రసధ్వని అసంలక్ష్యక్రమ రూపమున సిద్ధించినది.

## 4. రసభ్రాంతి

'రసభ్రాంతి' అన్నమాట లక్షణ గ్రంథము లందున్నదికాదు. కావ్యగత నాయికానాయకుల యొక్కగాని, ఇతర పాత్రల యొక్కగాని శృంగారముకాక చిత్రగతమైనదిగాని, దానివంటిదిగాని అయిన శృంగార వర్ణన ఇట సౌలభ్యము కొరకు 'రసభ్రాంతి' అని చెప్పబడినది.

ద్వారకానగర మందలి సౌధధావళ్యమును కవి
'కువలయకాంత కాంతమణికుడ్యము లందు సజీవభూమికా' (108-1)

అనుచు వర్ణించినాడు. ద్వారకానగర మందలి మేడలు చంద్రకాంతమణి నిర్మితములు. అందువలన అందలి కుడ్యములు దర్పణమువలె తళతళ మెరయుచు, అందుసంచరించు జనుల ప్రతిబింబములను స్పష్టముగచూపుచున్నవి. వీనివలన చూపరులకు ఆ కుడ్యములు చలచ్చిత్ర రంజితములా అన్న భ్రాంతిని గొలుపుచున్నవి. ఇట్టి కుడ్యములు గలిగిన గదులందు మదనకేళీ పరవశులై ప్రేయసీ ప్రియల అంగకములను ప్రతిఫలించుచున్నవి. ఇందలి తద్ధితప్రత్యయమైన 'క' 'చిన్న' అను అర్థమును వ్యక్తముచేయును. అంగకములనగా మర్మావయవ

ములనిధ్వని. అంగకములనుకూడ ప్రతిఫలింపజేయగల ఆ సౌధకుడ్యధవళిమను నుతించుటకు బ్రహ్మకును తెలియదట. అచ్చట జరుగు 'సృష్టికార్య' విచిత్రములను సృష్టికర్తయే వివరించలేడనుటవలన అందలి అతిశయము ధ్వనితము.

ఇందలి స్త్రీ పురుషుల సంభోగము యథార్థముకాదు. కుడ్యములందు ప్రతిఫలితము. అందువలన ఇందు శృంగారరసము భ్రాంతిరూపముగ మాత్రమే ఉన్నట్లు భావింపవచ్చును.

సాలమును వర్ణించుచు కవి ఇట్లు చెప్పినాడు.
'ఆపురిసాలమెన్నదగునంబరచుంబి శిఖామణిచ్ఛటా' (109-1)

ద్వారకానగర ప్రాకారము మిక్కిలి ఉన్నతము. దానిపై భాగమున వరుసగా మణి దీపములు అమర్చబడినవి. ఆ దీపకాంతులు స్వర్గమునందలి నందనోద్యాన పర్యంతము వ్యాపించినవి. రాత్రులందు విలాసముగా నందనవనమున విహరించుచు మన్మథకేళికలందు మగ్నులైన దేవదంపతుల రహస్యములను ఛేదించి, (ద్వాపరకృత్-సందేహమునకు తావొసగునట్టి) వారి రతోపరతములను ఈ కాంతులు నిస్సందేహముగా ఎల్లరకును బహిర్గతము చేయుచున్నవి. ఇట్లు చెప్పుటలో ప్రాకారము స్వర్గపరివ్యాప్తము అన్న విషయముతో పాటుగా దూర సంలక్షిత తస్కరసురతాదుల ప్రసక్తి పరోక్షముగ ఉన్నందున శృంగార రస భ్రాంతిని కలిగించుచున్నది.

ఈ విధమైన రసధ్వనులు అసంలక్ష్యక్రమములు.

## వస్తుధ్వని

వస్తు రూపమున అనగా పదముల యొక్క అర్థరూపమున సిద్ధించు ధ్వని వస్తుధ్వని.

'గోపాల్పేట పురీవరంబు దగు శ్రీకోకస్తనీయుక్తమై' (45-1)

అని కవి గోపాలుపేట వైభవమును ఉదాత్తముగా చెప్పినాడు. 'శ్రీకోకస్తని' యనగా లక్ష్మీదేవి. 'గోపాలుపేట లక్ష్మీదేవితో కూడినది' అనివాచ్యార్థము.

వైకుంఠముననుండు లక్ష్మి గోపాలుపేట యందెట్లుండును? అందువలన 'శ్రీ' అన్నదానికి 'సంపద' అని అర్థము చెప్పవలెను. అప్పుడు 'గోపాలుపేట సంపద్భరితము' అన్న వ్యంగ్యార్థము సిద్ధించును. 'శ్రీ' శబ్దము ముందు లక్ష్మిని, పిమ్మట సంపదను బోధించినది. అందువలన వివక్షితాన్యపరవాచ్యార్థము వాచ్యార్థము ముగిసిన పిమ్మట కొంత ఆలోచన చేసిన వ్యంగ్యము స్ఫురించినది. అనగా వాచ్యవ్యంగ్యములందలి క్రమము గోచరించినది. కనుక సంలక్ష్య క్రమము. పదగతము.

*  *  *

కవి గోపాలుపేట రాజవంశమున ప్రసిద్ధుడైన అయ్యభూపాలుని పరాక్రమమును ఈ విధముగా వర్ణించినాడు.

'దురమున నయ్యభూవిభుని దోరసిపుత్రి యమిత్రధారుణీ
శ్వరులకు వేల్పుటింతులకు జక్కవివాహమొనర్చి కీర్తిపూ
ర్తిరుచిర సూనజాలముల దీవ్రమహచ్ఛవిపుంజ మంబులన్
సురరుచితో జయేందిరను గూడి వసంతములాడుచేపుకన్.' (69-1)

'అయ్యభూపాలుని' దోస్థిత (భుజశబ్దము హస్తమునకు ఉపలక్షకము) అనగా హస్తస్థితి ఖడ్గపుత్రిక శత్రురాజులకు, దేవకాంతలకు వివాహముచేసినది' అన్నది ఇందలి వాచ్యార్థము. ఇట్లు చెప్పుటలో 'ఖడ్గము కల్యాణము చేయుట ఏమి?' అని వాచ్యార్థమునకు బాధకలిగినది. దీనికి 'అయ్యభూపాలుని ఖడ్గము యుద్ధరంగమున శత్రువీరులను సంహరించినది' అన్నది లక్ష్యార్థము. 'హతోవా ప్రాప్స్యసి స్వర్గం' అని యున్నందున రణనిహతులైన వీరులు స్వర్గమునకేగుదురనుట ప్రసిద్ధము. అందువలన 'ఖడ్గపుత్రిక శత్రువీరులకు స్వర్గమునకు వెళ్ళగలిగిన, యుద్ధమున సంహరించుటవలన, అవకాశమును కలిగించి, వారికి రంభాద్యప్సరస్సంభోగ సుఖమును పొందించినద'న్న వ్యంగ్యార్థము సిద్ధించును. 'ఖడ్గపుత్రిక యుద్ధరంగమున శత్రురాజులకు వేల్పుటింతులకు వివాహమును కావించినదన్న వాచ్యార్థమును 'శత్రువులను సంహరించినది' అన్న లక్ష్యార్థము తిరస్కరించినది. అందువలన లక్షణామూలధ్వని. అత్యంత తిరస్కృత వాచ్యము. వాక్యగతము.

*  *  *

కవి కృతిప్రేరకుడైన నరసింహారెడ్డి దక్షతను ఇట్లు చెప్పినాడు

'ఆనరసింహదేవుడపుడా భువి యాకడలిన్ మునిగినన్
దానెటుగా నుదారమహిదారుడునై పయికెత్తి నిల్పెజూ!
మానిత జన్నలీంద్ర హనుమంత నృపాలుని రాజ్యసంపదన్
శ్రీనరసింహ నామనృపశేఖర! నీవటు నిల్పితౌభళీ' (29-1)

'నరసింహదేవుడు అనగా పురుషోత్తముడైన విష్ణువు వరాహరూపధారియై భూమిని సముద్రమున మునుగకుండ ఎత్తిపట్టినట్లుగా, నరసింహారెడ్డి హనుమంత నృపాలుని రాజ్యసంపదను నిల్పినాడన్నది వాచ్యార్థము. నరసింహారెడ్డి హనుమంతరాయని రాజ్యసంపదను నిలిపినాడు' అనుటలో 'హనుమంతరాయడు తన దాయాదులచేత రాజ్యభ్రష్టుడుకాగా నరసింహారెడ్డి వారిని అణచి, హనుమంత రాయనిపునస్సింహాసనస్థుని గావించినాడన్నది వ్యంగ్యార్థము. నరసింహస్వామికి, నరసింహారెడ్డికి బింబప్రతిబింబ భావముండుటవలన దృష్టాంతాలంకారము. అందువలన ఇక్కడ అర్థాంతర సంక్రమితమై వాక్యగతమై అలంకారకృత వస్తు ధ్వని ఉన్నది.

* * *

సత్యభామ కోపమందిరముననున్న విషయము తెలిసి కృష్ణుడచటికి వెళ్ళి, సత్య చెలికత్తె చేతనున్న తాళవృంతమునుకొని వీవదొడగినాడు.

'చతురత నొక్క చేడె కరసారస సీమను బూనియున్న భా
సితమణి తాళవృంతమును శ్రీహరి తాగొనివీవ సత్య హృ
ద్గతమగు క్రోధభోగికి బ్రకంపిత సువ్యజనానిలంబులా
హుతులిడు లీల గన్పడియె నింపుదలిర్పగ నట్టివేళలోన్' (66-2)

'సత్య హృద్గతమగు క్రోధభోగికి వ్యజనానిలములను ఆహుతులిచ్చుట' ఇందలి వాచ్యార్థము. హృద్గతక్రోధము ఉపమేయము. భోగి (పాము), ఉపమానము. ఇట ఈ రెండును అభేద తాద్రూప్యరంజనముచేత 'క్రోధ భోగిగా' రూపితము. అప్పుడు కృష్ణుని వీజనానిలము, క్రోధభోగికి ఆహుతులిడు లీల గన్పడినదనుట

ఉత్ప్రేక్ష. 'ఆహుతులిడుట' యనగా అగ్నియందు వ్రేల్చుట. అగ్ని ముఖముగా యజ్ఞములందు దేవతలకు మధ్వాది హవిస్సులను సమర్పించుట ప్రసిద్ధము. అందు వలన 'ఆహుతులు' అను పదమునకు 'ఆహారము, వృద్ధికరము' అన్న అర్థములు అర్థాంతర సంక్రమిత రూపమున సిద్ధించినవి. దీనివలన వీజనానిలము క్రోధ భోగికి వృద్ధికరమైనదని అర్థమువచ్చినది. అనిలము భోగికి వృద్ధికరమేగాని, క్రోధమునకుగాదు. క్రోధము హృద్గతభావము. దీనికి ఆహారమిడుట పొసగదు. అనగా ఇట ప్రణయ కుపితయైన సత్యభామకు కృష్ణునిరాక, సమీపస్థితి, పారిజాత సువాసిత గంధవాహములు కోపమును ఇనుమడింపజేసినవని' వ్యంగ్యార్థము. ఈర్ష్యచేత అలిగిన సత్యభామ కృష్ణసామీప్యమునందే విరహమనుభవించు చున్నందున ఆమెకు 'వీజనోత్థితములైన శీతలవాయువులు విరహోద్దీపకములై వేదనను అధికముచేసినవన్న వ్యంగ్యార్థము కూడ స్ఫురించుచున్నది. వీజనా నిలములు క్రోధభోగికి స్వతస్సిద్ధములైన ఆహుతులుకావు. అందువలన ఇందలి వ్యంగ్యము కవిప్రౌఢోక్తి సిద్ధము. అర్థాంతర సంక్రమితము. వాక్యగతము. అర్థశక్తి మూలకము. అలంకారకృత వస్తు ధ్వని.

ఈ విధముగా నరసింగకవి రచనయందు అనేకట వ్యంగ్యార్థములు స్ఫురించి, 'రాచకన్యకా పరిణయము'నకు ఉత్తమత్వమును ఆపాదించుచున్నవి.



# 10. సంకేతశిల్పము

జ్ఞానార్థకమైన 'కిత్' (కితజ్ఞానే) ధాతువునకు చక్కగా, మిక్కిలిగా అన్న అర్థములుగల 'సమ్' అను ఉపసర్గ చేరి 'సంకేతము' అను పదము సిద్ధించినది. శబ్దనిష్పత్తిని బట్టి దీనికి 'చక్కగా తెలియునది' అని అర్థము. ఏదైన ఒక అంశమును లేదా విషయమును, తత్త్వమును తెలియజేయుదానిని 'సంకేతము' అని నిర్వచింపవచ్చును.

దీనికి ఆంగ్లమున 'Symbol' అన్నది సమానార్థకము. ఇది 'Symbolum' అను గ్రీకు పదము నుండి వచ్చినది. 'Some thing that stands for, represents, or denotes something else (not by exact resemblence, but a vague suggestion or by some accidental or Conventional relation), Esp- (espacially) A material object representing or taken to represent something immaterial or abstract, Spec- (specifically) An object representing some thing sacred[1]' అని Symbol పదము యొక్క నైఘంటికార్థము. (స్పష్టాకృతితో గూడిన సాదృశ్యముతోగాక, అస్పష్టమైన సూచనతోగాని, యాదృచ్ఛికముగాగాని, ఆచారసిద్ధమైన సంబంధముతోగాని) ఒక విషయమునకు బదులుగా మరియొక విషయము నిలుచుట, సూచకముగా నుండుట, వేరొక విషయమును తెలియజేయుటలను 'సింబల్స్' 'సంకేతములు' అనవచ్చును. '**ముఖ్యముగా** సాకారమైన వస్తువు నిరాకారమైన వస్తువునకు ప్రాతినిధ్యము వహించుట, **ప్రత్యేకముగా** ఒక విషయము అలౌకికమైన, పారమార్థికమైన అన్యవిషయమునకు ప్రాతినిధ్యము వహించుట' లను 'సింబల్స్'గా గ్రహింపవచ్చును.

సంకేతభావమే సంకేతత్వము లేక సంకేతవాదము. దీనికి ఆంగ్లమున 'Symbolism' (సింబాలిజం) అన్నది సమానార్థకము. 'The practice

of representing things by symbols, or of giving a symbolic character to objects or acts, the systematic use of symbols, A symbolic meaning attributed to natural objects or facts[2] అని 'సింబాలిజం' నకు అర్థము చెప్పబడినది. 'వస్తువులను (విషయములను) సంకేతములచేత తెలియజేయు వాడుకను; వస్తువులకుగాని, వాని ప్రవర్తనలకుగాని సాంకేతికతను ఆపాదించుటను; సంకేతములను ఒక నిర్దిష్టపద్ధతిలో ప్రయోగించుటను; సహజమైన వస్తువులకుగాని, వాస్తవములకుగాని సాంకేతికార్థమును ఆరోపించుటను' 'సింబాలిజం' (సంకేతకత) అని భావించవచ్చును.

సంకేతము, ప్రతీక అన్న పదములు పర్యాయములుగా, ప్రతీకత ఉన్న కవిత్వము ప్రతీక కవిత్వముగా సాధారణ వ్యవహారము.

'పందొమ్మిదవ శతాబ్దమున ఫ్రాంన్ దేశమున వెలసిన కవిత్వము ప్రతీక కవిత్వముగా వాప్తిచెందినదని, బోదలైర్, స్టీఫెన్ మల్లార్మేలు దీని వ్యాప్తికి కారకులనియు', 'ఈ ప్రతీక విధానములో ఏ భావమునైనను కవిత్వమునందు ప్రతిబింబించవచ్చునని, ఒక భావమునకుగాని, విషయమునకుగాని కవిత్వమునందు వేరొక విషయమును ప్రతినిధిగా ఉంచుట అన్నది ప్రతీక విధానముగా భావింపవచ్చుననియు' విమర్శకుల అభిప్రాయము.[3]

ప్రతీకలకు విషయ ప్రపంచమునందును అనగా కవి ప్రారంభించిన కావ్యగత 'వాచ్యార్థము'నందును, వీని కారణముగా కవి తన మనోభూమికలో సంకల్పించిన వాస్తవములందును అనగా 'అంతరార్థము'నందును ప్రాధాన్యముండును. ప్రతీకలు వాచ్యార్థమున స్వార్థమును త్యజింపవు' అంతరార్థమున వాచ్యమును అత్యంతముగా తిరస్కరించును అని భావము. అనగా శబ్దశక్తిచేత ఒకేసారి ఇటు లౌకిక ప్రపంచమునకును, అటు మనఃప్రపంచమునకును అన్వర్థమగునట్టి అర్థద్వయము నిష్పన్నమగునని ఫలితార్థము. ఈ రెండవ, విశిష్టమైన అర్థము అద్భుతమైన సౌందర్యానుభూతిని కలిగించునని మనము గ్రహింపవచ్చును.

భారతీయ మేధావులలో ప్రతీకవాదముపై స్పష్టముగా వ్రాసినవారిలో అరవిందులు ముఖ్యులు. వేదోపనిషత్తులందున్నది ఈ ప్రతీక కవిత్వమని చెప్పుచు, ఈ జగత్తులో అనేకవిషయాలు ప్రతీకలేయని తెలుపు సందర్భమున వారు దీనిని వివరించిరి.

'A symbol, as I understood it, is the form of one plane that represents a truth of another......but generally all forms are symbols. This body of ours is a symbol of our real being and everything is a symbol of some lingher reality'[4] 'ఒకభూమికలోని రూపము వేరొక వాస్తవమును తెలియజేయుటను' ప్రతీక అనవచ్చును. 'సామాన్యముగా అన్ని ఆకృతులును ప్రతీకలే. మన అస్తిత్వమునకు కారణమైన ఈదేహము ఒకప్రతీక. ప్రతిదీ ఏదో ఒక ఉన్నత వాస్తవమునకు ప్రతీక' అని అరవిందుని వాక్యసారముగా భావింపవచ్చును.

శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యవారు 'A symbol is defined as a Vehicle which conveys a truth in nature or concept of an individual mind'[5] అని పేర్కొన్నారట. 'ప్రకృతి సత్యమునుగాని, లేదా వైయక్తిక ఆలోచనాజనితమైన సరళినిగాని తెలియజేయుటకు వాహికగా ఉండునదే సంకేతము అన్నది ఈ వాక్యసారము.

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు ప్రతీకకవిత్వము(సింబలిజం)ను 'సదసద్వివేకవ్యవహారము' అన్నారు. భారతీయతత్త్వమునందే ఈప్రతీక విధానము అంతర్లీనముగా ఉన్నదని వారిసిద్ధాంతము. ఈప్రతీకకవిత్వములో కవి 'ఒకేవస్తువుయొక్క భౌతిక, తాత్త్విక రూపాలనుగ్రహిస్తాడు ——సింబలిజంలో ఒకేవస్తువు ఉంటుంది. దానిలోనే రెండోవస్తువు ఉంటుంది. బయటికి కన్పించేది భౌతికవస్తువు. మామూలుకళ్ళకు కనిపించకుండా లోపల ఉండేది రెండోవస్తువు' 'అంటే ఒకవస్తువులోనించి దానివాస్తవికతను పిండుకోవడం సింబలిజం' అని ప్రతీక విధానముపై గుంటూరు శేషేంద్రశర్మగారి అభిప్రాయములు.[6]

వెల్లూరు నరసింగకవి 'రాచకన్యకా పరిణయ' ప్రబంధమున అక్కడక్కడ ఇట్టి 'ప్రతీకలు' స్ఫురించుచున్నవి. ఉత్తములైన గురువు, విద్వన్మిత్రుల సాహచర్యము, వంశానుగతమైన విష్ణుభక్తి, ఆంధ్రమహాభాగవతానురక్తి, స్వీయానుభూతి, ఆత్మీయత, ఆదిశంకరులు, లీలాశుకుడు మొదలగు మహనీయుల కృతుల ప్రభావముల కారణముగా నరసింగకవికి సిద్ధించిన అంతస్సంస్కారమువలన ఆయనయందు వేదాంతభావములు చోటుచేసికొన్నవి. ఈ భావములు 'రాచకన్యకాపరిణయము'న కొన్ని సందర్భములందు స్వయం సిద్ధములై ప్రతిబింబించినవి.

1. కృష్ణుడు పారిజాత కుసుమమును రుక్మిణికిచ్చిన విషయముతెలిసి ఈర్ష్యాకుపితయై అలిగిన సత్యను ఊరడించుచు

'కందర్పాతిశయాంతమాగమము తర్కప్రక్రియంజూచినీ
సౌందర్యద్యుతిమీద దృష్టిపిగులన్ సంధించియామీద త్వ
న్మందాలాప సుధారసానుభవ సామ్రాజ్యంబునందేలి'యా
నందోబ్రహ్మము'గా మదిందలతుగాంతా! తావకాశ్లేషమున్' (81-2)

అని సాంత్వన వాక్యములు పలికినాడు. 'ఆమె వియోగమునుభరింపలేని కృష్ణుని ఆరాటము' ఇందలి వాచ్యార్థము.

కాని నరసింగకవి అంతస్సంస్కారఫలితముగ ఇందుమనోహరమైన అంతరార్థము స్ఫురించుచున్నది. ఇందలి 'కాంత' శబ్దముశ్లిష్టము. సాభిప్రాయకము. ఇది కృష్ణుడు సత్యభామనుద్దేశించిన స్త్రీ సంబోధక పదము మాత్రమేకాదు. 'కాంతుడు'-భర్త, శ్రీకాంతుడు, జగత్కాంతుడు, అనంతతేజఃపుంజీభూతముగా, మనోహరముగావెలసిన శ్రీకృష్ణపరబ్రహ్మము అన్న పరమార్థమున ఇది ప్రయుక్తము. ఈ దృష్టితో లభించు పద్యార్థమువేరుగానున్నది.

**కాంత :-** కస్య సుఖస్య అంతో నిశ్చయోఽత్రేతి - సుఖముయొక్క నిశ్చయము దీనియందుగలదు.. అని కాంత శబ్దముయొక్క అర్థము. గు.బా.ప్ర. అనగా 'శాశ్వతానందసంధాయకుడు. మోక్షప్రదుడు' అని అర్థము చెప్పవచ్చును.

కో బ్రహ్మాత్మానిలార్కేషు - విశ్వప్రకాశః. అప్పుడు 'కస్య బ్రహ్మణః ఆత్మనఃవా అంతో నిశ్చయోఽత్రేతి కాంతః నిశ్చినో తీతినిశ్చయః' అనగా 'పరమాత్మ సంబంధమైన నిశ్చయజ్ఞానము కలిగించువాడు **లేదా** పరమాత్మయందు బుద్ధిని చెదరకుండ కూర్చువాడు' అనికూడా అర్థము చెప్పవచ్చును.

'కామదేవః కామపాలః కామీ**కాంతః** కృతాగమః' విష్ణుసహస్ర నామాలు శ్లో. 83.

శ్రియఃకాంతాయ **కాంతాయ** కామితార్థప్రదాయినే ।
శ్రీమద్వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥
ప్రసిద్ధమైనహారతి శ్లోకము.

'గోప్యోలబ్ధ్వాచ్యుతం **కాంతం** శ్రియఃకాంతం వల్లభం' భాగ.దశ. పూ.భా. శ్లో. 15-33 అధ్యా.

'కాంతా! ఓకృష్ణపరమాత్మా!

కందర్పాతిశయాంతమాగమము - మన్మథాతిశయపర్యంతము వేదమును (వేదాంతమునందు మన్మథునకు మిక్కిలి ప్రాముఖ్యమున్నది. ఇతడు పన్నెండు మంది దేవీఉపాసకులలో ఒకడు. అనంగవిద్యకు ఋషి). కందర్పుడు - మన్మథుడు.) మత్ చేతనా తాం మథతీతి మన్మథః అనగా బుద్ధినికలియబెట్టువాడు.

తర్కప్రక్రియం జూచి - ప్రమాణ, ప్రమేయాదులగు తర్క శాస్త్ర విమర్శచే గ్రహించి అనగా బుద్ధికి అందినంతగా వేదము, వేదాంతములను తర్కశాస్త్రాధారముగా చర్చించి

నీ సౌందర్యద్యుతిమీద దృష్టిమిగులన్ సంధించి-మాయాకల్పితమైన నీ చిన్మయ జ్యోతియందు అంతర్దృష్టిని ఏకాగ్రముగ నిలిపి

ఆ మీద, త్వనందాలాప సుధారసానుభవ సామ్రాజ్యంబునందేలి- త్వాల - నీయొక్క (నీకు సంబంధించిన) మంద - గంభీరమైన (గాంభీర్యముగల), ఆలాప - వాక్కుల (తొలుబల్కులైన వేదములు), సుధ - (వేదముల తుది

భాగములైన ఉపనిషత్తుల సారరూపముగా లభించిన) జ్ఞానామృతముచేత, రసాను భవ - బ్రహ్మానంద రసాస్వాదనకారకమైన, సామ్రాజ్యంబునందేలి - నిరతిశ యానంద భరితమైన ఆత్మసామ్రాజ్యమున నోలలాడి.

తావకాశ్లేషమున్ - నీయొక్క కౌగిలింతను - నీతోడియైక్యమును.
ఆనందోబ్రహ్మముగా-ఆనందమనెడు బ్రహ్మముగా (బ్రహ్మానందముగా)
మదిందలంతు - నా మదిలో భావింతును.'

అన్న అర్థము అవగత మగుచున్నది. అనగా 'ఓ కృష్ణపరమాత్మా! వేదార్థ మును - వేదాంతార్థమును, ఉపనిషదర్థమును తర్కప్రక్రియచేత చర్చించి నీ చిత్కళయందు దృష్టిని సంధించి నీ ఆలాప సుధారససామ్రాజ్యమున తేలి యాడి నీ సాయుజ్యమును 'ఆనందో బ్రహ్మము'గా మనస్సులో భావింతును అన్నది ఈ పద్యపరమార్థము.

బహుశః నరసింగకవి హృద్గతభావముకూడ ఇదియే కావచ్చును. ఈ అర్థము అద్వైతపరము.

విశిష్టాద్వైతపరముగా ఈపద్యమున మరొక విశేషముకూడ తోచుచున్నది.

కందర్పాతిశయాంత మాగమము - అనుటలో ప్రద్యుమ్నవ్యూహము స్ఫురితము. పాంచరాత్రాగమమునందు 'సంకల్పించిన కార్యములను బట్టి పరవాసుదేవుడు అధిష్ఠించినపుడు ఆయా వ్యూహనామములను పొందుననియు, అది వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ నామములచే చతుర్విధములుగ నుండుననియు' చెప్పబడినవి.[7] అందులో ప్రద్యుమ్న వ్యూహము మూడవది.

ప్రద్యుమ్నవ్యూహము :- 'సంకర్షణ వ్యూహము నుండి ఏర్పడినది. జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అనుషడ్గుణములలో బలైశ్వర్యములు ప్రధానములు. తాపింఛము (చీకటి చెట్టు పువ్వు) వంటి శరీర చ్ఛాయ. కావున శ్యామలవర్ణ సుందరుడగు శ్రీకృష్ణకుమారుడు ఈ వ్యూహమని గుర్తింపబడినది. ఈతని అధిష్ఠానము బుద్ధి. సకలప్రాణి హృదయములందును ఈతడుండును. దీనికి అధిష్ఠాత బ్రహ్మదేవుడు.[8]' అని ప్రద్యుమ్న వ్యూహమును గూర్చి శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు పేర్కొన్నారు.

ఈ పద్యమునందలి కందర్పాతిశయము, ఆగమము - పాంచరాత్రాగమము; సామ్రాజ్యము - ఐశ్వర్యగుణము, తలంతు - తలపు అనగా అధిష్ఠానమైన బుద్ధి, మదిం -వాసస్థానమైన హృదయము, ఆనందోబ్రహ్మము - అధిష్ఠాత అయిన బ్రహ్మదేవుడు అన్నపదములు ప్రద్యుమ్న వ్యూహద్యోతకములు.

ఒక విధముగా చూడగలిగిన శక్తి అలవడిన కవికి, ఏ వస్తువునందైనను అతనికి ఆత్మీయమైన విషయము (భావము) ప్రతిఫలించుననుటకు ఈపద్యమొక ప్రకృష్టోదాహరణము.

2. వెల్లూరు నరసింగకవి యందు తైత్తిరీయోపనిషత్తు ప్రభావము బాగుగా కనబడుచున్నది. ఇందలి భావములు అప్రయత్నముగనే ఆయన రచనయందు స్థానమును పొందినట్లు గోచరించుచున్నది.

'సత్యజ్ఞానానంత తటస్థ లక్షణములతో నొప్పి ప్రాణులలోనుండు ప్రత్యగాత్మయే బ్రహ్మము. ఈ ప్రత్యగాత్మ అన్నమయాది కోశములతో కూడినది. ఇది పాంచభౌతికమైనది. దీనికి 'తల' ముఖ్యాంగము. కోశమనగా ఏదైన వస్తువును కప్పియుంచు ఆవరణము. అన్నమయాది పంచకోశములు ఆత్మను ప్రకాశింపనీయకుండ కప్పియుంచును. అవి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. ఉత్తరోత్తరములు పూర్వపూర్వములకు కారణములు. అన్నిటికన్న బయటనున్నది స్థూలమైనది అన్నమయకోశము. అన్నిటికన్నలోపలనున్నది సూక్ష్మతమమైనది ఆనందమయకోశము. బయటనున్న అన్నమయకోశము నుండి ఒక్కొక్కదానియందు మిగిలిన నాలుగు. మూడు, రెండు. ఒకటి అయిన లోపలి కోశములు ఇమిడి యుండును. ఉత్తరోత్తరముల జ్ఞానకారణముగా పూర్వపూర్వములు లయమగును. చివరకు అన్నిటికన్న లోపలనున్న ఆనందమయ బ్రహ్మముకూడ కార్యమే-అని గురూపదేశాదులవలన గ్రహించి, దానికి కారణమైన అవాఙ్మానస గోచరమైన పరబ్రహ్మమును సాధకుడు 'నేతి,నేతి' (ఇదికాదు, ఇదికాదు) అన్న అనుపలబ్ధి రూపమైన అపరోక్షానుభూతి ద్వారా గ్రహించగలుగును' అన్నది తైత్తిరీయోపనిషత్తు సారము. ఇదియే 'భార్గవీవారుణీవిద్య'గా ప్రసిద్ధి పొందినది.

ఈ భావములు 'రాచకన్యకా పరిణయము'న 'ప్రాకార' వర్ణనమందు పొడసూపుచున్నవి.

'అత్యున్నతాకృతియగు త్రివిక్రములీల
 నలబలీంద్రుని మీద నడుగుమోపి
ప్రతిపక్షజేతమౌ పరశురాముని మాడ్కి
 బరరాజహంస సంస్పర్ధనొంది
బలవంతుడగు రామభద్రునికైవడి
 మత్తఖరాసురోద్వృత్తి నణచి
సకలలోకైక రక్షకుడైన హరిజాడ
 సాగరమధ్యవాసంబుగాంచి

సంతతనిజాంతరాళ నిశాంతఖేల
దాశరాంతక భవ్యదివ్యావతార
లక్షణ నితాంతవైభవాలంకరణము
ద్వారకాపురి 'వరణ' మిద్ధరణి వెలయు' (110-1)

'కవి సంప్రదాయానుగుణమైన పురవరణ (ప్రాకార) వర్ణనము' ఈ పద్యమునందలి వాచ్యార్థము. కాని ఇందు అన్నమయాది పంచకోశచ్ఛేదన' మనెడు అంతరార్థము వ్యక్తమగుచున్నది.

ద్వారకాపురి వరణము—ద్వారకాపురియనగా మోక్షదాయకపురి. మానవులందలి ప్రత్యగాత్మకు నివాసస్థానమైన హృదయకోశమే ఈ ద్వారకాపురి. ఈ ఆత్మజ్ఞానమే మోక్షము. కాని ఈ ఆత్మను తెలిసికొనకుండ అన్నమయాది పంచకోశములు ఆవరించి యుండును. వాని ఆవరణమే 'వరణము' (ప్రాకారము).

'అత్యున్నతాకృతియగు త్రివిక్రములీల అలబలీంద్రునిమీద అడుగుమోపి' అనుట అన్నమయకోశమునకు ప్రతీక. అన్నమనగా మనము భుజించు ఆహారము కాదు. ఈ జగత్తున కంతటికి మూలకారణమైన పదార్థము (Matter) దానిని గ్రహించుటయే అన్న బ్రహ్మజ్ఞానము. ఈ అన్న బ్రహ్మమునే 'విరాడ్బ్రహ్మ' మందురు. "త్రివిక్రముడు" ఈ విరాడ్బ్రహ్మకు ప్రతీక. విరాడ్బ్రహ్మ సమిష్టి.

బలీంద్రుడు' విశ్వుడు అనగా 'వ్యష్టిరూపుడైన దేహి'కి ప్రతీక, 'అడుగు మోపుట' అనగా అన్నబ్రహ్మజ్ఞానమును పొందుట. వామనుడు బలినడిగినది పాదత్రయి. అనగా సత్త్వరజస్తమోగుణాలు. ఆకాశాది పృథివీ పర్యంతాలు తమో రజో వ్యాప్తాలు. స్థూలసూక్ష్మములైన వీనిని సాత్త్వికాంశతోనొప్పు కారణము చేతనే లయమొనరించవలయును. అందువలనే వామనుడు బుద్ధిమయమైన బలి ప్రధానాంగముపై (తలపైన) అడుగుమోపినాడు.

దీనికి ఈ విధముగా కూడ చెప్పవచ్చును. బలిచక్రవర్తి విరోచనుని పుత్రుడు. విరోచనుడనగా 'విగతం రోచిః యస్యసః' - విగతమైన కాంతి గల వాడు. అనగా కాంతి లేనిది - స్వయం ప్రకాశకత్వములేని జడము-ప్రపంచము అని అర్థము. విరోచనుని కొడుకు వైరోచని - బలి. అనగా ఈ ప్రపంచోద్భవుడైన జీవుడు విశ్వుడు. ఇతడువ్యష్టి - ఇతని తలపై వామనుని పాదము పడుట వలన ఇతడే 'విశేషరోచి'యై చైతన్యవంతుడైనాడు. 'సర్వస్వాత్మ నివేదనే బలిరభూత్ అనియున్నది. అందువలన బలి - వామనశబ్దాలు అన్నమయ కోశమును సంకేతించుచున్నవి.

'ప్రతిపక్షజేతయౌ పరశురాముని మాడ్కి పరరాజహంస సంస్పర్ధనొంది' అనుట ప్రాణమయకోశమునకు ప్రతీక. ఈ ప్రాణమయుడును, అన్నమయుని ఆకృతి కలిసి పురుషరూపమును పొంది జీవుడైనాడు. ప్రాణమయుడు తెలిసిన గాని అన్నమయుడు లయముకాడు ఈ అన్నమయుడు అశాశ్వతుడు అన్న విషయమును అన్నబ్రహ్మకు కారణమైన ప్రాణబ్రహ్మమును ఉపాసించి 'నేనే ప్రాణబ్రహ్మను' అని సాధకుడు గ్రహించగలుగును. ప్రాణ బ్రహ్మోపాసనకు ముఖ్యమైన ఫలము-దేహాదులు అసత్యములని గ్రహించి వానిపై అభిమానము నశించుట'. అవాంతరఫలము - 'సాధకుడు ఎట్టి అపమృత్యువును లేక పూర్ణాయుస్సును'. మానవుని జీవితము అశాశ్వతము. కాని సర్వధర్మ సాధనలకు ఇదియే మూలము ('శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్') అందువలన పర బ్రహ్మ జ్ఞానలబ్ధి పర్యంతము దీనిని నిలుపుకొనవలయును. కనుకనే సాధకుడు ప్రాణమయుని ఆరాధించి పూర్ణాయుస్సును పొందవలయును.దీనికి 'ప్రాణాయామ' ప్రాణులని అనగా జీవుని-ఆత్మను, ఆయామ-స్వాధీనములో ఉంచుట రూపక మైన 'అజప' గాయత్రియనెడు మంత్రమును (ఆత్మమంత్రము) సాధన చేయు

టయే ఉత్తమ మార్గము. మానవ శరీరమునందున్న ప్రాణాపాన వాయువులు రేచక, పూరకములద్వారా జీవుని పైకి, క్రిందికి ఈడ్చుచుండును. జీవుడు దానినే 'హంస' కీలకమగు 'సోహం' అనెడు మంత్రమును తనకు తనే సదా జపించుచుండును. ఈ రహస్యమును తెలిసి అభ్యసించువారే రాజయోగులు (రాజ హంసలు). దీనివలన ఇంద్రియ నిగ్రహము సిద్ధించి కామములు అడగును.

ఈ విషయసారము పైపద్య చరణమున స్ఫురించుచున్నది.

'ప్రతిపక్షము - శరీరమంపణగియున్న' 'కామాది' అరిషడ్వర్గ సముదాయము.

జేత-దానిని జయించినవాడు.

పరశురాముడు-చిరంజీవుడు. యోగీశ్వరుడు (మహేంద్ర పర్వతముపై తపము చేయువాడు. ఈయన సాధకునకు (జీవునకు) ప్రతీక.

కైవడి-(పరశురాముని) వలె

పరరాజహంస-మోక్షమునందాసక్తులై, రాజయోగ నిష్ణితులైన, ఉత్తములైన యోగులతో (రాజ హంసలతో) (హంస శబ్దము-అంతరాత్మ, పరమాత్మలిద్దరికిని వర్తించును-గురుబాల ప్రబోధిక)

సంస్పర్ధనొంది-పోటీపడునట్లుగా ఆత్మసాహస గావించి (చక్కని క్రమ సమున్నతిని పొంది)

ఈ పదముల సమాహారార్థముగా 'బ్రహ్మ సాక్షాత్కారమునకై, ప్రతిపక్షులను జయించిన పరశురామునివలె, అరిషడ్వర్గమును జయించుటకై సాధకుడు యోగీశ్వరులతో పోటీపడునట్లుగా ప్రాణాయామమును ఆచరించవలెనను అంతరార్థము స్ఫురించుచున్నది.

మానవుడు సుఖముగా జీవించుటకును, స్వేచ్ఛగా ఈ పాంచభౌతిక దేహమును విడిచి, ఇష్టలోక ప్రాప్తి చెందుటకును ఈ ప్రాణాయామము శ్రేష్ఠ

మైనది. దానివలననే మనోమయుడు పట్టువడును. అదియే తర్వాతి ఉత్తమ సోపానములకు దారిచూపుటకు మొదటి మెట్టు. అందువలన ఇంత చెప్పవలసి వచ్చినది.

'బలవంతుడగు రామభద్రుని కైవడి మత్తఖరాసురోద్వృత్తినణచి' అనుట మనోమయ కోశమునకు ప్రతీక సాధకుని సంసార కూపమున కూలద్రోయు బృహచ్ఛత్రువు మనస్సు. 'మన ఏవమనుష్యాణాంకారణం బంధమోక్షయోః' అని అందుకే అన్నారు. దీనిని నిగ్రహించుట అరిషడ్వర్గమును నిగ్రహించుటకంటే కష్టతరమైనది. అందుకే సాధకుడు పరశురాముని మించిన, ద్విగుణీకృత సంకల్పుడైన 'బలవంతుడైన రామభద్రుడు' కావలెను. ఈ 'రామభద్రుడు' సాధకునకు ప్రతీక. మత్తఖరాసురుడు 'తులువ మనసు'నకు ప్రతీక. 'సాధకుని సంకల్పము బలమైనగాని మనోద్వృత్తి యణగదు' అన్నది ఈ పద్యచరణాంత రార్థము.

'సకల లోకైకరక్షకుడైన హరిజాడ సాగరమధ్యవాసంబుగాంచి' అనుట విజ్ఞానమయకోశమునకు ప్రతీక. సర్వభూతాంతరస్థుడై, సర్వవ్యాపియై, సకల లోకములను రక్షించునట్టి 'హరి'యే విజ్ఞానమయుడు. చలదూర్మికానికరమైన మహోదధియే ఈ ప్రపంచము

ఏషః స్వయంజ్యోతి రశేషసాక్షీ
 విజ్ఞానకోశే విలసత్యజస్రమ్।
లక్ష్యం విధాయైన మసద్విలక్షణ
 మఖండ తత్త్వాత్మతయాను భావయ॥

(వివేక చూడామణి. 381)

'సకలలోకైక రక్షకుడైన హరియే' స్వయంజ్యోతి, అశేషసాక్షి, విజ్ఞాన కోశవిలసితుడు. 'సాగరమధ్య వాసముననున్న ఈ తత్త్వము అఖండ తత్త్వాత్మత చేతనే అనుభవింపదగినది.

'క్షీర సముద్రమున (శేషతల్పశాయియై) శ్రీమహావిష్ణువుండుననుట' ఎక్కడోలేదు. జీవుని ఆత్మలోనే ఉన్నది. కాని జీవునికి తనయందలి విజ్ఞాన

మయాత్ముని దర్శించగలిగిన దార్శనికత అలవడవలెను. దానికి సాధన, ఉపాసనలు అవసరము. దీనినే తపస్సందురు. తపస్సనగా అది ఏదో భయంకర మైన ప్రక్రియకాదు. చిత్తైకాగ్రతయేతపస్సు. అనగా సూక్ష్మ విషయమున బుద్ధిని లగ్నము చేయుట. ఈ పాలసముద్రము, (శేషతల్పము), శ్రీమహావిష్ణువు మన లోనే ఉన్నారు. మనకంటిలోనే ఉన్నారు. మానవుని నేత్రమందలి శుక్లపటలము (తెల్లగ్రుడ్డు) పాల సముద్రము. కృష్ణపటలము (నల్లగ్రుడ్డు) శేషతల్పము. లోపలనున్న నల్లని కనుపాపయే విష్ణువు. అందుకే విష్ణువు నల్లనివాడైనాడు. ఆ కంటిపాప ఒక్కటి లేనిచో అంతయుచీకటే ('సర్వేంద్రియాణాంనయనం ప్రధానం)' అనగా అజ్ఞానమే, అట్లే బిందువులేనిచొ బీజములేదు. బీజములేనిచొ సృష్టిలేదు. అప్పుడంతయు శూన్యమే. ఈ విషయమును దర్శించగలశక్తి విజ్ఞాన మయమైన ఆర్షచక్షువునకే సాధ్యము. ఇట్టి విజ్ఞానమును సముపార్జించుటకే గజేంద్రుడు-జీవుడు 'ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండు'నని మొర పెట్టుకొన్నది.

'తనయందలి విజ్ఞానమయుని తెలిసికొనుటకై లెమిసంకులమైన సాగర మధ్యవాసము వంటి దుష్కరమైన తపస్సుతో గూడిన ఆర్షతత్త్వమును అలవరచుకొనవలెనన్నది' ఈ పద్యచరణాంతరార్థము.

'సంతత నిజాంతరాళ.........ఇద్ధరణివెలయు' అనుట ఆనందమయ కోశమునకు ప్రతీక. నిజాంతరాళనిశాంతము-జీవుని హృదయమనెడు గృహము, ఇందులో, సంతతము, ఖేలత్-విలాసముగా విహరించునట్టి, ఆ శరాంతక-విష్ణువు-అహంకార, మమకారములతోగూడిన సమస్త ప్రాపంచిక విషయములనెడు రాక్షసులను అంతమొందించునట్టి ఆత్మయే ఆనందమయుడు. భవ్య దివ్యావయవ ......వైభవా లంకరణము - (ఇట్టి ఆత్మ యొక్క) శ్రేష్ఠమైన దివ్యావతార లక్షణములతో, నితాంత వైభవాలంకరణముగా-శాశ్వతానంద సంధాయకముగా, మోక్షకారకముగా, ఇద్ధరణి - ఇహలోకమునందే - ఈ దేహక్షేత్రమునందే, ద్వారకాపురి వెలయు - హృదయకోశమున్నది.

ఈ విధముగా 'హృదయకోశము నావరించియున్న ఆవరణములను భేదించి జీవులు తమయందలి ఆత్మను గ్రహించవలె'నన్న అంతరార్థము ఈ పద్యమునందు బోధపడుచున్నది.

కవికి ఎంతో దార్శనికత ఉన్నగాని ఈ విధముగా చెప్పగలుగుట సాధ్యముకాదు. దీనివలన వెల్లూరు నరసింగకవి ఆత్మీయత, పదప్రయోగ సామర్థ్యము, వైదుష్యములు స్పష్టమగుచున్నవి. ఇంత అకృత్రిమముగా పద పదార్థములు ఆత్మబంధువులవలె ఒదిగియుండుట కేవలము ఈశ్వర ప్రేరితము. ఇందు కవి సంకల్పశక్తికి భగవదనుగ్రహము తోడైనది. బుద్ధి పూర్వకముగా రచించవలెనని కూర్చున్నచో తలపగులగొట్టుకొనినను ఇట్టిది సిద్ధించుట కష్టము.

3. నరసింగకవి రాజకన్యల సౌందర్యవర్ణనమున ఆదిశంకరుల సౌందర్యలహరీ స్తోత్రమును అనుసరించి వారిని పరాశక్తికి ప్రతీకలుగా మలచి నట్లు స్ఫురించుచున్నది. నారదుడు కృష్ణుని యెదుట రాజకన్యల ప్రత్యంగ సౌందర్యమును ఇరువదినాలుగు పద్యములందు (189-212/1) వర్ణించినాడు. సాధారణ మానవ కాంతల వర్ణనవలె నఖశిఖ పర్యంతముకాక నారదుడు వారిని శిఖానఖ పర్యంతముగా చెప్పుటలో, కవి సంకల్పముననున్నది 'భగవతీ' వర్ణనమే అని ధృవపడుచున్నది. 'ఈమెయే' పరమాత్మని చిన్మాయాశక్తి. ఈమె ప్రకృతికాగా, పరమాత్ముడు పురుషుడు. ఈ ప్రకృతి పురుషుల కలయికయే ఈ అనంత సృష్టి అన్నది భారతీయ వేదాంతసారముగా తత్త్వజ్ఞుల తలంపు.

ఆదికావ్యమైన రామాయణమందలి 'సీతారాములు' జీవేశ్వరులు అన్న ప్రతీతియున్నది. సాక్షాన్నిర్గుణ పరబ్రహ్మమే సగుణరూపమున పార్వతీ పరమేశ్వరులుగా, లక్ష్మీనారాయణులుగా, సీతారాములుగా భావించుట కద్దు. అట్లే ఇక్కడి రాజకన్యకా కృష్ణులుకూడ జీవేశ్వరులకు ప్రతీకలు. భగవంతు డొక్కడే పురుషుడు, తక్కినదంతయు స్త్రీప్రాయమను నియమము చొప్పున రాజకన్యలు జీవులకుపలక్షకములగుచున్నారు. మధురభక్తి సిద్ధాంతముకూడ ఈ విషయమును ధృవపరచుచున్నది.

నారదుడు రాజకన్యల సౌందర్యవర్ణనను ప్రారంభించుచు

'ఆరమణీ శిరోమణుల నందరనయ్యరవింద సూతి రా
కారజనీకర ప్రభల, కంతుని తూపుల, కుందనంపు బం
గారముతోడ గూర్చి కారకౌశలమేర్పడదిద్ది తీర్చి శృం
గార రసాన్వితాకృతలుగా నొనరించి సృజించెనోకదా!' (189-1)

అని చెప్పినాడు. 'సుందరులైన స్త్రీ సౌందర్యావిష్కరణము' ఇందలి వాచ్యార్థము.

నరసింగకవి తన సంకల్పమున, స్త్రీ మూర్తి, 'రమణీశిరోమణి'యైన త్రిపురసుందరి సౌందర్య నిష్పత్తిని ఉద్దేశించినందువలన ఈ పద్యమున అపూర్వ నిర్మాణకళాసామర్థ్యద్యోతకములైన కూర్చి, ఏర్పడ, దిద్ది, తీర్చి, ఒనరించి, సృజించెనో అన్న ఆరు క్రియారూపములను వాడినాడు. ఇంతగా ప్రయత్నించినను ఆ రూపనిష్పత్తిలో ఆయనకు తృప్తికలుగలేదు. ఆ సౌందర్య రహస్యతత్త్వము పూర్తిగా పట్టువడలేదు. అందువలన శేషం......పూరయేత్' అన్నట్లు 'కదా' అన్న అవాఙ్మానసగోచరార్థద్యోతకమైన అవ్యయముతో ఆ 'రూపసిద్ధి' గావించి తన బరువును దించుకొన్నాడు. ఇదియొక సౌందర్యలహరీ పరంపర. ఆదిశంకరులు 'సౌందర్యలహరీ' స్తోత్రమున 'ఆహిమగిరికన్యదేహ సౌందర్యమును ఉపమానములతో సరిపోల్చి చెప్పుటకు బ్రహ్మేంద్రాదులైన కవీశ్వరులు ఎట్లును (కథమపి) సమర్థులుకాకున్నారు'10 అని చెప్పినారు. ఈ భావమే నరసింగకవికి స్ఫూర్తినిచ్చియుండవచ్చును. 'అఖండం పుణ్యానాం ఫలమివచతద్రూపమనఘం'అని కాళిదాసు అన్నట్లుగా ఆ రాజకన్యల సౌందర్యము అంత గొప్పది. నరసింగకవి ఈ పద్యము అంత విశిష్టమైనది.

నరసింగకవి(బ్రహ్మ) రాజకన్యల (త్రిపురసుందరి)రూపనిష్పత్తికై A. రాకారజనీకర ప్రభలు, B. 'కంతుని తూపులు, C. కుందనంపు బంగారము అన్న మూడు సాధనసామగ్రులను వాడినాడు. వీనియందు కవి అంతస్సంస్కార కారణముగా 'సాధకుడు సాధనాక్రమమునందు ఓజశ్శక్తిని ప్రాణశక్తిని, కుండలినీశక్తిని) ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి యోగముంద్వారా షట్చక్రములను దాటించి, సహస్రారమును చేర్చుటవలన జీవన్ముక్తుడుకాగలడు'

అనురాజ యోగమునకు సంబంధించిన మూలధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, ఆజ్ఞా చక్రముల స్ఫురణ కలుగుచున్నది. ఇదియే శ్రీచక్ర విలసనము.

ఈ షట్చక్రములు రెండు రెండుగా కలిసి మూడు ఖండములు అగుచున్నవి. 'మూలాధార, స్వాధిష్ఠానములు-అగ్నిమండలము, రుద్రగ్రంధి. మణిపూరక, అనాహతములు-సూర్యమండలము, విష్ణుగ్రంధి. విశుద్ధి, ఆజ్ఞాచక్రములు-చంద్రమండలము, బ్రాహ్మగ్రంధిగా[11] ప్రసిద్ధములు. నరసింగకవి రాజకన్యల రూపనిష్పత్తికై స్వీకరించిన మూడు సాధన ద్రవ్యములందు ఇవి అవరోహణ క్రమమున సూచితములు.

A. 'రాకారజనీకరప్రభల' అనుట ఆజ్ఞా, విశుద్ధిచక్రములకు సంకేతము.

మానవుని చైతన్యమునకు మూలకారణమై, శుద్ధజ్యోతిస్స్వరూపమైనది ఆజ్ఞాచక్రము. ఇది చక్రములన్నిటిలోను తలమానికమైనది. మనస్తత్వము. చంద్రమండలము.

జీవులకు నూతనోత్తేజమును, నవచైతన్యమును ప్రసాదించు అమృత వర్షిణియే విశుద్ధిచక్రము. ఇచ్చటగల చంద్రమండలాంశనుండి ఉచ్ఛ్వవించు అమృతసారమే జీవులమనుగడకు కారణము. ఇది ఆకాశతత్త్వము.

ఈ రెండు చక్రములు బ్రహ్మగ్రంధియనబడును. జ్ఞానకారకుడు బ్రహ్మ. జ్యోతిస్స్వరూపుడైన (జ్ఞానమయుడైన) చంద్రుడు తన కళలతో దీనిని ఆవరించియుండును. 'రాకారజనీకరప్రభ' అన్న నరసింగకవి సమాసము ఈ రెండు చక్రములను సూచించుచున్నది. చంద్రుడు జ్యోతిర్మయుడు, అమృతకిరణుడు, ఆకాశసంచారి' అగుట ప్రసిద్ధము.

B. 'కంతుని తూపుల' అనుట అనాహత, మణిపూరములకు సంకేతము.

జీవుని సర్వకర్మలకు ఆధారభూతమైన హృదయాకాశము (మనస్సు) అనాహత చక్రము. ఇది వాయుతత్త్వము. 'కంతుని తూపు' ఈ అంశమును

సూచించుచున్నది. సకల భువనములను వ్యాకులపరచునట్టి కంతుడు 'మనసిజు' డగుట ప్రసిద్ధము. ఇతని బాణము (తూపు)-పద్మము. ఇందు పుష్ప రసము ముఖ్యమైనది. ఇదియే సంవిచ్చక్రము - జ్ఞానకమలము - అనాహత చక్రము. 'పుష్పము సుగంధ మకరంద భరితము - వాయువు గంధవహుడు' అగుటవలన అనాహత చక్రము సూచితము.

అలంకారస్థానమై, ఉదకతత్త్వమైనది మణిపూరక చక్రము. ఇది మణుల చేత పూరింపబడినది. స్వాధిష్ఠానమునందలి రుద్రాగ్నితప్తమైన భువనగ్లాని హరించునట్లు కటాక్షవర్షము కురిపించినది. 'తాపమును పొందిన వారికి పుష్ప ములు శైత్యమును కలిగించుట, అలంకార సామగ్రియగుట' వలన 'కంతుని తూపులు' అన్నది మణి పూరకమును సూచించుచున్నది.

ఈ రెండు చక్రములు 'సూర్యమండలము - విష్ణుగ్రంథి' యగును. మన్మథుడు విష్ణువు కొడుకు. 'ఆత్మావై పుత్రనామాసి' అన్న శ్రుతివాక్య ప్రమాణ ముగా 'కంతుడు' విష్ణువునకు ఉపలక్షకము. విష్ణువు 'సూర్యమండలమధ్యవర్తి' అన్నది ప్రసిద్ధము.

C. 'కుందనంపు బంగారము తోడ' అనుట స్వాధిష్ఠాన, మూలాధారము లకు ప్రతీక.

స్వాధిష్ఠానము అగ్నితత్త్వము. 'కుందనంపుబంగారము' - మేలిమి బంగారము అన్నది తేజస్సామ్యముచేత అగ్నికి ఉపలక్షకమై ఈవిషయమును సూచించుచున్నది.

మూలాధారము పృథ్వీతత్త్వము. సమస్తమునకు భూమిమూలాధారమైనది. పృథ్వికి 'వసుంధర' అన్న పేరుండుట వలన బంగారము పార్థివ మగుట ప్రసిద్ధము. అందువలన 'కుందనంపు బంగారము'అన్నది మూలాధారచక్రమును సూచించుచున్నది.

ఈ రెండు చక్రములు 'అగ్నిమండలము-రుద్రగ్రంథి'యగును నిప్పు కణిక - మేలిమి బంగారము రూపసామ్యముచేత తుల్యములు. కృశానురేతుడైన

ఈశ్వరునివీర్యము సువర్ణమైనదనుట ప్రసిద్ధము-'గంగాయాం అగ్నినాన్యస్తస్య మహేశ్వరస్య వీర్యస్య హిరణ్యత్వేన భూతత్వాత్ గాంగేయం' - గురుబాల ప్రబోధిక. కనుక బంగారము. ఈశ్వరునికి-రుద్రగ్రంథికి ఉపలక్షకము.

ఈమూడు పరికర ద్రవ్యములచేత కవి (బ్రహ్మ) నిర్మించిన స్త్రీ రూపము 'శృంగార రసాన్వితాకృతి' యైనది. ఇది కామేశ్వరి (జగదంబ) కరుణారూప మైన అరుణాశక్తికి, చిదానందాకారమునకు ప్రతీక. ఈమె శృంగార రస రూపిణీ. జగమును రక్షింప నిపుణమైనది.

ఈవిధముగా నరసింగకవి రాజకన్యల వర్ణనా వ్యాజమున ఒక పద్యము ననే షట్చక్ర స్ఫూర్తితో జగదంబను వర్ణించుట ఆయన శబ్ద సంయమన శక్తిని చాటుచున్నది. మిగిలిన ఇరువది మూడు పద్యములందును రాజకన్యల ప్రత్యంగ వర్ణనము 'సౌందర్యలహరి'ని అనుసరించు రీతిలోనే సాగినది.

4. రాజకన్యల మద్యపాన సన్నివేశ వర్ణనమున 'తత్త్వమసి' అన్న సామవేద మహావాక్యార్థము స్ఫురించుచున్నది. 'లోకమాయను గ్రహించుటవలన సాధకునకు కలిగిన 'సంవిత్' జ్ఞాన ఫలితముగా సిద్ధించిన 'సమ్యగ్దర్శన శక్తి చేత అతడు సమస్త చరాచరమందంతటను పరమాత్మను దర్శించగలడు. అనగా 'సగుణమునందు నిర్గుణమును దర్శించుట' అన్నది దీని భావము.

'మీయతే ఇతిమాయా' దేనివలన కొలువబడునో అది మాయ. కొలుచుట కందని పరబ్రహ్మమును మిథ్యాజ్ఞాన నిర్మాణమగు ఈ ప్రపంచముతో (పరీక్ష్యా న్లోకాన్-లోకములను పరీక్షించి) పరీక్షించి కొలుచుచున్నట్లగపడు చున్నందున మాయ అనబడును. 'మతింస్వాత్మానం దర్శయతి ఇతి మాయా' అనగా ఆత్మ దర్శనము కలిగించునది మాయ. 'మా' అనగా చూపుట. విషయము యథార్థమున లేకున్నను ఉన్నట్లు మన దృష్టికి తోపింపజేయునది మాయ. 'రజ్జు సర్పభ్రాంతి యందు రజ్జువునందు లేని సర్పమును ఉన్నట్లు చూపునది మాయ' అన్నవి విజ్ఞులు పేర్కొన్న మాయాలక్షణములు.

వేదాంతమునందు 'మాయ మిథ్య' అని చెప్పబడి యున్నందువలను ఆ మిథ్యాపదార్థము అధిష్ఠానమైన బ్రహ్మమునందు కల్పితమగుట వలనను,

అధిష్ఠాన సత్తకంటే వేరగుసత్త (వస్తువుయొక్క ఉనికి) లేక పోవుటవలనను - మాయ తొలగినచో బ్రహ్మము సాక్షాత్కరించునని పండితాభిప్రాయము.

వారుణి పాన మత్తలైన రాజకన్యల 'మాటలు-చేష్ట'లందు ఈ విధమైన వేదాంత భావములు పొడసూపుచున్నవి. ఈ విషయమును విచారించుటకు ముందుగా దీనికి సంబంధించిన 'పూర్వరంగము'ను నరసింగకవి ఎట్లు సిద్ధ పరచినాడో గమనించుట అవసరము.

వేటనెపముగా రైవతకాద్రి చెంగటికి వచ్చిన బలరామునికి, ద్వారకకు వచ్చుచుండిన రాజకన్యలు అప్రయత్నముగ కలిసినారు. ఆయన వారిని విందు భోజనమునకు ఆహ్వానించినాడు. ఆ సమయముననే వరుణుడు బలరామునికి 'వారుణి' అను పేరుగల మద్యమును కానుకగ పంపినాడు. భోజనముల సమయ మున బలరాముడు రాజకన్యలకు 'వారుణి ప్రభృతమత్త ద్రవ్యంబులొసగిన' (146-3) వారు దానిని సేవించినారు.

ఈ 'వారుణి'-లౌకిక దృష్టితో భావింపబడునట్టి కాయికమత్తును కలిగించు నట్టి సాధారణ మద్యమువలెకాక, తైత్తిరీయభృగువల్లి యందు చెప్పబడిన, పర మాత్మ సాక్షాత్కారము గావించునట్టి 'భార్గవీ వారుణీ విద్య'గా స్ఫురించు చున్నది.

గురువు లేనిది ఆత్మవిద్య సిద్ధించదు. రాజకన్యలకు బలరాముడు గురు తుల్యుడు. కృష్ణుని పరోక్షమున వారిని ఆదరించినవాడు బలరాముడు. 'జీవాత్మ-పరమాత్మ'లను కలుపునది యోగశాస్త్రము. 'యుజ్' అనగా కలుపుట. ఆది శేషుని అవతారమగు పతంజలి ఈ శాస్త్ర నిర్మాత. బలరాముడు కూడ అంతకు ముందు ఆదిశేషుని అవతారమే. అందువలన బలరాముడు రాజకన్యలకు యోగ శాస్త్రోపదేష్టఅయి, వారికి పరబ్రహ్మబోధకమైని 'వారుణీవిద్య'ను ప్రసాదించి నాడని ఈ సన్నివేశము వలన స్ఫురించుచున్నది. (అమరావతి నుండి కృష్ణుడు మరలివచ్చిన పిదప 'వివాహవిధి'చేత రాజకన్యలను స్వీకరించి, వారి సంకట ములను తొలగింపుమని తమ్మునికి కర్తవ్యము గుర్తుచేసి, పెండ్లిపెద్దయై 'రాజ కన్యకా కృష్ణుల వివాహము'ను జరిపినవాడును బలరాముడే. ఈ విధముగా

నరసింగకవి 'రాచకన్యకా పరిణయ'మున బలరామునికి మిక్కిలి ప్రాధాన్య మిచ్చినాడు)

వారుణీ పాన పరవశలైన రాజకన్యలు దానిరుచికిపొందిన ఆనందమును నరసింగకవి ఈ విధముగా వివరించినాడు.

'వరుణుడు బంపించిన యా
సుర రుచిగొని సుదతులెల్ల సౌక్క ప్రమోదా
భరితలయి సన్నుతించిరి,
సురుచిర వారుణిని సరసశుభవాక్సరణిన్' (147-3)

అది 'సుర'. (సు-సుగతిని-ముక్తిని 'ర'-పొందించునది). అనగా తాత్కాలిక మత్తును కలిగించునది కాక అఖండానంద దాయకమై, ముక్తిప్రదమైనది. అందు వలననే ఆసుదతులు సౌక్క ప్రమోద ఆభరితలై దానిని ఈ విధముగ కీర్తించిరి.

'కండచక్కెర పానకంబరుదు జనములు
నమ్మమ్మ యీ యాసవమ్ము సరియె
ద్రాక్షలంబు మధురిమాత్మ్యుద్రమందురు గాని
జుంటి తేనియు దీనివంటి దగునె
కమ్మదనమ్ము చొక్కదనమ్మని యెంతురు
పాలమీగడ దీని బోలునటనె
మాధుర్యమున దివ్యమామిడి ఫలరసం
బరుదు దీటౌనె యీహాలమునకు
భువినిగల సర్వ ఫలరసములు గ్రహించి
దీని గల్పించెనో చతురాననుండు
నిట్లుకాకున్న నీరుచీలేల కలుగు
ననుచు బొగడిరి యంగనా మణులునెల్ల' (148-3)

ఆ వారుణి 'చతురానన' భావితమైనది కనుకనే, దానిసేవనమున రాజకన్యలు 'చతుర్వర్గ' ఫలసంబంధియైన బ్రహ్మానందము ననుభవించినారు. అందువలననే

'ఇట్టుకాకున్న ఈరుచులేంకలుంగనన్న' సంభ్రమమున మునిగిపోయినారు. దీని అనుభవము వారికి 'వింతలలో వింతయై సుఖాస్పదమై' తోచినది. అది మామూలు అనుభవమే అయినచో సాక్షాత్తుగా అనుభవించుచున్నదానిని వారు 'తోచినది'అని అనుకొనవలసినపనిలేదు. ('గోవు'ను చూచుచు ఇది 'గోవుగా తోచుచున్నది' అని ఎవరును అనరుకదా) ఆ 'పదార్థము' (కవి ఇక్కడ 'వారుణిని' 'పదార్థము' అన్నాడు-అనగా బ్రహ్మపదార్థము)వలన వారికి మాటలకందరాని సంతోషమును పొదలజేసినది. 'కన్నులందు, మదిని' 'సొంపులు' గూర్చినది. అనగా వారి చక్షుర్మానసములు (బహిరంతర నేత్రములు) సమస్తచరాచరమందంతటను పరబ్రహ్మను దర్శించగలిగిన దివ్యదర్శనాసామర్థ్యమును పొందినవి. ఈ దివ్య దర్శనము మామూలు లౌకిక నేత్రములకు గోచరించునదికాదు. కనుకనే శ్రీకృష్ణుడు అర్జునునకు కురుక్షేత్ర రణరంగమున తన విశ్వరూపమును చూపుటకు ముందుగా దివ్యచక్షువును ప్రసాదించినాడు. రాజకన్యలకు ఆ దివ్యదృష్టి బలరాముని కారణముగా లభించిన 'వారుణి(విద్య)' వలన సిద్ధించినది. నరసింగ కవి రాజకన్యల ఈ'వారుణీ అనుభవమును' ఈ విధముగా చెప్పినాడు

'మదిరాపాన ప్రమత్తచిత్తలగుచున్ మత్తేభయానల్ సుఖా
స్పదమై తోచిన యప్పదార్థమును జెప్పన్‌రాని సంతోషముల్
బొదలన్‌జేసెను గన్నులందుమది సొంపుల్‌గూర్చెనంచుండగన్
బదియార్వేవురు కన్యకామణులదభ్రస్తోత్రముల్ సల్పుచున్' (149-3)

అనిరాజకన్యలు ఆ అనుభవమును అదభ్రముగా-అనల్పముగా స్తుతించినారు.

ఈ అతిలోకమైన అనుభవమునకు భ్రాంతిచెందిన రాజకన్యలుచేసినచేష్టలు వర్ణనాతీతములు. దీనికంతటికి కారణము రాజకన్యల కృష్ణభక్తి. అమృతస్వరూపమైన ఆ భక్తిచేత వారుచేసిన చేష్టలు మనోమోహనముగ నున్నవి.

'గానమొకర్తె పాడను బికస్వరసుస్వరముల్చెలంగగా
వీణగ్రహించి మీటునలివేణి యొకర్తెశిలల్‌గరంగగా
జ్ఞానముదెల్పునొక్కతె జగజ్జనముల్‌ముదమందుచుండగా
దేనియలొల్కు ముచ్చటలు దెల్పునొకర్త సఖుల్నుతింపగాన్' (152-3)

అని నరసింగకవి వారిచేష్టలను వివరించినాడు. నారదమహర్షి 'యద్జ్ఞాత్వామత్తో భవతి, స్తబ్ధోభవతి, ఆత్మారామోభవతి' 'యద్-పరాభక్తితత్త్వము (పరమాత్మ తత్త్వము)ను తెలిసినవాడు మత్తుడును, స్తబ్ధుడును, ఆత్మారాముడును అగును' అని ఇట్టి చేష్టలను భక్తి సూత్రములందు వ్యాఖ్యానించినాడు.

ఇట్టిస్థితిలోని మనస్సు మహావిచిత్రమైనది. నిరర్గళమైనది. స్వేచ్ఛా విహారణ శీలమైనది. దీనికీ అవధులులేవు. ఇట్టి స్థితినే వైరాగ్యప్రకరణములో భర్తృహరి 'స్వాతంత్ర్యేణ నిరంకుశం విహరణం స్వాంతంప్రశాంతం సదా' అని అన్నాడు. దీనిముందు త్రైలోక్యరాజ్యాధికారముకూడ శూన్యప్రాయమే.

నరసింగకవి ఈవిధముగా '**పూర్వరంగము**'ను సిద్ధపరచినపిదప

'మాలూరఫలములు మర్రిచెట్ల ఫలించె
నీవింతగంటివే యిగురుబోణి!
జంబీరములు బుట్టు నింబతరువులయందు
నీ చోద్యమేమమ్మ యిందువదన!
నేరేడుచెట్లకు నారింజలుదయించె
నీమహత్వంబేమి కోమలాంగి!
ఖర్జూరవృక్ష సంఘములందు ద్రాక్షలు
పండుట చిత్రమౌ పంకజాక్షి!

యనుచు మైరేయ పానసంజనితమత్త
చిత్తలగుచును దమతమచేష్టలెల్ల
జూచువారికి వింతలు దోచునట్లు
భ్రాంతిముచ్చటలాడిరి పడతులెల్ల' (153-3)

అన్న పద్యమున 'వారుణీపానానంతర రాజకన్యల ఉన్మత్తచేష్టలను' వర్ణించినాడు.

ఇది, కవిబ్రహ్మ తిక్కన సోమయాజి తన భావనాపటిమతో భీముని భీకరకోపభావమునకు రూపమును ఇచ్చి దర్శింపజేసిన నేలయు నింగియుతాళ ముల్గాజేసి యేపునరేగి వాయించియాడ అన్న విరాటపర్వమందలి పద్యమంత గొప్పది. ఈమాట కొందరు సంప్రదాయవాదులకు కోపముకలిగింపవచ్చును.

ఈ నరసింగకవిని తిక్కన సరసన కూర్చొన బెట్టుటయేమియని. కాని 'ఎవ్వ రేమన్న సంద్రుగాకేమికొరత' 'వచియించెదకల్గినమాట గట్టిగా'.

రాజకన్యల అంతస్సంస్కారకారణముగా ఈ చేష్టలందు 'జగన్మిథ్యాత్వ కత్వ ప్రతిబోధకములు, సృష్టిరహస్యతత్త్వ సంకేతకములు' అయిన వేదాంత భావములు స్ఫురించుచున్నవి.

నిజమునకు రాజకన్యలు 'మర్రిచెట్లపై మారడికాయలు, వేపచెట్లపై నిమ్మకాయలు, నేరేడుచెట్లపై నారింజకాయలు, ఖర్జూర వృక్షములపై ద్రాక్షలు పండుటల'ను చూచికాదు వింతపడినది. అంతేగాక ఇట్లు కాయుట లోకమునందలి వ్యావహారిక సత్యమునకు విరుద్ధము. కాని నిరంతర చింతనము వలన రాజ కన్యలకు (ఆ వృక్ష-ఫలము' లందు) 'వటపత్రశాయియైన బాలముకుందుడు, జగన్మోహినికి ఈశ్వరుడు భ్రమయుట, రాసలీల, దేవతలకు అమృత ప్రదానము' వంటి పరమాత్ముని లీలలను వ్యంజించునట్లుగా 'ఒక వృక్షముపై- అన్యఫలము ఉదయించినట్లు' భాసించినది. ఇది ప్రాతిభాసిక సత్యము. అనగా వారికి కనబడు దృశ్యమాన ప్రపంచము ఒకతీరున ఉన్నది. (మాలూర ఫలము-మర్రిచెట్టుగా) - అది చిత్తమునకు అనుభూతమగుట వేరుగా ఉన్నది (వటపత్రశాయిగా). అది వింత. ఆత్మ సంస్కారజన్యమైన ఈ అనుభూతి విశేషము వారికే ఆశ్చర్యమైనది. వారు తమలోని 'దానిని' (పరమాత్మ తత్త్వ మును) తెలిసికొన్నారు. అందుకనే వారు 'ఈ వింతగంటివే ఇగురుబోణి!, ఈ చోద్యమేమ్మ యిందువదన!' అని పలుమార్లు. పలువిధములుగా పరస్పరము చెప్పుకొని పరవశించినారు. 'ఇది' (ఆరోపిత దృశ్యమాన ప్రపంచము) ఇది కాదు 'అది' (అధిష్ఠాన బ్రహ్మము) అని అప్పుడే వారికి తెలిసివచ్చినది, దాని కొరకే వారు అంతకాలము భావతపఃపారావారమున మునిగియుండినారు. వారి తపస్సు సిద్ధించి పరమాత్మ తత్త్వము సాక్షాత్కారమైనది. వారు దర్శించిన పరమాత్మ తత్త్వము ఒక విధమైనది కాదు-బహురూపమైనది. నియతమైనది కాదు-స్వేచ్ఛా పరివర్తన శీలమైనది.

'అంభోధిస్స్థలతాం-స్థలం జలధితాం ధూళీలవశ్శైలతాం,
మేరుర్మృత్కణతాం తృణం కులిశతాం వజ్రంతృణప్రాయతాం,

వహ్నిః శీతలతాం హిమం దహనతామాయాతి యస్యేచ్ఛయా,
లీలాదుర్లలితాద్భుత వ్యసనినేదేవాయతస్మైనమః' (పూర్వ ప్రసిద్ధశ్లోకము)

అన్నట్టి జగదీశ్వరుని చిద్విలాసమును రాజకన్యలు ఆకళింపుచేసికొన్నారు. ఇది అసలైన 'వింతలకు వింత'. అందుకేవారు మత్తచిత్తలైనారు. ఇంతకన్న భ్రాంతి మదమైనది మరొకటి లేదు.

'మత్తోనాన్యత్కించిదత్రాస్తి విశ్వం సత్యంబాహ్యం వస్తుమాయోపక్లుప్తమ్
ఆదర్శాంతర్భాసమానస్యతుల్యం మయ్యద్వైతే భాతితస్మాచ్ఛివోఽహమ్॥'

అని శంకరులు ఆత్మపంచకమున చెప్పిన అద్భుతస్థితి ఇట్టిదే.

దీనినే పారమార్థిక సత్యము అందురు. ఇది వ్యావహారిక, ప్రాతిభాసిక సత్యమునకు మీదనున్నది. ఇది త్రికాలాబాధితమైనది. శాశ్వతమైనది. ఇచ్చట అంతయు ఒక్కరూపుననే యుండును. ఇంద్రియ వ్యాపారముతో దీనికి నిమిత్తము లేదు. ఇది కేవల బ్రహ్మమయము. దివ్యదృష్టితో పరమాత్మని దర్శించగలిగిన దివ్యశక్తినే ఆదిశంకరులు 'మనీషాపంచకమున' 'దృఢప్రజ్ఞ' అన్నారు. రాజకన్యలు ఇట్టి దృఢప్రజ్ఞ చేతనే అంతటను ఆ పరాత్పరుని దర్శించినారు. అందువలననే 'వారి చేష్టలన్నియు చూచువారికి కూడ వింతలుగ దోచినవి'

ఆది శంకరులు దక్షిణామూర్తి స్తోత్రమున

'సర్వాత్మ త్వమితి స్ఫుటీకృతమిదం యస్మాదముష్మిన్ స్తవే,
తేనాస్య శ్రవణాత్త దార్థ మనన ధ్యానాచ్చ సంకీర్తనాత్;
సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యాదీశ్వరత్వంస్వతః,
సిద్ధ్యేత్తత్పునరష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్.' (ద.స్తో.శ్లో. 10)

అన్నదాని సారాంశమిదియే. తత్త్వమసి' అన్న మహావాక్యసారమిదియే.

ఇక్కడ మరో విశేషము కూడ ఉన్నది. 'మాలూర' శబ్దము సర్వ మంత్రాధిష్ఠానమైన 'ఓం' కారమునకు ఉపలక్షకము. ఇందులో 'మ, ఆ, ల,

ఊ, ర' అన్న అక్షరాలున్నవి. మ-జీవుడు, అ-పురుషుడు-పరమాత్మ. అనగా 'మా' అన్నవి జీవబ్రహ్మైక్యమునకు ద్యోతకము. ఇది అద్వైతపరము.

'లూర' అన్నదానిలో 'ల' అన్నది శక్తిబీజకమై సర్వధర్మములను అనుష్ఠింపవగిన పార్థివదేహము. 'ఊ'తో చేరినది. 'ఊ' అనగా శ్రోత్రమానస సంభూతమైన శత్రువులను నిగ్రహించునది. అనగా చక్షురాది దశేంద్రియము లను, అంతరంగ చతుష్టయమును, అరికట్టునది. ఈ విధముగా సాధన చతుష్టయమంచలి శమదమాదులను సాధించిన జీవుడే 'లూ'. 'ర' అనగా పరమాత్మ. ఇక్కడ జీవబ్రహ్మములకు అభేదము చూపబడినను, నిత్య సంసర్గమున్నవి 'లూర' అని. జీవుడు ఉత్తమమైన పరాభక్తి స్థితిలో ఉన్నప్పుడు పరమాత్మైక్యమును కాంక్షించక, జీవాత్మగనే ఉండి బ్రహ్మానందమును అనుభవించు స్థితినే కోరును. ఇది విశిష్టాద్వైతపరము. ఈ విధముగా నరసింగ కవి జీవబ్రహ్మల సంబంధాలను 'మాలూర శబ్దముచేత అద్వైత విశిష్టాద్వైత పరముగా సూచించినాడు. అంతగొప్ప అద్వైతియైన శంకరులు కూడ ఇట్టి విశిష్టాద్వైత స్థితినే కాంక్షించినారు- 'న మోక్షస్యాకాంక్షా భవతి భవవాంఛాపిచ నమే'- (దేవ్యపరాధాస్తోత్రము)

ఈ పద్యారంభము మాలూరఫలము, తర్వాతి పద్యారంభము 'మానస పూజా విధానక్రియలు' అనగా పరమాత్ముని మానసపూజా విధానముచేతనే పొందవలయునని కవి అంతరార్థము.

నరసింగకవి పద్యము'మాలూర ఫలములు' (153-3) అన్నదానియందు ఇంత అంతరార్థమున్నదన్న ఊహకు ప్రోద్బలకముగా, కవియే వ్యాఖ్యాన ప్రాయముగా '**ఉత్తరరంగమును**' సిద్ధముచేసినాడు. ఈ పద్యమునకు వెంటనే

మానస పూజావిధానక్రియల గృష్ణు
　　గాంచి సేవించిరి కన్నెలపుడు
హరికీర్తనామృత సరసిజాకరమున
　　దేలియాడిరి రాజబాలికలును

దేవకీనందన భావిఫలాప్తికు
పొంగుచుండిరి రుచిరాంగులెల్ల
జితదితి సుతశౌరి వితత కథల్ విని
కొనియాడుచుండిరా వనితలెల్ల

గడియకొక యేడుగా బ్రొద్దు గడుపుచుండు
కామినీమణు లాసవ భ్రామికమున
దేహముల చింతకాసంత తెలియలేక
నీలవేణులు హరిమీద జాలిజెంది' (154-3)

అని చెప్పుటవలన రాజకన్యల కృష్ణపరత కృష్ణమయతల స్పష్టమగుచున్నది.

అప్పుడు బలరాముడు 'వారి గుణములను పరీక్షించి, మధురిపుపై వారికి గల మిక్కిలి వ్యామోహమును గాంచి వారితో గౌరవముగా (157-3) ప్రొద్దు పోయినది నిద్దురలు పొందని, ఆయాసపడవలదని' (158-3) చెప్పినాడు. అతని 'అమృతతుల్యములైన పలుకులు' విని వారు నిద్రపోయిరి. ఆ నిద్రలందు వారకి పరిపరి విధములుగా కృష్ణ సంభోగ సుఖము కలిగినట్లు స్వప్నములు పొందిరి. మేలుకొన్న పిదప వారు ఆ వృత్తాంతమును పరస్పరము ఈ విధముగా చెప్పుకొనిరి.

'సొగసుగా చెక్కిళ్ళు చుంబించి చుంబించి
చేరిమోమున మోము చేర్చెనమ్మ
కరమున పాలిండ్లు గదియించి గదియించి
మించువేడుక గౌగిలించెనమ్మ
చక్కెరమోవి చురుక్కన పలుకెంపు
లుంచుచు దయను లాలించెనమ్మ
అతను సంగరమునకతి దమి బుట్టించి
కళలు ఝల్లనగను గవిసెనమ్మ

కలయనుచుదోచు నిక్కంబుగాగ దోచు
నెందుబోయెనో యిటుజేసినందసుతుడు
నంగజుని బారికిట్లు నన్నప్పగించె
చేరి యొకరికి నీ సిగ్గు జెప్పనీదు' (166-3)

'తరుణీ! కృష్ణుడు నాదుస్వప్నమున నుత్సాహంబుతో వచ్చినన్
పరిరంభంబొనరించి చుంబనములున్ బల్మారు గావించినన్
మరుకేళిం దనివారదీర్చి మణిదామంబిచ్చి యీరీతితి సు
స్థిరసౌఖ్యంబులు సల్పువాని క్రియంజేసెం లేదుమేల్కాంచినన్' (170-3)

అని ఈ రీతి తెలుపుకొనుటలో వారు కృష్ణుని 'హరి, జాంబూనదాంబరుడు, శ్రీకాంతుడు' అన్న పరాత్పర బోధకమైన సంబోధనతో చెప్పినారు. ఇవి రాజకన్యల స్వప్నాలుకావు. ఎందుకనగా వారికి ఈ అనుభవము 'కలయనుచు దోచు, నిక్కంబుగాగ దోచు' అన్నట్లుగా ఉండుటవలన ఇది యథార్థమో, స్వప్నమో తెలియుటలేదు. అనగా ఇది 'జాగ్రత్త స్వప్నాల' కంటే భిన్నమైన 'జాగ్రత్ స్వప్నము, లేక స్వప్నజాగరము' అన్న స్థితి ఇది. దీనినే 'ఉన్మీలన స్థితి' అందురు. అంటే ఇక్కడ కృష్ణుడుగాకాక, విరాట్స్వరూపముగా వారికి పరబ్రహ్మ గోచరించినాడని భావము. అనగా సగుణరూపము కాక నిర్గుణ రూపము వారికి గోచరమైనదని అంతరార్థము. అనగా ఈ స్వప్నములందలి సంభోగము లౌకికశృంగార సంబంధమైనది కాక 'పరాభక్తి'తో గూడిన జీవ బ్రహ్మైక్యముగ ద్యోతకమగుచున్నది.

ఈ విధముగానున్న **పూర్వ, ఉత్తర రంగములతో** 'మాలూరఫలములు' అను పద్యమును అనుసంధించి చూడగా రాజకన్యలు జాగ్రత్, స్వప్న, సుషుప్తులందు ఏక విధముగా కృష్ణైక్యమునే కాంక్షించినారని స్పష్టమగుచున్నది. ఆది శంకరులు.

'జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరాయాసంవిదుజ్జృంభతే,
యాబ్రహ్మాదిపిపీలికాంతనుషు ప్రోతాజగత్సాక్షిణీ
సైవాహంనచదృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపియస్యాస్తిచేత్,' (మ. పం. 1)
అని 'మనీషాపంచకము'న చెప్పిన స్థితి ఇట్టిదే.

ఫలితాంశమేమనగా రాజకన్యకా కృష్ణుల సంయోగము 'జీవబ్రహ్మైక్యమునకు సంకేతము, అని.

* * *

ఈ మద్యపాన సన్నివేశాధారముగను, నరసింగకవి తన కథలో బల రామునికిచ్చిన ప్రాధాన్యకారణముగను - బలరాముడు విశిష్టాద్వైత సంప్రదాయ మున ప్రసిద్ధమైన సంకర్షణ వ్యూహముగా పొడకట్టుచున్నాడు.

సంకర్షణవ్యూహము :- 'ఇది వాసుదేవ వ్యూహము నుండి ఏర్పడినది. విజ్ఞానము, శక్తి అను రెండు గుణములు ప్రధానములు. తెల్లగా అమృత నురుగ వలెనున్న దేహము. నల్లని వస్త్రమును గలిగి హలమును ధరించి యుండును. ఈ గుర్తులవలననే బలరాముడు సంకర్షణునిగ నిర్దేశింపబడెను. జీవులనందరిని సంకర్షించుటవలన నీ వ్యూహమునకాపేరు వచ్చినది. కంసభీతులై చెదిరిన యాదవుల నంపరనాక చోటికి సంకర్షించుటవలన బలరాముడు సంకర్షణు డాయెను. సకల జీవులకితడధిష్ఠాత. అధిష్ఠానము అహంకారము. ఈ వ్యూహము నకు భూతేంద్రియ మానమయుడు, కర్తృత్వ, కారణత్వ, కార్యత్వ, శాంత్యత్వ, ఘోరత్వ, మూఢత్వ లక్షణములు గలిగినట్టి రుద్రుడే అధిష్ఠాత. పాతాళము నివాసము. ముప్పది వేల ఆమడ వెడల్పున తోకను చుట్ట చుట్టుకొని మహోగ్ర శరీరముతో ననంతుడను సర్పాకారముతో విలసిల్లెడు ఆదిశేషుడు అతడు. ఈతని వేయిపడగలందు అవగింజవలె భూమండలముండును. శాంతుడుగనున్నను సంహార సంకల్పము కలిగినప్పుడు క్రుద్ధుడై, రౌద్రము కలవారు, త్రినేత్రులు, త్రిశూలధారులునైన ఏకాదశరుద్రులను సృజించును. ఇతడు పాతాళమునందలి నాగేంద్రులచే నిరంతరము సేవానమస్కృతులను పొందుచుండును. నాగ కన్యకలు అగరుచందనకుంకుమాదుల మైపూతల నీతనికి సమర్పింతురు, దర్శన స్పర్శనాదులవలన మదనావేశమునంది సాభిలాషలై, సవ్రీడలై చూచుచుందురు. అనంతగుణుడైన ఈ అనంతుడపుడు క్రోధమును వీడి శాంతుడై లోకక్షేమమును కోరును. సుర నరగరుడోరగాదులు స్తుతించినపుడు ఈతడు ప్రీతుడై మాగన్ను వెట్టి కూర్కును. నారదుడు తుంబురాదులతో బ్రహ్మదేవుని సభయందీతని కీర్తించును'[12] అని పాంచరాత్రాగమమందలి సంకర్షణ వ్యూహమును శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు వివరించిరి.

ఈ విధముగా నున్న లక్షణములందు 'బలరాముడు విజ్ఞానమయుడుగను, కృష్ణపరోక్షమున ద్వారకయందు రాజకన్యల రక్షణపోషణశక్తి కలవాడుగను, వారి ఆంతర్యమును మన్నించి, రాజకన్యకాకృష్ణుల వివాహము కావించినవాడు

గను, రాజకన్య లనెడు జీవులను కృష్ణుడను పరమాత్ముని వైపునకు ఆకర్షించి ఆ జీవబ్రహ్మైక్యమునకు దోహదపడినవాడుగను' ఉన్నట్లుగా బలరామతత్త్వము 'రాచకన్యకాపరిణయము'న ప్రతిబింబించినది.

5. నారదుని ద్వారా రాజకన్యలు కృష్ణునికి పంపిన సందేశమును నరసింగకవి ఈ విధముగా వివరించినాడు.

'విగ్రహజాగ్రదుగ్ర భుజవీర్యముచే నరకుస్వధించి నీ
విగ్రహణం బొనర్చి ననవింటి వజీరునివంటి నీల స
ద్విగ్రహ సంగతిన్ శుభమతిన్ గనజేసితివేని మమ్ము భా
విగ్రహ బాధలంటవని వెన్నునితో నిటు విన్నవించుడీ' (187-1)

'నరకాసురుని సంహరించి, అతని చెరనుండి తప్పించి, తమ్ము స్వీకరించుమని' రాజకన్యలు కృష్ణునికి సందేశము పంపుట ఇందలి వాచ్యము.

కాని ఇందు వేదాంత సంబంధమైన 'జీవునిమోక్షేచ్ఛ' స్ఫురించుచున్నది.

'భవ'మనగా జననమరణాదిరూపమైన సంసారమని యర్థము (భవ జలధి). ఈ భవముయొక్క భావార్థకరూపమే 'భావము' అనగా అజ్ఞానజనితము లైన ప్రాపంచిక సుఖదుఃఖాదులు, జరామరణాదులు మొదలైనవి. ఈ 'భావము' మతుబర్థమున 'భావి' అగుచున్నది. అనగా ఇహలోకసంబంధమైన దుఃఖభూయిష్ఠ మైన మానవజన్మ. ఇది పరమాత్మ మాయాకల్పితముగా ఆరోపితమైనది. ఈ 'భావి' గ్రహము. గ్రహమనగా పిశాచమువలె బాధించునది యనిగాని, చెర యని గాని అర్థము చెప్పవచ్చును. ఎల్ల శరీరధారులకు ఈ సంసారము దుఃఖకారణ మైన చెరసాల అని భావము. అందువలననే

'జన్మదుఃఖం జరాదుఃఖం, జాయాదుఃఖం పునఃపునః,
సంసారసాగరం దుఃఖం, తస్మాజ్జాగృత జాగృత' అన్నారు ఆదిశంక రులు. ఈ బాధానివారణమునకు తరణోపాయమొక్కటియే. అదియే భగవదైక్య ప్రాప్తి. అనగా అధిష్ఠానమైన బ్రహ్మమును చేరుట.

ఈ పద్యమునందు 'నీ (త్వత్), లసత్ - ప్రకాశించునట్టి, విగ్రహ - 'విశేషేణ ఆత్మనా గృహ్యత ఇతి విగ్రహః' విశేషముగా ఆత్మచేత గ్రహింపబడునది - అనగా జ్యోతిస్స్వరూపమైన పరమాత్మతో, సంగతిన్-కూడికను, ఐక్యమును, శుభమతిన్-శ్రేయస్కరమైన బుద్ధియందు, కనజేసితివేని-కలుగజేసితివేని అనగా ఆత్మజ్ఞానమును కలిగించినచో, మరలమాకు ఈ 'భావిగ్రహబాధ' అనగా 'పునర్జన్మ బాధలు, అంటవు-కలుగవు, అని రాజకన్యలు-జీవులు, వెన్నునితో-సర్వాంతరస్థుడైన పరమాత్మునితో విన్నవించుకొన్నట్లుగా' అంతరార్థస్ఫురణ కలుగుచున్నది. అనగా 'జీవుడు ఆరోపితమైన, దుఃఖభూయిష్ఠమైన మానవజన్మను వీడి, శాశ్వతానందసంధాయకమైన అధిష్ఠానబ్రహ్మమును జేరి, జన్మరాహిత్యమును పొందుటకై గావించు ఆత్మవిచారము' ఈ పద్యమున అంతరార్థముగా బోధపడుచున్నది.

ఇక్కడ విశిష్టాద్వైత సంప్రదాయమున ప్రసిద్ధమైన 'అనిరుద్ధవ్యూహ' స్ఫూర్తి కలుగుచున్నది.

అనిరుద్ధవ్యూహము:- ఇది ప్రద్యుమ్నవ్యూహము నుండి ఏర్పడినది. వీర్య, తేజస్సులు ప్రధాన గుణములు. ఇతడు శరత్కాల విలసిత నీలోత్పలచ్ఛాయ గలవాడు. అధిష్ఠాత చంద్రుడు. హృషీకము (వస్తువున గోచరించునంత రింద్రియము) మనస్సు అధిష్ఠానము. కావుననీతడు హృషీకేశుడు. ఇతడును పరవాసుదేవుడే. కనుకనే ఇతనికివలెనే అతనికిని హృషీకేశుడు అని పేరు వచ్చినది. ఈ అనిరుద్ధవ్యూహ లక్షణములను శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యులు వివరించిరి.

ఈ లక్షణములు ఈ పద్యమున కనబడుచున్నవి.

'విగ్రహజాగదుగ్రభుజవీర్యము చేనరకున్వధించుట-అనుటలో యుద్ధరంగమున (నరకుని) ఎదిరించుట అనగా 'అనిరుద్ధత' అన్న అనిరుద్ధలక్షణము స్పష్టము. 'వీర్య' శబ్దమునకు పరాక్రమము, తేజము అని అర్థద్వయమున్నది. నీలసద్విగ్రహము, మనిస్-అనుటలో హృషీకేశత్వము' అన్న అనిరుద్ధవ్యూహ లక్షణములు కనబడుచున్నవి.

ఈ విధముగా వెల్లూరు నరసింగకవి 'రాచకన్యకాపరిణయ' ప్రబంధము నందు ఆధ్యాత్మిక భావములు అటనట అంతర్గతములై ప్రతీకల మూలమున స్ఫురించుచున్నవి.

ఇందే కవి మరికొన్ని ఇతర సందర్భములందును ఇట్టి భావములనే ప్రత్యక్షముగను, పరోక్షముగను నిబంధించినాడు.

## 1. కృష్ణుడు పరాత్పరుడని స్పష్టముగ చెప్పుట

నరసింగకవి ద్వారకానగర, కృష్ణవర్ణనలందు ద్వారక వైకుంఠమనియు, కృష్ణుడు శ్రీమన్నారాయణుడనియు స్పష్టముగా చెప్పినాడు.

'ద్వారక భూస్థలిన్ వెలయు తత్పుర వల్లభుడై సురద్విష
ద్వారక చక్రధారియగు తామరసాక్షుకు శౌరి భాసిలున్' (124-1)

'ద్వారావతి నవతార, ద్వారా వర్తించు చక్రధరుడవు(164-1)అన్నాడు.

'ఆమధురానివాసుడు దయామృత పూర్ణ కటాక్షవీక్షణా
యామ ధురాధరుండగుచు నాత్మల సద్విషయంబు నిత్యప
ద్మా మధురంబు సర్వసుఖదంబుగ జేసె ధరిత్రయందు నా
హా! మధురాక్షసారి గొనియాడగ శేషునకైన శక్యమే' (125-1)

ఆ మధురానివాసుడు-'మధు' అంటే తీయనిది. అనగా ఆనందము. 'ర' అనగా గ్రహించుట. కనుక 'మధుర' అనగా శాశ్వతానందమైన ముక్తినికోరు 'మనస్సు' అని అర్థము. ఇది నివాసముగా గలవాడు 'పరమాత్ముడు' అని అర్థము. కటాక్ష వీక్షణాయామధురాధరుడు. ఆత్మల సద్విషయము-ఆత్మయందు ప్రకాశించు విషయ మనగా ఆత్మవిచారము-ఆత్మవిద్య-పరమాత్మవిద్య. ఇది నిత్యము. శాశ్వత మైనది. పద్మామధురము-సంపన్మధురమైనది. సర్వసుఖదమైనది. దీనినికలిగించు వాడుకనుకనే 'ఆయన' 'మధురాక్షసారి' అయినాడు. ఇక్కడ 'మధు'వనగా ఇహలోక జీవనమందలి మాధుర్యము అనగా 'అజ్ఞానప్రమత్తు' అని అర్థము. ఈ రాక్షసమైన మత్తును హరించినవాడాయన. ఆయన మాహాత్మ్యమును నిరంతరము తల్పరూపమున నిత్యసంసర్గమున నున్న ఆదిశేషునకైనను వర్ణింపకలవికానిదని చెప్పినాడు కవి.

## 2. సంబోధనలు

ఇతివృత్తమునందలిపాత్రలు ఇంద్రుడు, గరుడుడు, దేవతాసముదాయము, భూదేవి మున్నగువారు కృష్ణుని స్తుతించుటలో నరసింగకవి కృష్ణుని వేదాంత వేద్యుడుగా చెప్పినాడు.

'సకల వేదాంతార్థ సన్నుత గుణజాల' (136-2), 'మౌనిమానసకాసార మదమరాళ', 'కలితదుగ్ధాబ్ధిమణిశాల', 'కనకచేల' (137-2) అని ఇంద్రుడు స్తుతించుటలోను, అఖిలవేదాంతవేద్యాయ', 'అఘహరాయ' (195/2) అని గరుడుడు స్తుతించుటలోను ఈ అంశము స్పష్టము.

ఇంకను కవి కృతిభర్తనుద్దేశించి చెప్పిన ఆశ్వాసాంత పద్యములందలి సంబోధనలు కృతిభర్తకు, పరాత్పరునికి ఇరువురికి వర్తించుచున్నట్లున్నవి. వానియందు రెండు, మూడు మాత్రము ఇట ఉదాహరించుట జరుగుచున్నది.

1. 'సర్వదా సర్వదేహా' (431-2) సర్వదా - ఎల్లప్పుడు, సర్వదా- సమస్తమును త్యాగము చేయవలయుననెడి, ఈహా - ఇచ్ఛగలవాడు-కృతిభర్త సర్వదాసర్వదేహ - సగుణరూపమున సమస్తమున నిండినవాడు-పరాత్పరుడు.

2. 'పరిహృత మధుమోహా' (431-2) పరిహృత - పరిహరించిన, మధు - మద్యపాన సంబంధమైన, మోహా - మోహము కలవాడు అనగా మది రాసక్తుడు కానివాడు - కృతిభర్త. 'పరిహృతమధుమోహా' అన్న సమాసమునకు 'పరిహృతం మధునా - మోక్షధియా - మోహం - లౌకికవ్యామోహం-యేనసః' అని వ్యుత్పత్తి చెప్పవలయును. ('మన్యతే అభిలష్యత ఇతిమధు - మనజ్ఞానే. మోక్షేధీర్జ్ఞానం' అని గురుబాల ప్రబోధిక) అనగా జ్ఞానముచేత లౌకిక వ్యామోహమును అపరించినవాడు - పరాత్పరుడు.

3. 'దురితతృణలవిత్రా' (233-4) దుర్మార్గులను శిక్షించువాడు - కృతిభర్త - రాజు. పాపహారకుడు - పరాత్పరుడు.

## 3. అవతార స్తుతులు

పరమాత్ముడు దుష్టశిక్షణకై. శిష్టరక్షణకై ధరించిన అవతారముల వృత్తాంతములను భాగవతము వివరించినది. అందు దశావతారములు ముఖ్యములు. కాని వీనియందు కృష్ణావతారము చేరలేదు. మిగిలిన అవతారములన్నియు అంశావతారములనియు, ఒకొక్క కృష్ణావతారము మాత్రము పూర్ణావతారమనియు పెద్దల అభిప్రాయము. ఈ కృష్ణావతార వృత్తాంతము ఆమూలాగ్రముగ భాగవత దశమస్కంధమున వర్ణితమైనది. భాగవత విధానమును అనుసరించిన నరసింగకవి దశావతారములను పెక్కు పర్యాయములు, పెక్కు విధములుగ కీర్తించుటలో ఆయాభావములను పొందుపరచినాడు. ఒక్కొక్క అవతారమునకు ఒక్కొక్క పద్యముగను (నారదస్తుతి. మాధవైకాదశకము. 152-163/1), పది అవతారములను ఒకే పద్యమున నామసంకీర్తన రూపమునను (అదితి స్తుతి 403-2), వ్యాజస్తుతి రూపమునను (నరకుని స్తుతి 324-2), రెండు పద్యములందు వైతాళికులు (180, 181-2) స్తుతించినారు. దేవతలు కృష్ణుని ఆ బాల్య క్రీడలను వర్ణించి, దానితోపాటుగా బుద్ధ, కల్క్యవతారములను స్తుతించినారు. (191, 192-4) ఈ స్తుతికి ప్రారంభమున దేవతలు కృష్ణావతార తత్త్వమును ఈవిధముగా పేర్కొన్నారు.

'వసుధాభారనివారణంబు సలుపక వాంచించి యాదేవకీ
వసుదేవోత్తమగర్భసంభవుడవై వర్తించి నందవ్రజం
బెసగన్‌జేరియు గుప్తభావభయ రాహిత్యైక సంచారివై
పసగా నందయశోదలన్ సుతుడనన్ భాసిలితౌమాయచేన్' (98-4)

ఈవిధముగా చెప్పుటలో విశిష్టాద్వైతమునందు పేర్కొనబడిన 'వాసుదేవ వ్యూహము' స్ఫురించుచున్నది.

వాసుదేవ వ్యూహము :- 'శాంతోదితుండగువాడు వాసుదేవుడు. నిత్యోదితుడగు పరవాసుదేవుడు మహత్తత్త్వము నధిష్ఠించినపుడు, అనగా పనిలో నియోగించుటకై ప్రేరేపించినపుడు వాసుదేవ వ్యూహమని పిలువబడును. వ్యూహములందు ఇది మొదటిది. మరకతగిరివలె శ్యామలము. క్షీరసాగరము నివాసస్థానము. ఇది షాడ్గుణ్యపూర్ణము (విజ్ఞానము,శక్తి,బలము,ఐశ్వర్యము, వీర్యము

తేజము) ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములందు వేరువేరుగా గ్రహింప బడినది. ఆధ్యాత్మికరూపమున చిత్తము. ఆధిభౌతికమున మహత్తు, ఆధిదైవిక మున వాసుదేవుడు. అధిష్ఠాత క్షేత్రజ్ఞుడు. దీనివలన, జీవుల పరిపాకదశవలన, నీ మహాత్మునికి సృష్టించవలెనని తలపుగల్గి మహత్తత్వమును ప్రేరేచునని యర్థము. సత్వగుణ ప్రధానమై, దోషరహితమై, నిత్యమై, శాంతియై, యూర్మి షట్కరహితమై (జన్మము, అస్థిత్వము, వృద్ధి, పరిణామము, అపక్షయము (మోహం), నాశములు (మరణము), అరిషడ్వర్గదూరమై యుండునని భక్తులు దీనిని సేవింతురు[14]' అని ఈ వ్యూహలక్షణములను శ్రీమాన్ వేదాల తిరువేంగళా చార్యులు పేర్కొనిరి.

## 4. భూదేవి స్తుతించుట

'రాచకన్యకాపరిణయమందు నారదాదిభక్తులు కృష్ణుని స్తుతించుటలన్నియు ఒకయెత్తు, ఒక్కభూదేవి స్తుతించుట ఒక్కయెత్తు. నరకవధానంతరము, యుద్ధ రంగముననున్న కృష్ణుని దర్శింపవచ్చిన భూదేవి చేసిన స్తుతి 'అద్వైతవేదాంత సారము'గా కనబడుచున్నది.

భూదేవి దర్శించిన కృష్ణుడు సాక్షాత్పరాత్పరుడే.

'అంతటగాంచె భూయువతి యద్రిధరున్ గమలామనోహరున్
గంతుగురున్ భవాంబుభవగర్భ బిడౌజముఖాదివందితా
త్యంత విలాసకౌస్తుభగదాబ్జ శరాసనచక్ర నందకా
క్రాంత ధురంధరున్ శ్రితజనాంచిత రక్షణసత్కృపాకరున్' (345-2)

'ఇట్లుకాంచిసర్వాంతర్యామిత్వ సర్వజ్ఞత్వ సర్వపరిపూర్ణత్వ నిర్వికల్ప నిజవినోద విస్మితాత్ముండై లక్ష్మీకాంతా విలాస భాసమానుండైన సాత్రాజితీయు తవిరాడ్సైంధవు సమీపంబునకుంజని వందనాద్యర్చనంబు లొనరించి యిట్లని విన్నవించె' (346-2)

'నీలాభ్రనిభకాయ! శూలాయుధశరాయ!
నిగమాంతగేయ! శ్రీనగధరాయ!
సురరాజసన్మిత్ర! సూరిసన్నుతిపాత్ర!
భూరిసంశ్రితవనపూర్ణచైత్ర!

సుగుణమానసభృంగ! ఖగమహేంద్రతురంగ!
కదనాశనస్వాంతకమలభృంగ!
వాంఛితార్థద! భక్తవరమానసవిలాస!
మహితకౌముదినిభమందహాస!

సగుణనిర్గుణములకు సాక్షిరూప!
బ్రహ్మభవనేత్రకర్ణాగ్రప్రకటమౌను
లాదిగాగల వారలకలవియగునె
నిన్నునుతిసేయదరమె యాపన్నరక్ష!' (347-2)

బ్రహ్మేశ్వరానంతులకే సాధ్యముకాని ఆపరతత్త్వవర్ణనము తనకెట్లు హృద్యపడ, గలదన్న ధ్వనిని ఇందు నరసింగకవి నిక్షేపించినాడు. అందువలననే అలవియ గునె, 'తరమగునె' అని రెండు క్రియారూపములు వాడినాడు. 'బ్రహ్మాదులకవి యగునె' అని, 'తనకు తరమగునె' అన్న భావమిందు గర్భితము.

పిమ్మట భూదేవి గావించిన స్తుతి గద్యరూపమున దండకప్రాయమై, ప్రగాఢ ఆత్మవిచార విషయనిబిడీకృతము.

'దేవా! పిపీలికాది యోనులందును మోదభేద భేదాభేద సంజనితులై దుఃఖాగ్నిహోత్రంబున తంతన్యమానులై, శోకశాంతిలేని శరీరాభిమానంబున మోహితులై చంచలులైన వారలకు సన్మార్గంబు జూపి పోషించు ప్రియుండవు, జగదీశ్వరుండవు, సత్యజ్ఞానానంత స్వరూపాతిశయనిర్వికల్పుండవు, గురుండవు, విశేషకల్పాధారమశేష భూతాంతర్యామిత్వేన వర్తమాన స్వభావ నిమీలిత లోచనుండవు. అప్రమేయము, అననుభవవేద్యము, అపరోక్షమని తెలియు వారలకు భాసమాన కరతలామలక పరదైవతంబైన నీ యొక్క బ్రహ్మ కీర్తనంబులైన విలాసావతార ప్రసంగ విశేషంబు లుగ్గడింపుచు కామక్రోధ లోభ మోహమదరాగాది విముక్తులై శోకార్ణవంబు యుష్మద్దివ్యస్మరణయాన పాత్రంబున ధరించి భవదంఘ్రి కమల రాజద్భంబరార్చకమానసులైన శ్రితజనులజేరి యుందురు; శాబకుని మాతాపితరులు, వ్యాధిని భేషజానీతంబైన యౌషధంబును, వాహినీశమధ్యంబున మునింగెడువాని నావయును పోషింప నిపుణత్వంబునేరని లీల సంసారసాగర సంగతేషణత్రయ తంతన్యమానులై మీచేత నిర్దయులైన

వారిని రక్షింపనితరుండు సాధ్యుండుగాడు, నిష్ప్రపంచంబైన జగంబు బ్రహ్మారోపణంబున స్వరూపాతిశయంబు నొందించు స్వర్గాధ్యక్షుండవీవ, నితర ముముక్షుండవు. నిరంజనుండవు; భవదధీనంబైన పురుషునికి నీ యుప దేశంబున మాతృజనకాది మమత్వ సంసార పావక దందహ్యమానునింజేయక కృతార్థులంజేయుచుండు విట్టి మహానుభావుండవని యెరుంగక యీ నరక దానవుండు రజస్తమో గుణావృత జడమానస కృతాపరాధుండై రంగదభంగ సంగరంబున మీచేతనిహతుండై ముముక్షుండయ్యె; దుర్విజన శిక్షణంబును, శిష్ట జన పోషణంబును మీకునైసర్గికంబులు' (348-2) అని భూదేవి కీర్తించుటలో నరసింగకవి తనకు ఆత్మీయమైన ఆధ్యాత్మిక భావములను ప్రత్యక్షముగ పొందుపరచినాడు.

ఈ విధముగా రాజకన్యలు, నారదుడు మొదలగు భక్తుల యొక్క భక్తి పూర్ణమైన భగవత్స్తుతులను నరసింగకవి 'రాచకన్యకాపరిణయము'న ఉచిత రీతిని అనుసంధించినాడు. 'మోక్షసాధన కారణములలో భక్తి శ్రేష్ఠమైనదని చాటుట' ఆయన అభిమతము. అందులో మధురభక్తికి మిక్కిలి ప్రాధాన్య మున్నది. అద్వైతమార్గమునందు ఇది చివరిమెట్టు అనియు, దీనిని అధిగమించిన మిగులునది అద్వైతమనియు' తత్త్వవేత్తల అభిప్రాయము.

అందరికి సులభముగ తెలిసి, ఆకర్షించునట్టిది లౌకికశృంగారము. దీని ద్వారా పరమోత్కృష్టమైన మోక్షరతికి అభిముఖులను చేయుటకై ఆధునిక పండితులచేత మధురభక్తి సిద్ధాంతము ఆవిష్కరింపబడినది.

నరసింగకవి తన కావ్యనాయికలైన రాజకన్యలను మధురభక్తిపూర్ణులుగా చిత్రించుటవలనను, 'విగ్రహజాగ్రదుగ్ర (187-1), వసుధాభారనివారణంబు' (98-4) వంటి పద్యములందు 'వాసుదేవాది చతుర్వ్యూహము'ల లక్షణములు కనబడుచుండుటవలనను 'రాచకన్యకాపరిణయ' కావ్యమున విశిష్టాద్వైతము దృష్టిగోచరమగుచున్నది. కాని కావ్యమున అంతర్లీనముగా అల్లుకొనియున్నది అద్వైతవాసన. పాత్రలు, సన్నివేశములు అనెడు పూలను బంధించిన దారము విశిష్టాద్వైతము. ఇది కంటికి కనబడునది. ఆ దారమునకు అంటిపెట్టుకొని, కంటికి కనపడక (విషయమును నిర్వహించినది) ఉన్న పుష్పసు'వాసన'

అద్వైతము. ఒకటి గుర్వనుగ్రహ (పురాణం దీక్షాచార్యుల) లబ్ధము. మరొకటి సత్సంగతికి (ఖండవెల్లి లక్ష్మయ్య) ఫలితము. నరసింగకవిపై భాగవతము, లీలాశుకుడు మొదలగువారి విశిష్టాద్వైతప్రభావము, ఆదిశంకరుల శివానంద లహరి, సౌందర్యలహరి మొదలైన స్తోత్రముల, అద్వైతసిద్ధాంతముల ప్రభావము సమప్రాధాన్యముతో ఉన్నవి. అందువలన ఈ రెండు సంప్రదాయములను సమన్వయించవలసిన అవసరమున్నది.

విశిష్టాద్వైత సంప్రదాయమున భక్తుడు పరమాత్మైక్యమును కాంక్షించడు. 'భగవత్సాన్నిధ్యస్థితిరేవ మోక్షాదతిరిచ్యతే' భగావదైక్యముకన్న భగవత్సాన్నిధ్యస్థితినే వారు ఎక్కువయని తలతురు. పరమాత్మనిదర్శన, సేవనాదులనేవారు ఎక్కువగా కాంక్షింతురు.

అద్వైతమనగా జీవబ్రహ్మైక్యమే. ఈ రెండింటి సమన్వయమును ఈ విధముగా భావింపవచ్చును.

'సాధన ప్రథమావస్థయందు పూజ్య పూజకులకు భేదభావము పూర్ణముగ నుండును. ఆ భావము క్రమక్రమముగా సన్నగిల్లి సిద్ధావస్థయందు అభేద స్థితిని బడయును. 'దేహబుద్ధ్యాతుదాసోహం జీవబుద్ధ్యాత్వదంశకః। ఆత్మబుద్ధ్యాత్వమేవాహమితి మేనిశ్చితామతిః॥' అనియున్నది. అయితే పరాభక్తియొక్క పరమావస్థయైన జీవబ్రహ్మైక్య భావము అనుభవసిద్ధమైన తర్వాతగూడ కొందరు భక్తులు జీవబ్రహ్మముల భేదభావమును ధ్యాసమాత్రముగనేని యుంచుకొనుటగలదు. ఇందుకు కారణము ఐక్యస్థితిలో ఆనందమే యగుదురుగాని, ఆ యానందానుభూతికి అవకాశము కలుగదు. చక్కెరయేయగు ఆనందముకన్న, చక్కెరయొక్క మాధుర్యమును చవిచూచు ఆనందమెట్లు విశేషమో అట్లే బ్రహ్మానందమే అగుటకన్న దానిననుభవించుచుండుట వారికి సౌఖ్యముగాదోచి వారట్లు భేదభావమును ధ్యాసమాత్రముగా (భక్తులు) ఉంచుకొందురు. భేద భావము పూర్ణముగ నశించినపుడు 'జీవన్ముక్తి' యని జ్ఞాను లందురు. భేదభావము తావన్మాత్రముంచుకొన్న వారిని 'పరమభక్తో'యని భక్తులందురు. వాస్తవము విచారించినచో ఇరువుర లక్షణములందు భేదమేకాన్పింపదు. కావున జీవన్ముక్తియన్నను, పరాభక్తియన్నను ఒక్కడేయని తేలుచున్నది. ఇదే అర్థమును విద్యారణ్యులును, స్వప్నేశ్వరులును తెలిపిరి[15] అనిత్యాగీశానందుడు 'నారదభక్తి సూత్రములు' అన్న గ్రంథవ్యాఖ్యానమున అద్వైత విశిష్టాద్వైతములకు మధ్యేమార్గమును పేర్కొనిరి.

'(సంకేతశిల్పము' అని ప్రారంభించిన విషయమునకు ఇటకొంత అతి వ్యాప్తి కలిగినను విషయసంబంధముచేత కొన్ని అధికాంశములను ఇందే వివ రించవలసి వచ్చినది.)

ఈ విధముగా నరసింగకవి గుర్వనుగ్రహము, సత్సాంగత్యము, ఆధ్యా త్మిక చింతనము, స్వీయానుభవము మొదలగు వానివలన సిద్ధించిన సంస్కారము ప్రాతిపదికగా తన 'రాచకన్యకా పరిణయ' ప్రబంధమును 'బ్రహ్మ విద్యా దర్పణము'గా తీర్చయత్నించినాడు. ఈ గ్రంథవ్యాజముగా ఈయన నాద బిందుకళోపాసన గావించినాడు. రాచకన్యకా పరిణయ గ్రంథము 'శబ్దమయ' మైనది కావున 'నాదాత్మకము'. ఇది మనోమయము. కావ్యగతార్థము' 'బింద్వాత్మకము' ఇది జ్ఞానమయము. ఇందలి అంతర్గతమైన 'పరమాత్మ భావము 'కళాత్మకము.' ఇది ఆనందమయము. సూటిగా చెప్పిన ఈ రాచకన్యకా పరిణయ గ్రంథము వేదాంత పరిభాషయందు చెప్పబడిన జహదజహల్లక్షణా రూపముననున్న పరబ్రహ్మ సాక్షాత్కారము. ఇది కావ్యపరమైన ఇతివృత్త, పాత్రచిత్రణ, సన్నివేశకల్పన, ధ్వని, రస అలంకార, వర్ణనాదులతో గూడి యుండుటవలన స్వార్థమును వీడలేదు (అజహత్స్వార్థ), కాని పరమార్థ పరముగా ఇవన్నిము సంకేతములే.వీనికి వాచ్యార్థముకాని, మరే ఇతరార్థములుకాని ప్రయోజనముకాదు. పరమాత్మ సాక్షాత్కారము కావించుటయే దీని పరమ ప్రయోజనము. ఇది ఈ విషయమున తన వాచ్యార్థమును అత్యంతముగా తిరస్కరించినది. అనగా స్వార్థమును వీడినది (జహత్స్వార్థ) కావ్యరసములందు పేర్కొనబడని నిత్యానంద రసానుభూతి కలిగించుటయే దీని పరమోద్దేశము. సద్రూపచిద్రూప పరమగు బ్రహ్మశక్తి ఒక్కడేయని నిశ్చయజ్ఞానము కలుగు టయే నిత్యానందము. ఇదియే రాచకన్యకా పరిణయ గ్రంథరచనా సంకల్ప కారణమైన నరసింగకవి హృదయముగా తోచుచున్నది. కావ్యరచనా రూపముగా శబ్దబ్రహ్మను ఈయన ఆరాధించినాడు.

'ద్వేవిద్యేవేదితవ్యేతు శబ్దబ్రహ్మ పరంచయత్।
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి॥' అన్నట్లుగా ఆ పర బ్రహ్మ విద్యకై యత్నించి చరితార్థతను నరసింగకవి పొందదలచినట్లు ఊహింప వచ్చును.



# 11. తెలుగు వారి ఆచారములు- సాంఘిక జీవన ప్రతి ఫలనము

ఏ సాహిత్యమైన ఏదో ఒక సమాజము నుండే ఆవిర్భవించును. అందు వలన సాహిత్యమునకు, సమాజమునకు సంబంధము ఉండకతప్పదు. రచయిత కూడ సాటి మనుష్యులందరి వలెనే సామాజిక జీవి. సమాజములో తాను గుర్తించిన అంశములను రచయిత తన కవిత్వములో ప్రతిబింబింపజేయును. రచయిత తన కాలమునకు సంబంధించినది కాక ప్రాచీనమైన వస్తువును స్వీకరించి కవిత్వము చెప్పినను, తన సమకాలీన సామాజికాచారములను, జీవన విధానమును ప్రత్యక్షముగ గాని, పరోక్షముగ గాని తన ఇతివృత్త కల్పనమున నిబంధించక తప్పుకొనలేడు. సాంఘిక జీవితమును ప్రతిఫలించు విషయమున సమకాలీనమైన కథలను గ్రహించి కవిత్వము చెప్పు కవులకున్న స్వాతంత్ర్యము ప్రాచీన కథలను గ్రహించి కవిత్వము చెప్పు కవులకు ఉండదు. అందువలన సంప్రదాయ రీతిలో చెప్పిన ప్రాచీన కవిత్వము వలన కవి సమ కాలిక సాంఘిక విశేషములు విరళముగనే తెలియగలవు.

వెల్లూరు నరసింగకవి తన 'రాచకన్యకాపరిణయ' ప్రబంధమున యథా శక్తిగా తెలుగువారి ఆచారములను, ఉమ్మడి కుటుంబ జీవన విధానమును వివరించినాడు. తెలుగువారి వంటకములు, భోజనపు ఏర్పాట్లు. విందులు, అతిథులను ఆదరించుపద్ధతి, వివాహాది శుభ కార్యములందలి అభ్యంగన విధానము, వసంతోత్సవము, వివాహ విధానము మొదలగు ఆచారములు ఈ గ్రంథమున సముచిత స్థానమును పొందినవి. ఆది నుండియు ఆంధ్రులు సమిష్టి కుటుంబజీవనమునకు అలవాటుపడినవారు కావున వీరి యిండ్లయందు అత్తలు-కోడండ్రు, తోడికోడండ్రు, అన్నదమ్ములు, బావ-మరదండ్రు మొదలగువారి పరస్పరానురాగములు, అవగాహనలు మొదలైన ఉమ్మడి కుటుంబ జీవనమునకు సంబంధించిన విషయములను నరసింగకవి ఎత్తిచూపినాడు.సందర్భానుసారముగా ఆంధ్రదేశమునందలి గ్రామీణ పద్ధతులు, శకునములు, కలలపట్ల గల నమ్మ

కములు, వశ్య క్రియలు మొదలైనవి రాచకన్యకాపరిణయమున చోటుచేసికొన్నవి. అవసరమైన చోట్ల కవి ప్రాంతీయములైన ఉపమానములను ప్రయోగించి ఉపమాన నవ్యత ప్రకటించినాడు.

## ఆచారములు

**1. విందులు-వంటకములు :-** ఆంధ్రసాహిత్యము నందలి ప్రాచీన కావ్యములందు పెక్కు సందర్భములలో విందుభోజనములు వర్ణితములు. కావ్యములందలి నాయికా నాయకుల వివాహ సందర్భములందును, చుట్టములు, అతిథులు మున్నగువారిని ఆదరించు సందర్భములందును ఈ విందుల ప్రసక్తి ఉన్నది. శ్రీనాథుని 'శృంగార నైషధమున నలదమయంతుల వివాహానంతరము నందలి బువ్వము బంతి' సరసనర్మోక్తి చాతుర్య సౌష్ఠవముగా సాగినది. పైడి పళ్ళెరములతో భోజన పంక్తులు ఏర్పాటుచేయుట మొదలుకొని, భోజనానతంరము తాంబూల సేవనము వరకు ముప్పది పద్యములకు పైబడి వర్ణింపబడినది. పెండ్లి భోజనము కనుక ఇందు స్త్రీపురుషుల శృంగార చేష్టలందలి వేడుకలు మిక్కుటముగ నున్నవి.

దామెర్ల వెంగళరాజు 'బహుళాశ్వ చరిత్ర' వంటి గ్రంథములు కేవలము విందు భోజనములు వర్ణించుటకే వ్రాయబడినవా అన్నట్లున్నవి, 'ద్వాపరయుగమున మిథిలానగర రాజైన బహుళాశ్వుని ఇంటికి శ్రీకృష్ణుడు అతిథిగా వచ్చి, తుష్టిగా విందారగించి, భుక్తాయాసము తీరు వరకు ముచ్చటలాడి వెళ్ళుట' ఇందలి ప్రధాన కథ. దీనికై 683 గద్యపద్యములతో గూడిన అయిదాశ్వాల ప్రబంధమును రచించినాడు వెంగళరాజు. ఇందు ఏబది రెండు (52) గద్య పద్యములతో విందు భోజనము వర్ణితమైనది. ఈ వెంగళరాజు అన్న చెన్నమ రాజు కుమారుడైన దామెర్ల అంకరాజు కూడ తన 'ఉషాపరిణయ' ప్రబంధమున 'బహుళాశ్వచరిత్రను అనుసరించుచు ముప్పదిమూడు (33) గద్య పద్యము లందు విందు భోజనమును వివరించినాడు. ఈ రెండింటిలోను విస్తళ్ళు వేయుట మొదలుకొని, చేతులు కడుగుకొనువరకు విపులమైన వర్ణన ఉన్నది. కాక మాని మూర్తి వ్రాసిన 'పాంచాలీపరిణయము'న ఇరువది ఏడు (27) పద్యములందును, 'రాజవాహన విజయము'నందు పదమూడు (13) పద్యములందును విందు వర్ణింబడినదట.

వెల్లూరు నరసింగకవికూడ 'రాచకన్యకాపరిణయము'న మూడుచోట్ల విందులను వర్ణించినాడు. మొదటగా అవతారికయందు గోపాలుపేట ప్రభువైన లక్ష్మణరాయని భార్య కేశవాంబ యజ్ఞముచేసి బ్రాహ్మణ సంతర్పణ గావించినదని చెప్పినపుడు ఒక సీసమున (86-1) విందు భోజనము వర్ణితము.

అభ్యాగతిగా తన ఇంటికి వచ్చిన ఇంద్రునికి కృష్ణుడు తనయింట భుజించి వెళ్ళుమని చెప్పినపుడు తొమ్మిది(9) గద్యపద్యములందు (142-150/2) రెండవ పర్యాయము విందును వర్ణించినాడు.

కృష్ణప్రేషితలైన రాజకన్యలకు బలరాముడు భోజనపుటేర్పాట్లు గావించినపుడు పదునొకండు(11) గద్యపద్యములందు మూడవసారి విందుభోజనము వర్ణితమైనది. వీనియందు ఆంధ్రుల ఇండ్లలో నిత్యవ్యవహారముననున్న పెక్కు వంటకములు పేర్కొనబడినవి.

**ఆంధ్రుల వంటకములు :-** ఉగాది, దసరావంటి పండుగ దినములందును, వివాహాది శుభకార్యములందును ఆంధ్రుల ఇంట ప్రత్యేకముగాచేయు తీపివంటకము 'సెనగపూర్ణముతో తయారైన భక్ష్యములు.' అందువలనే 'పప్పులో బెల్లము వేయుట' (పూర్ణము వండుట) శుభకార్యమునకు ప్రత్యామ్నాయమైనది. 'భక్ష్యములు పెట్టుట' అనగా 'వివాహము చేయుట' అని జనవ్యవహారమున రూఢి అయినది. వీనినే 'అపూపములు' అనియు అందురు. ఆంధ్రుల ఆవపచ్చడి గాటు మిగులప్రసిద్ధమైనది. వంటకములందు ఇంగువ అధికముగా వాడుట, కంది పప్పు (వండినవి), మిరియంపు చారులు ఆంధ్రత్వమునకు చిహ్నములు. ఇట్టి ఆంధ్రుల వంటకములను నరసింగకవి ఈవిధముగా పేర్కొన్నాడు.

'సెనగ పూర్ణంబుబెట్టిన భక్ష్యములతోడ
గమ్మని సద్యోఘృతమ్ముతోడ
సరస సౌకర్యమౌ శాల్యోదనముతోడ
మెప్పైన పప్పుల యొప్పుతోడ
షడ్రసంబుల రుచుల్ సొగుకూరలతోడ
నమృతోపమాన పాయసముతోడ

నా౽ఘ్రాణ పరుషమౌనావ పచ్చడితోడ
బేరిన మీగడ పెరుగుతోడ
క్షీర పానీయముల స దక్షిణముగాగ
ధరణి సురలకునెల్ల సంతర్పణంబు
తనివితీరంగ సలిపెడు తల్లియనగ
బరగుజనుపల్లి కేశవాంబామ తల్లి' (86-1)

* * *

'మరియు ప్రత్యేక రుచిగల మాంసములును
నరుదు పరిమళ మిళిత దివ్యాన్నములును
సూపములు కూరగాయలు సొంపుమెరయు
నూరుబిండ్లూరుగాయలు చారుగములు' (141-3)

అంబోడములు వడలతిరసాల్ గారెలు
పుగ్గిలుపేణిలు పూర్ణమల
బూరెలు, పుణుకులు, నీరత్తియలును చే
గోడీలు పూరీలు కుడుములెన్న
నలరిన కర్జకాయలు చక్కిలాత్తేనె
తలలు మనోహరములును మరియు
లడ్డువ లిడ్డెన లలితమౌ మోరుండ
లంగిరవల్లి యలాదిగాగ
మాలతీలును చిక్కుడు పూలసేవ
లమరగూర్చిన పాయసాన్నములు' (142-3)

* * *

'వడియము లప్పళాల్ రుచిరవంతములై తగు పిండివంటలున్
గడి కడికిన్ వినోదరుచి గల్పనజేసెడి పక్వమాంసముల్
సడలని దివ్యవాసనల సంపదలన్ విలసిల్లు నన్నముల్
తడయని కూరగాయలు ఘృతప్లుతమొప్ప ఘుజించి రంగనల్'

'కమ్మగా గాల్చిన కర్రికుట్ల నొకర్త
కొకతెబల్ ప్రేమ నొసగు' (150, 151-3)

అని ఈ విధముగా చెప్పబడిన వంటకములందు అధిక భాగము శాకాహారమునకు సంబంధించినవే. 'రుచిగల మాంసములు', 'పక్వమాంసములు' అని మాత్రమే మాంసాహార విషయమున కవి చెప్పినాడు. ఒక్క 'కర్రికుట్లు' అను వంటకమునే పేర్కొన్నాడు. కవి బ్రాహ్మణుడు కావున మాంసపు వంటకములను వేరు వేరుగా ఇంతకన్న విపులముగ చెప్పలేకపోయియుండ వచ్చును.

కవి పేర్కొన్న వంటకములందు భోజనములందలి పదార్థములను, పిండి వంటలను వేరు వేరుగా చెప్పవచ్చును. భోజనమందు శ్రేష్ఠమైన సన్న బియ్యముతో వండిన అన్నము (సువాసనోదనము), ఊరుబిండ్లు (ఒకటి, రెండు దినములు మాత్రమే నిలువయుండునట్టి గోంగూర, వంకాయ, పచ్చి కొబ్బర మొదలగువానిచే చేయు నూరినట్టి పచ్చడి. దీనిని 'రోటిపచ్చడి' అందురు), ఊరుగాయలు (ఉప్పు, ఆవ మొదలైన వానిలో ఊరవేసిన మామిడికాయ, ఉసిరి కాయ మొదలైనవి. ఇవి ఏడాదిపాటు నిలువయుండును)- అందులో ముఖ్యముగా 'ఆఘ్రాణపరుషమౌ ఆవ పచ్చడి, పప్పు, చారు, శాకపాకములు (నంజుడులు, వేపుడు కూరలు) పాయసాన్నము (పరమాన్నము), భక్షము, వడియము, అప్పడములు, ఘృతము, మీగడ పెరుగు మొదలగువానిని పేర్కొనవచ్చును.

పప్పన్నము పట్ల మిక్కిలి యిష్టము కలవారు తెలుగువారు. వీరు ఇండ్లలో కూరగాయలతోగూడిన పప్పు (పప్పు ధాన్యములైన కంది, పెసర మొదలగు వానితో కూరలు, కాయలు కలిపి చేసినది), సూపము (వట్టి పప్పు, చప్పటి పప్పు) అని రెండు విధములుగా పప్పుచేయుదురు. 'సూపమును' పితృ కార్యములందు (తద్దినములు) తప్పనిసరిగా చేయుదురు. అందువలన 'సూప పాకము' శుభకార్యములందు లక్షణకరముకాదని కొందరు భావింతురు. కాని వివాహములందును 'సూపము' చేయుదురని పరంపరగా వచ్చుచుండిన స్త్రీల 'బువ్వము బంతుల' పాటలందు ప్రసిద్ధముగానున్నది. ఇక తెలుగువారి 'చారుల' రుచి అపరిమితము. అందువలననే 'సారం (చారు) భోజనసారం', 'చారు చారు తరంభాతి' అన్న ప్రఖ్యాతివచ్చినది. నరసింగకవి 'మిరియపుచారు', 'తీయచారు లను' పేర్కొన్నాడు. ఇవిగాక మజ్జిగతోకూడ 'చారు' చేయుదురు. దీనిని మజ్జిగ చారు, చల్లచారు అందురు. ఈ వంటకములన్నియు జంబీర (నిమ్మ)

జీర (జిలకర), సర్షప (ఆవాలు), రామఠ (ఇంగువ) ద్రవ్యములతో సిద్ధము చేసినవి.

ఇక పిండి వంటలందు సెనగపూర్ణము పెట్టిన భక్ష్యములు, వడలు, గారెలు (ఇవి తీపు. కాని సర్కారు ప్రాంతమున వడలను గారెలనియు, గారెలను బూరెలనియు వ్యవహరింతురు), పేణీలు, పూర్ణము బూరెలు (సుగయలు, ఉండ్రాళ్ళు) చేగోడీలు (కోలబడియలు),పూరీలు, కుడుములు, కర్జకాయలు, చక్కిలాలు, లడ్డువలు (లడ్డు), ఇడ్డెన మొదలైనవి ఈనాడు వ్యవహారమున ఉన్నవి. మిగిలినవానిలో శబ్దరత్నాకరాదినిఘంటువులకెక్కి భక్ష్యవిశేషములు'గా పేర్కొనబడినవి కొన్ని, నిఘంటువులకెక్కనివి మరికొన్ని. అతిరసములు (అత్రెసాలు, అరిసెలు), పుణుకులు (పుడుకులు), తేనెతలలు (తేనెతొల(న)లు), మోరుండలు, మనోహరములు, నీరత్తియలు (నీరువత్తిగ - పేణీలు) మొదలైనవి నిఘంటువు లందు భక్ష్యవిశేషములుగా చెప్పబడినవి. అంబోడములు (ఆముదవడలు)., వుగ్గీలు, అంగిరవల్లియలు. మాలతీలు (మండిగలు), చిక్కుడు పూలసేవ మొదలైన పిండి వంటలు నిఘంటువులకెక్కలేదు.

**2. అతిథి సత్కారము :-** 'అభ్యాగతస్స్వయంవిష్ణుః' అన్న సంస్కారము మనది. నరసింగకవి రాచకన్యకాపరిణయము'న అతిథి సత్కార విధానము ను ఆమూలాగ్రముగా వివరించినాడు. అతిథిని సాదరముగా ఎదురువెళ్ళి పిలుచుకొని వచ్చుట, భోజనమునకాహ్వానించుట, భోజనాగారముచేరుట, భోజనపు టేర్పాట్లు, రుచులు చెప్పకొనుచు హాస్యోక్తులతో తృప్తిగా భుజించుట, హస్త ప్రక్షాళనము, తాంబూలసేవనము, కానుకలిచ్చి అతిథులను సత్కరించి పంపుట మొదలగు అంశములందు కవి తెలుగు తనమును గుమ్మరించినాడు. ఈ విశేష ములను నరసింగ కవి 'శ్రీకృష్ణుడు ఇంద్రునికిచ్చిన ఆతిథ్యము ద్వారా వివరించినాడు.

దిక్పాలక సహితుడై ఇంద్రుడు కృష్ణుని దర్శింపవచ్చినాడు. కృష్ణుడతనిని సాదరముగా చూడగా, ఇంద్రుడు వందనమిడి, నరకుని దుశ్చేష్టితములను వివరించి తమ్ము కాపాడుమని శరణు కోరినాడు. అప్పుడు కృష్ణుడు ఇంద్రుని ఈవిధముగా భోజనమున కాహ్వానించినాడు.

'శతమఖ! తావకాగమన సంగతితోడ ముదంబుగల్గె మా
కతిథివి నేడునీవిచటనంచితలీల భుజింపగాదగున్
క్షితిసుతుకార్యమెంత? నతశీఘ్రముగా వధియింతువాని నీ
మతిని నొకింత సంశయము మానుమటంచు గరంబు బట్టినన్' (141-2)

కృష్ణుడు ఇంద్రునితో 'భూపుత్రుని సంహరింతును. అనుమానించకుము. నీరాక మాకానందము. నీవునూ అతిథివి, నీవిచటనే భుజించవలసినదని' చేయిపట్టుకొని భోజనమున కాహ్వానించినాడు. ఈవిధముగా చేయిపట్టుకొనిపిలుచుట అప్యాయతకు నిదర్శనము.

ఇక్కడ నరసింగకవి ఆంధ్రదేశమునందలి సంప్రదాయము ననుసరించి భోజనాదికముల ఏర్పాట్ల విధానమును వివరించినాడు. ఆంధ్రదేశమునందలి బ్రాహ్మణుల ఇంట భోజనవిషయమున 'మడి' అనునది సుప్రసిద్ధమైన ఆచారము. బ్రాహ్మణులు ప్రతిదినము మడి (ఉతికి ఆరవేసిన వస్త్రములు) కట్టుకొని భుజింతురు. పితృకార్యములందు ఈ నియమమును కఠినముగ పాటింతురు. పాతిక సంవత్సరముల క్రిందటి వరకు వివాహాది శుభకార్యములందును 'మడి' విషయమున సడలింపులు లేకుండినవి. యజమాని ఇంట వంట సిద్ధమైన పిమ్మట ఆహూతులు మడివస్త్రములు ధరించి భోజనమునకు వచ్చుట ఆచారము.

ఆ విధముగనే ఇందులో, ఇంద్రుడు మొదలగువారు 'విదోహన శుద్ధివస్త్ర సంధారణలు' (ఉతికి ఆరవేసిన శుభ్రవస్త్రములు ధరించి) 'ఆదిగాగల విధానములు సల్పి' (సంధ్యావందనాదికముల ముగించి) కృష్ణునివెంబడి భోజనాగారము చేరినారు (142-2). పిమ్మట సత్యభామ చెలికత్తెలు భోజనపుటేర్పాట్లు గావించినారు.

'భోజనశాలార్హ భూరిపీఠములపై
ప్రియముతో కూర్చుండ బెట్టువారు
నవరత్న సుందరములైన పసిండి
కంచముల్ పంక్తిగనుంచువారు

కొమరు పానీయాల్ప కుంభముల్ వెసెదెచ్చి
వలపటి చక్కలనిలుపువారు
బహుశాక పాకముల్ పచ్చళ్ళు నూరు బిం
డ్లూరు గాయలు కొని చేరువారు
పంచ భక్ష్యాన్నములు వడ్డించు వారు
తెలవి కమ్మని ఘృతములు దెచ్చువార
లగుచు సాత్రాజితీ సఖులతిశయమున
మెలగ సాగిరి భోజన నిలయమునను' (144-2)

ఈ విధానమంతయు తెలుగుదేశము నందలి బ్రాహ్మణుల ఇంట మామూలుగా జరుగునట్టిదే. ముఖ్యులెల్లరు ఏకకాలమున మొదటి బంతియందు భుజింతురు. వరుసగా పీటలు వేయుట, పళ్ళెరము లుంచుట, మంచినీటి చెంబులు ఎడమ ప్రక్కన పెట్టుట, వంటకములు వడ్డనకై చేర్చుటలు ఆచారము.

అనంతరము, వడ్డించువారు బలవంతముగా కొసరి, కొసరి వడ్డించు చుండగా వంటకముల రుచులు చెప్పుకొనుచు ఆనందముగా భుజించుట ఆచారము. ఈ సందర్భములో శ్రీకృష్ణుడు దేవతలను వంటకములందలి రుచుల విషయమున ఎంతో మనోజ్ఞముగా ఊరించినాడు.

'అమరేశ! యీ అపూపము చవిగాంచుమా
ఘృతముగైకొను సదాగతి సుమిత్ర!
పరమాన్నమింపు సొంపరయు వైవస్వత!
కోణప! పచ్చళ్ళ కొమరు గనుము
యాదసాంపతి! రసాయనము జూడుసపాదు
లనిల! సువాసనోదనము గొనుము
పౌలస్త్య! వలసిన భక్ష్యముల్ గోరుమ
ఈశాన! తీయబారింపుజూడు

మనుచు బహుభోజ్యముల రుచుల్ సనయముగను
దెల్పుచును వేడ్కమీరంగ దేవతలను
గూడి సరసంపు ముచ్చటలాడుకొనుచు
కోరికలు మీర శ్రీకృష్ణడారగించె' (146-2)

ఈ పద్యమున కృష్ణుడు ఇంద్రాది దిక్పాలకులకు సాభిప్రాయముగ వారి వారికి అనుగుణమైన వంటకములనే చెప్పినాడు. ఈ మాటలలో నర్మగర్భమైన ఎత్తి పొడుపులు ఉన్నవి. అందువలననే నరసింగకవి వీనిని 'సరసంపు ముచ్చటలు' అన్నాడు.

దివిజనాథుడైన ఇంద్రుడు యజ్ఞాధికారి కనుక అతనిని సర్వోత్తమమైన '**అపూపము**'ను (భక్ష్యమును) రుచిచూడుమన్నాడు. ఇంద్రుడు 'అపూపప్రియుడ' నుట ప్రసిద్ధము.

వాయుసఖుడైన అగ్నిని 'ఆజ్యము' కొనుమన్నాడు.

సూర్యసుతుడైన యముని 'పరమాన్నము' సొంపు తెలిసికొమ్మన్నాడు. దీనినే 'పాయసము' అనియు అందురు. పాలు, బెల్లమునేసి పలుచగా వండిన అన్నము. దక్షయాగ సందర్భమున భగ్నదంతుడైన సూర్యునకు రథసప్తమి దినమున (మాఘశుద్ధసప్తమి) పాయసము నైవేద్యమిడుట ప్రసిద్ధము.

క్రవ్యాదుడైన నైరృతునకు 'పచ్చళ్ళ' (ఉప్పుకారము వేసిన కూరగాయ దినుసులు గాని, పప్పుదినుసులు గాని కలియనూరిన వ్యంజన విశేషములు) మనోజ్ఞత తెలిసికొనుమనుటలో 'పచ్చిమాంసము తినువానికి పచ్చళ్ళరుచి ఏమి తెలియును ?' అన్న వ్యంగ్యగర్భితమైన ఎత్తిపొడుపున్నది. రాక్షసుడు కావున 'ఆఘ్రాణపరుషమైన ఆవఘాటు' కలిగిన రాజసాహారము చెప్పుట కూడ ఉచిత ముగ నున్నది.

లవణాలయుడైన వరుణునకు 'రసాయనము' (షడ్రసయుక్త ద్రవ వ్యంజనము)ను చెప్పినాడు. బహుశః ఉప్పురుచి మాత్రమే తెలిసిన అతనిని షడ్రుచుల వైశిష్ట్యము తెలిసికొనుమని చెప్పియుండును.

గంధవహుడైన వాయువును 'వాసన దియ్యపుటన్నమును' స్వీకరించు మన్నాడు.

కుబేరుడు కోమటి అన్న వ్యవహారమున్నది. కోమటి పిసినిగొట్టు అన్న విషయము కూడ లోకవ్యవహారము. లోభి తాను తినడు. ఇతరులకు పెట్టడు. చివరకు ఎంగిలిచేతితో కాకులను అదల్చిన తన వ్రేళ్ళకున్న మెతుకులు రాలి పడునేమోయని వ్రేళ్ళునాకి మరీ అదిలించును. ఇట్టి విషయమై ఎత్తిపొడుచుచు 'వట్టి వ్రేళ్ళు నాకి కొనక, కడుపునిండుగా 'భక్ష్యములు' (నమిలి తినగలిగిన పిండివంటలు) ఆరగించుమని కుబేరునితో అన్నాడు. ఈ భావము స్ఫురించు నట్లుగా కవి ఈ గ్రంథముననే ప్రసంగాంతరమున కుబేరుని గురించి 'రాజరాజై తనరారు ధనాధీశు, డలకాపురము నుత్తరాశనేలె' (37-1) అన్నాడు. అవతారికయందు కృతిప్రేరకుడైన వట్టెము నరసింహారెడ్డి దాతృత్వమును గురించి గొప్పగా చెప్పుటకై 'ధనదుడన్న గొప్పపేరు గలిగిన కుబేరుడును, మరికొందరును వెలవెల బోయినట్లు' చెప్పుచు పైవిధముగా చెప్పినాడు. 'కుబేరుడు పేరుకు మాత్రమే రాజరాజు, ధనాధీశుడు. ఇంత సంపద ఉండికూడ అలకాపురమును ఉత్తరాశను - ఉత్తర దిశను, ఉత్తర + ఆశన్ - అనగా అధికమైన ఆశ చేత (దురాశచేత) పాలించినాడు. అనగా లోభియ అర్థము అన్న అర్థము కవి ప్రయోగించినాడు.

హాలహల ధారియై నిత్యము గొంతుమంటతో బాధపడు ఈశ్వరునికి 'తీయచారును' చెప్పినాడు. ఎండకాలమున చేయబడు తీయని మామిడికాయ చారు తాపమును పోగొట్టి శైత్యమును కలిగించుట ప్రసిద్ధము.

ఈవిధమైన కృష్ణుని సరసోక్తులకు అలరి దేవతలు కూడ వంటకములు రుచులు మెచ్చుకొనుచు భుజించిరి.

'పొగచిన కూరగుంపుల ప్రపూర్ణరుచుల్ గొనియాడు వారలిం
పగుమిరియంపు చారుల హాహాయని సన్నుతిజేయువారు మె
చ్చగదగు పిండివంటలు వెసంజవిచూచి భుజించు వారలై
గగన చరుల్ మురారి సముఖంబున మించిరి సమ్మదంబునన్'

'రొంపిగ ం జలధిలో జని
ముంపుట, నేక రుచిచేత నిరవొందుట నా

సొంపెంత యనుచు సుధ నిర
సింపుచు సరసాన్నములు భుజించిరి రమర్త్యుల్' (147, 148-2)

ఈ క్రొత్త వంటకముల రుచి వారికి అమృతమును కూడ మరిపించినది. పంకమయమైన సముద్రమున జనియించుట, ఒకే రుచికలిగియుండుట (సముద్ర జనితమైనందున బహుశః ఉప్పగ మాత్రమే ఉండి యుండునేమో) లు సుధ యందలి లోపములుగా వారికి ఈ షడ్రసోపేతమైన భోజనమును ఆరగించిన పిదప తెలిసివచ్చినది. 'పొరుగింటి పుల్లగూర' రుచి అహహాయని పించి, లొటికలు వేయుచు భుజింపజేయుట సహజమే కదా.

పిమ్మట దేవతలందరును 'శృంగారవతులు సారసుగంధాంబు లొసంగ ధౌతకర పంకజు'లైరి. అప్పుడు కృష్ణుడు వారికి తాంబూలములు సమకూర్చినాడు.

'ఉడురాజ శిలాజగతిన్
విడిదిగ గూర్చుండబెట్టి వేడుకలలరన్
విడెము లొసగించె గృష్ణుడు
కడు సొగసుగ జాలవల్లికల పడతులచేన్' (150-2)

అనంతరము కృష్ణుడు 'కమ్మని పలుకుల వారికి కొమ్మని యుడుగర లొసగి గురుతర లీలన్ సమ్మతి' బంపినాడు.

ఇట్లు అతిథి సత్కారవిషయమున ప్రాంతీయతను జోడించి నరసింగకవి విపులముగ వివరించినాడు.

**4. అభ్యంగనము :-** ఆంధ్రదేశమున వివాహాదులందు పండుగ రోజు లందు తైల మర్దనము గావించుకొని తలస్నానము చేయుట ఆచారము. ఆడు బిడ్డలను పండుగలకు పిలుచుకొని వచ్చినపుడు తల్లులు, వదినలు మహానంద ముతో వారికి తలలంటి స్నానము చేయింతురు. ప్రత్యేకముగా దీపావళి సందర్భ మున ఇంటియందలి ఆబాలవృద్ధముగా ఈ 'తలలంటు వేడుక' జరుపుకొందురు. ఈ అభ్యంగన విధానమును నరసింగకవి తన గ్రంథమున, సత్యభామ చెలులు కృష్ణునకు అభ్యంగనము చేయించు సందర్భమున పది పద్యములందు (119-128/2) వివరించినాడు.

కృష్ణుడు, సత్యభామకై దండలలవరించి స్నానశాల చేరినారు. సత్యభామ కృష్ణుని రత్నాసనముపై కూర్చుండబెట్టి, తలలంటి స్నానము చేయించుమని చెలికత్తెలకు చెప్పి తాను జలకమాడ వెళ్ళినది.

భూషణములు వదిలించుటః- అప్పుడొక సుందరి హరి ధరియించిన వర దివ్య విభూషణములు వదిలించినది. (119-2)

శిరసంటుటః- ఒక కంజాక్షి సంపంగితైలముతో శిరసంటినది. (120-2)

నలుగుబెట్టుటః- ఒక సుందరి ఇంద్రనీలమునకు హస్తముతో సానబెట్టి నట్టుగ నలుగుబెట్టినది (121-2)

గంధామలకమిడుట;- ఒక మదేభయాన ఉసిరికపిండి పట్టినది. (122-2)

జలకమార్చుటః- సాటి చెలులు సముచితోష్ణములందివ్వ ఒక చెలువ స్నానమాడించినది. (123-2)

తడియొత్తుటః- ఒక యువతి శరీరమునకు ఒత్తుడు బడకుండ తడియార్చినది (124-2)

కురులు దువ్వి చిక్కుతీయుటః- ఒక విరిబోణి శిరోజములను దువ్వి చిక్కుదీసినది (125-2)

ఒకతె వస్త్రము లొసగినది (126-2). వేరొకర్తుక ఆభరణములు ధరింప జేసినది (127-2). మరికొందరు వివిధములైన అలంకారములు కావించి, అద్దమున చూపిరి (128-2). ఇట్లు కృష్ణుని అభ్యంగనము ముగిసినది.

కవి ఈవిధముగా అభ్యంగనమును వివరించుటలో తిమ్మన 'పారిజాతాపహరణము'ను యథాతథముగా అనుసరించినాడు.

**4. సంధ్యావందనాదులు:-** శిష్టాచార సంపన్నులైన బ్రాహ్మణులు ప్రతి దినము ఉదయమున సంధ్యావందనము, దీవతార్చనము అన్న రెండు దైవ సంబంధమైన కార్యములను ముగించనిది తక్కిన ఏ కార్యములను చేయరు. దీనినే పరిభాషయందు 'నిత్యానుష్ఠానము' అందురు. దీనిపిదపనే వారికి మిగిలిన దినచర్య మొదలగును. నరసింగకవి ఈ నిత్యానుష్ఠానమును శ్రీకృష్ణుని సంధ్యావందనాదుల ద్వారా చెప్పినాడు.

'రత్న పీఠమిడి వినూత్న జలంబులు
హైమ పాత్రికలను నతివలిడగ
బద్మలోచనుండు పగటి సంధ్యావంద
నంబు దేవతార్చనలు నొనర్చె' (129-2)

**5. వివాహము:-** వివాహము అనునది జీవితమునందలి ముఖ్యమైన వేడుక. సర్వజనులును వారివారి ప్రాంతీయాచారములను అనుసరించి మహా నందముగా ఈ మహోత్సవమును చేసికొందురు. కవులు తమ గ్రంథములందు ఈ వివాహఘట్టములను ఆత్మీయ సంప్రదాయ ద్యోతకముగ వర్ణించుట సహజము. కాని, ఏ విషయమునైనను సమగ్రముగా వర్ణించు స్వభావముకల నరసింకగకవి ఏలనో తన 'రాచకన్యకా పరిణయము'న ప్రధానాంశమైన కృష్ణ రాజకన్యకల వివాహమును మిక్కిలి లఘువుగా ముగించినాడు.

కృష్ణప్రార్థితుడై, రాజకన్యల వివాహకార్యభారమును వహించిన బల రాముడు రాజకన్యల గృహములకు వివిధ సంభారములు పంపినాడు. ద్వారకా నగరము అలంకరింపబడినది. ఆహ్వానితులై భర్గవిధి ప్రముఖాది దేవతలు, గర్గాది మునీశ్వరులు, పాండ్య బర్బర దేశాధీశ్వరులు వచ్చినారు. గర్గాదులు లగ్నము నేర్పరచినారు. వధూవరుల అభ్యంగనములు, అలంకారములు పూర్తి యైన పిమ్మట వారిని వివాహమంటపమును చేర్చినారు.

'వన్నెలు మించు వివాహమందిరమున
    జేరంగదోలి విచిత్రలీల
భూరి పంచమహావాద్య పూర్ణముగను
వేదవిద్యా వినోదములు విప్రవరులు
చదువు చుండగ సామ్రాజ్యసహితముగను
భూనుత వివాహములు చేయబూనిరపుడు' (274-2)

ఇక్కడ నరసింగకవి లఘువుగా అభ్యంగనము అయిన వెంటనే అక్షతారోపణ మును (తలబ్రాలు) చెప్పినాడు. ఈ తలబ్రాలవేడుక నాలుగు పద్యములందు (275-287/4) వర్ణితము. మంగళసూత్రధారణమును కూడా, అంతటితోనే

వివాహము ముగిసినది. రాచకన్యకాపరిణయమున, ముఖ్యమైన ఈ విషయమును ఇంతసూక్ష్మముగా, హఠాత్తుగా కవి ముగించుటకు కారణము అనూహ్యము.

**6. వసంతోత్సవము:-** ఆంధ్రదేశమున వివాహము లందును, హోళీ పూర్ణిమ (ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ, దీనినే కామునిపున్నమ అనియు అందురు) వంటి పండుగ సందర్భములందును వసంతోత్సవము పేరిట రంగులు చల్లు కొనెడు ఆచారమున్నది. పసుపు, సున్నము, నీరు కలుపగా ఏర్పడు ఎఱ్ఱని ద్రవమును వసంతమందురు. కాలానుగుణముగా పలువిధముల రంగుపొడులను నీటియందు కలిపి చిమ్మనగ్రోవులతో చల్లుకొనుట అలవాటయినది.

నరసింగకవి గ్రంథావతారికలో గోపాలుపేట ప్రభువైన అయ్యభూపాలుని పరాక్రమమును వర్ణించు సందర్భమునందును, ప్రకృతివర్ణనయందును ఈ వసంతోత్సవమును హృదయాహ్లాదకరమైన రూపకసమాసోక్త్యాద్యలంకార సంభరితముగ వర్ణించినాడు. అయ్యభూపాలుని పరాక్రమమును ఈ రీతిగా వివరించినాడు.

'దురమున నయ్యభూవిభుని దోరసి పుత్రియమిత్రధారుణీ
శ్వరులకు వేల్పుటింతులకు జక్క వివాహమొనర్చి కీర్తి పూ
ర్తిరుచిర సూనజాలముల దీవ్రమహచ్ఛవి కుంకుమంబులన్
గురురుచితో జయేందిరను గూడి వసంతములాడు వేడుకన్'(169-1)

ఇందు వివాహాంతమున జరుగునట్టి వసంతోత్సవము పరోక్షముగా అయ్యభూపాలుని పరాక్రమ వర్ణనావ్యాజమున వర్ణితము. ఆంధ్రదేశమున వివాహోపుతంతు ముగిన పిమ్మట వియ్యపురాండ్రు, అత్తలు-కోడండ్రు, వదనలు-మరదండ్రు రంగులు చల్లుకొని ఆనందించుట ఆచారము. దీనిని కవి చక్కని రూపకమున చెప్పినాడు. 'యుద్ధరంగమున అయ్యభూపతి ఖడ్గపుత్రిక శత్రురాజులకు, వేల్పుటింతులకు వివాహముచేసి (యుద్ధమున హతులైనవారు వీరస్వర్గ మలంకరించి, రంభాద్యప్సరస్సంభోగమును అనుభవించుట ప్రసిద్ధము), అధికమైన కీర్తి యనెడు పుష్పములతో, శౌర్యమనెడు కాంతిభరితమైన కుంకుమలతో (రక్త కాంతులతో) మిక్కిలి వేడుకగా తాను జయేందిరనుగూడి వసంతోత్సవ మాడినదని' కవి వర్ణించినాడు.

సూర్యాస్తమయమందలి అరుణజరఠాతపము, సంధ్యాకాంతులను వర్ణించుటలో ఈ వసంతోత్సవవేడుకలను కవిసుందరమైన సమాసోక్తులతో చెప్పినాడు.

'కిరణశృంగాళిచే నరుణాభికుడు ధరా
కాంతపై జిల్కు వసంతమనగ' (159-2)

'అరుణుడను వలపుకాడు కిరణములనెడు చిమ్మనగ్రోవితో ధరాకాంతపై వసంతము చిల్కరించినట్లుగ వృద్ధాతపము ప్రకాశించినట్లు' చెప్పబడినది. అనురాగియైన నాయకుడు తానువలచిన స్త్రీపై వసంతము గ్రుమ్మరించుట అప్రస్తుతము.

'తరుణహరిత్సతి లీలా
పరిచితిచే నంతరిక్షపల్లవికునిపై
నరుణరుచి రసము చిమ్మిన
కరణిన్ సంధ్యాతిరాగ కలనదనర్చెన్' (159-2)

'సూర్యాస్తమానానంతరము తూర్పుదిశయందు ఆకసమునందలి ఎర్రనికాంతులతో సాయంసంధ్య ప్రకాశించినద'ని చెప్పుటలో ఒకానొక అన్యకాంత (ఇంద్ర సంబంధియైన పరకీయ) శృంగారచేష్టలందలి పరిచయముతో అంతరిక్షుడను విటునిపై వలపురసము గ్రుమ్మరించుట అప్రస్తుతము.

**7. రజస్వలలను ముట్టుకుండుట :-** పరిక్షిన్మహారాజు కారణముగా కలిపురుషుని పాపము స్త్రీలకును పంచబడివారు రజోదూషితలైరని భాగవత వాక్యము. యుక్తవయస్కులైన పిదప స్త్రీలు ప్రతినెల రజస్వలలై ఆపాపమును పోగొట్టుకొనుచున్నారనుట పూర్వప్రసిద్ధమైన విషయము. ఈవిధముగా రజస్వలైన స్త్రీలను మూడుదినములు తాకకుండ దూరముగానుంచుట బ్రహ్మణుల ఇంట సంప్రదాయము. ఈ విషయమునే నరసింగకవి దేవకాంతల పుష్పాపచయ క్రీడ లందలి హాస్యోక్తులను వర్ణించు సందర్భమున ఈవిధముగా చెప్పినాడు.

పూలుకోయుటలో ఉత్సాహమును ప్రకటించని ఒకయువతిని

'పుష్పిణులను జేరి ముట్టరాదంచును
బూలతీవల పొంతపోవదతివ' (29-4)

అని తక్కిన స్త్రీలు ఎత్తిపొడిచిరి. ఇందు 'పుష్పిణి' అన్న పదము శ్లిష్టము. 'పుష్పించిన పూలతీవల వద్దకుపోవదనియు పుష్పవతులైన పూదీవలవంటిస్త్రీలను ముట్టరాదనియు' అర్థద్వయమువచ్చినది. రజస్వలలను తాకరాదన్న సాంఘికాచారము ఇందుప్రకటితము.

**8. తాంబూల సేవనము :-** తెలంగాణలో ప్రతిదినము పలుమార్లు తాంబూలము వేసికొనుట బహుళజన సామాన్యమైన అలవాటు. అనేక విధములైన జర్దాలతో గూడిన తాంబూలము(పాను)ను తయారుచేయుటలో తెలంగాణ ప్రసిద్ధికెక్కినది. ప్రాచీనకాలమునుండియు విందుభోజనముల అనంతరము విడెమువేసికొనుట ఆచారముగనున్నను, మహమ్మదీయుల సాహచర్యము అధికముగాగల తెలంగాణలో ఈ అలవాటు హెచ్చినది.

నరసింగకవి, కృష్ణుడు ఇంద్రునికి విందుభోజముచేసిన సందర్భమున విడెములొసగించినట్లు చెప్పినాడు. భోజనానంతరము తాంబూలసేవనము మామూలుగా సాగునదే. ఇదిగాక, కృష్ణుడు సత్యాసహితుడై నరకునిపైకి దండయాత్రకు వెడలి ప్రాగ్జ్యోతిష సమీపశైలాగ్రమున విడిసిన సందర్భమున అక్కడ కృష్ణుడు తాంబూల చర్వణాదికముల గావించినట్లు నూతన కల్పన గావించినాడు.

'ఆస్తరణము గరుడండిడ
సుస్తనియుందాను జాలసొంపు దలిర్పన్
స్వస్థముగా గూర్చుండిరి
నాస్తను, తాంబూల చర్వణాది విధులచేన్' (213-2)

ఇక్కడ కృష్ణుడు నాస్త, తాంబూలసేవనము మొదలగు విధులు నిర్వర్తించినట్లు కవిచెప్పినాడు. ఇందలి 'నాస్త' అన్యదేశ్యము. హిందీభాషాపదము. దీనికి 'అల్పాహారము' అని అర్థము. కవి ఈ విధముగా చెప్పుటకు మహమ్మదీయ ప్రభావమే కారణము. తాంబూలపు పెట్టె (పాన్‌దాన్) లను వెంటనిడుకొని చీటికి మాటికి తాంబూలము వేసికొనుట నేటి అలవాటు. బహుశః కవి కూడ ఎక్కువగా తాంబూలము సేవించెడి వాడేమో.

**9. శకునములు - కలలు :-** అనాదిగా ఆంధ్రదేశమున జనులలో శకునములు - కలలపట్ల అనేకములైన విశ్వాసములున్నవి. శుభశకునములవలన మేలుకలుగుననియు, దుశ్శకునములవలన కీడుకలుగుననియు, కలలకు ఫలితము లుండుననియు నమ్మకములున్నవి.

నరకునిపై దండయాత్రకు భార్యాసహితుడై వెళ్ళుచున్న కృష్ణుడు తమకు కలిగిన శుభశకునమును సత్యభామకుచెప్పి తమకు తప్పక విజయము కలుగు ననెను.

'విను! మనజయము సిద్ధము
ననుందగ మంచిశకున మయ్యెందరుణీః
యనుకూల మందపవనము
గనుగొన నామోదసూచకంబై తోచెన్' (211-2)

అనుకూల మందపవనము ఆమోద సూచకమైన శుభశకునము అందువలన కార్య సిద్ధి యగునని భావము.

అదే సందర్భమున, నరకునకు ప్రాగ్జ్యోతిషమున పెక్కుదుశ్శకునములు పొడసూపగా అతడు చలించి మంత్రులతోవాపోయినట్లు ఈరీతిగా కవి తెలిపినాడు.

'పగలే కూయదొడంగె ఘూకములు సత్ప్రాసాదదేశంబులం
బుగులుం బుట్టివరళ్ళు పల్లముల పాపోవంగ జొచ్చెన్ మదిన్
బెగడుం జెందగగాక సంఘము మహాభీమంబుగా మ్రోసెనే
పగిదో తోచదు నిద్దినంబున మహోత్పాతంబులున్ బుట్టుటల్ (215-2)

గ్రుడ్లగూబలు అరచుట, నక్కలు ఏడ్చుట, కాకుల అరుపులు ఉత్పాత సూచకము లైన అపశకునములుగా భావింపబడుచున్నవి.

సుస్స్వప్న, దుస్స్వప్నములకు శుభాశుభ ఫలితములు కలుగుననియు, వేకువజామున వచ్చిన కలలు నిజమగుననియు, పగటికలలు ఫలించవనియు ఈరీతిగా కలల విషయమై పెక్కు నమ్మకములు వ్యవహారముననున్నవి. ఈవిష యములలో కొన్ని రాజకన్యల స్వప్నములందు చెప్పబడినవి.

కృష్ణవిరహ బాధితలైన రాజకన్యలు కృష్ణుని గురించి పరిపరి విధముల ఆలోచించుచు రాత్రి బాగుగా ప్రొద్దుపోయిన పిమ్మట నిద్రించిరి. అప్పుడు వారికి అనేక విధములుగా 'కృష్ణసంభోగ సుఖము కలిగి'నట్లు కలలు వచ్చినవి. ఇవి వేకువజామున వచ్చినందున తమ కలలు నిజమై, తమను కృష్ణుడు 'ఘనముగ జేపట్టి తాను కళ్యాణవిధిన్ దనరగ గైకొనగలడని' రాజకన్యక లందరును అనుపమ సంతోషిత స్వాంతలైరి.

**10. సూచ్యములైన ఆచారములు :-** నరసింగకవి కొన్ని ఆచారములను విధానయుక్తముగ వివరించక సూచించినాడు. అట్టివానిలో 'వశ్యక్రియలు', ఇతర లోహములను బంగారముగ మార్చుట (రసవాదము) మొదలైనవి కొన్ని.

1. మందులు, మ్రాకులతో స్త్రీలు భర్తలను వశ్యుల చేసికొను ఆచారము ఆంధ్రదేశమున ఒకకాలమున ఉండినది. ఈ విషయము, చెలికత్తె మాటలకు అదిరిపడిన సత్యభామ పరితపించు సందర్భములో ఈ రీతిగా పేర్కొనబడినది.

> 'ధవుని బంటువలెన్నిరంతరము చెంతన్ గొల్వగా జేసె బ్రా
> భవమొప్పన్ దివిషన్మునీంద్రుని నుతింపన్‌జేసె వంది క్రియన్
> పవతుల్ ప్రేమలుమీర జేరి తనుహర్షం బొప్ప వశ్యక్రియా
> జవమేమంచు నుతించ వచ్చునల భోజాధీశ సత్పుత్రికిన్' (37-2)

> 'అ, మందులమారి భీష్మక కుమారిక మాయకులోలుడైన గో
> విందునినమ్మి యెంతయవివేకము చేసితి మందగామినీ!' (38-2)

ఇందలి 'వశ్యక్రియాజవము. మందులమారి' వంటి పదములు 'వశ్యక్రియలను' సూచించుచున్నవి.

2. పాదరసముతో, ఆకు పసరులతో ఇత్తడి, రాగివంటి క్షుద్ర లోహములను బంగారముగా మార్చు విద్యకు ఒకనాడు విశేష ప్రాముఖ్యముండినది. దీనికే పరుసవేది, స్పర్శవేది, స్వర్ణయోగము, రసవాదము అని పెక్కు వ్యవహారము లుండినవి. ఈ విద్య తెలిసినవారిని సిద్ధులు అనుచుండిరి. ఈ విషయమును, నరసింగకవి 'శుక్రనక్షత్రోదయ' వర్ణన సందర్భమున ఈ రీతిగా సూచించినాడు.

'సమయసిద్ధుడు క్రియాసముదయంబులంచేత
ఘటియించు సూతంపుఘటికయనగ' (175-2)

ఇందలి 'క్రియాసముదయులు, సూతంపుఘటిక' అన్న పదములు 'రసవాదమును' సూచించుచున్నవి. సూతము అనగా పాదరసము. 'అథచపలో రసస్సూతశ్చ పారదే' అమరము. 'ఘటిక' పాదరస ప్లావితమైన కుండ అనిగాని, పాదరసపు గుళిక అని గాని చెప్పవచ్చును. ఈ విద్య అరువది నాలుగు కళలందు ఒకటి.

## 11. గ్రామీణ పద్ధతులు

'సురచిర శశికాంత సోపానములతోడ
రమణీయమణి మంటపములతోడ'

అని కవి దీర్ఘిక (దిగుడు బావులను) సంప్రదాయానుసారముగా వర్ణించుచు

'స్నాన సంధ్యా జపాద్యనుష్ఠాన ధర్మ
పరమపావన వైదిక ప్రతతితోడ
జలపరిగ్రహణాగత కలశపాణి
భామినులతోడ దీర్ఘికల్ పరగునచట' (120-1)

అని కొంత ప్రాంతీయతను చాటినాడు. దిగుడు బావులు ఆంధ్రదేశపు పల్లెటూళ్ళ యందు అధికము. వీనిని ఊరి బావులు (ఊర బావులు) అందురు. ఊరి స్త్రీలు బిందెలు, కడవలతో అచటికి నీటికై వచ్చుట సహజము. దీనినే 'జలపరిగ్రహణా గత కలశ పాణిభామినులు' అని కవి చెప్పినాడు. సదాచార సంపన్నులైన బ్రాహ్మణులు ఊరి బావుల గట్టున స్నాన సంధ్యానుష్ఠానములు నిర్వర్తించుట పల్లెలందు ఈనాటికిని అక్కడక్కడ కనబడగలదు.

**12. ఉపమాన నవ్యత (ప్రాతీయోపమానత)** నరసింగకవి రాజ కన్యల సౌందర్యమును వర్ణించు సందర్భమున వారివ్రేళ్ళను పిల్లపెసరులతో పోల్చినాడు.

'తరలకను పిల్లపెసరుల
పరల కరశ్రీ హరించు తరుణాంగుళముల్' (201-1)

ఈ ఉపమానము నూతనము. పిల్లపెసరులకాయలు సన్నముగను, మృదువుగను ఉండుటవలన వీనితో కవి స్త్రీల వ్రేళ్ళను పోల్చినాడు. ఆంధ్రదేశమున వరి పొలములందు భూసారమును వృద్ధిచేయుటకు ఎరువుగను, పశులకు మేతగను పిల్లపెసరును వాడుట ప్రసిద్ధము. కొల్లాపుర ప్రాంతమున ఈ విధానము అధికము.

## కుటుంబ జీవన విధానము

ఆంధ్రదేశమున ఈనాటికిని ఉమ్మడి కుటుంబ జీవనము అధికముగా నున్నది. ఇది ఐకమత్యమునకు నిదర్శన. కనుకనే తెలుగువారియింట అత్తలు-కోడండ్రు, తోటికోడండ్రు, బావలు-మరదండ్రు, అన్నదములు మొదలగువారికి ఆత్మీయతాభిమానములు మెండుగనున్నవి. ఈ విషయమును నరసింగకవి ప్రత్యేక దృష్టితో నిర్వహించినాడు. మూలకథలో లేనివిధముగా బలరాముని పాత్రకు ప్రాధాన్యమును కల్పించి కృష్ణ ప్రేషితలైన రాజకన్యలకు అతని అండ కల్పించినాడు. 'బలరాముడు-రాజకన్యల బావ-మరదండ్ర సంబంధము, తమ్ముని భార్యలపట్ల బాలగార్లకు గల వాత్సల్యము, భర్తృగ్రజుడైన బలరాముని పట్ల ఇంటికోడండ్రయిన రాజకన్యలు ప్రదర్శించు భయభక్తులు, బలరామకృష్ణుల భ్రాతృవాత్సల్యము,' 'అదితి, శచీదేవి, సత్యభామల అత్త-కోడళ్ళ సంబంధము, అనురాగములు, శచీసత్యభామల తోడికోడండ్ర ప్రేమభావములు' మొదలైన వానిని నరసంగకవి విలక్షణమైన రీతిలో వివరించినాడు.

ఈ విధముగా నరసంగకవి ఆంధ్రుల ఆచారములను, కుటుంబ జీవన విధానమును తన గ్రంథమున ఉచితరీతితో ప్రతిబింబింపజేసినాడు.



# 12. పూర్వకావ్యానుసరణము

కవులు తమకు పూర్వులైన మహాకవులను అనుసరించుట మర్యాద. దీని వలన వారికి గౌరవమే కలిగినది కాని కించుదనము కలుగలేదు. పూర్వ కవుల పట్ల గురుభావము కలిగియుండుట ఉత్తరకవుల వినయ గుణగ్రాహకత్వములకు ప్రతీక. ప్రబంధకవులందరును ఎంతోకొంతగా పూర్వాంధ్ర కవుల, సంస్కృత కవుల ప్రభావమునకు లోనైనవారే. వీరు పూర్వులను అనుసరించుటలో తమకు వలసిన మార్గమును ఎన్నుకొన్నారు. కొందరు పద్యరచనా విధానమును ఒర వడిగా పెట్టుకొనగా, మరికొందరు సన్నివేశకల్పనా విధానము, సంభాషణా చమ త్కారము, పాత్ర చిత్రణాదులను దృష్టిలో నిడుకొనిరి. కొందరు పూర్వకవుల పదశిల్పమును ఆకళింపు చేసికొని మేలురమైన పద్యరచన సాగించగా, ఇంకొందరు తు.చ. తప్పకుండ పూర్వపద్యములనే అనుసరించిరి, అనువదించిరి. వెల్లూరు నరసింగకవి కూడ ఈ పూర్వసంప్రదాయమును అనుసరించి పోతనాది పలువురు మహాకవులను అనుసరించినాడు.

నరసింగకవికి ప్రాచీనాంధ్ర సాహిత్య పరిచయము బాగుగనున్నది. వీనిలో పోతనామాత్యుని భాగవతమన్న ఈయనకు ఆరవ ప్రాణము. అందులోని సత్యభామా నరకాసుర యుద్ధ ఘట్టమునందలి భావమును యథాతథముగ స్వీక రించినాడు. ఈయన పూర్వాంధ్ర ప్రబంధములను మథించినవాడు. నంది తిమ్మనార్యుడు ఈయనకు మార్గదర్శకుడు. ఆయన 'పారిజాతాపహరణము' నాదర్శముగా గ్రహించియే తన గ్రంథారంభము కావించినాడు. తిమ్మన పద్య రచన, పదప్రయోగము, భావములను నరసింగకవి అధికముగా అనుకరించి నాడు. విజయ విలాసకర్త చేమకూర వేంకటకవి ఈయనకు గురుతుల్యుడు. నరసింగకవి పూర్వకవులను స్తుతించిన పద్యములు కాలగమనములో నష్టమై పోయినవి కాని లేనిచో పై విషయములు స్పష్టముగా తెలిసియుండెడివి. అవసరమును బట్టి శ్రీనాథుడు, పెద్దన, కృష్ణరాయలు, రామరాజభూషణుడు మున్నగువారి పద్యములను అనుసరించి వారిపట్ల తనకు గల గౌరవమును వ్యక్తపరచినాడు.

నరసింగకవి అనుకరణము ప్రధానముగా రెండు విధములుగానున్నది. అందు ఒకటి కథానుకరణము మరొకటి పద్యానుకరణము.

## కథానుకరణము

ఈ విషయము ముందుగా ప్రస్తావింతము. నరసింగకవి నంది తిమ్మన పారిజాతాపహరణమును, పోతనామాత్యుని భాగవతమును కథా నిర్వహణమున అనుసరించినాడు. 'పారిజాతాపహరణము' నాదర్శముగా గొని తన గ్రంథారంభము కావించినాడు. ఒక్క పురవర్ణన (ద్వారకాపురవర్ణన) తప్ప మిగిలిన కృష్ణుని దక్షిణ నాయకత్వము, నారదాగమనము, పారిజాతపుష్ప ప్రదానము, దాని ప్రభావ వర్ణన, నారదకృత రుక్మిణీస్తుతి, సత్యభామాగర్హణము, దూతికా కథనము, సత్యభామానిర్వేదము, కోపమందిర ప్రవేశము, కృష్ణాగమనము, సత్యాసాంత్వనము, సత్యాకృత కృష్ణ గర్హణము, సత్యాప్రసాదనము, మజ్జనభోజనాదికములు, సాయంకాల, అంధకార, నక్షత్రచంద్రోదయ వర్ణనలు, చంద్రికా విహారము, శ్రీకృష్ణుని మేలుకొలుపు, ప్రయాణసన్నాహము మున్నగు అంశములను తులనాత్మకముగా ఒక అచ్చున గ్రుద్దినట్లుగా నరసింగకవి రచించినాడు.

ఇక సత్యభామా నరకాసుర యుద్ధఘట్టమున కవి ఆంధ్ర మహాభాగవతమును మార్గదర్శకముగా స్వీకరించినాడు. నరసింగకవి పోతన భావమునే ఇక్కడ స్వీకరించినాడు కాని పద్యరచనా విధానమును అనుకరించలేదు. పోతన వృత్తములు ఎక్కువగా వాడగా ఈయన కందములందే రచన సాగించినాడు. పోతన సమాసములందు తనకు నచ్చిన వానిని యథాతథముగా తన కందములందు ఇముడ్చుకొన్నాడు. పోతన ఒక్కొక్క సీసమున చెప్పిన విషయమును ఈయన రెండుమూడు కందములందు వివరించినాడు. నరసింగకవి ఒక్కొక్కచోట చక్కని శబ్దాధికారముతో పోతన వృత్తపద్యమున చెప్పిన భావమును ఏ మాత్రము దెబ్బ తినకుండునట్లుగా సమతూకముతో తన చిరుకందము నందేబిగించి ఏకమాత్రాలాఘవత్వమున పుత్రోత్సవలాభమును పొందినట్లు సంతసించు వైయాకరణి' వలె శబ్దసంక్షిప్తీకరణము కూడ ఒకకళయని నిరూపించినాడు.

# పద్యానుకరణము

నరసింగకవి పద్యానుకరణ విధానమును ఈ క్రిందివిధముగా వర్గీకరించు కొనవచ్చును. ఈయన పద్యములుకొన్ని పూర్వపద్యములకు పద భావానుకరణములుగను, భావానుకరణములుగను, పదానుకరణములుగను ఉన్నవి. మరి కొన్ని కుదింపులుగచూపట్టుచున్నవి. పూర్వప్రసిద్ధకవుల కొన్ని పద్యముల ప్రభావ, ప్రేరణలకులోనై వ్రాసిన పద్యములును ఉన్నవి.

## 1. పద భావానుకరణములు

వీనిని సంపూర్ణానుకరణములు అనవచ్చును. అనగా పద్యపుయెత్తుగడ, కవితాధార, సమాసకల్పనము, భావము, కొన్ని సందర్భములందు వృత్తస్వీకారము మొదలగు సర్వవిషయములందును పూర్వ, స్వీయ పద్యములు రెంటను సమానమై ఒకమూసలో పోసినట్లుగా ఉన్నవి. ఇట్టివానిలో తిమ్మనను అనుసరించినవి పెక్కులు. ఒకటి, రెండు దీర్ఘవచనములతో కలిపి ఇట్టివి దాదాపు ఇరువది పద్యముల వరకున్నవి. మరికొన్ని పోతన, చేమకూర వేంకట కవుల అనుసరణ లిట్టివే.

'ఆరమణీలలామములు నందరగూడి యదూద్వహుండు' (పారిజాత 40-1)

'ఆరామామణులన్ విధూపలమయీహర్మ్యప్రదేశంబులం' (రా.ప.134-1)
తిమ్మన'ఆయాప్రదేశంబులందు భార్యాసహితముగా కృష్ణునివాసము'ను చెప్పగా నరసింగకవి అందలి 'రహస్యక్రీడలను' అధికముగా చెప్పినాడు. ప్రాసలెంటను సమానమైనను రెండవదానియందు ద్విప్రాస అధికము.

'అనవిని ప్రేటువడ్డ యురగాంగన యుంబలె నేయిపోయుఫ'
(పారి. 82-1)

'అనుపల్కుల్విని వంతలాడిత రుషద్ధర్యాష భార్యావిధం'
(రా.ప.82-2)

తిమ్మన సత్యభామను 'వేటువడ్డ యురగాంగన'గా చెప్పగా నరసింగకవి దానికి దీటువచ్చునట్టుగా విచిత్రమైన రీతిలో 'దండతాడితరుషద్దర్వ్యక్ష భార్య' అని ఆడు సింగముగా చెప్పినాడు. ఇది 'సదసత్సంశయగోచరోదరి' అన్న శ్రీహర్షుని ప్రయోగమునకు పోటీగా శ్రీనాథుడు చెప్పిన 'అస్తినాస్తి విచికిత్సా హేతు శాతోదరి' అన్న ప్రయోగవిధానమును జ్ఞప్తికి తెచ్చుచున్నది.

* * *

వచనమునందును ఇట్టి అనుకరణము చోటు చేసికొన్నది.

వ. 'వేండియుం దుహినకరమండలంబునం గురియు నప్పండు వెన్నెలలు సాయంతన నటన చటుల మహానట వికటాట్టహాస భాసంబుల కనుప్రాసంబులై .........నిద్రాముద్రితనేత్రుడై శయనించె; నయ్యవసరంబున' (పారిజాత 53-2)

వ. 'వెండియు నప్పుండరీక మండలంబున దండిమెరసి సమయోరవ్వుండు పిచండిలంబుగా నిండించు కర్పూరాఖండ పాండిత్యంబు నంగీకరించుచు, ఖండ పరశు చండతరాట్టహాసంబులు రసాస్థలంబున వెదజల్లిన విధంబునం భాసిల్లుచు .........నిద్రాముద్రితనేత్రలై శయనించిరంత.' (రా. ప. 171-2).

ఇందలి భావము శబ్దార్థాలంకారములు, పదప్రయోగ విధానము తుల్యములు.

'మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు' (భాగ. సప్త. 150)

'నూతన మేఘోద కాయత చాతక
జాతముల్ చనునె దుర్జలములకును' (రా. ప. 374-2)

భావమునను, పద్య నిర్వాహణమునను, సమాసఘటనమునను పై రెండు పద్యములు కవల పిల్లలవలె భాసించుచున్నవి.

* * *

'చంద్రప్రస్తర సౌధశేఖరస పరశ్యామా కుచద్వంద్వ ని'
(విజయవిలాసము 1-1)

'శ్రీపూర్ణోత్పలి బాంధవోపల గళత్శ్రీసౌధ కుంభచ్యుతా' (రా. వ. 45-1)

ఈ రెండు పద్యములందును ఇంద్రప్రస్థము, గోపాల్పేట అన్నపుర నామములు తప్ప మిగిలిన వృత్తము, ఎత్తుగడ, పద్యపునడక, భావము, సమాస కల్పనము, అలంకారము మొదలైన వన్నియు సమానమై బింబ ప్రతి బింబ ప్రాయములుగ నున్నవి.

## 2. భావానుకరణములు

సత్యభామా నరకాసుర యుద్ధ ఘట్టమునందలి పోతనామాత్యుని పద్యముల భావమును నరసింగకవి స్వీకరిచినాడు.

'సమద పుష్పంధయ ఝంకారములు గావు
భీషణ కుంభీంద్ర బృంహితములు' (భాగ. దశ. ఉత్త. 153)

అని పోతన సీసమున చెప్పిన పద్యభావమును కొంత తనమాటలను వేరుగా జోడించి నరసింగకవి మూడు కందములందు చెప్పినాడు.

'..................
.........శీతాంశుముఖీ
కొల్లలు వేడ్కలు వెద
జల్లుచు గన్గొనగ నీళ్ళచల్లాటలచే.'

'అళి ఝంకృతులే దంతా
వళఘీంకృతు లీ, శుకాళి భాషలె హయహే
షలు, కంకణ నిక్వణన
మ్ములె రథనేమినినాదములు తలపోయన్.'

'చెలుల పురస్కృతులె భటా
వళుల తిరస్కృతులు, ఘోష నాదంబులె హే

ధుఁ నాదమ్ములు, వీణా
కలరవములె వినఁగ జాపగుణ నిస్వనముల్'

'దురమెక్కడ నీవెక్కడ
'నరుదేరఁగ వందు నిలువు.........' (రా. ప, 201-204/2)

* * *

వేణింజొళ్ళెము వెట్టి సంఘటిత నీవీబంధమై భూషణ'
(భాగ. దశ. ఉత్త. 170)

అన్న వృత్తపద్య భావమును కొంచెము ఎక్కువ తక్కువగా నరసింగకవి కంద పద్యమున చెప్పినాడు.

'జడముడిచి సొమ్ములిమ్ముగ
నిడినీవిబిగించి చింగులివురు పరచిబల్
విడికాశబోసి చన్గవ
నడుమ సరుల్‌నిలిపి కొంగునడుమున గట్టెన్' (రా.ప. 266-2)

పోతన పద్యము సంస్కృత బాహుళకముకాగా నరసింగకవి పద్యమున అచ్చ తెనుగుదనముట్టిపడుట విశేషము.

* * *

'రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు' (భాగ.దశ.ఉత్త. 183)

అని పోతన సత్యభామ శృంగార వీరములను జంటగా ఒకే పద్యమునచెప్పిన క్రమమును విడగొట్టి రెండు వేరువేరు కందముఎంచు భావశైథిల్యము లేకుండ నరసింగకవి చెప్పినాడు.

'నీమొగము, నీచెరగును,
నీమహితశరాసనంబు, నీదర్శనమునమున్
సోముని, మదనధ్వజమును,
గామునివలె సమ్మృతలహరిగా గంటిజుమీ'

'ఈ నీ చిహ్నములవనీ
ఘూనసకవి, కేతు, విలయసూర్యపరిధి, వై
శ్వానరముల చందంబున
గానంబడకున్నె నీదుకదనము నందున్' (రా.ప. 299, 300-2)

## 3. పదానుకరణములు

నరసింగకవి పోతనామాత్యుని సీసములందలి కొన్ని సమాసములను, పదములను యథాస్థితముగ తనకందములందు బిగించినాడు.

'సౌవర్ణ **కంకణ ఝణఝణ** నినదంబు
శింజినీరవము తోఁజెలిమి సేయ
దాటంక **మణిగణ ధగధగదీప్తులు**
గండమండల రుచిఁ గప్పికొనగ
ధవళతరాపాంగ **ధళధళరోచులు**
బాణజాల ప్రభాపటలినణప
**శరపాతఘుమఘుమ** శబ్దంబు పరిపంథి' (భాగ.దశ.ఉత్త. 177)

'గుణనికరముతో గరకం
**కణఝుణఝుణ** రవముమెరయ, గండస్థలిద
ర్పణరుచిర కర్ణభూషణ
**మణిధగధగ దీప్తి** పొలియ మలయుచునుండున్'
'దృగళిత **ధళధళరుచులా**
శుగ శిఖర ప్రభలగడవ, సురరిపు నాథా
నుగ సైన్యకల కలార్భటి
నగణిత **శరపాతఘుమఘుమార్భటి**యార్పన్' (రా.ప. 289-290/2)

కంకణ ఝణఝణ రవము, మణి ధగ ధగ దీప్తి, ధళధళరుచులు, శరపాత ఘుమఘుమ వంటి పోతన సమాసములు నరసింగకవి కందములందు చక్కగా నిబంధింపబడినవి. ఈవిధముగా పోతన పదప్రయోగ సంపదను నరసింగకవి పైతృక ధనముగా భావించి, సాధికారముగా స్వీకరించి సద్వినియోగము కావించినాడు.

* * *

## 4. కుదింపులు

నరసింగకవి పోతన భాగవత పద్యములను పలువిధములుగా, యథేచ్ఛగా కుదించుకొని వాడుకొన్నాడు.

అ. వృత్తపద్యభావమును కందమున చెప్పుట.

'జ్యావల్లీధ్వని గర్జనంబుగ సురల్ సారంగ యూథంబుగా'
(భాగ. దశ. ఉత్త. 182)

అని పోతన సత్యభామ యుద్ధమును ప్రావృట్కాలముగా సావయవముగా రూపించి శార్దూల వృత్తమున చెప్పినభావమును ఏమాత్రము పొల్లువోని విధముగా నరసింగకవి

'ధనువింద్ర ధనువు గుణని
స్వనమురుము నిలింపులెల్ల చాతకములు నే
ఘనమీవు మెరుపుగా నరి
జనశిఖి నార్చితివి నిశితసాయక వృష్టిన్' (రా.ప. 298-2)

అని చక్కని చిక్కని చిన్నారి కందమున కుదించి తనశాబ్దికదక్షతకు ప్రతీకగా చూపినాడు.

ఆ. వృత్తపద్యభావమును అర్ధ కందమునముగించుట.

'దానవులైన నేమి మరిదైత్యసమూహములైన నేమి నీ' (భాగ. దశ. ఉత్త. 155)

అని పోతనామాత్యుడు సత్యచేత పలికించగా నరసింగకవి లఘువుగా కంద పద్య భాగమున.

'నీ, మరుగుననుండగ నాకీ
వెరపేటికి నాదుమాట వినుమిటు కృష్ణా! (రా.ప. 204-2)

అని కుదించినాడు.

ఇ. వృత్త పద్యభావమును ఒక సమాసముతో సూచించుట.

'అలినీలాంక చూడ నొప్పెసగె బ్రత్యాలీఢ పాదంబుతో' (భాగ. దశ. ఉత్త. 179)
అన్న పద్యభావమును నరసింగకవి 'రణాభినుతాలీఢ పదస్థితిన్' (276-2) అన్న సమాసముతోడనే సరిపెట్టినాడు.

ఈ. ఒక సంపూర్ణ పద్యమును ఏకాక్షరముతో సూచించుట.

'లేమాదనుజులగెలువగ, లేమా' (భాగ. దశ. ఉత్త. 172)
అని పోతన యమకముతో చెప్పిన కందమునకు నరసింగకవి చమత్కారముగా ఒకే అక్షరమును ఉపలక్షకముగా చెప్పినాడు.

'తలవాంచి పలుకకుండిన
తెలిసెన్ నీ చిత్తవృత్తి ధీకొని రిపులన్
గెలువంగల నాకంటెను
బలమెక్కడ గలదె నీకు భండనమే 'లే'

అని పోతన పద్యభావమును తన కందమున చేప్పినను, ఆ పద్యమునకు అలంకారమై'లే' ఈయనను కట్టివేసినది. అందువలన దానిని తన పద్యాంత్యాక్షరముగ కూర్చి తృప్తిపడినాడు.

## ౫. పూర్వ కవి ప్రేరణలు

కాశీఖండము, మనుచరిత్ర, ఆముక్తమాల్యద, వసుచరిత్ర, చంద్రికా పరిణయము, విజయవిలాసము, యాదవ భారతీయమువంటి గ్రంథములందలి కొన్ని పద్యములకు ఆకర్షితుడై నరసింగకవి వాని ప్రేరణతో తన గ్రంథమందు కొన్ని పద్యములు వ్రాసినాడు.

## కాశీఖండము

'కంటికి నిద్రవచ్చునె సుఖంబగునే రతికేళి జిహ్వకున్' (కాశీ ఖండము)
'కంటకుడైన యాదవుని గర్వమడంచకయున్న మిక్కిలి'
(రా. ప. 288-2)

శ్రీనాథుని కాశీఖండ పద్యమున 'మేరువుతో స్పర్థించిన వింధ్యుని' మనస్థ్సితి' చెప్పబడగా, నరసింగకవి పద్యమున 'కృష్ణుని'తో వైరమునకు సిద్ధమైన నరకాసురుని మనోరథము చెప్పబడినది'. సందర్భము రెండిటి యందును సమానము. ఈ రెంటను భావమునందును, పదప్రయోగ విధానమందును, నడకయందును, ప్రాసయందును, వృత్తవరణమందును తుల్యములగుట స్పష్టము.

## భాగవతము

'పీఁట చక్కఁగ బట్టి వెరవెరుంగనికొమ్మ
బాణాసనంబెట్లు పట్టనేర్చె (భాగ. దశ. ఉత్త. 181)
'రిపుడు చివ్వకు వచ్చునపుడు ప్రత్యాలీఢ
పాదమేభంగి తాపాదుకొల్పె' (రా. ప. 99-3)

సందర్భములు వేరైనను రెంటియందును సత్యభామ పరాక్రమమే వర్ణితము. భాగవతమున శుకుడు, నరసింగకవి రచనలో బలరాముడు సత్యపరాక్రమమును అభివర్ణించినారు. నరసింగకవి అర్థాంతర సమర్థనముతో సత్యభామ పరాక్రమమునకు పుష్టిని చేకూర్చినాడు.

## మనుచరిత్ర

'ఎక్కఁడివాఁడొ యక్షతనయేందు జయంత వసంతకంతులన్'
(మను. 35-2)
'చంద్రుడొ యింద్రపుత్రుడొ వసంతుడొ లేక తలంచి చూడయ'
(రా. ప. 363-2)

పెద్దనార్యుని మనుచరిత్రమున 'ప్రవరుని సౌందర్యమునకు అబ్బురపడిన వరూధిని ఆత్మగతమున పై విధముగా తలచినట్లు చెప్పబడగా, నరసింగకవి తన గ్రంథమున తత్తుల్యమైన సందర్భమునందే అనగా 'నరకవధానంతరము తమ వద్దకువచ్చిన కృష్ణునిగాంచి రాజకన్యలు పైవిధముగా తలచినట్లు' చెప్పినాడు. పెద్దన 'ప్రవరుని తనూవిభవవైభవాధిక్యద్యోతకముగా' 'విషమాలంకారము'ను గ్రహించగా, నరసింగకవి 'కృష్ణుని లసత్సాంద్ర తనూవిలాస వరసంపదను' స్పష్టీకరించుటకై 'ఉదాత్తాలంకారము'ను స్వీకరించినాడు. రెండు

పద్యములందును వరస్వీకరణమే ఉన్నదికనుక 'ఉత్పలమాలా' వృత్తమును కవులు గ్రహించుట ఉచితముగ నున్నది.

* * *

'ఎందేడెందము కందళించి రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్'

(మను. 62-2)

ఇంద్రియ సుఖలాలసత పరమానందమయమైన బ్రహ్మానందమును కూడ విషయానందముగా తలపింప జేయుట ఉభయత్ర సమానము. 'డెందము, మది'అని 'ద' కారయుక్తమైన పదములతో రెంటను మనశ్శబ్దము చెప్పబడినది. 'దః పుంసి దాతరిచ్ఛేదే' 'క్లీబేపానవైరాగ్య' 'ద్రావకేశుచౌ' అని నానార్థరత్నమాల. 'దకారము ఛేదించుట యందును, వైరాగ్యమునందును, పరిశుద్ధుని యందును వర్తించును, 'రుద్రబీజమైన' దకారము మోహదము, మోక్షకరము' అని బీజాక్షర నిఘంటువు. మానవుని ఇహలోకలోలుని గావించునది మనశ్శార్దూలము. దానిని నిగ్రహించవలెనన్న మానవుడు 'కృత్తివాసుని' వంటి రుద్రుడుకావలెను. కనుకనే పెద్దన, నరసింగకవు లిరువురు ఇచ్చట 'ద' కారప్రాసతో గూడిన శార్దూలవృత్తమునే స్వీకరించినారు. నరసింగకవి పద్యమందలి అంతరార్థము అన్యత్ర ప్రస్తావితము.

## ఆముక్తమాల్యద

ఆంధ్రభోజుడైన శ్రీకృష్ణదేవరాయని పుష్పలావికావర్ణనలను వర్షర్తు వర్ణలను నరసింగకవి అనుసరించినాడు.

'వెలది! యీనీదండ వెలయెంతః నాదండ
కును వెలబెట్ట నెవ్వని తరంబుః' (ఆము. 19-2)

'ఇచ్చను బూబంతులే గొనవచ్చితి
ముట్టిచూడగ నిమ్ము మోహనాంగి!' (రా. ప. 119-1)

ఈ రెండు పద్యము లందును పుష్పలావికావిట జనముల నర్మోక్తులు సరసముగ వర్ణితములు.

* * *

'సరుగుం జెంచలి దుమ్మిలేదగిరిసాకుం దిత్రిణీ పల్లవో
త్కరముం గూడ బొరంటి నూనియంతో గట్టావి కుట్టారికో'
(ఆము 134-4)

'వెచ్చని తీర్థమాడి నులివెచ్చ పదార్థములారగించి బల్' (రా.ప. 230-4)

అని వర్షఋతువును వర్ణించుటలో, కృష్ణరాయలు 'కట్టావి కుట్టారి కోగిరములతో కుంపటీ మంచములతో' రెడ్లు జడి బాధను నివారించుకొన్నట్లు చెప్పినాడు. నరసింగకవి దానిని మనోహరముగ మరికొంత పెంచినాడు. మేఘాలోకనము గృహస్థులందరకును మదనోద్దీపకము. ఎంత వెచ్చని భోజనము, కుంపటి మంచము లున్నను కంఠాశ్లేషాసక్తలైన నిజకాంతల సాంగత్యములేక వారికీ జడివాన బాధ సంపూర్ణముగ తొలగిపోదుకదా. కనుక నే నరసింగకవి 'ప్రౌఢ యాంధ్రకురువంపుడు బల్కుచ సీమలానుచున్' భోగించినట్లుగా చెప్పి గేస్తుల జడి బాధను పూర్తిగా నివారించినాడు. కురువంపుడు' అన్న పదమును 'కురు చవంపుడు-కించిత్ వల్గత్-కొద్దిగా జారిన' అన్న అర్థమున వాడినాడు.

## వసు చరిత్ర

'నానాసూనవితాన వాసనల నానందించు సారంగమే' (వసు. 47-2)

'విలసద్గంధ ఫలీ తిలప్రసవముల్ విశ్వంభరాధీశక' (రా.ప. 197-1)

ఈ రెండు పద్యములందును భావము ఇంచుమించుగా సమానము. భట్టుమూర్తి ఒక్క సంపెంగనే స్వీకరించగా, దానికి జతగా నరసింగకవి తిలకుసుమమును కూడ గ్రహించినాడు.

* * *

'ఆ తన్వంగి యనంగ ఝాంకరణ వజ్ఞాముక్త చూతాస్త్రని'
(వసు. 101-3)

'కలిమివెలంది మందిరము కమ్మని విల్తుని వాడికైదువై' (రా.ప. 200-1)

తమ్ములు, బిడ్డలు తమవారికి శుభములు గూర్చుట లోకసహజము. 'విరహబాధిత అయిన గిరిక సహజాతములు (తమ్ములు)' అని పద్మముల మాటునకేగ అవియే

ముందుగా జ్ఞాతివైరముతో ఆమెను బాధించినట్లు' వసుచరిత్రకారుడు చెప్పగా, 'బాలమృణాళములు తమ ప్రసవములను (బిడ్డలను, పుష్పములను) నమ్మి పద్మముల బలిమివలన వృద్ధిపొందినట్లు' నరసింగకవి చెప్పినాడు. కాని బిడ్డల మరుగు జొచ్చిన మృణాళనాళములు రాజకన్యల బాహు వల్లికల పోలలేక పోయిన వన్నాడు.

## చంద్రికా పరిణయము

'పరువంపుననగుంపు బలితంపు జిగిపెంపు
గనిమొప్పు పాణియుగ్మములతోడ' (చం. ప. 13-1)
'నునుకెంపు ననగుంపు పెనుసొంపు నణగింపు
మధురంపుట ధరంపు విధముపెంపు' (రా. ప. 170-1)

అచ్చికపద బాహుళ్యమునందును' సీసపద్యమును నడిపిన తీరునందును, మాధవ రాయని పద్యమును నరసింగకవి పద్యము అనుకరించుచున్నది. దాదాపుగా ఈ తీరుగల పద్యములు పెక్కు ప్రబంధములందు గనపడుచున్నవి.

## విజయవిలాసము

పురవర్ణ నాంగములైన సాలఖేయములను వర్ణించుటలో నరసింగకవి చేమకూర పద్ధతిని స్వీకరించినాడు.

'నీ సరియైన దేవతటినింగలగించెద నీవడంపుమా' (విజయ 5-1)

ఇందు సాలఖేయములు రెండును ఒక్కపద్యముననే చెప్పబడగా నరసింగకవి విడగొట్టి వేరువేరుగా కొంత పెంపుతో భగ్యంతరమున చెప్పినాడు.

'అత్యున్నతాకృతి యగు త్రివిక్రమలీల
నలబలీంద్రునిమీద నడుగుమోపి' (రా. ప. 110-1)
'ఉరగవధూటులు తత్పురి
పరిఖాంబు విహారకేళి పరవశలగుటన్' (రా. ప. 112-1)

పై పద్యమున పురప్రాకారము త్రివిక్రమునితో పోల్చబడుటచే అవి ఆకాశవ్యాపి యని సూచితము. క్రింది పద్యమున పరిఖ పాతాళవ్యాపియని చెప్పబడినది.

చెండ్లాగుబ్బలు జాళువాతళుకులా చెక్కిళ్ళడాల్ సింగిణీ' (విజయ 139-1)

'చెండ్లా గుబ్బలు తామర
తూండ్లా బాహువులు, ఘన్మథుడుధరియించే' (రా. ప. 130-3)

నరసింగకవి పద్యమందు ఒకటి రెండు అవయములు ప్రసక్తిలేకున్నను, పద్యము వేరైనను, ప్రాస, పదభావములు ఉభయత్ర సమానము. కాని విజయ విలాసమందలి సందర్భౌచిత్యము రాచకన్యకా పరిణయమున కొరవడినది. అందు అర్జునుడు ఏకాంతమున నర్మసఖునితో తానే వివాహమాడదలచిన కన్యను ఎట్లు వర్ణించినను దోషములేదు కాని, నరసింగకవి రచనయందు బలరాముడు సమస్త జన సమక్షమున బహిరంగముగ తమ్ముడు వివాహమాడదలచిన కన్యలనిట్లు వర్ణించుటలో కొంత ఉచితజ్ఞత కొరవడినది. ప్రబంధములందిట్టివి సర్వసామాన్యము.

* * *

దాతృవితరణౌదార్యమును చెప్పుటలో నరసింగకవి వెంకటకవిని అనుసరించినాడు.

'అడుగుమాత్రమెకాక యంతకెక్కుడుగ నీ
జాలెనే యలబలి చక్రవర్తి' (విజయ. పీఠిక.) 25

'సిరితోడ బుట్టువై చెన్నొందు తారకా
ధవుడు పాదమె శుచికవి కొసంగె' (రా. ప. 37-1)

చేమకూర వేంకటకవి తనకృతి భర్తయైన రఘునాథ నృపాలుని ఈగిని వర్ణించగా, నరసింగకవి తన కృతి ప్రేరకుడైన నరసింహారెడ్డి దానశౌండిమ మును వివరించినాడు. రెండిటియందును వ్యతిరేకాలంకారము సమానము. కొందరు దాతలపేర్లు వేరైనను వెంకటకవి విధానముచే నరసింగకవి గ్రహించి

నాడు. 'ఆదిలక్ష్మికి సహజుడై యుండికూడ చంద్రుడు శుచికవికి అనగా అగ్ని యనెడు కవికి ఒక్కపాదమె అనగా ఒక్క అంశమే ఇచ్చినాడు. స్వర్ణమయమైన మేరు చిహ్నితుడైయుండి కూడ ఈశ్వరుడు తన అర్ధాంగికి సగము మాత్రమే (అర్ధ శరీరమే) ఇచ్చినాడు. బలి దానసముద్రుడైకూడ వామనునకు త్రిపాద ధరణినే ఇచ్చినాడు. రాజరాజని పేరుండికూడ లోభియై కుబేరుడు ఉత్తరాశ (ఉత్తరదిశ, అధికమైన పేరాశ)తో అలకాపురమును పాలించినాడు అనగా ఇతని ధనదత్వము నేతిబీర యందలి నేయివంటిది అని వారి ఈవిని అపహసించిన సంపూర్ణదాత నరసింహారెడ్డియని' నరసింగకవి చెప్పినాడు.

* * *

'వలపంతి నీకటాక్షము గల్గనిన్నాళ్ళు
మరు శిలీముఖములు సరకుసేయు' (విజయ 198-2)
'చెలి! నీకృపాదృష్టి చెలగువేళయందు
మదనుని సుతునిగా మదిదలంతు' (రా. ప. 79-2)

విజయవిలాసమున అర్జునుడు సుభద్రను, రాచకన్యకాపరిణయమున కృష్ణుడు సత్యభామను సాంత్వనపరచు సందర్భములందలివి పై రెండు పద్యములు. అలిగి అనుగ్రహించని ప్రియురాలిని ప్రసన్నము గావించుకొనుటకై విరహ బాధితుడైన నాయకుడు పడు పరితాపము వీనియందు వర్ణితము. నాయకునకు నాయికా సాహచర్యమున మన్మథుడు, తదనుచరులైన చంద్ర, శుక, మంద పవనాదులు ఎంత ఉద్దీపకములగునో, నాయికా వ్యతిరిక్తమున అంతగా ప్రతికూలించును. నరసింగకవి 'కృష్ణుడు తనకు సత్యానుగ్రహము కలిగిన సమయమందు విరహులకు శత్రువులైన పుష్పబాణుడైన మన్మథుడు పుత్రుడుగను, చంద్రుడు బావమరదిగను, లీలాశుక భాషలు ఇంపుగను, వాయువును నిక్కముగ తలతునని చెప్పుటలో చక్కని చమత్కారమును చూపినాడు.

రెండు పద్యములందును నాయికల అవయవములకు తుల్యములై, సాభిప్రాయకములైన ఉద్దీపకములే పేర్కొనబడినవి. సత్యభామ, సుభద్ర లిరువురును ఖ్యాతిపొందిన స్వాధీనపతికలే. బావమరదులైన కృష్ణార్జునులును ప్రఖ్యాతికెక్కిన దక్షిణనాయకులే. వాక్కుశలులే. చేమకూర వేంకటకవి, వెల్లూరు నరసింగకవు లిరువురును శబ్ద చిత్రకుశలురైన కవీశ్వరులే.

* * *

రెండురెండు పాదములకు విడివిడిగా పంచప్రాసలుండుట.

'మారుతమ్ముల వాడికి మలయకూట
మారుతమ్ముల వేడికి మట్టుమీరు
చంద్రకిరణమ్ములకు శుకశారికాళి
చంద్రకిరణమ్ములకు జాలబలదరించు' (విజయ. 8-3)

'కలకలనగు చిగురాకుల
కలకలనగు రాజకన్యకల చరణంబుల్
తలతలయను నెలనెలతల
తలతలయను సతుల నఖరతతి కిరణంబుల్' (రా.ప. 201-1)

ఇందు శాబ్దికానుకరణము స్పష్టము. యమకము ఉభయత్ర సమానము.

* * *

సందర్భ, భావములు వేరైనను కొన్నిచోట్ల నరసింగకవి కేవలము పద్య పుటెత్తుగడలనే అనుసరించినాడు.

'ప్రకట శ్రీహరియంఘ్రిబుట్టి హరుమూర్థంబెక్కి' (విజయ. పీఠిక. 8)
'ప్రకట శ్రీ జనుపల్లి బ్రాహిబహదర్జక్హాల రాయేంద్రుడౌ' (రా.ప.91-1)

## యాదవ భారతీయము

నరసింగకవి తనకు మాతృవంశమున పూర్వీకుడైన చెన్నకృష్ణకవి రచించిన 'యాదవభారతీయ' మందలి కొన్ని పద్యములను అనుసరించినాడు. ఈ యాదవ భారతీయము ద్వ్యర్థికావ్యమై గోపాలుపేట వల్లభరాయునికి అంకితము.

'అయ్యనరేంద్రుచు హేతినిహతాహిత రాడ్వనితాశ్రువారితో' (యాదవ.60-1)
'దురమునయ్యభూవిభునిదోరసిపుత్రియమిత్రధారుణీ' (రా.ప.69-1)

నరసింగకవి కూడ తన గ్రంథమును గోపాలుపేట చివరి సంస్థానాధిపతియైన హనుమంతరాయునికి అంకితమిచ్చుటవలన యాదవ భారతీయముననుసరించి కృతిభర్తవంశక్రమమును అభివర్ణించినాడు. ఆ వంశమున ప్రసిద్ధుడైన అయ్య

భూపాలుని ప్రతాపము ఉభయత్రసమానముగా వర్ణితము. చెన్నకృష్ణకవి రూపకోపమలతో చెప్పగా, నరసింగకవి రూపకోత్ప్రేక్షల సాంకర్యముతో చెప్పినాడు. నరసింగకవి భావనయే సుందరతరమనుట స్పష్టము.

* * *

'శ్రీకాంతయని కొందరేకతగొనియాడ
సతియని కొందరు సన్నుతింప' (యాదవ. 43-1)
'సకలవైభవముల శరజబాణాంబ శ్రీ
రాయజనుంపల్లి రత్నమాంబ' (రా. ప. 77-1)

గోపాలుపేట రాజవంశమున ప్రసిద్ధురాలైన కోనాంబను చెన్నకృష్ణకవి వర్ణించగా నరసింగకవి రత్నమాంబను వర్ణించినాడు. వీనియందు పద్యము నడిపిన తీరు వేరైనను భావానుసరణమున్నది. చెన్నకృష్ణకవి శ్లేషోల్లేఖములతో చెప్పగా, నరసింగకవి హేతుసహితముగా ఉల్లేఖించినాడు. లక్ష్మీదేవిని 'శరజబాణాంబగా' పార్వతీదేవిని 'ఫణిభగశ్వాంబ (కుమారస్వామిజనని)గా' భూదేవిని 'జనతావనీశ్వరతనూజాంబ (సీతను కన్నతల్లి)గా' బిడ్డల కారణముగా ఖ్యాతికెక్కిన తల్లని కడుపుగల మాతృమూర్తులుగా చిత్రమైన రీతిలో చెప్పినాడు.

* * *

'ఆరఘుపతి కనుజుడనం
గారాజిలు రామకృష్ణ ఘనుడు దనర్చున్
ధీరాజిత ధీరాజిత
గీరాజితనున్ నుతింప గీర్తిధనుండై' (యాదవ. 21-1)

'ఆరాజమణికి ననుజుల
దై రాజిలు వల్లభస్థిరాధీశ్వరుడా
సారాయిత శారాదృత
సారశరాసాభ్రలూన శత్రుకమలుడై' (రా.ప. 51-1)

పద్యము, ప్రాసలతోపాటు రెండవ పద్యమందు శాబ్దికానుసరణము స్పష్టము.

## నాయికా విలాపము

నాయక తిరస్కారముననో, అతని ధృష్టత్వముననో, విరహమును భరింపజాలకనో నాయికలు రోదించినట్లు పెక్కు ప్రబంధములందు చెప్పబడినది.

'పాటునకింతులోర్తురె కృపారహితాత్మక' (మనుచరిత్ర. 70-2)

అని పెద్దన 'మనుచరిత్ర'లో వరూథినీ విలాపమును,

'ఈసున బుట్టిడెందమున హెచ్చిన శోకదవానలంబుచే' (పారిజాత.133-1)

అని తిమ్మన 'పారిజాతాపహరణము'లో సత్యభామ విలాపమును,

'ఆ జాబిల్లి వెలుంగువెల్లికల డాయంలేక' (వసు. 52-4)

అని భట్టుమూర్తి 'వసుచరిత్ర'లో గిరికా విలాపమును వర్ణించగా

'తామసమోపలేక మది ధైర్యము వ్రీల ముసుంగు కొంగునె
మ్మోమున మాటుచేసుకొని మోహనరాగకలస్వనంబుతో
గోమలియేడ్చె నప్డు యదుకుంజరుకున్ మదిజాలిఁబుట్టగా
సామజకుంభ సన్నిభ కుచస్థలినస్రులు జాలువారగన్' (రా.ప. 109-2)

అని నరసింగకవి సత్యభామ విలాపమును మోహనరాగతుల్యముగా చెప్పుటలో పైమూడు పద్యముల భావమును కొంత కొంతగా స్వీకరించి, మేళగించినాడు. 'సామజకుంభసన్నిభకుచస్థలి నస్రులు జాలువారుట'లో, వరూథినీ విలాపము. ('మీటిన విచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందువంగాన్), నెమ్మోమున ముసుంగు కొంగు మాటుచేసుకొని భర్త యెదుట యేడ్చుట'లో తిమ్మన సత్యావిలాపము ('ప్రాణ విభు కట్టెదుటన్ లలితాంగి పంకజ శ్రీసఖమైన మోముపయి జేల చెరంగిడి'), 'ధైర్యము వ్రీల, మోహనరాగకల స్వనము' అనుటలో గిరికా విలాపము ('కిన్నరవధూ రాజత్కరాంభోజ కాంభోజీ మేళవిపంచికా రవ సుధా పూరంబు')లు అను కృతములు.

## సన్నివేశానుకరణము

రాచకన్యకా పరిణయమున విరహతాడితలైన 'రాజకన్యలు మానస పూజా విధానమున కృష్ణుని సేవించుట, వారు పరస్పరము స్వప్నానుభవము తెలిగించు

కొనుట'లు భాగవతమందలి 'గోపికలు తాదాత్మ్యమున కృష్ణలీలల ననుకరించు టను పోలియున్నది.

పూతనయై యొక్క పొలంతి చరింపంగ
శౌరియై యొకకాంతి చన్నుగుడుచు' (భాగ. దశ. పు. 1019)

వంటి పద్యభావముల ఛాయలు, రాజకన్యల వియోగబాధయందు చెప్పబడినవి.

'మానసపూజా విధానక్రియ గృష్ణు
గాంచి సేవించిరి కన్నెలపుడు (రా. ప. 154-3)

అని మద్యపాన మత్తతతోగూడిన చేష్టలందును,

'సొగసుగా జెక్కిళ్ళు చుంబించి చుంబించి
చేరిమోమున మోముజేర్చెనమ్మ' (రా. ప. 166-3)

అనియున్న స్వప్నానుభవములను రాజకన్యలు పరస్పరము వివరించుకొనుట లోను వీరు భాగవతమునందలి గోపికా విధానములను అనుసరించుట స్పష్టము.

ఈ విధముగా నరసింగకవి పలువురు పూర్వకవులను అనుసరించి వారి పట్ల తనకుగల గౌరవమును ప్రకటించినాడు.



# 13. ఉపహ్మాృతి

తరతరములుగా భరతోర్వర ఆధ్యాత్మిక సుధాలహరిగా, పారమార్థిక చింతనా విభావరిగా ప్రపంచమున ఖ్యాతిగాంచినది. వేద ప్రాతిపదికమైన హైందవమతము అందుకు కారణము. నేడు 'మతము' అన్నమాట పలువురికి అనిష్టకారణమైనది. అది సంకుచిత దోషదూషితమని, సమాజ విచ్ఛేదకరమని వ్యతిరేకభావములు ప్రబలినవి. ఈనాడు దేశ, విదేశములను గగ్గోలుపరచునట్టి సంఘర్షణలు, హింసాకాండలు, మారణహోమములు మొదలైనవానికి ఈ 'మతము' తావొసంగుచుండుటయే అందుకు కారణం.

కాని మన ప్రాచీనులు చెప్పినది, ఈనాడు పలువురు భావించునట్టి, భేదబుద్ధిని కలిగించి సర్వనాశకరముగా పరిణమించి పరిమితార్థము కల్గిన 'మతము' కాదు. అది ఉన్నతాశయములతో, విశాల దృక్పథముతో అఖండముగా విశ్వజనీనత నాపాదించునట్టి 'ఉత్తమమతము'. అది రాగద్వేషముల కతీతము. పూర్ణసుఖావహము. మానవ జీవన విధాన నిర్దేశకము. సృష్టిరహస్య తత్త్వోప దేశకము.

జగద్గురిష్టులైన ప్రాక్తన మహర్షులు, ప్రవక్తలు వేదచోదితమైన తత్త్వ మును తమతమ సిద్ధాంతముల రూపమున లోకమునందు పంచినారు. వాని సమాహారమే హిందూమతము. ఇది భారతీయ సంస్కృతి, సంప్రదాయములు, హిందువుల ఆచార వ్యవహారములు, ఉదాత్త సామాజిక విలువలు మొదలైన వాని కూడలి. అఖండ భారత జాతీయతకు చిహ్నము.

'సూత్రేమణిగణావ' అని గీతాచార్యుడు ప్రవచించినట్లుగా, బయటకు కనబడునట్టి భిన్నమతములు, సంప్రదాయములు, వ్యక్తిత్వములు మొదలైన వన్నియు ఈ మూలసూత్రముననే అంతర్లీనమై దేశమునకు అఖండత నాపా దించుచున్నవి.

'ఉన్మజ్జంతి నిమజ్జంతి ప్రేమ్ణ్యఖండ రసస్వతః,

సర్వేరసాశ్చ భావాశ్చ తరంగా ఇవ వారిధౌ.' అని కవి కర్ణపూర గోస్వామి భక్తిసిద్ధాంత ప్రతిష్ఠాపనకై చెప్పిన మాటలు అఖండ భారత జాతీ యతకును అన్వయించును. భారతదేశమందలి భిన్నత్వములన్నియు తరంగ ప్రాయములు. భారత జాతీయతాసాగరం మొక్కటియే స్థిరముగా నిలుచునది

ఈ ఉదాత్త భారతీయ సాంస్కృతిక సంపదను పరిరక్షించునట్లుగా, ఋషికల్పులైన కవులు భావతపఃఫలితముగా తాము దర్శించిన తత్త్వమును తమ కావ్యమునందు నిక్షేపించినారు. భారతజాతీయతయందే అనుస్యూతమైన

ఆధ్యాత్మిక, పారమార్థిక భావములు ప్రతిబింబించని కావ్యములు భారతీయ సాహిత్యమున అరుదు. కనుకనే వేదాంత సంబంధమైన వైరాగ్య వాసనలు లేని వాడు ఉత్తమకవి కాలేడన్న అభిప్రాయము ఏర్పడినది.

అభ్యుదయ భావములు కలిగిన రచయితలు, విమర్శకులుగా తలపబడు వట్టి వారు ఈనాడు 'సామాజిక స్పృహ' అన్నమాటను ఎక్కువగా వాడు చున్నారు. సమాజ, సాహిత్యములు అవినాభావ సంబంధముతో పరస్పర ఆధార నేతృత్వ లక్షణములు కలిగియున్నవి. సమాజమునందలి 'రుజ'ను గమనించి, దానికి చికిత్సచేసి సమసమాజ స్థాపనకై పాటుపడవలెనన్నది ఈనాటి సాహిత్యధ్యేయమైనది. అప్పుడు ఈ శుష్కవేదాంతము, వైరాగ్య భావములవలన సమాజమునకు ఒరుగునదేమి? అన్నవిధముగా కొందరికి సందేహము కలుగ వచ్చును. కాని ఈ ఆధ్యాత్మిక భావములు, జగన్మిథ్యావాదములు కూడ సమా జమునకు సంబంధించినవే. ఇవి ఎక్కడినుండో దిగుమతి అయినవి కావు.

సమాజము ఈనాడు మహావేగవంతమైనది. మానవునికి జీవన సమరమున పోటీ ఎక్కువైనది. అతడు ఆర్థిక, భౌతిక, సాంఘిక సమస్యల విషవలయమున, గానుగ యంత్రమున బడిన వస్తువువలె చితికిపోవుచున్నాడు. అట్టిచో, ఈనిదాఘ తప్తునకు వేదాంత భావములు అమృతపు జల్లును చిలుకరించి, బాధోపశమనము గావించి, చిత్తశాంతిని కలిగించునన్నమాట మీరరానిది.

'అసలు జీవితమే యథార్థము కాదన్న జగన్మిథ్యావాద తాత్త్విక ప్రభా వము సాహిత్యముపై ఉన్నది. ఆధ్యాత్మిక వస్తువుకూడ సామాజిక వస్తువువలె ఒక వస్తువే. అందువలన ఆధ్యాత్మికానుభూతివాదము కూడ వాస్తవికతావాదనే అనవచ్చు' అని సాహిత్యవేత్తల అభిప్రాయము.

'గొప్ప తత్త్వవేత్త అయినవాడే ఉత్తమకవి కాగలడని' పాశ్చాత్య విమర్శ కులును అభిప్రాయపడినారు. 'No man was everyet a great poet without being at the same time a profound philosopher, అని కోలిరిడ్జి విశ్వసించినాడు.

కవి ఏ కాలమువాడైనను, అతడు స్వీకరించిన వస్తువు ఏదైనను దాని యందు అంతస్సత్వమున్నచో అది సమాజమునకు తప్పక దగ్గర కాగలదు. సార్వజనీనతయే ఉత్తమ సాహిత్యలక్షణము.

భారతీయ సాహిత్యమున రామాయణ, భారత, భాగవతములు ప్రథమ గణ్యములు. ఇవి తాత్త్విక సంపదకు తరగని పెన్నిధులు. పలువురు ఆంధ్ర కవులు ఆ తత్త్వమును పరిగ్రహించి ప్రత్యక్షముగను, పరోక్షముగను తమ కావ్యములందు నిబంధించినారు.

వ్యాసభగవానుని హృదయ తత్త్వమును పట్టుకొన్నవాడు ఆంధ్ర మహాభాగవతకర్త పోతనామాత్యుడు. అంతటితో ఆయన తపన ఆగలేదు. వ్యాసుని విషయపారమునకు తాను పెద్దల వలన విన్న వ్యాఖ్యాన వివరములను, జీవితమున తాను లోకమును దర్శించినందువలన గలిగిన జ్ఞానమును, తన మనస్సు అనుభవించిన అనుభవసారమును భాగవతాను వాదమున జోడించినాడు. 'విబుధజనుల వలన విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత తేటపరతును'ని తన విజ్ఞాన సర్వస్వమును ఆంధ్రమహాభాగవతమున క్రుమ్మరించినాడు. అందువలననే వ్యాసుని భాగవతము పోతనామాత్యుని చేతిలో విస్తృతినందినది.

అట్టి పోతనమాత్యుని ఆత్మను అవగతము చేసికొన్నవాడు వెల్లూరు నరసింగకవి. గీతాచార్యుడు, ఆది శంకరులు, జగద్గురిష్ఠులైన ఉపనిషత్కర్తలు మొదలగువారి హృదయగతములను కూడ ఆకళింపుచేసికొన్నాడు. ఈ సంస్కారము నుండి రూపుసంతరించుకొన్నదే 'రాచకన్యకాపరిణయ' ప్రబంధము.

వెల్లూరు నరసింగకవి యందలి పారమార్థిక భావవిలసిత కవితాబీజము వేంకటేశ్వరునికి అంకితముగా వెలసిన 'సుభాషితత్రిశతి'గా అంకురించి, భక్తాంత్రిరేణు ప్రాస్తావికమైన 'చూతపురీవిలాస' యక్షగానముగా పల్లవించి, ఆధ్యాత్మిక వాసనాభరితమైన, మధురభక్తిరసనిర్భరమైన 'రాచకన్యాకాపరిణయ' మహాప్రబంధ రూపమున 'సుమహిత ఫలద'మైన కల్పవృక్షముగా పరిఢవిల్లినది.

'హరివి పరాత్పరుండ వఖిలాగమ వేద్యుడవిందిరామనో
హరుడ వనంతమూర్తివి చరాచరచేతనవర్తివంబుజో
దరుడ వజాండ వాద్యుడవు ధాతృకపర్ది పురందరాది ని
ర్జరవరులెవ్వరుం దెలియజాలరు తావకసచ్చరిత్రముల్' (152-1)

అట్టి చరాచరచేతనవర్తి, అఖిలాగమవేద్యుడు, పరాత్పరుడు అయిన శ్రీకృష్ణ పరమాత్ముని 'లీలావిశేషము' నరసింగకవి ప్రతిభచేత 'రాచకన్యకాపరిణయ' ప్రబంధామృతముగా ఆవిష్కృతినొంది 'సరసరస సమన్వితాతి చమత్కృతిక'మై, భక్తజనకల్మషనిరాకృతి గావించి, 'సహృదయనివేదితనివృత్తి'యైనది.

నరసింగకవి కావ్యనిర్మాణ దక్షత, అంతర్యముల ఆధారముగా 'రాచకన్యకాపరిణయ' ప్రబంధ సౌందర్యమును అన్నికోణముల నుండి స్పృశించి దిగ్దర్శనముగా ఇట వివరించితిని. నా బుద్ధికితోచిన విధముగా, కవిచిత్తసంస్కార జనితములై కావ్యమున భాసిల్లు ఆధ్యాత్మిక భావములను ప్రస్తావించి నరసింగకవి హృదయావిష్కార ప్రయత్నము గావించితిని.

ఒప్పు తత్పరయు రసజ్ఞుల అనుభవమే కవితాకన్యక జీవము.

ఓం తత్సత్



# * సూచికలు

## అవతరణము

**1. ప్రవేశిక :**

1. ధ్వన్యాలోకము. పు. 29. 2. సంస్థానముల సాహిత్యసేవ పు. 24. 3. శతకకవుల చరిత్ర పు. 795. 4. ఆంధ్రకవి సప్తశతి పు. 103. 5. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక కాకినాడ. సంపు. 18. సంచి. 2. పు. 60. 6. "అప్రతిభస్య పదార్థసార్థః పరోక్ష ఇవ, ప్రతిభావతః పునరపస్యతోపి ప్రత్యక్ష ఇవ'' కావ్యమీమాంస. పు. 36. 7. 'మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయమాలాం। యోజ్యం కావ్యేష్వవహితధియా తద్వదేవాభిధానమ్॥' కావ్యాలంకారము 1-59. 8. 'విశిష్ట పదరచనా రీతిః' 9-1 పు. 489 సాహిత్య దర్పణము. 9. చూ. ఈ గ్రంథపూర్తి పాఠము. అనుబంధము. I

**2. జటప్రోలు సంస్థానము - భాషాసేవ :**

1. సాంస్కృతిక పునరుజ్జీవనము పు. 78. 2. శ్రీ సురభివారి వంశ చరిత్రము. పు. 84. 3. సంస్థానముల సాహిత్యసేవ. పు. 20. 4. జట ప్రోలు సంస్థానము (వ్యాసము) సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము-4 పు. 46. 5. Ibid. 6. Ibid. 7. శ్రీ సురభివారి వంశచరిత్రము. పు. 20. 8. Ibid పు. 79. 9. జటప్రోలు సంస్థానము. సం. ఆం. వి. కో-4 పు. 47. 10. Ibid 11. శ్రీ సురభివారి వంశచరిత్రము. పు. 62. 12. Ibid పు. 120. 13. Ibid 14. శ్రీ సురభి వేంకటలక్ష్మారావు బహద్దరువారి జీవితము. పు. 38. 15. ఆంధ్రకవుల చరిత్ర. ద్వి. భా. పు. 128. 16. ఈ గ్రంథము గరికపాటి నాగయ్యశ్రెట్టి అనువైశ్య శిఖామణి ఆర్థిక సహాయమున చదలువాడ సుందర రామశాస్త్రిగారి ఆధిపత్యమున ముద్రింపబడినదట. 17. చూ. అనుబంధము II 18. చూ. అనుబంధము III.

**3. వెల్లూరు నరసింగకవి పరిచయము - రచనలు :**

1. చూ. ఇందలి అనుబంధము II 2. సంస్థానముల సాహిత్య సేవ. పు. 30. 3. చూ. అనుబంధము v 4. శ్రీ వెల్లాల శివరామశాస్త్రిగారి కథనము. 5. సంపు. 17-సంచి-4, 6; సంపు 18-సంచి-1, 2. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక కాకినాడ. 1928-29. 6. చూతపురీవిలాస పీఠిక పు. XII.

**5. పరిణయ ప్రబంధములు - రాచకన్యకా పరిణయము :**

1. ప్రకాశకులు కాశీనాథుని నాగేశ్వరరావు. ఆంధ్రపత్రిక కార్యాలయము 2. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము పు. 59. 3. సమగ్ర ఆంధ్ర సాహిత్యం-II పు. 41-42

## అనుశీలనము

**1 ఇతివృత్త నిర్మాణము :**

1. 'అన్యాశ్చైవం విధాభార్యా కృష్ణస్యాసన్ సహస్రశః। భౌమంహత్వా తన్నిరోధా దాహృతాశ్చారుదర్శనాః॥' భాగ. 2. 'యథాహతో భగవతా భౌమో యేన చతాస్త్రియః। నిరుద్ధా 'ఏతదాచక్ష్వ విక్రమం శార్ఙ్గధన్వనః।' Ibid. 3. 'ఇత్థం రమాపతిమవాప్యపతింస్త్రియస్తా, బ్రహ్మాదయోపి నవిదుః పదవీంయదీయామ్, భేజుర్ముదా, విరతమేధి తయానురాగ, హాసావలోక నవసంగమ జల్పలజ్జాః॥ Ibid. 4. తత్రరాజన్యకన్యానాం షట్సహస్రాధికాయుతమ్। భౌమాహృతానాం విక్రమ్యదదృశే, హరిః॥' Ibid. 5. A. 'చతుర్దశసహస్రాణి ఏకవింశచ్ఛతానిచ। B. 'గంధర్వాణాంచ యాకన్యాజహారనరకోబలీయాశ్చ దేవ మనుష్యాణాం సప్తచాప్సరసాంగణాః'॥ హరివంశము. 6. 'తతఃసప్తైవ శక్రేణ శంఖచక్ర గదాసిభృత్। ప్రతస్థేగరుడేనాథ సత్యభామా సహాయవాన్॥ Ibid. 7. సర్వాసామేవ సంకల్పః పతిత్వేనాభవత్తదా'। Ibid. 8. 'తస్య చంద్రోపమం వక్త్రం నిరీక్ష్యముదితేంద్రియాః। సంప్రహృష్టా మహాబాహుమిదం వచన మబ్రువన్॥ సత్యంచ యత్పురా వాయు రిహాస్మాన్వాక్యమ బ్రవీత్। సర్వభూతమతిజ్ఞశ్చ దేవర్షిరపి నారదః॥ విష్ణుర్నారాయణోదేవః, శంఖచక్రగదాసిభృత్। సభౌమంహత్వాభర్తాచ భవితాసః॥ Ibid.

**3. నాటకీయత :**

1. నాట్యశాస్త్రము 1-109. 2. చూ. నిర్వచనోత్తర రామాయణ పీఠిక. XI డా. పాటిబండ మాధవశర్మ. 3. Comparative Aesthetics P. 450 Vol I. 4. 'సానుబంధం పతాకాఖ్యం' దశరూపకం. 5. 'ప్రకరీచ ప్రదేశ భాక్' Ibid. 6. 'స్వల్పోద్దిష్టస్తు తద్ధేతుర్బీజం విస్తార్యనేకథా' Ibid. 7. 'అవాంతరార్థ విచ్ఛేదే బిందురచ్ఛేద కారణం' Ibid. 8. కార్యం త్రివర్గ స్తచ్ఛుద్ధయే కానేకాను బంధిచ' Ibid. 9. 'ఔత్సుక్యమాత్ర మారంభః ఫలలాభాయ భూయసే' Ibid. 10. 'ప్రయత్నస్తు తదప్రాప్తౌ వ్యాపారోఽతి త్వరాన్వితః' Ibid. 11. ఉపాయాపాయశంకాభ్యాం ప్రాప్త్యాశాప్రాప్తిసంభవః' Ibid 12. 'అపాయభావతః ప్రాప్తిర్నియతాప్తిః సునిశ్చితా' Ibid. 13. 'సమగ్ర ఫలసంపత్తిఃఫలయోగోయ థోదితః' Ibid. 14. 'వృత్త వర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః। సంక్షేపార్థస్తు విష్కంభోమధ్య పాత్ర ప్రయోజితః। Ibid.

**4. నరసింగకవిపై దుష్యము-శబ్దప్రయోగసౌష్ఠవము :**

1. ఓజః ప్రకాశకైర్బంధ ఆడంబరః పునః, సమాసబహులా గౌడీ' సాహిత్యదర్పణము. 2. 'ఈషత్ప్రౌఢార్థ సందర్భా సాత్త్వతీ వృత్తి రిష్యతే' ప్రతాపరుద్రీయము. 3. వర్ణైః శేషైః పునర్ద్వయోః సమస్త పంచషపదో పాంచాలి కామతా' సా.ద. 4. 'అత్యర్థ సుకుమారార్థ సందర్భా కైశికీ మతా' ప్ర. రు. 5. యా పదానాం పరాన్యోన్య మైత్రీ శయ్యేతి కథ్యతే' ప్ర.రు. 6. 'అత్యుద్ధరార్థ సందర్భావృత్తి రారభటీ స్మృతా' ప్ర. రు.

**6. అలంకార పరిష్కృతి :**

1. 'కావ్యశోభాకరాన్ ధర్మా నలంకరాన్ ప్రచక్షతే' కావ్యాదర్శము. 2. 'సౌందర్యమలంకారః', 'కావ్యం గ్రాహ్య మలంకారాత్' కావ్యాలంకార సూత్రవృత్తి. 3. 'సుందరత్వేసతి ఉపస్కారకత్వం అలంకారత్వం' రసగంగాధరము. 4. 'వ్యంగ్య రమణీయతా ప్రయోజకాః అలంకారాః Ibid. 5. కవికోకిల గ్రంథావళి సం. IV పు. 148. దువ్వూరిరామిరెడ్డి. 6. చూ. విజ్ఞాన సర్వస్వము - 6. పు. 148. 7. 'అపరాం బోధనం ప్రాహుః క్రియాఽ సవసదర్థయోః' చంద్రాలోకము. 8. 'విరుద్ధాత్కార్య నిష్పత్తి ర్దృష్టాకాచిద్విభావనా' Ibid.

8. రసమాధురి :

1. నానార్థ రత్నమాల. 2. నారదభక్తి సూత్రములు. సూ. 2. 3. కావ్యాలంకార సంగ్రహము. పు. 280. 4. కావ్యప్రకాశము. పు. 92. 5. దశరూపకము. 83-4. 6. చూ. The Number of Rasas. p. 122. 7. కావ్యప్రకాశము. పు. 93. 8. చూ. The Number of Rasas. p. 123. 9. Ibid. 10. రసగంగాధరము. పు. 45,46. 11. కావ్యదర్శము. పు. 276, 277. 12. చూ. The Number of Rasas. p. 13. Ibid. 14. తెలుగు కవుల-భక్తితత్త్వము. పు. 10. 15. The Number of Rasas. p. 145. 16. Ibid. 146. 17. A. చూ. కావ్యాలంకార సంగ్రహము. పు. 308. B. The Number of Rasas. p. 150. 18. Ibid. p. 142,143, 19. Ibid. p. 122. 20. నారదభక్తి సూత్రములు. సూ. 23. 21. సూ. 24. Ibid. 22. అంతరార్థ భాగవతము. పు. 234. 23. Ibid. పు. 235. 24. Ibid. 238. 25. ఆంధ్రవాఙ్మయము-కృష్ణకథ-1. పు. 149,150.

9. ధ్వనిదీప్తి :

1. ధ్వన్యాలోకము. 4-1. 2. Ibid 7-1. 3. Ibid.పు. 102. 4. కావ్యాలంకార సంగ్రహము పు. 197. 5. ధ్వన్యాలోక(లోచన)ము. పు. 102. 6. కావ్యాలంకార సంగ్రహము. పు 102.

10. సంకేత శిల్పము :

1, The Shorter Oxford English Dictonary. III. Col. P. No. 2108. 2. Ibid. I. Col. 2109. 3. నాదేశంనాప్రజలు విప్లవకావ్య విమర్శ. పు. 71. 4. Ibid. పు. 75. 5. విజయవిలాసము - సంకేతశిల్పము. 6. రరరేఖ. పు. 49-62. 7. ఆంధ్రమహాభాగవతోపన్యాసములు పు. 291. 8. Ibid. 9. ఆత్మమంతస్యహంసస్యపరస్పర సమన్వయాత్! యోగేన గత కామానాం భావనాబ్రహ్మ చక్షతే' శ్లో. 9. బ్రహ్మప్రతిపాదకయోగము. శ్రీమదుత్తరగీత. 10. 'త్వదీయం సౌందర్యం తుహినగిరి కన్యేతులయితుం, కవీంద్రాః కల్పంతే కథమపి విరించి ప్రభృతయః' శ్లో. 12. సౌందర్యలహరి. 11. చూ. 'క్షితావట్పంచాశత్' శ్లో. 14. సౌం.ల. లోల్లలక్ష్మీధరవ్యాఖ్య. 12. ఆంధ్రమహాభాగవతోపన్యాసములు. పు. 295, 296. 13. Ibid. 296. 14. Ibid. 15. నారదభక్తి సూత్రములు. పు. 34,36,297. అనువాదం శ్రీ దొడ్డ వెంకటరామ రెడ్డి.



# విషయసూచిక

## అనుబంధము-1

# రాచకన్యకా పరిణయము

## ప్రథమాశ్వాసము

## అవతారిక

(ఇష్టదేవతా ప్రార్థనము, పూర్వకవి స్తుతులు లుప్తములు)

శా. సాక్షాద్వాణియొ యా బృహస్పతియొ వైశంపాయనుండో యనన్
శిక్షావ్యాకరణాది శాస్త్రకలితా శ్రీ సాహితీ పాండితీ
దీక్షం గైకొని సత్పురాణ కథలుద్దీపించు గద్వాల శ్రీ
దీక్షాచార్య గురూత్తమాంఘ్రియుగళి ధ్యానస్థితిన్ స్మరింతున్ గడున్. 1

ఉ. వట్టెము ఖండవల్లి కులవారిధి చంద్రుడు వేదమూర్తి శ్రీ
పుట్టిన యింటిరీతి పరిపూర్ణ కృపామతి సం[illegible]కిన్
పెట్టుమహీజమున్నత వివేక సుఫలంతతి పుణ్యరాశికిన్
పెట్టియ లక్ష్మయాఖ్యుడను విద్వదధిష్ఠానకున్నమస్కృతుల్. 2

క. సత్కవులు మంచివారి స
ముత్కలికల కలరుచుండ నోర్వక కుకవుల్
హృత్కలిత మలిన తమ ప
క్షోత్కట వక్రగతులొప్ప నురుకుదు రెందున్. 3

వ. అని యిష్ట దేవతా వందనంబును సత్కవిమతంబ ప్రకరణాను వర్తనంబును విద్యా గురువర్య పాదారవింద ధ్యానంబును సుహృద్వరేణ్య నమస్కారంబును కుకవిజన తావలేప నివర్తనంబు గావించి సమస్త సుమనోమోద నానల్ప మృతకల్ప కల్పతరు ప్రసూన వితాన [illegible] మకరంద బిందు బృంద నిష్యందనా మంద [illegible] సరస రససమన్వితాతి చమత్కృతియును [illegible] హృదయ [illegible] నివృత్తి యును భక్తజన కలుష నిరాకృతియును [illegible] విశేషంబు

రచియింపం బూని యేతత్కావ్యకన్యకా రత్నంబున కధీశ్వరుం డెవ్వం
డోయని విచారించు సమయంబున. 4

శా. శ్రీరాజీవ ముఖమనోహర శుభశ్రీ పాదపద్మస్ఫుర
ద్ధీర స్వాంతుడు రాజనీతినియమోదీర్ణాను సంధాయి తా
మూరు *శ్రీ ప్రథితాన్వయాంబునిధి రాట్పూర్ణేందు శుంభద్యశో
హారస్ఫూర్తినెసంగు పట్టెము నృసింహారెడ్డి భూపాలుడున్. 5

ఉ. నెట్టిన చందురా రవల నీటగు మేడలయందు జేడియ
ల్దట్టముగా జనుంగవ నలందెన గందపు సౌరభాప్తికిన్
బెట్టుకుటమ్ము మేల్విరులు ఏడ్కొని తేటులు నావరింపగా
వట్టెము పట్టణంబు గనుపట్టెను బట్టయి యబ్ధి పట్టికిన్. 6

క. సకల శుభాస్పద కమలా
ధిక నిజమందిరము నందు దేశిక విద్వ
త్సుకవి ద్విజాత్మబంధు
ప్రకరముతో గూరుచుండి ప్రకట ప్రేమన్. 7

మ. ధర సంపత్ప్రద పంచవక్త్రి హనుమత్స్వామి ప్రసాదోక్తి సు
స్థిర కావ్యాచరణున్ సుధీవినుతు లక్ష్మీనారసింహార్య సో
దరు వెల్లూరు నిశాంతు నప్పకవి కాంతాకృష్ణమాంబాత్మజున్
నరసింగాహ్వయు సత్కవీశ్వరు ననున్రావించి పల్కెంగృపన్. 8

### కృతిప్రేరకుని అభ్యర్థన

చ. సరహరి పాదభక్తహిత నందవరాన్వయ వార్ధి తారకా
వర! కుశికాత్మజాతముని వర్య సగోత్ర! పవిత్ర రుక్మసూ
త్ర! రసిక సంస్కృతాంధ్రకవితాప్రతిభా కమనీయ ధీరకుం
జర సముదాయ చిత్తజలజాతరవీ! నరసింగ సత్కవీ! 9

---

* 'శ్రీ' తేల్చి పలుకబడినను పూర్వాక్షరము గురువైనది. ఏక సమాసముగా స్వీకృతము.

చ. హరియగు కృష్ణమూర్తి పదియార్వురు వేవురు రాచపట్టులన్
బరిణయమైన సచ్చరిత బాగుగ మెప్పొందించు గ్రంథమున్
వర జనుపల్లి రాజకుల వర్ధనుడౌ పానుకుంటి నాదృపో
దరుసకు నంకితంబుగ సుదారకృపన్ ఘటియింపుడే యటంచన్. 10

ఉ. ఆ నరసింహ భూవరుని యాజ్ఞను నే శిరసావహించియున్
శ్రీనిధి సింగపట్టణ నృసింహు కృపారస వీక్షణంబు పెం
పూనుచు నావిభూత్తము గహోత్కరమున్ గొనియాడ వేడ్క నా
మానసమందు నిల్పి యిటు మన్నె యొనర్చితి నాక్షణంబునన్. 11

క. 'ఓ నరసింహమహీపా !
శ్రీనిరవొందగను మీరు చేసిన యాజ్ఞన్
నా నేర్పుకొలది తిరముగ
నే నెరవేర్చెదను ధారుణీశ్వర! వినుడీ. 12

క. మీ యన్వయంబు మొదలుగ
మీ యశము పరాక్రమంబు మీ వైభవమున్
మీ యౌ దార్యాతిశయము
మీ యనుపమ సత్యనియతి మీ సద్గుణముల్. 13

వ. వినుతించెద నవధరింపుడు. 14

-: కృతిప్రేరకుని వంశవర్ణన :-

గీ. సంతతానమ దావిత్యకాంతమై ప
విత్రమైనట్టి శ్రీమహావిష్ణు పాద
పద్మమున బుట్టి తాడూరు వంశరత్న
మలరె పూర్వాల గోత్రామృతాబ్ధి సరణి. 15

మ. ఇల మోటాటికులస్థులైన ఘనులీశేంద్రు లుప్పరగ్రామము
ల్వెలయంజేసి వసించు వారటంచు నా పేరొందె వంశంబు కే
వలమై యొప్పెను కొంతమందు నదియే వర్థిల్లు చుండంగ మీ
కలరున్ తాడిహారు వంశమట్లు నది శ్రేయంబొ నృసింహాధిపా! 16

శా. ఆ వంశంబున రామచంద్రవసుధాధ్యక్షుడు ధర్మాత్ముడై
దేవబ్రాహ్మణ భక్తియుక్తుడయి కీర్తిం విప్రదేశంబులం
దావాసంబు ఘటింపజేసి బల శౌర్యాటోప సేనాధికుం
డై వేదండరథాశ్వవాహన యుతుండై రాజ్యమేలెందగన్. 17

క. మీ తండ్రి పాపిరెడ్డి మ
హీతలపతి సుకృతి దాత హితబంధు సుతో
పేతుడయి కీర్తిని నా
సేతు హిమాచలము దనుక చేర్చి తనరెన్. 18

క. తాదృశ తనూజులకును ప్ర
మోద రసంబున వివాహములు చేసి శుభ
శ్రీ దనరి పుత్ర పౌత్ర చ
యా దరుడై రాజ్యమేలి యలరెన్ జగతిన్. 19

క. మీ యన్నగారు నల్గురు
ధీయుతులతి శాంతులురు విశిష్టులు న్యాయో
పాయులు సూనృత వాక్తే
జో యశులు దయాపరయ్యు చూపట్టిరిలన్. 20

వ. అందు. 21

క. శ్రీ కోదండరామాఖ్యా ర
సాకాంతుడు సకలవిబుధ జనగేయుండై
ప్రాకట సంతతి యుతుడై
సేకొనియె శుభప్రభా విశేష ప్రౌఢిన్. 22

క. కోదండ రామరెడ్డి స
దాదానపు ఖ్యా గురుత్వ తత్త్వము దనరం
గా ధరణిజ శశి శిఖి బలు
లా దివిగవి పగిది లఘువులై రి తలంపన్. 23

వ. తదనంతరంబు. 24

క. రామనల యశుడునై శ్రీ
రామ నయ సుధైర్య సత్య రమ్యాంగుడునై
రామ నగారి విభవుడై
రామ నయ విభుండు భువిని రాజిలు చుండెన్. 25

ఉ. ఒల్మియు గల్మియుం గలిగి వట్టెము పట్టణమేలుచుండి ని
ష్కల్మషమైన మానసము సత్యవచస్సిరి సద్వివేకమున్
బల్మరు కూర్మియున్వెలయ బట్టణ సీమల గొప్ప గొప్ప వా
రల్మది మందగా విరిగె రామనయేంద్రుడు రాజమాత్రుడే. 26

శా. శ్రీ పద్మాక్షు దయాప్తి రామనయ రాజేంద్రోత్తముండెప్పుడున్
వ్యాపాదస్థితి స్వప్నమందయిన నోర్వంజాలకున్నట్టి రా
డ్వ్యాపారాంచిత చిత్తముం గలిగి సాహాయ్యంబుగావించె శ్రీ
గోపాల్పేట పురీప్రభుత్వము తెరంగున్మేల్మెరుంగై తగన్. 27

క. ఆ పృథ్వీపతి కై వడి
ప్రాపుగ మీరుండ బట్టి బహు వేడుకతో
గోపాల్పేట ప్రభుత్వ
శ్రీ పునరభివృద్ధిగనె నృసింహారెడ్డి! 28

ఉ. ఆ నరసింహదేవుడపుడా భువి యాకడలిన్ మునింగినన్
దానెటుగా నుదార మహి దారుడునై పయికెత్తి నిల్పె జూ
మానిత జన్పలేంద్ర హనుమంత నృపాలుని రాజ్యసంపదన్
శ్రీ నరసింహనామ నృపశేఖర! నీ వటు నిల్పితౌ బళి. 29

క. చెట్టతనముగల రిపులను
మొట్టమొదట పీచమణచి ముదమొప్పగ జే
బట్టితివి హితుల నెల్లను
వట్టెము నరసింహ భూప! వైరి దిలీపా! 30

శా. శ్రీమంతుల్ గుణవంతులుత్తమ బుధశ్రేణుల్ను దారుల్మహా
*సామంతాది జనంబులున్నదరు పేష్కారుల్ దొరల్మెచ్చగా
సామోపాయ చతుష్టయంబునను దేశప్రాభవోచ్చైస్థితిన్
హైమాంశుద్యుతి నేలితౌర నరసింహారెడ్డి భూపాలకా! 31

ఉ. చెర్వులు బావులున్వన విశేషములున్మరి దేవళంబు లీ
యుర్విసుపర్వ జీవనము లూర్జితమున్బొసగించి వేడ్క మీ
పూర్వ నృపాలకోత్తముల పుణ్యము సర్వము నిర్వహించి చి
త్తర్వగ కీర్తినించితివి ధారుణి శ్రీ నరసింహ భూవరా! 32

ఉ. బండపలాంజనేయ పదపద్మములన్మదిలో స్మరించి మా
రాండకులావతంసుడగు రాములవారి ప్రతిష్ఠజేసి యా
ఖండల తుల్యవైభవము గాంచిన నీసరి దాతలేడు నా
క్కండు నృసింహరెడ్డి! సరిగాదగు నీకొక వేల్పు గిడ్డియే. 33

క. మీ మనము మీ కరమ్మును
మీ వేదం ప్రాంగణముల వేలిమి వడసన్
నేమముగ దానవారి
శ్రీ మహిమ జెలంగె నారసింహారెడ్డీ! 34

క. ఘనసోమ శ్రీ మహిమన్
దనరితివౌ విమలకీర్తి దాన స్ఫూర్తిన్
జననుత సంపత్పూర్తిన్
రణవిస్ఫూర్తిన్ నృసింహ రాజబిడౌజా! 35

---

* సమ్రాణ్ణాజము లాడగా - లబ్ధ ప్రతి పాఠము. ప్రాస భంగము. అర్థ భంగము.

సీ. ఇనుడయ్యు గువలయ హితమొనర్పని సూర్యు
డలఘు తేజమున జోడగునె నీకు
రాజయ్యు దోషాకర స్థితిగను చంద్రు
డమల కళాప్తి నీడగునె నీకు
శుచియయ్యు నవిహిత స్ఫూర్తి వర్తిల్లు వహ్ని
తగు ప్రతాపమున దీటగునె నీకు
ఘనుడయ్యు నప్రసిద్ధి నడంగు మేఘుండు
త్యాగంబుచే బురుడగునె నీకు

నినుడు రాజును శుచి ఘనుడనెడి పేర
నవని పాలించి నిర్దుష్టతాప్తి నమరి
విహితగతిమీరి యనిశంబు వెలసి తహహ
వైభవ సురేశ! నరసింహ వసుమతీశ! 36

సీ. సిరితోడ బుట్టువై చెన్నొందు తారకా
ధవుడు పాదమె శుచికవి కొసంగె
హైమధర పదాభిరాముడై యీశుండు
తన సుదృఙ్మణికి నర్ధంబొసంగె
బలి దానవనధియై పరగుచు గోవిందు
నకును బాద త్రయంబె కడునిచ్చె
రాజరాజై తనరారు ధనాధీశు
డలకాపురము నుత్తరాశనేలె

ననుచు వారల దాతృత్వమపహసించి
సత్కవులు కోరు కోర్కెలు సఫలముగను
ఖ్యాతిగా నిచ్చు సంపూర్ణదాతవీవె
యమిత గుణసాంద్ర! శ్రీ నృసింహావనీంద్ర! 37

క. మీ తాతలు మీ తండ్రులు
మీ తోఁబుట్టువులు మీరు మేదినిలో వి
ఖ్యాతి గలవారు గావున
నాతరమా మిము నుతింప నరసింహనృపా! 38

వ. అనినవిని సగౌరవంబుగా జాంబూనదాంబరాభరణ కర్పూరతాంబూలాది సత్కారంబులం గావించిన నేను హర్షించి శ్రీమజ్జనుంపల్లి సవాయిరాజా హన్మంతరాయ మహా భూపాల బహిరీ బలవంత బహదరుగారి మహారాజ వంశ రత్నావళి నభివర్ణించెద. 39

-: కృతిపతి వంశవర్ణన :-

చ. అనవరతానమద్విబుధమౌ హరిపాద సరోరుహంబునన్
జననము నొందె నాలుగవ జాతి తదన్వయ కల్పభూజమై
జనుపలి వంశమింపలరె సౌమనసాప్తి దదన్వవాయ శా
సనుడగు వీరకృష్ణనృపచంద్రుడు మించె మహేంద్రుకైవడిన్. 40

క. ఆ విభుడు రామకృష్ణో
ర్వీవల్లభుగాంచె నతడు పెదవేంకట భూ
దేవేంద్రుగనియె నతనికి
ధీవృతి చినవేంకట క్షితి ప్రభుడొదవెన్. 41

క. ఆ యిమ్మడి వెంకటపతి
ధీయుతు గోపాలరాయ ధీరునిగని సౌ
ఖ్యాయతి నెలసెను దచ్చుతు
డీయిలను సవాయి వెంకటేంద్రుండలరన్. 42

క. అరిపుర విజయోత్సవ పుర
హరుడగు తద్వేంకటేంద్రుననుజాగ్రణియై
పరగిన రంగనృపాలుడు
ధరగోపాల్పేట రాజధాని వసించెన్. 43

వ. ఆ పట్టణలలామం బెట్టిదనిన 44

శా. శ్రీ పూర్ణోత్పల బాంధవోపలగణశ్రీ సౌధ శుంభచ్ఛికా
లాపీ గంధకుచద్వయీ పరిమళాహ్లాదాగత ద్యోధునీ
శ్రీ పంకేజ దళాంతరస్థ మధుపశ్రేణీ విహారస్థితిన్
గోపాల్పేట పురీవరంబు దగు శ్రీకోక స్తనీ యుక్తమై 45

వ. మరియును 46

సీ. శ్రీమహాలక్ష్మి వర్తించు పదార్వన్నె
బంగరుపీట గోపాలుపేట
ధర్మకార్యప్రవర్తన మించునొక్కచో
పదుగురి మాట గోపాలుపేట
*సలయింప నలరును గలమాదిధాన్యంబు
పైరలేపేట గోపాలుపేట
బలులగు రిపులకు సలవిగాకుండ ద
ర్పము గలకోట గోపాలుపేట

నందనవనంబు చొక్కాటమిందు నాట
సుమహిత ఫలంబు **లిచ్చోట నమరు తోట
పుడమి చెలికి లలాటమింపడరు చోట
మేలు పాపిట యౌను గోపాలుపేట. 47

క. ఆ రాజధాని రంగ ధ
రా రమణుండేలు శ్రీ కరంబుగ సతతం
బా రాజధాని మొదలగు
భూరి గ్రామములకెల్ల భూవరుడగుచున్. 48

---

* సల-ఏటికాలువలోనగువానికి నీరు ఆవలికి పోవుటకు నడుమ అడ్డముగా నుంచు తడక.

** వీ వాటమమరు-లబ్ధప్రతి. (అర్థశ్లేషము);

మ. ఆలరం బుత్రులఁగాంచె రంగవిభు డర్థాఢ్యున్ హనూమత్ప్రభున్
*దిలకున్ రాయనృపున్ సవాయి ఘనకీర్తి గ్రామునిన్ గేశభూ
లలనున్ లక్ష్మణు నయ్యయున్ గుణలతాలాలిత్యవత్కాయమా
నలసత్సర్వ జగత్ప్రభూత్తమ నిశాంత స్థానుల న్వేడుకన్. 49

ఉ. ఆతత శౌర్య ధుర్యులగు నానృప నందనులందు నగ్రజుం
డై తగు హన్మ భూవర సుధాంశుడు మించు జగచ్ఛటాగుణ
స్యూతనిజోల్ల సద్వర గుణోత్కర రత్నమయ స్రగగ్రము
క్తాతతిగుచ్ఛ విశ్రుత వికస్వర కీర్తిరుచి ప్రరోహుడై. 50

క. ఆ రాజమణికి ననుజుం
డై రాజిలు వల్లభస్థిరాధీశ్వరు డా
సారాయత శారాదృత
సార శరాస్త్రబలాన శత్రు కమలుడై. 51

క. ఆ వల్లభరాయడు సం
జీవాంబిక యందు గనియె శ్రీ యుతు హనుమ
ద్భూవల్లభు కాశీపతి
ధీవిలసితు దేవరాయ ధీరవరేణ్యున్. 52

క. శ్రీ జయ వల్లభరాయ
క్ష్మాజాని ద్వితీయపత్ని జానాంబిక యం
దాజినుత శౌర్యకీర్తి వి
రాజితు రంగనృపుగాంచె రహిచే వెలసెన్. 53

---

* తిలకము = శ్రేష్ఠము. ఇది తరచు సమాసాంతములందే ప్రయుక్తము. సూ. రా. ఆం. ని, ఈ యర్థమున నిది సమాసోత్తర పదమగును- శ. చం, ఇటవ్యస్తముగా ప్రయుక్తము.

ఉ. రంగనృపాలు పౌత్రుడయి రాజిలు నాహనుమద్ధరాధి రా
ట్పుంగవుకీర్తి పూర్తి శివమూర్తి దగున్ శరజాత గౌరవా
ప్తిం గమలాహి తోరుకరదీప్తి మహాసిత కంధరాను ష
క్తిం గమనీయ హైమ జగతీధర ధర్మనియుక్తి నెంతయున్. 54

చ. హనుమ ధరాధి రాడనుజుడై తగు కాశినృపాలు మండలా
గ్రనిశితకాంతు లాజిగడు గ్రమ్మినచో బరరాజ హంస రా
జి నిభృత పత్రముల్సెదర శీఘ్రగతిన్ని జపుండరీక పా
శిని వెడబాసి భీరుగతి లీనత జెందు గుభృద్బిలంబులన్. 55

క. ఆకాశీపతి సోదరు
డై కౌమరగు దేవరాయడడరున్ దుర్వా
త్సాక జయాస్తోక నయా
లోక చయాలోక లసదలోలాకృతియై. 56

చ. క్షితిపయి దేవరాయ నృపశేఖరుహేతి విభిన్న వైరి భూ
పతి మదకుంభి కుంభ రుచిబంధుర మౌక్తికముల్మరుత్పథో
ద్గతి దగి వ్రాలుచుందనరు దద్రణ వైభవ హృష్ట చిత్తలే
ఖ తతులు మిక్కిలిన్ గురియు గల్పక కోరక బుద్ధి నింపుచున్. 57

ఉ. ఆధరణీ విభూత్తమున కాత్మజులౌ నరసింగరాయ భూ
నాథుడు రామకృష్ణ జన నాథుడు నిర్వైరు దోః ప్రతాప తే
జోధికులై మహోగ్రసమరాంగణ సాహస విక్రమార్కులై
సాధుజన ప్రపోషణము శాత్రవ భంగమొనర్చి రిమ్మహిన్. 58

వ. అల జనుంపల్లి వల్లభరాయని ప్రథమ పత్నియగు సంజీవాంబికా రత్నం
బెట్టిదనిన. 59

శా. మంజుస్వాంతముతోడ నర్థి జనులన్మన్నింపుచున్నీతి చ
ర్యంజర్చింపుచు శేషధర్మముఖ శాస్త్రంబుల్ కడున్వించు మ
త్సంజీవాంబ యంటచు సత్కవులు మెచ్చన్ బోల్చు శ్రీజన్పలీ
సంజీవాంబకు సాటిబోటి గలదే సర్వంసహామండలిన్. 60

ఉ. హాళిని వల్లభేంద్ర ఘను జాగ్రగణిత్రమైన సవాయి భూమి భృ
న్మౌళి కుమారసన్నిభ కుమారుల గాంచె వినమ్ర విద్విష
జ్జాలిని రామరాయనృపచంద్రుని నీరరుహాస్త్రరూపు గో
పాలవిభున్ బలోన్నతులు భాసిలు లక్ష్మణశౌరి వేడుకన్. 61

చ. అవిరత దానశీలుడగునట్టి సవాయి నృపాలుకీర్తి సు
చ్ఛవి యగణీయ సద్భువన జాతములన్ సృజియింప గాంచి
భువనము లొండురెండు బలు పూనిక నూన్చిన నల్వ యిందిరా
ధవు నతనాభికాంబురుహ ధామమున న్వడదొగె సిబ్బితిన్. 62

క. ఆ విభు తనయుండగు రా
మావని భృన్మౌళి యలరు నతిదుర్మద సం
భావనమతి యావనపతి
జీవనరంజ శన చతుర జిహ్మగశరుడై. 63

వ. అతని సహోదరుండగు గోపాల రాయుండు. 64

మ. కునభిత్వంబున గచ్ఛపాధి పతియున్గొండల్ ఘనశ్యామ దం
తనిరూఢస్థితి రాజరుక్కులన మిథ్యామోజి దుశ్చర్మయు
క్తిని దిగ్దంతులు శేషదక్షు తలినెంతే నొందగా గాంచి మే
దిని గోపాలనృపాలు జేరి రహి జెందెన్సద్గుణామోదియై 65

ఆ. ఆ సవాయి నృపతి కనుజుడౌ కేశవ
పార్థివుండు వెలయు బ్రబల విష్ణు
భక్తి యోగశక్తి బ్రహ్లాదుడుగ భూమి
జనులు సన్నుతింప సద్గుణముల. 66

క. ఆనృపునసుజుడు లక్ష్మణ
భూనాథుడెసంగు సుగుణ పూర్వసమాఖ్యా
సూన సువాసిత దిగ్వని
తానత కబరీ భర ప్రతానుండగుచున్. 67

వ. అతని యనుజుండగు నయ్యభూపాలుండు. 68

చ. దురమున నయ్యభూవిభుని దోరసి పుత్రి యమిత్ర ధారుణీ
శ్వరులకు వేల్పుటెంతులకు జక్కి వివాహ మొనర్చి కీర్తి పూ
ర్తిరుచిర సూనజాలముల దీవ్ర మహచ్ఛవి కుంకుమంబులన్
గురు రుచితో జయేందిరను గూడి వసంతము లాడువేడుకన్. 69

వ. అతని కుమారుండగు నరసింహరాయుండు. 70

క. ఆ నరసింగ నృపాలుడు
మానిత సద్గుణ వితాన మణిహార సుకాం
తానూన దిగ్వధూటీ
పీనస్తన యుగళుడగుచు బృథ్విన్వెలసెన్. 71

వ. మరియును శ్రీసవాయి భూమీశ్వరుని కూమారుండగు గోపాలరాయని
విధం బెట్టిదనిన 72

గీ. పానుగల్లు మహారాజధానికెల్ల
పరగదేశాయి విభుడయి భాగ్యనగర
పాదుషాగారి భూరి కృపన్ జెలంగి
మన్నె వారీలు సాధించి వన్నె కెక్కె. 73

సీ. జిష్ణుడంచును బరక్షితి భృత్ప్రకాండంబు
జతురాఖ్యుడని కవీశ్వరచయంబు
నలఘుకళానిధి యనుచు సత్ప్రకరంబు
నినుడంచు మిగులలోకనివహంబు
నచలేశ్వరుండంచు నఖిలదేవావళి
సరస ఘనుండని సౌమనసము
నసమాంబకుడని రమ్య సరోజ ముఖులును
బౌసగ శ్రీదుండని పుణ్యజనులు

నిరతము నుతింప నలరారు నిజపదాంబు
జాను బంధ యథార్థ కృతారి మౌళి
లాలితాంబుజ రాగరత్నాళి రుచిర
మార్చితుండగు గోపాల మనుజ విభుడు. 74

శా. ఆరాజేంద్రునకుద్భవించిరి కుమారాగ్రేసరుల్ రామచం
ద్రారెడ్డి క్షితిపాలకుండు మరియు న్నాయన్న భుజాని ల
క్ష్మారాయుండనువారు ముప్వురును శ్రీజన్పల్లి వంశామృతాం
భోరాశిక్షణదాధిపేంద్రులనగా భూభారము న్బూనుచున్. 75

వ. గోపాల రాయ భార్యాశిరోమణియగు రత్నమాంబ యెట్టిదనిన 76

సీ. సకల వైభవముల శరజబాణాంబ శ్రీ
రాయ జనుంపల్లి రత్నమాంబ
ప్రథన జయంబున ఫణిభుగశ్వాంబ శ్రీ
రాయ జనుంపల్లి రత్నమాంబ
వితత భాషా చమత్కృతి శారదాంబ శ్రీ
రాయ జనుంపల్లి రత్నమాంబ
క్షమ జనకావనీశ్వర తనూజాంబ శ్రీ
రాయ జనుంపల్లి రత్నమాంబ

తన యుదారత కీర్తి ప్రతాపములును
దేశదేశములందును దేజరిల్లె
ననుచు జనులు నుతించగా నవనియేలె
రమ్య సద్గుణ నికురుంబ రత్నమాంబ. 77

క. అనిశము జనములు వినుతిం
పను నా గోపాల రాయ ప్రభువరు తనయా
గ్రణియైన రామచంద్రా
వనిపతి జగమేలుచుండె భాసురకీర్తిన్. 78

సీ. తాసర్వ విద్యానిదాను డౌటకు జన
కుండు గోపాల రాయుండె సాక్షి
తా నమోఘగుణ ప్రధానుడై ప్రతిలేక
నలరుట తల్లి రత్నమ్మ సాక్షి
తా జయశాలియై రాజిల్లుటకు మామ
ధర సుభద్రామనోహరుడు సాక్షి
తా శరచాప సంధానకోవిదుడౌట
కనుజుండు లక్ష్మణుండరయ సాక్షి

తన నిజాహ్వయమెపుడు సార్థకము గాగ
భూమి పాలించెనని బుధుల్ పొగడుచుండ
జనుపలీవంశ వార్ధి నిశాకరుండు
రామచంద్ర క్షితీశుండు రహిజెలంగె. 79

సీ. అఖిల సౌభాగ్యంబు లనుభవింపుచునుండి
రాజ్యభార మొనర్చు రసికుడితడె
సత్వప్రధానుడై శాత్రవజనులను
నేర్పుతో హరియించు నిపుణుడితడె
సకల ప్రజలనెల్ల సతతంబు రక్షించి
వినయంబుతోనుండు ఘనుడితండె
నఖిల భూపాలకు లభినుతి సేయంగ
దీనుల బోషించు ధీరుడితడె

యనుచు సుకవులు వర్ణింప నవనియేలె
రాజమాత్రుండె సూరవీరప్రతాప
శాలి నిరతాన్నదాన విస్తారకీర్తి
బైరి జనుపల్లె రాయన్న పార్థివుండు. ౮0

వ. తదనుజుండగు లక్ష్మణరాయ భూరమణుండు. ౮1

సీ. దశరథు కరుణ చేతను వృద్ధి గాంచియు
నుత రామ చంద్రానుజత వహించి
నిర్నిద్రగతి నవనిజనాళి గాచియు
గురుధర్మ మెప్పుడేమరక దాల్చి
ధర సుమిత్రానంద దాయియై వర్ధిల్లి
యినవంశతిలకమై జననమొంది
ఘన మేఘనాద భీకరగుణధ్వని శత్రు
పంక్తి కంఠ విభూతి బడలు పరచి

వెలయు లక్ష్మణుపగిది భూవలయమునను
సురుచి రానంత విఖ్యాతి సొంపు మీరె
జనుపలి కులాంబురాశి నిశాకరుండు
రమ్య గుణపాళి లక్ష్మణరాయ మౌళి. 82

గీ. రహిని జనుపల్లి లక్ష్మణరాయ నృపతి
పాలి యర్ధాంగలక్ష్మియై భాసురముగ
సకల సుకవి జనంబులు సన్నుతింప
గీర్తి చెన్నొందె సవ్వాయి కేశవాంబ. 83

సీ. అచ్యుత దేవాలయమ్ములు గట్టించి
భూసుర స్థాపనమ్ములు ఘటించి
స్థిరజీవనమ్ములౌ చెరువులు వేయించి
విమల సంతానాభి వృద్ధి గాంచి
నవ భూమి సఫలవన ప్రతిష్ఠలు సేసి
సార్థక నిక్షేప మాచరించి
శాశ్వత ఖ్యాతిగా సత్ప్రబంధములందు
యిలసప్త సంతానములను జెంది

పృథుల పానీయశాలికల్ పెక్కులొనర్చి
సకల రాజాధిరాజ సంస్థాన వినుత
ఘనగుణోన్నతి వెలసెను గవి సురేంద్రు
వల్లి జనుపల్లి కేశవాంబామ తల్లి. 84

సీ. శతధృతి సేసిన సవనరాజంబన
వసుధా స్థలంబులో నన్నెకెక్కె-
చక్రవర్తగు హరిశ్చంద్రుడొనర్చిన
నరమేధ మఖమన నవనివెలసె
రాజరాడ్దశరథరాజు చేయించిన
తురగమేధంబుతో సరిగనయ్యె
ధరణీ తలంబులో ధర్మరాజొనరించు
రాజసూయంబన రహిదనర్చె

ననుచు భూసురకోటులు సభినుతింప
యజ్ఞరాజంబు చేయించి యవని సురుల
కిష్టధనంబు లొసంగి సంతుష్టితోడ
బరగె జనుపల్లి కేశవాంబామతల్లి. 85

సీ. సెనగ పూర్ణంబు బెట్టిన భక్ష్యములతోడ
గమ్మని సద్యోఘృతమ్ముతోడ
సరస సౌకర్యమౌ శాల్యోదనముతోడ
మెప్పైన పప్పుల యొప్పుతోడ
షడ్రసంబుల రుచులొప్పగుకూరల తోడ
నమృతోపమాన పాయసముతోడ
నాఘ్రాణ పరుషమౌ నావపచ్చడితోడ
బేరినమీగడ పెరుగుతోడ

క్షీరపానీయపులం సదక్షిణము గాఁగ
ధరణి సురులకు నెల్ల సంతర్పణంబు
తనివి తీరంగ సలిపెడు తల్లియనగ
బరగు జనుపల్లి కేశవాంబామతల్లి. 86

క. ఆపణతి మనుప వెంకట
గోపాలరాయ విభుడఖిల కోవిద నుతుడై
శ్రీ పరమేశ్వరు గృపచే
నొప్పించె నుదార నీతి నృతిమతి యుతుడై. 87

మ. వ్రతనోర్వీపతులేలు రీతిగను గోపాల్పేట సంస్థానమున్
గుతుకాత్ముండయి నవ్యవెంకటనవై గోపాల రాయావనీ
పతిరక్షించుచు బెండ్లియాడె శుభసంపత్సద్గుణశ్రేణి సం
శ్రిత చింతామణి శ్రీక్షమాధరణి లక్ష్మీనరసమాంబామణిన్. 88

వ. ఆమానవతీ మణియందు. 99

శా. దిక్పాలాది కళాంశ శోభితుడు దాతృత్వార్క సూనుండు సా
ధ్వీకూపార్ణాంబుజపాళి మిత్రుడు మహాధీర స్వభావుండు స
మ్యక్పూతాత్ముడు సద్గుణోత్కరుడు సత్యజ్ఞాన సంపన్నుడౌ
జక్పాలరాయనృపోత్తముండు పొథమెన్సంగ్రామ భీముండనన్. 90

మ. ప్రకట శ్రీజనుపల్లి బ్రహ్మబహద్దక్పాల రాయేంద్రుడా
ధ్యకళాశాలియునై స్వకీయమగు రాజ్యంబేలుచున్ సత్ప్రవ
ర్తకులై వట్టెముపట్టెణేశుడగు కోదండరామ భూపాలు పు
త్రిక సాధ్వీమణి రంగనాయకమగారిం బెండ్లియాడెందగన్. 91

మ. అకలంక వ్రతగౌరియో సుగుణ సౌహార్దక్షమా క్షోణియో
వికసత్పుణ్య పురాణపురుష కథా విజ్ఞాన భూపుత్రియో
సకలాశాస్థిత సాధ్వీబృందము నుతించన్మించె శ్రీరంగనా
యక భామామణి సత్యవాక్సరణి విద్యావాణియో నాదగున్. 92

సీ. శ్రీ భోగభాగ్యవిశేషంబుచేత గం
దర్పాంబ శ్రీరంగనాయకాంబ
వితత పాతివ్రత్య విస్తృతిచే శంత
నసుతాంబ శ్రీరంగనాయకాంబ
తారకాహ్వయ మనుధ్యానంబుచే బాహు
లేమాంబ శ్రీరంగనాయికాంబ
నిరతక్షమాగుణ నియతిచే జనక సం
తానాంబ శ్రీరంగనాయకాంబ

శ్రీవర పదాంబుజాత సేవావలంబ
సకలవిబుధ చకోరక చంద్రబింబ
కుటిల శాత్రవ భూధరపటలిశంబ
నయగుణ కదంబ శ్రీరంగనాయకాంబ. 93

క. ఆయువతియందు జక్కా
ప్రాయ సపై బహిరి బహధరాధిపుడెలమిన్
శ్రేయో భివృద్ధి గలిగిన
శ్రీయుత హన్మంతరాయ నృపవరు గనియెన్. 94

గీ. ఆవిభూత్తము డనఘయశోవిశాలుడై
మహాగుణశాలియై యలరుకతన
నట్టి గోపాలుపేట సత్పట్టణంబు
నేలు హన్మంతరాయ భూపాలుడిపుడు. 95

## షష్ఠ్యంతములు

క. ఏవం విధ సుగుణాఢ్యున
కావల్గిత పవన జవన హయదార్ఢ్యునకున్
శ్రీవైభవ జక్కాప్రా
యావనిపతి తనయునకు మహావినయునకున్. 96

క. దానశాత్రాధిపునకు
మానితకీర్తి ప్రతాపమయ మృక్తా సం
ధానిత కనక శకల భూ
షానత మణిబంధునకు దయాసింధునకున్. 97

క. పరనరనాథ భయంకర
నిరుపమ సంగ్రామకేళి నిపుణాస్త్ర సము
త్కర బంధుర కర మందర
వర సింధుర చిర మదద్రవత్ర్పఘణునకున్. 98

క. శిక్షిత రిపు రక్షిత విపు
లక్షితి సుపుర స్థితాశ్వలక్షిత ధారా
వీక్షణ జానూక్షణ నే
త్రక్షణ సంఫుల్ల హృదయతామరసునకున్. 99

క. గోపాలక గోపాలక
గోపాలక శరణనీతి గుణభోగునకున్
భూపావన భూపావన
భూపావన జవవిభాసి భుజబాహునకున్. 100

క. జనుపలికుల చూడామణి
కనుదిన తర్పిత నవగ్రహార్పిత ఘృణికిన్
ఘన వితరణ సురమణికిన్
హనుమద్భూపాల మణికి నభప్రాగణికిన్. 101

వ. శ్రీ శుభకరంబుగా నా యొనర్పంబూనిన రాచకన్యకాపరిణయంబను
మహాప్రబంధంబునకు గథాక్రమంబెట్టిదనిన. 102

## కథాప్రారంభము

క. శ్రీమంతుండు పరీక్షి
ద్భూమీశుడు బహుకథానుభూతి నిరతుడై
నేమంబున శుకముని సు
త్రామునకు నమస్కరించి తగనిట్లనియెన్. 103

క. "శుకముని శేఖర! కనకాం
శుకము నిజాంగమునగప్పు సురనుత నీలాం
శుక మూర్తి కథలు లీలా
శుకము గతింజెప్పగలవు సొంపు జనింపన్. 104

చ. హరి పదియారు వేల వసుధాధిపకన్యల నెవ్విధంబునన్
బరిణయమయ్యె నా యమృత భానుని భార్య లనేక లొక్కడా
సరసిజనేత్రలందరికి సమ్మతిగాగ మెలంగుటెట్లు సు
స్థిరమతి నమ్మనోహరు విచిత్ర చరిత్ర మెరుంగ జెప్పవే." 105

క. అనుచు బరీక్షిజ్జనపతి
తను నధిక ప్రేమ నడుగ దాపసవర్యుం
"డనఘా! వెన్నుని చరితము
విను"మని చెప్పందొడంగె విస్తర ఫణితిన్. 106

### —: ద్వారకానగర వర్ణనము :—

క. సాధు విధు ప్రస్తర మయ
సౌధ చరత్సుతను గాన చాతుర్య సము
ద్బోధిత మదనేత శర
గాధిత హృదమరము ద్వారకాపుర మమరున్. 107

చ. కువలయ కాంత కాంత మణికుడ్యములందు సజీవ భూమికా
నివహములో యనంగ రమణీయ మనోభవకేళికా వస
ద్యువయువతీ జనాంగకములొప్పగ గానగ వచ్చు దత్పుర
ప్రవిమల సౌధసంపదలు బ్రహ్మకునైన నుతింప శక్యమే. 108

ఉ. ఆపురి సొంపుమెచ్చఁదగు నంబరచుంబి శిఖామణి చ్ఛటా
దీపకళా విశేష పరిదీపిత నందనకాననాంతర
శ్రీ పరిహార కేళి సుఖసింధు నిమగ్న నిలింప దంపతీ
ద్వాపర కృత్పరస్పర పిధాన విధాన విహీన లీలమై 109

సీ. అత్యున్నతా కృతియగు త్రివిక్రమ లీల
 నల బలీంద్రుని మీఁద నడుగుమోపి
ప్రతిపక్ష జేతయౌ పరశురాముని మాడ్కి
 బర రాజహంస సంస్పర్ధనొంది
బలవంతుడగు రామభద్రుని కైవడి
 మత్తఖరాసురో ద్వృత్తి నణచి
సకల లోకైక రక్షకుడైన హరిజాడ
 సాగర మధ్య వాసంబు గాంచి

సంతత నిజాంతరాళ నిశాంత ఖేల
దాశరాంతక భవ్య దివ్యావతార
లక్షణ నితాంత వైభవాలంకరణము
ద్వారకా పురి వరణ మిద్ధరణి వెలయు. 110

శా. ఆకుంభీనస విష్టపాధిక గభీరాతీర పూర్ణామిత
వ్యాకోచాబ్ధి మరంద తుందిల మిళిందామంద ఝుంకార స
త్కోకద్వంద్వ మరాళనాదకలితా కుంభీభవత్ప్రార కాం
తాకేళీభృత గంధతోయమగుచుం దత్ఖేయ మెన్నందగున్. 111

క. ఉరగ వధూటులు తత్పురి
పరిఖాంబు విహార కేళి పరవశలగుటన్
నరులందు రయ్యగడ్తకు
నురగ జగత్తునకు మార్గమున్నదొ యనుచున్. 112

సీ. నానాభిధానావధాన ప్రధానాస
మానాగమ ద్విజస్థానకంబు
దుర్వార విద్విషద్గర్వ నిర్వాపణా
ఖర్వ శౌర్య క్షత్త్రిదూర్వహంబు
పేటిభృత స్వర్ణకోటీ పణాదాన
పాటీల సద్వైశ్య వాటికంబు
గోత్రామృ తాశన క్షత్త్రార్య భజనాతి
మాత్ర కృషి క్రియా పాత్ర పదజ

మనిరతాధ్వరమంత్ర స్వరారి వీర
విజయఘోషణ బహుల వస్తు విక్రయార్థ
భాషణాఖిల ధాన్య భృత్ప్రకట శకట
చరణ రటనాకరం బొప్పు హరిపురంబు. 113

ఉ. అంబరచుంబి శృంగనిచయంబులు నిర్మల భర్మ నిర్మితాం
గంబులు నూత్నరత్నతతకాంతి పరిస్ఫురితంబలౌ శతాం
గంబులు మేరు తుల్యములుగా గనుగొందురు భూజనంబుల
య్యంబుజనాభపట్టణ వరాంగణభూముల వేడ్కమీరగన్. 114

సీ. ఋభురాజ వజ్ర సంక్షుభితాంగములు గాక
గరిమగాంచిన నీలగిరులనంగ
కంధిరబంధ సంగ్రహణేచ్ఛ డవిగుండి
ధరకుడిగ్గిన పయోదము లనంగ
కరచమత్కృతి విశ్వకర్మ నిర్మించిన
హరినీలమయ కృతకాద్రులనగ
భాను భానుచ్ఛటాపరిహృతంబులుగాక
గడివేరు కటిక చీకటులనంగ

ధరణిసెలయు సనన్న సాధారణములు
కంసమర్దన విజయైక కారణములు
పటుతరాటోప విద్విషద్బాహుబల ని
వారణములును దత్పురి వారణములును 115

చ. సకల సులక్షణాన్విత విచక్షణ లక్షిత సుందరాంగముల్
వికలిత దుర్మదారి పృథివీపతి రాట్చతురంగము ల్సమా
ధిక రహితాచ్యుతేంద్ర రవిదివ్య తురంగములొప్పునెంతయున్
ప్రకట జవాధరీకృత కురంగములన్నగరీ తురంగముల్. 116

మ. అయుతానేకపజిత్సదృక్ష బలగర్వోద్యత్కటు ల్విద్విష
జ్జయ ధాటీపటు సాహసాన్విత సముత్సాహోర్భటుల్సంగరా
భయఖేలాతి విహారలంపటులునై భాసిల్లుచున్ ధీవరా
న్వయ దుగ్ధాబ్ధి నిశావిటుల్ ఘనభటుల్వర్తింతు రవ్వీటిలోన్ 117

సీ. జిలుగు బంగరు రంగుచీరల తగుకట్లు
వెలలేని సొమ్ముల కలిమిసీట్లు
నళిక స్థలంబున వలపు కస్తురిబొట్లు
దురుముల గ్రొవ్విరి సరులచుట్లు
నసువు కాంద్రదొలరించు ననమోవి పలుగాట్లు
గులుకు గుబ్బల వాడి గోటినాట్లు
సరసంపుటలుక పెచ్చగగొట్టు జడకొట్లు
సిడిముడి వీడని చెంపపెట్లు

వీట్ల సయ్యాట్లకై పోట్ల నాట్లపాట్ల
దేట్ల ముచ్చట్ల నచ్చట్ల నాట్ల బోట్ల
కోట్ల బలుకుట్ల పనులట్ల చాట్లమాట్ల
నేట్ల విలసిల్లె నవ్వీటివాల్లె వాట్లు. 118

సీ. ఇచ్చను బూబంతులే గొనవచ్చితి
ముట్టి చూడగనిమ్ము మోహనాంగి!
ముట్టిచూతువుగాని మొదలనాకై దండ
నాణెమ్ము జూడుమో జాణరాయ!
కైదండ నాణెమ్ము గనుగొనగా మంచి
తావిది యగునటే పూవుబోణి!
మంచి తావిది చూడుమా నీవు కలయగా
జాగేల చేసిదో సరసహృదయ!

జాగుసేయక నీనీవి సడలు నపుడె
మదవతీ! నీకు పిమ్మట ముదమొనర్తు
నను విటులగూడి చెచ్చెరలాడుకొనుచు
విరులు పురినమ్ము పుష్పలావిక జనమ్ము. 119

సీ. సురుచిర శశికాంత సోపానములతోడ
రమణీయ మణిమంటపములతోడ
ప్రవిమలామృత తుల్య పానీయములతోడ
సంచితరాజ హంసములతోడ
కమల మాధూద్ధత భ్రమరపంక్తుల తోడ
చిరకుడ్య సాలభంజికల తోడ
పటు నీలగజ తతోభయ పార్శ్వముల తోడ
సముచిత స్ఫటిక ఘట్టముల తోడ

స్నానసంధ్యా జపాద్యనుష్ఠానధర్మ
పరమపావన వైదిక ప్రతతి తోడ
జల పరిగ్రహణాగత కలశపాణి
భామినుల తోడ దీర్ఘికల్ పరగునచట 120

క. మహనీయ జీవన శ్రీ
సహితములై జనుల తృష్ణ సడలింపుచు బ్ర
త్యహము బహుప్రదుల గతిన్
బ్రహలుం దత్పురము నందు భాసిలు చుండున్. 121

మ. కురువేరున్మరువంబునున్ దవనమున్ గుందమ్ములున్ మల్లియల్
కురువిందల్ విరవాదులున్ దొగడలున్ గోరెంటలున్ బొన్నలున్
గిరిమల్లెల్ కరవీరచంపకములున్ గేదంగులున్ జాజు ల
బ్బురపుం దావులు గ్రుమ్మరింప వెలయున్ బూదోట లవ్వీటిలోన్. 122

శా. ఆకుందోటలు పోకమ్రాకులు సముద్యన్నారికేళ ద్రుమా
నీకంబుల్ గదళీతరుల్ పనసలున్ నిమ్మల్ రసాలంబు ల
స్తోకగ్రాహులు దాడిమక్షితిజముల్ తోరమ్ములైనట్టి మృ
ద్వీకావల్లికలన్ బెనంగొనిన పందిళ్ళంద సంఖ్యాతముల్. 123

ఉ. ద్వార కవాట కుడ్యఘటిత త్రిదశేంద్రశిలాహిజిద్వృష
ద్వార కళాధిరాడుపల ధామ పరిస్ఫుట గేహవాటియౌ
ద్వారక భూస్థలిన్వెలయు దత్పురవల్లభుడై సురద్విష
ద్వారక చక్రధారియగు తామరసాక్షుడు శౌరిభాసిలున్. 124

ఉ. ఆ మధురానివాసుడు దయామృత పూర్ణకటాక్ష వీక్షణా
యామ ధురాధరుండగుచు నాత్మ లసద్విషయంబు నిత్య్య ప
ద్మామధురంబు సర్వసుఖదంబుగ జేసె ధరిత్రియందు నా
హా మధురాక్షసారి గొనియాడగ శేషనకైన శక్యమే. 125

సీ. గజవరదానంద గరిమ గాంచిన వాడు
గజవర దానంద గరిమవాడు
ఘన పుణ్యజన విమర్దనము సల్పినవాడు
ఘన పుణ్యజన వివర్ధనము వాడు

కమల జాతాప్త విగ్రహము సల్పినవాడు
కమలజాతాప్త విగ్రహము వాడు
గగన చరేశ్వర సుగతి నొందిన వాడు
గగన చరేశ్వర సుగతివాడు

సాధు బృందావన క్రీడ సల్పువాడు
సాధు బృందావన క్రీడ సల్పువాడు
సబలుడగువాడు గోపాలచక్రవర్తి
సబలుడగువాడు గోపాల చక్రవర్తి.

క. రాజ్యంబు నిఖిల సంప
త్ప్రాజ్యంబుగ నేలుచుండె బటుతర నిజ సా
మ్రాజ్యంబు మేలుమేలని
పూజ్యంబుగ సకల జనులు పొగడగ నంతన్. 127

ఉ. ఆవనజాత నేత్రుడసహాయ పరాక్రముడై నిశాట శి
ష్టావన జాతచత శితికంఠ సహస్రవిలోచనాది దే
వావనజాత కీర్తి కలితాష్ట దిశాక్రముడై ధరాస్థలిన్
గావ నజాత శత్రుడనగా విలసిల్లెను ధర్మపద్ధతిన్. 128

క. తాలాంకుడు ఖగరాజో
త్తాలాంకుడు నూత్నరత్న తతకాంతి సమే
తాలంకరణౌఘ నితాం
తాలంకృత దివ్యమూర్తులై భాసిలుచున్. 192

మ జతగా నిర్వురు కొల్వుకూటమునకున్ సద్బంధు మిత్రాశ్రిత
ప్రతతుల్వెంబడిరాగ వచ్చి ఘనదీప్యద్రత్న సింహాసన
స్థితులై మంత్రులు పండితుల్ కవిజన శ్రేష్ఠుల్ రసజ్ఞుల్ పురో
హితులుం గాయకులుం బరాంకులు భట్టిర్వంకలన్ గొల్వగన్. 130

ఉ. రైవతకాభిధానుఁడగు రాజిల రాజిల గాచు బుద్ధి పే
రైవతరించి నాడనగ నాత్మజ నాత్మజనుర్విఁ యుక్తుఁడై
రైవతకాద్రి చెంగటి పురంబు గరంబుగ దేరియిచ్చెనా
రైవతకన్యకన్ రిపువిరాముడు రాముడు భార్యగా గొనెన్. 131

క. కళ్యాణవతిని రేవతి
గళ్యాణము బలునకు తగగావించి తుదం
కళ్యాణాంబర ధరుడును
గళ్యాణవతీ ముఖాబ్జగంధుల గొనియెన్. 132

సీ. రుచిరాంగరుచి జిత రుక్మిణి రుక్మిణి
సత్యభామాంచిత సత్యభామ
జాంబవత్యుచధన్య జాంబవద్వరకన్య
మిత్రజనానంద మిత్రవింద
పంచాస్త్ర శాస్త్ర సుభద్రానుభవ భద్ర
సమదంత విజిత దాడిమ సుదంత
కాంతిస్వసాయిత కాళింది కాళింది
లలిత సులక్షణ లక్షణాఖ్య

గీ. గాగనెనమంద్రుగురు గంధనాగయాన
లంబుజాతాక్షుని పరిగ్రహంబులైరి
మానవతులు సమత్వాభిమానవతులు
వారినెన్నంగదరమె యెవ్వారికైన. 133

శా. ఆ రామామణులన్ విధూపల మయీ హర్మ్య ప్రదేశంబులం
దారామస్థలులందు రమ్యకృతకాహార్యాగ్ర భాగంబులం
దారామాబ్ధితటీ లతాగృహములం దానంద సంధాయియై
యా రామానుజుడెంతయున్ బహుళరహస్య క్రీడలన్ దేల్చుచున్. 134

క. ఏవేళ నే వధూమణి
కే విధమున సురత సౌఖ్యమిఁచునో హరిదా
నావేళ నా వధూమణి
కావిధమున సురత సౌఖ్యమందగ జేయన్. 135

చ. మరియు నమూల్య రత్నరుచి మంజుల సైగనిగీ విరాజితా
భరణములున్ విచిత్రతర ధర్మపి నిర్మిత దివ్యసుందరాం
బరములు సాధుగంధ రసబంధుర నిస్తుల వస్తు సంతతుల్
వరుస నొసంగు నఁగనల వాంఛలుదీర మురారి సారెకున్. 136

శా. నే వేడ్కన్ విహరింతునన్నతడు మన్నింపంగ నా తోడనే
యే వేళన్ విహరించు నా కొరకు దానే వస్తువుల్ దెచ్చుచున్
నావల్లన్ సుఖియించు నా కతని కెన్నన్ వేరులే దెప్పుడిం
దే వర్తించు ముకుందు డందు రనురక్తిన్ గాంత లిట్లందరున్. 137

సీ. సతుల వీణాగాన చాతుర్య మాలించి
యుల్లసిల్లుచునుండు నొక్కవేళ
నేకాంతమైనచో నిగురుబోణుల సర
సోక్తుల నవ్వించు నొక్కవేళ
తమ చెల్వు నిల్వుటద్దములందు గన్పింప
నువిదలతో జూచు నొక్కవేళ
పగడసాలాటాడు భామామణులనెల్ల
నోడించు తానోడు నొక్కవేళ

నింపుదిలకింప దనదు మోహంపు చెలులు
గమ్మగమ్మన వాసించు కమ్మతావి
పుప్పొడులు గుప్ప నప్పు డప్పొలతు లధర
నుదుట బూబంతులడరించు నొక్కవేళ. 138

క. నారీ తిలకంబులతో
నారీతి సుఖానుభూతి నందుచు లీలా
ర్ధారీకృత శారీనుత
కీరీరిత సూక్తులాలకింపుచు నుండున్. 139

చ. యువతు లనేకులున్న మగడొపిక నందరి నొక్కరీతి కై
తవ ముదయింపనీక ప్రమదం బొసరించుట దుష్కరంబుకే
శవుడది యేమొకాని తనచానల నందరి నొక్కరీతి గా
రవ మొనరించు నెయ్యెడ బరస్పర మైత్రి జనింపనెంతయున్. 140

గీ. ఇటుల జవరాండ్ర నందరి నేలుచుండి
భోజకన్యకు మరియు సాత్రాజితికిని
మిగుల జనవిచ్చి మన్నించు నగధరుండు
కడమ పడతుల మదికాక పొడమనీక. 141

క. దక్షిణ నాయక సహజా
దక్షిణ తం దనరు శౌరి తను జను లెల్లన్
దక్షిణ నాయకుడని కన
దక్షిణ నేత్రావిహార దక్షుండయ్యెను. 142

ఉ. కొన్ని దినంబులిట్లునల గోపవధూజనమాన చోరుడ
త్యున్నత భోగభాగ్య విభవోజ్జ్వలుడై విహరింపుచున్ జగ
త్యున్నత లీల నొక్క దివసంబున రుక్మిణి మందిరంబునన్
జెన్నగు రత్నపీఠిని వసించి సుఖస్థితి నుండు నత్తరిన్. 143

## నారదాగమనము

సీ. ప్రవిమల శారీర ధవళ కాంతి చ్ఛటల్
కావిధోవతులపై గను పడంగ
నురరీకృత ద్వాదశోర్ధ్వపుండ్ర సురేఖ
లుచితాంగముల సద్రుచి జెలంగ

కమలాక్ష తులసికా కంఠ మాలిక లుర
స్థలమున కొంకవింత చెలువొసంగ
మణికమండలు దివ్య మాయూర పింఛముల్
కర భుజాగ్రాకల్ప గతివెలుంగ

తులసి జపమాల యంగుళములం బొసంగ
బెదవులచ్యుత మంత్ర సంపద గసంగ
మహతి మ్రోపున మొరయంగ మధువిరోధి
గాననరుదెంచ నారదమౌని వరుడు. 144

క. అరుదెంచిన నెదురుగ జని
మురవైరి నమస్కరించి మునివరునంతః
పురమునకు దెచ్చి పూజలు
కరమరుదుగ సలిపె భోజకస్కృత తోడన్. 145

గీ. పూజలొనరించి కయ్యంపు భోజనంబు
దెట్టజడదారి పదములట్టట్టు నొత్తి
మినుకు రతనంపు రవలు దాపిన పసిండి
దండి గద్దియనతని గూర్చుండజేసి. 146

క. మునిపతి యాసతి నభినవ
ఘనమణిమయ రుచిర పీఠికస్వాసియించెన్
దినమణి బలదనుజ నిఘా
దన దిగ్గిరి శిఖరమెక్కి దనరిన భంగిన్. 147

క. దానవరిపుడిట్లు సుఖా
సీనుండై సత్వగుణ విశిష్టుండగుచ
మ్మౌనిగని పల్కె నిజ స
మ్మానోచిత సూక్తులమృత మాధురి జిలుకన్. 148

క. "నారదమౌనిచంద్ర! శర
న్నారద రిపుసాంద్ర! మీరు నయసంపదచే
నారదరిపు సన్నుతిగ
న్నార దమ ప్రకృతి జనుల నమ్మనివారల్ 149

మ. అరిషడ్వర్గ విదూరు లింద్రియ జయవ్యాపార సంచారు ల
స్థిర సంసార విముక్తధీరు లఘవిచ్ఛేదక్రియోదారు లాం
తర విద్యాపరిహారు లట్టి ఘనులన్ దర్శించితతిన్మిమ్ము మీ
కరుణా పాత్రుడనైతి" నంచు బలుకంగా మౌని నిర్విణ్ణుడై. 150

శా. "దేవా! కేవల మానవుండనెడు రీతిం బల్కగా జెల్లునే
నీవింద్రాది సురాగ్రగణ్యుండవు జగన్నిర్మాత నీ నాభీ రా
జీవావిర్భవుడేను దత్సుతుడ మచ్చేతస్సరోజంబునం
దేవేశన్ భజియింపుచుందు నినులక్ష్మీశా! జగన్నాయకా! 151

చ. హరివి పరాత్పరుండ వఖిలాగమవేద్యుడ నిందిరామనో
హరుడ వనంతమూర్తివి చరాచరచేతనవర్తి వంబుజో
దరుడ వజుండ వాద్యుడవు ధాత్రి కపర్ది పురందరాది ని
ర్జర వరులెవ్వరుం దెలియ జాలరు లావక సచ్చరిత్రముల్. 152

దశావతార స్తుతి

మ. జలజాతాసనునేమరించి భయలేశం బేమియున్ లేక న
త్తొలుబల్కుల్గొని సత్వరంగదలి పాదోధింబ్రవేసింపన
వ్వలసుందిండిని బట్టి వానియసువుల్ పోగొట్టి వేదంబులన్
నలుమోముల్గల రేనికిచ్చితివి మీనస్వామివై మాధవా! 153

మ. సురదైత్యాళి మహోరగ ప్రవరు రజ్జుప్రోతముంజేసి మం
దర మంధానముచే బయశ్శరనిధిం దర్చంగ దత్పర్వతో
ద్ధరణక్రీడ జెలంగి రక్షసులకుం దప్పించి జేజేలకే
మరకన్ ద్రాపవె వార్ధిజామృతము కూర్మస్వామివై మాధవా! 154

మ. ధరణీ మండలి జాపచుట్టగ భుజాదర్పంబునం జుట్టి ము
ష్కరవృత్తిం జన చంకబెట్టుకొని పోగాఁజూచి జంఘాలనిం
త్వర నంపంజని త్రుంపవే దితిసుతాధ్యక్షున్ హిరణ్యాక్షు ఘో
కర దంష్ట్రాహతులన్ మహోగ్రకిటి లోకస్వామివై మాధవా! 155

మ. తనతో నర్భకుడన్న మాటకు సభాస్తంభంబు హస్తంబుచే
గినుకం దట్టిన నుట్టిపడ్డగతి దిగ్భేదార్భటిన్ స్తంభసం
జనితోగ్రాకృతివై హిరణ్యకశిపుం జాగ్రన్నఖాగ్రాళిచే
హననక్రీడ నటించి త్రుంచవె నృసింహస్వామివై మాధవా! 156

మ. అతిమాయాపటు వామనాకృతిని డాయం బోయి పాదత్రయీ
మితభూమిన్ బలినర్థి వేడుకొని నీమేన్పెంచి లోకంబులం
ద్భుత లీలన్ గొలువంగ జాలమికి తద్దోషాచరుం ద్రొక్కవే
యతలస్థాయినిగా త్రివిక్రమ సమాఖ్య స్వామివై మాధవా! 157

మ. ప్రతిపక్షుండగు కార్తవీర్యనృపతిన్ భజించి ముయ్యేడు మా
ర్గితర క్షత్రియ సంతతిన్ వెదకి వేహింసించి తత్ఖండన
క్షతజంబున్ బితృతర్పణక్రియకు దద్గాత్రంబుల న్ముక్తికిన్
మతిచే మెట్టొనరింపవే పరశురామస్వామివై మాధవా! 158

మ. దమియాగాహితులం జయించి హరకోదండంబు ఖండించి సీ
తమ నాసక్తి బరిగ్రహించి భృగురామాటోపమున్మాంచి శీ
ఘ్రమె సాకేతపురాన పెంచి వనులం గష్టించి సుగ్రీవనా
మము హెచ్చించి దశాస్యునొంచితివి రామస్వామివై మాధవా! 159

మ. వసుధన్ గోపకిశోర వేషమున గోవత్సంబులన్ గాచుచున్
గసిదీరన్ బ్రబల ప్రలంబ ముఖ రక్షశ్రేణి నిర్జించి సా
హసవృత్తిన్ గరిపట్టణంబు నిజసీరాగ్రంబుచే సూచి తా
మసు దుర్యోధను గెల్చితేవె బలరామస్వామివై మాధవా! 160

మ. పతితాశ్వత్థముఁగంప సేవ కపటావేశంబు గావించి సం
వరితై నగ్నత నక్షతుం బసురకాంతల్ కౌగిటం జేర్ప ద
త్ప్రతి ధర్మం బొనరించి యా త్రిపుర దైత్యశ్రేణి మృత్యుంజయో
ద్ధరిచే సంతవధింప జేసితివి బుద్ధస్వామివై మాధవా! 161

మ. బలిమిం వర్జన ధర్జనంబుల జగత్ప్రాణి ప్రయాణ క్రియల్
సలుపంగాంచి కలించి మారుత జవాజానేయమున్ సాహసో
జ్జ్వల చక్రాకృతి నెక్కి ఖడ్గహతి దుష్టమ్లేచ్ఛ విచ్ఛిత్తి సం
ధిం జేయంగల వెక్కటిన్ గలికి మూర్తిస్వామివై మాధవా! 162

చ. వరుస దశావతారము లవారణలీల ధరించి దుష్టసం
హరణ ముదార శిష్ట జనతాదరణం బొనరించినట్టి దే
వర చరితంబెరుంగ గలవారలె మాదృశులైన తాపసుల్
సరసిజసంభవేందుధర శక్రముఖామరులైన మాధవా! 163

క. ద్వారావతి నవతార
ద్వారా వర్తింప చక్రధరుడవు దవిష
ద్వారావన దైత్యవిప
ద్వారావక్ర ప్రతాప ధన్యుడవనుచున్ 164

## పారిజాత పుష్ప ప్రదానము

వ. మరియు నవ్విరించి తనయుండాత్మ బ్రహర్షించి వివిధోదంచ ద్చతుర వచః ప్రపంచంబుల సత్కారించనాంబరు నుత్కర్షించి సన్నుతించి ముమ్మరమ్ముగా గమ్ముగమ్మునం దన పరిమళమ్ము నలుగడలం గ్రుమ్మరించు సోమరితెమ్మరలం గ్రమ్మం జిమ్మరు కొదమ తుమ్మెదలం బొదలుచుం బున్నమవెన్నెలరేని చిన్నెల జెన్నరు చున్న పారిజాతం పుమిన్నా క్రొవ్విరిం దెన్నుగా విన్నువాక నుత్పన్నంబగు సొన్నంపు గ్రొన్నన రాపురపు టాకునం బుచ్చుకొన్నుయుఁజేసి "జయతు జయతు దేవో దేవకీ నందనోయ" మనుచు నాశీర్వచన పూర్వకంబుగా నేర్పున సమర్పించెను. 165

క. అంజలి చేగొని కన్నుల
మంజులగతి నొత్తుకొని సమున్నతి పరుడై
రంజిలుచు నెమ్మదిం దన
కంజాక్షుం డెల్లసంచి కడుమోహము తోన్. 166

క. ఈ నిర్జర తరు కుసుమం
బే నెలతకు బంపవలయు నిందరు సరియే
నేనిచట నుంచి మరియొక
మీనాక్షికి బంపుటు చితమే కాదు గదా. 167

క. అని తలచుచున్న మునిపతి
కనుసన్నంజూప భోజకన్యామణికిన్
దన చేకుసుమం బొసగిన
ఘనతర ముదమొదవ గేలగైకొని యంతన్. 168

మ. అలరుం గ్రొవ్విరి గ్రొవ్వెదం దురుమి తానయ్యారె యొయ్యారపుం
జెలువంబున్ దిలకింప నింపుగ వసించెన్ నూత్నరత్నాసన
స్థలినే యెమ్మెలు దాల్చెనో మరుని చే సమ్మోహనాస్త్రంబొ ని
శ్చల విద్యుల్లతయో యటంచు జనులెంచన్ భాసమానాంగియై. 169

సీ. నునుకెంపు నసగంపు పెనుసొంపు నిగనింపు
మధురంపు టధరంపు విధము పెంపు
తెలి వాలుగపుమేలు బలుజాలు వడిదేలు
నునువాలుగపుడాలు మనువజాలు
తెలిగట్టు చలిగట్టు మంచుట్టు పలుగొట్టు
నెవబుట్టు కవనెట్టు కుదురపట్టు
తొగజారు నొరనూరు పగవోరుమను గేరు
జగదేరు వగమీరు మొగము సౌరు

కలికి చిలుకల పలుకుల కులుకు జిలుకు
నందు రేనియలొలుకు రేబలుకు లహహా
సురతరుపరాంత మహిమచే జూపరుంకు
వింతగనుపింప రుక్మిణీ కాంతమెరసె. 170

ఉ. కన్నుల కింపుసొంపు దొలకం గనుపించుచు నిట్టులున్న న
కన్నెన్నుల కలితో నపుడు కయ్యపుడెండి తపస్వివల్కె ''న
కన్నెన్నుల ఎండి రాకొమరు గన్నవెలందివి గాన నిచ్చెనీ
కన్నుల కేరికీయక మురారి యనల్పపు వేల్పుక్రొవ్విరిన్. 171

శా. శ్రీ రామామణి భారతీరమణి గౌరీదేవి పౌలోమియున్
సౌరస్త్రీలోక కోంపరీ కుసుమరాజం బొపలందాల్తు రీ
పారావార పరీతభూతలమునన్ బ్రఖ్యాతులైనట్టి యే
నారీ రత్నములైన దాల్ప దగరెన్నన్ దీని భోజాత్మజా! 172

గీ. దీనికెనయైన దివ్యప్రసూన మెందు
గాన మటుగాన నేనికు దీనిమహిమ
పూని వినిపింతు విను''మని మౌనివరుడు
తియ్యదనముప్పతిల నానతీయ దొడగె. 173

క. ''కదలించు సురటివైఖరి నెండతాకుళ్ళ
గరదీపగతి నిర్గదరుము వెళ్ళ
బరిధాన భూషణ ప్రతతి గూర్చునాడళ్ళ
దరలించు నాకలి దప్పితళ్ళ
ధనధాన్యవస్తు సంతతులు నింపు నగళ్ళ
గౌమవ గాకుండ జేకూర్చు మేళ్ళ
మనువల మగల నింపుగగూర్చు కౌగిళ్ళ
వర్షించు వలపుల వానజళ్ళ

మేళ్ళ ముంగెళ్ళ నెలరాజిగెళ్ళ మేళ్ళ
దళ్ళ పాదుళ్ళ గుస్నుసూపెళ్ళ చాళ్ళ
జోళ్ళ రతికేళ్ళ బడలికల్ మళ్ళ మళ్ళ
సళ్ళనిడి చేయు రేమెంద రేళ్ళరేళ్ళ. 174

మ. హరికిన్ బట్టపురాణివై సిరికిఁబట్టైనట్టి పూఁబోణివై
ధరణిం బుట్టిన పద్మపాణి విది తథ్యంబింక నీ వాదలన్
సురశాఖి ప్రసవంబు దాల్పఁదగు''నంచున్మెచ్చి కీర్తించి ని
ర్జర మౌనీంద్రుఁడు నవ్వుచున్ గలవాక్సంపాదియై యిట్లనున్. 175

క. ''నీ సవతు లెవ్వరైనను
నీసవతులుగారు సుమ్మ నిరుపమ విభవో
ల్లాసవతి వగుము రిపు మ
ల్లాసవ తిమిరార్కుఁడగు నిజాధిపు కరుణన్. 176

క. జిగిదేరిన సోయగమున
బిగి మీరిన జవ్వనమున బెనిమిటి మదికిం
పుగ మెలగుచు బొగడొందితి
జగమున నని సత్యభామ సారెకు మురియున్. 177

క. సాటికి వేటికి దనతో
బోటికి నెదిరించుపాటి బోటి గలుగదే
నాటికి నను సాత్రాజితి
నేటికి దన బిగువుసడలె నీవగు ఘోటిన్. 178

క. అందరు సుందరులును దమ
డెందంబుల వేడ్కఁ లినుమడింపగ నీతో
బొందొదవ రింపుచు నుందురు
సందేహములేదు రాజసము నీ కొదవెన్." 179

క. అని తరతమ భావోక్తుం
ననితరసాధ్య ప్రభాంగనాళికి వోడ్తో
న నితరలనుగతి హొడమగ
ననితరశోకయను గుంపినాధిప తనయన్. 180

క. కొనియాడి మరలి హరిగను
గొని "యాడికలయ్యె నీవు గోపికలం గూ
డ్కొని యాడిన కతలిక గై
కొనియాడిన మేలు రాచకూతుల" ననినన్. 181

ఉ. "నారదమౌని చంద్ర! నను నవ్వుల కెవ్వరు రవ్వమాటల
న్నా రదరం దదుక్తులకు నన్ను నెరుంగరె మీర లెందుగ
న్నా రచనెంచి తెత్తు నరనాథుల కన్యల జాడదెల్పుడీ"
నా రవనచ్ఛదాగ్రమున నవ్విగురొత్తగ శౌరికిట్లనున్. 182

ఉ. "దేవర దర్శనార్థ మరుదెంచుచు మార్గమునందు భీమ భౌ
మావర జన్ముడైన నరకాసురు డాజుల రాజరాజులన్
గావర ముప్పతిల్ల గరఖడ్గముచే విదళించి తద్ధరి
త్రీవర కన్యకామణుల దెచ్చిన ముచ్చట వింటివీనులన్. 183

క. విని ప్రాగ్జ్యోతిష పట్టణ
మునకుం జని తద్విశేషముల జూచుచు భూ
తనయుని శాసనమున నొక
ఘన గృహమున మెడలు రాచకన్యలనెల్లన్. 184

క. కని వారలచే బూజలు
గొని నరకాసురుడు పెండ్లికొరకై తమ్మున్
గొని వచ్చిన కథ నాతో
వినిపించి దురంతచింత విలపించి తగన్. 185

క. అందరిలో నొక కొందరు
సుందరులిట్లనిరి సర్వసుంఘులగుచు మీ
రిం దరు వెంచితిరిక 'మ
మ్మందరినింగావవలయు నవి యెట్లనినన్'. 186

ఉ. 'విగ్రహజాగ్ర దుగ్ర భుజవీర్యముచే నరకున్వధించి నీ
వి గ్రహణం బొనర్చి ననివించి పజీరునివంటి నీ లన
ద్విగ్రహ సంగలిన్ శుభమతిన్ గనజేసితివేని మమ్ము భా
వి గ్రహ బాధలంటవని వెన్నునితో నిటు విన్నవించుడీ!' 187

క. అని నను ప్రార్థించిన న
వ్వనితల కథయం బొసంగి వచ్చితి వారిం
గనికరముగ గావగవలె"
నని తెలియగ జెప్పి మరియు హరికిట్లనియెన్ 198

## —: రాజకన్యకా సౌందర్య వర్ణనము :—

ఉ. "ఆ రమణీ శిరోమణుల సందర నయ్యరవిందసూతి రా
కా రజనీకర ప్రభల కంతునితూపుల కుందనంపు బం
గారముతోడ గూర్చి కరకౌశల మేర్పడ దిద్ది తీర్చి శృం
గార రసాన్వితాకృతలుగా నొనరించి సృజించెనో కదా! 189

ఉ. ఆనెరిగొప్ప లాసురుచిరాస్యము లాతెలివాలుచూపులా
మేనిమెరుంగు లాదిగువుమిట్ట చనుంగవ లాయొయారముల్
సూనశరు స్మరుల్గొలుపు చోద్యము గాదివి మౌనులైన న
మ్మానినులం గనుంగొనిన మానసముల్నిలుపంగ నేర్తురే! 190

క. కొమ్మల వదనమ్ముల యల
కమ్ముల రదనమ్ముల సరిగాకను నరవిం
దమ్ములు కందమ్ములు కుం
దమ్ములు జల గగన నవ పదమ్ముల డాగెన్. 191

సీ. హరి సింహములు రంధ్రాన్వేషణము సల్ప
గుణవతీమణుల ముంగురుల సొబగు
జలదాళి జీవనశక్తి పాయగ జేయు
శరదబ్జనేత్రల జడల సౌరు
సకలంకుడగు సారసద్వేషి గబళించు
నవతమోవేణుల నగుమొగములు
మీల బల్వంతల పాలుగా నొనరించు
కోకస్తనుల సద్విలోకనములు

మన్మథుని విండ్ల గంట్లెల్ల మాన్ప దలచు
గంధ సింధురయానల కన్నుబొమలు
పక్వబింబఫలమ్ముల బలిమినణచు
కీరవాణుల మధురోష్ఠసార రుచులు. 192

శా. రాజీవాక్షి తరంబులన్ బ్రబలి సారశ్రీపగల్మీర దా
రాజీవాక్షి సహాయతన్మెలగి పోరంగేరి తద్వాసనా
రాజీవారణకేళిచే జెలగె సౌరా రాజకన్యాక్షి స
ద్రాజీవాలయ దానసయ్యుగళి వంతన్ జారెపేరప్పులన్. 193

క. మెప్పులుగల యప్పొలతుల
రెప్పలు తమ యొప్పుల నపహరించిన వడి దా
నిప్పుల జెడి యప్పులబడి
చిప్పింబడి ముత్తియంపు జిప్పలు ముడిగాన్

క. బోటుల కనుబొమ్మలతో
జీటికి మాటికిని పోరచేదార కెనా షిం
డ్లేటికి నలికట్లంబడె
నేటికి మొరలిడియె శరములేటికి విడిచెన్. 195

గీ. తళుకు చెక్కులు మెరుగుటద్దముల మించు
మించు జోడుల కనుచు వర్ణించవలసె
వలసినప్పుడు చూపరుల్ కలయజూడ
జూడనగు సందు ధమమేని నీడ లౌర ! 196

మ. విలసద్గంధఫలీ తిలప్రసవముల్ విశ్వంభరాధీశ క
న్యాలకామోదము సంఘటిల్ల నిజరమ్యస్నేహ సంబంధమున్
గలుగంజేసి తదీయనాసలగుటన్ గన్పట్టి తత్ప్రేక్షణా
ళుల నానాసుమగంధసారముల దేల్చున్నిర్విరోధంబుగన్. 197

క. శ్రీవర్ణములో నవసం
ఖ్యావర్ణములో యటంచు గణుతింప సతీ
సౌవర్ణాభరణ శుభ
శ్రీవిలసత్కర్ణములు ప్రసిద్ధికి నెక్కెన్. 198

క. చిలుకల కొలుకుల గళములు
పలుకులు దరములును కీరపంక్తుల దరమున్
జలధింబడి మొరపెట్టన్
నలినొరలున్ దిరుగుకాననమ్ములు వరుసన్. 199

చ. కలిమి వెలంది మందిరము కమ్మనివిల్తుని వాడికైదువై
యలరుగదా ! నిజ ప్రసవమంచు ధదీయ బలమ్ము నమ్మి చా
పలగతి గన్నవారి నెడబాయక నేమరియుండె నందుచే
బొలతుక బాహువల్లికల బోలవు లమ్మృణాళి నాళముల్. 200

క. మరువక నెదిరించిన తా
మరల సిరిన్ బలిమి నణచు మగువలకరముల్
తరలకను పిల్లపెసరుల
దరల కరశ్రీ హరించు తరుణాంగుళముల్. 201

క. తరుణుల పయోధరంబులు
మరిమరి నిరసించు కనకమయ కుంభములన్
గిరిదంభముల న్వర్తుల
కరి కుంభములన్ రథాంగ ఘనడింభములన్. 202

చ. మెలతల మేనులన్ బసిడిమేడలపై వలరాయడెక్కె నే
ర్పలవడ గన్నె గేదగుల నందముగా రచియించినట్టి తా
వలసగ భాసిలున్ వళులు, భామినులన్ మదనాస్త్రశాలలన్
సలువుగ బూలవిండ్లకిడు నారులనందగు నారులెన్నగన్. 203

శా. పాటీయక్షమ కేసరప్రసవముల్ పల్మారు రాజన్యక
న్యా సాక్షీ వివరోపమానతకు నానావాహినీ సాల సం
తాన శ్రీనిరవొందె పోరుటకు దత్సాదృశ్యమెద్దానిచే
నైసం గానగలేక రేబగలు నత్యంతార్తిం దపించున్ జుమీ! 204

క. డీకొనలేక మృగేంద్రా
నీకంబులు కొండగుహల నెలవుగ డాగెన్
రాకేందుముఖుల కౌనుల
కాకాశము నిరవకాశమది దీటగునే. 205

క. ఏణీలోచనల ఘన
శ్రోణీభరములకు గాంగశోభన పులిన
శ్రేణీజలనిధి వసిత
క్షోణీ చక్రముం నీడుజోడన దగునే. 206

క. కదళిక లనుమానించక
కదళికంగు బాసలుడిగి కదసిన కసిచే
కదలి కలహించి గెలుచున్
గదళికలన్ గలభరాజగమనల యూరుల్. 207

ఉ. కొబ్బరి గిన్నెలన్ గనినగున్ నృపకన్యలజానువుల్ బళా!
దబ్బరగాదు దీటునకు దమ్ము నెపేర్చిన వాటిబట్టి లో
నబ్బరపాటు నొందగను సంగడివీథుల నమ్మజూపి పె
ల్లుబ్బిన దుస్కురుస్కులుగనొత్తి మెసంగగజేసె గావునన్. 208

క. తరుణుల జంఘలతో శర
గరిమన్మళ్ళబడి కమలగర్భములనికిం
గొరగాక తత్తృణీకృత
కరణములై వెన్నొసంగె గాదే తుదకున్. 209

క. కలకలనగు చిగురాకుల
కలకలనగు రాజకన్యకల చరణంబుల్
తలతలయను నెలనెలతల
తలతలయను సతుల నఖరతతి కిరణంబుల్. 210

క. ఇంతుల నడలు మదోన్నత
దంతుల నెక్కుంగ దివురు తమ వెనువెంటన్
రంతులొనర్చుచు నంచల
బంతుల దిరుగంగజేయు బళిబళి యనగన్. 211

క. ఆ చెలువల గొనియాడగ
నా చిలువలరే డశక్యమనుచున్మది నా
లోచన మొనర్చు నల! మృగ
లోచనల నుంతింప దరమె లోకులకనుచున్. 212

చ. మునివరు డిప్పొధిన్ భువనమోహనమూర్తి విశేషధన్యలా
మనుజవరేణ్యు కన్యలని మాధవుతో నెరిగించి "భూమి నం
దన దనుజుం జయించి ప్రమదంబున నప్పుడియారువేల భా
మినుల వరించు"మంచు నెలమిన్ వచియించి తదాజ్ఞనేగినన్. 213

క. నారద నిభవర్ణుడు హరి
నారదముని లపిత ఘోరనరకాఖ్యా మహో
నారదవిభు జీవనదీ
నార దరాచరణ దృఢమనస్కుండయ్యెన్. 214

—: ఆశ్వాసాంతము :—

మ. సుర సన్మాద్వరభోగ భోగమణిభాచ్ఛ్రభాహి శౌర్యాతి భా
సుర కీర్తి ప్రవిభాగ భాగనగరస్తోకం ప్రతిజ్ఞాత్త భూ
సుర ముఖ్యావనయోగ యోగనిరతస్తుత్యాత్మ సంసేవితా
సుర సంహార్యనురాగ! రాగరహితస్తోత్రప్రియం భావుకా! 215

క. దరకర కరుణాకర పర
దరకర బిరుదాంక నలినతతి వికసన సుం
దరకర నిభవిభవ బుధా
దరకర సంగర జయాత్యుదార ప్రదరా! 216

మాలిని. సదమలగుణసాంద్రా! జన్మలీ సంతతీంద్రా!
సదవనకృతిరుంద్రా! సత్యవాగ్రామచంద్రా!
సదయనయవితంద్రా! సత్కళాపూర్ణచంద్రా!
హృదయలసదుపేంద్రా! యిష్టభోగామరేంద్రా!

# గద్యము

ఇతి శ్రీమత్సింగ పట్టణ లక్ష్మీనృసింహస్వామి కటాక్ష వీక్షణ
కృపాపాత్రుండును నాశ్వలాయనసూత్రుండును విశ్వా
మిత్రమౌని విఖ్యాత గోత్రుండును ముత్యాల
యప్పయామాత్య ద్వితీయాక పుత్రుండునగు
వెల్లూరు నరసింగకవి ప్రణీతంబైన
రాచకన్యకాపరిణయంబను మహా
ప్రబంధంబునందు ప్రథమా
శ్వాసము.

—o—

# రాచకన్యకా పరిణయము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరుక్మిణీ మనఃప్రియ
చారుతర పదాంబుజాత సంస్రుత మకరం
దారూఢ పానపీనో
దార హృదయ భృంగహేం! హనుమ న్నృపాలా! 1

గీ. అవధరింపుము భరతవంశాగ్రగణ్యు
డగు పరీక్షిన్నరేంద్రు డత్యంత భక్తి
నపుడు తరువాతి వృత్తాంత మానతీయ
వలయునని పల్కె శుకయోగి వల్లభుండు. 2

మ. క్షితినాథోత్తమ! చెప్పెదన్వినుము శ్రీకృష్ణుండు భోజాత్మజా
న్వితుడై నారదమౌనిదత్త కుసుమోన్నిద్ర ప్రభావం బభీ
ప్సిత సంధాన మహానుభావమగుటన్ జేతస్సరోజంబునం
దతులానందము కంపళింప సుఖలీలాసక్తి నిట్లుండగన్. 3

గీ. కలహ భోజనముని శౌరికడకు రాక
మునుపె రుక్మిణి మందిరమునకు వచ్చి
మెవలు సాత్రాజితీ దూతి మొదటినుండి
యచట బుట్టిన ముచ్చట లన్ని యుపెని. 4

క. మరలి చనుదెంచి యద తన
దొరసానింగాంచి కన్నుదోయిని రాగాం
కుర ముదయింపగ నిట్లని
సరభసగతి బలికె కోపచలితాధరయై. 5

## —: దూతికా కథనము :—

శా. "అమ్మా! నీపతి రుక్మిణీ రమణు డత్యంతానురాగంబుచే
కొమ్మా దివ్యములైన సొమ్ములివి గైకొమ్మా సమర్పించెదన్
రమ్మా చేరువకంచు బిల్చి తనుచేరం గౌగిటంజేర్చి ము
ద్దిమ్మా యంచును మోవి నొక్కి రమణుం డిచ్చె న్విభూషావళుల్. 6

ఉ. ఇచ్చిన సొమ్ములెల్ల ధరియించి నిజేశునకు న్నమస్కృతుల్
హెచ్చిన భక్తితోడ రచియించి తదాజ్ఞ దదంక పీఠిపై
మచ్చికచే వసించి యల మంజులవాణి విలాసవైఖరిన్
ముచ్చట లాడుచున్ భువన మోహిని యాయననుండె నత్తరిన్. 7

క. చతురాస్య సుతుడు నిజదీ
ధితి దిక్కుల గప్ప జుక్క తెగిపడ్డ గతిన్
దితిజారి సన్నిధికి న
ద్భుతరీతిన్ రాగ సతని బొడగని వేగన్. 8

చ. ఎదురుగనేగి దండమిడి యింటికి దోడ్కొనివచ్చి రుక్మిణీ
మదవతి కన్నుసన్న నొకమానిని బంగరు పీట బెట్టినన్
గుదురుగనిల్చి మౌనికులకుంజరు డంత విదర్భకన్యతో
యదుపతి సల్పు పూజలకు నాత్మను సంతసమంది యంతటన్ 9

చ. హరిగొనియాడి యొక్క దివిజావనిజాత లతాంత మిచ్చి దే
వరకనురూపమైన ప్రసవంబిది దీని ప్రభావమెన్న నె
వ్వరికి వరంబుగా దఖిల వాంఛిత వస్తువులిచ్చు భూమి భృ
ద్ధరజ శచీముఖ త్రిదశ దంపతులెల్ల ధరింతు రివ్వరుల్. 10

చ. అనియిటు వేయినోళ్ళ గొనియాడిన నచ్చెరువంది యవ్విరిన్
దనకనుదోయి నొత్తికొని తామరసాక్షుడు భోజకన్యకున్
ముని కనుసన్న నిచ్చిన ప్రమోదముచేగొని కప్పుగొప్పునం
దనువుగ దాల్చి మౌనికి నఘారికి వందన మాచరించినన్. 11

క. మునిపతి పుత్రవతీభవ
యని దీవించిన హసన్ముఖాంబుజ యగుచున్
జని తనపెనిమిటి దాపట
ఘన మణిమయ రుచిర పీఠకన్వసియించెన్. 12

గీ. అతుల నవరత్నమయ పీఠ నధివసించి
ఇక్ష్వాకుసుమైక మహిమచే దేజరిల్లు
భోజనృపనందనకు సాటిబోటు లెల్ల
సేవలొనరించి రేమని చెప్పవచ్చు 13

ఉ. తంటలమారి వేల్పుజవదారి తపల్లత వంపె శౌరి వా
గ్గంటిని జూచి "నీకు తెరగంటి నెంతలనైన సాటిగా
నంటి వచింపగా దగ దొకప్పుడు చెప్పిన చెప్పవచ్చు ము
క్కంటి నెలంతనుం గమలగర్భుని కాంతను గొంత దీటుగన్. 14

క. నీకు నల సత్యభామకు
మాకుం జూడంగ హస్తిమశకాంతరమో
రాకేందువదన! నీకా
కోకస్తని నీడు చెప్పగూడునె జగతిన్. 15

క. తను దానె పొగడుకొను గద
తనకంటె విభుండు నిన్నుదయ సేయంగా
దన కెరుక లేదె దీనికి
దనకీ కుసుమంటె సాక్షి తామర సాక్షి! 16

ఉ. పెద్దవు బుద్ధిశాలివని ప్రేమ సపత్నులు నిన్నుగూడి స
య్యొద్దిక తోడ నుండుట పయోజదళాయతలోచనుండు నే
ముద్దుల గుల్కు చక్కదనముంగని సొక్కుచు నిన్ను దాయ కే
ప్రొద్దును సర్వసౌఖ్యముం బొందుచు నుండుట కానెరుంగదే. 17

సీ. పెను జాంబవతి మిత్రవిందయు మొదలైన
వనిత లెల్లను దనవంటి వారె
తను మాత్రమే శౌరి కనుకూలవతి గాని
పతికి వీరనుకూలవతులు గారె
తను బాయడని తాను తలచినట్లు విభుండు
తము బాయడని వీరు తలచుకోరె
తన చేటుగారు వీరనుచు దాసనినట్లు
దను సహింపక వీర లనగలేరె

తనకు వీరికి గల తారతమ్యమేమి
వాసి వన్నెం తనసాటి వారు వీరె
చనవు సేయంగ బలుమారు సత్యభామ
కనలి నీతోడ వాదింపదనకుమేలె." 18

వ. మఱియును. 19

క. ఈ లీల రుక్మిణిని ఘను
రాలని లాలించి సవతిరాజాస్యలతో
గేలించి నిన్ను ముని వన
మాలి వినన్ బలికె తగవుమాలిన జోలిన్. 20

గీ. "రుక్మిణీ భవత్సమాన విరోచమాన
మహిమ గలదట్టి యంగన మనసు తెలిసి
సత్యభామాదిసతుల నాసతినిజాజ్ఞ
మొదలునట్లుగ నడిపించుమీ మురారి !" 21

వ. అని. 22

గీ. పలికె నంతటబోక "భూపతుల సుతలు
గలరు పదియారువేలు నాయందరుబోండ్ల
పృథ్వీసుతుచేత బాధపప్పించి వారి
నందరిని పెండ్లియాడు మానందముననను. 23

ఉ. అరసి సత్యభామ మొదలైన మృగాక్షులు రెల్లపేళ నే
తీరున సన్నుహాస మణిపద్మవిభూషణ పిటిరాంబరా
గార సుగంధమాల్యముఖ తాప్యములిత్తువొ యట్టివారి నిం
పార సుఖింపజేయవలె నంపర సుందరులం గృహాంగణన్. 24

క. ఘన దక్షిణనాయక వ
ర్తనమున బదియారువేల తరుణుల సత్యా
వనరుహముఖి మొదలగు నీ
వనితల మరుకేళి సమత వర్తింపు హరీ! 25

క. చిగురు విలుకాని కేళిన్
మగువల నందరిని సమత మన్నింపుము నీ
గగనావలగ్న భీష్మజ
కగణిత వశుడవయి మెలగవయ్య ముకుందా!” 26

వ. అని యుపదేశంబున 27

గీ. హరికి బదియారువేల భార్యామణులును
దొరకెడి యుపాయమును వారితోడి జాంబ
వతి మొదలుగాగ నార్వురు సతుల తోటి
నిన్ను సమురాలిగా నెంచి నిశ్చయించె. 28

గీ. కుసుమ మొకటిచ్చి రుక్మిణిన్ గొసరి మెచ్చి
కాంచనను దెల్పి దుంపెన కొంత సల్పి
నలిన నాభుని గనుచు వేసెలపు గొనుచు
వెల్పు జపదారి గనియెను వింటిదారి. 29

మ. ముని మాటల్విని కంసమర్దనుడు సమ్మోదంబుతో నారకుం
డెను గాని కథ సత్యభామ తగవెంచే కొంతకోపంబు చే
సునా మౌనీంద్ర! తదాది యుండె పరియించుమన్మథ రిట్టాప వ
ద్దని పల్కించెల భోజరాజ సుతయుం దా వక్షహితంబుకన్. 30

కం. ఆ నారదముని మాయల
నానారచ రిపుడు సల్పు నా గడపు బనుల్
నా నారదకచ సంపద
లా నారద గురునకైన నలవియె తెలియన్. 31

మ. అను పల్కుల్విని పంకతాపిత రుషద్ధర్యక్ష భార్యా విధం
బున నాజ్యాహుతి గొన్న దర్ప హుత భుక్పూర్ణార్చి చందంబునన్
జనితామర్ష కషాయి తాక్షియగుచున్ సాత్రాజితీదేవి హె
చ్చిన గాఢవ్యయుతానుతాపియగుచున్ జెల్కత్తెతో నిట్లనున్. 32

—: సత్యా నిర్వేదము :—

శా. "ఏమేమీ చెలి! కృష్ణజేరి మునినన్నిట్లాడెనా మాధవుం
డామాటల్విని సొన్పి సమ్మతిలెనా యారుక్మిణీదేవి తా
నేమేమాడె సపత్నులెల్ల వినగా నీలీల వర్తింప స
త్యాప్రి మాటయ్యెండని శౌరి నమ్మదగునా భావించి చిత్తంబునన్. 33

ఉ. మాయలమారి వేలుపుం మౌనికి రుక్మిణి జేరి సన్నుతుల్
జేయగ సత్యనారదులు జేయగ సారెపదారువేల తే
బ్రాయపు జానలన్ హరికి భార్యల జేయగనేమి గల్గె హా!
పాయని నాదు నాథునెడబాపుట దోసమటంచు నెంచకన్. 34

ఉ. మేలు లభించు గర్వమున మించిన నాసవతెవ్వతైననన్
గేలి యొనర్చుమంచు కనుగీటెనొ తానె మునీంద్రుడిట్టి వా
గ్జాలము చేతనన్ను విరసంబులు బల్కెనొ మాయవాది గో
పాలుడె యిన్ని వంచనలు బన్నెనొ నిక్కము దెల్పవె చెలీ! 35

మ. తనకేలా ననునిట్టిపట్టిడన వైపక్ష్యముఖుల్ నవ్వ పా
వనమౌనీంద్రుడు మత్ప్రసంగములు దుస్స్వాంతంబుతో శౌరి చెం
తను వేమారెటు బల్కు దమ్ము బహు పెద్దల్గా విచారింతురో
వినయంబొప్ప నమస్కరింతురొ మదన్విశ్వాసముల్ గూర్తురో. 36

మ. ధవునిం బాయువ తెన్నిరంతరము చింతన్ గొల్చుగా జేసె బ్రా
ధవమొప్పన్ విపిషన్మసంభ్రమని సుంపన్ జేసె వంచిత్రయున్
నవతుల్ ప్రేమలు మీరజేసి తను హర్షంబొందె వశ్యక్రియా
జవమేమంచు నుతింపవచ్చు నల! భోజాధీశ సత్పుత్రికిన్. 34

ఉ. ముందటి మోహమాపరణమున్ గృపయున్ సొగసొ రతిక్రియా
సందవిలాసమున్ దనమనంబున నల్పక నన్ను బాసి యా
మందులమారి భీష్మకకుమారిక మాయను లోయిడైన గో
విందుని నమ్మి యెంత యవివేకము చేసితి మందగామినీ! 38

చ. కృప విడనాడుచు న్మరుడు ఘోయని పైకొను వేళయందునే
యపరిమితానురాగమున నార్తి తొలంగగ జేసి తన్నుబల్
నిపుణత బ్రోచుచున్నది గణింపక నన్నిటుజేయజెల్లునా
కపటికి నెంతదెట్టియుపకారము చేసిన మేలుచేసునే? 39

చ. అలుకను బల్కకుండినను హాయని చంచలమొందు మోము పే
రులక ముడుంచు జీరు భువినొద్దిక గద్దరిలున్ వడంకు చే
ష్టలుడుగు రామయంచు వరుసందగ ముమ్మరుబల్కు బాధచే
గలికి! మురారికెట్లు పగగల్గగ నెవ్వతె బోధచేసెనో! 40

మ. అకలంకంబగు యానవాస్యయము నందావిర్భవం బొంది గో
పకులింద్లంబెనుపొంది యిట్టులని చెప్పన్రాని దుష్కార్య సా
ధకుడౌవాని రసజ్ఞుచేతపడన యింతల్ గావటే! కాముక
స్త్రీ పతస్సత్యను చిత్తమంచు భువిలో జానింపరే కోవిదుల్. 41

క. కాపట్యము గనకనివ్వక
నాపై దయగల్గినట్లు నమ్మించుచు దా
నా పద్మముఖిని గొల్చిన
గోపాలుని గుణము మెచ్చుగొనవచ్చు జుమీ! 42

సీ. అంబువచ్ఛాయ, దివ్యాదివ్యపర్యారా
ర్థంబు స్వప్నప్రభుత్వంబు దూర
లక్షితశైల విలక్షణంబాకాశ
సూనంబు జలరేఖ సోమరూప
మమరగా శశవిషాణము నీర సంభవ
భవ బుద్బుదంబు దుర్భర మరీచి
కా జలభ్రాంతి వికాశిత శాల్మలీ
పుష్ప ప్రకారంబు పొందనంద

రాని మ్రాని ఫలంబు విజ్ఞాన హీన
జనుని ముచ్చట వలెగాదె చర్చసేయ
నాగవపుమాట బూటకమంరుతేట
కంసరిపుమాట కడువనగండ్లమూట. 43

క. ప్రకటమగు బూతవిలి మ
చ్చిక సేతల జేరి వగలుచేసిన నర బె
ట్టిక నమ్మరి నా కృష్ణుని
ముకురానన! నన్ను బంతమున నేమరచెన్. 44

ఉ. సోముని వెన్నెలంబలె ప్రసూనము నందలితావి కైవడిన్
హైమమునందు గాంతిగతి నిక్షువున న్మధురంబు వైఖరిన్
గామిని చిత్తవృత్తి మెలగంగల నాథుడు గల్గుటెల్ల దౌ
ర్నోము ఫలంబుగాదె! మృగలోచన! మాటలు వేయునేటికిన్. 45

ఉ. ఏలధనంబు భూషణములేల విచిత్రతరాంబరంబు ల
వ్వేల సుమంబులేల మణులేల యొయారములేల గాన వి
ద్యాలలితత్వమేల నిరతంబు కృపామతితోడ నుత్తమ
స్త్రీలకు మానరక్షణము సేయని కట్టడి భర్త గల్గినన్. 46

సీ. తన తోడ నేమేమి పని విన్నవించిన
నాలస్యమొనరింపజాల దలప !
తోటి తొయ్యలులు నా తోటి దీటుకకు రా
గని సహింపదుగదా కంటుకంతి !
నాయాజ్ఞగైకొన కేయింతి భవనంబు
జేరంగనొల్లదో చిగురుబోణి !
యేసఖుల్ నాతోడ నేమి బోధింతురో
యని భయంపడు చాల వనజనేత్ర !

సరసగతులను నన్నునేమరక తిరుగు
హరిని బరిపరిరీతుల మరులుకొలిపి
తరుణి రుక్మిణి తన యనుచరుని జేసె
నెరుక గల్గిన నతడు నన్నేలమరచు. 47

సీ. వినుత వీణాగాన విద్యావిశేషముల్
సరస కవిత్వ ప్రసంగములును
పాటవ సాహిత్య నాటకాలంకృతుల్
చతురంగ కేళికా చతురతలును
నాట్య పాండిత్య నిర్ణయములు ఘనకళా
శాస్త్రరహస్య విచారములును
చౌశీతి బంధవిస్తార వినోదముల్
పటు చమత్కార వాక్ప్రౌఢిమలును

మెరయ నిరతంబు ప్రొద్దులిద్దరము జరుపు
కొనుచు నెడబాయక తిశయమున సుఖింప
దాసహింపక రుక్మిణీధవశనయన
వాసుదేవుని దనవశ్యు జేసుకొనియె. 48

గీ. సవతి జనములు పైకెక్కెన ధవుడుకరుణ
లేనివాడయ్యె కౌటిల్యమూనియున్న
పడతి! మముబోటివారి కెక్కడి యశంబు"
అని విసికి చింతతోడ డగ్గనములేచి. 49

## —: సత్యభామ కోపాగార ప్రవేశము :—

క. చిర దురభిమాన చింతా
గురుమతి ఘనమేరుకుధర కుహరంబునకున్
జొరబడు సింగపు సతిగతి
సరసీరుహవదన కోపసదనము జేరెన్. 50

గీ. చేరి మణిభూషణాది శృంగారములను
దానె సడలించి పేదముత్తైదువవలె
సమరు మంగళ సూత్రమాత్రము వెలుంగ
మలిన వసనంబు తలకొంగు సమరగట్టి. 51

క. ఈ రీతి యువతి ప్రావృ
డ్ధారాధర వసితసోమ తారుణ్యకళా
సారాంగి యగుచు గోపా
గారంబున నుండె నెవరు గనపడకుండన్. 52

మ. అళినీలాంక కోపమందిరమునం దత్యంత రోషాప్తి చే
బలుపేసారు మురారిదూరు చెలిసంపన్ జీరు బల్మారు చం
చల తన్మీరు ఛలారి యీతడని యంచుంజేరు శయ్యోపరి
న్వెలయం జేయు దురంత చింత మదిలో వేధింపగా నయ్యెడన్. 53

వ. ఇట్లనేక ప్రకారంబుల నలమట వహించి గోవిందుని తనయందు గరుణ లేని వానిగా భావించి నారదుని విప్రలాపంబు లుగ్గడించి రుక్మిణీదేవి గర్వసంరంభంబు తన హృదయశల్యంబుగా దలచియున్న సమయంబున నక్కడ. 54

గీ. నారదుడు చన్నపిమ్మట సరసనాభు
డల్ల రుక్మిణి గృహమున సరససుఖముగ
నుండె నోకదించలేక నిట్టూర్పు పసకు
సత్య కన్నుల గట్టిన సరణి దోప. 55

ఉ. దేవ సుమంబునాకు మునిచెప్పి యొసంగుట నేను రుక్మిణీ
జీవనజాతనేత్ర కతి శీఘ్రము నిచ్చుట విన్నమాని స
త్యావరవర్ణినిన్ బహు విధంబుల గేరడ మాడుటన్ ధరి
త్రీవర కన్యకామణుల దెల్పిన ముచ్చటయున్ని జంబుగన్. 56

క. తావిని సత్యకు దూతిక
యీ విధమంతయును వరుసనెరుక పరచి నా
పై వెడమాయల ముచ్చట
లేవేవి వచించె నొక్కొయిందువదనతోన్. 57

వ. అని నెమ్మనంబునం దలచి. 58

—: సత్యభామా మందిరమునకు కృష్ణుని రాక :—

సీ. గోమైన లేమ నెమ్మోము గన్గొను ప్రేమ
త త్తర పాటొందు చి త్తమునను
చెవులపండువుసేయు చెలి జిల్కుముచ్చట
ల్వారెకు వినగోరు కోరికెలను
మధురాధరమునందు సుధగ్రోలి తనమేని
శాదహరించు సమ్మోదమునను
నతివ గాఢాలింగనాపేక్ష చేతను
జాడ గన్పట్టు బల్వేడుకలను

బాణవేగ మనోవేగ వాయువేగ
ములహసించు రథంబెక్కి లలితగతిని
సత్యభామామణీధామ సౌధసీమ
గదియజని శౌరియట శతాంగంబు నిలిపి. 59

గీ. తేరుడిగి యంత గృహబహిర్ద్వార సీమ
సారథిని నిల్వుమని యదుపీరవరుడు
గవను లన్నియు త్వరతోడ గడచిపోయి
రంజనములేని నగరు తెరంగుగాంచి. 60

చ. ఒకయెడ గీతవాద్యములు నొక్కయెడన్ గవితా ప్రసంగముల్
నొకయెడ నాట్యవైఖరులు నొక్కయెడన్ శుకశారికాది ప
క్షికుల కలస్వనంబులును జేడెల వాఙ్నికరంబు లొక్కచో
నకట! చెలంగు నేడునొకటైన గనంబడదేమి హేతువో. 61

చ. ముని యిటువచ్చి దేవసుమమున్ గృపనిచ్చిన ముచ్చటాదిగా
గను బహుళ ప్రసంగములు కంజదళాక్షికి దూతివచ్చి చె
ప్పిన విధమున్ గనంబడియె బెన్కువబుట్టగనట్లుగాక పో
యిన కడుచిన్నబోవుటకు హేతువులేదనినిశ్చయింపుచున్. 62

గీ. సత్యభామా సఖీజన సంఘమెల్ల
నర్ఘ్యపాద్యాది విధుల దన్నరయకునికి
చూచి తన భార్య కాపత్యసూచకంబె
యని విచారించి వాడల ననుసరించి. 63.

చ. జిలుగు పసిండి చేలములు చిత్రవినూతన రత్నభూషణం
బులు ధనముల్ మనంబలర పూర్ణముగా దగలంచమిచ్చుచున్
లలిత మృదూక్తి మాధురి మెలంగగజేసెను సత్యభామ నె
చ్చెలులను గంసవైరి స్వవశీకృతలై సతిజాడ దెల్పగన్. 64

ఉ. ఆ గజయానలందరు రహస్యముగా సతిజాడ దెల్పినన్
నాగశయాను డంగన మనం బరయంగ దలంచి పొంచి దా
లోగుచు గోపమందిరములో వసియించిన సత్యచెంతకున్
వేగమె చేరెనొక్క యరవింద నిభానన మాటుచేసుకన్. 65

చ. చతురత నొక్కఁ జేసె కరసారస సీమను బూనియున్న భా
సిత మణితాళ వృంతమును శ్రీహరి తాగొని వీవ సత్యహృ
ద్గతమగు క్రోధభోగికి ప్రకంపిత సువ్యజనానిలంబులా
హుతులిడులీల గన్పడియె నింపు దలిర్పఁగ నట్టివేళలోన్. 66

ఉ. ఆ సతి చిత్తవీథికి మహాద్భుతమై యతి రమ్యమై మహో
ల్లాసదమై సుధాస్పద విలాసమునై యచ్చెరువట్టి మే
ల్వాసన రాగగాంచి నలువంకలు నారసి చూచె ముందటన్
వాసవ నీలసన్నిభ శుభాంగుని గోపవధూ భుజంగునిన్. 67

గీ. చూచి కన్నీరు రెప్పల నాచికొనుచు
మునుపటట్లనె మరలంగ ముసుగుబెట్టి
శయ్యపై బవళించిన సఖిని జూచి
పలికె యదువీరు డంత నేర్పలర నపుడు. 68

## —: సత్యభామతో కృష్ణుని సాంత్వన వాక్యములు :—

ఉ. ''అంబుజనేత్రి! చీకటి గృహంబున నుండగనేల కాంచనా
భంబగు నీ శుభాంగమున భవ్యతరాంబర భూషణాళి తో
రంబుగ దాల్పవేల యధరంబున వీడ్యపు సొంపు నింప కి
ట్లుంబవళింపగనేల యిచటన్నిను జూడగ వింతలయ్యెడున్. 69

ఉ. ఆననమెత్తి చూడవు దయామతి గౌగిట జేర్చ వింపుగా
దేనియలొల్కు ముచ్చటలు దెల్పవు మోహము పెచ్చు హెచ్చగా
సూనశరాజిలోన నను జొక్కఁగ జేయవు నేడదేమియో
మానిని ! నీ తెరంగు జెపుమా కడు దోసము మాని నీ మదిన్. 70

చ. కురులు బెడంగు నెన్నుదురు గోము కనుంగవ బెళ్కు నాస సుం
దరత కపోలకాంతి రదనచ్ఛదదీప్తి శ్రుతిద్యుతుల్ సుకం
ధర రుచిరత్వమున్ శుభస్తన ఘనవర్తులతంఘ్రి హస్త భా
సురతను గౌను సోయగము జూచియు నిన్నెడబాయనేర్తునే. 71

సీ. ద్వాదశి సముద్రాబ్ధి వాసునైన భజింతు
నాతి! నీ మోవి పానకము దొరుక
పున్నమ ఏస మొక్క ప్రొద్దులు సలుపుదు
పొలతి! నీ నెమ్మోము బొలుపు గనిన
చవితినాడు గజాస్యు నవలీల గొలిచెద
రమణి! నీ కుచ పరిరంభ మమర
సర్పవల్లభు నం షష్ఠి నాదర్చింతు
చెలువ! నీ నూగారు చెలువు గనిన

కలికి! నీవు ప్రసన్నతగాంచు కొరకు
వేలుపుల నెల్ల నీ రీతి వేడుకొందు
నేడు నాతోడ ముచ్చటలాడు మికను
తరుణి! శృంగార పూర్ణనేత్రజిత హరిణి! 72

చ. అలరు శరంబులున్ జిగురుటాకుల విల్బుడి డాలుమీలు చి
ల్కల బలముల్ తరంగములుగా నల! పున్నమ చందమామ రా
కలకు విజృంభ వృత్తిగల కంతుమహాంబుధి నెట్లుదాటు దీ
వఁగి యొకింత నాయెడ ఘృణాయత నావయు గాక యుండినన్. 73

చ. ఒగులు మనంబునంబొడమి తీవ్రగతింజనుదెంచి ప్రేమఁగ
మ్మగను ప్రియాను లాపముల మన్నన జేసిన వంచకంబు లీ
వగలని నన్నుదొడ్డ పగవానిగజూడకు మవ్యయో! మహా
యుగములు త్వద్వియోగ భరమొందిన వేళలు నాకు జూడగన్. 74

చ. పెదవి సుధారసంబిడక బింకము మీరగ గొంగిలింప కిం
పొదవ రతిక్రియల్ సలుపకూరకయుండిన నీకె దోసమౌ
మదన శరాళికిన్ బెదరి మాటుకు జొచ్చిన నన్నునిట్లు నీ
వదయత జూడనాయమగునా కమలాయత పత్రలోచనా! 75

ఉ. ఇందునిభాస్య! నీకృప యొకించుక నాయెడ గల్గెనేని గై
కొందు పయోధరంబు లరిగొందును మోవి సుధారసంబు చే
కొందు నురోజ దుర్గముల కోయని నీవిడు ముద్దుమెచ్చులన్
గొందు సురేంద్ర భోగమనుకొందును నీవిపుడానతిచ్చినన్. 76

చ. మంపజగంధి! యింతపలమా పలుమాటలనేమి నీకు గా
వలసిన కోర్కులెల్లను ధృవంబుగ గూర్చనా నీ నిజాజ్ఞలో
మెలగనా నీ సపత్నులను మించగ నిన్గడు గారవింపనో
చెలగి భవద్గృహంబున వసించనా నిచ్చలు ప్రేమలుంచనో. 77

చ. కిలకిల నవ్వుటెప్పుడో శుకీ విసరంబులగేరు పల్కులన్
పలుకుట యెప్పుడో కలక బాయుట యెప్పుడో సారెసారెకిం
పులు దళుకొత్త నీకు దయబుట్టుట యెప్పుడో కోర్కెదీరగా
జిలుకల కొల్కి! నిన్ను నెదజేర్చి సుఖించెడి భాగ్యమెప్పుడో. 78

సీ. చెలి! నీ కృపాదృష్టి చెలగు వేళలయందు
మదనుని సుతునిగా మదిదలంతు
సకియ! నీ మోము ప్రసన్నత గనువేళ
చందురు బావమరంది యందు
నువిద! నీ నునుపల్కు చెవులుసోకినవేళ
లీలాశుక స్ఫూర్తి గేలిసేతు
నీయింపు నిట్టూర్పు నాయందమరు వేళ
వరగంధవాహను బావనుగ నెంతు

కులుకు గుబ్బలు నాయెద నిలిపిరతుల
సంచితంబుగ నన్ను దేలించువేళ
విరహులకు శాత్రవులునైన వీరినెల్ల
మిత్రులనుకొందు తావక మైత్రివేళ. 79

చ. పొంతుక లెవ్వాధిన్ గపట బోధలు సేసిరొ నాదుచిత్తమున్
నెఱియగ నీవె కోపము గడించితొ నిక్కముగాదె నేరమో
లలనకొ! వెన్నకంటె మృదులంబగు నీ హృదయంబు వజ్రపున్
శిలవలె బల్కఠోరమును జెందగనేమి విచిత్రమిత్తరిన్. 80

శా. కందర్పాతి శయాంత మాగమము తర్కప్రక్రియం జూచి నీ
సౌందర్యద్యుతి మీద దృష్టిమిగుల న్సంధించి యామీద త్వ
న్మందాలాప సుధారసానుభవ సామ్రాజ్యంబునం దేలి 'యా
నందో బ్రహ్మము'గా మదిం దలతు గాంతా తావకాశ్లేషమున్. 81

సీ. పడతి! నీ పొత్తున గుడువని దినమది
యుపరాగ దినముతో నుపమజేతు
చెలి! నీకు పీడ్యముల్ సలుపని వాసరం
బది హరివాసరంబని తలంతు
తరుణి! నీమోము చందురుని జూడని నిశి
నమవస నిశిగ భావమున నెంతు
రమణి! నీ యాలింగనము పొసంగని నాటి
యా రాత్రి శివరాత్రియని తలంతు

లెమ్మ రుచిభోజనమ్ముగానిమ్మ రమ్మ
కమ్మ కపురంపు విడెము గైకొమ్మ నమ్మ
కొమ్మ! నీవాడననుకొమ్మ నెమ్మొగమ్మ
నెమ్మి ముద్దిమ్మ నెర సమ్మదమ్ము గ్రమ్మ. 82

ఉ. నా చెవి కింపునింపుచు మనం బలరింపుచు బల్కితేని ప్ర
జ్ఞాచతురత్వ మేరుపడ గ్రక్కున గూర్చెద నీయభీష్టముల్
దాచక నాకుదెల్పు విదితంబుగ నీమది బుట్టినట్టి యా
లోచన భీతశంబరవిలోచన మోహిత పద్మలోచనా! 83

చ. అవని చరించునట్టి సకలార్థులపేక్షను ధర్మయుక్తి గా
ర్చి వినగ జెప్పుచున్నవి చేసి సమాలోకించుకేనియున్
జెవి సోరనీని దుష్ప్రభుని చెయ్వున నెవటువారకున్న మా
కవల మికేమి బుద్ధి ధవళాయతలోచన! వేగదెల్పవే. 84

చ. నను దయజూడు కొమ్మ! ఎవనాడకు" మంచు మునుంగు కొంగు మె
ల్లన సడలింపబోవ నదలింపుచు గృష్ణుని జూచి "యింకనై
సునె మరి నీ ప్రసంగములు సొన్పవు చాలు తొలంగు" మంచు గ
ర్జనమున బల్కె నంత నవసారసలోచన యూరకుండినన్ 85

ఉ. ఈ చెలి చిత్తవీథి నుదయించిన కోపభరంబు దీర్ప నే
యోచనయున్ ఘటింపదు నయోక్తులు పల్కిన వంచకంబులై
తోచినరీతి గన్పడియె దొయ్యలికిం బ్రణమిల్లుటే సదా
లోచన యంచు దత్పదవిలోకము జేయ బ్రయత్నుడౌనెడన్. 86

చ. అతని తలంపు లానెరిగి యప్పుడు వోణి హృదంతరాళ గుం
భితమగు చింతచే మిగుల భీతిలి చయ్యన గూరుచుండి "య
చ్యుత! యిటసేయవచ్చిన కుచోద్యములెల్లను గంటి నీవు నీ
చతురిమ భోజపుత్రికడ సల్పు" మనంగను శౌరియిట్లనెన్. 87

ఉ. "దోసములెన్నియైన గృపతో శమియింపుము నేఁ బ్రమాణమున్
జేసెద నీకు గోపమిక జేయకు నిర్దయవాడనేను నో
హో సఖి! లోకమెంచ వినవో యొక సామెత యిద్ధరాస్థలిన్
దాసరి తప్పు దండమున దప్పునటందురు పెద్దలందరున్." 88

వ. అనిన శ్రీకృష్ణునకు సత్యభామ యిట్లనియె. 98

—: సత్యభామ కృష్ణుని తూలనాడుట :—

క. "నీ లక్షణములు తెలియని
బేలనె యిటు జేరి యేల బెల్లించెదు మా
ర్జాలము శీలములవి గో
పాలా! నీయందు వెలయు పండితత్వంబుల్. 90

ఉ. ఎను వచింపనేల జగమెన్నను తావక సుప్రభావముల్
యేనుగు మచ్చికల్ మహీ మహీ ప్రణయంబులు కాలనేమి వి
జ్ఞానములున్ మృగభ్రమిత గానము లంబుతటీ బకాదిక
ధ్యానములున్ సృగాల వినయంబులు దేవరవారికే తగున్. 91

ఉ. కల్లలు ముళ్ళ మాటలు మొగంబున నిచ్చకముల్మరుంగునన్
తుల్లక వాక్యముల్ బహుకుచోద్యము లిచ్చట నందురుక్మిణీ
పల్లవ పాణితో సరసభాషలు ప్రేమలు నీ కవశ్యముల్
పల్లవ కామినీ హృదయ వారిజనందన! నే నెరుంగనే. 92

చ. సరసిజనేత్ర! నీకిటు పొసంగిన కూర్మికి దేవ సంయమీ
శ్వరుడె తలంపసాక్షికల చందము దెల్పెద బంచదారలో
గరళము వంటి వర్తనము గాదొకొ తావక వాక్య వైఖరుల్
సరియిక నీచువంచనలు సాగవు పొమ్మటు ధృష్టశేఖరా! 93

క. ఈ యుక్తులచే నాతో
నాయము ప్రకటింప నామనం బలరె జుమీ!
నీ యుపకృతులే కావా
సాయకముల వంటి ముని ప్రసంగము లెల్లన్. 94

చ. ముని యిటులన్వచింప జలముంగల రుక్మిణి యాలకింప నీ
వును గడు సమ్మతింప సరిబోటులు చాలహసింప మిక్కిలిన్
పని యటులన్సహింప నవివేకము నిన్నను వర్తనంబు చే
సినదిక జాలుచాలును రుచింపవు నీకపట ప్రియోక్తులున్. 95

చ. నిను ననలేల నారదముని స్వచియింపగనేల రుక్మిణిన్
గనయున మారనేల గౌరగాని దురుక్తుల నొందుమంచు నా
వనరుహసూతి నా నొసట వ్రాసిన వ్రాతననంగ జెల్లుగా
కనయము పేరి వాక్పనుట కక్కర యెందుకు గోపవల్లభా! 96

శా. స్తోత్రంబుల్ ముని రుక్మిణిన్ బొగడి సన్ భాషించువేళన్ భవ
ద్గాత్రంబున్ గను హొంగగా ఎసగ వేడ్కల్ పుట్టినా నీకు మా
స్త్రాజిత్తున కీర్ష్యనాయెడ జనించెన్ బోలు లేకుండినన్
గోత్రోర్వాప గుణాన్వితుండవగు నీకున్ నన్ను దానిచ్చునే. 97

ఉ. పోడి యొకింతలేని వలపుల్ప్రచరించగరాదు కృష్ణ! నీ
జాడలు జూడ రుక్మిణికొసంగిన వేలుపు పూవు రావి నా
మేదకు దెచ్చి యాపె యశమే వెలయింపుచు నన్ను నారెకున్
గోడిగమున్ ఘటించు కొరకున్ భవతాగమనంబు గన్పడెన్. 98

క. మొల్ల సుమగంధుంగు నీ
యిల్లాండ్రకు నీకు మనసులింపుగ గన్నుల్
చల్లగగా నా పంతము
చెల్లించెన నేడు జూడు శ్రీఘమె శౌరీ! 99

సీ. ఈ చెల్మికత్తె లేయింటి పంచన బడి
యుండగా వలయునో యొడిగి యొడిగి
యీ సౌధమునను నే భాసురాంగికి సారె
క్రీడింప వలయునో వేడుకలర
నీ దివ్యమణి భూషణాదు లే సుందరి
పాలౌనో యధిక సంభ్రమము మెరయ
నీ శుక శారికా పేశిజ సముదయం
బేరామకడ వసియింపవలెనో

యహహా! యస్మన్మహోద్యాన విహరణాతి
శయము లెవతెకు నీ తోడ నయిన నగునో
యనఘ! సవతులు నను గేలిగొనక మునుపె
వద్దు చెల్లింతుగాక నే భయము లేక. 100

క. చను వక్కఁడ వగలెక్కఁడ
మనసందును లేనపోనిమాటలునిట నీ
పనులెరిగి మోసపోయితి
నిను ననసేమిడికి నాదె నేరము కృష్ణా!. 101

మ. శ్రవణంబుల్ సుఖమొందగా జిలుగు ముచ్చట్లాడగా నేర్తునో
యపిలంబంబున గూడనేర్తునొ ప్రమోదాపాదినై హావభా
వ విలాసాతి శయంబులొ సుమశర వ్యాపారముల్ బన్ని ని
స్నవలీలన్ వలపించనేర్తు నొకా భోజాధీశ కన్యాగతిన్. 102

క. నేనీకు దగిన కాంతను
గానట యిపయారువేల కన్యలు గలరం
చా నారదముని బల్కఁడె
శ్రీ నాయక! వారి పెండ్లి జేకొనువేడ్కన్. 103

చ. మురహర! నీకు మిక్కిలిని మోహము బుట్టుఁగేను రుక్మిణీ
సరసిజ పాణినో మిగుల జాంబవదాత్మజనో తలంపగా
ధరకుచ మిత్రవిందనొ సుదంతనొ భద్రనొ సూర్యపుత్రినో
సరసత గల్గు లక్షణనొ సారెకు నన్ను దలంప జెల్లునే. 104

సీ. భీష్మకాత్మజవలె ప్రియములు నేనేర
జాంబవత్సుతవలె సరసమెరుగ
కాళిందవలె సుఖకారిణి నేగాను
మతిమిత్రవింద సంగతులెరుంగ
భద్రవోలెను నిరుపద్రవస్థితి నేనేర
బంతమాలేదు సుదంతవలెను
లక్షణవలె నిష్కళంకను నే గాను
సాధకై వడి లేదు సాధువృత్తి

ఉ. “అండజయాన! నామదికి సద్భుతమయ్యెను మున్ను నెన్న డి
ట్లుండవు పుష్పమాత్రమునకో ఏను మెంతటికైన నీకు నే
నుండగ జింత నీ వగిచి నొందగ జెల్లునె పోయి తెత్తునా
ఖండలునైన గెల్చి త్వరగా సురభూజమదెంత కార్యమే. 111

గీ. తెచ్చి యుష్మద్గృహారామ దేశమధ్య
మున బ్రతిష్ఠించి నీ మనమునకు బ్రీతి
సేయుదుము నీవు కడు చింత చేయవలదు
చారుగుణధామ! నమ్ముమీ సత్యభామ!” 112

ఉ. అమ్మురఘస్మరుండిటుల నానతి యిచ్చిన మేల్ ప్రతిజ్ఞచే
నెమ్మది జింతబోవిడిచి నిండెను గోర్కులటంచు నప్పుడున్
సమ్మద మొందు సత్యముఖచంద్ర వికాసముచే సఖీచకో
రమ్ముల కేళికాధిక ఖరమ్ములు మించె విచిత్ర వైఖరిన్. 113

వ. అప్పుడు. 114

మ. ఒగి దిక్పాలక కర్ణదేశ బధిరోద్యోగంబుగా మ్రోసె నా
ఖగరాజ ధ్వజ మందిరోపరి మహాఘంటానినాదంబు మ
ధ్య గతుండయ్యెను బద్మమిత్రుడిక స్నానాది క్రియల్సల్పవె
మ్మగపైరిస్తుత! యంచు సారెకు పదాహ్వానంబు చందంబునన్. 115

ఉ. ఆ సమయంబునందు గమలాయతలోచను డర్థకృత్యముల్
దా సలుపన్ దలంచిన విధంబుగనుంగొని సత్యభామ యు
ల్లాసమొనర్పగా బని మెలంతలకుం గనుసైగ సేయగా
నా సఖులంతటన్ జలకమాడగ శౌరికి విన్నవించినన్. 116

—: శ్రీకృష్ణ సత్యభామల స్నానాదికము :—

గీ. అంబుజాక్షుడు సత్యముఖంబు జూచి
కలికిరో! నీవు జలకంబు సలుపుమనుచు
పలుక నిద్దరు కైదండల లవరించి
స్నానశాలకు నేతెంచి సంభ్రమమున. 117

ఆ. రత్నపీఠమునను రాజీవ నేత్రుని
గూరుచుండ బెట్టి కీరవాణి
యూడిగంపు జెలుల కుచిత పూజలు సల్ప
ననుచు జెప్పి చనియె నంతిపురికి. 118

క. హరి ధరియించిన మణిమయ
వర దివ్య విభూషణములు వదలించెను సుం
దరి యొకతె తత్క్షణంబున
శిరసున కభ్యంజనంబు సేయు తలంపునన్. 119

మ. సరులల్లాడగ గొప్పువీడ గుచముల్సందీక పోరాడ గే
సరితోపోరు నుదారపుంగవును భాస్వల్లీల జవ్వాదగా
గర పద్మంపు మరందమాని కచభృంగంబు ల్విరాజిల్లు పై
ఖరిదోపన్ శిరసంటె మాధవునకా కంజాక్షి సంపంగ తై
ల రసభ్రాజిత మస్తకస్థలికి నుల్లాసంబు గల్పించుచున్. 120

చ. మృగమదమున్ జవాజియు సమేళనమౌ హరి చందనంబుతో
సొగసుగ యాదవేంద్రునకు సుందరి యొక్కతె నల్గుబెట్టినన్
దగిన శరీరకాంతుల విధంబవుడేమని చెప్పవచ్చు దా
గుగ నల యింద్రనీలమునకున్ గరసాన ఘటించెనోయనన్ 121

క. గంధామలకంబిడె నొక
గంధేభ ప్రవరయాన కాళీయ ఫణా
దింధిమిత ధిమిత నాట్యో ద్ధు
రంధరునకు యుద్ధజిత జరాసంధునకున్. 122

సీ. ప్రకట యాతాయాత పదమంజు మంజీర
ఝణఝణత్కార జృంభణము మెరయ
మహిత రాటంకాది మణిదివ్య భూషణ
ప్రకరకాంతిచ్ఛటల్ ప్రబ్బుకొనగ

స్థిర శరచ్చంద్రికాకర మృదులాంబరా
ధిక విచిత్రమ్ము తుర్దిశంగప్ప
జలకుంభ ధృతకర జలరుహ భూషిత
కంకణ క్రేంకార కలన పసర

శాతకుంభ కుంభ సంభృతాఖిలనదీ
జలము సముచితోష్ణమలరజేసి
చెలువ లందియివ్వ జెలగి శ్రీహరికిని
జలకమార్చె నొక్క చంద్రవదన. 123

క. తడి యొత్తెనపుడు మరుత
త్తడి బోలిన మెలతయొకతె దైత్యారికి బు
త్తడి వన్నె చేలచే నా
త్తడి బడకుండంగ మృదులత న్విలసిల్లన్. 124

క. విరిబోణి యొకతె వెన్నెల
చౌరపిల్లలవంటి మెరుగు తోరపు గోళ్ళన్
గరమొప్ప దువ్వి నేర్పున
సిరులు చొలుకు నెరుల కపుడు చిక్కులు బాపెన్. 125

గీ. అంగన యొకర్తె బంగరు రంగులడర
చుంగులు పొసంగగ దిద్ది కురంగపకును
హరివశము కాంతి గేరెడు నంబరములు
వెచ్చ యుంచిచ్చె నలదేవదేవునకును. 126

చ. సిరిమెరయన్ గదాని వనిచే విలసిల్లెడు నూర్పరత్న నూ
పుర కటిసూత్ర హారకరభూష శుభాంగద కర్ణకుండల
స్ఫురితకిరీట ముఖ్య వరభూషణముల్ ధరింపజేసె. సుం
దరముగ వాసుదేవునకు దన్వి యొకర్తె విలాసవైఖరిన్. 127

ఉ. గంధమలందె నొక్కరితె కస్తురినామము దిద్దె ముద్దుగా
నిందునిభాస్య యొర్తు పుష్పమెత్తు బరస్థలి దాల్పజేసె నిం
దిందిరవేణి యొక్కరితె యిందిరగొ సద్దమువెచ్చి నిల్పె గో
వెందుని చిత్తముల్లసిలు వేడుక నొక్కతె వధూటి ప్రేమతోన్. 128

ఆ. రత్న పీఠమిడి వియూత్న జలంబుల
హైమ పాత్రికలను సతివలిడగ
బద్మలోచనుండు వగడి సంధ్యావంద
నంబు దేవతార్చనలు నొనర్చె. 129

ఉ. అప్పుడు సత్యభామ జలమాడి శుభాంబరముం ధరించి బ
ల్మెప్పుగ రత్నభూషలును మేన సమర్చి లలాటసీమ సొం
పొప్పగ జుక్కబొట్టిడి పయోజదళావళి గొప్పుజేర్చి మేల్
కప్పుర వాసన ల్వొలయ గాళియ భేదిని జేరవచ్చినన్. 130

గీ. వీరమోహినివలె దను జేరినట్టి
సారసాక్షిని సత్కృపా గౌరవమున
నింపుమణి పీఠిపై వసియింప జేసి
సరస వాక్ప్రౌఢిమల నొప్పు సమయముననుు. 131

—: ఇంద్రా గమనము :—

సీ. మందారమాలా మరందతుందిల సురేం
దిందిరఝుంకృతుల్ గ్రందుకొనగ
మకుటాది భూషణ నికరమణీ విభా
చకచకల్ రవి మరీచికల గప్ప
త్రిణిత్రింశత్కోటి గాణిత ప్రబల గీ
ర్వాణ యోధావరశ్రేణి గొల్వ
కేళీవిజిత పర్వతాళీ నిపాత దం
భోళి విస్తృత బాహుపాళి మెరయ

సితకరీంద్రమునెక్కి సన్నుత విభూతి
ద్వారవతి జనుల్ చూడ దుర్వారభక్తి
వేయికన్నుల నానంద తోయమంద
నింద్రుడేతెంచె నల యాదవేంద్రుగనగ. 132

క. ఏతెంచిన బలవైరిని
జేతో మోదంబు తోడ శ్రీహరి కరుణా
న్వితుడయి చూచు చుండగ
నాతడు హరిపాద జలరుహద్వయి చెంతన్. 132

క. సంతసము తోడ నల వృ
త్రాంతకు డసురారి గూర్చి "యాద్యాయ నమ
శ్శాంతాయ ముని మనోజ్ఞని
శాంతాయ నమో" యటంచు జాగిలి మ్రొక్కెన్. 134

క. మ్రొక్కిన లేలెమ్మని హరి
మక్కువతో బలుకలేచి మది స్రుక్కుచు దా
నిక్కరణి బొగడె బలరిపు
డక్కమలా విభుని జూచి యందరు వినగన్. 135

సీ. "జయ విదర్భావనీశ్వర కన్యకాలోల!
సరస సాత్రాజితీ సురతలీల!
జాంబవతీముఖ షట్సతీ పాంచాల!
సంక్రంద నోపల శకల నీల!
మణి కుండల ప్రభా మండిత సుకపోల!
భక్తలోకైక కృపావిశాల!
సకల వేదాంతార్థ సన్నుత గుణ జాల!
కాంతి విభాసిత కనక చేల!

ముని హృదయ ఖేల! దనుజ దుర్జన విఫాల!
కాంతి యుతఫాల! వరసామగానలోల!
మధుర వాగ్జాల! నిర్జిత మగధ పాల!
భవ్యతరశీల! నందగోపాల బాల! 136

సీ. దండంబు నీకిదె కుండలీశ్వర ఫణా
మండలీ తాండవోద్దండ లీల!
వందనం బిదె నీకు బృందావనాంత గో
బృందావనామితానంద ఖేల!
సేవింపు నీకిదె సేవకలోక సం
జీవన దాన ప్రభావ జాల!
సాష్టాంగమిదె నీకు దుష్టదానవ మదా
నష్టంబ వారణోత్కృష్ట లీల!

మ్రొక్కు నీకిదె మముగావ దిక్కునీవె
మౌని మానసకాసార మదమరాళ!
కలిత దుగ్ధాబ్ధి మణిశాల! కనకచేల!
భవ్యతరశీల! నందగోపాలబాల! 137

క. లీలం దశరూపములు
ద్వేల గతిందాల్చి ధరణి వెలసిన హరి! యో
లీలామానుష విగ్రహ!
పాలింపవె నన్ను లోకపావన! కృష్ణా! 138

క. ధరణీసుతుడగు నరకా
సురుడమరావతికి వచ్చి శూరత నఖిలా
మరుల జయించె హరించెను
వరుణచ్ఛత్రంబు నదితివరకుండలముల్." 139

క. అని విన్నపమొనరించిన
విని చక్రధరుండు "నీకు వెరపేటికి స
య్యన వాని ద్రుంచి నీమది
కనుమోదమొనర్తునో బలాంతక! పురియున్. 140

చ. శతమఖ! నావకాగమన సంగతితోడ ముదంబుగల్గె మా
కతిథివి నేడు నీవిచట సంచితపీఠ భుజింపగాదగున్
క్షితిసుత కార్యమెంత సతిశీఘ్రముగా వధియింతువాని నీ
మతిని నొకింత సంశయము మాను" మటంచు కరంబు బట్టినన్. 141

—: విందు భోజనము :—

ఉ. ద్వారవతీశ భాగ్యమని ధారుణిసోకగ మ్రొక్కి సాదరై
వారము సేయుచుం ద్రిదశవారము గొల్వగ జేరె భోజనా
గారము కృష్ణువెంబడి నగారి విదోహన శుద్ధ వస్త్ర సం
ధారణలాదిగా గల విధానములుం దగసల్పె వేడుకన్. 142

గీ. అపుడు నిర్జర సహితుడై యలరుచున్న
కృష్ణ ననుమతి తలమోచి కెలకులందు
జాణతనముల వింసిల్లు సత్యభామ
నిలయమున గల్గు పరిచారికలు ముదమున. 143

సీ. భోజన శాలార్హ భూరి పీఠములపై
ప్రియముతో గూర్చుండ బెట్టువారు
నవరత్న ఖచిత సుందరములైన పసిండి
కంచముల్ పంక్తిగ నుంచువారు
కొమరు పానీయాబ్బ కుంభము ల్గొనివచ్చి
వంపని చక్కగ నిలుపువారు
బహుశాకపాకముల్ పచ్చళ్ళు నూరుబిం
డ్లారుగాయలు గొని చేరువారు

పంచ భక్ష్యములను వడ్డించువారు
తెలిపి కమ్మని ఘృతములు తెచ్చువార
లలిమ సౌత్రామణి సభాంతరమున
మెలగసాగిరి భోజన నిలయమునను. 144

వ. అపుడు సౌత్రామణివల్లభుండు పులోమజానాయకాది దిక్పాలక వర్గంబును
గనుంగొని యిట్లనియె.

సీ. "అమరేశ! యూపపూపము చవిగొనుమయా
ఘృతము గైకొను సదాగతి సుమిత్ర!
పరమాన్నమింపు సొంపరయు వైవస్వత
కోణప! పచ్చడ్లు కొమరుగనుము
యాదసాంపతి! రసాయనము జూడు సహాదు
అనిల! సువాసనోదనము గొనుము
పౌలస్త్య! వలసిన భక్ష్యముల్ గోరుము
ఈశాన! తీయబారెంపు జూడు"

మనుచు బహుభోజ్యముల రుచుల్ననయమునను
మెచ్చుచును వేడ్కమీరంగ దేవతలను
గూడి సరసంపు ముచ్చట లాడుకొనుచు
కోరికలు మీర శ్రీకృష్ణు డారగించె. 146

చ. పొగచిన కూరగుంపుం బ్రపూర్ణరుచుల్గొనియాడు వారలిం
పగు మిరియంపు చారుంహహా యని సన్నుతి జేయువారు మె
చ్చగ దగు పిండివంటలు వెసంజవి చూచి భుజించువారలై
గగనచరు ల్మురారి సముఖంబున నెంచిరి సమ్మదంబునన్. 147

క. రొంపిగల జలధిలో జని
యింపుట నేకరుచిచేత నిరవొందుట యా
సొంపెంత యనుచు సుధ నిర
సింపుచు సరసాన్నములు భుజించి రమర్త్యుల్. 148

క. ఈరీతి హరియు నిర్జర
పేరులు భుజియించి యంతవేడ్కఁ దలిర్పన్
సార సుగంధాంబులు శృం
గార వతులొసంగ ధౌతకర పంకజులై. 149

క. ఉడురాజ శిలాజగతిన్
ఎడిపిగ గూర్చుండబెట్టి వేడుక లలరన్
విడెము లొసగించె గృష్ణుడు
కడు సొగసుగ జాలవల్లికల పడతుల చేన్. 150

క. కమ్మని పలుకుల వారికి
కొమ్మని యుడుగర లొసంగి గురుతర లీలన్
సమ్మతి బంపిన సురనిక
రమ్ములు నమరావతీ పురమ్మున కేగన్. 151

గీ. అపుడు సత్యాసమేతుడై హరి వినోద
కేళి సలుపుచు గూర్చున్న వేళయందు
దినకరుడు వారుణీ సేవకును జెలంగు
తీరునను జేరె నస్త్రాద్రి చేరువకును. 152

**—: సాయంకాల వర్ణనము :—**

సీ. కిరణ శృంగాళిచే నరుణాభికుడు ధరా
కాంతపై జిల్కఁ వసంతమనగ
నస్త్రాద్రివృక్ష ప్రశస్తమై విలసిల్లు
రవిజపాపుష్ప పరాగమనగ
సూరమాష్టికు డంధకార దంతిని బట్ట
బెంపుజేసిన ననజొంపమనగ
వరుణ పింగనా వరశిరస్థలి దాల్చు
భాస్వన్మణి ప్రభాపటలమనగ

నసమతర దాడిమ పలాశకుసుమ విసర
ఘుసృణ విద్రుమ విసరుహకుంజ పుంజ
మంజు రంజన కరమయ్యె మారుమసలె
నరుణ జరఠాతపంబు భాసురముగాగ. 153

క. తోయజ బాంధవు డరుణ
చ్ఛాయన్విలసిల్లె నపరశైలము నందున్
సాయం సంధ్యాసుందరి
పాయసము భుజించు పైడి పళ్ళెరమనగన్. 154

సీ. గాఢాంధకార రాక్షసవల్లభుడు వెంట
బడిపట్టుకొనునను భయముగలిగొ
చక్రవాకవిహంగ చక్రవియోగార్తి
జూడలేననునట్టి శోకమొదవొ
దూరాగతాయాస భూరినిద్రారతి
గ్రుంకుమెట్టను శయ్యగున్కుటకునొ
పరరాజ పరకర ప్రాప్తమౌ నిజపదం
బనుచింత దూగెడు మనసు పొడమొ

యని జనులు సంశయాత్ములై గనుగొనంగ
నధిక ప్రభదూలి కడుజాలి నంబుమాలి
విహరణము చాలి పశ్చిమ వీచిమాలి
యందు గందువ మీరగా నస్తమించె. 155

మ. కమలంబుల్ముకుళించె గోకముల దుఃఖధ్యానమున్మించె మా
రమదోద్రేకము సందడించె నుడువారంబుల్ప్రకాశించె జా
రమనంబుల్ హరిషించె గైరవజయారంభంబు ప్రాపించె సం
తమసస్తోమము బొంచె వాసరము మార్తాండుండు చెల్లించినన్. 156

క. పులుఁగడి గూళ్ళం జేరెను
జంజంబుల కలమి జారె జక్కవకవలున్
వెలవెలఁబారె కలువల్
కళఁబాసె చకోరసమితి గర్వము మీరెన్. 157

క. తరుణ హరిత్సతి లీలా
పరిచితిచే నంతరిక్షపల్లవికునిపై
నరుణరుచి రసము జిమ్మిన
కరణిన్ సంధ్యాతిరాగ కలన దనర్చెన్. 158

సీ. పశ్చిమాంబుధిగత పాతాళ సుచిరత్న
ఫణిఫణారత్న ప్రభాపటలమొ
సమయాత్మనిష్కుట సముదంకురితదళ
మహితశోణాశోక మండలంబొ
వారుణీ ద్వీప సంభవ శుంభదుత్తాల
సరసవిద్రుమ లతా సముదయంబొ
విరహిజన జనాభిసరణ మీనాంక కృ
ద్ఘనరక్త పటకుటీకానిచయమొ

తపన హయపంక్తి ఖుర తాడితావధూత
శాతకుంభాభ నూతన ధాతురాగ
జాత చరమాద్రి భవక రజప్రకరమొ
యన మెరసె సంధ్య విటవిటీ జనములెన్న. 159

—:అంధకార వర్ణనము:—

ఉ. చింతల వేగి యొంటిగ వసించి పరస్పర దర్శనాప్తి ధీ
మంతులు నౌ విటీవిటుల మానధనాపహృతార్థి యైన యా
కంతుని మాయకుచ్చు పొడికైవడి మిక్కిలి కారుక్రమ్ముచున్
ధ్వాంతము నిండ బర్వె వసుధాస్థలిపై దశదిఙ్నిగూఢమై. 160

వ. ఆ సమయంబున. 165

సీ. ఒక విటసంకేత మొకకాంత చేరిపే
రొకడాట గనక పుచ్చిక బెంగు
నొకనాతి ప్రీతి వేరొకని యొద్దికి బోవ
గికురించి యొకడు సందుగొని కవయు
మకరాంకకేళి భర్తకుసౌఖ్య మిట్టించి
యొకలేమ తగువల్లవికుల బొదవు
నొకని పిల్వగబంచి యొకచోట నుంచి వే
రొకనితో నొకతె యొద్దిక జరించు

ఘూరి గాఢాంధ కామాంధములు సహాయ
మగుచు తమువేగిరింపగా నిగురు బోండ్లు
సొగసు కాండ్రను దొంగతూపు శూరువగల
వేచి తిరుగుచు రన్ని శివేళమందు. 166

క. సర్వకులటాంగనలకున్
దుర్వహమై మిగుల భయము దోచగ గళలుం
బర్వగ జీకటి విరియగ
బర్వేందుండుదయ శిఖరిపై నుదయించెన్. 167

క. మదన క్ష్మాపతి లీలా
స్పదమతి నుదయాద్రికృతక శైలస్థితుడై
పదయుగము విడువ నాడన్
గసిన తెల్లిగ్గద్ద పదుపుగతి శశి మెరసెన్. 168

ఉ. సురలను వింత పొందు తొగజోటికి రేటెకిపట్టు గట్టు కూ
తురుదొరసొమ్ము వమ్ముసెలిదొంగిను గంగనదీని రావితా
మరలను కీడు జోడుహరిమాటకు రేపకమేర దారగా
పరులకు మున్పు మెప్పుగురుణాయకు నాయకుదొంచె ముంచెసన్. 169

క. మనసిజదేవ మహోత్సవ
మొనరింప నిశావధూటి యురు విభవముగన్
వనరుహ భవాండ భవనం
బునకిడు గచ్చనగ మెరసె బూర్ణజ్యోత్స్నల్. 170

వ. వెండియు సప్తాంతరీక మంటపంబున దంచి మెరసి వర్షించు పండువెన్నెల లజాండకరండంబునందు సముమోరప్ప్యంపు పిచండిలంబుగా నిండించు కర్పూరాఖండ పాంశుత్వంబు నంగీకరించుచు, ఖండపరశు చండత రాట్టహాసంబులు రసాస్థలంబున వెదజల్లిన విధంబునం భాసిల్లుచు, సఖండలత వేసంవరాజ రాజవతంస మండల దండాహతారక్త ప్రకాంత పాండిమంబు బెండు వడజేయుచు, పక్షిజధ్వాంత రక్షోవల్లభ విక్షోభన దక్ష శశి నృహర్య్రక్షోదయరాగ రక్త సిక్తాంగ ప్రక్షాళన విచక్షణ త్రయక్ష విధి హరిముఖ సురాధ్యక్ష విరచితాంతరిక్షధునీ ప్రవాహ పూరంబులన విడంబించుచు, నిఖిల తరుజాలంబుల సురసాలంబుల పోల్పింగను పట్టజేయుచు, కైరవంబులకు సంతోషపూరంబు మేర మీరన్ ఘటియింపుచు, బహుళక్షుధార్తి చకోరార్తి సమాజంబులకు బుభుక్షాస్ఫూర్తి నిర్వర్తిల్ల జేయుచు, నిండుకాంత సౌధధరాధరంబులపై సెలయేటి ముత్తంబులు జలజల ప్రవహింపజేయుచు విశ్వవిశ్వంభరా వ్యాపకంబై శోభిల్లె; నయ్యెడ వెదవిలాసుడు చిడిముడిపాటున మడుకడర జెరుకుగడవింట వెడవెడ నదరించు చెడిదంపు టంపరలకు సుడిబడి గడగడ వడంకు పడతుల మచ్చిక నుడువుల నెనరు గడలొత్త లాలించు గడుసు విటులును, విటజన చిత్త రంజనాయత్త చిత్తజాత వికార సంభూత కిలకించితాది శృంగార భావచేష్టా విరాజమాన భువనమోహన వసతులగు జారసతులును, సతులకును వసతులకు నితరేతరస్నేహాతి శయంబులు వితతంబుగా నతికించు చతుర వాక్ప్రతతుల నతిప్రౌఢలై యానుగోవులగతి మితరహితంబుగా జరియించు శంభళీసతులును, వసతు లగు సంకేత స్థలంబుల ప్రాణసమానులగు భుజంగుల నిలువ నియోగించి కర్పూర మిళిత పాటీర పంకంబులు పొంకంబుయగా నెమ్మేనులంగలయ నలందుకొని యతి మృదుల ధవళపరిధాన ధారిణులై ప్రవ్యక్త ముక్త

దామంబులు నవవికసిత మల్లికా కుసుమమాలికలు నిబ్బరంబుగా బ్రబ్బి
కొని యుప్పరంబగు శిఖాప్రగల్భ గుబ్బలపై నర్తనంబులు సలుప,
నిగనిగమను వగగల మగరాల నిగుడించిన వాటికంబుల దీప్తులు
విరహభవశర కపోల ప్రకాశంబులు స్మిత చంద్రికలు ముప్పిరిగొన
నిజనివాసంబులు వెడలి సౌంగంబులైన చంద్రవరశాల పొలుపున బ్రాణ
వల్లభుల నుద్దేశించి చను నభిసారికా కదంబములును, రసాల తా
హింతాల ఖర్జూర నారికేళ తరుజనిత మధురసంబులు పటికంపు గిన్నెల
మెరుంగు నెలరాచిప్పల మధిరాసుకోరల పూరంబుగా నించిమించిన
వేడుకలరార వంచకంబున రసమునుంగు సంచయాసక్తు. గింపుదనం
బున నిచ్చిన హాలాపానమదంబున తబ్బిబ్బు మాటలాడు దివ్యోకవతుల
యధరంబు సుధలుగొని యుబ్బిన చనుగుబ్బలు తమయురంబు లద
రంగ గౌగిలించి చౌశీతి బంధంబులన్ గ్రీడించు పల్లవశిఖామణులును,
మంజిష్ఠగితంబులై హంసతూలికా కల్పితంబులగు పర్యంకంబుల మీనాంక
కేళీకేళి, మానటుమ్మలం జేరి యరమోడ్పు కనుంగవంతో నిద్రించు
వధూవరులును, వయోవరులు నింద్రవసించుట్టిమ ప్రదేశంబుల బ్రతి
ఫలిత ఋషంబులు రంగస్థలాలంకృత ప్రసూనంబుల విధంబుల భాసిల్ల
మృదంగతాళ వీణావేణు విశేష వాద్యంబులు మధురంబులుగా మెరయ
సరస సంగీత వాద్య ప్రవీణలై మెరయు వారకామినీ జనంబులతో
వర్తించు సరసులును, సరసుల గల కుముద సముదయంబులపై దత్ప
రాగంబులేచి మరందపాన పరవశ భృంగంబులనేచి రాచనవతల
కలధౌత సువర్ణమయ సౌధంబులపై వాసి లోచనసానందకరులైన తరుణీ
తరుణుల రతిశ్రమంబవనయించు మృదుమందమలయానిలంబులును,
మలయానిల చంద్రశ గోస్తనికాయమానంబులం బ్రవేశించి తద్వివరం
బులం జొరబారి యధోభాగంబులం గనుంగొని వంటయిన బ్రేటులాడు
చంతుని మత్తదంతులబోలిన కాంతానికరంబులును, నికరంబులగు
ముకుర ప్రకరంబులగేరు సుకపోలంబులంగల శుకవాణుల పంజర
బంధంబులపై జకెలిగల మకరకేతను శరమ్ముల సరమ్ములు సుధ
మధురమ్ములుగా నలంకరించు రాజకుమారవరులును, కుమార సమ్మిత
రూపవయోవంతులైన నిజకాంతుల కౌగిలింపలు సడలునను మరంత

చింతాస్వాంతంబులంచే నిశాంత సమయం బగుటయు నెరయ పద్మినీజాతి కాంతా సముదయంబులును, సముదయ నాగరసమూహంబులై నాయక సహచరులగు పీఠమర్ద విదూషకచేట విటాదికంబులును, విలాస విలాసినీజన మహోల్లాస భాసమాన చతుర భాషామనీషా విశేషాతిశయం బుల నయంబులైన ప్రసంగంబులుం గలిగి యనంగరాజు మహదైశ్వర్యంబు చందంబున విరాజిల్లు నాసమయంబున వాసుదేవుండును సౌధాజిరియును అనర్ఘగారుత్మత రత్న చిత్ర స్తంభ విభ్రాజితంబును, మహేంద్రనీల వజ్రవిద్రుమ విటంక స్థూల జాలంబును, నవమణిగణఖచిత కళాశాస్త్ర రచిత జాలకబంధ సుందర సౌధభంజి కాపుంజరంజిత కుడ్య ప్రదేశంబును, వివిధ విచిత్రాంబరబద్ధ నిర్మల ముక్తామయ గుచ్ఛా లంబిత నూతన వితానంబును, దేదీప్యమానదివ్యమణిదీప దీపితంబును, ధగద్ధగాయమాన నిష్కళంక ప్రభావిభాసిత పురుషప్రమాణ దర్పణ విలసి తంబును, మృగమద సంకుమద కర్పూర చందనాది నానావిధ పరిమళా ధిష్ఠిత పద్మరాగమణి పేటికా సమేతంబును, పారావత పతగ వ్రాతకు కూజితంబును, కనక పంజరాంతస్థ మధురాలాప శుకవిరావితంబును, పరిచారికామణి ప్రతిమాభిరామంబును, సువర్ణలేపిత లవంగ పూగనాగ వల్లీ దళ భాజనంబును, పరిశుద్ధ సుగంధోదక భరిత నవమణిగణఖచిత ప్రతిగ్రహ యోగ్య పాత్రంబును, నాభోగ భోగంబులంచే నయనానంద కరంబైన శయనాగారంబున వివిధంబులైన మదనక్రీడల తృప్తిబొంది నిద్రాముద్రితనేత్రలై శయనించి రంత. 171

గీ. రాత్రి తన స్వాధికారభరంబు చాల
తక్కువగుటకు చింతించి తత్తరించి
వైరియైనట్టి యినుడు పైవచ్చుననుచు
చంద్రుడరిగెను నస్త గిరీంద్రమునకు. 172

క. చోరులడగి జారుండగి
మారుంగాంగి మృగాంకమండల శోభా
చారుతర ధాగధగి బహు
తారావళి నైగనిగి పసంపడి జారెన్. 173

క. శుకవాహాధిక రమ్యా
ధిక మోహానుగత సురతపీడిత యువతీ
నికరైక విభీకరముగ
గృకవాకము అరచె గొక్కొరోకో యనుచున్. 174

సీ. సమయసిద్ధుడు క్రియా సముదాయంబుంచేత
ఘటియించు నూతంపు ఘటిక యనగ
గాలవర్తకుడు స్వోత్కర్ష చేతంగట్టు
డంబైన ముక్తా ఫలంబనంగ
ప్రాక్సతి ముక్కరపై గీలించిన
కొమరైన తెలివెండి గుండనంగ
విరహులన్మృగముల వేటాడి చాలించి
చను మదనుని చేతి శంబమనగ

జిగి మిగుల గలిగి వట్రువ సిరుల జెంగి
తొగలరేనికి నాపవల్దోచెననుచు
వగల వెంబడి జను పడవాలు పగిది
టక్కు చెలువొంద నలవేగు చుక్క పొడిచె. 175

ఉ. అంత నిశాంత యామవతి యన్సతి కాంతుడు పశ్చిమాద్రికిం
తెంతనరాని చింతజసద తృతతిజాడను బోవ నాసికా
ప్రాంత విభూషణ స్థగత భాసిత మౌక్తికమో యనంగ స
త్స్వంత వలక్షకాంతిని విహాయస వీథిజరించె శుక్రుడున్. 176

క. హరి హరిదంబా వేదీ
ధర పరిచిత దళన వసు బంధూ నవ
స్ఫుర దరుణ ద్యుతులోయను
నరుణ ద్యుతు లుదయ శిఖరి నల్లన బట్టెన్. 177

## -: శ్రీకృష్ణుని మేలుకొలుపు :-

గీ. వంది మాగధజనములు వాసుదేవు
సన్నిధికి వచ్చి మిక్కిలి సన్నుతింప
జొచ్చిరతులిత మధుర వచోనిరూఢి
పద్యశశ్యార్థ్య సుగుణ విధానముఁగను. 178

చ. "జయజయ దేవకీ తనయ! సారసలోచన! యాదవాన్వయా!
జయజయ రుక్మిణీ రమణ! సారసగర్భము ఖామరస్తుతా!
జయజయ పాకశాసన ప్రసన్నిభదేహ! ఖగేంద్రవాహనా!
జయజయ భక్తవత్సల! నిశాచర మర్దన! శౌర్యవర్ధనా! 179

సీ. శ్రుతి చోరకుండైన సోమకు ద్రుంచిన
మీనరూపస్వామి! మేలుకొనుము
గిరినీటమునఁగ నుద్ధరణ మొనర్చిన
మేటి కూర్మాధిప! మేలుకొనుము
దితి సుతుమర్దించి క్షితినుద్ధరించిన
కోలాధినాయక! మేలుకొనుము
ధర్మకశ్యపు జేరి భక్తుని బ్రోచిన
హేలానృకేసరి! మేలుకొనుము

కేలి బలినొంచు వామన! మేలుకొనుము
మెరయు నృపహార భృగురామ! మేలుకొనుము
చెలఁగు రావణాంతక! మేలుకొనుము
నీలవసన హలాయుధ! మేలుకొనుము. 180

గీ. త్రిపుర సతుల వ్రతముఁ జపహరించు
మేలుగఁ బుద్ధరూపక! మేలుకొనుము
కలికివయ్యును దుష్టుల గర్వమణఁచి
మెలఁగి శిష్టు పాలింప మేలుకొనుము. 181

క. చీకటి యను మదనునిపై
బ్రాకటమగు పూర్వకుధర భవుడుగ్రత నా
లోకించు నుదుటి కన్నన
నా కమలాప్తుండు పొడిచె నగరిపుని డెసన్. 182

క. జక్కవలు సొక్క తొగసిరి
వక్క చకోరములు స్రుక్క ధాత్రీవిబుధుల్
మొక్క వమంబులు గుహలం
జిక్క నినుండుదయ శిఖరి శిఖరము నెక్కెన్. 183

గీ. ఓలి డెబ్బదిరెండు నియోగములును
సలుపు దాసులు వాకిట నిలిచినారు
చేరి మీ సేవ లొనరించు చిత్తములను
మేదినీనాథ! శ్రీకృష్ణ! మేలుకొనవె." 184

వ. అని పలుకుచున్న వంది మాగధ వాక్యంబు లాకర్ణించి మేలుకాంచి
ప్రాతః కాలకృత్యంబు లాచరించి వెడలి చని. 185

సీ. వరుసతో దేవకీ వసుదేవుల భజించి
సీరపాణికి నమస్కారమొసగి
తనరార నుగ్రసేనునకు దండముబెట్టి
సేవించి సాత్యకిం దీవనొసగి
ప్రద్యుమ్న సాంబుల ప్రణతులు గైకొని
కరుణతో సుతులను గారవించి
సకలసేనాధినాయకుల మ్రొక్కులుగొని
చెలువొంద నిజసభాసీనుడగుచు

ప్రాణ సఖులును రాజులు బంధుజనులు
హితులు కవి గాయకులు పురోహితులు గొలువ
గొలువునను మంత్రిజనులను గూర్చి పలికె
నరక సురరిపునాథుని నడకలెల్ల. 186

—: శ్రీకృష్ణుడు నరకునిపై దండయాత్రకు సిద్ధపడుట :—

మ. "వినుడీ! భూమికుమారదైత్యుని మహావిద్వేషకృత్యంబులున్
ఘనముమ్మొగ్గరు దోరగామర బసద్గంధర్వ దిక్పాలకా
ది నివేశంబులనెల్ల గొల్లగొని వేధింపంగ జొచ్చెన్ ద్వరన్
జనివానిన్వధింపకున్న బహుదోషంబుల్ భువిన్ బుట్టెడిన్. 187

ఉ. కొంకణ చేంకణ ద్రవిడ కోసంకేకయ మాగధాధి రా
జాంకములన్ హరించియు, భయంబొసరించెను వారలన్నిరా
తంకము గాగ దత్సుతల దక్కక చక్కని వారినందరిన్
బింకము తోడ బట్టి చెరబెట్టెను లీల పదారు వేలకున్, 188

క. వాగ్జాలము పని యేమీ?
రుగ్జనకము పరులకది పరోక్షము కనగా
దిగ్జన పతుల కసాధ్యము
ప్రాగ్జ్యోతిషపురము నెంత బలవంతులకున్. 189

ఉ. సేనలు జేరరాదు విలసిల్లగ లగ్గలు బట్టిదీసుకో
బూన దరంబుగాదు వెరవుం గడులేదు మహాపరాక్రమ
స్థానమదెట్లు చూచినను సాహము గూడదు సేను దక్కయే
మానవ నాథుకైన తరమాయది సాధ్యము సేయ నిద్ధరన్. 190

క. భూచరుల కసాధ్యంబిది
ఖేచర మార్గమున జనియు గినుకను నా దో
షాచరుని వధింపగ దగు
లోచన పర్వంబుగాగ లోకుల కెల్లన్. 191

వ. అని వినతా తనూభవుం బలుకుటయును. 192

## —: గరుడాగమనము :—

శా. పక్షక్షేపణ జాతవాతహతి దిగ్భాగంబులల్లాడగా
నక్షత్రోత్కర నిభ ప్రభాననము పూర్ణజ్యోత్స్నలం గప్పగా
నక్షీణంబగు దేహరోచులను బాలార్కద్యుతుల్మీరగా
బక్షీంద్రుం డరుదెంచె మాధవుని శ్రీపాదాబ్జముల్ గొల్వగన్. 193

గీ. పెన్నిధానంబు గనుగొన్న పేదరీతి
నీరదంబును గనుగొన్న నెమ్మిలీల
నంబుజారిని గను చకోరంబు పగిది
సభను హరిగని ముదమంది సన్నుతించె. 194

గీ. "అఖిల వేదాంత వేద్యాయ యఘహరాయ
పావనాయ మునీంద్ర హృద్భావనాయ
రాక్షస హరాయ దీన సంరక్షణాయ
ఘననిభాయ నమోనమో" యనుచు మ్రొక్కె. 195

గీ. మ్రొక్కినను గాంచి నెమ్మది ముదము బెంచి
హస్త మస్తక సంయోగ మది ఘటించి
మేను నివురుచు దన సన్నిధానమునను
గూరుచుండగ నియమించి కుశలమెంచి. 196

వ. ఇట్లా దరింప హరిం గనుంగొని వైనతేయుండిట్లనియె. 197

ఉ. "దేవరవారి సేవకుడెంచితి మీరు దలంచినంతలో
వావిరి మీకుపెంపొదము వాంఛితముండగ నాకు దెల్పుడీ"
నావిని "భూమినందనుడనంపగు దైత్యుని మీద యుద్ధమున్
గావగ వేగ రమ్ము నరకాసురునిన్వధియింపగా దగున్." 198

క. అనవిని సంతోషము దన
మనమున బెనగొనగ నురగమర్దను నంతన్
ఘనముగ మేనుప్పొంగెను
వనితము పిఱుంకు సమరమతి పేర్కొనఁగా. 199

వ. అంత శ్రీకృష్ణుండు శంఖ చక్ర గదా నందక శార్ఙ్గాది సాధనంబులు ధరియించి యుద్ధసన్నద్ధుండై ప్రయాణోన్ముఖుండై దేవకీ వసుదేవోగ్ర సేన బలభద్రాది గురుజన ప్రముఖులచేత ననుజ్ఞాతుండై గరుడవాహనా రూఢుండగు సమయంబున సాత్రాజితీదేవి సన్నిధానమునకు వచ్చి యిట్లనియె. 200

—: సత్యభామ యుద్ధమునకు వత్తుననుట :—

క. “వల్లభ! నీతో మది రం
జిల్లగ వచ్చెద “నటన్న” శీతాంశుముఖీ!
కొల్లలుగా వేడ్కలు వెద
జల్లుచు గన్గొనగ నీళ్ళ చల్లాటలదే. 201

క. అళి ఝుంకృతులే దంతా
వళ ఘీంకృతు లీ శుకాళి భాషలె హయహే
షలు కంకణ నిక్వణన
మ్ములె రథనేమీ నినాదములు తలపోయన్. 202

క. చెలుల పురస్కృతులె భటా
వళుల తిరస్కృతులు సాధువాదంబులె యో
ధుల నాదమ్ములు వీణా
కలరవములె వినగ జాపగుణనిస్వనముల్. 203

క. దురమెక్కడ నీవెక్కడ
నరుదేరగ నిలువు “మని పలికిన” నీ
మరుగున నుండుగ నాకీ
వెరపేటికి నాదుమాట వినుమిటు కృష్ణా! 204

క. నీ వెంట వచ్చి దైత్యుం
నీ వనిలో గెలువజూచి నీ జయవార్తల్
నీ వెలదుం గందరకును
వాకిరి వినిపింతు మరలివచ్చెద వెన్కన్. 205

క. నను రావల దననేటికి
చనుదెంచెద"ననిన నవ్వె సమ్మతి నిటు ర
మ్మని ముందర నిడుకొని తా
వనజ దళాక్షుండు గరుడవాహన మెక్కెన్. 206

## —: సత్యాకృష్ణుల ప్రస్థానము :—

క. అప్పుడు గరుడడు రెక్కలు
విప్పి నభంబునకు నెగసి వేగమె చనుచో
నప్పద్మాక్షుడు సతితో
నిప్పుడమిం జూపి చెప్పె నిట్లని వేడ్కన్. 207

క. "అందమగు పురులు కరులును
స్యందనములు హరులు వారిజంబుల కొలనుల్
సుందరవనములు నయనా
నందము లగు కనుగొనంగ నాళీకముఖీ! 208

మ. ధరణీమండలి వింతజూడు తరుణీ! తార్క్ష్యోపరిస్థాయివై
గిరులన్నిర్ఝరులం దటాకముల నాక్రీడా ప్రదేశంబులన్
స్థిరమై యొప్పు నదీనదంబులను విచ్చేయుద్విజశ్రేష్ఠులన్
సిరులన్నించిన దేవతాస్థలులలో సేవల్ప్రమోదంబులన్. 209

క. అని యిట్లుం బ్రియు రాలికి
మనమున సంతోషమొదవ మార్గముతోడన్
గననగు వింతల జూపుచ
జనియెను శాత్రపుని పురికి సామీప్యముకున్. 210

క. "ఏను! మన జయము సిద్ధము
సనుపొందగ మంచి శకున మయ్యెం దరుణీ!
యనుకూల మందపవనము
గనుగొన నామోద సూచకంబై తోచెన్." 211

శా. ఈలీలం సరసంపు ముచ్చటలచే నింపొందు సత్రాంగనా
జాలా రత్నము దాను దత్పుర సమీపస్థానమం దొక్కచో
శైలాగ్రంబున నిర్మల స్థలిని వృక్షచ్ఛాయలం జేరి గో
పాలుండుం దన తాప దీర్చుకొనగా బాలించుచో సత్తరిన్. 212

క. ఆస్తరణము గరుడండిడ
సుస్తనియుం దాను చాల సొంపుదలిర్పన్
స్వస్థముగా గూర్చుండిరి
నాస్తను తాంబూల చర్వణాది విధులచేన్. 213

క. అక్కడ భూసుతు పురమున
మొక్కరమున దుర్నిమిత్తములు బహుదోచన్
రక్కసుడు తనదు సభలో
బొక్కుచు దన మంత్రివరుల బొడగని పలికెన్. 214

## —: నరకుని మంత్రాలోచనము :—

మ. "పగలే కూయ దొడంగె ఘూకములు సత్ప్రాసాద దేశంబులం
బగులుంబుట్టి వరత్నపల్లములు వాపోవంగ జొచ్చెస్మదిన్
వెగడుం జెందగ గాకసంఘము మహా భీమంబుగా మ్రోసె నే
పగిదో తోచదు నిర్దిశంబున మహోత్పాతంబులుం బుట్టుటల్. 215

మ. మును భూలోకము రాజులం గెలిచితి స్ఫూర్తి ప్రతాపంబునం
జని స్వర్గాధిపుడైన యింద్రుని మహోత్సాహంబు బోజేసితిన్
ఘనునగ్నిన్యముని న్నిశాచరపతిం గాండాధిపు న్వాయువున్
ధననాధుం శివునిం జయించితిని యుద్ధ క్రీడ చెన్నారగన్. 216

క. నా కెవ్వ డెదురు లేడని
లోకంబున పిరుగుచుండి లోకులు మెచ్చన్
శ్రీకృష్ణుండను యాదవు
డా కంసుడాదిగా మదాపుల ద్రుంచెన్. 217

ఉ. కంటకుడైన యాదవుని గర్వమడంచక యున్న మిక్కిలిన్
గంటికి నిద్రవచ్చునె సుఖంబులు జెందెడి వృత్తి మానసం
బంటునె వైరికోటికి భయంబులు బుట్టునె కీర్తి వచ్చునే
బంటు తనంబుచేత సులభక్రియ వాని వధింపకుండినన్. 218

క. ఆలోకమైన నమృతము
హాలాహలమైన పగిది నరులను లీలన్
దేలగ జూచిన పనిచెడు
వాలాయము ద్వారవతికి వడి జనవలయున్." 219

వ. అనుచుం దనయెదుటం దోచిన దుర్నిమిత్తంతబులు తన మరణ సూచకం బులని విచారించక దుర్మదంబున దుర్గర్వంబుచెంది సేనాధిపతింగనుం గొని "నీవు సమస్త సైన్యంబుల గట్టాయితంబు గావించు" మని చెప్పి మంత్రులం గనుంగొని "మీరు మీ బలంబుల గూర్చుకొని రండు ప్రాతఃకాలంబున దండయాత్రకుం జనవలెనని చెప్పిన వారలనుమతించి యిట్లనిరి. 220

ఉ. "దేవ! భవద్బలంబునను దివ్యుల గర్వమడంచి పుచ్చవా
భావంబయంబు రాజులను బోరులలో వధియించి వైవవా
కేవల యాదవాధముడు కృష్ణుడొకండు భవత్ప్రతాప స
త్పావక కీలలంబడియు భస్మము గాకెటు నిల్వ నేర్చునే. 221

ఉ. ఆవరణాప్రియుం బంధులాది చరాచరములభరించు భూ
దేవికి నందనుండవు మదిన్విలసిల్లగ సత్యశౌచ యు
త్పావనమూర్తి వెన్నిట నభశ్చరులాదిగ లోకులెల్ల నీ
సేవలు సల్పగోరుదురు చిత్రమె నీ కొక కృష్ణుగెల్వగన్. 222

క. దేవర పరిణామంబే
జీవనమని కోరుచున్న సేవకుల మమున్
భావించి పంపు మేపని
గావలసిన దీర్ఘగళము కాళ్ళపిరసయా ! 223

ఉ. ఏము పరాక్రమంబున జయింతుము పంపు జయింపకుండిన
న్నేమరి పాటునైన వినయేచ్ఛఘటింపుచునైన సాధు గో
త్రామర వృత్తినైన వివిధంబగు మంత్ర మహౌషధంబులం
భ్రామక మొందజేసి సదుపాయము నన్వధియింతు మిప్పుడున్.'' 224

క. అనవిని మంత్రులతో భూ
తనయుం డిట్లనియె "దైత్య దానవ మాయం
జని త్రుంచుట యర్హమె బహు
ఘనులకు యుద్ధమున రిపుల ఖండింప దగున్. 225

గీ. మీరు మీ బలంబుం గూడి మేల్కొ గలిగి
నగర మీరాత్రి కాపాడదగును మీకు
జేరుడీ యిండ్లకని'' సెలవొసంగి
తాను జనెనంతిపురికి నిద్రాభిరతిని. 226

క. ఓ మోహనాంగి! సత్యా
కామిని! సంధ్యా సమీపకాలం బయ్యెన్
నేమరి యుండరు దనుజులు
నీ మేరనె చనగవలయు నిది వేళ సుమీ. 227

క. లేలెమ్మా యోకొమ్మా !
బాలారత్నమ్మ! తార్క్ష్యుపై గూర్చొమ్మా
వాలాయము భూతనయుని
ప్రోలెల్లంజెరిచి గాసి బొంపెంపవలెన్." 228

క. అని సత్యభామ తోడను
వనజేక్షణుడంత గరుడవాహనుడై భూ
తనయుని పట్నము దగ్గరి
పెనుపువ సేయంగదలచి ప్రియకిట్లనియెన్. 229

క. "వెనకక యిట్లార్భ్యాండిన
మనపై యుద్ధంబు సలుప మహిసుతు డే లీ
లను జనుదెంచును వానికి
గసలుం బుట్టుకు దుడుకు గావించవలెన్." 230

వ. అంత. 231

## -: కృష్ణుని ప్రాగ్జ్యోతిషపు ముట్టడి :-

చ. గరుడపదోద్ధతి న్నిశితకాండరుహాశని పాతపద్ధతిం
గురుతర మేరుసార పటుఘోరగదాహతి నుగ్గునుగ్గుగా
ధరబడ గ్రూంద్రోచె వితతంబగు కోటలు క్రొత్తడంబులుం
స్ఫురితములైన గోపుర సమూహములుం బహుకేళికావనుల్. 232

సీ. పటుజల దుర్గంబు బడబానల శర ప్ర
యుక్తి తోడుతను దచ్ఛక్తిదవలె
గంధవాహాఖ్య దుర్గంబు పర్వత బాణ
సంధానమున దాని జవమడంగె
నగ్నిదుర్గము వారుణాస్త్రఘాతంబున
జల్లారి బహుతదుచ్ఛ్రయము మానె
లోహాది దుర్గసమూహంబు వజ్రమ
యాంబకంబులను జూర్ణంబులయ్యె
మాముకొన పురజనులందు చోటులేక
పాటవంబైన హరి శరఘాటికపుడు
మామువలు గూడి యలకాల కూట హరుని
బాడి మొరపెట్టె నసురకోటులెల్ల. 233

క. మురహరుఁ డిటులఁ ద్రుంచెను
కరహేలం బోరణము లవ వ్రయల కోటుల్
ధర సూర్యుఁ డోలె గనచే
సరఘన గిరినొత్తి దాంచె జన్యంబంతన్. 234

—: ముర మురపుత్రులవధ :—

క. ఆనిబిడ ధ్వనివిని పం
చాననుడగు మురనినాము వదరుచు నిపుర
న్మాని జయింయులు వెయువడి
నానాదిక్కులను జూచి నలినాక్షుఁగనెన్. 235

సీ. బిగితాళ సంధించి విరుదువక్షాణించి
నయమైన నిజసాధనములు బూని
దిక్కులల్లాడగా జుక్కలురాలంగా
నుబ్బిరంబగ బెదబొబ్బ పెట్టి
కన్నుల నిప్పులొల్కగ గర్జించుచు
నట్టహాసముజేసి యవుడుగరచి
''నీ వెవ్వడవురోరి! నీ పేరుజెప్పుము
మురసుర వైరితో మోటుకొనగ

గరుడ గంధర్వయక్ష కిన్నరులునైన
నురగవరులైన నమరఖేచరులునైన
నెదుట నిల్వరు నీవునాకేమిలెక్క
పొమ్ము నెటనైన నూరక పొలియనేల.'' 236

మ. అనినం గృష్ణుడు నవ్వి "యోరి మురదైత్యా! యిట్లు దుర్భాషలా
డిన నేవుం బహుశౌర్యుడైతో జయమెట్లాపన్నిన్ను మర్దించ వ
చ్చిన వీరుండను నీకు నేనెవడనో వీక్షించు రప్పించు నిం
కిన వానిన్నిను ద్రుంచి వైచెద నిరంతంబైన యుద్ధంబునన్". 237

క. అనిన నృకేసరి దాసరి
కిని పెను శివమెత్తి నటుం గేడింపుచు హా!
వని యదుపీరునిపై నొక
ఘన గద బడవైచి పేర్చి కడువడి నార్చెన్. 238

క. కడు నార్చి వైచు పెనుగద
పొడి పొడి గావించి వాని ఘోరియురమునన్
బెడిదంబుగ నాటించెను
ఓడుగును బోలిన శరంబు భీకరలీలన్. 239

క కడుమూర్ఛ నొంది వాడును
వడవునటం దెలిసి మేటిధనువంది జవం
బడరగ గురిసెను శరముల
జడి నగమున గప్పు మంచు చందము గాగన్. 240

క. అవి యెల్ల నైదు శరముల
నవియంగా జేసి తచ్ఛరాసము దునిమెన్
బవివంటి యొక శరంబున
దివులొందగ వాడు పైకి తెంపున వచ్చెన్. 241

ఉ. వచ్చిన యా మురాసురుని వక్షము భూరిశిలీముఖంబులన్
గ్రుచ్చిన దచ్ఛరంబు పటుఘోరతరంబుగ యోజనంబు దా
నెచ్చుగ దీసుకం జని రయంబున వైచిన వాడు నాత్మలో
నచ్చెరు వంది కొంత భయమందుచు గ్రమ్మర ధైర్య చిత్తుడై. 242

వ. మరల దురాలాపంబు లాడుచు గదియం జని. 243

క. జ్వాలా భీలం బగు నొక
శూలము బక్షీంద్రునరొమ్ము సూటిగ ద్రేయన్
బాలవనమాల దాల్చిన
లీలం గరుడండు మది జలింపక యుండెన్. 244

వ. అప్పుడు గరుడవాహను ధైర్యశౌర్యంబులం గాంచి మురుండు చింతా
క్రాంతుండై మత్తపోబలంబున సంపాదించిన యాయుధంబులు నిరర్థ
కంబులై చనియె నేమి సేయంగలవాడ నెరికెందారి పురికి మరలంజనిన
నరకవల్లభునిచేత నవమానితుండవగుదునని ధైర్యంబవలంబించి. 245

గీ. కాలదండ సమాన సంకాశమైన
శక్తి వైచెను నసుర దురుక్తులాడి
యది తృణీకారముగజేసె హరి నిశాత
సాయకముల వాడు విచారపడగ. 246

క. పంతము గైకొని యయ సమ
యాంతకువలె పిక్కటిల్లద్రువ నార్చుచు రాగా
బంతముతో దన్నాధన
మింతింతలుగాగ ద్రుంచె నిశితల తోడన్. 247

ఉ. తోమరముం ధరించి బలుదోర్బల మొప్పగ వాడు సాహసో
ద్దాముడునై యుగాంతశరదంబు విధంబున మ్రోయుచున్న సుర
స్తోమములెల్ల నచ్చెరువుతోడ గనుంగొన వైచె గృష్ణునిం
భీమముగా నతండు నది పింపిగజేసె శరాళి వెందియున్. 248

క. అదిగని వాడొక ముద్గర
ము పటున ధరియించి భయము నొంపగనైవన్
బదనుం దూపుల నదిచెడి
కొదవంబడె ధళియుటంచు కోపము హెచ్చెన్. 249

క. హెచ్చితన పంచముఖముల
బెచ్చుమిరియుచు ఘోరరణము సేయుచు హరిపై
నచ్చెనట దైత్యుశిరములు
చెచ్చెర జక్రమున దునిమె చిత్రముగాగన్. 250

క. సురలు హృష్టాస్యములం గెల్ల
స్మెరమెరగా మెంగుచున్న మేచకాంగు మురా
సురుడు సని గూలుటం గని
హరికిని జయవెట్టి కురిసిరలరులమర్త్యుల్. 251

క. తునిగిన వాని శిరంబును
తనువును నలిసములబడిన తత్సుతులతనిం
గని శోకాతురులయ్యును
జెనకువకుం గడిసిరపుడు భీకరలీలన్. 252

వ. గదా ఖడ్గతోమర భిండివాల శూలచక్ర ధనురాది సాధనంబులు ధరి
యించి ధూమ్రమనఘస్వ దంతరిక్ష విభావస్వారుణ వసుశ్రవణు లసంబేరు
గల మురాసురపుత్రులేడ్వురు ఘనధ్వాంతరాశంబులు నిండ సింహ
నాదంబులు సలుపుచు హరితోదండలపడి ఘోరయుద్ధంబుసేయ వార
లందర ననేకాయుధంబుల హతులంగావించి సత్యయుం దానును గరుడ
వాహనారూఢుండై తేజరిల్లుచుండె నక్కడ చారులైన రక్కసులు నరకా
సురుని వద్దకేంజని యిట్లనిరి. 253

క. "ఓదేవ! భూమినందన
నే దారుణ శౌర్యమునను నిఖిలజగంబుల్
భేదిల్లునట్టి సియా
మోదంబున నిపుడు చాలమోసము వచ్చెన్. 254

క. అక్షౌహిణీ సేనలు
పక్షులగదలింపలేని దావక దుర్గా
ధ్యక్షులం గూల్చెను నే
తక్షణ మాత్రంబులోన గడువెరగయ్యెన్. 255

సీ. బహుపుష్పఫలగంధ భరితోపవనముల
        గూకటివ్రేళ్ళతో పీకివైచె
సప్తప్రాకారనిరాసలమయ దుర్గముల్
        తద్వైరి బాణసంతతుల గూల్చె
పద్మాకర తటాక బహుదీర్ఘికలయందు
        సంయురిక్త విధాయకంబు సలిపె
వాతాశనిలోక పాతాళపర్యంత
        పరిఘల మృచ్ఛిలాభరము నించె

విపణులెల్లను రిత్తగావించి విడిచె
కొలువుకూటంబులను నేలగూలద్రోచె
నెదురు తనకెవ్వరనుచు దుర్మదముతోడ
వెలయుచున్నాడు యాదవ వైరవరుడు. 256

క. మురసురవైరి సుతులతో
పురమున బరిమార్చి యధిక దోర్బలమొప్పన్
నరకాసురుడేడని త
త్పరుడై చనుదెంచె నిపుడు దనుజాధీశా!" 257

వ. అనిన విని నరకాసురుడు నాజ్యాహుతి గావించిన జ్వాలాభీలంబైన మహానలంబు చందంబున గాలంద్రొక్కిన క్రూరంబైన కాలసర్పంబు లీల మహోద్దండ దండతాడితంబైన కంఠీరవంబు విధంబున ప్రచండ కోపోద్దీపితమానసుండై దంతంబులం గొరుకుచు నేత్రంబుల నిప్పులురుల దండనాయకులం గనుంగొని "మీర లతి త్వరితంబుగా యుద్ధసన్నద్ధులు గండని, సైన్యంబుల నతివేగంబ తెండని" చాటిచెప్పి తాను గట్టాయితంబై వివిధంబులైన శస్త్రాస్త్రంబులు ధరియించి రణభేరి వేయించెను. 258

## —: నరకుని రణాగమనము :—

మ. గిరులెల్లం ఒరిగె న్దిగ్గజములుం ఘీయంచు మ్రొగ్గె న్నిశా
కర మార్తాండులు తల్లడిల్లిరి నక్షత్రంబులు వ్రాలె ఖే
చరులెల్లం ఘన మూర్ఛనొందిరి విరాజద్గాఢ నిర్ఘాత దు
ర్ధర కల్పాంత ఘనధ్వని స్ఫురిత గోత్రాపుత్ర భేరీధ్వనిన్. 259

క. పూని యనేకాక్షౌహిణి
సేనలు గొలువంగ వీరశేఖరులెల్లన్
వేనోళ్ళం గొనియాడగ
భూనందనుడనికి వెడలె పొగరున్వెలయన్. 260

సీ. అష్టదిగ్గజ జాతులగు మత్తమాతంగ
బలములు కోట్ల సంఖ్యలను మీర
సౌంభకాహ్వయ రథాడంబరంబైన ర
థంబులు గణనాదికంబు లమర
నిర్జరపతి హయస్ఫూర్జితోత్తమములౌ
హరులు న్యర్బుదములై మెరయుచుండ
గాలకింకర నిభాకారులై మితిమీరి
పటు జవయుత వీరభటులు వెలయ

నిట్టి సేనలు తనవెంట జుట్టి కొలువ
మేరు సన్నిభమైనట్టి తేరునెక్కి
భేరి కాహళ ధ్వనులును భోరు కొలుప
వెడలె యుద్ధంబునకు నల్ల పుడమి సుతుడు. 261

వ. ఇట్లు చనుదెంచు దైత్యుని దారుణాగమనంబును దత్సైన్యాడంబరంబును
గనుంగొని సత్యభామకు హరి యిట్లనియె. 262

మ. ‘‘హెంతీ! కంటివె ఘనుడుతండు మంతో వోనాశ్గా ప్రక్షా ల
క్ష్మాలకున్ని ప్రహ్లాదమైన సైన్యముంతో గర్జిల్లు దైతేయు పే
రుంతో మత్తగజేంద్రవయూథముంతో రూఢైక వేకక్కి వో
ర్వం మెప్పార జగత్త్రయుంబు వడివా ఖండింప గర్వోష్ణతన్. 267

క. అన విని కని తన మనమున
జనియించిన విస్మయంబు సమ్మోహంబున్
దనరగ నే సీతనితో
ఘనిసేయుడు ననుచు సత్య యాత్మ దలంచెన్. 264

వ. ఇట్లు దలంచుకొని. 265

క. జడముడిచి సొమ్ములిమ్ముగ
నిడి సివిబిగించి చింగులివురు పరచి బల్
విడి కాశ బోసి చన్గవ
నడుమ సరుల్నలిపి కొంగు నడుమున గట్టెన్. 266

క. శౌరి సతి జూచి ‘‘తరుణీ!
వీరాలంకారములను విలసిల్లుచు నీ
వీరీతి లేచి నిల్చిన
కారణమేమని’’న సిగ్గు గడలు కొనంగన్. 267

క. తలవాంచి పలుక కుండిన
‘‘తెలిసె న్నీ చిత్తవృత్తి ధీకోని రిపులన్
గెలువంగల నాకంటెను
బల మెక్కువ గలదె నీకు ఖండనమేః లే! 268

క. చేడియలెల్లను సురత
క్రీడల నలయించి మగల గెలువగ నెందున్
బ్రోడలుగాక విరోధుల
తోడం బోరాడి పేరబ్రోడెడి వారే! 269

క. గురు బాహుబలమున పుర
హరు మెచ్చని వీరు డీత డబలవు నీవున్
నరకునకు నీకు నెంతయు
గరి మశకాంతరము కాదె! కామిని! తలపన్. 270

క. నీకిది తగదన్నను మది
గైకొన వటులైన రణము గావించు మికన్
నీ కలవి గాక యుండిన
నాకారులగెల్చు తెరగు నాకే తెల్పున్! 271

క. విరిబోణి! నీమనోగత
మరయుట కిట్లంటిగాక నరమర గలదా
మరి సిగ్గేటికి నీకి
త్తరి చల్లకు వచ్చి ముంత దాచగ వలెనే! 272

క. అని మరియు నిట్టులనియెను
"వనితామణి! మెచ్చనట్టి వార్తలు విన్నన్
జనులైన నేమియననీ;
మొనసిన సంద్రంబు మూయ మూకుడు గలదే! 273

క. ధరణీ సుతుడనికిదిగో
సరభసగతి వచ్చె నింక జాగేటికి నీ
కర చాతురి జూచెద" నని
హరి సతికపుడిచ్చె విల్లు నమ్ముల పొదియున్. 274

క. ఇచ్చిన గైకొని కవ్వడి
నెచ్చెలికి నమస్కరించి నెంత తదాజ్ఞన్
బుచ్చుక చపవిని వియచ్చరు
లచ్చెరువుగ గనుగొనంగ నర్యభిముఖియై. 275

## —: సత్యభామా నరకాసురుల యుద్ధము :—

క. ధనువెక్కుపెట్టి గుణ ని
స్వనము గావించి శరము సంధించి రణా
భినుతాలీఢ పదస్థితి
గని నరకాసురుని కొమ్మ గాడగ నేయన్. 256

క. వాడయ్యెడ నదరని
వాడై బలువింట వెడలు వాడి శరములన్
మూడదరించిన నడుమనె
మోడక నవి దునిమె తా మహోగ్రాస్త్రములన్. 277

క. త్రుంచిన పెక్కమ్ములు వ
ర్షించె నతం డంతకంతె చిత్రమ్ముగ ల
క్షించియు వాని సితాశుగ
సంచయ మడరించి త్రుంచి జడియక మరియున్. 278

క. నిశితార్ధ చంద్రసాయక
మసదృశ గతి బరపి తచ్ఛరాసము దునుమన్
గసరుచు వాడొక బలుగద
విసవిస వెస విసరివైచి విట్టుగ నార్చెన్. 279

క. వైచిన తనదెస కది రా
జూచి భయంపడక నిలిచి సునిశిత పటు నా
రాచముల డురుము జేసిన
వాచా నిష్ఠురము లాడి వాడటు మీఱన్. 280

గీ. ఒక్క ధన్వంది వాడు మహోగ్రలీల
చంద్రహాస నిభ స్ఫురచ్ఛాత శరము
వింట నరిబోసి విడిచె వాల్గంటి మీద
నా సతియు ద్రుంచె దా నిశితాశుగముల. 281

గీ. సిగ్గు రోషంబు మనమ్ములో జెంగలింప
నగ్గలంబైన బాణంబు లందుకొనుచు
మ్రొగ్గ జేయుదు నీకాంత మురిపెమనుచు
బెగ్గటిల్లగ శరముల వృష్టి గురిసె. 282

మ. అవి యెల్లం ద్రుటిమాత్ర కాలమున మాయంజేసి సూర్యాధిక
చ్ఛవి నొప్పారు మహాశరంబులను వజ్రప్రాయతద్దేహముం
జవ మొప్పంగడు జర్జరీ కృతముగా సల్పం బహుక్రోధ సం
భవుడై పెక్కు శిలీముఖంబులను గూర్పం ద్రుంచె వాటిన్వెసన్. 283

గీ. ధనువు దెగటార్చి మేటి రథ్యముల గూల్చి
సారథిని ద్రుంచి ధ్వజమును జక్కుజేసి
రథము బొలయించి వేగ తద్రథిక వరుల
జాలి బడజేసె సతి బాణ జాలములను. 284

క. శూలమ్ము వైవ నది శర
జాలమ్మున కుల్కిదక్క జటులాంబకమున్
ఫాలమ్మున నాటించిన
గాలమ్ము బడిన చేపగతి గడుస్రుక్కెన్. 285

క. స్రుక్కిద్ధర మూర్ఛిల్లిన
రక్కసుడొక డతని దనదు రథమధ్యముపై
జక్కగ నిడుకొని చనియెను
గ్రక్కున నచ్చోటు బాసి కలగుచు నంతన్. 286

క. సవ్యాపసవ్యములుగా
నవ్యాహత వాహశక్తి నడరెంచి మహా
దివ్యాశుగముల నొంచిన
గ్రవ్యాద బలంబు పరచె గన్నది గతిగాన్. 287

క. అట్లగుట జూచి సతితో
నిట్లని మురవైరి పలికె నెవ్విధమున నీ
వెట్లాడ నేర్చితి వీ
పోట్లాట విచిత్రమయొ? బూర్ణేందుముఖీ! 288

క. గుణ నికరముతో గరకం
కణ ఝణఝణ రవము మెరయ గండస్థలి ద
ర్పణ రుచిర కర్ణభూషణ
మణి ధగధగదీప్తి పొలియ మలయుచు నుండున్. 289

క. దృగశిత ధళధళరుచి లా
ఘుగ శిఖర ప్రభలగడవ సురరిపు నాథా
నుగ సైన్యకల కరార్భటి
నగణిత శరపాత ఘుమ ఘుమార్భటి యార్పన్. 290

క. శృంగార వీరరసములు
సంగర రంగమున జూడ జలజేక్షణయై
పొంగుచు నెలకొనె నోయన
భృంగాలక! నీదు చెలువు పొలుపొందె జుమీ! 291

క. సొంపు గనుపింప నన్నుం
గెంపు జనింపంగ రిపుని గ్రేగన్నుల వీ
క్షింపుచు శరమరి వోయుట
దెంపరివై వేయుటయు నుతింప దరంబే ! 292

క. బొమ్మల పెండ్లిండ్లకు రా
రమ్మని చెలువన్న బోవు రణమున కెటులన్
సమ్మతితో నరుదెంచితి
నిమ్మహి నీ ధైర్య మహిమ యెన్నిక గాగన్. 293

క. మగవారి కెదుర నిలువవు
పగవారిం గెలువ నెట్లు భావించితివో
వెగడుదు వుయ్యాల లెక్కఁగ
ఖగరాజ స్కంధమెట్టి గతి నెక్కితివో. 294

క. మును చెలుల కల కలంబులు
వినజాలని దానవెట్లు వింటివి · పటహ
ధ్వను లంచల నడిపించెడి
పని కోర్వవు రిపుల నెట్లు భర్జించితివో. 295

క. వీణె సవరించి నఖర
శ్రేణిం దంత్రికల పాటసిరి పలికింపన్
జాణవుగా వెల్లైరిగితి
బాణాసనమంది గుణరవము బొనరింపన్. 296

క. చిలుకల బలికించెడి నే
ర్పులవడ దెట్లబ్బె శరము నభిమంత్రింపన్
గల కుశలత దుడుకాడవు
కలనేనియు రిపుల నెట్లు గర్జించితివో. 297

క. ధను వైంద్ర ధనువు గుణని
స్వనమురుము నిలింపులెల్ల జాతకములు నే
ఘన మీవు మెరుపుగా నరి
జనశిఖి నార్చితివి నిశితసాయక వృష్టిన్. 298

క. నీ మొగమును నీ చెరగును
నీ మహిత శరాసనంబు నీ దర్శనమున్
సోముని మదనధ్వజమును
గాముని వలె నమృతలహరిగా గంటి జుమీ! 299

క. ఈ నే చిహ్నము లవని
సూనుఁ గపి కేతు వెంచు సూర్యో పరిధి పై
శ్వాసరముం దండంబుఁ
గానంబడ కున్నె నేడు కదనము నందున్. 300

క. చూచిన గురిదప్పక పై
యాచకముఁ దసరులేక సలిపక బలు నా
రాచముల నొంచి ధరలో
ఖేచర రిపు సైన్యములను గెలిచితి వాజిన్. 301

క. గోలవెః నీవతి సాహసు
వాలవు నిన్నభినుతింప నలవియె హరికిన్
బాలక! మెచ్చితి నిచ్చెద
వాలాయము నీకభీష్ట వస్తువు లెల్లన్.” 302

వ. అనుచు జవరాలిం బ్రశంసించి వైనతేయుని బాహు పీఠంబున సుఖా
సీనులై గూర్చున్న యవసరంబున. 303

చ. ఘనముగ నిద్రజెంది వెనుకం దగమేల్కాంచినను నట్టివాని లీ
లను జెను మూర్ఛయున్వోన దొలంగి ధరాసుతు డన్ని దిక్కులం
గనుగొని వాజి హారణ నగ ప్రతిహాస శతాంగ భృత్య వీ
ర నికర సైన్యముం గడు పరాజితు లౌట నెరింగి చింతతోన్. 304

వ. తన్నుం గాపాడుచుం దన రథమధ్యంబున నుంచుకున్న దైత్య వీరునిం
గనుంగొని యిట్లనియె. 305

క. “మనకుం గల సైన్యం బెటు
జనియెం రథభట తురంగ సామజ యోధా
గ్రణులెందు బోయి రీ కథ
వినుపింపుము నాకు నిపుడు వీరవరేణ్యా”! 306

వ. అనిన వాడిట్లనియె. 307

క. "ఏ యెడ బురుషులు వింట్లుం
సాయకములు బూని రణము సలుపుడ రట్లున్
స్త్రీ యసురుం ద్రుంప న్నా
ర్యాయతి జనుదెంచె కాళరాత్రియ పోలెన్. 308

క. ఘన శర తరంగములు గల
తన శౌర్య సముద్రమునను ధనుజులముంపన్
జనుదెంచిన మృత్యువుగా
గనబడె నీకాంత చూడగా భూతనయా! 309

క. ఘన పురుష సన్నిధానం
బున విల్లు ధరించి శర సమూహము ముంపన్
మనసైన్యము దైన్యముచే
జనియె యథాయథలుగాగ జవమరి బెలుచన్". 310

వ. అనిన విని కటకటంబడి పారిపోయిన సైన్యంబుల బహుప్రయత్నంబునం బురికొల్పుకొని పునర్యుద్ధ సన్నద్ధుండై శ్రీకృష్ణునిం గనుగొని యిట్లనియె. 311

—: నరక కృష్ణుల పరస్పర నిందాలాపములు :—

క. "గోపాలక! మా తోడను
భూపాలకువలెను యుద్ధమునకు వచ్చితివో?
యీపడతి రాక యుండిన
నీపటు శౌర్యంబులెల్ల నేఁగను గొందున్. 312

సీ. నవనీతమును దధి నవఘృత క్షీరము
ల్దొంగిలి మెసగు తెరంగు గాదు
గొల్ల బాలురతోడ జెల్లాలటకు వచ్చి
బంతులాడిన యట్టి చంతుగాదు

కసువులుఁగలిగిన వసతికి గోవుల
    తరములాడిసంపట్టి తెరపుఁగాదు
మసలు మాయలుపన్ని పసికాపుజిల్లాండ్ర
    గూడి క్రీడలు సల్పు జాడగాదు

నస్మదీయ చమూసమూహార్ణవంబు
నీది దరిజేర నీచేతగాదు కృష్ణ!
పసులకాపరి! గర్వంబు పొసగ బోదు
పనుము గోపాల! నీకు నీ సమరమేల? 313

క. ఆడది గావున యుద్ధ
క్రీడకు జెయ్యాడదయ్యె గ్రీడగ జెలువా
జాడను నోడితి సరి మగ
వాడెటు నాయెదుట నిలువ వచ్చునె యాజిన్. 314

క. మగవాడవయ్యు నీవి
మగువకు విల్లిచ్చి దాని మాటున బ్రతికే
నగుబాట్లకు వెరవవుగా
నగధర! నీవైరులెల్ల నగరే జగతిన్. 315

ఉ. వ్రీడ దొలఁగి నీదు నలివేణి రణంబొనరింప జూచుచుం
చేడి తనంబు బూని నెరబింకముమాని జడుండవై మొగం
బోడక మనంబుగ బ్రయోజకునింబలె నీవునిల్చినం
జూడజగంబు వారలకు జోద్యముగాదె భవత్ప్రతాపముల్." 316

వ. అనిన శ్రీకృష్ణుండిట్లనియె. 317

శా. ఓరోరీ! నరకాసురా! వినుము నీ యుర్వీకభావంబు నా
గోరక్షత్వము శౌర్యశాలివగుచుం ఘోరాజిలో నిల్వుమీ!
వీరాగ్రేసురు లెల్ల మెచ్చగను వేవిల్లన్ శౌర్యంబునం
బోరాడంగలవచ్చు నీదు ఛలముంబోనాడు దౌర్బల్యమున్. 318

సీ. పరగ గోరక్షణ బ్రాహ్మణ రక్షణ
        లవిమాకు సహజంబులనగ వినవె
లలితమౌ క్షత్రియ కులము వాడనుగాని
        చండ దైతేయ పులుండగాను
సుదతి రణక్రీడ సొంపుజూచితిగాని
        నేను విల్లందితే నీవు నిల్వ
గలవె బ్రహ్మయు నీలకంఠుడు మొదలైన
        దేవతల్నాదిక్కు- దేరి చూడ

గలరె నీవు తృణప్రాయమెలిమి తెలియ
లజ్జ లేకను నీవు నాపజ్జకిపుడు
యుద్ధ మొనరింప వచ్చితే యుర్వీతనయ!
మగువయే చాలు నీదు దుర్మద మడంప." 319

వ. అనిన వాడిట్లనియె. 320

క. "మగువ ధనుశ్శరములు గొని
పగతురతో రణముసల్పి బతిగను గొనుచున్
మగటిమికి బాసియుండ
న్నగు బాటగుగాదె సకల నగరములందున్. 321

క. నీలావు దెలిసె నీ యి
ల్లాలికి విల్లమ్ము లిచ్చినప్పుడె పోరన్
జాలవు మాతోనిక గో
పాలక! పొమ్మ"నిన శౌరి పలికెన్నగుచున్. 322

క. "నారీమణితో మార్కొని
పోరాడగలేక పారిపోయినచో నీ
శూరత్వము దెలిసె నిశీ!
నోరెత్తకు"మనిన భూతనూజుండలుకన్. 323

క. "జలధిం జొరిన కానన
ముల దూరిన బిలప్రవేశముల జేరిన రా
కలిమిం గేరిన మసరం
జలమీరిన కలికి వగల జేరిననైనన్. 324

క. నిను బోనిత్తునె విక్రమ
ఘనినైనను నడరు మనికి గాకుండిన స
య్యనను శరణం జొరుమిక
ననిశం గృష్ణుండు పలికె నత్యుగ్రుండై. 325

క. "ఓరీ నరక నిశాచర!
పోరక సేలావు నాదు పోటరి తనమున్
నూరక తెలియగ వచ్చునె
పేరమ్మున నిట్టులేల ప్రేలెదవ"నుచున్. 326

—: నరక వధ :—

క. గౌనమున శతఘ్నినామక
ఘన దివ్యాస్త్రంబు దొడిగి కర్ణాంతముగా
ధనువు దెగదీసి వేసిన
దనుజబలోద్ధతులణంగె దత్సమయమునన్. 327

క. శరముల హరుల గవెక్కృద
కరుల నరిందితిజవరుల ఖండించిన న
య్యరి సైన్యము దైన్యంబున
హరి కెదురగ లేక పరచె హాహాయనుచున్. 328

క. హరిని స్సత్యను మూపున
ధరియించినను గరుడనపుడు దన పవనఘతో
ప్రాకారమున ముక్కున రెక్కల
సురరిపు కరి బలమునొంచె శూరతమెరయన్. 329

క. మరియును ఖగపతి రెక్కల
గరువలి యురువడికి వెరచి కంపింపక లో
నెరుడందుచు బరిముఖమై
పరచెను హతశేషమైన పరబలమంతన్. 330

వ. అంత నరకాసురుండు. 331

శా. కేలన్విల్లు ధరించి వాడు హరిం గేలించి క్రూరానల
జ్వాలాభీల శరంబునుం దొడగి రక్షశ్శ్రేణులుప్పొంగ "గో
పాలా! నాబలసంపదం గనుము శుంభల్లీలలన్వేగము
ద్వేలంబౌ భవదీయగర్వమును ఛేదింతునస్మదీయాస్త్రమున్." 332

క. అనునంతలోపలను ద
ద్ధనువును గాండంబు వాని ధ్వజమును మిగులన్
దునకలుగా బడవైచెను
దనశాత శిలీముఖాళి దనుజులు చెదరన్. 333

గీ. అంతవాడల్క మీరంగ బంతగించి
పొంతనున్నట్టి యొకవిల్లు సంతరించి
యంతకుని పోలి క్రోధ దుర్దాంతుడగుచు
పెంచ శరవృష్టిగురిసె శ్రీకాంతుమీద. 334

గీ. మంచు నిరసించు సూర్యునిమాడ్కి నపుడు
వాని శరముల నొక దివ్య బాణమునను
విరియజేసిన వాడు నచ్చెరువు నంది
చింతచే నేనినెట్లు జయింతు ననుచు. 335

క. [1]ఆగ్నేయ బాణమప్పుడు
ప్రజ్ఞను దలపోసి కృష్ణుపై నడరింపన్
విజ్ఞాని వహ్ని సిరివరు
నాజ్ఞాధారకుడు గనుక నటు నూరకుండెన్. 336

1. ప్రాసవైపరీత్యము.

ఉ. వాఁడు మురాగ్రహాంబునకు వారుణ బాణముపైఁప శౌరియుం
వోదసె వాని శౌర్యమును ద్రుంగఁగ వాయుశిలీముఖంబు ప
ద్వేషకతోఁప వాని నవలీల ప్రయోగము సల్పెనంత వా
డోదక పర్వతాస్త్రము సముద్ధతి తోడుతఁబైఁప వెండియున్. 337

శా. దంభోళ్యాహ్వాన సాయకంబును మహోద్దండంబుగా శౌరి దో
ర్దండ ప్రక్రియ నారిగూర్చి యపుడు కర్ణాంతంబుగా దీసియు
న్నుంఖల్లీలను బర్వతాస్త్రము వడిం జూర్ణంబు గావించియు
న్సంభావింపక రథ్యసారథి ధ్వజచ్ఛత్రంబులం ద్రుంచినన్. 338

క. అడిదంబు బంక గైకొని
బెడిదంబుగ రథము డుంకి భీకర లీలం
గడువడి గృష్ణుని గవయఁగ
గుడుసుంగైదువను వాని కుత్తుక ద్రుంచెన్. 339

క. త్రుంచిన వాని శిరంబు స
మంచిత కోటీర కుండలాగ్ర ప్రభ వె
ల్గించుచు నేలం గూలెను
మించిన హరిపాదముల సమీపము నందున్. 340

వ. అంత. 341

చ. మొరసెను దేవదుందుభు లమోఘములై బహుపుష్పవర్షము
ల్గురిసిరి నిర్జరుల్ప్రకటన కుంతితలీలల మేనకాదికా
ప్సర నికరంబు లెల్ల రథసంబుగ నాడిరి నారదాదులు
న్సురులు చెలంగ బాడిరి విశేషముగా హరికీర్తివీణలన్. 342

## —: భూదేవి భగదత్తునితో కృష్ణుని దర్శింపవచ్చుట :—

క. మరియు హరి భూమి పుత్రుని
పురమున మన్నాటి వేడ్కతోడుకనుండెన్
ధరజ సుత ప్రౌటకునితో
శరజు జౌరస్వాచ్ఛె నతని సన్నిధి కపుడున్. 343

క. అరుదెంచి మెల్లమెల్లన
కరిహయభట భూరి రుధిర కౌశిక భూతో
త్కర భయదభంగ సంగర
ధరణి స్థిరియున్న పతన తగ ముద మెసగన్. 344

ఉ. అంతట గాంచె భూయువతి యద్రిధరుం గమలా మనోహరుం
గంతుగురుం భవాంబుభవగర్వ బిడౌజ ముఖాది వందితా
త్యంతవిలాస కౌస్తుభగదాబ్జ శరాసన చక్రనందకా
క్రాంతభుజాభరుం శ్రితజనాంచిత రక్షణసత్కృపాకరున్. 345

వ. ఇట్లు కాంచి సర్వాంతర్యామిత్వ సర్వజ్ఞత్వ సర్వపరిపూర్ణత్వ నిర్వికల్ప నిజవినోద విస్మితాత్ముండై లక్ష్మీకాంతా విలాస భాసమానుండైన సాత్రాజితీయుత విరాట్సైంధవు సమీపంబునకుం జని వందనార్చ నంబు లొనరించి యిట్లని విన్నవించె. 346

సీ. నీలాభ్ర నిభకాయ! శూలాయుధ శరాయ!
నిగమాంతగేయ! శ్రీనగధరాయ!
సురరాజసన్మిత్ర! సూరిసన్నుతిపాత్ర!
భూరి సంశ్రితవన పూర్ణచైత్ర!
సుగుణ మానసంగ! ఖగమహేంద్రతురంగ!
కదనాశనస్వాంత కమలభృంగ!
వాంఛితార్థద! భక్తవరమానస విలాస!
మహిత కౌముది నిభమందహాస!

సగుణ నిర్గుణములకును సాక్షిరూప!
బ్రహ్మభవ నేత్రకర్ణాగ్ర ప్రకటమౌను
హాటగా గంభారం కంపి యగని
నిన్ను నుతిసేయ వరమె యాపన్నరక్ష! 347

వ. దేవా! పిపీలికాది యోనులందును మోహభేదభోగాభోగ సంజనితులై దుఃఖాగ్నిహోత్రంబున దందహ్యమానులై శోకకాంలిలేని శరీరాభిమానం బున మోహితులై చంచలులైన వారలకు సన్మార్గంబు జూపి పోషించు ప్రియుండవు, జగదీశ్వరుండవు, సత్యజ్ఞానానంద స్వరూపాతిశయ నిర్వికల్పుండవు, గురుండవు, విశేషకల్పాధార మశేష భూతాంతర్యామి త్వేన వర్తమాన స్వభావ నిమీలిత లోచనుండవు, అప్రమేయమననుభవ మవేద్యమపరోక్షమని తెలియువారలకు భాసమాన కరతలామలక పర దైవతంబైన నీయొక్క బ్రహ్మకీర్తనంబులైన విలాసావతార ప్రసంగ విశేషంబు లుగ్గడింపుచు కామక్రోధలోభమోహ మదరాగాది విముక్తులై శోకార్ణవంబు యుష్మద్దివ్యస్మరణ యానప్రాంతంబున దరించి భవ దంఘ్రికమల రాజద్భంభ రార్భకమానసులైన శ్రితజనుల జేరియుందురు; బాలకుని మాతాపితరులు, వ్యాధిని భేషజానీతంబైన యౌషధంబును, వాహినీశమధ్యంబున మునింగెడువాని నావయును పోషింప నిపుణత్వంబు నేరనిలీల సంసార సాగర సంగతేషణత్రయ తంతన్యమానులై మీచేత నిర్దయులైన వారిని రక్షింప నితరుండు నాథ్యత్నుండుగాడు; నిష్ప్రపంచం బైన జగంబు బ్రహ్మారోపంబున స్వరూపాతి శయనంబు నొందించు స్వర్గాధ్యక్షుండవునీవ! నితర ముముక్షుండవు, నిరంజనుండవు క్షపదభే సంబైన పురుషునికి నీయుపదేశంబున మాతృజనకాది మమత్వ సంసార పావక దందహ్యమా నునింజేయక కృతార్థులం జేయుచుండు విట్టి మహాను భావుండవని యెరుంగక యీ నరకదానవుండు రజస్తమోగుణావృ జడమానస కృతాపరాధుండై రంగదభంగ సంగరంబున మీచేత నిహ తుండై ముముక్షుండయ్యె; దుర్జనశిక్షణంబును, శిష్టజనపోషణంబును మీకు నైసర్గికంబు లని'' వినుతుంచి యమ్మహాత్మునకు పాళభృచ్ఛత్రం బును అదితి కుండలంబులు సమర్పించి యనేక సాష్టాంగ వందనార్చనం బులు సలిపి పాత్రుండైన భగదత్తుంజూపి యిట్లనియె. 348

క. ''బాలుడు యుష్మత్కృపనను
కూలవర్తించు బుద్ధికుశలుడు మృదువా
గ్జాలుడు సతరక్షణ! వన
మాలి! రక్షింపదగిన మాన్యుడు మెకున్. 349

క. కరుణించి నరకదైత్యుని
పురమునఁ గరుదెంచి వాని పుత్రునిఁ దను సు
స్థిరముగఁ బట్టము గట్టియు
పరివిగ ద్వారకకు మీరు వేంచేయఁదగున్". 350

మ. అను భూదేవి ప్రియానులాపములఁ గర్ణానందముం జెంది మ
న్ననచే మిక్కిలి గౌరవించ భయదానం బిచ్చి ప్రాగ్జ్యోతిషం
బునకుం జొచ్చెను సత్యాదానును రయంబు న్స్మర బక్షీంద్రవా
హనుఁ డద్ధాత్రియు భూమి పౌత్రకుఁడు సత్యాసక్తితం గొల్వఁగన్. 351

గీ. రాజమార్గంబునను హరి రాకఁ గాంచి
పసిడిమేడల పైనుండి పడఁతులెల్ల
లాజలును బుష్పములను నీరాజనములు
వెసనమర్పించిరా యదువీరునకును. 352

క. భగవంతుఁడని యెరుంగక
జగతీసుతుఁ డితనితోడ సలిపెను వైరం
బెగ ముచు గన్నుంగానక
తగరు బలిసి కొండతోడ దాకినలీలన్. 353

క. అని పెక్కువిధములను హరి
గొనియాడుచు భూమిపుత్రకుని తోడుత దు
ర్జన భావము నిందించెడి
జనులం గని శౌరి నగుచు జనుదేరంగాన్. 354

క. భూదేవియు భగదత్తుఁడు
యాదవ విభునకును మణిమయాంచిత సౌధం
బాదట నొసగిరి విడిదిగ
సాదరమున నర్చనములు సలిపిరి వేడ్కన్. 355

వ. అంత శ్రీకృష్ణుండు సత్యాసమేతుండై సకల పూజా విధానంబుల సంతృప్తుండై సంతోషాతిశయంబున భగవత్తుం జూచి "నిజజనకునకు బరలోక కృత్యంబులు నిర్వర్తించి పరిశుద్ధుండ వైరమ్మ"ని యతండట్ల జేసి పవిత్రుండై సన్నిధానంబునకు వచ్చి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించిన శుభముహూర్తంబున సమస్త పుణ్యనదీ జలంబులం దెప్పించి యభిషిక్తుం గావించి రాజయోగ్యాలంకారంబులైన మణిభూషణంబులను సువర్ణచేలంబుల నలంకృతుంజేసి పితృరాజ్య సింహాసనస్థుం గావించి లలాటంబున మణిమయ పట్టంబు గట్టించి సమస్త రాజలోకంబు చేత బహుమానితుంజేయించి బ్రాహ్మణజనంబులకు గోహిరణ్య రథగజ తురగాందోళికాగ్రహారాది దానంబులొసంగి స్వస్తి పుణ్యాహవచనంబులు చదివించి యాశీర్వాదంబుగావించి "నీవు బుద్ధిమంతుడవై జగద్విరోధంబు లేక రాజ్యంబు సేయుమని" చెప్పి కొన్ని దినంబులు వసించి పట్టణ శృంగారంబవలోకించుటకునై గృహంబు వెడలి చని. 356

చ. కొలువు హజారముల్ పసిడి గోపురముల్ మణి చిత్రహర్మ్యము
ల్నెలశిల లింద్రనీలములనిగ్గులు పచ్చలు కెంపురాలచే
విలసితమైన పణ్యముల వీథులు జూచుచు రాగనొక్కచో
వెలయగ గాంచె శౌరి మణి విస్తృతమౌనొక సౌధరాజమున్. 357

క. కాంచియు నవమణి ఖచితో
దంచిత శృంగారమహిమ కచ్చెరు పడుచుం
గొంచక తద్గృహము ప్రవే
శించె దదంతరమునందు జెల్వొగనంగన్. 358

వ. ఇట్లు ప్రవేశించి. 359

—: కృష్ణరాజ కన్యకల పరస్పర సందర్శనము :—

మ. కనియెం గృష్ణుడు తద్గృహంబునను రాకాచంద్ర సంకాశికా
ననలం జంచల నేత్రలం గనకసూన ప్రస్ఫురన్నాసలం
ఘనవేణీ విలసద్విలాసలను గోకద్వంద్వ వక్షోజయు
గ్మనతోద్యద్ఘన మధ్యలన్వితత శృంగారైక రాట్కన్యలన్. 360

మ. కని వీరచ్చరలో సురాంగనలొ యక్షస్త్రీలొ విద్యాధరాం
గనలో పన్నగకాంతలో గరుడలో గంధర్వచంద్రాస్యలో
యని యాసుందర తెన్నరేరిల మహోద్యచ్ఛేష భాషాధిపు
ల్వీన బోయింపగ దీరిముచ్చటలు కేలిలచిప్పుడీ చందముల్. 361

క. అని యోచన చేనుండగ
గనిరి పదార్వేల రాజకన్యకలతని
న్వనితలనిరి తమలో వెస
గనబడదు గదమ్మ యిట్టి ఘన సుందరమున్. 362

ఉ. చంద్రుడొ యింద్రపుత్రుడొ వసంతుడొ లేక తలంచి చూడయ
క్షేంద్ర కుమారుడో మరియు శ్రీకరుడో మదనుండొ యీలస
త్సాంద్ర తనూ విలాస వరసంపద జూచిన మెచ్చవచ్చు వా
గేంద్రునకైన యల్ల నరగేంద్రునకైన నుతింప శక్యమే. 363

క. అని తమలో తామచ్చెరు
వున గనుగొనుచుండ వారి యొద్దకు గృష్ణుం
డనుపమ లీలల జనుదెం
చెను బరామరికలు సేయుట కొరకై. 364.

క. వచ్చిన శ్రీహరి కెదురుగ
వచ్చి తదీయాంఘ్రియుగ్మ వనజంబులకున్
విచ్చలవిడి మ్రొక్కిరి కడు
హెచ్చిన భక్తులను వారిజేక్షణలెల్లన్. 365

ఉ. మ్రొక్కిన సుందరీజన సమూహములు న్ముదమందునట్లుగా
గ్రక్కున దీవన ల్సలిపి గౌరవ లీలల నాదరించి పెం
పెక్కగ సన్నుతించి ‘‘కమలేక్షణలార: భవద్విచారము
ల్మక్కువ తోడ మాకును గ్రమంబున దెల్పుడి మీకు మేలగున్. 366

వ. అనగ వార లిట్లనిరి. 367

క. "మా మా జనకుల పటు సం
గ్రామముల వధించి మమ్ము గామించుటకై
భూమి కుమారాసురు డిటు
దీమసమున జెరలు బట్టి తెచ్చెను కృష్ణా! 368

సీ. కర్ణాట కాధీశు కన్య యీనవబోడి
ద్రవిడదేశాధీశు తనయయిదియు
ఘూర్జరనాథుని కూతురీ కొమ్మయు
గేరళరాజ కుమారి యిదియు
గాళింగదేశ భూకాంతుని సుతయిది
మగధేశు బిడ్డ యీ యిగురుబోణి
చోళాధినాథుని చూలు యీతన్వంగి
మాళవపతిపుత్రి యీలతాంగి

కోసలేశుని సుతయిది కోంకణాంగ
వంగ కాశ్మీర కాంభోజవరమరాట
లాట భూపాల తనయలీలలనలెల్ల
కృష్ణ! మమ్మందర ను గటాక్షించు దయను." 369

క. అని సంతోషాతిశయం
బున గన్నికలుండ దత్సమూహము లెల్లం
గని కృష్ణుండిట్లనియెను
"వనజేక్షణలార! మీదు వాంఛలు జెపుడీ. 370

మీతలి దండ్రుల గృహముల
కాతత మది జనగవలెనొ నదిగాకను మీ
చేతో మోదంబులు గల
భూతల పతులందు బుద్ధి పొడమునొ చెపుడీ!" 371

మ. అనిశం గృష్ణుని గాంచి కాంతల సమూహం బెల్లనుం దైత్యమ
ర్దన! మీపాద సరోరుహద్వయుని జింతంజెంది యున్నట్టి మ
మ్ము ను నీ లీలల బల్కు సర్వమె జగంబులగాన నిద్రాత్రిలో
జననం బందిన విష్ణుమూర్తివి మదిచ్ఛల్మీ కడ న్వర్తిలున్. 372

క. ఇతర నృపాలక జన సం
గతులొల్లము మీ పదాబ్జగత చిత్తలమై
సతతము మిమ్మేకోరెద
మితర నృపుల గొల్చు చిత్తమిందదు మాకున్ 373

సీ. నూతనమేఘోద కాతత చాతక
జాతము ల్చనునె దుర్జలములకును
వెన్నెల గుత్తిని వేడు చకోరిక
ల్చెలగి చండజ్యోతి జేర జనునె
మానసకాసార మహితమరాళముల్
తుంగ మడ్డులను మెలంగ జనునె
పద్మమరందైక పాన భృంగంబులు
జిల్లెడు పూల కాశించ బోనె

దేవ! త్వత్పాద సేవె మా జీవనంబు
గావునను మమ్ము రక్షించు కరుణ తోడ
దేవకీ పుత్ర! సుజన వందిత చరిత్ర!
భవ్యగుణ జాల! సంతత భక్త లోల! 374

క. భూపుత్రుడు చెరబెట్టెను
పాపాత్ముండనుచు మేము పరిరిస దోషం
బాపుఖ్యునిచే గాదా
మీ పద పద్మముల సేవ మెచ్చుగ దొరికెన్." 375

క. అని ముదమందుచ తను బ్రా
ర్థన చేసెడి సతుం కథయదాస మొసగి భూ
వనితను గనుగొని "యీయం
గనలను శృంగార వతులు గావింపుమ"నన్. 376

గీ. అనిన పదియారువేల రాట్తనయలకును
రంగుమీరంగ విలసదభ్యంగనములు
చెలువు దాసీ జనంబుల చేతనపుడు
తీవిగా జేసి జలకమాడించె నపుడు. 377

చ. చెలువగు మేల్కడాని పనిచే విలసిల్లెడు దివ్యభూషణం
బులు గనకాంబరంబులును భూరి సుగంధ విలేపనంబు లిం
పులు దళుకొత్త షడ్రుచుల భోజన తృప్తలుగా నొనర్చి కే
వలము లవంగ పూగముఖ వాసన వీడ్యము లిచ్చి వెండియున్. 378

గీ. పుడమి చేడియ శ్రీకృష్ణు కడకు వచ్చి
"ధన్యలగు పదియార్వేల కన్యకలను
వితత శృంగారవతుల గావించినాను
పరగ మీదటి కార్యంబు లెరుగ జెపుడ!" 379

క. అన, భగదత్తునితో ని
ట్లనియెన్ "సుందరుల కందలంబులు రథము
ల్తనర గజంబులు హయములు
ననువుగ దెప్పించు వీరి నంపించవలెన్. 380

క. ద్వారావతికిని వీరలు
చేరంగా వలయు నీవు శీఘ్రమెలెమ్మా!
సారెకు నేకాక్షోహిణి
వీరుల నంపించు వీరివెంట జనగన్." 381

—: కృష్ణుడు రాజకన్యలను ద్వారకకు పంపుట :—

వ. అనిన, సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి "దేవర చిత్తంబున కెద్ది యిష్టంబొ యట్ల సేయంగలవాడ"నని వారలు కోరిన రథగజతురగాందోళికం బొసంగి యొక్కొక్కరికి నైదుగురు పదుగురు దాసదాసీజనంబుల నొసంగిన సంతసించి యా కన్నియలు శౌరి సన్నిధానంబునకు వచ్చి నమస్కరించిన వారల నాశీర్వదించి గారవించి "మీరలు ద్వారకా పురంబునకు జనుండు మీ కోర్కులు సఫలంబులగు"వని పంచిన వారలు రథగజతురంగాందోళికారోహణలై భేరికాహళాది పంచమహావాద్యంబులు మ్రోయ నేకాక్షౌహిణీ బలంబు వెంబడిం గొలువ కతిపయ ప్రయాణంబులం ద్వారకాపురి సన్నిహిత సముద్ర తీరంబున విడిసిన, సైన్యాధికారులు వారలతో నిట్లనిరి.

-:రాజకన్యలు ససైన్యలై సముద్రముగడచి రైవతకాద్రి చెంగట విడియుట:-

సీ. శంబరవైరి నిజాంబికా జననంబు
నంబుచరాశ్రితాలంబనంబు
నంబుద పాంథ మహాంబుదాన గృహంబు
నంబుజాతాక్ష శయ్యాతలంబు
శంబాయుధోత్సవాడంబర కరణంబు
నంబర చర నిరతాన్నదంబు
నంబికావర శరాధార తూణీరంబు
నంబు తరంగ విడంబనంబు

కంబు సమ్మృతంబు వరకౌస్తుభంబు జృంభ
ణంబు చేనొప్పు నింద్రహయంబు లావి
కంబు లిందుల కగనుద్భవంబు నొందె
నంబుజాసనతీ సముద్రంబు గనుడి! 383

వారలు గైకొని నావికు లాదట
లాదట జనుదెంచి "మిమ్ముం బరనిపుడే
వేడుకతో దరియించెద
మీడవసింపంగనేల నీ వార్ధిపై." 384

వ. ఆరోహణంబు సేయుండని వారి సందరను నవ్వాడలపై సేనా సమే
తంబుగా గూర్చుండబెట్టి క్రమంబున సందరిం గడవంగ జేసిన సందరు
సన్నుతించి మజ్జనభోజనాదికృత్యం బులాచరించి తృప్తింబొంది యిటకు
యోజన దూరంబున రైవతకంబను శైలంబు గలదు, దేవతాస్థలంబందు
వసియింతమని నిశ్చయించి యటసంజని పటకుటీరంబులు బన్నించి
నిలిచిన. 385

—: సత్యాకృష్ణుల సర్గప్రయాణము :—

క. అచ్చట, ప్రాగ్జ్యోతిషమున
*నచ్చుతుడు ప్రయాణమయ్యె నమరావతికిన్
నచ్చిన భక్తిని పుడమి ని
యచ్చర రిపుసుతుడు వెంట ననుపగ వేడ్కన్. 386

క. ధరణి సతిన్నరకసుతుం
బురికి స్మరలంగ బంపి పురుహూతపురీ
సరణిం జనియెను గృష్ణుడు
విరివిం గడు వేడ్క మదిని విలసిల్లంగన్. 387

గీ. బాణవేగ మనోవేగ వాయువేగ
ముల హసించెడి గరుడని మూపునందు
సత్య హరియును గూర్చుండి సత్వరమున
మేరు శైలంబు చెంతకు జేరిరపుడు. 388

వ. చేరి సత్యభామతో హరి యిట్లనియె. 389

సీ. ''ఈ మేరువే కదా భూమి కాధారంబు
హేమమయంబు సంక్షేమదంబు
ఈ శైలమే కదా యాకంబు చేతికి
బటుధనువైన సంపత్కరంబు

---

*అచ్యుతుడు-అచ్చుతుడుగా ప్రయుక్తము.

ఈ పర్వతము కాదె యింద్రాది దిక్పాల
పురములం కధిక సుస్థిరకరంబు
ఈ నగంబే కదా యందు సూర్యాక్షాది
గ్రహముంచే ప్రదక్షిణకరంబు

నిడియె మణి గండ శిలల సంపదల బొదలు
పొరలు కల్పమహీరుహంబుల జెలంగు
రంగు బంగరు పక్షి మృగాంగకముల
మెరయు నీయద్రి గంటివే మించుబోణి! 390

సీ. గంధర్వులును వీరు కాంచన సుమవాస!
చారణుల్వీరలు చంద్ర వదన!
కింపురుషులు వీరు శంపాలతిక దేహ!
కిన్నరుల్వీరు పంకేరుహాక్షి!
యక్షులు వీరు సులక్షణ లక్షిత!
విద్యాధరు ల్యాలివేణి! వీరు
గరుడలు వీరలు గలకంఠి! కనుగొను
సిద్ధులు వీరలు సింహమధ్య!

సహ్యకులు పన్నగులు వీరు కుశలచరిత!
భూచరులు ఖేచరులు వీరగోచరముగ
నింద్రు గొలువంగ జనియెద రింపుమీర
వీరి గుంపులు గంటె చకోరనయన!'' 391

మ. మరియుం గృష్ణుడు సత్యకు న్సుర పురీ మార్గస్థుడై జూపుచుం
గరుడా రోహకుడై సశంఖ విలసత్కౌమోదకీ నందక
స్థిరశార్ఙ్గ ప్రముఖాది సాధనములుం జెల్వంబుగా బూని స
త్వరతో జేరెను నింద్రపట్టణ బహిర్ద్వార ప్రదేశస్థలి
న్సురలెల్ల న్హరిరాక దేవపతితో సూచించి రవ్వేళలోన్. 392

శా. శంభల్లీలం బొంచ జన్యా జనన స్ఫూర్జన్మహాభీమమౌ
బంభారావము రాక్షసాంగనల గర్భస్రావముల్సేయగా
జంభారాతి ముఖామరాళి మనముల్సంతోషముల్పొందగా
గంభీరధ్వని జేసె శౌరి తనరాకల్దెల్పి దేవాళికిన్. 393

**—: ఇంద్రుని ఎదురుకోలు :—**

క. ఇంద్రుడు సమ్మోదకళా
సాంద్రుండై యెదురు కొనగ జనుదెంచెను బ
క్షీంద్ర వరవాహనుని ని
స్తంద్రక్రియ సకలదేవ సైన్యము గొలువన్. 394

సీ. తుంబుర నారదాదులు వీణియల బాడ
రంభాద్యనేకాప్సరలు నటింప
జెలువైన మణివేత్రములు బూని గంధర్వ
వరులు సందడి బరాబరులు సేయ
సప్తదిక్పతులు నిచ్చానురూపములైన
వాహంబులెక్కి వెంబడిగ నడువ
బ్రహ్మర్షులెల్ల సుస్వరయుక్త వేదము
ల్మనుకొని సంతోషముల బఠింప

నభ్రమాతంగ పతిపై నదభ్రలీల
వజ్రి గూర్చుండి యతులితవైభవమున
నిజ గృహ ద్వారమును వెళ్ళి నీరజాక్షు
గనగ నరుదెంచె సంతోషకలితుడగుచు. 395

క. కాంచెం బురి బహిరంగణ
కాంచనమయ భూమియందు గరుడారూఢుం
జంచలయుత ఘనమత్యరు
ణాంచిత పర్వతమునందు నలరెడు లీలన్. 396

వ. ఇట్లు సన్నిహితంబుగా గరుడారూఢుండై సర్వాంగనా సమేతుండై దృష్టి
పథంబునం గనంబడుచున్న హరింగాంచి యతిత్వరితంబుగా నైరావత
గజంబునుం డిగి సన్నిధానంబునకువచ్చి సాష్టాంగదండ ప్రణామంబు
లాచరించిన నతండు గరుడావతరణంబుసేసి యబ్బలారాతిం గౌగిటం
జేర్చుకొని గారవించిన నతం డిట్లనియె. 397

క. "పంచాయుధ జనక! మదీ
యాంచిత గృహమునకు మీరు నరుదేరవలెం
జంచత్త్వత్పాద రజ
స్సంచయమున నాగృహంబు సత్కృత నొందున్." 398

క. అని వేడుకొనుచు దోడ్కొని
చనియెందన గృహమునకును శౌరిని. వేడ్కం
జని యదితి సన్నిధికి హరి
కని మ్రొక్కెను బుత్రకుండు గావున నతితోన్. 399

—: అదితి ఆదరణ :—

గీ. మ్రొక్కినను గాంచి నెమ్మది ముదము బెంచి
శిరము మూర్కొని ముద్దాడి చెక్కునిమిరి
"యరయ వచ్చితె నన్ను దయాంబురాశి!
నే కృతార్థత నొందితి నీరజాక్ష! 400

ఆ. నన్ను గన్న తండ్రి! నా పాలి దైవంబ!
నా తపః ఫలంబ! నా కుమార!
నేడు నిన్ను గంటి నే ధన్యురాలను
రావె నాదు భాగ్యరాశి! కృష్ణ!" 401

మ. అని లాలింపుచు బెక్కు దీవనలు నెయ్యం బొప్పగా జేసి "యో
తనయా! యా బలిచేత నా సుతుని యింద్రత్వంబు పోవంగ వా
మన రూపంబును దాల్చి నా సుతుడవై మన్నించి యిప్పించ వా
మును సామ్రాజ్యము నేర్పుశాలివగుచు న్మల్లోకము ల్మెచ్చగాన్. 402

గీ. మచ్చ కచ్ఛప కిటివర మనుజసింహ
వామన భృగూద్వహ రఘురామ రేవ
తీశ బుద్ధాఖ్య కలికిమూర్తిత్వమునను
జగము పాలించవా యుగయుగములందు. 403

గీ. నీగుణంబులు నెన్నని నేగణింతు
బెక్కుభంగుల మము బ్రోవ దిక్కు నీవె
రాజరూపక దైత్యుల తేజమణప
భూమి బుట్టిన పురుషోత్తమా! ముకుంద! 404

వ. అనిన సంతసించి. 405

క. హేమాంబరమున గట్టిన
యామణిమయ కుంతలములు నపలి కొసంగన్
నామె గ్రహించెను ముదమున
శ్రీమహిళావరుని పొగడి చిత్రము గాగన్. 406

వ. అనేక విధంబుల శ్రీకృష్ణుని గుణాతిశయంబులు వర్ణించి నరకాసురుని
దుష్టగుణంబు లుగ్గడించి యిట్లనియె. 407

సీ. "గొరియల మందలో జొరబడు తోడేలు
విధమున రాజుల వెదకి చంపె
బక్షులపైకేగు బహిరి చందంబున
యక్షుల బహుభంగి శిక్షజేసె
నురగుల నురుమాడు గరుడని చాడ్పున
సురమానసంబులు చూరబుచ్చె
నాలగుంపులను శార్దూలంబు గనులీల
దొంగ గంధర్వుల ద్రుంచజేసె

నట్టి నరకాసురుని చేత కమరునట్టి
తమి మహేంద్రుండలగొను కుండలములు దెచ్చి
మరల నాకు నొసంగితొ కరుణతోడ
వానినెట్లు జయించిరో వాసుదేవ! 408

క. ఈ సత్యాబలపరాక్రమ
మేనతులకునైన గలదె యిరవందంగా
భూసుతుని గర్వమణచెను
భాసుర యుద్ధమున ధీరపత్నియనంగన్. 409

వ. అని తన సన్నిధానంబున సేవావృత్తినుండు పౌలోమింగనుంగొని సత్య
భామా కృష్ణులంజూపి యిట్లనియె. ·410

క. "ప్రియురాలీ సత్యము
పాయని నీ మరిది యితడు పద్మాక్షుండున్
యో యింద్రపత్ని! కలదే
నీ యంతటి భాగ్యశీలి నిఖిల జగములన్". 411

గీ. అనిన విని తాను సత్యను గనికరమున
కౌగిటను జేర్చి కరమున గరముబట్టి
తనదు శృంగార భవనంబు గనగ వేడ్క-
జనియె పౌలోమి సంతోషసహితయగుచు. 412

వ. అప్పుడదితి కృష్ణుంగని యిట్లనియె. 412

క. మాయయ్య! కొన్ని దినములు
నీ యంగన నీవు కరుణ నెలకొనవలయున్
మా యింటి సమ్మదంబున
శ్రేయంబులు మాకు నెపుడు చేకురు నటులన్." 414

గీ. "అమ్మ! నీ చిత్త మట్లు కానిమ్మ" సంగ
సమ్మతంబున నింద్రుండు సంతసించి
"లలితమై నట్టి మత్సభాస్థలము జూడ
రమ్ము శ్రీకృష్ణ! దాని చెల్వమ్ము గనుము". 415

క. అని కరముబట్టి దోడ్కొని
చనియెన్ శృంగార కలిత సభకును శౌరిన్
జని చింతామణి సింహా
సనమున గూర్చుండె రపుడు సంతోషమునన్. 416

సీ. చంద్రకాంతోపల సత్కాంతి చంద్రికా
తతికి చకోర సంతతులు రాగ
బద్మరాగ ప్రభాపటలాతపములకు
జక్రవాకంబులు సంతసింప
మరకత దీప్తి సమాజంబుగని బాల
తృణమని శంబరగణము జెలగ
నింద్రనీలప్రభా సాంద్రమంబుదమని
నెమ్మి తండము తాండవమ్ము సల్ప

దళుకు లీనెడు సురసభాస్థలము జూచి
వింత గల్పించు నౌ జడ జంతువుం క
వార్యమౌ విశ్వకర్మ చాతుర్యమనుచు
మెచ్చుకొనె జేరి దాని యమ్మేలు మురారి. 417

సీ. చెలువైన రంభోర్వశీమేనకాదుల
మేటి నాట్యమునకు మెచ్చి మెచ్చి
తుంబుర నారదాదుల వీణాయంత్ర
గాత్రవిద్యల మేలు కాంచి కాంచి

సుమనీతి పొందెన్ను గరిమను మెచ్చి
పెంపొందు సమ్మోద మందియుండి
కవి కవిత్వ ప్రౌఢ గాంభీర్య కరుణా
స్ఫూర్తి ధరణీశునిని బొగడి పొగడి

తన కరాసిని యుద్ధ భూస్థలిని గూలు
వైరి వీరుల నింద్రుండు గారవించు
సంపదలగాంచి యానంద మొంది యొంది
పరసె సంతోషమున మీరి యమ్మురారి. 418

క. ఇటు తన మాచెల్లికి దేవ్యాలు
ఘటియించెను యింద్రసభను గాంచి ముదమునన్
"మటుమాయలు గావు జూమీ ?
యటు భరతేంద్రునకు వల్కె నాలాపంబుల్." 419

క. అని మెచ్చుకొనుచు నింద్రుం
గనుగొని "నీభోగభాగ్య గరిమ నుతింపన్
వనరుహ భవునకు నల శే
షునకును సర్వజ్ఞుడైన శూలికిదరమే ?" 420

క. అని పెంపుజేసినను విని
"వనితానుకగమన! నీవు విశ్రుత కరుణా
జననము కాదె మాకును
ననువుగ బహుభోగసుఖము లమరుట లెల్లన్. 421

సీ. మాకు నింద్రత్వ సామ్రాజ్యంబు గలుగుట
జాతవేదునకు యజ్ఞాధికార
మరయగా యమునకు సంహాత్మ వంశస
క్రవ్యాదునకు నాసుర ప్రభుత్వ

మాపాశధరున కకూపార హంస
ననిలునకును సుగంధానుభవము
నర్థేశునకు నిధానాధికారంబు
నీశ్వరునకును సర్వేశ్వరత్వ

మలరుటలునెల్ల నీకృపవలన గాదె
యాదవాన్వయ కళల పాథోధి చంద్ర
దేవకీపుత్ర! విమత పార్థివ జయిత్ర!
భవ్యతరశీల! నంద గోపాలబాల" 422

క. హరినిట్లు పెక్కు భంగుల
సురపతి గొనియాడి యంత సురుచిర లీలా
చరణమున నుండి రిరువురు
స్ఫురిత మహావైభవములు పొలు పొంపంగా 423

వ. సంతోషంబున గూర్చుండి వరుణదేవునిం గనుంగొని కృష్ణుం డిట్లనియె.

మ. "వరుణా! భూసుతుడాహవంబునను భవ్యంబౌ భవచ్ఛత్రమున్
హరియించెన్నినుగెల్చి వాని పటుశౌర్యంబొప్పగా ఘోర సం
గర భూమిన్వధియించి తెచ్చితిని ముఖ్యంబైన నీఛత్రముం
గరుణం గొమ్మని" యిచ్చె పాశి కమరుల్కంసారినిన్మెచ్చగన్. 425

క. వరుణుడు నేవిధముల శ్రీ
హరినిం గొనియాడె మ్రొక్కి "యచ్యుత! మీ స
త్కరుణను గాదా మా మా
సిరులకు విఘ్నంబులేక చేరినవే"నుచున్. 426

సత్యకు సంశ్రీహరి సాం
గత్యకు నెమ్మనము నంర కామెంచు నంం
కృత్యములు నిచ్చెవేడుక
నత్యంతామోద మొంది హరిహయసపెయున్. 427

ఉ. వాసన వాసుదేవులు సవారితలీలల గ్రీడ సల్పుచుం
గేసరి శౌర్యశాలియగు కృష్ణునకుం బహుభూషణాళి యు
ల్లాసముతో నొసంగుచు విలాస సువర్ణమయాంబరంబులం
భాసుర లీల నిచ్చుచును భక్తి నొనర్చుచు నుండె నిత్యమున్. 428

గీ. కంసవైరియు జంభారి ఘనత మీరి
సఖ్యత నొసంగి యుండిరా సత్యశచియు
దనర సన్యోన్య మిత్రత్వమున జెలంగి
నిండు వేడుక తోడుతనుండు నంత. 429

—: ఆశ్వాసాంతము :—

చ. మను నృప నీతిభూషణ సమంచితభూషణ మాన్యపోషణా
వినుత రణాంత భీషణ వివేక విభీషణ దుష్టశోషణా
మనుజ హితాత్మ జీవన రమాపతిసేవన రమ్యభావనా
జనుపతి వంశపావన ద్విషత్కృత భావన సంశ్రితాసనా. 430

మాలిని:- సరసగుణసమూహా సాధురక్షాసమూహా
స్మరనిభశుభదేహా సర్వదాసర్వదేహా
నిరుపమజనవాహా నీతివాక్యప్రవాహా
పరిహృతమధుమోహా భక్తి సంతుష్టమోహా. 431

క. అనుపమ విభవ శచీపా
ఘనతర కీర్తి ప్రతాప కనక కలాపా
జనుపతికుల ప్రదీపా
హనుమద్రాయా వనీప యాత్మజ రూపా. 432

# రాచకన్యకా పరిణయము

## తృతీయాశ్వాసము

క. శ్రీ బహదరు బహిరి సమా
ఖ్యా బిరుదాంకన విలోకనాన్విత సమర
ప్రాబల్యా రహిత సహిత మ
హాబల వసవరి మహీశ! హనుమదధీశా 1

వ. అవధరింపుము పరీక్షిన్నరేంద్రుండు శుకమునీశ్వరుం గనుంగొని. 2

గీ. శుకమునీశ్వర! మన్మనోత్సుకముగాక
నవలికథ నాకు దెలియంగ నానతీవె
యింద్రపురినుండి శ్రీకృష్ణుడేమి చేసె
శైలముననుండి చెలులు నెచ్చటికి జనిరి." 3

క. అనవిని మునివర్యుం డి
ట్లనియె బరిక్షిత్తుతోడ "ననఘా! వినుమీ
వినిపింతు సాంగమీ కథ
తనరగ జెప్పెదను సావధానముగాగన్. 4

మ. బలదేవుడొకనాడు ద్వారకాపురీ భాస్వత్సభామంటప
స్థలి సింహాసన సీమయందు వితతోత్సాహం బునం గూరుచుం
డి లసత్కాంచన నూత్నరత్నఘన కోటీరాద్యలంకారము
జ్జ్వలగం బున్నమనాటి చందురుని దీపిన్మెను భాసిల్లగాన్. 5

క. సభలోన మంత్రులును భూ
విభులును బందితులు సకలవిద్వాంసవారున్
రభసముగ దన్ను గొలువగ
విభవము కన్నులకు జాల విందొనరింపన్. 6

వ. ఇట్లా సుఖాసీనుండై కూర్చుండి మిత్రులం గనుంగొని యిట్లనియె. 7

—: బలరాముని మంత్రాలోచనము :—

గీ. "వనజ నాభుండు నరకాసురుని జయింప
జనియు బెక్కుదినంబులు సనియెనిటకు
నేటికిని రాడదేమి సందియమొకాని
చింత వొడమెను నేడు మత్స్వాంతమునకు." 8

మ. అనినం రాముని గాంచి మంత్రుల సమూహంబెల్ల నోదేవ ! దు
ర్జన సంహారము సేయ, శిష్టుల నవార్య ప్రక్రియంబ్రోవగా
ఘన ధర్మ స్థితి ధారుణిన్నడుపగా గామించి జన్మించు మీ
కును జింతింపగనేల వచ్చు హరి భాగ్యుండయ్యు నేడింతలోన్. 9

సీ. పూతనాదిక దైత్యపుంజంబు బాల్యకా
బాల్యకాలమున వేధించియు సమసి చనరె
కంసుండు మీ తోడ గడు విరోధము సల్పి
బలు సహాయులతోడ బొలసి పోడె
కృష్ణవేషముబూని క్రీడించి పౌండ్రక
వాసుదేవుడు మేను బాసి చనడె.
బాణాసురుడు వేయు బాహువుల్దెగి యుద్ధ
ధరణిలోపల మీకు శరణు జొరడె

గర్వలో దుష్టరాజ లోకంబులెల్ల
మీరి యరుదెంచి మీచేత దోరిచనరె
యిటుల నరకుని వధియించి యతిశయమున
వచ్చు హరి చింతసేయంగ వలదు మీరు." 10

క. అను మంత్రుల పలుకులు దా
విని హరి ముదమంది చాలవేడ్కఁ దలిర్పన్
దనసభను హితులు తోడుత
మునుకొని యిష్టాను లాపముల నుండు నెడన్. 11

—: చెంచుల రాక :—

సీ. నెమలీకెల తురాయిలమరించు తోలుకు
ళ్ళాయిలమీద జెల్వంబుగాగ
బకిలి కుచ్చుల దండలొకకొన్ని బాగుగా
పాగాల సొబగు లేర్పడగ జుట్టి
పలువన్నె మెకముల బలుచర్మములు గూర్చు
నరచుట్టు లంగముల్దొరగ దొడిగి
కావిలాగుల సిలికాళలు బిగిమీర
బిందుగాజుట్టి యుద్ధంపులీల

బొల్లి నామంబులును గుర్జపూస పేరు
వితతముగ దాల్చి మేటి రైవతకగిరిని
గూడెములచెంచు నాయకుల్గుములుగూడి
తీవి జనుదెంచి రాబందేవు జూడ. 12

గీ. “ఓరి యనుమంత! సీరామ! నారసిమ్మ!
తిరుమలేసుడ! మారకాపురము సెన్న
వరద! సీరంగ! మేకోటవాస!” యనుచు
జెంగి తమతమ పేరుల బిలుచు కొనుచు. 13

ఆ. బలునిగాంచి మ్రొక్కి బహులీలలను సన్ను
తించి మించి తమకరాంచలముల
బెక్కువేడ్క దాముదెచ్చిన మృగముల
నిఖిల పక్షిగముల నిలిపిరెదుట. 14

గీ. కస్తూరి మృగపు బిల్లలు ఘనజవాజి
పిల్లలును లేడిపిల్లలు భీకరంపు
బెబ్బులుల కూనలును గడుచెడిదమైన
సింగముల బొద్దెలను గానుకచేసిరపుడు. 15

మత్తకోకిల. జీడిపప్పులు చారపప్పు వన్యఫలంబులుం
జోడు వాయని వారువంబులు చోద్యమౌ వన పక్షులు
ల్వేడుకల్వెలసిల్లునట్లుగ వింతవింతల చామరాల్
కోడె బెబ్బులి గోళ్ళ నక్కల కొమ్ములున్న జరిచ్చినన్. 16

గీ. మెచ్చి వారికి బహుమాన మిచ్చె బలుడు
మాడలును వస్త్రములు జిగిపైడి సొమ్ము
వీడులేనట్టి చక్కని పాడి మొదవు
లోడక నొసంగె వారికి వేడుకలర. 17

క. ఇచ్చిన గైకొని నెమ్మది
పెచ్చుపెరిగు సమ్మదముల బ్రియము దలిర్పన్
మెచ్చుగొనుచు గొనియాడిరి
విచ్చలవిడి జాతి భాష వెలయగ జెంచుల్. 18

శా. "సామీ! దేవర యాన మీరకను నిచ్చల్సెంచుగూడెంబుల
న్మేమున్నా మ్జవరాండ్లు పిల్లలును నేమిన్నింతమున్లేక యా
బూమిం గాయలు పండ్లు తేనియలు నింపున్మీర బోసేసి మీ
సేమం బెప్పుడు గోరుసుంచెపము పోసింపం దగున్మమ్ములన్. 19

ఉ. దేవరవారు వేటకరుదేరవలె న్భవ దీయసేనతో
రైవతకాద్రి చెంగటి ధరం బస గ్రొవ్వెమెకంబులుండు నా
తావుల జేరనీవు నరతంపములంగడు వేధ సల్పుచుం
దీవరమొప్ప మీరుసనుదెంచి జనంబుల బ్రోవగా దగున్. 20

సీ. నిర్మలోదక పద్మ సీతాకరంబులు
కడు రొంపిగావించు కాసరములు
పండిన సస్యముల్పెండాడి సమిగూడి
చీకాకుగా జేయు సూకరములు
లేడి గుంపులను గాపాడుచు దెరనర్ల
బొడవ దూకెడు నిఱ్ఱిపోతు గములు
దుప్పులు గవయముల్ గొప్పలౌ కడతులు
నేల యీనినలీల గేలిసల్పు

సింగములు బెబ్బులులును మతంగజములు
ఖడ్గశరభాది ఘోరమృగంబులచట
సిల్లర మెకంబులంటె మాసెప్పరాదు
సీరి! మీరలు వేటవేంచేయుదటకు." 21

క. అను చెంచువారి మాటలు
విని సమ్మదమంది, బలుడు వేటాడుటకై
మనసుప్పొంగగ నంతట
తనవారలనెల్ల జూచి తగనిట్లనియెన్. 22

—: **బలరాముని వేట** :—

సీ. సాత్యకి! ప్రద్యుమ్న! సత్రాజితామాముఖ
కాంతాకుమార వర్గంబులార!
అక్రూర కృతవర్మ లాదియాదవ వీర
వరులార! బహుశౌర్యవంతులార!
మొదలు మీమీ సైన్యములు గూర్చుకొనిరండు
వేటబోవలె నటవీ స్థలికిని
మృగములు భ్రమ చెందదగు వేషములతోడ
జవయుక్త కుర్కుర సమితితోడ

వేటపులుఁగులు వలలురుల్నాఁడి గలుఁగు
ఘటుల మృగముల బట్టు నేర్పరులుఁదెండు
మృగములెల యీనిఁకట్లుగా మెలఁగుచుండు
మేటి రైవతకాద్రి సమీపమునను. 23

క. వనముల బులులును హరులును
మనసీవట సంచరించు మార్గస్థుల స
య్యన రండు మనము నచటికి
జని క్రూరమృగాళినెల్ల జంపగ వలయున్. 24

గీ. అనిన విని వేటబోవు నెమ్మనము లలర
మొదలు ధనురాది సాధనంబులు ధరించి
కుర్కురంబులు వేటి పుల్లులను హర్చి
బలుని యెదుటను నిలిపిరేర్పాటు గాగ. 25

సీ. "గజముల మీద నాగ్రహముచే దూకుటో
సింగపు గొదమం చెల్వుదాల్చు
నాబోతుకోడెలపైబడు జిగిజూడ
బెబ్బులి కదుపుల బింకమొప్పు
పెంచిన సారంగ సంచయంబుల గని
యే గోంముల చందమేగడించు
ఖడ్గ భల్లూకాది ఘనమృగంబులగాంచి
గండభేరుండ మార్గముల బొదలు

నిట్టి కుర్కురముం జూడ నిశయముం
వాహముం నాదికూర్మ వరాహములను
గావుపట్టగ జాలిన చేవగలవి
కంఠరవ భిన్న దిక్తటాగ్రములు సుమ్మ. 26

సీ. కాప్రేడు కంగూరగంప హస్మంతు గా
 డడవి బోడము లులాయములవి త్తి
గురుమెకంబుల పొలి గుండె తల్లడ మిడి
 సుడిగాలి యిది వనసూకరముఁ
కడసి త్రుంచును బులికదుపుల జముడిది
 యిది మనుబోతుఁ గదలనీదు
నిర్రిబోతులు బారి గొర్రెలు దీనికి
 కణతుఁ బింకంబుణచు నిదియు

దేవ! కేవలి శునకముల్గావునివియు
దేవతాజీవములు వనజీవములకు
ప్రళయకాలంపు గాలుని పగిది నొప్పు
గొలుసులను బట్టి తెచ్చిన కుర్కురములు. 27

ఉ. గాటము మీరుగా వనఖగంబుల బట్టగ బైకిదోల నీ
వీట పులుంగు సంచయము వింతల నెంతని చెప్పవచ్చునా
మేటి సుధాకరుంగదిసి మ్రింగగ బోయెడి రాహులీల నే
ర్పాటుగ గానవచ్చు బలరామ! జనాళికి నేత్రపర్వమై. 28

ఉ. పక్కస మీసకిం చెసగ ఖాసిలునీబయిదీంద్రుమేటి బల్
రెక్కలగాడ్పు సోకిన ధరిత్రిని గూలును పక్కిగుంపు పే
రుక్కుదొలంగి తాపమున నోర్వక రాసులలీనుండు పెం
పెక్కగ బండ్ల మీద ధరియింపగ వచ్చును వేటగాండ్రకున్" 29

వ. అను వేటకుందోడలైన భటుల మాటలువిని సమొస్మంబు మొగంబునం జెలువొంద రథగజ తురంగారోహణులై తన వారలందరు వెంబడి నడువ మేరుసంకాశంబైన తేరెక్కి భేరికాహళాది మహావాద్యంబులు మ్రోయ వనంబునకుం జనుదెంచెడు సమయంబున పీరభటులిట్లనిరి. 30

సీ. "బల్లెంబుచేనెంత పటునైన కిటినైన
పడ ద్రోయకున్న నీ భటుడగాను
దారి దప్పకను గటారిచే గేసరి
బట్టి త్రుంపకను నీ భటుడగాను
వనగజంబుననైన పెనుతుండమును బట్టి
బాధింపకున్న నీ భటుడగాను
బారిన బడ్డ బల్కారెను బోతును
బంధింపకున్న నీ భటుడగాను

గబ్బి భల్లాకపతినైన ఖడ్గమృగము
నైన గర్జిల్లు బెబ్బులినైనగాని
మహిత నిశిత విలాసి చమత్కారాసి
బట్టి దున్మాడకున్న నీ భటుడగాను. 31

సీ. మును కుంతమున సింగమును గూల్ప మాళవ
క్షితిపతి రతనాల పతక మొసగె
గొరకచే బెబ్బులిం దెరలింప గేరళ
భూవిభుండిచ్చె నీ నేవళంబు
పరశుచే శరభము పరిమార్ప కురుపతి
మేలిమి బల్సర్పిణీ లొసంగె
కారెను బోతును జూరిచే ద్రుంప ద్రా
విడపతి యీ పైడి కడెము లొసగె

దేవ! దబ్బర మాటలు గావుసుమ్ము
కాషరపుడెంత క్రూరమృగమ్మునైన
బట్టి పరిమార్చెదను నాడు బంటు తనము
చేవ గనుపట్టు వలె బలదేవ! మీరు," 32

క. అను వీరభటుల మాటలు
విని సమ్మదమంది "యెంత వీరులుగా నా
మనసునకు దెలియు నీవే
టను గనవలెనింక మీ దృఢక్రమ మెల్లన్." 33

క. వలలు నురులు జిగురు గండెలు
బలు కుక్కల లగుడు భైరి పటు సాళ్వంబుల్
జిల కట్టెలు కన్నె సరా
ల్నలువుగ ధరియించి వనమునకు జనిరంతన్. 34

గీ. వనము చుట్టును దట్టంపు వలలు బన్ని
యెరుక బడకుండ తెరలోనె నురులు బెట్టి
యగ్గి గుహలందు దరికొల్పి రగ్గలముగ
గుములు గట్టుక బలుపోటు కూతలిడిన.. 35

ఆ. పటుతరాగ్ని యంత్ర పట పటార్భటులచే
దిక్కులెల్ల బగిలి దిక్కరులకు
చౌడువడియె నితరజాతి మృగాళికి
భయము బొడముడెంత పనితలంప. 36

క. తావులు వెడలటవీవన
జీవంబులు దారదొడగె జీకాకై హ్రా
ద్భావములు పిగిలి నానా
త్రోవల బోవంగగని యదూద్వహుఁడంతన్.

సీ. బలుడు ధనుర్బాణముల బూని దండిగా
చెండాడె గండభేరుండములను
సాత్యకి నిశితార్ధచంద్ర సాయకముల
ఖండించె శరభ సంఘంబులెల్ల

గ్రొవ్వాడి తూపుఁ గూర్చెను రోషించి
రతిపతి సింహ సంతతులనెల్ల
శార్దూల గణముల సంహరించెను గ్రుచ్చ
వర్మకంఠ ద్బాణవర్షములను

సొంబుగసిధార గాసర సముదయముల
ద్రుంచె ఖడ్గమృగాళి నడంచి రతని
తమ్ములతులిత కాండవేగమ్ము చేత
సకలమృగముల నితరులు చంపిరపుడు. 38

క. జల్లిమృగంబుల ద్రుంచిరి
బల్లిదులగు వీరభటులు ప్రజ్ఞ దలర్పన్
నల్లనివి నిడుఁద సౌరాల్
తెల్లని చామరలుగోసి తెచ్చి రధికముల్. 39

సీ. తతమత్త వనజవేదండ దంతంబులు
తెగగోసి మూపుల దెచ్చువారు
దట్టుకుంభములుజేరి లక్క ముత్తెంబుల
దివిరి మల్లెల మోసి తెచ్చువారు
వేడ్కతో గుహలు ప్రవేశించి యటగాంచి
పచ్చలు కెంపులు దెచ్చువారు
కస్తురి యుంబచ్చ కప్పురంబుజవాజి
తెట్టులుగన్గొని తెచ్చువారు

వీరభటులెల్ల దమతమ పౌరుషముల
దెచ్చిరపు డూపవస్తువు ల్ధిరుంగుచు
పొంచి బలరాముచే మెప్పు గాంచుకొరకు
బట్టుగా నాతనికి గానుకబెట్టిరపుడు. 40

ఉ. ఉగ్రవయస్సు నేకలపు గుంపుల గొంతల బుట్టినట్టి మే
గ్గొఱ్ఱెపొటేళ్ళ గంటుగఁ గొమ్ముల బల్లిదుపైన చుట్టిపే
ఱిఱ్ఱుల ముండ్లు జిమ్ముపెను నెద్దులపై కుశగొల్పు పుక్కలం
బఱ్ఱుగ వోలిపట్టి పుళిపించిరి త్రుంచిరి పేటికాండ్రొగెన్. 41

ఆ. వంల దవిలెకొన్ని వడివార మరికొన్ని
యురుల జిక్కికొన్ని గురులచేత
ధరణిగూలెకొన్ని తత్తరపాటుచే
మృగములెల్ల జాల బెగడుచెందె. 42

మ. సొరిదిన్వే పొదరిండ్లుజొచ్చి గుహలన్శోధించి ప్రత్యంతభూ
ధర్మములన్నరసి వానియుంకువల చందంబల్విచారించి సుం
దరమౌ పచ్చిక పట్లుగాంచి గిరిసత్తంబుల్దగంజొచ్చితీ
వరమొప్పన్మృగ సంతతిం గనుచు దేవంద్రుంచి రా మార్గికుల్. 43

క. కలదేళ్ళ లేళ్ళ పందుల
గుండక గిరులందు బొడము గొఱ్ఱెపొటేళ్ళన్
గెందామర కొలనులకడ
జెందన లాబేళ్ళ మడియజేసిరి మృగముల్. 44

క. చెట్టాడెడు మిన్నాగుల
జిట్టాడెడు ముంగిసలును జిన్నమృగములం
బట్టుకొని తెచ్చి నజరున
బెట్టిరి రామునకు భటులు ప్రియము దలిర్పన్. 45

క. మృగముల జతలు వినాశన
మగుటంగని వనమునందు నంతట బోకన్
ఖగములను బట్టు వేడుక
దగల న్వేటాడు పులుగు తతి గను గొంచున్. 46

వ. బైరీలగు సాళ్వంబు వేగ వారణంబు జంకట్టి కన్నెసరంబులాపి గాగం వేటపులుగుం నెత్తంబుం గమరిన హస్తంబునపై నిడుకొని చోపుకత్రలు కక్షంబునం ధరియించి వలలురులు జిగురుగొయ్యలు ముద్దుడులుం గ్రహియించి పొదరిండ్లం జోహిడి పక్షిగములన్లేపి సాళ్వంబుం పైకిం దోలిన. 47

ఆ. నీళ్ళనుండి నీరుకోళ్ళ నాడేళ్ళను
బీళ్ళ దిరుగు కారు కోళ్ళ జోళ్ళ
గూళ్ళనుండు పావురేళ్ళ పూరేళ్ళను
సళ్ళనీక బట్టె సాహసములు. 48

క. బైరీల పైకి దోలిన
చారు లసత్పక్షజాత చండానిల సం
భారమున గూలె పక్షులు
ధారుణిపై మూర్ఛ జెంది తరతరములుగాన్. 49

సీ. పచ్చరిల్లలు మంగపండ్లు బందరుగాండ్లు
పికిలి పిట్టలు బహులకుముకలును
పెడిసెలు తీతువు పిట్టలు వదరుకల్
పికములు శుకములు బకనికరము
జీనుగుమాయీలు చెందోళ్ళపాలలు
బురుకలు నావంక పుంజములను
తంగేడు గొరువంక తతులు బాటామేక
లాసకొల్పుడు పిట్ట లలరుపైడి

కంటెలును మేటి బేండసుగాండ్లు టిట్టి
భములు నెమ్మిలు మొదలైన పక్షిగములు
కూరె రాసుల కొలదిగా సరసముగను
వెలయ బండ్లకు నించిరి వేటగాండ్రు. 50

సీ. వలలు నేర్పున ధరాతలమున నొడ్డియు
పిట్టల గుంపుల బట్టువారు
పసరు కొయ్యలను వంచించి రెక్కలకును
పగిలించి ఖగముల దిగుచువారు
కమ్మర పురుగుల గూర్చిన ముక్కడు
గుమి బడ్డ పసగాలి గొనెడువారు
నురులలోపల జిక్కి మొరపెడు పులుగుల
దొరకించుకొని బుట్ట ద్రోయువారు

వెలయ బక్షుల బహురీతి వేట చేత
బట్టి చిక్కంబులను బెట్టి బలునియెదుట
బెట్టినను సమ్మదంబంది ప్రేమ చేత
నాదరించెను వారల మోదమెసగ. 51

గీ. లగుడు వార్షంబు డేగజులంబు మరియు
రహిని జలకట్టె కన్నిసరంబులాది
వేట పుల్గులచే బక్కిపాటు గాంచి
బలుడు మిక్కిలి సంతోషపడియెనపుడు. 52

గీ. లగుడులను వేటపుల్గు కులంబు లపుడు
ద్రుంచె శౌర్యంబునను పోల్క సంచయముల
రామ బాణాళి రాక్షసస్తోమముల న
డంచులీలల గడిసి బంధించు లీల. 53

క. చపురుంగాకుల బట్టెను
సమవంబున వార్షసమితి శౌర్యము మీరన్
పమపముల సింహసంఘము
క్రమమున నేనుగుల ద్రుంచుగతి బలసిల్లన్. 54

క. జంకట్టెంగమి సెరుం
బులుగుల సందోహమును బొంకమువంచెన్
బులినికరం బాపోతుం
జెలగును హింసించుటేం చెన్నొందంగాన్. 55

గీ. కన్నెసరములు వాయువేగముంగ గడిసి
తమకమున ద్రుంచి బెగ్గురు సముదయముల
వృకసమూహంబు లాకటి వేఢచేత
గొర్రెపోతులగమిబట్టి కొరుకులేల. 56

క. డేగలగుంపులు బట్టెను
వేగంబు కపోతములను బీరముమీరన్
మూగిన హరిణీగణముం
నాగరకొను జిర్తపులు యాకృతి దోపన్. 57

మ. చలమొప్పన్మృగపక్షి సంతతులనుంజక్కాడి యాయా తతి
స్వాంతోప్పన్శయిలాగ్ర భాగమునకున్వ్యావిన్వోసంబంపి సే
నలనుంగూడుక పర్వతాగ్రభువి యందంబుం గనంగోరి ని
శ్చలతంజేరె బలుండు ఖుర్దనకరేచ్ఛన్ సొంపు పెంపారగన్. 58

వ. మరియు నద్ధరాధరంబు సురాసురజేగీయ మానంబై నిరంతర కిసలయ
కోరక కుసుమ పరిమళ భరితంబులైన నానానోకహంబుల విరాజ
మానంబై పురందరనందనోద్యాన క్రీడాపర్వత శృంగారంబు నంగీక
రించి తత్ప్రదేశంబునం జరియించు చెంచు రాయంచ యానల విపంచికా
సంచరత్సర్వ ప్రసరమాధురీ ధురీణంబుల కుహూంగంబు విధంబునం
భాసిల్లు నవవికసిత కుటజకుసుమ మకరందపాన తుందిలేందిందిర
ఝుంకారంబులవలనను మెరుంగులుం గ్రాయు రంగులం బుపడించు
చంద్రకాంతవిశాలశిలాతలంబుల చిత్తంబు హత్తుకొని నెత్తంబులాడు
వియచ్చర మత్తకాశినీ సముదయంబులవలనను అభ్రంలిహ శిఖర

సమీపదేశంబులం బొడమి నిర్ఝరంబులు క్రిందుగా బ్రవహించు నధఃపాత విర్భిన్నప్రస్తరఘట్టన ధ్వానంబు లురుములని యకాల గర్జనంబులకు సంతసిల్లి వర్షాగమనంబయ్యెనని పురులు విచ్చి కేకారవంబుల నటియించు నీలకంఠజాలంబుల వలనను మరకత మణిమయ దీప్తులం బ్రసరింప బాలతృణ ఖావన భ్రాంతిజేరి విఫలప్రయత్నంబులైచను హరిణీగణంబులవలనను నింద్రనీల గండశిలల దమతమ ప్రతిబింబంబులు దృష్టిగోచరంబైన స్వజాతి వైరంబుల నటలు నిక్కించి భయంకర గర్జనంబుల డుంకి కరాళ నఖర దంష్ట్రాఘర్షణంబునకు నసాధ్యంబై మరలిచను గేసరవిసరంబుల వలనను కమలినీ కైరవిణీ సద్యోవికసిత మధుపానమత్త భృంగరాజ హంసచక్రవాక బకాది జలశకుంతారావంబులం బ్రకాశించి నిర్మలోదకంబులుంగల సరోవరంబుల వలనను, అభ్రంకష శాఖిశాఖా యుగళంబుల మొల్లంబులుగా నల్లుకొన్న వాసంతికాలతా దోలికా సముదయంబులం గూర్చుండి తమచక్కదనంబుచే నమృతాశన సుందరులం ధిక్కరించి కయ్యానకు కాలుద్రువ్వు చందంబున నొయ్యారంబుగా నుప్పరంబంటను నుయ్యెలలూగు తోపు జేజేరా తొయ్యలులవలనను స్ఫటిక శిలాతలంబులం బ్రతిఫలించు నానావర్ణపాతాళ నివసద్వాతాశినీ సమూహంబులంగని తముమునుకరచిన యురగంబులని భ్రమించి తత్తచ్ఛాయల జంచుపుటంబుల బొడిచియు బక్షంబుల నడచియు బదంబుల ద్రవ్వియు దమ ప్రయత్నంబులు వ్యర్థంబులైన వేసరి చను బాలగరుడ పతంగంబులవలనను నభిరామంబై శ్రుతిహితద్విజ శబ్దంబుగావున యజ్ఞవాటంబునుంబోలె హరినివాసంబుగావున వైకుంఠపురంబునుంబోలె పుండరీక నిలయంబు గావున కాసారంబునుంబోలె నవమణి సందోహ కరంబుగావున రాజరాజ గృహంబునుంబోలె గరుడ గంధర్వకిన్నర కింపురుషసిద్ధ విద్యాధరామర సేవ్యంబుగావున హేమనగంబునుంబోలె నొప్పుచున్న యన్నగోపరిభాగంబున జెలికాండ్రతోడ గొన్ని చిత్రంబులు గనుంగొనుచు నొక్కయున్నతస్థలంబెక్కి నలుదిక్కులం గనుంగొన నొక్కదిక్కున మహాడంబరంబైన సైన్యంబు గనుంగొని తన సఖులతో నిట్లనియె. 59

## —: బలరాముడు పర్వతమున కావల సైన్యమును గాంచుట :—

ఉ. ఎవ్వని సైన్యమో యిటకు నేటికి వచ్చెనొ నా యెఱుఁగకె
కివ్వ సధెట్లు దాటెనొ రహింధయలేశము లేక ద్వారకం
బివ్వకుంగాలు ద్రవ్వు యదుశేఖరుడౌ బలరాముడుంచగా
నెవ్విధి దాటవచ్చు కలహించిన ఘోరి గదాయుధోద్ధతిన్. 60

క. అనవిని మంత్రులు బలభ
ద్రునితో నిట్లనిరి "కడు విరోధము సేయం
జనుదెంచిన సైన్యముగా
దనువుగ మన సఖ్యమునకు నరుదెనోపున్. 61

క. అది యెట్లుండినిన మనతో
గదనము సల్పుటకు రాక గాదది ప్రేమా
స్పదమయి తోచుచున్నది
హృదయములకు వితత కుశల హేతువులగుచున్. 62

వ. అనిన విని యతండు నెమ్మనంబున సంతసించి. 63

## —: చార ప్రేషణము :—

గీ. సీరి తనయొద్ది చారుల జేరిపలికె
"మీరలటబోయి సైన్యవిచారమెల్ల
దెలిసి రమ్మ"ని పంపించ తీవ్రముగను
జనియు సైన్యాధికారుల జూతగాంచి. 64

క. "మీ వచ్చుట మాదొర బల
దేవుడు పంపెమమ్ము దెలియుట కొరకై
మీ వృత్తాంతము మాకును
నీవరముగ దెలియజెప్పిరే క్షేమముగున్. 65

శా. ఏ రాజ్యంబున నుండి వచ్చిరి మీరెవ్వారు శైలస్థలిం
జేరంగారణమేమి సైన్యములతో సీరి ప్రభావంబు వి
న్నారో లేదొ బలుండు కృష్ణుడు ససూనద్గాఢ శౌర్యాప్తి భూ
భారంబుం ధరియింపుచుందురు దృఢంబౌ సీర చక్రంబులన్." 66

క. అనవిని వారలు చారుల
గనుగొని యిట్లనిరి "మేము కలహము సేయం
జనుదెంచిన వారముగా
మనిశము మా విభుని యాజ్ఞ కరుదేవంసెన్. 67

మ. మహాగమన వృత్తాంతంబు జెప్పెద వినుండు. 68

—: భగదత్త సైన్యాధి కారుల కథనము :—

గీ. భూరి శౌర్యాతి శయుడైన భూమి సుతుడు
సంబుధీశుని యాతపత్రంబు నదితి
కుండలంబులు గైకొనె ఘోర యుద్ధ
మున బ్రతాపించి దేవతలను జయించి. 69

గీ. సమరమున భూమిలో రాజ సముదయముల
బొంకమణగించి వారిక బుట్టినట్టి
పుత్రికలు నాపదార్వేల పొంతు కలను
దాను పెండ్లాడ వెచ్చెనా దైత్యవరుడు. 70

క. అదిగాకను దుర్మదమున
సవనంబుంగలుగు పుణ్యసతులను దురితా
స్పదుడయి చెర్వగ జొచ్చెను
గదనంబున నెవరు గెల్వగా లేరతనిన్. 71

గీ. ఇటు జగత్త్రయి వానికి నెదురు లేక
సంచరింపుచునుండ సహించలేక
యింద్రుడీ శౌరి సన్నిధి కేగుదెంచి
వెప్పిన గ్రహించె వాని దుశ్చేష్ట లెల్ల. 72

క. 'నీ వేగము నీ యింటికి
నావసుధాసుతుని ద్రుంచి యతివేగముగా
నేవచ్చెద నీయింటికి
నో వాసవ! నీవు చింతనొందకు మింకన్'. 73

గీ. అనిన విని మ్రొక్కి యతడేగె నమరపురికి
సేనతో బోవ గూడదు వానిపురికి
ననుచు సత్యాసమేతుడై యచ్యుతుండు
నరుదెంచెను గరుడ వాహనుడు నగుచు. 74

ఉ. కోటలు క్రొత్తడంబులును గోపురముల్గదతోడ గూల్చె చె
ల్లాటము తోడనుండగ మురాసురుడుంగని ఘోరయుద్ధముం
ధాటిగ జేసు వానిని వధంబొనరించియు దత్సుతాళికిం
గీటణగించి యుద్ధమున గేరుచు నుండగ భూమిసుతుం డొగిన్. 75

క. వివి దారుణ సైన్యంబులు
తను గొల్వగ భేరికాది ఢణఢాణ మహా
ధ్వనులను దిక్కుల ద్రీలగ
జనియె మహారథము నెక్కి సమరోద్ధతుడై. 76

వ. ఇట్లు దారుణాగమనంబునుం గనుంగొని తాను యుద్ధంబు సేయుటకు
సంభ్రమించి తన వల్లభునిచేత సనుజ్ఞ గైకొని. 77

క. సత్యధనుర్బాణంబులు
నత్యంతామోదమునను నందుకతానే
ప్రత్యాలీఢ పదస్థితి
నృత్యము లాడించె నరకునిందల్పేనన్. 78

గీ. ఇట్లు ఘనఘోరయుద్ధంబు నింతిసల్పి
వానివక్షంబు క్రొవ్వాడి బాణమునను
దూరవేసిన పెనుమూర్ఛ దొరగె భువిని
నరకునిసేన పలాయనంబయ్యెనంత.

వ. ఇట్లు సత్యభామ యుద్ధంబు హరి గనుగొని యాశ్చర్యంబు నొంది బహు
మానంబులిచ్చి యాయువతియుం దానును సంతోషంబున నుండునంత. 80

గీ. నిద్రమేల్కాంచు చందాన నిబిడమైన
మూర్ఛదేరియు దానంత భూసుతుండు
వెరచి పోయిన సైన్యముల్మరలగూర్చు
కొనుచు హరిగాంచి మిక్కిలి కోపగించి. 81

క. 'ఆడది యుద్ధము సేయన్
వ్రీడా హీనుండ వగుచు పిరుని వలెనే
యోడక నీవు నిలుచుట
క్రీడా వీక్షణులు నిన్ను గేలింగొనగాన్.' 82

క. అనిన హరినవ్వి నరకుని
గనుగొని 'యోరోరి యధమ! గర్వోత్తరముల్
జనునే నీకల నాడది
పెనకువ నిను బాణసమితి బింకమడంపన్. 83

ఆ. అఖిల జనులు నిన్ను నవమాన మొనరించు
జీవనమునకంటె చావు లెస్స
వనితచేత భంగ మొనరించితిని గాక
మాకు నీవు లక్ష్యమా తలంప". 89

గీ. అనిన రోషంబు మిక్కిలి నతిశయిల్ల
నవనిజుండు దావాగ్నిపై గవయు మిడుత
చందమున శౌరిపై బాణసమితి గూర్చ
హరియు జక్రంబునను వాని శిరము ద్రుంచె. 85

క. మునులును దేవతలును హరి
గొనియాడిరి లోకమునకు గుశలము గలిగెన్
జనకంటకు డగు ధరణీ
తనయుని చావునకు బుధులదైన్యము బాసెన్. 86

క. తన పుత్రుని మరణమునకు
వినతాసు వాహనుండు వేంచేసుటకున్
మనమున దుఃఖము మోదము
జనియింపగ ధరణి కృష్ణు సన్నిధి జేరెన్. 87

గీ. చేరి దండప్రణామంబు చేసి సన్ను
తించి" జగములు గావ మదిందలంచి
యవతరించిన విష్ణుండవయ్యనీవు
సాధురక్షణ దుష్టశిక్షణము కొరకు. 88

క. అని పెక్కు భంగులను హరి
వినుతించియు 'దేవ! నాదు విన్నపమొకటిన్
వినవలె మత్పౌత్రునకును
నఘా! తజ్జనకు రాజ్య మమరించవలెన్.' 89

గీ. అనుచు బ్రార్థించు భూమివాక్యముల కలరి
వాని పట్టాభిషిక్తుగా నొనరజేసి
యకలుషంబైన రాజసేవకులనిలిపి
నీతిమార్గునిజేసి మన్నించెనంత. 90

మ. పురి శృంగారము జూడవేడ్క మదిలో బొల్పొందగా శౌరి సుం
దరమౌవీథులు సౌధము ల్వివిధమాన్యంబైన హర్మ్యంబులున్
స్ఫురితాట్టాలక గోపురంబులును సొంపుల్గుల్కు పణ్యంబులుం
గరమొప్పంగనుచుం జనంగనొకచో గాంచెన్మహా సౌధమున్. 91

క. ఈ సౌధములో వింతం
వాసి గనుంగొనగవలయు వారక ననుచుం
భూసుతుని సుతుడు తన నిజ
దాసుడునై కొలువజొచ్చె దద్వారంబున్. 92

గీ. చొచ్చి తద్గేహమున వెంతజూచుచుండు
సమయమున రాజకన్యల సముదయములు
వచ్చి హరిపాద యుగళ సద్వనజములకు
లీల మ్రొక్కిరి పదియారు వేలసతులు. 98

ఉ. మ్రొక్కిన కాంతలం భువనమోహనలంగని వీరలెవ్వరో
యెక్కడివారొ యిప్పరివసించుట యెందుకొ వేల్పుటింతులం
జక్కదనంబునంగెలువ జాలుదురౌర శుభాంగ వైఖరి
న్మక్కువ వీరి మర్మము సమగ్రమునుం దెలియంగగన్వలెన్. 94

వ. అని తలంచి వారి సందరినిం గ్రమంబుగా నాశీర్వదించి మీ వృత్తాంతం బంతయు దెలుపుమనిన తమ తమ దేశంబులు తమ తమ జనకులు నరకాసురునిచే ఘోర యుద్ధంబున కూలుటయు దమ్ముందాను పెండ్లాడ వలెనని యందరినిం బట్టి తెచ్చి చెరసాల నుంచుటయు మొదలు గాగల తమ యాశయ సంభవంబులగు వృత్తాంతంబు లరుకపరచిన సమ్మ తించినారు కోరిన వరంబులచ్చి వారినందరిని వివాహంబునం గైకొన గలవాడై వారల నందర నలంకృతలం గావించి వారలకు రథగజ తురంగాందోళికా దాసదాసీ జనంబుల నొసంగి తాను నింద్ర పురంబునకు బ్రయాణోన్ముఖుండై, ద్వారకాపురంబునకు మమ్ము నీ కన్యకాజన సహస్రంబుల వెంబడిం జనుకుని యక్షోహిణీ బలంబుతో బరపిన శ్రీకృష్ణుని యాజ్ఞాధారపలమై సముద్రంబునుం దరియించి మాసుందరులు రైవతకశైలంబున గొన్ని దినంబులు నివసింపం గోరిన నింమనిల్చినారము ఇది భగదత్తుని సైన్యంబు నతండు మీ దాసుండగుట మేము మీ దాస జనంబులమని బలరామునకు నమస్కరించి విన్నవింపుడని" న నచ్చారజనంబులు దత్సన్నిధానంబునకు జని సత్యభామ యుద్ధంబు చేసి నరకాసురుని మూర్ఛితుం జేసి తత్సైన్యంబుల బారద్రోలుటయు నంతలోన వాడు మూర్ఛయుం దెలిసి పలాయనమైన సైన్యంబుల మరలం బురికొల్పుకొని పునర్యుద్ధ సన్న ద్ధుండై గోపాలదేవుని నిష్ఠుర వాక్యంబులాడి ఘోరయుద్ధంబు చేసి చక్రముచే నిహతుండగుటయు భూదేవి ప్రార్థనంబున నరకసుతుండైన

భగదత్తుని పట్టాభిషిక్తుం గావించుటయు మొదలైన వృత్తాంతంబు
లన్నియుం జెప్పిన నతండు మనంబున బహు సంతసించి. 95

క. "ఈ బాలికాశిరోమణి
ప్రాబల్యంబెన్న దరమె భువనమున నైన''
దా బలుడగు నరకుని బా
హాబల మణగించి మూర్ఛ నందించెనటా ! 96

గీ. బాల సుగుణాలవాల విశాల శీల
కేల విల్లు నమ్ములును దాల్చియాలమునను
నోలి నరకుని పటు సైన్యజాలములను
బారగా ద్రోలెనట తన బాహుశక్తి. 97

క. దారుణ కర్మంబిడి మగ
వీరులకుం గాక నీలవేణుల వశమే
ధారుణి శూరుల లజ్జం
దూరంగా జేసె గుసుమకోమలి భళిరే! 98

సీ. రిపుడు చివ్వకు వచ్చునపుడు ప్రత్యాలీఢ
పాదమే భంగితా పాదుకొల్పె
సింహధ్వనులు వాడుసేయుచురా ధను
ష్టంకార మెటుసల్పె శంకలేక
ప్రత్యర్థి బాణాళి భంగంబు గాగ న
ప్రతిహత శరములేపగిది గూర్చె
భేరి భాంకారాది భీమారవంబుల
కదరకెవ్విధి నిల్చె గదనమునను

వినగ నాశ్చర్యమై తోచె వెలదులకును
నిట్టిధైర్యంబు శౌర్యంబు లెందుగలవు
సాహసము షడ్గుణము స్త్రీ జనుల కనుచు
బల్కుటయు నిక్కమిది సత్యభామయందు." 99

క. అని బలుడు నిర్విధంబున
దనమరదలి భూరి శౌర్యధైర్యగుణంబుల్
వినుతించె వేయు విధముల
ఘన సంతోషంబు మదికి గలవాడగుచున్. 100

గీ. మది మహాసంభ్రమంబుతో మంత్రివరుల
గనియు భగదత్తు సైన్యాధికార జనుల
జేర బిలిపించి బహుమతి సేయవలయు
బొసగ వస్త్రాన్న పాన విభూషణముల. 101

క. గోవిందుడు పంపించిన
యావరవర్ణినుల నిటకు నాచరలీలం
దేవలయును వారల గన
గావలయును భోజనాదికము లిడవలయున్. 102

క. అని నిశ్చయించి భగద
త్తుని సేనానాయకులను దోడ్కొని రాగా
జనుడని పంచిన చారులు
చని వారల దెచ్చిరతని సన్నిధి కపుడున్. 103

గీ. వారు బలరాము పదయుగ్మ వనజములకు
దమ కిరీటంబులును సోక దండమిడిన
సనయమున వారికధిక దీవనలు సల్పి
యాదరంబున గుశలంబు లడిగి మరియు. 104

వ. అప్పటి వృత్తాంతంబంతయు సవిస్తరంబుగా దెలియం జెప్పుండనిన
వారలిట్లనిరి. 105

మ. "హరి ప్రాగ్జ్యోతిష పట్టణంబునకు శౌర్యంబొప్పగా వచ్చి త
త్పురముంగాసి యొనర్చుట ల్మురసురారిం ద్రుంచుటల్నట్టి భీ
కరకృత్యంబులు విన్నమాత్రమె నశక్యంబైన కోపంబునం
ధరణీసూనుడు సేనతో జనియె యుద్ధక్రీడకు న్మారితోన్. 106

గీ. ''యుద్ధ సన్నద్ధుడైవచ్చె గృద్ధుకగుచు
నిద్ధవాత్మజు బాణవిరుద్ధముస వి
రుద్ధ మణగింతు శౌర్యసంసద్ధనమున"
ననిన హరితోడ సత్యయిట్లనుచు బల్కె. 107

ఉ. ''దేవ! మదీయ వాంఛితముదీర గ నన్గరుణింప గావలె
న్నీ వసుధాతనూభవుని నేక్షణ మాత్రము పోరిచూచెదం
దావక హస్త సంభృత హితంబులునైన ధనుశ్శరంబులం
దీవరమొప్ప నాకు నిటుదెమ్ము కనుంగొని మచ్చమత్కృతుల్.'' 108

గీ. అనిన హరినవ్వి సంతోషమతిశయిల్ల
వారిజాక్షులు రిపులతో బోరువారె
దారణం బగు యుద్ధ విధానమునకు
బూనితివి మాకు నాశ్చర్యమును జెలంగ." 109

క. అని ''కానీ నే జూచెద
ఘనమైన భవత్ప్రతాప కౌశలమ"ను చుం
దన విల్లు నమ్ములిచ్చిన
వనితయునందు కొని మ్రొక్కి వైరి ముఖంబై. 110

శా. ఆకర్ణాంతముగా ధనుర్గుణము ముఖ్యప్రక్రియదీసి పీ
రాకారంబు ఘటించి శౌర్యమున బ్రత్యాలీఢ పాదస్థయై
లోకంబుల్వినుతింప బాణముల చాకృంం గుప్పి నొప్పింప నా
డా కంపించియు మార్చనొందె ధృతిప్రయ్యం బారె దత్సేనలున్. 111

క. ఆ బాణ లాఘవంబును
నా బాహుబలంబు ధైర్యమా సాహసము
న్నే బాలికలకు గల దిల
నీ బాలామణికె దగు నహీన చరిత్రల్. 112

క. క్షామం ఖాండాసురుతో
దామసమున రణము సల్పు దర్పము మెరయన్
ఏ మానినీ శిరోమణి
భూమీసుతుతోడ యుద్ధముం గడు సల్పెన్. 113

ఆ. వాడు మూర్ఛదెలిసి యోడిపారిన తన
సేన లెల్ల మరల దానె గూర్చి
నీరజాక్షు జూచి నిష్ఠురోక్తుల బల్క
ననిని దనడు చక్రమున హరించె. 114

గీ. వాడు రణమున బడిన యా వార్త భూమి
దేవి విని తన పౌత్రునితో దీవరమున
వచ్చి శరణంబు వేడిన వాసుదేవు
డభయ మిచ్చియు వారల నాదరించె. 115

గీ. ధరణి ప్రార్థించె తనపుత్రు తనయునకును
జనకు రాజ్యంబు దయచేసి సాదరమున
వాని బట్టాభిషిక్తునిగా నొనర్చు
మనిన హరి సమ్మతించి దానట్ల జేసె. 116

క. తమునడుగ నచటి వృత్తాం
తము లెల్ల సమగ్రముగను దాత్పర్యముగా
గ్రమమున జెప్పిన విని హలి
యమిత మహాసంభ్రమంబు నందుచు బలికెన్. 117

క. "హరి యుద్ధములో వైరుల
హరియించుట క్రొత్తగాదు హరిమధ్యతగ
న్నరుల జయించుట మాపది
కరుదగు విస్మయంతలోన నాసక్తిచరత్నల్." 118

క. అని "మీరలచటనే భో
జనములు సేయంగవలయు సంతోషమునన్
దనుమధ్యల నిచ్చటికిని
వినయంబున బిలిచి తెచ్చి పెండ్లిడవలెన్." 119

వ. అనిన భగవత్తుని సేనాధిపతులిట్లనిరి. 120

క. చెలువొందు మీప్రసాదము
గలుగుటచే మాప సకల కలుషము లడగెన్
నిలలో నిష్టార్థంబులు
ఫలియించెను విమల మోక్ష ఫలమచ్చె హరీ!" 121

**—: బలరాముడు రాజకన్యలను పిలిపించుట :—**

గీ. అనిన విని ప్రేమతో నచ్యుతాగ్రజుండు
వారివేర్వేర తోడుక వచ్చువారి
దోలి పదియారువేవుర బాలికలను
లీల దెప్పించె సంతోషశాలియగుచు. 122

సీ. బావగారగు బలదేవుని దర్శనం
బెట్లబ్బునోమాకునింపుమీద
ద్వారకానగర నివాసులమై యున్కి
యెన్నటి కబ్బునో సన్నుతముగ
వసతిగా దేవకీ వసుదేవులకు బూజ
గావించుటెన్నడో కౌశలమున
వాసుదేవుండు వివాహంబునను మమ్ము
జేపట్టు టెన్నడో సిరులు మెరయ
ననుచు బదియారువేవురు నంగనలును
జింతచే రేబగళ్ళు నాశించియుండ
వారి భాగ్యంబు ఫలియింపవలను పరిది
బలుడు పిలిపించె వారి వైభవము మెరయ.

ఉ. వచ్చిన యంగనామణుల వన్నెయు వాసియు జూచువేడ్కదా
నచ్చుతునన్నవారలకు నందికిన్విహరింపయోగ్యమై
మెచ్చుఘటించు పర్వతముమీద నొకానొకచోట నిల్పితా
మచ్చిక వారి ముచ్చట సమగ్రము చెల్వగనిల్చె ముంగటన్. 124

క. నిలిచిన బలరామునిగని
లలనా జనులెల్ల మదికలంకలు దీరం
జెలగుచు నతని పదద్వయ
జలజములకు మ్రొక్కి రధికసమ్మోదమునన్. 125

వ. ఇట్లు నమస్కరించిన "శీఘ్రంబుగా వివాహప్రతిష్ఠాసిద్ధింజెంది యాయు
రారోగ్యపుత్రపౌత్రాభి వృద్ధులంబొసంగి ప్రకాశించుచుండుడని"
యాశీర్వాదంబులిచ్చిన సమ్మోదంబులందె యున్న సమయంబున వారల
సౌందర్యంబులం గని యిట్లనియె. 126

చ. "శుకముల రీతిపల్కులును సోయగముల్గడుముద్దుగుల్కు కిం
శుకముల వైఖరిం బొగరుసొంపులు నిల్పు రదాంశుకంబులుం
శుకములు చంచలాకృతిని శోభిలు కన్నుల తళ్కులౌనవాం
శుకములు కంతుడైన మది జొక్కెడె మాజవరాంగ్రడజూచినన్. 127

క. వెన్నెల గుత్తిపులుంగుల
చిన్నెల జక్కవల పొగరు చెన్నుల నగు న
య్యన్నుల తెలిగన్నుల వశి
చన్నుల చక్కదన మెన్న శక్యమె జగతిన్. 128

సీ. తరుణ పల్లవ సముద్ధరణముల్చరణముల్
నక్షత్ర సఖము లీ నఖము లౌను
లక్ష్మీజ కాహళోల్లంఘ లీలంఘులు
కదళికా స్తంభ శృంగారు వారు

లా స్తినా స్తిక పరీక్షా సాధ్యమధ్యముల్
పిరుదులు పులిసంపు బిరుదు లెన్న
కుచములు నిర్జిత లికుచములన నొప్పు
కంఠముల్ శంఖ సోల్లుంఠనములు

దంతముల సౌరు కుంద సంతతుల గెలుచు
జెన్నుదులకింపు తావలు నీ కన్నుగవలు
మొగముల మెరంగు పూర్ణ సోముల తెరంగు
లలికురుల సంచు లింద్ర నీలముల మించు. 129

క. చెండ్లా గుబ్బలు తామర
తూండ్లా బాహువులు మన్మథుండు ధరియించే
విండ్లా కన్బొమ లౌరా
పెండ్లాడ వగును వట్టివెన్నునకబలల్. 130

సీ. దొండ పండ్ల ధరముల్తో రంపు జెక్కుటద్దంపు
నిద్దంపు టద్దముల్నెరి కురులును
నీలంపు నిగనిగల్నె మ్మోముల బెడంగు
నిండుసోములు కుందనికరములును
దంతపంక్తులు కుముదంబుల సొంపులు
కన్నులతీరు సంకాశ నాస
ములరేఖ తిలసూనములగెల్చు కఠినంపు
గబ్బల జిగిహేమ కుంభములను

జిలువల హసించు నూగార్ల చెలువు నాభి
గములు జలపరివాహ విభ్రమములెన్న
సైకతంబులు పిరుదులు సరసిజాత
ములను వచించు కరపాదములు చెలులకు." 131

వ. అని వారల సౌందర్యంబు స్తుతియించి యిట్లనియె. 132

క. "నరకాసురుడె య్వేధమున
చెరబట్టెను వాని ద్రుంచి శ్రీకృష్ణుండే
నెరవుల మిమ్ముం దెచ్చెను
తరళేక్షణలరా! మాకుదప్పక చెపుడీ." 132

వ. అన విని సంఘటిత కరాంజలులై తమ తమ దేశంబులును దమ తమ జనకుల నరకాసురుండు యుద్ధంబుల సంహరించి తమ్ముందెచ్చి చెర బెట్టుటయు దాము బాల్యంబున నిండ్లలోనుండి శ్రీకృష్ణుని చరితంబులు విని యతనిపై మోహంబులు గలిగి యుండుటయు చెరసాలకు నారదుండు వేంచేయుటయు నతని పూజించి మా వృత్తాంతం బంతయు వారికి విన్నవించి మమ్మునందరి రక్షించుమని ప్రార్థించుటయు నతండు ద్వారకకు వేంచేసి తెలియజెప్పిన విని చక్రి యటకుం జనుదెంచి ఘోర యుద్ధంబున నరకువధియించి భూదేవి ప్రార్థనంబున వాని సుతునకు బట్టంబు గట్టి మమ్ముంగాంచి మా మనవులు విని మా కోరిన వరంబు లిచ్చి మమ్మిటకు సైన్యంబుతో బంపించుటయు మొదలుగా గల వృత్తాంతంబులన్నియు జెప్పిన విని సమ్మోదంబు నొంది యిట్లనియె. 134

క. "చెలులార మీరలిప్పుడు
సులలిత భోజనము లిచట సల్పి వలయుం
జెలగు మహావైభవమున
నలద్వారవపురికి మనము నరుగగ వలయున్." 135

వ. అని యాదరించిన సంతసించి నమస్కరించి యా రాజకన్యక లిట్లనిరి.

సీ. ఘన తానకేన సందర్శన చంద్రోద
యమున కలరుచకోరంబులట్ల
బాలపద్మాప్త సంభవమున పాలించి
తమ కెంచు చక్రవాకములకీతి

సన్మేఘ దర్శన స్వాంతహితముంటయ్యు
నటియించు నీలకంఠములలీల
భాసమానంబైన పద్మాకరంబును
గనుగొన్న చంచరీకములభాతి
యుష్మదీయాంఘ్రి సరసిజ యుగ్మమందె
భక్తిగలిగిన మాకచ్చె బద్మనేత్రు
వరసుఖానంద సామ్రాజ్యవైభవములు
రామ! యదుకుల సోమ! శాత్రవ విరామ!" 137

క. అని తనుగొనియాడిన యా
వనితల వాక్యముం కలరి వసుదేవ సుతా
గ్రణి బలదేవుండిట్లనె
నెనరుంగల వాక్యములను నెయ్యంబలరన్. 138

గీ. "పూర్వ జన్మతపఃఫలంబులన కాదె
మీకు మా కృష్ణసేవాను మేళనంబు
నబ్బుటలు బ్రహ్మరుద్రాదులందరాని
పదవి చెందెదరిక మీరు సుదతులార!" 139

వ. అని లాలించి భోజన ప్రయత్నంబునకు లెండని చెప్పి సూపకాధికారుం రావించి, యిటకు శ్రీకృష్ణుండు పంపిన కాంతాశిరోమణులకు, వారి వెంబడింగల సైన్యంబులకు, మన సైన్యంబులకు, మదీయామాత్య సఖశిఖామణుల కందరకు దత్త దిచ్ఛానుకూలంబుగా భోజనంబు లిడుండని చెప్పిన. 140

—: విందు భోజనము :—

సీ. వేటాడి తెచ్చిన వివిధంబులైనట్టి
పక్షిమృగంబు లేర్పాటు గాగ
ననుభవింప నయోగ్యమైన వాటిని నెల్ల
భూధరోపరియందు పాతముచేసి

పరికర ద్రవ్య సంపదలింపు మీరగా
గూర్చియు ఘృతపక్వ కుశలు లగుచు
జంబీర జీర సర్షపయుక్త రామచ
సంవాసిత ద్రవ్యసంతతులను

మరియు ప్రత్యేక రుచిగల మాంసములును
నరుదు పరిమళ మిళిత పర్యాన్నములును
సూపములు కూరగాయలు సొంపుమెరయు
సూరుపిండ్లూరుగాయలు చారుగములు. 141

సీ. అంబోదములు వడలతిరసాల్గారెలు
పుగ్గిలు పేణీలు పూర్ణమంరు
బూరెలు పుణుకులు నీరత్తియలును చే
గోడీలు పూరీలు కుడుములెన్న
నలరిన కజ్జికాయలు చక్కిలాత్తేనె
తలలు మనోహరములును మరియు
లడ్డువ లడ్డెన లలితమౌ మోరుండ
లంగెర వల్లియలాది గాగ

మాలతీలును చెక్కుడు పూలసేవ
లమర గూర్చిన పాయసాన్నములు వండి
కావడుల మోసి తెచ్చి ముఖ్యస్థలముం
దెంచినను గాంచి బలుతు వడ్డించుమనియె. 142

వ. అప్పుడు. 143

సీ. దుష్టశిక్షణమును శిష్టసంరక్షణం
బొనరింప యదువంశమున జనించి
నట్టి మహాత్ములు నచ్యుతాంశోద్భవు
ల్బలకృష్ణులిద్దరు వారెయుండు

రాముండు వేటాడ బ్రమపంబునను వచ్చె
　　నతనికి బ్రియము సేయంగ వలయు
నని వరుణుండును దనపేరిటాసవం
　　బును బంపెబలునకు నెనరుతోడ

నతులితానందియై యతడ పెగ్రహించి
రైవతకశైలమున నుండు దేవతలకు
మహిత నానావిధాపూప మద్యమాంస
వితత దివ్యాన్నములను నైవేద్యమొసగె. 144

క. దేవతలకు నైవేద్యము
గావించిన ద్రవ్యములను గౌశలియగుచున్
రేవతి రమణుడు పంపెను
నావర వర్ణినుల కెల్ల నాదరలీలన్. 145

వ. అందరినిం బంక్తులేర్పడం గూర్చుండ బెట్టి కుందనంపు బళ్ళెరంబుల బక్వపదార్థములు వడ్డించి వారుణి ప్రభృత మత్తద్రవ్యంబు లొసంగిన ననుభవించి. 146

## —: రాజకన్యకల మద్యపానము :—

క. వరుణుడు పంపించిన యా
సురరుచిగొని సుదతులెల్ల సొక్కి ప్రమోదా
భరితలయి సన్నుతించిరి
సురుచిర వారుణిని సరస శుభ వాక్సరణిన్. 147

సీ. "కండచక్కెర పానకంబంద్రు జనములు
　　నమ్మమ్మ! యీయాసవమ్ము సరియె
ద్రాక్షారసంబు మధురిమాంభుద్రమందురుగాని
　　జుంటితేనియ దీనివంటి దగునె

కమ్మదనమ్ము చొక్కమ్మని యెంతురు
పొలమీగడ దీని బోలునటనె!
మాధుర్యముచ ఁ దియ్యమామిడి ఫలరసం
బంద్రుడుదీటౌనె యీ హాలమనకు

భువినిగల సర్వ ఫలరసములు గ్రహించి
దీని గల్పించెనో చతురాననుండు
నిట్లుకాకున్న నీరుచులేలకలుగు
ననుచు బొగడిరి యంగనా మణులునెల్ల. 148

మ. మదిరాపాన ప్రమత్త చిత్తలగుచు న్మత్తేభయాల్సుఖా
స్పదమై తోచిన యప్పదార్థమును జెప్పన్రాని సంతోషముం
బొదలంజేసెను గన్నులందు మది సొంపుల్గార్చె నంచుందగం
బదియార్వేరు కన్యకామణు లపభ్ర స్తోత్రముల్సల్పుచున్. 149

చ. వడియము లప్పడాల్ రుచిరవంతములైతగు బిండివంటలం
గడికడికి న్వినోదరుచి కల్పనజేసెడి పక్వమాంసముల్
సడలని దివ్యవాసనల సంపదలన్విలసిల్లు నన్నముల్
దడయని కూరగాయలు ఘృతప్లుతమొప్ప భుజించిరంగనల్. 150

సీ. కమ్మగా గాల్చిన కర్రికుట్ల నొకర్తె
కొకతె బర్రేమ చేతికినొసంగు
బంగరు గిన్నెలోపల వారుణినినించి
మెచ్చుగా నొకతెకందిచ్చు నొకతె
ప్రకటమత్తద్రవ్యమొకతెకు దినిపించి
యొకతె నవ్వేను బకాపకలు చెలగ
వాసించు పచ్చి లవంగాల దేలిసి
సొరాయి నొకతె కొసంగు నొకతె

వాసనామృతపాన విలాస మత్త
చిత్తలగుచును దమతమ చేష్టలెల్ల
మించు వేడుకతో బ్రకటించుకొనుచు
కేళి గావించి రతివలక్కాలమునను. 151

ఉ. గానమొకర్తె పాడను బికస్వర సుస్వరముల్చెలంగగా
వీణగ్రహించి మీటు నలివేణి యొకర్తె శిలల్గరంగగా
జ్ఞానముదెల్పునొక్కతె జగజ్జనముల్ముదమందుచుండగా
దేనియజిల్కుముచ్చటలు గెల్పునొకర్తె సఖుల్నలింపగాన్. 152

సీ. "మాలూరఫలములు మర్రిచెట్ల ఫలించె
నీవింతగంటివే యిగురుబోడి!
జంబీరములు బుట్టు నింబతరువులయందు
నీ చోద్యమేమమ్మ యిందువదన!
నేరేడు చెట్లకు నారింజలుదయించె
నీమహత్వంబేమి కోమలాంగి!
ఖర్జూర వృక్షసంఘములందు ద్రాక్షలు
పండుట చిత్రమౌ పంకజాక్షి!"

యనుచు మైరేయపాన సంజనిత మత్త
చిత్తలగుచును దమతమ చేష్టలెల్ల
జూచువారికి వింతలు దోచునట్లు
భ్రాంతి ముచ్చట లాడిరి పణతులెల్ల. 153

సీ. మానస పూజావిధానక్రియల గృష్ణు
గాంచి సేవించిరి కన్నెలపుడు
హరికీర్తనామృత సరసిజాకరమున
దేలియాడిరి రాజబాలికలును

దేవకీనందన భావిఫలాప్తి కు
ప్పొంగుచుండిరి రుచిరాంగులెల్ల
జిత దితిసుత శౌరి వితతకథల్వేని
కొనియాడు చుండి రావనిత లెల్ల

గడియ కొక యేడుగా బ్రొద్దు గడుపుచుండు
కామినీమణి లాసవ భ్రామకమున
దేహముల చింత కాసంత తెలియలేక
నీలవేణులు హరిమీద జాలిజెందె. 154

క. ఇవ్విధమున నారీమణు
లువ్విళ్ళూరుచును దర్పకోత్సవమునకుం
గవ్వుచు హరిపై మోహము
నివ్వటిలంజెలంగి రపుడు నెరి వేడ్కలతోన్. 155

ఆ. అర్కుడ స్తమించె నరుణిమ చిగురించె
రిక్కలుద్భవించె మిక్కుటంపు
టిరులు సందడించె నిందుడు నుదయించె
వెన్నెలలును మిగుల విస్తరించె. 156

క. ఆ మదవతుల గుణంబులు
రాముడు పరీక్షసేయు రహిగను పట్టె
న్నామధురిపుపై మిక్కలి
వ్యామోహము గాంచి గౌరవంబున బలికెన్. 157

గీ. "నిద్దురలు వొంది చెలులార! ప్రొద్దు వోయె
ప్రొద్దునను లేచి ద్వారకాపురమునకును
మనమునందరమును వేడ్క జనగవలయు
మేలుకొని యుండ నాయాసమే ఘటించు". 158

గీ. అమృత తుల్యంబులైనట్టి యతని వాక్య
ములకు సంతోషములు జెంది ముదితలెల్ల
నిద్దరలు బోయి రావేళ నిండు వేడ్క
నాట పాటలు ముచ్చట లన్ని సడలి. 159

వ. అప్పుడు. 160

మ. వినతానందన వాహనాగ్రజుడు శ్రీవిస్మీరగా విశ్వక
ర్మనురావించి తదాత్మ సంతసిల సన్మానించి "యీకన్యకా
జన సంఘంబు పదారు వేవురకు మెచ్చౌ సౌధజాలంబులిం
దిననాథుండుదయించు వేళకు శుభాప్తింగాగ గల్పించుమీ ! 161

క. ప్రాతః కాలమునకు మే
మేతెంచెద మీవుబోయి హేమమయంబుల్
జాతి సురత్నస్థగితో
పేతంబులొనర్చు సౌధ బృందములు తగన్. 162

మ. శివయక్షశ్వసన స్ఫురద్వరుణ రక్షేశాంతకాగ్నీంద్ర ది
గ్ధవ సౌధంబులకంటె మిక్కిలి వినోదంబైన మేడల్మహో
త్సవముప్పొంగి జనుల్నుతింపగ విలాసస్ఫూర్తి గల్పించుమీ
రవి భాస్వంతములై చెలంగగ నపూర్వంబైన దద్యుతిచేన్." 163

గీ. అనినవిని మ్రొక్కి పురికేగి యచ్చటజేసె
నిచట నిద్దురబోయిన యిందుముఖులు
సరసుడగు కృష్ణుచే గ్రీడసల్పినట్లు
గలలుగాంచియు మిక్కిలి కళవళించి. 164

వ. స్వప్నాను భవంబులైన చేష్టలు నొకరికొకరు జెప్పుకొనుచు నిట్లనిరి.

—: రాజకన్యల స్వప్నానుభవములు :—

సీ. "సొగసుగా జెక్కిళ్ళు చుంబించి చుంబించి
చేరిమోమున మోము జేర్చెనమ్మ?
కరమున పాలిండ్లు గదియించి గదియించి
మించువేడుక గౌగిలించెనమ్మ!
చక్కెరమోవి చురుక్కన పలుకెంపు
లుంచుచు దయను లాలించెనమ్మ!
అతను సంగరమున కతివమిబుట్టించి
కళలు ఝల్లనగను గవిసెనమ్మ

కలయనుచుదోచు నిక్కంబుగాగదోచు
నెందుబోయెనో యిటుజేసి నందసుతుడు
నంగజుని బారికిట్లు నన్నప్పగించె
చేరి యొకరికి నీసిగ్గు జెప్పనీదు. 166

క. నా కలలో హరి వేడుక
జేకూరగవచ్చి సంతసిల విరిదండల్
నా కొప్పున గంతమున
కో కొమ్మ! నలంకరించె గోమలి! వింటే. 167

క. జాంబూనదాంబరుడు సర
సంబుగ నా కలనువచ్చి సాధ్వీకోవే
తాంబూల చర్వణంబని
సంబరపడి నోటికొసగె చనియెంగదనే! 168

క. ఓ కాంతా! నా కలలో
శ్రీకాంతుండేగుదెంచి చెక్కిళ్ళ కుచ
ప్రాకట సీమల వ్రాసెను
గా కరచాతురిని మకరికా పత్రంబుల్. 169

మ. తరుణీ ! కృష్ణుడు నాదుస్వప్నమున నుత్సాహంబుతోవచ్చినన్
పరిరంభం బొనరించి చుంబనములుం బల్మారు గావించి న
స్మరకేళిం దనివారదీర్చి మణిదామంబిచ్చి యారీతి సు
స్థిర సౌఖ్యంబులు సల్పువాని క్రియజేసెన్ లేడుమేల్కాంచినన్." 170

క. అనవిని "కృష్ణుడు మనలను
ఘనముగజేపట్టితాను గళ్యాణ విధిం
దనరగ గైకొనగలడని''
యనుపమ సంతోషమొంది రంగనలెల్లన్. 171

క. అని తమ స్వప్నములను దో
చిన మాటల నొకరికొకరు జెప్పెడువేళం
గనుగొన నిశాంతమయ్యెను
విను మిందుం డస్తమించు వేళబొసంగెన్. 172

సీ. సత్సంతతులకు దేజంబులు కడజారె
ద్విజకులంబుల రొదల్దిశలుమీరె
రాగోదయంపు బరంపరల్మితిమీరె
బంకజాప్తుని విజృంభణము జేరె
పగలు బుట్టుటకు దంభమ్ములు చేకూరె
గువలయం బాపద గుడువ దూరె
నాశ్రయించిన చకోరాళి యాశలు దీరె
దనయాప్త చంద్రకాంతములు డాగె

నరయ పరచక్రముల భయమంతదీరె
వరుస తోడుత సన్మార్గవర్తియైన
మహితయశుడైన సర్వజ్ఞమౌళియైన
సత్ప్రభుడు భూమిగావని సమయమునను. 173

వ. అంత, 174

వ. ఇట్లు చనిచని. 180

గీ. పురి సమీపంబునకు జేరబోవునంత
పౌరులెల్లను నతని వైభవము గాంచి
"యేమిజయవార్త వినియెనో కామపాలు
డున్నతానందమున వచ్చుచున్నవాడు." 181

క. అని యతని జూడబోదా
మనికాన్కలు గొనుచు మేడ్కలలరగ నంతం
జని తత్పాదాంబురుహము
లనుగాంచి నమస్కరించలాంన నతడున్. 182

గీ. వారి దీవించి సంతోషనార్థిదేల్చి
తత్సమర్పిత వస్తువుల్తాగ్రహించి
ధరణి సుతుతోడి కృష్ణు యుద్ధ ప్రకార
మంతయును దెల్ప వారలు సంతసించి. 183

క. "దేవరవారి ప్రభావము
నావనరుహాభవునకైన హరునకు నైనం
దేవేంద్రుకైన మరియును
నా వాసుకి యగ్రజాతు కలవియె తెలియన్. 184

క. నీవేమి కృష్ణుదేమియు
నీ వసుధను భారమగు మహీశ దనుజులం
జీవములు హరించుటకును
శ్రీవరు సంశజులటంచు జెప్పుదురు బుధుల్. 185

క. దేవరవారలు నగరము
దీవరముగ జేరి శౌరిదేవుల కెల్లం
దావులు కల్పన సేయుట
కేవల సౌజన్య"మనుచు గీర్తింపంగన్. 186

గీ. "అతివలను బ్రోవ ధర్మంబు" యనుచు వేడ్క
ధర్మశాలలు కేళికోద్యానములును
దీర్ఘికలు చెర్వులును నదుల్దేవళములు
సారె గాంచుచు జనె పురద్వారమునకు. 187

శా. శ్రీరామామణి కేళికాసదనమై శృంగార భూమీరుహ
స్ఫారోదంచిత పత్రపుష్పఫల సంభారానతారామమై
నీరోదార తటాక దీర్ఘిక సరిన్నిర్నిద్ర కాసారమై
శ్రీరమ్యంబగు ద్వారకాపురము జొచ్చెన్ రాముడుల్లాసియై. 188

గీ. కుశల గుణ రూపశాలి షోడశసహస్ర
కృష్ణనవ్యాంగనాను సంకీర్ణుడగుచు
సకల సేనలు గొల్వ నుత్సాహలీల
రాజవీథిని బలరాము రాక గాంచి. 189

గీ. కనకమయ సౌధముల వారకాంతలెక్కి
రాముడతివేడ్క పురవీథి రాకగాంచి
ముత్తెముల సేసలును నవపుష్పములును
లాజలును జల్లి రతులితోల్లాసమునను. 190

మ. పురిశృంగారము జూచుచుం బ్రజల సద్భోగాప్తికి న్మెచ్చుచుం
ధరణీ దేవమహీశ్వరార్యవర శూద్రప్రౌఢ విద్యాధురం
ధరభాగ్యంబులు గాంచి సంతసిలుచుం ధాత్రీశకన్యామణుల్
పురవీథిం బలరాము వెంటజనుచో బొంగారుచున్వేడ్కలన్. 191

గీ. ఇట్లు తనవెంట జనుదెంచు నిందుముఖుల
దెలియజూచుచు "వసుదేవ దేవకులకు
వరుసమ్రొక్కియు వారి దీవనలు గాంచ
వలయుమీరలు చెలులార! వాంఛదీర." 192

క. అనుబలరాముని వాక్కులు
విని సంతసమంది చాలవేడ్కదలిర్పం
గనకమునకు ఘనవాసన
జనియించిన యట్లు కాంతి సతులకు జెందెన్. 193

క. అనక కన్యకలందరు
గొనకొని వసుదేవదేవకుల పాదములం
గని వరుసతోడ మ్రొక్కిరి
కనకాబ్జములకును దేటి కదుపులీలన్. 194

వ. మ్రొక్కిన వారలు సంతోషాతిశయంబునొంది బలరామునితో "నీకన్యకా సహస్రంబు లెవ్వరని" యడిగిన నతండు "నరకాసురుండు దిగ్విజయంబు చేసి రాజసమాదయంబుం సంహరించి వారి కన్యకా సహస్రంబుల దాను బెండ్లాడంగలవాడై ప్రతిబంధంబున నుంచిన నారదుండు కన్యకాజనంబుల యొద్దికి నయత్నంబుగా జనుదెంచిన నతనింబూజించి ప్రార్థించ, కృష్ణుని సన్నిధానంబునకుం జని మనవి చేసిన నతండను గ్రహించి ప్రాగ్జ్యోతిషపురంబునకుంజని ఘోరయుద్ధంబున వానిసంహరించి కన్యకాసహస్రంబు లందరు దన్ను వరించిన వారల వివాహంబుగా దలంచినవారై యిటకుంబుత్తెంచినాడు తాను నిద్రలోకంబునకుం జనినవాడు నింతలో రాగలండని" చెప్పె. 195

సీ. భీష్మజ మొదలైన భీతమృగాక్షుల
నేడ్వురమనముల కింపుదనర
జేసి వారిప్రసన్న చిత్తలగావించి
పదియారువేవుర పడతులకును
విశ్వమోహనముగా విశ్వకర్మ ఘటిత
నిర్మల సౌధాళిలో నిలుపదలచి
వారిండ్ల పుణ్యాహవాచనల్గావించి
తగ బ్రాహ్మణులకు సంతర్పణములు

జేసివారం మనముం జింతదీర్చి
కోరకయమున్నె వలసిన భూరివస్తు
భారములు పంపె వారి నివాసములకు
వారలు ముదంబునొంది రవారితముగ. 196

క. ఒక్కటనైనను వారికి
దక్కువగాకుండ బహుపదార్థములెల్ల
న్మిక్కిలి పంపించుటచే
"మక్కువమనయందు గలదు మరి హలి కనగన్. 197

క. రంజితమణి భూషణములు
మంజుల నవ కనక చిత్రమయ చేలములుం
గంజాతాది సుమంబుల
పుంజంబులు మృగమదాది ముఖ్యపరిమళాల్. 198

క. వేడకమును బంపించెను
బోడిమిగల సకలవస్తు పుంజము, హలికిం
జోడగునె కల్పవృక్షము
వేడిన నిడుగాక తనదు నిత్తరణమెల్లన్. 199

క. మనసులు తెలిసిన సద్గుణ
ఖనియగుగద హలధరుండు కానినాదుల్
తన దాతృతకును దీటా"
యని సన్నుతిజేయ జొచ్చిరంగనలెల్లన్. 200

గీ. కృష్ణుడాదిని తమునాదరించి నటుల
భోజనాదిక బహుమానముల జెలంగి
సంతసింపుచునుండి రాకాంతలపుడు
"హరికెమాకు వివాహమౌ నెరగదెట్టొ." 201

—: రాజకన్యల విరహము :—

మ. అని చింతింపుచు రేబగళ్ళు హరిపై నత్యంతమోహాప్తిచే
వన జాతాస్త్రశరప్రవర్షములు దుర్వారంబులై తాకగా
ననబోణుల్ హరిరాకగోరుచు "ముకుందా! మమ్ము రక్షించవే
యనురాగమ్మున వేగనందరి వివాహంబంది చేపట్టవే." 202

ఉ. కాయజు డిక్షుకార్ముక ముఖంబున గ్రొవ్విరితూపురేయ రే
రాయడు వేడివెన్నెల పరంపరలున్వెసగాయ గోకిలల్
కోయని చౌలు చిందరగగూయ మదాళులు ఝుమ్మఝుమ్మన
న్మ్రోయగ మందమారుతము మించుకవచ్చె నిటెట్లు తాళగన్. 203

సీ. అంచితంబుగను రాయంచ పటాణి
మాదార్ల బలములు మడిసికొలువ
జంకలన్మొగలి వజీర్ల కట్టాపౌజు
బారులు దీరి వెంబడిగ నడువ
సర్వభుగ్వరసంఘ సైదుల లసకరు
ల్మానల నేర్పరచుక మోహరింప
గోకిలలను మేటి శేకు పతాకినీ
భీకరధ్వనులచే విరహులదర

వచ్చెవలరాజు తనదుసవారిమెరయ
రంగుగా మలయపవన శతాంగమెక్కి
కొదమ తుమ్మెద సిద్దీల రొదలుబొదల
యింకతాళుట మెట్లకో యిందుముఖులు. 204

క. ఆ తరుణులనిరి "సుమశర
జాతమ్ముల మను జాల జడిపించెడు నీ
చేతో జాతుని జాతర
చేతామా కొంత శాంతి జెందుట కొరకున్." 205

మ. అని యూహించి ధరాధి నాయకుల కన్యాసంఘముల్మేటి క్రొ
న్ననలన్నొప్పగు కప్పురంపు తగమిన్నాజాతి కస్తూరి వా
సనలుం బున్గు జవాజియున్మరుని పూజల్సల్పగా గూర్చిమే
ల్వన జాతాయత పత్రికందదను రూపంబున్వెసన్ వ్రాయుచున్. 206

గీ. భవ్యమౌమొగిలిపువు చప్పరము క్రింద
దీరు సొగసైన బుప్పొడి దిన్నెమీద
మదను నాకృతి నిల్పియా మదవతులను
నర్చనారంభలై యిట్టులనిరి భక్తి. 207

సీ. తుభ్యమర్ఘ్యం జగస్తుత్య రతీశాయ
పాద్యమంభోజాత పటుశరాయ
యాచమనీయ మవాప్త దిగ్విజయామ
స్నానీయమతిశయ సంభవాయ
హేమాంబరం గ్రాహ్య మిక్షుశరాసాయ
మణి భూషణాళి తేమధు సఖాయ
మాధుర్య నైవేద్య మాదయాసింధవే
చందనం లలిత వక్షస్థలాయ
పూర్ణచంద్ర సహాయాను భూరిమధుర
నిబిడ శుకపికనినదామ నిజ ప్రతాప
నిరహాజనమాన మథనామ విధుసఖాయ
మనసిజాయ నమోనమో'' యనుచు మ్రొక్కి. 208

వ. ఇట్లు మనసిజగురు కైంకర్యాభిలాషలై యుండిరి. 209

—:ఆశ్వాసాంతము:—

మ. ఘనసంగ్రామ పరాక్రమ క్రమకళాగాంగేయ గాంగేయ దృ
ష్ఘునవో పక్రమ విక్రమ స్మృతివిచారాధేయ రాధేయకో
కనదాప్త ప్రతిమాన దానకలనాగాధేయ గాధేయ వై
రినిరోధాధ్వరపాల సత్యవచన శ్రీకాయ శ్రీకాయకా. 210

క. ప్రాలేయ కుధరధైర్యా !
శూలాయుధశౌర్య ! శత్రుసూదన కార్యా !
బాలాప్రియ సౌందర్యా
పాలిత కవివర్య ! కీర్తి భాసురచర్యా ! 211

మాలిని. అభయభట సమాజా ! త్యాగమందారభూజా !
విభవజితబిడౌజా ! విస్ఫురత్సూర్యతేజా !
శుభమతి మహిజాప్మా సుందరాంగీ మనోజా !
సభయ విమతరాజా ! సత్కళాభోజరాజా ! 212

## గద్యము

ఇతి శ్రీమత్సింగ పట్టణ లక్ష్మీనృసింహస్వామి కటాక్ష వీక్షణ
కృపాపాత్రుండును నాశ్వలాయన సూత్రుండును విశ్వా
మిత్రమౌని విఖ్యాత గోత్రుండును ముత్యాం
యప్పయామాత్య ద్వితీయాక పుత్రుండునగు
వెల్లూరు నరసింగకవి ప్రణీతంబైన
రాచకన్యకాపరిణయంబను మహా
ప్రబంధంబునందు తృతీయా
శ్వాసము.

— ο —

# రాచకన్యకా పరిణయము

## చతుర్థాశ్వాసము

క. శ్రీలలనామణి విహరణ
లీలాసదనా! కృపాంచిత మకరంద
శ్రీలసిత కమలసమ నే
త్రాలోక కటాక్షజాల! హనుమన్నృపాలా! 1

వ. అవధరింపుము! శ్రీపరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

క. "అవ్వలికథ యెట్లయ్యెను
నవ్వనితలు మోహవార్ధియందు మునుగుచు
న్నెవ్విధి దరియించిరి మరి
కవ్వడి సఖుడేమి చేసే గాంక్షదలిర్పన్". 3

క. అనవిని శుకుడు పరీక్షి
జ్జననాయకు తోడననియె "సాంగము గాగా
వినుపింతు సాంతమీ కథ
వినుమ"ని చెప్పందొడంగె విస్మయమొదవన్. 4

సీ. వాసవుండును మరి వాసుదేవుండును
సన్యోన్యమిత్రత్వమతిశయిల్లి
సుఖగోష్ఠినుండుచో సురపతి హరితోడ
జనువుమీరంగ నిట్లనియె ప్రీతి
"రంభాద్యనేకాప్సరలగూడి మనమును
సత్యభామాశచీ సహితముగను
సప్తపక్షతులు వత్సరములును మొ[illegible]యగా
అనవరత నందన వనములందును

నచట క్రీడలు సల్పి ప్రఖ్యాతి గలుగు
దేవగంగను జలకేళి దేలి యటకు
మరలి చనుదెంచి మణిమయ మందిరముం
నురుతరానంత సుఖగోష్ఠి నుండవలయు.'' 5

క. అనవిని సంతోషము తన
మనమున బెనగొనగ నంత మాధవుడా యిం
ద్రుని గనుగొని సరిసరి వెస
జనవలెనచ్చోట క్రీడ సల్పగ వలయున్. 6

—:ఇంద్రాదుల నందనవన విహారము:—

క. అని యిరువురు ముదమొదవగ
వనితలతో సకలదేవ వర్గముతోడన్
జని వనముజొచ్చి క్రీడా
జనితాశయులగుచు గుసుమ చయములు గనుచున్. 7

ఉ. ముప్పదిమూడు కోటుల సముజ్జ్వలమౌ దేవసేనలే
చొప్పున దమ్ముగొల్వగను శోభనమైన వనంబులోన బెం
పొప్పగ జెట్టుచెట్టుకు నవోజ్జ్వలమై విలసిల్లు గొప్పెరుల్
తప్పక చూచుచున్విమల తామరసాక్షుడు వాసవుండొగెన్. 8

క. అమరుల నందరిగని "మీ
రమణులతో మీకు మనసురంజిలు చోటం
గ్రమముగ గ్రీడింపుడనం'
బ్రమదంబున జనిరి వారు ప్రమదల తోడన్. 9

గీ. అక్కడక్కడ దమకు హృద్యంబులైన
స్థలములనుజేరి క్రీడలు సలుపజొచ్చి"
రంగనలతోడ చుంబనాలింగనములు
వీణియల పాటలను బాడివేడ్క జెలగి. 10

గీ. కొమ్మను గొమ్మలెక్కించి కోర్కెమీర
బూలు గోయించి పొందుతో మాలికలను
దాము కూర్చుచు జిత్రవిధానములను
బుష్ప భూషణముం గూర్చి పొందుపరచి. 11

గీ. ఎవ్వరెవ్వరు తమమది కిష్టమైన
పూలదండలు వడియాది భూషణములు
ప్రణుత నవమణి కనక భూషణములట్లు
బూని చేసిరి బహువర్ణసూనములను. 12

క. ఆ సమయంబున సత్యయు
వాసవసతితోడ ననియె "వరవర్ణిని! మీ
భాసుర వనమున చోద్యవి
లాసములు జెలంగెనమ్మ లాలిత్యములై. 13

క. ఒక కొమ్మకు జామంతులు
నొక కొమ్మకు మల్లెపూవు లొక కొమ్మకు దా
ప్రకటంబగు విరజాజుల
నికరంబులు జూడ నిటు జనించుట యరుదౌ. 14

క. చూడ నొక చెట్టునందే
పోడిమిగా బొడమె వివిధ పుష్పములు భువిన్
జూడము వేడ్కలు నావిధ
క్రీడంబుల సకలరాజ గృహముల వనులన్. 15

క. దేవ వనమహిమ లేమన
భావింపగ ముందుచూడబడు వృక్షమ్మే
తా వేరొక భూజంబగు
న వింతలు భూమిఁగనుండ నెఱఁగసమహా. 16

క. కావలసిన ఫలపుష్పము
లే వృక్షమునందు జూడ నిరవై యుండున్
నే విధము వాసనారుచు
లావిధమున గలుగజేయు నప్పుడె తరుణీ. 17

క. నారింజలు జామపండ్లు వ
నీరమ్యములైన యల్లనేరెడు పండ్లున్
బేరైన నిమ్మపండ్లును
శ్రీరంజిలునట్లు నొక్క చెట్టున బొడమెన్. 18

గీ. ఒక్కవృక్షమ్మునందె సంయుక్తముగను
జాతిజాతి ఫలాళి సంజనితమయ్యె
మనసునకు జూడ దేదీప్యమానమగుచు
నన్నివింతలు నీవన మందె యుండు. 19

గీ. కామరూపులు దేవతాగణములెల్ల
నట్లు గావున వారియుద్యానవనము
నేర్చినో వారి విద్యలన్నియు ననంగ
నన్నివింతలు నీవన మందెయుండు." 20

వ. అనిన సత్యభామతో శచీదేవి యిట్లనియె. 21

క. "ఇది సప్త ఋషుల కాశ్రయ
పనమగుటం జేసి తత్ప్రభావము చేతం
బొదలున్సకల పశంబులు
మెదలు న్వైరంబు లేక మృగపక్షు లిటన్. 22

క. ఏయే కోర్కులు గోరిన
తా నిష్టార్థంబు లొసగి ధన్యులజేయున్
నీ యింద్ర భూజమెప్పుడు
కూ యిడినం జగతి సకల కుజములు నిడునే." 23

వ. అంత. 24

క. నందన వనమున నచ్చర
బృందంబులు పూలుకోయు ప్రియము దలిర్పన్
మందారాది సుమంబుల
సందోహము జూచి కోయ సాగిరి వేడ్కన్. 25

క. నానావిధ పుష్పంబులు
మానక చెలరేగికోసి మదవతులెల్లన్
బూనికల బటురయంబుల
సూనాస్త్రుని బాణసమితి జూరగొను క్రియన్. 26

—: దోహద క్రియలు :—

మ. ఒక కాంతామణి పొన్నక్రొవ్విరులు వేగోద్యోగియై చెట్టు నుం
చక తాగోసి సఖీలలామ గని హాస్యంబొప్పగా నీవు గో
సుక పొమ్మన్నను నవ్వెనంతటను రాసుల్మీరగాబూసె దా
నికి నాశ్చర్యమునొంది భళిరే! యీ చోద్యమెందుంగనన్. 27

క. అందరు సుందరులలో నొక
యిందువదన పూలుగోయ నిచ్చకలుగకన్
మందగతి నూరకుండిన
సుందరులిట్లనిరి హాస్య సూక్తులతోడన్. 28

సీ. "పతితుల నెందును బట్టరాదంచునో
యీరామ రాలు పండ్లేరదయ్యె
బుష్పిణులను జేరి ముట్టరాదంచును
బూబంతివల పొంత బోవదతివ
పల్లవ సంగతేర్పడిన కొమ్మలచెంత
జేరరాదని సతిచేరదయ్యె
బండాశలను మైత్రి సల్పరాదని రోసి
కొవ్విరుల్ముట్టంగ గోరదబల

యహహా! యీయింతి శింపేమనగ వచ్చు
తాను జంబీర ఫలకుచ తనుఁరాఁగి
పల్లవాధరి సూనసంవాసియయ్యుఁ
గేరి తనయంగసముల నెగ్గింప దగునె.'' 29

క. బృందారకాంగనలు కసి
గందని క్రొవ్విరులు గోసి కాంక్ష దలిర్పన్
నందముగా నించిరి సుమ
బృందమును విచిత్ర ఘటిత పేటికలందున్. 30

సీ. మాధవీలతలకు మరి పొన్న చెట్లకు
జెలువుగా బెండ్లిండ్లు చేసిచేసి
తపసుల రంభల కుపమ జెలంగగా
గోర్కె తోడుత జెల్మి కూర్చి కూర్చి
పరమహంసంకును బర్మినీతతులపై
నేర్పుతో మోహంబు నెరపి నెరపి
ప్రకటమౌ బ్రహ్మణ్యులకు మన్మథ వ్యాప్తి
జిత్తంబులలరగా జేర్చి జేర్చి

తమ చమత్కారములు మహోద్యానమునను
హరియు దేవేంద్రులీ చోట్ల మరసి చూచి
మెచ్చి నుతియించునట్లు సమ్మోళనము గను
గ్రీడసల్పిరి యచ్చర చేడెల్ల. 31

క. దశదోహళములు తమకును
వశమై పుష్పించ వన్నెవాసింగలయా
శశిముఖులును బుట్టించిరి
విశదంబగు తమ విలాసవిద్యా విధిచేన్. 32

సీ. "డంబుగా దశదోహదంబుల బుష్పింప
జేయుట తరుణుల చేష్టలదియు
నొక్కొక్క చెట్టున నొక్కొక్కటే కాని
యన్నియు నొకటి చేయంగలేదు
కాంత యొక్కతె వనమంత బూయించెనా
యదె జగన్మోహిని యనగబరగు
మూడు లోకములను జూడుము నిటువంటి
కాంతను నదియు నెక్కడగలందొ'

యనుచు నింద్రుండు పలుక నావనితతోటి
మారుమాటడలేక తామూరకున్న
నదియు హరిగాంచి నెమ్మది నతిశయించి
మురళితానుగ్రహించి సమ్మదముబెంచి
గానమొనరించిననుగాంచి కడుభ్రమించి
వనము పుష్పించి ఫలియించి వన్నెమించె. 33

క. అందునకువజ్రి పరమా
నందంబునుజెందె యదితినందనుల మహా
బృందములు సన్నుతించిరి
పొందుగ దిక్పతుల సతులు పొగడరివేడ్కన్. 34

క. అచ్చరలు వేయి నోళ్ళ
న్మెచ్చిరి గంధర్వవరులు మేల్మేలనుచు
న్విచ్చలవిడి వినుతించిరి
యచ్చుతు మురళీసుగాన హాళిక్రియకున్. 35

గీ. "వనమునను గ్రీడజాలించి వాసుదేవ!
మనమునిప్పుడు గంగకు జనగవలయు
నచట జలకేళి గావించి యాప్తవర్గ
ములను గూడుక నిండ్లకు బోవవలయు". 36

వ. అని యింద్రుడనగనందరు జలకేళీ జనితాళయులై గంగకుం జని. 37

ఉ. అంతట వాసవుండు హరి యచ్చటి తక్కిన దేవకోటి సు
స్వాంతముతో జగద్వినుత స్వర్నది తీరవిహార యోగ్యతా
త్యంత విశాల భూములను సందముగా జరియించుచుండగ
న్వింతగ దత్ప్రవాహమును వేడ్క నుతించిరి యా దివౌకసుల్. 38

## —: గంగా స్తవము :—

శా. "గంగా! నీకు నమస్కరించెదము ముఖ్యంబైన యుష్మన్మహా
రంగత్తుంగ తరంగ సంగత యపార ప్రక్రియల్మామకీ
నాంగంబుల్ స్పృశియించు మాత్రమున నుద్యత్పాప సంఘంబులుం
భంగంబై కడుభస్మమై చనుగదా భాసిల్లు త్వచ్ఛక్తిచేన్. 39

క. పావనుల జేయుచుందువు
భావించియు స్వర్గమర్త్య పాతాళములన్
దావుగల జనులగంగా
దేవీ! నీవంటి పుణ్యతీర్థముగలదే. 40

క. శ్రీవిష్ణు పాదకమల స
మావిర్భవమంది శివ విషాయాసంబుం
బోవంగజేసి తచ్ఛిర
మావాసము జేసినట్టి యంబుధితరుణీ! 41

చ. నిరతము మూడుకోటులును నేబదిలక్షల తీర్థకోటికిం
దొరవననొప్పుచున్న నిను దోషణమంద నుతించినన్మహా
దురితములెల్ల బాయునట తోయధి పట్టపుదేవి! నీదు స
త్కరుణకు బాత్రులైన మముగావవలెన్ శుభముల్నొసంగుచున్. 42

మ. శరణంచున్నిను వేడువారిని దయేచ్ఛా సుప్రభావంబునం
గరమొప్పన్మనుగంగజేసి బహుపలకంబుల్నివారించి సు
స్థిరముంజెందగ వారికెల్లను శుభశ్రేయంబులుంగూర్చి యీ
శ్వరుతోటిన్సరివారి జేయుదట స్వచ్ఛంబైన మందాకినీ!" 43

వ. అని యివ్విధంబునం బ్రశంసించి జలక్రీడా మహోత్సాహంబున దత్ప్రవాహంబు బ్రవేశించి. 44

## —:జలక్రీడలు:—

సీ. చెలువుగా బంగరు చషకాల జలముల
నన్నమ్మించి సములపై జిమ్మిజిమ్మి
యీడుజోడగు వారి బైడితమ్ములగల్గు
పుష్పొడుల్కన్నుల గుప్పిగుప్పి
పూదేనియలు పారిపోవు వారలబట్టి
పోనీక పైలకు బూసి పూసి
సలలితోత్సాహ విశాలముల్మీరగా
నంబువుల్కడు జల్లియాడియాడి

శంబర భరంబుగల ప్రవాహంబులోన
నీదులాడుచు బహుళసమ్మోదమలర
గేరి నొక్కరి నొకరు నెగ్గించుకొనుచు
గ్రీడ సల్పిరి వేల్పులు వేడుకలర. 45

క. అంచలవలె బహుమానపు
సంచయములలీల బొదలు జక్కవలవలె
న్మించు గజము కేళిక గా
వించిరి సురసంఘమెల్ల విస్మయమొదవన్. 46

సీ. గరుడలు గంధర్వవరులు విద్యాధరుల్
కిన్నరులు చారణుల్ పన్నగులును
సిద్ధులు సాధ్యులు చెలగు కింపురుషులు
దక్షులౌ యక్షులు రాక్షసులును
దేవయోని విశేషభావంబు గలిగిన
భూచరుల్ ఖేచరులు పుణ్యధనులు
క్షణఘటికాయామ ఘననిశీధిన్యధి
దేవతల్మరి పితృదేవతలును

మొదలుగా గల్గు వారలు ముదమెంర్పు
నెవ్వరెవ్వరు తమగుంపులింపుమీర
హాసచేష్టా విలాసముల్ భాసురముగ
జెలువు మీరంగ జలకేళి సలిపిరపుడు. 47

క. జంకుక్కుటముల మీనం
బులవలె మరిశింశు మారములవలె గ్రీడ
సలిపిరి వేల్పులు వేడ్కల
సలిల స్థానంబు వదల జాలని ప్రేమన్. 48

మ. శరసంఘంబుల నీదులాడుచు మహోత్సాహంబునం దేవతా
తరుణుల్పంచమ సుస్వర ప్రకట నాదంబు ల్పికస్తోమ వి
స్తరలీలాతి శయంబుమీర బదకంజాతంబులం భూరి సుం
దర నీరంబులు జల్లులాడిరి యమందంబైన లీలారతిన్. 49

శా. రంభాద్యప్సరలున్ శచీముఖ దిశారాజాంగనల్ ప్రోల్లస
ద్దంభ ప్రక్రియ భాసమాన బహు సిద్ధ స్త్రీలు విద్యాధరీ
రంభోరుల్గరుడాంగనామణుల పార ప్రక్రియాలాస్యలై
యంభః కేళిక సల్పి యల్సిరపుడు న్నాశ్చర్యమున్మీరగన్. 50

మ. సలిల క్రీడలుమాని మేన్లతడి వస్త్రాలన్నివారించి యు
జ్జ్వల నానావిధ వర్ణచేలములు భాస్వల్లీలలం దాల్చి కే
వల మాణిక్య మయంబులైన ఘన శుంభ ద్భూషణంబు ల్విలా
స లసత్ప్రక్రియగా ధరించి రపుడుం జంభారి ముఖ్యామరుల్. 51

క. జలకేళిక గావించియు
నలినాక్షుడు వస్త్రభూషణములు ధరింపం
బలువగు చుక్కలతో శశి
వలె హరి భాసిల్లె వాసవ ప్రభృతులతోన్. 52

గీ. సత్యయును వేల్పుటింతులు జలకమాడి
నవ్య వస్త్రాదికాభరణములు దాల్చి
కేవలము మెర్పుదీవల తీవి దనరి
భాసమానాంగలైరి యుల్లాసములను. 53

గీ. మొదలు పుష్పంబులను జేయు భూషణములు
స్త్రీలు పురుషులు నందరు లీల దాల్చి
పరిమళంబులు దిక్కుల బ్రబ్బికొనగ
జేసిరప్పుడు నూత్న విలాసమలర. 54

గీ. నందనానీత బహుఫల బృందములను
నందరు నారగించి యానంద మొంది
వితతరుచులకు మెచ్చి సన్నుతులు జేసి
పురికి గడువేడ్క బైనమై పోవదలచి. 55

క. ఐరావతాది వాహము
లారోహణమొప్ప జేసి యతుల విమానా
ధారులయి చేరి రప్పురి
భూరి మహాభేరి నినదములు మెరయంగన్. 56

సీ. చెలగుచు రంభోర్వశీ మేనకాదులు
మొనసి మహోత్సాహముల నటించ
తుంబుర నారదాదులు వీణియల సుస్వ
రంబులతోడ గానంబుసల్ప
వంది మాగధ బృంద మందంద బిరుదులు
పొందుగా బొగడుచు సందడింప
సప్తర్షులెల్ల సుస్వరయుక్తములు గాగ
నమితావధాన వేదములు చదువ

సురసభాసీనులగుచును సురలు మరియు
హరియు దేవేంద్రులఖిల దిశాధినాథ
ముఖులు నచ్చటి విద్యల మోదమంది
నిజనివాసంబులను జేరనిశ్చయించి. 57

గీ. ఇంద్రకును బోవ దలచి సురేంద్రు తోడ
నాజ్ఞగైకొని యప్పురియందుగల్గు
తమ మహాసౌధములు జేరి తల్పములను
సతులతో సుఖనిద్రానుషంగులైరి. 58

గీ. వాసుదేవుండు తర్వాత వాసవుండు
కేళికాగారములు జేరి మేలిమైన
పూలశయ్యల సతులతో బుష్పశరుని
కేళికలదేరి నిద్రల గీలుకొనిరి. 59

వ. అంత శ్రీకృష్ణుండు కొంతసేపు నిద్రించి మేలుకాంచి. 60

క. శ్రీకాంతుడు సత్యంగని
"యోకాంతా! వేగనందనోద్యానములో
గైకొనవలయు సురద్రుమ
మేకాంతముగాగ లెమ్మునిపుడె చనవలెన్." 61

క. అని, గరుడునిపై దీవ్రము
గనుజని సత్యమును దాను గమలాక్షుండు
న్వనమపుడు జొచ్చివేడ్కలు
జనియింపగ బారిజాత సన్నిధికరిగెన్. 63

—: కృష్ణుడు పారిజాతము నపహరించుట :—

చ. ప్రకటిత శౌర్యశాలి హరి బాహుబలంబున బారిజాతముం
బెకలిచి తార్క్ష్యుపై నిలిపి ప్రేమనిండగగ సత్యభామతో
"ముకురనిభాస్య! నీమదికి మోదము జెందెగదా దివౌకస
ప్రకరమువచ్చి తాకినను ఖండన భూమిని బారద్రోలెదన్." 63

వ. అనిన నప్పుడు. 64

క. వనపాలకులా రథసము
గనుగొని "యేమయ్య కృష్ణ! కడుదుడుకు పనుల్
చనునే నీకిది ధర్మమె
వనరాజము దీనిజెరుక వచ్చునె నీకున్. 65

వ. అనిన శ్రీకృష్ణుండు వారితో నిట్లనియె. 66

గీ. "వాసవునకును మాకును వాదుగలదు
నందుకే నీమహీజంబు నందుకొంటి
యతడు మాతోడ రణముసేయంగ దలచి
వచ్చిన జయింతు నీపాదపము హరింతు". 67

క. అనవిని వనపాలకులట
జని యావృత్తాంతమెల్ల జంభరిపునితో
వినిపించిన బహుకోపము
జనియించి దిశాధి పతుల సంఘము తోడన్. 68

గీ. "ఎంటిరే! కృష్ణుడొనరించు కంటకంబు
తొంటివలె దొంగతనమున కంటినాడు
వెంటనంటియు నొంటి గాణ్ణంటబట్టి
కొండె నీతని శిక్షింపకుంటె తరమె". 69

మ. వితతంబౌ బహుకోప శౌర్యములు నావేశించి వహ్న్యాది ది
కృతులం జూచియు "వేగరెండు ఘనజంభద్బాహునాటోప సం
తతులుప్పొంగగ బారిజాత మపుడుందైత్యారిచే వీడ జే
సి తదీయంబయినట్టి గర్వమును గాసింబెట్టి తేగాదగున్." 70

గీ. రాజుమాటలు మీరంగరాదుగనుక
చెప్పిన గ్రహించి యాపనుల్సేయవలయు
దైవకృత్యంబులేరీతి గావలయునొ
చనగ వలెయుద్ధమునకు వంచనములేక. 71

వ. అని యొండొరులు విచారించుకొని తమ తమ బలంబులం గూర్చుకొని వివిధంబులైన శస్త్రాస్త్రంబులు ధరియించి శరాంగమాతంగ తురంగ పదచర బలాంగంబులైన చతురంగంబులతో నమరావతీపుర ద్వారంబు నిర్గమించి సమీపస్థానంబున బురుషోత్తముం గాంచిన. 72

ఉ. తప్పక నింద్రుకీర్తియు బ్రతాపవు లక్ష్మిని తాగ్రహించియుం
జెప్పక పోవుచున్నటుల జెల్వుగ నంబర పారిజాతముం
గప్పురగంధి సత్యయును గౌరవలీల దార్ష్యునింగన
న్నప్పటి వింతగాన బడె నాహరినింగనుగొన్నవారికెన్. 73

వ. అప్పుడు శ్రీకృష్ణునుద్దేశించి యాగ్రహించి యమరనికరంబిట్లనియె. 74

ఉ. "ఎందుల బోయెదో యదుమహీశ్వర! నిన్నిక బోవనిత్తుమా
కొందల మందజేసి నిను ఘోర శరాబ్ధిమునుంగ జేయకన్
నిందలి పారిజాత మిపుడీవు గ్రహించిన నీకుదక్కునా
యిందుని రాహు పట్టుక్రియ నిప్పుడె నిన్నటు చుట్టి పెట్టెదన్. 75

క. ఆ మాటలు విని కృష్ణుడు
"నేమీ నాచెంతనుండు నీ భుజము మీ
స్తోమంబులు విడిపించిన
మీ మానుషమెన్నవచ్చు మేదినిలోనన్. 76

క మీబలములు చూతామని
నే బట్టుక వచ్చినాడ నిర్జరతరువున్
మీబంటు తనము తోడను
వే బవరము చేసి గెల్చి విడిపించుడ"నన్. 77

క. బంధుర భేరీనినద ధు
రంధర రథగజతురంగ రభసభట రజ
స్సంధానమగుచు నొప్పెని
శాంధక్రియ సూర్యదీప్తు లణగుటచేలన్. 78

వ. అప్పుడు. 79

చ. చలము జెలంగ దోర్యుగళ సంభ్రమమున్మెరయంగ వేల్పులం
న్నలకువ జెంది వెన్కకుజనంగ సభంగకులాచలాళికిం
బలిమిదొలంగ భూరితర ఖాంకృతులున్మెరయంగ నప్పుడు
న్వొలయగ బట్టెశౌరి పరవీరభయంకర పాంచజన్యమున్. 80

రా. జంభారి ప్రముఖామరు ల్వితత భాస్వ చ్చౌర్యము లీమ్రరగా
దంభోళి ప్రముఖాయుధంబులు మహోద్దండంబుగా దాల్చి సం
రంభంబు ల్వెలసిల్లు నట్టుగ నవార్యచ్ఛంఖ నాదంబులుం
గంభీరంబగు భేరి వాద్యములమోఘంబైన సింహధ్వనుల్. 81

—: ఇంద్ర కృష్ణుల యుద్ధము :—

క. ఈ రీతిమెరయ జేయుచు
భూరిధనుష్టంకృతులును భోరుకొలుపన్
ఘోర శరాసారంబులు
వారిజ దళనయనుమీద వడిగురియింపన్. 82

శా. దర్పంబేర్పడ శార్ఙ్గనామక మహాధానుష్కనాదంబు తా
నేర్పొప్పం ఘటియించి ఘోరశరవహ్నిం గూర్చి తత్సేనపై
జేర్పం దీర్చగలేక ధైర్యమొక వాసింగూర్చి తామంతటం
సర్వోద్వృత్పటు బాణసంఘములు కృష్ణస్వామిపై గుప్పినన్. 83

క. గరుడని రెక్కల గాడ్పుల
నురువడికే విరిసిచనె సముజ్జ్వల శరముల్
దరహసితులైరి సత్యయు
హరి యావిధమెల్ల గాంచి మానందముతోన్. 84

క. గదలను భల్లంబులు బలు
గుదుపల చక్రముల పరశుకోటి నిశాతా
స్పదమగు శూలంబులచే
వదలక శ్రీకృష్ణుమీద వైచె రమధ్యక్షుల్. 85

క. అపుడగని కృష్ణుడు దానతి
ముదమున నిఖిలాయుధాప్యమోఘ శరంబుల్
పదపడివైచిన జవములు
వదలుచునని నేలగూలె వడిచెడి పిదపన్. 86

మ. వలయాకారముగా హరింబొదవి గీర్వాణుల్ ఘురాధర్షదో
ర్బలముల్మీరగ బాణసంఘములు గప్పన్నర్ధ చంద్రాఖ్య సం
కులబాణంబులు గప్ప బారిచని రాక్రోశంబులు స్వీడగా
జలదంబుల్పటు వాయుసంఘముచే జన్నట్లు నిస్త్రాణులై. 87

మత్తకోకిల : మాటిమాటికి దేవతల్ యనుమానమింతయులేక బల్
ధాటిమీరగ దైత్యవైరిని దాకి యోడి పలాయనం
బౌటచేత బురందరుండును నగ్నచండ ధరాధి సం
ఘాటమెల్లను జింతతోడుత గాసినందియు సంతమే
ల్పాటవంబు గడెంచి మళ్లియు ఖండనోద్ధతులై తగన్. 88

ఉ. అంతట నిర్జరుల్మహదహంకృతులై కడుబేర్చి స్వప్రభా
వంతములైన బాణములు వైచియు ప్రాణసహాన శస్త్రము
ల్పంతము మీరశౌరిపయి బంపిన యవ్విజయంబు దూలిశ్రీ
కాంతుని పాదపద్మములు గాంచి నమస్కృతులొప్ప జేసినన్. 89

సీ. గంధర్వులపుడు సంగరమున నోడియు
నదిరి యథాయథలగుచు జనిరి
విద్యాధరుల్ యదువీరునిధాకకు
జంచలమున బటాపంచలైరి
కిన్నరులెల్ల నాపన్నులై మితిమీరి
దూరి వేగంబున బారిచనిరి
యక్షులు ప్రాణ సంరక్షణాపేక్ష ప
ద్మాక్షునకును నరాధృతులైరి

చక్షతలుమాని యింద్రాగ్ని ధర్మనిరుతి
వరుణ వాయువ్యయక్ష శివప్రభృతులు
శరణుజొచ్చిరి మాతప్పుసైచుమనుచు
నపుడు హరినవ్వి వారితోననియె బ్రీతి. 90

క. “నన్నొక నరమాత్రునిగా
నెన్నుచుగర్వమున నేమేయీశుల మనుటల్
పున్నాగముతో మశకము
లెన్నైననుబోరి తగ జయింపంగలవే. 91

క. దేవతలమనెడి సోహం
భావము వారించుకొరకు బరికించి మిమున్
గావలసినవాడనునై
యీ విధమున బారిజాతమే గైకొంటిన్. 92

క. మరి మీ దుర్గుణ సుగుణము
లరయంగా దలచి బహుదయాస్థితిగల యీ
తరువును నేను గ్రహించితి
వరుసం గొన్నాళ్ళు ద్వారవతి నుండుటకున్. 93

క. తరుణీ మణియగు సత్యకు
వరమిచ్చితి పారిజాత వసుధారుహము
న్మరి నీ కేళీవనమున
స్థిరముగ నాటింతుననుచు దెల్లముగాగన్. 94

క. శరణాగత సంరక్షణ
బిరుదెప్పుడు మాకుగలదు ప్రియము దలిర్పన్
పరిరక్షించితి మీమీ
యురవులకుంజేరుడింక నిచ్ఛానుగతిన్”. 95

**—: దేవతలు కృష్ణుని స్తుతించుట :—**

గీ. ''స్వస్తి సకలార్థపాల! నమోస్తు"యనుచు
నవ్యసాష్టాంగ దండ ప్రణామములను
జేసియామీద బహు ప్రదక్షిణము లొప్ప
జేసినుతిజేసి రమరులు భాసురముగ. 97

మ. ''వసుధాభార నివారణంబు సలుపన్వాంఛించి యాదేవకీ
వసుదేవోత్తమ గర్భసంభవుడవై వర్తించి నందవ్రజం
బెసగం జేరియు గుప్త భావభయ రాహిత్యైక సంచారివై
పసగానంద యశోదలున్సుతుడనం భాసిల్లితౌ మాయచేన్. 98

క. జలజాక్షా! బలరాముడు
సలలితముగ నీకు నగ్రజాతుండై వ
ర్తిలగా నందయశోదలు
బలుమోదము నొంద గారవము సల్పితివా. 99

గీ. తొంటి తెరగంటి వాల్గంటి కంటకమున
బంట విషమూనినం బురుటింటిలోన
గెంటిసనజేయవచ్చు నాగొంటుచెనటి
చంటనే దాని ప్రాణముల్ గొంటి వధిప! 100

గీ. బండి దైత్యుండు శిశువవై యుండువేళ
మెండు కపటంబునను నీదు దండజేరి
ఖండితుని జేయరాగ త్వచ్చండపాద
దండితుని జేయవా బహుఖండములుగ. 101

ఉ. చక్రసమీరదైత్యుడు దిశాతతులం బహుధూళిగప్పి ని
ర్వక్రపరాక్రమంబున ద్వరన్వినువీథికి నిన్నుదీసుకం
జక్రగతిం జనంగ ఘనశైలము భంగిని భారమయ్యు ద
ద్వక్రమమున్ హరించియు భుజింపగ గూల్చవె ప్రాణముల్ సనన్. 102

క. శైశవమున గోపికల ని
వేశంబులు జొచ్చి పాలువెన్నలు పెరుగున్
లేశము లేకుండగ దిను
టీశా! యిటువంటి శౌర్యమెందుంగలదే. 103

క. గొల్లల పడతుల మది రం
జిల్లగ బలుబూతు పనులు చేయుచు వారిం
బల్లవ పిలుతుని క్రీడలు
తెల్లముగా సల్పుచుండితివి చిత్రముగాన్. 104

మ. బకుడు న్వత్సకుడు న్నఘాసురుడు శంఖద్వైరమేపార "జం
పకపోని త్తుమె గోపాలబాలకుల మాపంతంబులుం జూడు న
మ్మిక లోనుండుము కంసభూప!" యని నెమ్మి న్వచ్చి పోరాడి యం
తకు ప్రోలు న్వెస జేరబోయిరి గదా త్వద్బాహు శౌర్యంబుచేన్. 105

గీ. కేశి వృషభాసురుండు సాక్రోశమునను
మంచ బెగడొంద వచ్చియమంచ గతుల
వేధ సల్పగ నాదైత్యవీరవరుల
మించి తృటిమాత్రమున సంహరించలేద. 106

క. గోవత్సములును బాలుర
దీవరమున దాచి బ్రహ్మదేవుడు తా నీ
దేవత్వము చూతామని
తావెగము నోడి మ్రొక్కె తగ గొనిడెయాన్. 107

క. నామఖము సేయకెట్లని
తామసమున వజ్రి వర్షధారలు గురియన్
భూమిధరమెత్తి యాగో
స్తోమంబుం గొల్లవారితో బ్రోచితివా. 108

క. పూని మహోజ్వాలల దా
వానలముంజుట్టుకొనగ వడిమీరగ నా
ధేనువుల గోపకులను సు
ధీనత! రక్షించి మ్రింగితివి దవవహ్నిన్. 109

క. కాళీయుండను క్రూర
వ్యాళము యమునాహ్రదమున వసియించి నిజ
క్ష్వేళమున ప్రజలజంప ఫ
ణాళిం దద్గర్వ మణగ నటియించితివే. 110

క. డంబగు కపటంబునను ప్ర
లంబుండను రక్కసుండు లఘుగతి రామున్
నంబరమునకుంగొనిచల
దొంచిగ దచ్ఛిరము బగులద్రుంపడె హలియున్. 111

క. కన్నెలు యమునా నదిలో
జెన్నుగ జలకంబు లాడ చీరలుగొని యా
పొన్న తరువెక్కి సిగ్గులు
గొన్నట్టి మహానుభావ! గుణనిధివయ్యన్.

మ. మురళీనాదముచేత గోపవనితల్మోహించి సంసార దు
స్తరకృత్యంబులు మీరి తావక పదాబ్జద్వంద్వముంజేరి వే
మరు కేళిన్వెసగోరివేడ బహునేమంబుల్ ప్రసంగింప నా
తురతం జిక్కియు మ్రొక్కిసంగరుణ సంతోషించి రక్షింపవా. 113

క. రాసక్రీడాదుల ను
ల్లాసము గల్పించి వారలను బహుకేళీ
భాసురమున లాలించు వి
లాసుడవగు నీగుణంబులను జగమెన్నన్. 114

సీ. నందయశోదల నందనుండనిపించి
మందపాలకుల తోపొందుసలిసి
బృందావనమున గోబృందములనుగాచి
కొందర రాక్షసకోటినణచి
కందర్పకేళికలందు గోపస్త్రీల
జెంది మహానంద మొందజేసి
మందకువేధలు జెందకుండగ బ్రోచి
యందరకును ముదమొందునట్లు

బాలనాశ్చర్య కృత్యముల్లీల సలపి
క్రమతవసుదేవదేవకీ శ్రమనివార
ణంబు సల్పంగ గోరుమనంబు గలిగి
యున్నవేళల గంసుండునోర్వవేక. 115

క. పగచే జన్నపునెపమున
''నాగిరాముని గృష్ణునిం బయోదధి ఘృతముల్
దగగైకొని నందాదుల
వగ నందరిదోడ్కొరమ్ము వడి నక్రూరా !" 116

క. అను కంసనృపుని మాటలు
విని సంతోషంబుమదికి వికసిల్లంగా
తన రథమునెక్కి మందకు
జనిమెన్నందుండు వసించు సదనంబునకున్. 177

క. నందుని గని నన్యోన్యా
నందంబులు జెంది వందనంబులు సలుపన్
గ్రందుక బలరాముడు గో
విందుడు జనుదెంచి యతని వేడ్కంజూడన్. 118

క. కోరిక సాష్టాంగ నమ
స్కారంబులు సేయజూచి శౌరియు నా య
క్రూరుని గౌగిట జేర్చెను
నా రాముడు నట్లజేసె యభినందితుడై. 119

గీ. అపుడు నన్యోన్యకుశలంబులడిగియతని
నర్ఘ్యపాద్యాది విధులనునాదరించి
వెలయు భోజన తృప్తుగావించి పిదప
దండి గద్దియనతని గూర్చుండ జేసి. 120

క. తాంబూలము వేయుచు దో
రంబుగ గూర్చుండి ముదభరస్థితినతనిన్
నంబుజనేత్రుడు నంద వ్ర
లంబారులు జేసిరతని లక్షణ మరయన్. 121

వ. అక్రూరునింగనుంగొని గోవిందుడిట్లనియె. 122

క. "సుధవంటి సద్గుణంబున
నధికుడనగు నిన్ను మేము నడిగెదమిపుడున్
మధురాపురిలో ముచ్చట
విధమెల్లను మాకు దెల్పవే యక్రూరా! 123

క. కంసుడు సుఖియై మత్పితృ
హింసకుడై యున్నవాడె యిచ్చాను గలిన్
శంసద్గర్వముతో బహు
మాంసాశియు బోలె భూరిమదము బొసంగన్." 124

వ. అనినవిని యక్రూరుండిట్లనియె. 125

క. "మీకుం దెలియని విధ మే
లోకంబున గలదు వినుము లోకస్తుత్యా!
నాకుందెలిసిన మాత్రము
మీకున్విన్నపమొనర్తు మెలకువతోడన్. 126

క. మీ మామ దుర్గుణంబులు
నేనుమఱులయందులేవు హితవుదలిర్పన్
గామితము లివ్వడెవరికి
శ్రీమంతులజూచి కడునశింపగ జేయున్. 127

క. సజ్జనులను మన్నింపడు
నిజ్జగమున దుర్జనులనె యేలుచునుండున్
సజ్జాతివారి బ్రోవడు
ముజ్జగమున నతనివంటి మూర్ఖుడు గలడే. 128

క. వసుదేవదేవకులను
న్మసలుచు శ్రమపెట్టునట్లు మాయాదవులన్
గసరుచు దండించిన పర
వసుధేశులజేరి కొలువ వారుంజనుటల్. 129

క. ఈగతిచేనుండి ధను
ర్యాగము తలపెట్టినాడు రణజయమునకున్
వేగ మిము దోడ్కొరమ్మనె
పోగావలె మీరుమేము ప్రొద్దున పురికిన్. 130

గీ. రాజు బిల్చిన యాజ్ఞమీరంగ దరమె
ప్రొద్దునను లేచి మధురకు బోవవలయు
పాలుపెరుగును నెయ్యియు బండ్లమీద
భరణమొప్పగజేసి గోపకుల గూడి." 130

వ: అని యారాత్రి నిద్రించి సూర్యోదయ సమయమున మేల్కాంచి ప్రయాణోన్ముఖులై యక్రూర బలరామ సహితంబుగా రథారోహణంబు సేయునెడ నందయశోదలకు నమస్కరించి వారిచేత దీవనలు గైకొని నందునింగనుంగొని నీవు గోరసభరితంబులైన శకటంబులు బట్టించుకొని

సమస్త గోపకులతో ముందర జనుమని చెప్పి తానును తనయందు ప్రేమాతిశయంబులు వదలం జాలని గోపికలందరి నాలింగనాది కృత్యంబుల నాదరించి సమ్మతింపజేసి త్వరితగతి కొంత దూరంబు జనునంత నక్రూరుండు తాను యమునానదీ జలంబుల స్నానమాది కృత్యంబులు దీర్చుకొనివచ్చెద తావత్పర్యంతంబు రథంబునం గూర్చుండుండని చెప్పి తాబోయి స్నానోద్యుక్తుండగు సమయంబున నాజలంబుల మీ రూపంబులం గాంచి మరల రథంబునుం గనుంగొని యాశ్చర్యంబు నొందునెడ నిజస్వరూపంబునొందిన బహువిస్మితుండై పిదప స్నాన సంధ్యాద్యనుష్ఠానంబులు దీర్చుకొని మరల మీ సన్నిధానంబునకు వచ్చి సాష్టాంగదండ ప్రణామంబులు గావించి బహు విధంబులం భజింపుచు రథంబెక్కి మధురోప కంఠవనంబున నందాదులు శకటంబులతో విడిసిన స్థలంబు ప్రవేశించి రథంబుగొని పురము ప్రవేశింపుమని యక్రూరునిం బంచి తామును భోజనాది కృత్యంబులాచరించి మార్గాయాసంబు దీర్చుకొని కొంతసేపు నిద్రించి మేలుకాంచి. 132

గీ. "రామ! యిప్పురివింత జూతము రమ్మ
నెవ్వరెవ్వరి మనసుల కెవ్విధమున
నుడునోతెల్వ దిట్లూరకుండవలదు
జాగుసేయకరమ్మ వేవేగనిపుడు." 123

క. ప్రమదముతోడుత గోపక
సముదయములు తమ్ముగొలిచి చనుదేరంగా
గ్రామమునజొచ్చిరి యప్పురి
విమతుల గుండియలు బగిలి విరివిరి బోవన్. 134

గీ. పురము వీథుల సంచరింపుచునురాగ
రాజువగు చాకిమూటల రాకగాంచి
వాని పెద్దగువాని దువ్వలువలడుగ
వాడు దుర్భాషలాడిన వేసెబొడమి. 135

మ. సమదోక్షుల్పచరించ లేకియగునా చాకిన్వడిం జంపి వ
స్త్రములున్ రాముడు తాను గోపకులు తోరం బొప్పగా దాల్చి క
ల్పములుం బూనుక వచ్చు గుబ్జగని మేలం బొప్పగా దానిచే
దమి దీరంగ నలంకరించుకొని యద్దాసిందగం దిద్దియున్. 136

క. అది కోరిన వరమిచ్చియు
సదయుడు మాలికుని మేటి సదనము జేరన్
ముదమున నతడర్చించెను
గొడవలుగాకుండ నతని కోర్కులొసంగెన్. 137

క. పాయకుని యిల్లు జేరి కృ
పాయతమతి నతడు పరమ భక్తుండగుటన్
వేయివిధంబుల బూజలు
సేయగ నాతని కొసంగె శ్రేయః ప్రాప్తిన్. 138

క. లీలం జని కంసు ధను
శ్శాలకు నచ్చటనుగాంచి శౌరి మహా
భీలంబగు ధానుష్కము
కేలందానిని గ్రహించి గీటణగించెన్. 139

గీ. దానికావలి వారలు తామసమున
యుద్ధమొనరింపరాగ బల్ క్రుద్ధులగుచు
దద్ధనుః ఖండముల వారిదగ వధించి
రప్పురము వారలెల్ల నాహా యనంగ. 140

వ. ఇవిధంబున హరి విహరించి యప్పురోపవనంబునకు మరలిచని క్షీరా న్నంబుల నారగించి యారాత్రి జాగ్రతగలిగి యుండిరి; అక్కడ కంసుండు నీవార్త లన్నియును విని భయంపడి చింతాకాంతుండై నిద్రించునెడ దుర్నిమిత్త దుస్స్వప్నంబులు గని బహుళంబగు నావేదన చేత మల్లరంగంబునకు వచ్చి సభాయుక్తంబుగా గూర్చున్న సమయం బున. 141

శా. చాణూరుండును ముష్టికుండును మహాజంభారి దంభోళి స
త్రాణ ప్రక్రియమల్ల శేఖరులునై రాజేంద్రునిం గావగా
ప్రాణస్ఫార సమాన సఖ్యులగుచుం బంట్లై వడిం గొల్వగా
రాణం జొచ్చిరి మల్లరంగమునకున్ రంజిల్లు శౌర్యంబులన్. 142

క. ఐరావత విజయముతో
నారోహణమొందు కువలయా పీడంబున్
ద్వారంబున కాపుంచెను
శూరులు నెవ్వారు గనను జొరరాకుండన్. 143

మ. బలుడుం దానును సర్వగోపకులు విభ్రాజత్ప్రితాపంబుచే
వలనొప్పన్మథురాపురంబు పెనుత్రోవన్వచ్చి మల్ల ప్రదే
శలసద్వారము జేరియందు గిరిభాసంబైన మత్తేభము
న్మెలగం గాంచియు దానిపాలకులు నెమ్మిన్మీర ధీకొల్పినన్. 144

క. "ఓరీ! మాదెస కీపటు
క్రూరగజంబిట్లు దోలగూడునె కానీ
మీరి చనుదెంచె నేని వి
దారింతుము దాని మిమ్ము దర్యంచిపుడున్." 145

క. అనవినక వారక్రూరత
గినుకన్నాగజము మీదికిం ధీకొల్పన్
"వినరా నీమద మిప్పుడు
జనజేయుదు మ"నుచు సాహసము దశుకొత్తన్. 146

సీ. చండదోర్దండ ప్రచండబలంబున
దుండంబు వడిబట్టి పిండి పిండి
కొండమాడ్కి జరించు దండి వేదండంబు
గుండెలు పగులగా గూలదన్ని

వెండి దూలముల నుండు దంతంబులు
బెండుల చాడ్పున పీకివైచి
ఖండనంబునకు నుద్దండత జనుదెంచు
దుంది పాలకులను జెండివైచి

దండధరులనుబోలి యుద్దండ బాహు
దండముల దంతయుగళంబు దాల్పనంగ
రామకృష్ణులు నాయుద్ధరంగమునకు
వచ్చినాప్తులు తముజూచి మెచ్చిపొగడ. 147

క. ఆరామకృష్ణులను జా
ణూరుడు ముష్టికుడుగాంచి "నుతశౌర్యములన్
బోరాడవలయు మాతో
మీరలు మీరాజు జూచి మెచ్చుకొనంగన్." 148

క. అనవిని వారలు వెనుకకు
జనకంగాళలు బిగించి శౌర్యముమీరన్
బనిబూని వచ్చియుద్ధము
నొనరింపగ బూనిరపుడు ఘనత జెలంగన్. 149

క. ముష్టికుని తోడ రాముడు
స్రష్టగు శ్రీకృష్ణుడపుడు చాణూరునితో
ముష్టాముష్టినిబాహా
త్కృష్టగా బోరుసల్పి దీకొనిరపుడున్. 150

క. నానావిధ సాధనముల
భూనుతులగు వారిబట్టి పొలయించిన నా
స్థానము వారలు బొగడగ
భూనాథుడు కోపగించి పొగరున బలికెన్. 151

క. "ఇచ్ఛాలకులను బైటికి
ద్రొబ్బుడి యాయుగ్రసేను ద్రుంపుడు మీరల్
దబ్బర లాడక నికపై
రబ్బను వసుదేవుబట్టి హరియింపుడటుల్ 152

క. నందుని బట్టియు బంధన
మొందింపుడు వాని బంధువుల్మారఁ బెట్టన్
నందరి బట్టుడి దండుగ
లందుడి వారెల్లవగల నాప్తత బొగలన్." 153

క. అని పల్కు రాజుమాటలు
వినగ సహింపకను వాని విదళించుటకై
ఘనక్రూరదృష్టి గనుగొని
మనసిజునిం పోలనేత్రుమాడ్కి గడంగెన్. 154

క. అంబిక్ళ్ళగరచి మత్త గ
జంబుంగని పైకి దుంకు శౌర్యయుత మృగే
ద్రంబువలె వానిసిగ హ
స్తంబున బిగబట్టి ఘోరతరముగ నీడ్చెన్. 155

క. అంతటనె వాని ప్రాణము
లంతకునిం జేరె వాని యనుజులు కోపా
క్రాంతమున రణమునకు రా
బంతమున బలుడు వారి బడగూల్చెధరన్. 156

క. కావలసిన కృత్యంబులు
నేవిధమున నెవరిచేత నిచ్ఛానుగతిన్
గావించవలెనొ యవ్విధి
గావించిరి యంతమీద గౌరవలీలన్. 157

గీ. తల్లిదండ్రుల దర్శించు తత్తరమున
గంసు చెరసాలలోనుండి గాసిజెందు
వారలనుగాంచి దుఃఖించి వందనములు
జేసివారలు తామిల్లు జేరిరంత. 158

క. చేరి తమ శ్రమయెల్ల గు
మారులతో జెప్పుకొనగ "మార్తుర నణచే
శూరతగల్గిన దాకా
వారింపని మాదెతప్పు వర్జింపదగున్ 159

వ. అని వారికి నభ్యంగనాదె కృత్యంబు లాచరించి రామునుస్నాతులై షడ్ర
సాన్నాంబులు భుజియించి సంతోషాతిశయంబున నుండిరంత. 160

క. కృపతోడుత బుత్రులకును
నుపనయనంబులు జేయనూహించి వెసన్
నుపమగ దెప్పించెను తా
నపరిమితంబైన ద్రవ్యమంతయు వేడ్కన్. 161

గీ. ఋషుల బ్రాహ్మల బిలిపించి రూఢిగల్గు
నొగి ముహూర్తము లారంభమొప్పజేసి
వడుగు నాలుగు దినములు గడవజేసి
బహు పదార్థము లొసగెను బ్రాహ్మణులకు. 162

గీ. రామకృష్ణులు బ్రహ్మచర్యంబు సలుప
గోరి కాశీపురంబును జేరి యచట
దసరు సాందీపుని సుసన్నిధానమునను
వేదవేదాంగములు ధనుర్వేదములును. 163

క. సాధించి సకలవిద్యా
బోధకుడగు నతని చాల పూజించి మహా
మేధంజను చత్సుతుని స
మాధానము గాగ నివ్వమది రంజిల్లన్. 164

క. "ఇటువంటి బహుసమర్థుల
నెటు జూడము మీరలెచటికేగిన నైనన్
బటువిజయము మీకగున"ని
స్ఫుటముగ దీవించి పంపె భూషింపు చొగిన్. 165

వ. ఇట్లు సాందీపునిచేత నాశీర్వాదము గైకొని యనుజ్ఞతపడసి మథురా
పురంబుజేరి సుఖగోష్ఠినుండుసంత. 166

గీ. కంసుభార్యలు దుఃఖ సంగతలు నగుచు
దండ్రియగు మాగధునిజేరి తత్క్రమంబు
లన్నియును దెల్పి దుఃఖింప నతడు కృష్ణు
మీద దండెత్తి క్రోధ సంపాదియగుచు. 167

క. కదసి కలహించి మోడెను
బదునెనిమిది మార్లనేక బలముల తోడన్
యదువులను గెల్చు పంతము
వదలక యత్నంబుతోడ వాడున్నంతన్. 168

గీ. కాలయవనుండు నారదకథితుడగుచు
గేరియుద్ధంబునను గెల్తు గృష్ణుననుచు
దనరమ్లేచ్ఛబలంబులు తన్నుగొలువ
మథురకును ముట్టడము బెట్టెమత్తుడగుచు. 169

వ. అంత శ్రీకృష్ణుడు. 170

క. పారిచను వానివలె పురి
ద్వారము తావెడిలి వారదారగ జనగా
ఘోరాశ్వమెక్కి వాడును
క్రూరుండై వెంటనంటె కోపము తోడన్. 171

గీ. వెంటనంటియు హరిని దానంటలేక
దంటతనమున జనగ నాతమ్మికంట
శైలగుహ జొచ్చి యచట బ్రచ్ఛన్నుడయ్యె
వాడు నాగుహజొచ్చె దుర్వారుడగుచు. 172

వ. అందు. 173

క. బకరాజ ఋషియు ముకుళాం
బకుడై నిద్రింపజూచి ఫక్కున దన్నెన్
సెకబుట్టి యతడు జూచిన
ప్రకటంబుగ వాడు గూలె భస్మంబగున్. 174

క. సన్నుతముగ నా ఋషికి బ్ర
సన్నుండై కోరునట్టి సకల వరంబుల్
మన్ననతోనిడి నిజపురి
కెన్నగ దానేగి యవనభృత్యుల నడచెన్. 175

గీ. అంత మీదట జలధి మధ్యంబు నందు
శత్రులకసాధ్యమై జగజ్జనములెన్న
నిర్మితి వినోదియగు విశ్వకర్మచేత
బురము గట్టించె ద్వారకాపురమనంగ. 176

క. అంతట మధురాపురికి ని
రంతరము నివాసులైన ప్రజలను జేర్చెన్.
వింతగల తనదుమాయా
క్రాంతముచే ద్వారకా పురస్థలిలోసన్. 177

వ. అప్పుడు మాగధుండు మరల యుద్ధంబునకు రాగలండని తలంచి. 178

క. బలరాముడు తానిరువురు
నిలిచిరి మధురాపురమున నిగ్రహబుద్ధిన్
బలములతో వాడు చనెన్
గెలుతు నిపుడు కృష్ణునవెడు కిల్బిషబుద్ధిన్. 179

క. ''పిడుమునంను వపంపు షు
గాడు గదా పనితోడ గలహము సేయన్
గూడద"ని పారిరను క్రియ
జోడుగ వారరుగ జూచి శూరత మెరయన్. 180

ఆ. వెంటనంటి వాడు వివిధబలంబులు
గెంటబోక తనదు వెంట నడువ
నరుల కెక్కరాని గిరిమీద వారెక్క
జూచి వాడు సేనచుట్టు విడిచె. 181

క. మాగధుడు యుక్తి జెప్పెను
నీగిరి కెంజుట్టుముట్టి యీ చెట్లెల్లన్
దీగలు పొదలెల్లను గడు
వేగమె తెగనరికి యగ్ని పెట్టుండ"నుచున్. 182

క. అగుగాకని తత్సేనలు
నగము నగలంచుట్టు చెట్లు నరికి గిరికి దా
నిగువుగ జుట్టుం జేర్చియు
బిగవహ్ని దగుల్చ మంటె ప్రబలెం జ్వాలల్. 183

క. ఆ పెను మంటల చేతను
నా పర్వతమున వసించు సకల ప్రాణుల్
యేపుడిగి భస్మమైచనె
తావట్యుండైన మగధు కాతెస్యముచేస్. 184

క. శ్రీహరి విష్ణుమాయా
భారసమారూఢులగుట ద్వారవతి పురిన్
జేరి సుఖగోష్ఠినుండిరి
పౌరులు తామభిన నిభం భాగ్యోన్నతులై. 185

క. మనవైరులు భస్మంబై
చని రిగదా యనుచువాడు సంతోషముతో
జనెదన పురికిని మాగధు
డనఘులు ద్వారకకు వారలరుగు టెరుగకయున్. 186

క. బలరాముడు పెండ్లాడెను
నలరేవతి యనెడు కన్య నతిశయలీలం
జలజాక్షుడుగొనె రుక్మిణి
జలజేక్షణ సత్యభామ జాంబవతులనున్. 187

గీ. మిత్రవింద సుదంతను మెరయు భద్ర
లలితకాళింది లక్షణలనెడు వారి
బ్రీతివెలయగ నెనమంద్ర బెండ్లియాడె
భోగభాగ్యాతిశయముల బూర్ణుడగుచు. 188

క. భూమికి బరువై మిక్కిలి
పామరులౌ రాక్షసాంశవుల నృపతులన్
నేమరక హరియించిన
స్వామీ! శ్రీకృష్ణ! విబుధ వర్ధన తృష్ణా! 189

చ. నరకుని ఘోరమైన కదనంబున ద్రుంచి పదారువేపురం
దరుణుల రాజకన్యల ముదంబున దెచ్చితి పెండ్లియాడగా
వరుసగ వారినెల్లను వివాహముగైకొని యంతట ధరా
తరుణికి మోదమందెడి విధంబును గూర్తువు శౌర్యశాలివై. 190

మ. త్రిపుర స్త్రీలను బుద్ధరూపమున బాతివ్రత్యముం జెర్చి యా
తపనుండున్ శశిచక్రముల్ రథము నిద్రాత్రిన్ శ్రుతుల్ రథ్యముల్
యుపమాశాలియు బ్రహ్మసారథియు నీవున్మేరు విల్లంబులై
తపియింపంగను దారకాత్మజవధం ధట్టించవా శంభుచేన్. 191

మ. కలిలో దుష్కృతులైన మ్లేచ్ఛులు జగత్సంతాపము గావింపుచుం
బలవంతంబగు శౌర్యలీల ప్రజం బాలింపగా జూచి బల్
చలమొప్పంగ తురంగమెక్కి కలికి స్వామిత్వ మింపొంపగా
నలి గావింపవె వారినెల్లను జగన్నాథుండవై ఖడ్గివై." 192

క. అని యీవిధమున నమరులు
వనజాక్షు దశావతార వర్తన లెల్లన్
గొనియాడి నిల్చినను హరి
గనుగొని కరుణాసమేత కౌతుక మొదవన్. 193

గీ. ''మమ్ము జేరిన మీ యాయుధము లెల్ల
మరల గైకొని మీ యిండ్ల కరుగు డ''నిన
నింపుమీరంగ నవియు గ్రహించి మ్రొక్కి
చనిరి వేడ్కల దమతమ సదనములకు. 194

వ. ఆ సమయంబున. 195

సీ. కెంపు గుంపుల పెంపు సొంపు సంపాదింప
జాలిన రెక్కల శైలమునను
మెరుపు సత్సంఘములురు శశిభాస్కరుల్
యింద్రధనుద్యుతుల్సాంద్రమలర
గరమొప్పు నీలమేఘము లీల సత్యాస
మేతుడై హరి పారిజాత వృక్ష
సచ్ఛాయ యందును శంఖచక్ర సుశార్ఙ్గ
ముఖ సాధనముల విస్ఫురణ జెలగ

మహిత మణిభూషణ విరాజమానుడగుచు
సారె గరుడని మూపుపై జారుపీత
మునను వసియించి ద్వారకాపురము దారి
జేరె దైత్యారి సంతోషశాలి యగుచు. 196

సీ. సాంకవ మృగమద సౌరభ సహిత బృం
దారక తరుజ సమీరణములు
తతయోజనాంచిత చతుర్దిశలను
గల ప్రజకెల్ల సౌఖ్యంబు సలుప
రోగిష్ఠులకును నారోగ్యంబుగలిగెను
వంధ్యాంగనలు గర్భవతులునై రి
ఫలపుష్ప వృద్ధియు భరితమయ్యెను రిక్త
వృక్షంబులకు నెల్ల వత్సరమున
సకల నదులు స్వాదుజలముల ప్రవహించె
దెలివి గలిగె దిక్కు లెక్కలకును
దేవకీసుతుడును దేవతరువునుగై
కొనియు నిజపురికిని జనినవేళ. 197

క. పేదలకు బెన్నిధానము
చేదొరికిన లీల ముదము జెందెను బురిలో
పాదుగల జనులకెల్లను
వేదాది సుకర్మములను వెంసిరి విప్రుల్. 198

—: కృష్ణుడు ద్వారకానగరోపవనము చేరుట :—

గీ. ద్వారకాపురి చెంతకుజేరి యుపవ
నంబున వసించి పాంచజన్యంబు శుభగ
కంబుగాగను బటునినదంబు సలుప
వంచిన ముదంబునొంది పురంబువారు. 199

వ. అప్పుడు. 200

—: రాజకన్యలు కృష్ణుని వద్దకు దూతికను పంపుట :—

గీ. పురజనులు వారి దోడుక పోకమునుపె
తమ మొరలు దెల్పవలెనని తన్వినొకతె
బంపవలచిరి యేకాంత పద్ధతిగను
తపని మనసుకు తమ మనస్సంకల్పి వెలసు. 201

మ. సకల శ్రీహృదయాంబుజాత కలనా సంవేదినియా నొక్క దూ
తికనుం బంపిరి శౌరి సన్నిధికి ప్రార్థింపంగ దుర్వార ద
ర్పకుడౌ దర్పకు వేధలన్నియు భరింపన్లేక రాట్కన్యకల్
ప్రకటంగా దమ ముచ్చటల్దెలిపి సంభావించి తన్ ప్రోవగన్. 202

క. ఆ దూతిక చని శ్రీహరి
పాదాంబుజములకు మ్రొక్కిపలికెను హరితో
“నీదయ యింకారాదా
యాదరమున వారి ముచ్చటంతయు వినుడీ. 203

క. శుకపికముల రొదలకు జం
ద్రకిరణముల వేడిమికిని దాళక మరియుం
బకపకలౌ వకవక లౌ
కకవికలౌ రాజకన్యకల హృదయంబుల్. 204

క. కామజు శరముల ధాకకు
బాయక ప్రసరించు మందపవనుని వీకన్
రేయెండల దొరకాకకు
నాయాసము జెందు సతుల నరసియు గనుమీ. 205

సీ. రోహిణియును జగన్మోహిని సంతతో
త్సాహిని సౌభాగ్యగేహినియును
శుకవాణి సైకత శ్రోణి యంబుజపాణి
వినుతింపదగు నీలవేణి యనగ
సరసవాగ్ధోరణి సన్మార్గచారిణి
సతతాయకారిణి సఖరధరణి
విజితాంగజుని రాణి వినుత సద్గీర్వాణి
మరుని కంఖాణి యాస్మరకృపాణి

యనెడు పదియార్గు రంగనల్వినుతి కెక్కు-
వేలు తత్సంఖ్యలమరిన వెందులకును
నాయికా మణుల గనుచు నవ్యసూన
బాణువేదన బడలేక పలవరించి. 206

క. ఈరీతి పదార్వేవురు
నీరజనేత్రలకు నెల్ల నెమ్మనములలో
శౌరిపయి మోహమెత్తగ
దూరిరి యంగజుని వాని తోయము వారిన్. 207

క. "మదనా! మమ్మేచగనీ
కదనా యీవేళ కడు భయంపడి మామా
హృదయములు జించెదవు నీ
పదనుం బూదూపు లేసి పాంథలగుమమున్. 208

సీ. కదనంబులోన మార్గణమున మీ తండ్రి
మదమడంచెను దైత్యమండలముల
వదలక శరణన్న వారిని రక్షించె
గొడువ దీరగ వారి కోర్కెలిడెను
జగములన్నియు దయాశాలియై రక్షించె
గ్రమమున సకల పాపముల నణచె
మునులకు సురలకు మోదమాపాదించె
సకల పుణ్యముల కాస్పదుడునయ్యె

నట్టి సద్గుణు కడుపున బుట్టినట్టి
పట్టివై తండ్రిగుణము చేపట్టలేక
వెట్టిగుణమెట్లు నీవు చేపట్టువడెను
సుమశరాసార! మార! యశోవిదూర! 209

క. మారా! శ్రీసతి ముద్దు కు
మారా! నీ దుర్గుణంబు మానక మము నే
మారక నే చెదవదెరా
క్రూరత శివుకంటిమంట గూలెదవు సుమీ! 210

గీ. మలయ మారుత శుభ్రాంశు మండలంబు
మదన శుకపిక కేళి సమాజములను
షట్పదమరాళ షడృతు సముదయమును
నడరు నాయాసములనెల్ల గడుపుకొనుచు. 211

క. ఒక్కొక్క ఋతువునందున
కక్కసమగు వేధలన్ని గడుపుచునీకై
వెక్కసమగు మోహముగల
యక్కన్యలవిడువ దగునె యాకాలమునన్. 212

## —: షడృతు వర్ణన :—

వ. ఆ ఋతుక్రమం బెట్టదనిన. 213

ఉ. అంత వసంతమొప్పె మదనాధిక సైన్యవిహార సంభృతా
శాంతము కాంతకంతు శరసంఘ సముజ్జ్వల వన్యమేదినీ
ప్రాంతము పాంథ హృద్భయద భారమనో భవదర్ప విస్ఫురా
త్యంతము సంతతాఖిల జనాళికి నేత్రవిచిత్రపర్వమై. 214

సీ. సుమనోద్భవుండయ్యు శుకలీల దనరుచు
మధువై నవామోద మహిమజెలగి
కాలాఢ్యుడై పాంథగతుల వేధించియు మా
ధవుడై పలాశ విదారియగుచు
సురభియై హరిహయ స్ఫురణం నెసగుచు
నామనియై భూజనాళిబ్రోచి
బహుతపశ్శాంతుడై ఫలసంపద వహించి
చైత్రుడై రాగాది చయముగూర్చి

చారు సవన ప్రయోక్తయై సకం పెప్ర
వరశుభప్రవ నానాసవముల నొసగి
పంచమ స్వరపూర్ణతాభ్రాజి యగుచు
ఘన వసంతుడు బహురూపి యనగ బరగె. 215

సీ. అవని కొమ్మలకు బల్లవ సంగతులు గూర్చె
బుష్పిణులకు మధుస్ఫూర్తి జేర్చె
మొగి భుజంగులకు నామోదమాపాదించె
భ్రమదాళులకు రాగపటిమ నెరపె
బరమహంసలకును బద్మినీ తతినిచ్చె
విటపసంగతి శుకవితతి కొసగె
వనవాసులకు లతాంగనల పొందు ఘటించె
బ్రహ్మణ్యులకును రంభానుకూల

మెంత చిత్రంబు జూడ విభ్రాంతిగరపి
పంతమున వింత వింతలు సంతరించె
దపసులకు మన్మథవ్యాప్తి దనరజేసె
దుష్టకృత్యంబు లీ వసంతునకు దగును. 216

క. కెంపులు నించిన నీలపు
గంపంతో గాననాబ్ధి కన్యక తగగం
బంపె వసంతున కసగా
గుంపు పలాశములు సూనగుచ్ఛము లలరన్. 217

సీ. మీన కేతను ప్రతాపానల జ్వాలలు
భాతి లేమావి జొంపములు వొలిచె
కందర్పు కీర్తులకై వడి మల్లికా
సూన గుచ్ఛముల రాసులు జనించె

వరపింప బాలు చామరం చంపంబుస
        మొగలిమొగ్గలు విచ్చి మొనలు సూప
స్మరునకు ఛత్రసంపద బట్టు లీలం
        బుష్పించె బున్నాగ భూరుహములు

స్వారి వెడలెడు మదను శరీరమునకు
జల్లుచుండెడు బహుగంధవర్ణలీల
కుప్పతెప్పలు పుప్పొడి గుప్పెదిశల
నంబుజాస్త్రుని యాడంబరంబులపుడు. 218

ఉ. గాలియనే మహోభయదఘస్మరు డంచిత భూరుహౌఘ స
ద్గాళి నిజాంశుకంబులు రయంబున తానహరించ జర్మము
ల్పోలగ గప్పుకొన్న కుజపుంజముపై దయచేసి పచ్చడా
ల్సేలుగా గప్పెనెవ్వగ గృశింపగనీక వసంతుడెంతయున్. 219

క. తరుల జిగురింపజేసెను
బరికింపగ బండ్లు పంటపైరులొసంగెన్
విరహుల తపింప జేయుట
బరగ వసంతుండు నింద పాలయ్యె జుమీ. 220

క. తేనియం ఫలములొసగె బ్ర
సూనంబుల పరిమళసుఖము లొసంగెన్
బూని ప్రజనెల్ల గాల్చెడి
వాని వసంతాఖ్యమంచి వాడన దగునే. 221

సీ. చింతనిప్పులతోడ జెల్మి సేయుచునుండు
        పండువెన్నెలతోడ పరిభవిల్లి
పడమటి వాయువుప్రహుళంబులై వీవ
        బలువైన రాత్రిజాములు కృశింప

బహుపిపాసా స్ఫూర్తి పరగిన వారికి
మృగతృష్ణలను జలాపగలుదోప
సుడిగాలి చందముల్బడిబడి చరియింప
వడలకాక జనాళి బడలు పరుప

చండకిరణుండు ధారుణీ మండలమున
కిచ్చునప్పులు మరలంగబుచ్చుకొనిన
జగతి జనులకు జలరిక్తమగుటచేత
గాసి నొందించె నాగ్రీష్మవాసరములు. 222

క. కుచకుంభ శీతలంబులు
ప్రచురాధర మధు సుధానుభవము లొసంగుచున్
రుచిరాంగులు రక్షించిరి
విచికిల శయ్యలను గ్రీష్మవేళల విభులన్. 223

క. ఉగ్రగ్రీష్మ మహాసురుండు కిరణోద్యోగంబు సంధించి లో
కగ్రస్తం బొనరించి కాకలమునుంగం జేయ గృష్ణాభ్రవీ
రాగ్రాధిష్ఠవరుండు తాను శరసరంభంబునం ముంప గ
ర్వగ్రంథిత్వము మాని పారిచనగా రంజిల్లె లోకంబులున్. 224

క. పర్షతనమైన వేసవి
ఘర్షింపగ దాని గర్వకైతవ మణపన్
వర్షాకాలము వచ్చెను
హర్షదమై సకల జనులకానందముగాన్. 225

గీ. కాళికాదేవి వలె వర్షకాళికయును
నాణెమైన తటిత్కృపాణంబు బూని
గ్రీష్మ ఋతువను రాక్షసాగ్రేసరాఢ్యు
మిహిర శిరమును ద్రిప్పక ద్రుంగెనంత. 226

క. లావణము గల్గు వారిని
వావిరితో గూర్చి మంచివారినొనర్పన్
జీవనద ! నీవెకావా
కేవలముపకార వృత్తికిం ఘనుడవనన్. 227

క. ఘోరాసారాధారా
ఖారంబై జగతియందు బట్టువదలక
న్నీరి వరిషించె నిజగృహ
దూరస్థులు తడిసి తొప్పదోగి వడంకన్. 228

వ. ఆసమయంబున. 229

ఉ. మెచ్చని తీర్థమాడి నులివెచ్చ పదార్థము లారగించి బ
ల్పచ్చడము ల్ముసుంగులిడి పై చలిసోకని కమ్మటిండ్లలో
ముచ్చ మునింగి యింటిపని మున్మరమెల్లను దీర్చిప్రక్కకు
న్వచ్చిన ప్రౌఢయాంధ్ర కురువంపుడు బల్కుచసీమలానుచుం
బచ్చని విల్తుకేళికల బన్నిరి యాస్తుల గేస్తులజ్జడిన్. 230

గీ. బాగుమీర శరత్కాలమేగుదెంచె
మంచు వర్షించె బగటి యామములు కొంచ
దనము వహించె జలద సంతతి చలించె
నదులు పరివాహపూర్ణ యానములు డించె. 231

గీ. పాత్ర ద్విజరాజ సత్సంఘమిత్రతతులు
ప్రబలనివ్వని మేఘదుష్ప్రభుడుసనగ
రాగముదయించి వచ్చె శరత్ప్రభుండు
చెలువుగా వీరలకు దెల్విజెందజేసి. 232

మ. జయ యాత్రాసమయంబు రాజులకు సంచారైకనానాకళా
శ్రమ విభ్రాజిత యాచకావళి హృదిచ్ఛాసానురూపంబు భా
గ్యయశోవర్ధితులైన దాతలకు శ్రేయః ప్రాపకంబై శుభో
దయ విస్తారమునై వెలిగెను శరత్కాలంబు ఖాళీలమై. 233

సీ. కార్తీక శుభ్రాంశుమూర్తి యాననమొప్ప
        విమల ప్రసాదహాసము జెలంగ
కలిత నక్షత్రముక్తా హారములు దూగ
        లలితాంక కస్తూరి తిలకమలర
శరదభ్రవస్త్ర సంభరిత శరీరియై
        చేరి చకోరాశ్రితులు గొలువ
గమనీయమగు దేహకాంతి దిక్కులకెల్ల
        దెలివి సంపాదించి చెలువుదనర

శరద సంఘములను సురాసురులు గూడి
మరుతు మంథానగిరి నిరమ్మదపుత్రాట
జుట్టి వర్షర్తు వార్ధిచేపట్టి తర్చ
బుట్టినట్టి శరల్లక్ష్మి పొగడనెగడె. 234

క. ధారుణి పంకములిగిరెను
దారుల పొంకంబులమరె దారుణ తటినీ
వార పరీవాహ మహా
భారంబు లడంగె బయలుపడె పులినంబుల్. 235

క. శీతలము విభుల చెంతల
కేతేరని ముగుద సతుల కిచ్చలు బొడమన్
జేతు ననుచు హిమవంతం
బేతెంచెను దాముదామె యిచ్ఛంజనగన్. 236

సీ. రాత్రియామములు దీర్ఘంబులై రాజిల్లె
        పగటి జాములు కొంచబడి కృశించె
సహవాసయోగ్యుడై దహనుడు హితుడయ్యె
        బహుశీతభీత ధూర్వహులకెల్ల

మగల సహించని మగువలు రాత్రిళ్ళు
దయవారి కౌగిలింతలను వేడ
ప్రకటమత్తద్రవ్యపానాతిశయమున
వేశ్యలు విటులను వెదకుచుండ

గాక వస్తువులెల్ల ముఖ్యత గ్రహింప
గోరు జనములు వాటిని బేరమాడ
జేరుచును సంగడులయందు జేరజేసె
శీతకాలంబు నతిభీతిచెందినట్లు. 237

క. చలి కొంతసేపు నెండల
బలమిన్మరి కొంతసేపు భాసిల్లంగా
వలనొప్పనపుడు కాలము
వెలయంగా శిశిరఋతువు వేళలయందున్. 238

గీ. మాఘమాసంబు విబుధశ్లాఘ్యమనుచు
నల్లరేగళ్ళబంటలు కొల్లలమరె
యావకాశింపు ధాన్యాళి తీవి దనరి
కండ్లపండువు నయ్యెను జగతికెల్ల." 239

వ. అని, మదనాద్యాయాసంబులు షడృతుకాలంబుల ననుభవించు నాయంగ
నల క్రమలు చెప్పిన దూతికతో హరి యిట్లనియె. 240

క. "నెలతా! నీవటుజని యా
లలనలతో వారి మదికలంకలు దీర
న్వలనొప్ప జెప్పి మనసులు
చెలువుగ రంజిల్లునట్లు జేయుము త్వరగాన్. 241

క. అని యిట్లుతన్ను బంపిన
పని "మీకు భయంబు దీర్ప నేవచ్చితినో
వనజేక్షణలారా! యిక
ఘనమోదము జెంది సుఖముగా నుండు డెదన్. 242

క. మీ శుభకార్యమునకు దా
నా శౌరియు వచ్చి మిమ్ము నందరి నిపుడే
డాసి తగ బెండ్లియాడును
లేశము చింతయు వలదని" లీలగ దెలుపన్. 243

## —: బలరాముని ఎదురుకోలు :—

క. నలినాక్షు నెదురుకొనగా
బలరాముడు సాత్యకియును బహుసైన్యంబుం
బలు పట్టపు దేవులు పు
త్రులు నందరు వాహనాధిరోహణులగుచున్. 244

గీ. వచ్చి హరిగాంచు నంతలో వారిజాక్షు
డన్నకు నమస్కరించె నాసన్నిధాన
మునను సాత్యకి హరిపాదములకు మ్రొక్కె
తనయులందరు శౌరి సత్యలకు మ్రొక్క. 245

క. మ్రొక్కిన వారికి దీవన
లక్కరతో సల్పి వారి నందరి నెల్ల
న్మక్కువతో లాలించిరి
యక్కమలాక్షుండు సత్య యలరెడు వేడ్కన్. 246

క. అంతట బలరాముడు శ్రీ
కాంతునితోననియె "మన నికాయమునకు బ
ల్సంతసమున బోదాము వ
నాంతంబున నుండనేల హరి! లేలెమ్మా". 247

క. హలి హరి యిరువురు వేడ్కల
జెలగుచు నిజవాహనముల జెలువలరంగా
వలనొప్పనెక్కి చేరిరి
సలలిత పురిగోపురంబు సామీప్యముగన్. 248

క. భేరికాహాళముల రొద
ఘోరుకొలుప బుణ్యజనులు పొగడగ రాజుల్
చేరి తము గొల్చి రాగా
శూరులు ద్వారవతి పురము జొచ్చిరి వేడ్కన్. 249

సీ. రంభనుమీరు వారాంగనామణులు మృ
దంగ వాద్యముల నృత్యములు సల్ప
జంత్రగాత్రముల స్వతంత్రులై గాయకుల్
సరిగమపదనిసా స్వరము బాడ
గద్యపద్యాత్మక క్రమత మీరగ వంది
మాగధుల్ విజయసంపదల బొగడ
గనక మణివేత్ర కరులయ్యు గంచుకుల్
పరగ సందడి బరాబరులు దీర్ప

సకలరాజులు తమతమ సైన్యములను
గొలిచి తమ వెంబడిగ రాగ గుశలమరయ
వీథివెంబడి రాగ నా సౌధములను
బురము కాంతలు లాజలుపూలు జల్ల. 250

క. ఈ విధమున బలకృష్ణులు
ఠీవిం బురవీథిరాగ డెందములలరన్
వేవిధముల గొనియాడిరి
సేవింపుచు బురజనములు చిత్రముగాగన్. 251

క. "మనదొర హరిదేవేంద్రుని
పగబూని జయించి యట సుపర్వమహీజమ్ముం
గొనివచ్చెను గావున నిక
మనపురి దేవేంద్రుపురికి మరి దొరయయ్యెన్. 252

సీ. ఈ దేవభూజమే మోదమాపాదించి
పేదలబ్రోచు సమ్మోదశాలి
యీపారిజాతమే యేపారనింద్రుని
కాపాడుచున్న దయారసంబు
నీ నిర్జరక్ష్మాజ మానంద మొందించి
మౌనులపాలించు దానశీలి
యీ కల్పశాఖియే లోకుల రక్షింప
గైకొన్నయట్టి వివేకమూర్తి"

యనుచు భూజనులెల్లను వినుతి జేసి
దీప ధూపైక నైవేద్యతృప్తి సల్పి
హరిని నిర్విఘ్నదనర్చించి యంతమీద
నందరును భూరి సంతోషమొందిరంత. 253

క. "స్వర్గస్థుల బ్రోచుట నై
సర్గికమిది మనకు భూమిజనులను బ్రోవన్
మార్గముమేలని తలచి ని
రర్గళగతి గృష్ణుజేరి రాబోలుసుమీ." 254

క. మరి పారిజాతమహిమయు
హరి సామర్థ్యంబు పౌరులందరు వినుతుల్
పరిపరి విధముల జేయుచు
బరి పూర్ణానందమొంద పలికిరి వేడ్కన్. 255

క. కొనియాడుచు గొలుచుచు హరి
గుణములు వేవేలు గాగ గోరికతో నా
తని తమ తమ యిండ్లకు దో
డ్కొని చని బహుధనములిడి రకుంఠిత లీలన్. 256

గీ. వారిసంపద రక్షించి వాసుదేవు
డిష్టసిద్ధులు వారలకిచ్చి పిదప
దమ నివాసమునకు జేరి తల్లిదండ్రు
లకు నమస్కార మొనరించి సుకరలీల. 257

గీ. పారిజాతంబు సత్యాశృంగారవనిని
దగ బ్రతిష్ఠించి యుటుమహోత్సవము సల్పి
ధరణిసురులకు బహుపదార్థములొసంగి
నిండువేడుక తోడుత నుండునంత. 258

క. తలిదండ్రులు బలరాముడు
బలికిరి "పదియారువేల వరవర్ణినుల
న్వలనొప్ప బెండ్లియాడక
నిలుపుట మరియాదగాదు నీరజనేత్రా! 259

క. నీవు జగన్మోహనుడవు
గావున నీమీది కాంక్షగల కన్యల సం
భావించి పెండ్లియాడుము
తీవరమున వారి కాంక్ష దీర్పుము కృష్ణా! 260

మ. పది యార్వేవురు రాజకన్యకల శుంభద్లీలలందెచ్చి బ
ల్ముదమొప్పంగను బెండ్లియాడి బహుసంభోగంబులందేలక
న్విదితంబౌయపకీర్తి దిక్కులల నసద్వ్యాఖ్యాతి బెంపొందక
సదయ ప్రక్రియ వారి బ్రోవవలె కృష్ణా! నీవు సంతోషివై." 261

వ. అనిన శ్రీకృష్ణుండిట్లనియె. 262

క. "మీ యాజ్ఞ లేక యుండగ
నీ యింతులనేవివాహ మిచ్ఛపడకయు
న్నే యూరకుంటినింతకు
మీ యాజ్ఞంగొంటినిపుడు మింతలగొనగాన్." 263

క. అని బలరాముని గనుగొని
"మనపురము నలంకరించు మహితుల నెల్లం
బని నేర్పరులను జేయుము
వినుతించి జగంబువారు విస్మయమందన్. 264

క. పెండ్లింట్లకు గావలసిన
మెండ్లు పదార్థములు వారు మెచ్చునటుల వా
రిండ్లకనిచి యాదవ
రాండ్లపుగల బంధుజనుల రప్పించు త్వరన్." 265

గీ. అనిన విని సీరి సంతోషమంది జగతి
పేరుగల్గిన పనివారి బిల్వనంపి
వారల బహూకరించి "యీ ద్వారకాపు
రంబలంకృతి సేయుడీ డంబుమీర". 266

వ. అనిన వారు సంగీకరించి. 267

## —: రాజకన్యకా కృష్ణుల పరిణయము :—

సీ. సాంకవ మృగమద పంకముల్పన్నీట
సొంపుమీరగ గలయంపి జల్లి
నవమణి హేమంపు నవ్యసౌధాళికి
మేపసానలుబట్టి మెరుగుబెట్టి
పచ్చలకెంపుల ఘాసిల్లు తోరణా
ల్మెచ్చు ద్వారంబుల మెరయగట్టి
ముత్తెంపుకుచ్చుల మొనసిన పట్టు ప
టావకుల్మెకట్లు తీవగట్టి
పెక్కువన్నెలుగల బహుటెక్కెములును
జొక్కు పెండ్లిండ్ల నెక్కించి సొగసుమీర
నిగనిగలుమీర బురినెల్ల సొగసుబెట్టి
నంపనే ద్వారవతి బహుకాంతి నించి. 268

క. కంతుగురు నగరికంటె
న్వింతలు గల్పించుచున్న విధిపురికంటె
న్నంతకరిపు పురి కంటె బ
లాంతకు నగరమునకంటె నాపురి మెరసెన్. 269

క. పడియార్వేవురు సుదతుల
సదనముం వివాహయోగ్య సద్వస్తువులు
ల్వాదితంబుగ బంపించెను
సదయత బలరాము డచటి సతులును బొగడన్. 270

క. భర్గవిధి ప్రముఖులు నా
స్వర్గాధిపుడింద్రుడాది సకల దిగీశుల్
గర్గ ప్రముఖ మహాముని
వర్గములే తెంచిరా వివాహము గనగన్. 271

సీ. పాండ్య బర్బరకురు బాహ్లీక సౌరాష్ట్ర
దేశాధిపతులు నరుదెంచి రటకు
కోంకణ డేంకట కోసల కేకయ
వసుధాధిపులు జేరవచ్చిరటకు
కాశ్మీరకాంభోజ కాళింగ గాంధార
పాంచాలకులు ప్రవేశించి రటకు
లాటమరాట వరాట కర్ణాటాంధ్ర
దేశాధిపులు బరతెంచిరటకు

కుకుర ఘూర్జర మాళవశక పుళింద
మత్స్య ద్రావిడ కన్నడ మగధ సగర
దేశవల్లభులును వేవవేవు పెండ్లి
గనగ జనుదెంచి రాశ్చర్యకరముగాగ. 272

శా. గర్గాది ప్రముఖుల్ మహామునులు ముఖ్యంబైన లగ్నంబు ష
ద్వర్గ ప్రాకటశుద్ధిగా వెదకి చార్ధ్యంబొప్ప రాట్కన్యకా
వర్గంబున్ హరికి న్వివాహమును తేవన్సల్పు యత్నంబు స
న్మార్గప్రక్రియ జేయబూనిరి జగన్మాన్యంబుగా వేడ్కతోన్. 273

సీ. కౌమరొప్పగా బెండ్లికొడుకును నా పెండ్లి
కూతులనెల్ల ప్రఖ్యాతికాగ
నభ్యంగనాది కృత్యంబులు గావించి
యమలరత్న విభూషణములు నూత్న
బహుదివ్య పరిధాన సహితుల గావించి
సొంపుమీర నలంకరింపజేసి
వన్నెలు మించు వివాహమందిరమున
జేరంగదోలి విచిత్రలీల

భూరి పంచమహా వాద్యపూర్ణముగను
వేదవిద్యా వినోదముల్విప్రవరులు
చదువుచుండంగ సామ్రాజ్య సహితముగను
ఘనుత వివాహములు జేయ బూనిరపుడు. 274

సీ. ఆయింతులెత్తిన దోయిళ్ళ ముత్తెము
లప్పద్మరాగ ప్రభాపటలి దోప
హరి శిరస్థాన విన్యస్తలంబలగుచు
గుందసూనంబుల గ్రెంపుపరువ
సీరవతులిత శరీరంబుపై ప్రాలి
సంక్రందనోపలచ్ఛాయలమర
ద్వివ్యభూషణ మణిదేదీప్యమానంబు
లగుచు వత్తచ్ఛాయ నభినయింప

ముదితలు పదారువేవురు ముదముమీర
ప్రోడిగాగూడి తలంబ్రాలు వోయువేళ
వింతవింతల కాంతులత్యంతలీం
భాసమానంబులయ్యె జూపరులకెల్ల. 275

మ. పదియాఱ్వేవురు రాచకన్యకలు శుంభల్లీల దోయిళ్ళ బెం
పొదవంజేర్చిన యాణిముత్తెములు సొంపుల్మీరగా వేగమున్
యదురాట్సింహుని శీరుషస్థలిని శ్రేయం బొప్పబోయంగ సం
పదకై యెత్తిన పూలచేరులవలెం భాసిల్లె నా పెండ్లిలోన్. 276

క. చంపక గంధులు కొందరు
గంపలతో నించి యివ్వగా ముత్తెములన్
బెంపుగ జేతుల కొద్దీ వ
హింపుచు దలంబ్రాలు వోసిరింపు దలిర్పన్. 277

క. ఆరాచకన్యకలు యదు
వీరుండన్యోన్యముగను వెలయుచు దలంబ్రా
లొక్కరికతో సల్పిరి యౌ
రౌర ! యనుచు సకల జనములానందింపన్. 278

క. పాడియు దప్పక సురత
క్రీడలు చౌసీతి బంధరీతులు వరుసన్
గూడుక పదియార్వేవుర
చేడియలరమించె గోపశేరుడెలమిన్. 279

:—ఫలశ్రుతి:—

క. ఈ సత్కృతి పఠియించిన
వ్రాసిన వినువారికిహపర క్షేమములుం
భాసురముగ లభియించును
శ్రీసువతీ రమణుడెపుడు శ్రీశ్రీంజేయున్. 280

—:ఆశ్వాసాంతము:—

మ. సమర ప్రాంగణ సాహసాంక ! వరకేసంపేట గోపాల దే
వ మనోజ్ఞాంఘ్రి సరోరుహభ్రమరడింభప్రాయ చిత్తాబ్జ ! రా
జమృగేంద్రా ! హనుమంతరాయ ధరణీ జానీంద్ర ! మార్తాండతే
జ ! మనోజాత సమానరూప విలసత్సామ్రాజ్యదేహాధిపా ! 281

మాలిని. పరమగుణపవిత్రా ! పండిత స్తోత్ర పాత్రా !
దురితతృణలవిత్రా ! దుష్టసుదోహజైత్రా !
సురసకవనచైత్రా ! శుద్ధపెన్ బాలగోత్రా !
అరహిత బుధమిత్రా ! హన్మధాత్రీకళత్రా ! 282

# గద్యము

ఇతి శ్రీమత్సింగ పట్టణ లక్ష్మీ నృసింహస్వామి కటాక్ష వీక్షణ
కృపాపాత్రుండును నాశ్వలాయన సూత్రుండును విశ్వా
మిత్రమౌని విఖ్యాత గోత్రుండును ముత్యాల
యప్పయామాత్య ద్వైతీయీక పుత్రుండునగు
వెల్లూరు నరసింగకవి ప్రణీతంబైన
రాచకన్యకా పరిణయంబను మహా
ప్రబంధంబునందు సర్వంబును
చతుర్థాశ్వాసము సంపూర్ణము.
ఓం తత్సత్



# అనుబంధము-2

(వెల్లూరు నరసింగ కవిని గూర్చి శ్రీ వెల్లాల శివరామ శాస్త్రిగారి పరిచయ వాక్యములు)

శ్రీ ఎల్లూరు కవి నరసింగయ్యగారు ఎల్లూరు గ్రామం రాజధాని అగు కొల్లాపురమునకు సుమారు, రెండు కిలోమీటర్ల దూరమున ఉన్నది. ఆ గ్రామస్తులు అనేకులు ఉద్యోగరీత్యా తెల్లవారు ఝామున మొదలు రాత్రి 10 గంటల వరకు విశేషముగా వస్తూ పోతూ ఉండిరి. శ్రీ కవిగారు సైతం 2-3 దినములకొక పర్యాయమైనా రాజధానికి వచ్చి - శ్రీశ్రీశ్రీ రాజావారి దర్శనం చేసుకొని 10 గంటలనుండి స్వగ్రామం వెళ్ళుచుండిరి. కవిగారు అజానుబాహులే కాని స్థూలకాయులుగాదు.

వారొచ్చినపుడు రాజధానిలోని పండితులతో కలసి సాహిత్యాది చర్చలు చేయుచుండిరి. ఆస్థాన విద్వదగ్రేసరులు. చంద్రికాపరిణయ వ్యాఖ్యాన కర్తలు మా తండ్రిగారగు వెల్లాల సదాశివశాస్త్రుల వారితో సహా చర్చలు జరుపుచుండిరి. 'చంద్రికా పరిణయ వ్యాఖ్య చక్కగా లేదు' అని కవిగారు శ్రీశ్రీ రాజావారి సభలో ప్రస్తావింపగా దానిపై మా తండ్రిగారు 'తాము మరియొక వ్యాఖ్య రచించి ప్రకటించండి అని చెప్పితిమి కదా, ఆ పని యెందుకు చేయర'ని అడిగితిమని బ్ర॥వె॥ కి.శే. పల్లా నృసింహశాస్త్రిగారితో చెప్పుచుండగా విన్నాను.

కీ.శే॥ మా తండ్రిగారు దుర్మతి సంవత్సర కార్తీక శుద్ధదశమి రోజు జన్మించినట్లు చెప్పుచుండిరి. అరువది నాలుగు సంవత్సరముల రెండు మాసములు జీవించి క్రోధన సంవత్సర బహుళ-విదియ శుక్రవారం రాత్రి-9 తొమ్మిది గంటలకు పరమపదించిరి. వారి కాలము 1860-1925 ప్రాంతము.

శ్రీ కవిగారు మరణించు వరకు వారికి 60-62 వయస్సు ఉండవచ్చు ననుకుంటాను. మా తండ్రిగారి కంటే ముందుగానే కవిగారు గతించినట్లు గుర్తున్నది.

వెల్లాల శివరామశాస్త్రి

12-3-87

7-5-24
వెంకటేశ్వరనగరు
మహబూబునగరు

# అనుబంధము-3

## సురభివంశక్రమము

1. పిల్లలమఱ్ఱి బేతాళనాయడు (మూలపురుషుడు).
2. దామానాయడు.
3. వెన్నమనాయడు.
4. దాచానాయడు.
5. సింగమనాయడు.
6. అనపోతానాయడు.
7. ధర్మానాయడు.
8. తిమ్మానాయడు.
9. చిట్టిదాచానాయడు.
10. అనపోతానాయడు.
11. చిన్నమాదానాయడు.
12. ఎఱ్ఱసూరానాయడు.
13. మాదానాయడు.
14. మల్లానాయడు.
15. పెద్దినేడు.
16. మల్లభూపతి.
17. పెద్దమల్లానాయడు.
18. మల్లభూపతి.
19. మాధవరాయడు.
20. నరసింగరావు.

21. మాధవరావు.

22. బారిగడుపులరావు.

23. పెద్దరామారాయడు.

24. జగన్నాథరావు.

25. వేంకట లక్ష్మారావు.

26. వేంకట జగన్నాథరావు.

27. వేంకట లక్ష్మారావు. ('రాచకన్యకా పరిణయ' ప్రబంధకర్త వెల్లూరు నరసింగకవి వీరి కాలము వాడు).

28. జగన్నాథరావు.

29. వేంకట కుమార కృష్ణ బాలాదిత్య లక్ష్మారావు (ఇప్పుడున్నవారు).

# అనుబంధము-4

## నరసింగకవి వంశక్రమము

- రంగప్ప (మూలపురుషుడు)
  (క్రమము, అంతరములు తెలియవు)
  - అప్పకవి (ముత్యాల)
    - లక్ష్మీనరసయ్య
      - అనంతరామయ్య
        - నరసింహారావు
          - మహాదేవరావు
          - గోపాలరావు
        - సుబ్బారావు
          - కృష్ణమూర్తి
            - నరసింహారావు
            - ప్రసాదరావు
          - సదాశివరావు
            (రాచకన్యకాపరిణయ లిఖితప్రతి ఇచ్చిన వారు)
            - నరసింహారావు
            - సుబ్బారావు.
        - రామసుబ్బయ్య
      - వెంకటాచలమయ్య.
    - నరసింగ కవి
      (రాచకన్యకాపరిణయకృతికర్త)
      ఈయనకు ముగ్గురు కుమార్తెలు.

# అనుబంధము-5

## ఎట్టెము నరసింహారెడ్డి వంశక్రమము

రామచంద్రారెడ్డి (మూలపురుషుడు)
(క్రమము, అంతరములు తెలియవు.)

పాపిరెడ్డి

కోదండ రామిరెడ్డి | రామనయ | (వీరి ప్రసక్తి లేదు) | నరసింహారెడ్డి (రాచకన్యకాపరిణయ కృతి ప్రేరకుడు)

కోదండ రామిరెడ్డి

రంగనాయకమ్మ (కుమార్తె)
(గోపాలుపేట జగపాలరాయని భార్య)

# అనుబంధము-6

## గోపాలుపేట హనుమంతరాయని వంశక్రమము




రామరాయడు
గోపాలరాయడు
(భార్య రత్నమాంబ)
లక్ష్మణ శౌరి
రామచంద్రారెడ్డి
రాయన్న
లక్ష్మారాయడు
(భార్య కేశవాంబ)
వెంకట గోపాలరాయడు
(భార్య లక్ష్మీనరసమ్మ)
జగపాలరాయడు
(భార్య రంగనాయకమ్మ)
హనుమంతరాయడు
(రాచకన్యకా పరిణయ కృతి భర్త)

# ఉపయుక్త గ్రంథసూచిక


తెలుగు కావ్యములు

1. పోతనామాత్యుడు బమ్మెర — ఆంధ్రమహాభాగవతము
2. తిమ్మన నంది — పారిజాతాపహరణము
3. పెద్దన అల్లసాని — మనుచరిత్ర
4. శ్రీకృష్ణదేవరాయలు — ఆముక్తమాల్యద
5. భట్టుమూర్తి — వసుచరిత్ర
6. వెంకటకవి చేమకూర — విజయవిలాసము
7. చెన్నకృష్ణకవి — యాదవ భారతీయము
8. మాధవరాయలు సురభి — చంద్రికాపరిణయము
9. నరసింగకవి వెల్లూరు — 1. రాచకన్యకాపరిణయము 2. చూతపురీ విలాసము 3. భర్తృహరి సుభాషితములు
10. శేషేంద్రశర్మ గుంటూరు — రక్తరేఖ
11. వెంకటశాస్త్రి నెమలూరు — శ్రీ వనపర్తి సంస్థానచరిత్ర

ఛందోవ్యాకరణ గ్రంథములు

1. పెద్దన విన్నకోట — కావ్యాలంకార చూడామణి
2. అప్పకవి — అప్పకవీయము
3. భట్టుమూర్తి — కావ్యాలంకార సంగ్రహము
   వ్యా. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
4. ఛందోదర్పణము — అనంతామాత్యుడు
5. అథర్వణాచార్యులు — వికృతి వివేకము
6. చిన్నయసూరి — బాలవ్యాకరణము

విమర్శలు - వ్యాసములు

1. ఆచార్య వెంకటరామనరసింహం. కాకర్ల — ఆంధ్రప్రబంధములు-అవతరణవికాసము

2. యశోదారెడ్డి పి. — 1. తెలుగులో హరివంశము, 2. పారిజాతాపహరణ పర్యాలోచనము 3. ప్రబంధవాఙ్మయము
3. డా. నరసింహం అంతటి — ప్రబంధాలలో ప్రకృతి వర్ణనలు
4. డా. రామనాథశాస్త్రి — ఆంధ్రవాఙ్మయము - కృష్ణకథ-1
5. ఆచార్య దొణప్ప తూమాటి — ఆంధ్ర సంస్థానములు-సాహిత్యసేవ
6. డా. సూర్యనారాయణశర్మ వేదాలు — అంతరార్థభాగవతము
7. డా. శివారెడ్డి ఎల్లూరి — భారత రసభారతి
8. డా. వీరభద్రయ్య ముదిగొండ — నాదేశం-నాప్రజలు విప్లవ కావ్యవిమర్శ
9. శ్రీ నరసింహశాస్త్రి కేశవపంతుల సంస్థానముల సాహిత్యసేవ
10. ఆరుద్ర — సమగ్రాంధ్రసాహిత్యం 7, 8, 10, 11
11. సుబ్బారావు వంగూరు — శతకకవుల చరిత్ర
12. వేంకటరమణయ్య బులుసు — ఆంధ్రకవిసప్తశతి
13. సదాశివశాస్త్రి వెల్లాల — శ్రీ సురభివారి వంశచరిత్రము
14. తిరువేంగళాచార్యులు వేదాల — ఆంధ్రమహాభాగవతోపన్యాసములు (వ్యాసం)

నిఘంటువులు

1. సీతారామానుజాచారి బహుజనపల్లి — శబ్దరత్నాకరము
2. సుబ్బారాయడు మహాకాళి — శబ్దార్థ చంద్రిక
3. రామయ్యపంతులు జయంతి — సూర్యారాయాంధ్రనిఘంటువు
4. అమరసింహుడు — అమరకోశము (గురుబాల ప్రబోధిక)
5. ఇరుగపదండనాథుడు — నానార్థరత్నమాల, బీజాక్షరనిఘంటువు

సంస్కృత గ్రంథాలు

1. వ్యాసుడు — 1. భాగవతము 2. హరివంశము
2. లీలాశుకుడు — శ్రీకృష్ణ కర్ణామృతము.

